# ఆంధ్ర ద్విపద సాహిత్య చరిత్ర

## (పదునెనిమిదవ శతాబ్ది వఱకు గల కావ్యముల సమీక్ష)

డా. టి. సుశీల

ఢిల్లీ విశ్వవిద్యాలయమువారిచే పి. హెచ్. డి. డిగ్రీ
ఒసంగబడిన సిద్ధాంత వ్యాసము

# ఆంధ్ర ద్విపద సాహిత్య చరిత్ర

(పదునెనిమిదవ శతాబ్ది వఱకు గల కావ్యముల సమీక్ష)

**డా. టి. సుశీల**

ఢిల్లీ విశ్వవిద్యాలయమువారిచే పి. హెచ్. డి. డిగ్రీ
ఒసంగబడిన సిద్ధాంత వ్యాసము

గ్రంథారంభమున వాడు ద్విపద - దాని పుట్టుపూర్వోత్తరములు అను వ్యాసమును అంతమున ఆయా ద్విపద కావ్యముల కాలములందలి సాంఘిక మతాచార పరిస్థితులను వ్యాసమును రచించియున్నారు ఇందు మొదటిది ద్విపద ఛందమునకు సంబంధించినది వారది యెట్లు రూపొందినదియు, దేశి మార్గములలో నే పద్ధతికి జెందినదియు, సంస్కృతముతో దానికిగల సంబంధమును సమగ్రముగను సవిమర్శముగను జర్చించియున్నారు చివరి వ్యాసమున వారు ప్రదర్శించిన పరిశీలన శాఖాపాత్రమై ఆయాకాలములందలి మత సాంఘిక పరిస్థితుల నద్దమునందువలెం జక్కగా ప్రకటించుచున్నది ఈ వ్యాసము పఠించిన పూర్వాంధ్రకవులందుం గూడ నెంత సాంఘిక స్పృహ యున్నదో తెలియ వచ్చును ఈ అధ్యాయములు రెండును గ్రంథమున కాద్యంతములందుండి గ్రంథము విలువను ద్విగుణీకరింపం జేయుచున్నవి వీనిని రచించుటలో రచయిత్రి చూపిన నేర్పు మెచ్చందగియున్నది

ఏకసంఖ్యాకములైన ద్విపద కావ్యములను సుమారు పది వర్గములుగా విభజించి శ్రీమతి సుశీలగారు వాని నన్నిటినిగూర్చి కూలంకషమైన సమీక్ష కావించి యున్నారు కథా కథనము, రసపాత్ర పోషణము, వర్ణన విధానము, భాషా శైలీ విశేషములు మున్నగువానిని గూర్చి వారు కావించిన పరిశీలనము సమగ్రమును విమర్శప్రశంసాపాత్రమునై యొప్పారుచున్నది బసవపురాణ పండితారాధ్య చరిత్రలు, హరిశ్చంద్ర చరిత్ర, నవనాథ చరిత్రలు, వరదరాజ రామాయణము ద్విపద భారతము మున్నగు సుద్గ్రంథములను వారు సమీక్షించిన రీతి ప్రశంసనీయమై యున్నది ద్వైతాద్వైత విశిష్టాద్వైతములను, వేదాంతగ్రంథములను సమీక్షించునప్పుడు వారు చూపిన ఆధ్యాత్మిక పరిజ్ఞానము నాకచ్చెరువు గొల్పినది అట్లే వారు చారిత్రాత్మక ద్విపదలను విమర్శించునప్పుడు సమగ్రమైన చరిత్ర జ్ఞానము ప్రదర్శించియున్నారు

వారి వైదుష్యము [illegible] సర్వసు[illegible] యొప్పుచున్నది గ్రంథ[illegible] వారు ప్రదర్శించిన నిష్పక్షపాత వైఖరి ప్రశంసింపదగియున్నది [illegible] విమర్శకుడును మమకారాహంకార పరి

త్యాగపూర్వకమైన సమభావమును చూపించిన ఉపేశ్యకల యెంతైన సుప్రది ఆ విషయమున రచయిత్రి మంచి నిగ్రహమును సమభావమును ప్రదర్శించి యున్నారు ద్విపద కవులు తమ తమకాలమునందలి వ్యావహారిక పదములను అన్యదేశ్యములను విరివిగా వాడియున్నారు శ్రీమతి సుశీలగారికి ఉర్దూ, హిందీ భాషలతోఁగూడ పరిచయముండుటచే వారట్టి పదములను చక్కగా వివరించి యున్నారు వారి సిద్ధాంత వ్యాసము సారస్వత విద్యార్థులకేకాక చరిత్రకారులకును పండితులకును గూడ ఉపయోగకరముగా నుండునని నా అభిప్రాయము. వారిందు 18వ శతాబ్దమువఱకును గల ద్విపదకావ్యములనే సమీక్షించియున్నారు. కాలాంతరమున వారు తరువాత వెలసిన ద్విపద కావ్యములను సైతము సమీక్షించి గ్రంథమునకు స్వయం సంపూర్ణతను గలిగింతురని కోరుచు, ఈ సిద్ధాంత వ్యాసమును రచించుటలో ప్రకటించుటలోను వారు పడిన సాఫల్యముతో గూడిన శ్రమను ప్రశంసించుచు విరమించుచున్నాను

హైదరాబాదు

16—8—79

దివాకర్ల వేంకటావధాని

# ప్రస్తావన

పదునెనిమిదవ శతాబ్దాంతము వరకు గల ద్విపద కావ్యముల చరిత్ర నీ గ్రంథము ద్వారా ఆంధ్రలోకమున కందించుటకై వినయ పూర్వకముగ ప్రయత్నించితిని. ఈ ప్రయత్నము ఢిల్లీ నుండి జరుగుట వలన మిక్కిలి వ్యయ ప్రయాసలతో కూడి భగీరథ ప్రయత్నమే అయినది. ఎంత వరకు సఫలీ కృతురాలనైనదియు నిర్ణయము పాఠకులకే విడిచిపెట్టెదను

మొత్తము నేనిందు పరిశీలించిన ద్విపద గ్రంథములు 114 అందు 37 మాత్రమే ముద్రితములు తక్కినవి 77 గ్రంథములును అముద్రితములు, కొన్ని తాళపత్ర గ్రంథములు, కొన్ని కాగితపు ప్రతులు. ముద్రిత గ్రంథములలో కొన్ని గ్రంథకర్తృ నామములు లేక, గ్రంథకర్తలు తెలిసినప్పటికిని వారి కాలములు తెలియక, యున్నవి కొన్ని గ్రంథములు తుది మొదళ్ళు లేక అసంపూర్ణములుగ నున్నవి.

వీనియందు గ్రంథకర్త నామములు తెలియనివి ... 21

గ్రంథ రచనాకాలము తెలియనివి ... ... 30

గ్రంథకర్తలు తెలిసిన స్థలములందు వారి కాలమును కనుగొన ప్రయత్నించితిని తుదిమొదళ్ళు లేక గ్రంథకర్తలపేర్లు తెలియక యున్నవానిని అటులె విడిచి పుచ్చవలసి వచ్చినది

ఈ ద్విపద కావ్యముల నన్నిటిని పరిశీలించిన పిమ్మట ఒక విషయము స్పష్టముగ తెలియుచున్నది ఈ శాఖ విపులమైనదే కాక, ఎన్నో విధముల విశిష్టమైనట్లు కూడ ప్రారంభదశలో వినిని సోమనాథాదులు మత ప్రచారమునకై ఉపయోగించి రచనలు గావించినను కాలక్రమమున వీనికి ఒక సాహిత్యాంగ ముగా స్థానమేర్పడినది "ద్విపద కావ్యంబు ముది లంజ" యిత్యాదిగా ద్విపద యెడ నుండిన నిరసన భావము తొలగిపోయి, ఇతర సాహిత్య ప్రక్రియ లతో దీనికి సమానముగు గౌరవ ప్రతిష్ఠ లేర్పడినవి గొప్ప పండిత కవులు కూడ ఈ ఛందమును చేపట్టి రచనలు గావించిరి. రంగనాథుడు, గౌరన, ...

పాక చిన్నన్న, దోనేరు కోనేరు నాథుడు, మడికి సింగన, కూచిమంచి తిమ్మకవి, ప్రముఖ ద్విపద కవులలో కొందరు మాత్రమే. కాలము గడిచిన కొలది, ద్విపద కావ్యములు శైలీ విషయమున సుగమములు, సామాన్యులకొరకు రచింపబడినవి యను నభిప్రాయము కూడ మారినట్లు గానబడుచున్నది. ఏలయన గౌరనాదుల కృతులలో సంస్కృతపద బాహుళ్యముతోపాటు అనేకద్విపద లేక సంస్కృత సమాసములుగా గూర్చబడినవి. కాన ఛందమును మాత్రమే ద్విపదనుస్వీకరించి, మిగిలిన విషయములలో అవి పద్య కావ్యముల, ప్రబంధముల త్రోవలో నడిచె నని చెప్పవచ్చును ప్రబంధ యుగమునకు తరువాత వెలసిన కావ్యములన్నియు, ప్రబంధ లక్షణముల నన్నిటిని పుణికిపుచ్చుకొని, తచ్ఛాయలో నడిచినవి గౌరన కాలము నాటికి ద్విపదలో షష్ఠ్యంత రచన కూడ ప్రారంభమైనది ఈ విధముగ నీ కవులు ద్విపద కావ్యమునకు సాహిత్యలోకమున పద్యకావ్యముల తోడి సమాన గౌరవ ప్రతిష్ఠలను తేబూని, కొంతవరకు సఫలులైరి గౌరన నాటికి మతో ద్రేకము చల్లారి శాంతపూరిత వాతావరణ మేర్పడినది కావుననే అతడు చల్లని కావ్యమును, ప్రసన్నమైన శైలిలో వ్రాయగలిగెను ద్విపద కావ్యములు కొన్ని, ఉదాహరణకు బసవ పురాణ, పండితారాధ్య చరిత్రలు సంస్కృతమున ననువదింప బడుట ముదావహమైన విషయము ఇటులే తరువాతి కాలమున కొన్ని ద్విపద కావ్యములు పద్యకావ్యములుగ రూపొందినవి

శైవమత సంబంధములగు కావ్యముల కన్న వైష్ణవమత సంబంధములగు కావ్యములే (నేను చదివిన వానిలో) నధిక సంఖ్యలో నున్నవి దీనివలన ఆంధ్ర దేశములందలి జనులకు వీరశైవముకన్న అద్వైత విశిష్టాద్వైత మతముల యెడ ఎక్కువ ఆదరగౌరవములున్నట్లూహింప వీలగుచున్నది తరువాతి సంఖ్య వేదాంత సంబంధ కావ్యములది సుబోధమగు శైలిలో వేదాంత రహస్యముల నెన్నిటినో కవులీ కావ్యములందు వివరించిరి. వీనిలో గూడ అద్వైత వేదాంత సంబంధ ములే అధికములు. దక్షిణదేశమున అరవదేశమున, మధుర, పుదుకోట, తంజావూరు రాజ్యముల నేలిన తెలుగురాజులు కొందరు తాము స్వయముగ కావ్యములను రచించి, కవుల నాదరించి పోషించి, వారిచే రచనలను వ్రాయించిరి.

సానంద చరిత్ర, దేవాంగపురాణముల కర్త అయిన భద్రకవి లింగకవి, ఉత్తరార్కాడు జిల్లాలోని పడవీడు నివాసి చొక్కనాథ చరిత్రకర్త పచ్చకప్పురపు తిరువెంగళకవి, రామనాథపురజిల్లా వాస్తవ్యుడు. రుక్మాంగద చరిత్రకర్త కని గిరి, తంజావూరి మహారాజు శాహాజీ కాలమునాటివాడు. తంజావూరి మహారాష్ట్ర ప్రభువు ఏకోజీ మధురమగు తెనుగున రామాయణమును రచించెను తంజావూరి రఘునాథ నాయకుడు నలచరిత్ర ద్విపదకావ్యమును రచించెను. అతని పుత్రుడు విజయరాఘవు డీ చందమున రఘునాథ నాయకాభ్యుదయమును రచించెను. ఈతని కాలముననే వెలసిన కవి పరమానంద తీర్థయతి, శివజ్ఞానమంజరి, అనుభవదర్పణము అను వేదాంత గ్రంథముల కర్త ఈతడు మన్నారు గుడి యందలి దండకారణ్య నివాసి

ఈ ఛందమునందు గల గేయ సౌలభ్యమును బట్టి భగవంతునిపై స్తుతి పూర్వకమగు రచన లెన్నియో రచించబడినవి శరణాగత ద్విపద, శ్రీరంగ మాహాత్మ్యము, వరదరాజమంజరి, మొదలగునవి యిట్టివి. తెనుగు సాహిత్య మనువాదముతో నారంభమైనదను మాటకీ ద్విపద సాహితీశాఖ అపవాదమై యున్నది

ద్విపదకావ్యము లన్ని విషయములపై రచింపబడినను, నీతిబోధక కావ్యములు మాత్రమిందు రచింపబడలేదు. ఇట్లివి అన్ని విషయములపైని రచింపబడుటచే, వస్తు వైవిధ్యమును గలిగి ఈ శాఖ అత్యంత ప్రాధాన్యమును, ప్రాముఖ్యమును గల్గియున్నది ఈ కావ్యములు తక్కిన శతాబ్దములలోకన్న 16, 17 శతాబ్దములలో నధిక సంఖ్యలో రచింపబడినట్లు తెలియుచున్నది తెనుగు సాహిత్యమున స్వర్ణయుగముగ పరిగణింపబడుచున్న 16, 17 శతాబ్దములలో నీ కావ్యములు కూడ అధిక సంఖ్యలో రచింపబడుటలో వింతలేదు గ్రంథ రచనా కాల మెఱుకపడని అనేక కావ్యములుకూడ ఈశతాబ్దులందే రచింపబడియుండును

గ్రంథరచనా కాల విషయములో శ్రీనిడదవోలు వెంకటరావుగారు ద్విపద కావ్య సూచికలో నిచ్చిన కాలములనే అనుసరించితిని. వారెచట కవికాలమును

పేర్కొనలేదో అపుడు వీలుగల స్థలములందు నేను కాల నిర్ణయము చేయ బూనితిని

గ్రంథ కర్తృత్వ విషయము వివాదాస్పదముగ నున్న సందర్భములందు నా యభిప్రాయమును సకారణముగ నిరూపించితిని

అముద్రిత గ్రంథ సూచికలో పేర్కొనబడని తాళపత్ర గ్రంథములను కూడ కొన్నిటిని నేను, మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమునందును, తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థయందును చదివితిని ఇవి సుమారు 10 లేక 12 ఉండును

అనువాద, అనుసరణ గ్రంధముల విషయములో ద్విపద కావ్యములను మూల గ్రంధములతో పోల్చి కవి మూలగ్రంధము నెంతవర కనుకరించెనో, కేవలానుసరణముగ, లేక మూల భిన్నముగ రచించెనో పరిశీలించితిని

ప్రతి కావ్యమునకును, సాహిత్య, వాఙ్మయ, శైలీ, ఛందో, వ్యాకరణ దృష్ట్యా విలువను పరిశీలింప బూనితిని వీనియందలి భాషవిషయమై నేను కృషిచేయలేదు అయినప్పటికిని, కవు లచ్చటచ్చట గావించిన విశిష్టములైన వింత ప్రయోగములను గుర్తించితిని.

1968లో పి హెచ్. డి పట్టము కొరకు ఢిల్లీ విశ్వవిద్యాలయమునకు సమర్పించిన పరిశోధన గ్రంథమిది ఆచార్యులు, శిష్యవత్సలులు శ్రీ డా. కొత్తపల్లి వీరభద్రరావుగారి పర్యవేక్షణ క్రింద నేనీ విషయము నధ్యయనము చేసితిని వారు ఉత్తర భారతములోని విశ్వవిద్యాలయమునందు దక్షిణభారత భాషయైన తెలుగులో పరిశోధన చేయుటకు జ్యోతిని వెలిగించారు జ్యోతినుండి జ్యోతిని వెలుగజేయు సంప్రదాయానుసారంగా ప్రస్తుతం ఢిల్లీ విశ్వవిద్యాలయంలో తెలుగులో విభిన్న విషయములపై మరికొందరు విద్యార్థులు పి.హెచ్ డి పట్టము కొరకు కృషిని కొనసాగిస్తున్నారు. ఈ సందర్భమున నేనేగాక, ఆవిద్యార్థులు కూడ వారి యెడ ఎంతో కృతజ్ఞులై ఉండవలసి యున్నది.

ముద్రణాదిక వ్యయము ముమ్మడించిన ఈ రోజులలో నింత పెద్ద గ్రంథమును ప్రచురించుట దుష్కరకార్యమే. అయినను ప్రచురించ వలెనను కోరిక తీవ్రమగుటచే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారి నార్థిక సహాయము నర్థించితిని వారు కొంత సహాయము నందించిరి. అందుకు విద్యా శాఖ వారికి మిక్కిలి కృతజ్ఞురాలను అటులే తక్కువ వెలకు కాగితము లభింపజేసిన భారత ప్రభుత్వము వారికి కృతజ్ఞురాలను నేను డిల్లీలో ఉండుట ముద్రణ హైదరాబాదులో జరుగుటవలన ప్రూఫురీడింగ్ హైద్రాబాదులోనే చేయించవలసి వచ్చినది కాని దురదృష్టవశాత్తు ప్రూఫు రీడింగ్ బాధ్యతా రహితంగా జరగడంవల్ల పుస్తకములో కొన్ని తప్పులు దొర్లినవి దీనివలన పాఠకులకు చాల ఇబ్బంది గలుగును నా యీ అసహాయతను పాఠకులు మన్నించగలరని ప్రార్థన అదృష్టం నోచుకొని ఈ గ్రంథం మలి ముద్రణ గాంచ గలిగితే మిక్కిలి సావధానతతో ముద్రణ జరిపించి పుస్తకమును దోష రహితముగ పాఠకుల కందింపగలను. నాకు కేవలము గురువులు ఆచార్యులు మాత్రమేగాక, నా సర్వతోముఖాభివృద్ధికి కారణులును, శ్రేయోభిలాషులునైన పూజ్యులు శ్రీ దివాకర్ల వెంకటావధానిగారికి నేనెంతో ఋణపడి యున్నాను వారి సహాయమే లభింపక పోయినచో నేడీ పుస్తక మీ విధముగ వెలుగును చూచుట సంభవించెడిది కాదు. ఆరోగ్యము సరిగ లేకున్నను లెక్కచేయక వారు పుస్తక ముద్రణ కార్య భారమును వహించి చివరి నూరు పుటల ప్రూఫు లనుకూడ చక్కదిద్ది గ్రంథమును నిర్దుష్ట మొనర్చిరి మరియు కోరినదే తడవు దయతో తొలిపలుకులను వ్రాసి యిచ్చిరి. వారికి నా కృతజ్ఞతా పూర్వక ప్రణామ పుష్పాంజలులు.

కొత్తఢిల్లీ
18–8–1979

టి. సుశీల



# విషయ సూచిక

## మొదటి ప్రకరణము



## రెండవ ప్రకరణము

## మూడవ ప్రకరణము



## నాల్గవ ప్రకరణము

(3) ఇతరములు



## అయిదవ ప్రకరణము



(ఎ) శైవమత సంబంధములు

## ఆఱవ ప్రకరణము

## ఏడవ ప్రకరణము



## ఎనిమిదవ ప్రకరణము



## తొమ్మిదవ ప్రకరణము



## పదియవ ప్రకరణము

## పదునొకండవ ప్రకరణము



## పండ్రెండవ ప్రకరణము





# ద్విపద - దానిపుట్టుపూర్వోత్తరములు

రెండు పాదములు గల యొక ప్రత్యేక ఛందము తెనుగున ద్విపదగా పరిగణింపబడుచున్నది. వృత్తములకు, పద్యములకు నాల్గు పాదములుండును. పదము లేక పాదము అనగా పద్యములోని నాల్గవ వంతు అనగా ఒక పద్య పాదము. నాల్గు పాదములు కలది పద్యము కాగా, రెండు పాదములు గలది ద్విపద యయినది ఇట్లగుట వలన ద్విపద కన్వర్థ నామ మేర్పడుచున్నది. తెనుగునందలి ద్విపదకు ప్రతిపాదము నందును మూడింద్ర గణములు, ఒక సూర్యగణము నుండి మూడవ గణాద్యక్షరము యతి స్థానమై, ప్రాస నియమమును గల్గి యుండవలెనను నియమమును లాక్షణికు లేర్పరచిరి. ఉదాహరణమునకు,

'గోపికా వల్లభా గోవింద నిన్ను
గోపాల మాధవా గురుదేవ గొలుతు'

పద్యకావ్యములందు ఒక్కొక్క జాత్యుపజాతి వృత్తములను వ్రాయు సంప్రదాయము కలదు గాని, ఒక్క ద్విపదను వ్రాయు సంప్రదాయము తెనుగున లేదు. గ్రంథమంతటిని ద్విపదలో వ్రాయుటయే సంప్రదాయము. దీనినే అప్పకవి, 'క్షితి దగ నీ రెంటిచే నొప్పు ద్విపద, మితి లేక చెప్పిన మేలంద్రు కవులు' అని కావ్యమునంతటిని ద్విపదగా చెప్పవలయుననెడి అనాటి సంప్రదాయమునే చెప్పెను.

ఈ ద్విపద ఛందస్సుయొక్క చరిత్రను ప్రాచీనతను పరిశీలింప వలసియున్నది. కొందరి మతానుసారము తెనుగు భాషయందలి పదజాలము వలె, సాహిత్యమునందలి యితర సంప్రదాయములు, ఛందోరీతులవలె, నీ ద్విపదకూడ సంస్కృత ప్రాకృతములనుండి వచ్చినది. వారు తమ వాదమ్మున కుపబలముగా ద్విపద శబ్దము వేదములందును, ప్రాకృత [illegible] యందును, కానబడుచున్న దనియు, అదియే మన వాఙ్మయమ్మున వచ్చి చేరిన దనియు నందురు.

వైదిక వాఙ్మయమున ద్విపదా గాయత్రీ, ద్విపదా జగతీ, ద్విపదా శత బృహతీ, ద్విపదా త్రిష్టుప్, ద్విపదా విరాట్, అను ఛందస్సులు గాన వచ్చుచున్నవి. ద్విపద, ద్విపది, ద్విపదిక, ద్విపదగ,ద్విపదీ ఖండము, దోహా (పా) మొదలగు పేర్లతో నొక ఋగ్భేదమనియును, గీత ప్రబంధమనియు, మాత్రా వృత్తమనియు. ననేక గ్రంథములందు దీని ప్రసక్తి వివిధ రూపముల గానవచ్చుచున్నది.

1 వాచస్పత్య నిఘంటువు. ద్విపదికా, ద్విపదీ, 'స్వార్థేక' హ్రస్వః, గీతిభేదే, 'శుద్ధా ద్విపదకా గీతి ర్గ్రంథ లేత్యభి ధీయతే'-భరతః - ద్విపదీః ఋగ్భిన్నే ద్విపదయుక్త గీతి భేదే మాత్రావృత్తభేదేచ ఆదౌ షట్కలం మేతత్, తదను పంచచ చతుష్కలమ్ గుర్వంతం ద్విపదీ భవతీహ వింశత్యష్ట కలం దలమ్ గాయత్ర్యా స్యేక పదీ చతుష్పద్యపవని సహిపద్యాసే శతపథ బ్రాహ్మణము (14–8–'510)

2 శబ్దస్తోమ మహానిధి ద్విపదా (స్త్రీ) ద్వాపాదా వస్యాః పాదస్యాన్త లోపః జాప్ భ త్వాత్పదాదేశః ఋగ్విశేషే ఛందో భేదే దీప్ ద్వి పదీ

3 శబ్దార్థ చింతామణి· ద్విపదా (స్త్రీ)ఋగ్విశేషే ద్వౌపాదా వస్యాః సంఖ్యాను పూర్వస్యేతి పాదస్యాన్త లోపః టా ఒ్కతీపి టాప్ పాదః పత్

4. భరతుని నాట్యశాస్త్రము విక్రమోర్వశీయమున కాళిదాసు సూచించిన 'చిత్రలేఖా ప్రవేశానంతరం, ద్విపదికయా దిశోవలోక్య" అనుదానిని పేర్కొని ద్విపదికకులక్షణమును వ్యాఖ్యాత భరతముని ప్రోక్తముగ జెప్పినాడు భరతుని లక్షణమని వ్యాఖ్యాత చెప్పినది.

'శుద్ధా ఖండాచ మాత్రా సంపూర్ణేతి చతుర్విధా
ద్విపదీకరణాఖ్యేన తాలేన పరిగీయతే,
చతుర్భిరీదృశైః పాదైః శుద్ధా ద్విపది కోచ్యతే
అర్థాంతేఽన్యే స్వరానాహుః ఖండాచ్ఛ్రుద్ధయోర్థయా
షష్ఠేనేకైన గురుణా మాత్రా ద్విపదికా మతా
శే యా శుదెన సంపూర్ణా గురుణాంతే భికేనతు.

కాని ఇది భరతమున గానవచ్చుట లేదు సంగీతరత్నాకరమున నాల్గవ యధ్యాయమున 214–217 శ్లోకములుగా కానవచ్చుచున్నది.

కాని ద్విపదక జంభలా నామకమగు నొక గీతి భేదముగా భరతుడు చెప్పినట్లు వాచస్పత్యమున గలదు కదా

విక్రమోర్వశీయిమున ద్విపదిక లక్ష్యము లేకపోయినను, జంభలిక లక్ష్యము గలదు దానికి రంగనాధుని వ్యాఖ్యాన మీ విధముగ నున్నది.

'జంభలికా గీతి విశేషః తధా చాహ భరతః ఉద్గ్రహాది సకృద్వైక ఖండో ద్వి శకలోధవా, యత్రిధ్రువో ద్విర్వాభోగో (?) ధ్రువే ముక్తిః సజంభకః ఇతి ఏతస్యైవ నామ జంభలికేతి మతంగ మతమ్ ధ్రువే ముక్తి రహితా పూర్వోక్త లక్షణ లక్షి తానేతి శ్రీమద్భట్ట సోమేశ్వర చరణాః' (ఈ జంభలికయే ద్విపదిక రూపాంతరమగు జంఘల యేమొ)

౫. మతంగుని బృహద్దేశిః

'యస్మాత్ కరణ తాలేన ద్విపదీవృత్త సంగతా
సాభవేత్ ద్విపదీ నామ ప్రోక్తా వస్తు విచక్షణైః
ఆద్యం పాద ద్వయం యత్రతస్యాదిను ప్రాస వర్జితం
అను ప్రాస స్తృతీ యేపి చతుర్థేనా ధగీయతే.

జనాశ్రయి. అధ్యా. ౫ సూ. ౫౪–58
సూత్రము. గణ స్త్రియోభంగ ద్విపదీ–54.
వృత్తి త్రయోగణాః ప్రతిపాదం భవన్తి చేత్

భంగ ద్విపదీ నామ భవతి
గణాధికారవర్తమానే పునరుణగ్రహణం చతుర్లఘూనాంచ
సర్వేషాంగణనా మభేదేన గ్రహణార్థమ్
ఇతర ధాహి చతుర్లఘూనామేవ గ్రహణం స్యాత్

సూ ౫౫. 'చత్వారం పంచషట్ స ప్తవా'
వృ తి. తసాం ఏవ భంగ గింపదాంస కేవలం । తయాం

ఏవ గణా భవన్తి చత్వారోవా పంచవా షద్వా సప్తవా భవన్తి

సూ · 56. 'భాంతేవా'–

వృత్తి. తస్యా భంగ ద్విపద్యా ప్రతిపాదం గురురన్తే
భవతి వానవా'

సూ . 57 'త్రింశద్వాపరమా'

వృత్తి. త్రింశల్లఘవో యస్యా భంగ ద్విపద్యాఃత
సా భవతి త్రింశద్వా పరమాధికా భంగ ద్విపదీ
తతః సర్వాభ్యో భంగ ద్విపదీ భ్యోయా పరమాసా
త్రింశద్వా భవతి తదధికా నాస్తి

సూత్ర : 58 ద్విపదీ గీతికా పరా

వృత్తి. సైవ భంగ ద్విపదీ ద్విపదీ త్యుచ్యతే గీతికా
పరా భవతి చేత్

భావ ప్రకాశమున 'కావ్య' మను నుపరూపకము 'సభగ్నతాళ ద్విపదీ ఖండ మాత్రా పరిష్కృత మనియును, 'కల్పవల్లి' యను నుపరూపకము 'ద్విపదీ ఖండ గేయాఢ్య' యనియును గలదు బాణభట్టుని కాదంబరి పూర్వ భాగమున 'ద్విపది' యొక పాఠ్య విశేషముగా పేర్కొనబడినది.

6. మానసోల్లాసము

త్రయోగుణా గురుశ్చాంతే ప్రథమే ధ తృతీయకే
ద్వితీయేచ ద్వ్యోగణా ద్వ్యోగురూ తథా
జగణో నాత్ర కర్తవ్యో భాగాంతే యమకం భవేత్
ఇతి ద్విపదగం నామా తస్యో దాహృతి రుచ్యతే
గాతవ్యః స్వర సంయుక్తస్తా లేన పరివర్జితః
ప్రబంధో ద్విపదాభి ఖ్యోగీత విద్యా విశారదైః
షట్కలోగణ అద్యస్య తతః పంచ చతుష్కలా

అంతే గురుర్ద్వితీయే జః పష్ఠేచ ద్విపదీతు సా
పాద ద్వయాంతే క ర్తవ్యః స్వర న్యాసోయథోచితః
ఏనకేనాపి తాలేన గాతవ్యా ద్విపదీ బు ధైః

7. సంగీత చూడామణి

'సంస్కృతే యే ద్విపదగాః ప్రాకృతే దోహ కాళ్చతే
అభీష్టమాత్ర తాళః స్యాదా భోగో అన్యపదైః కృతః
స్వరైర్న్యాసో విధాతవ్యః తాళమాన ద్వయేనవా

8. సంగీత సుధాకరము

"కరణాఖ్యేన గాలేన గతవ్యోమ కాంతలే
అభోగోన్య ప దైః కార్యోన్యాపస్తాలాద్విమానతః
ద్విపదీచ భ వేదేనమ్"

9 ప్రాకృత పింగళము

సూత్రము;

ఇహ చతుష్క గణ నిర్మిత పదః త్రిలఘు విరామం
భవతి తుషీ
నాగాధిప పింగళ భరిత సుమంగళ ఛత్రావృత్త మిదం ద్విపద

ఉదా కావ్యమాలా సీరీస్, నెం 4।

ద్విపద Having two feet as verse
ద్విపది లేక ద్విపదికా a kind of prakrita metre.

10 ఆప్టే సంస్కృత నిఘంటువు నుండి,[1]

ద్విపధా

ప్రధమ చరణే 14 మాత్రా

ద్వితీయ చరణే 13 మాత్రా

కాని పై వానిని పరిశీలించిన పిమ్మట వీనిలో నేదియు మన ద్విపద లక్షణముతో సరిపోవుటలేదని తెలియుచున్నది. ఈ 'ద్విపద' 'గుర్వంతం ద్విపదీ భవతీ' యని గుర్వంత మయినది. కాని మన ద్విపద లఘ్వంతము జంఝలికము పాదమునకు పదమూడు మాత్రలు గలది.

మన ద్విపద పాదమున కనీసము పదిహేను మాత్రలుండును జనాశ్రయిలో పాదమునకు ముప్పది మాత్రలు పైగా చెప్పబడినవి మన ద్విపదకు పదునెనిమిది మాత్రలకంటె నెక్కుడుండ జాలవు మానసోల్లాసమున 1-3 పాదములందు మూడు గణములు నొక గురువు 2-4 పాదములందు రెండు గణములు రెండు గురువులు అను లక్షణము చెప్పబడినది మన ద్విపదలో ఒకటి రెండు పాదములకొకే లక్షణము. అది లఘ్వంతము. కాని మానసోల్లాసమున చెప్పబడిన లక్షణము మన ద్విపద కన్వయింపదు

సంగీత రత్నాకరమున చెప్పబడిన ద్విపదకమే దోధకమనియు, దానికి మూడు భగణములు, రెండు గురువులు లక్షణమనియు, కల్లినాథుడు చెప్పినాడు. ఈ దోధకమునే త్రిష్టుప్ ఛందో వృత్తముగా లాక్షణికులు పరిగణించిరి. ఈ దోధక లక్షణము మన ద్విపదకు సన్నిహితముగ నున్నది అందలి చివరి గురువును లఘువు చేసినచో ద్విపద పాదమగును దోధకమున భగణ ప్రయోగము విహితము తెనుగు ద్విపదయందట్లుగాదు. భగణప్రయోగం ఐచ్ఛికము. రెండు పాదముల యందును నొకే లక్షణమును గల్గినవన్నియు 'ద్విపద' లను సామాన్యార్థమున పై వన్నియు ద్విపదలు కాని మన ద్విపద

1 Part II—p 849

లక్షణము వీనికంటె భిన్నమై విలక్షణమై యొప్పుచు దేశీయ ఛందస్సనదగి యున్నది

దేశీయ ఛందస్సనగానేమి? ద్విపదను దేశీయ ఛందస్సని యెట్లు చెప్ప వలను పడుచున్నది? దేశికంటె వేరైనది మార్గ. తెనుగు భాషయందలి పద జాలమున దేశి, లేక అచ్చతెనుగు పదములును, సంస్కృత సమములు లేక తత్సమములు నున్నటులుగనే, తెనుగు కవితయందు, మార్గదేశీ సంప్రదాయము లున్నవి ఇట్టి విభాగము సంస్కృతభాషయిందు లేదుగాని, సంగీత నాట్య శాస్త్రము లందున్న ఆ భేదమును పురస్కరించుకొనియే తెనుగు కన్నడ కవులు సాహిత్యమునను నా సంప్రదాయమును ప్రవేశపెట్టియుందురు లేదా భాషయందలి పదజాలమున నున్న విభాగమును బట్టికూడ వారట్టి విభజనను గావించి యుందురు.

సంగీత శాస్త్రమున సంగీతము దేశి మార్గములని రెండు విధములుగ పేర్కొనబడినది బ్రహ్మ మున్నగు వారిచే మార్గితమై, భరతాదులచే, శివుని యెదుట గానము చేయబడినది మార్గమనియు, వివిధ దేశములందలి జనులకు హృదయ రంజకముగ నుండునది దేశి యనియు శార్ఙ్గదేవుడు తన సంగీత రత్నాకరమున దెల్పెను. మార్గ దేశములకు గల భేదమును గూడ నాతడు వివరించినాడు [2] స్వర గ్రామ జాత్యాదుల యొక్క లక్షణముల

---

2 గీతం వాద్యం తథానృత్తం త్రయం సంగీత ముచ్యతే,
మార్గోదేశీతి తద్ద్వేధా తత్ర మార్గస్స ఉచ్యతే
యో మార్గితో విరించాద్యైః ప్రయుక్తో భరతాదిభిః
దేవస్య పురతః శంభోర్నియతో భ్యుదయ ప్రదః
దేశే దేశే జనానాం యద్రుచ్యా హృదయ రంజకం
గీతంచ వాదనం నృత్తం తద్దేశీ త్యభి ధీయతే,
యేషాం శ్రుతి స్వరగ్రామ జాత్యాది నియమో నహి,
నానా దేశ గతిచ్ఛాయా దేశీరాగస్తుతే మతాః
కామచార ప్రవర్తిత్వం దేశీ రాగస్య లక్షణం
నియమేతు సతి తత్ర మార్గత్వ మను లక్షితం.

నన్నిటిని సమగ్రముగ గల్గి సర్వదేశముల యందును సమాన రూపమును సంత రించుకొన్నది మార్గమనియు, ఆయా దేశములయొక్క జనుల కనుగుణమగు ప్రవృత్తిని కల్గియుండి నియమబంధనము లేకుండ కామచారి ప్రవర్తిత్వము గల్గినది దేశి యనియు నాతడు దెల్పెను. ఇతర సంగీత శాస్త్ర గ్రంధములయిన కాశీనాధుని సంగీత సుధాకరము[3] సంగీత దర్పణము[4] రామయామాత్యుని స్వర మేళ కళానిధి[5]కూడ, దేశి మార్గముల కీ లక్షణములనే దెల్పుచు దేశి జనుల హృదయరంజకత్వమే దేశి ముఖ్య లక్షణముగా జెప్పుచున్నది రామయా మాత్యుని లక్షణమును, శార్ఙ్గదేవుని లక్షణమును నించుమించుగా నొకే విధముగా నున్నవి శార్ఙ్గదేవుడు 'దేశే దేశే జనానాం యద్రుచ్యా హృదయరంజనం,' అని చెప్పగా నీతడు "దేశీ రాగాదిభిః ప్రోక్తం తద్గానం జన రంజనం" అని నిర్వ చించినాడు ఇందు వీరుపయోగించిన 'జన' శబ్దము సామాన్య జనులను నర్థమున ప్రయోగించబడినది

సంగీత రత్నాకరమందు మార్గము గాంధర్వ మనియు దేశి గానమనియు, పేర్కొనబడినది గాంధర్వ మనాది సంప్రదాయ సిద్ధముగా చెప్పబడినది 'అనాది సంప్రదాయ మిత్యనేన గాంధర్వస్య వేదవ దపౌరు షేయత్వ మితి సూచితం భవతి' అని దానికి వ్యాఖ్య వ్రాయబడినది. దీనివలన గాంధర్వ మనాది కాలమునుండి వచ్చుచున్నదనియును, వేదములవలె అపౌరుషేయ మనియు విదితమగుచున్నది స్వరమేళ కళా నిధియందు, 'తత్రలక్షణాను రోధేన గాంధర్వం సంప్రయుజ్యతే'' అని గాంధర్వము లక్ష్యాను రోధముగ ప్రయోగింపబడునని దెల్పబడినది. అనగా నది లాక్షణికు లేర్పరచిన లక్షణానుగుణముగ నుండును

---

3. అధునాగీయతే యచ్చా నియతం కామచారతః
దేశే దేశే ప్రచరితం తత్సర్వం దేశి సమ్మతం

4. తత్తద్దేశస్థ యా రీత్యా యస్మాల్లోకానురంజనం
దేశే దేశేతు సంగీతం తద్దేశీత్యభిధీయతే

5 'దేశీ రాగాధిభిః ప్రోక్తం తద్గానం జన రంజనం'

గాని, లక్షణ వైరుధ్య మిసుమంతయు దాని యందుండదు నవ్యతకందు తావుండదు కాని దేశి యందిట్లు కాదు దానికిట్టి నియమములు లేనట్లు శార్ఙ్గ దేవుడు,

"యద్వా లక్ష్య ప్రధానాని శాస్త్రాణ్యేతాని మన్యతే,
తస్మాల్లక్ష్య విరుద్ధం యత్తచ్ఛాస్త్రం నేయ మన్యథా..."

అని చెప్పినాడు. ఇందలి 'శాస్త్రాణ్యేతాని' అనువాదానికి దేశీ విషయాణీత్యర్థః అని వ్యాఖ్యానముండుట వలన ఆయాదేశములందలి జనుల యభిరుచులకు తగినట్లుగ నుండి వారిహృదయముల కాహ్లాదము గూర్చుటయే దేశికి ప్రధాన లక్షణము. ఇందువలన భిన్నభిన్న దేశము లందలి జనుల రుచులకు తగినట్లుగ భిన్నభిన్న విధములుగ నది యుండును జనులు వారి వారి కిష్టమగు విధమున దానిని పాడుకొందురు

నృత్యము కూడ మార్గదేశీ భేదములచే ద్వివిధముగ నుండునని దశ రూపకమున చెప్పబడినది 'అన్యద్భావాశ్రయం నృత్యం నృత్తం తాళ లయాశ్రితమ్. అద్యం పదార్థాభి నయోమార్గోదేశీ తథాపరమ్ [6] ఇచ్చటగూడ మార్గమను దానికి దేవతలచే వెదుకబడినదై పదార్థాభినయమైన నృత్యము మార్గమని ప్రసిద్ధి చెందినట్లును, ఆయా దేశములకు సంబంధించిన దగుట వలన నృత్తము దేశి యనబడుచున్నట్లును చెప్పబడినది

సంగీత నాట్యశాస్త్రము లందలి ఈ మార్గ దేశీ భేదములను సాహిత్య పరముగ పరిశీలించినచో సంస్కృతము మార్గ సంప్రదాయమునకును, ఆంధ్ర, తమిళ, కర్ణాలూది భాషలు దేశి సంప్రదాయమునకును, చెందినవని తోచును. 'మార్గగీతం పురైవాసీత్[7] అన్నట్లు, మార్గమునకు ప్రాచీనతయె లక్ష్యమని చెప్పబడినప్పుడు, భాషా, సాహిత్యములను బట్టి సంస్కృత వాఙ్మయము మార్గ సంప్రదాయమునకు చెందునని చెప్పక తప్పదు. మార్గ సంప్రదాయమునకు ప్రాచీనత (ప్రధాన) లక్షణమైనదో, దేశికి నవ్యతయే లక్షణము కావలెను. లేక ఆ కాలమునందున్న సంప్రదాయముకంటె భిన్నమై, తద్వ్యతిరిక్తమై, విప్లవా

6. దశరూపకము 1-9
7. సంగీత రత్నాకరము

త్మకమైనదిగా నుండవలెను కేవలము భాషాపరముగా చెప్ప జూచినచో సంస్కృతము మార్గ సంప్రదాయమునకు, ఆ కాలమునకు బయలుదేరి అప్పటికి నవీనమైన భాషలు, ఆంధ్ర, తమిళ, కర్ణాటాది భాషలు దేశి సంప్రదాయమునకు చెందిన వని చెప్పవచ్చును తెనుగు సాహిత్యమున రెండు సంప్రదాయము లున్నటులు మనకు తెలియుచున్నది కన్నడమందీ సంప్రదాయ ముండినట్లు కవిరాజమార్గము వలన తెలియుచున్నది. దేశి భిన్న భిన్న విధములుగా నుండుట వలన కన్నడ భాషలోని దోషమెంత యని చెప్పనలవికాదని నృపతుంగుడు కవి రాజమార్గమున దెల్పినాడు [8] కావున, కన్నడ సాహిత్యమున నీ రెండు సంప్రదాయము లున్నట్లు తెలియుచున్నది తెలుగున కూడ నీ సంప్రదాయము లుండినట్లు శాసన ప్రమాణముగూడ గదు. ఇది నృప ధూర్జటి భీమయపండని చేబ్రోలు శాసనము

"తలంపు సదర్థ భావమునం దద్గత సూక్తుల కూడ వర్ణనల్
గొలుసు గొనంగ వ్రావడులు గోరిన భంగికి వచ్చి ముట్ట గో
మలగతి దేశిమార్గములు మట్టు పడం గ్గ్రనంబు లొప్ప నా
ద్యుల క్రియఁ జెప్పనేర్చె నృప ధూర్జటి భీమయ పండ్డ డిమ్మహిన్.

---

8. "దోసమిని రెండు బగెదు,
ద్భాసిత తఱి సందు కన్నడం గళోళెందుం
వాసుంగియు మఱి యలాదదై
బేసఱుగుం దేశి బేఱె బేఱెప్పదఱిం"
(కవిరాజమార్గము) ఇది క్రి శ 815-871 ప్రాంతమున నుండిన నృపతుంగునిచే రచింపబడినది

9 (1) దక్షిణ దేశీయ శాసనములు సం వెం 103
(2) శాసన పద్యమంజరి - 19 - పు 37

తెనుగు సాహిత్యమున మార్గదేశీ పదములను మొట్టమొదట ప్రస్తావనకు తెచ్చినవాడు క్రీ శ. 12 వ శతాబ్దమున వెలసిన కవిరాజ శిఖామణి నన్నెచోడుడు

'మును మార్గ కవిత లోకం
బున వెలయగ దేశి కవిత బుట్టించి తెనుం
గును నిలిపి రంధ్ర విషయం
బున జన చాళుక్య రాజు మొదలుగఁ బలువుర్'

లోకమున మార్గ కవిత వెలసి యుండగా, జాళుక్య రాజులు పలువురు దేశి కవితను పుట్టించి ఆంధ్ర విషయమున తెలుగును నిలిపిరని అతడు చెప్పెను. ఈ చాళుక్య రాజాదులతో గొందరు కవులుకూడ నుండి యుండవచ్చును కీ శే. వీరేశలింగము పంతులుగారు నన్నెచోడుడు దేశి కవులను కూడ నొక పద్యమున స్తుతించి యుండుననియు, ఆ పద్య మెటులో నశించి యుండుననియు భావించిరి. నిజముగా అతడటులే రచించి యుండి యది మనకు నేడు లభ్యమగుచుండినచో, అతని దృష్టిలో మార్గదేశి కవులన నెవరో మనకు స్పష్టముగా నెఱుకపడెడివి. స్తుతి సింహావలోకన పద్యమైన 'సురవరులను' పద్యమున అతడు చెప్పిన క్రమముననే, మొదట స్తుతి గావించినాడు. కావున, పురాణ కవి సంఘమనగా, వ్యాస వాల్మీకాదులును, ఉత్తమ మార్గ సత్కవీశ్వరులనగా కాళిదాసాదులైన సంస్కృత కవులును, దేశి సత్కవులనగా, నన్నయ లేక - చాళుక్య రాజులలో నుండిన తెలుగు కవులునని యాతని యభిప్రాయమై యున్నటులు తెలియుచున్నది కాగా నిట సంస్కృత కవిత మార్గ కవిత, తెలుగు (దేశ భాషలలో రచితమైనది) దేశి కవిత యని తేలినది కాని కాలక్రమమున నీ యభిప్రాయము మారినట్లున్నది సంస్కృత సాహిత్య ప్రభావితమైన నన్నయాదుల కవిత మార్గ కవిత యని, భావ, భాషా, ఛందో విషయాదికములన్నిటిలో గూడ, దేశీయత గల్గినదే దేశి కవిత యనియు నభిప్రాయమేర్పడినది అపుడే, సోమనాథాదుల రచనలు దేశి రచనలుగా ప్రఖ్యాతి నొందినవి. అనగా, సంస్కృతప్రభావము గల్గిన రచనలన్నియు, మార్గకవితా సంప్రదాయమునకు చెందినవనియు, సంస్కృత ప్రభావ రహితమైనవి శుద్ధ దేశీయములైనవి దేశిరచన

లను భావ మేర్పడినది, 'మార్గ గీతం పు ్రరెవాసీత్ అను లక్షణమునే గీటు రాయిగా నంగీకరించినచో, నన్నయ కాలము, లేక చాళుక్య రాజాదుల కాలము నాటికి, సంస్కృత కవిత పురాతనమై, నన్నయాదుల కవిత నవీనమై, సంస్కృత కవిత మార్గ కవిత యగుచున్నది కాని సోమన కాలమునాటికి సంస్కృత ప్రభావము గల్గిన నన్నయ రచన పురాతనమై, వీరి రచనలు నవీనములై తనతారుచు, దేశీయ రచనలైనవి.

ఇందువలన నిప్పుడు మార్గయనగా సంస్కృత ప్రభావము కల్గిన రచనా రీతి యనియును, దేశి యనగా, సంస్కృత ప్రభావ మేమియు లేక, దేశమునందే పుట్టి, దేశమునందే పెరిగి, నిరాడంబరముగా నుండి, తత్తద్దేశ జనుల కాహ్లాదమును గూర్చునదే యనియు తెలిసినది. ప్రస్తుత చర్చనీయాంశమైన తెనుగు ద్విపద ఛందస్సు సంస్కృత జనితము గాని తత్ప్రభావితము గాని గాదని పైని తెలిసికొంటిమి ఇది శుద్ధ దేశీయమైన ఛందస్సు. ఇతర ద్రావిడ భాషా ఛందో రీతులలో గూడ దీనికి సామ్యము గలదు కాని, సంస్కృత పండితులకు, ఈ ద్విపద కవిత్వము నెడల, దేశి కవిత్వము నెడల నాదరము లేకపోవుటచే దీనికి రాజాశ్రయము లభింపక తగినంత ప్రచారమును పొందలేదు. కాన నిది గ్రంథస్థమై గౌరవమును బడయజాలక పోయినది. దీని నాదరించి, యానందించిన వారు సామాన్యులు, జానపదులు, కావుననే ఇట్టి జానపదుల దేశమునందే పుట్టి, అచటనే పెరిగి, ఇటీవలి కాలమువరకు వారి పరిధికిమాత్రమే పరిమితమై యుండి పోయినది. కాని ద్విపద ఛందస్సు, తెలుగు ఛందస్సునకు, భాషకును జీవగఱ్ఱ వంటిది "దేశీయమైన జానపద సారస్వతమునందు నూటికి తొంబదిపాళ్లు ద్విపద ఛందస్సున కొదుగును ఇది కారణము గావచ్చును. ద్విపదయొక్క గణ ప్రస్తారము సంస్కృత గణములకు సంబంధించినది.[10] నేటి కుపలబ్ధమగుచున్న జానపద, లేక దేశీయ వాఙ్మయమున తొంబదిపాళ్ళు, ద్విపద ఛందస్సున కొదుగు ననియును, ఏ వాఙ్మయమునందైనను, పద కవిత్వమే పద్య కవిత్వము కంటె ముందుద్భవించుననియు చెప్పుకొనినను, ద్విపద ఛందస్సుయొక్క ప్రాచీనత యెంతటిదో నిర్ణయింపజాలము. ఇది చాలకాలము నుండి దేశమున నుండిన దనుటకు ముఖ్యముగ రెండు హేతువులు కన్పించు

10. తెలుగు ఛందో వికాసము, పీఠిక(శ్రీవిశ్వనాథ సత్యనారాయణ)పు. vii

చున్నవి మొట్టమొదటి లక్షణ గ్రంథకారుడైన రేచనయు నితర లక్షణ గ్రంథ కర్తలును నీ ద్విపద లక్షణమును చెప్పిరి.[11] రెండవది, నేటిదనుక, లభించిన, ప్రాఙ్నన్నయ కాలమునాటి పద్యమయ శాసనములన్నియు, ద్విపద రూపాంత రములే ఇవిగాక, అప్పకవి చెప్పిన కంద భేదము లాఱుగాక" యను (4-264) పద్యమువలన, నన్నయకు పూర్వమునుండియు దేశమందు ద్విపద యున్నట్లు తెలియుచున్నది [12]

కన్నడమందు 'సాంగత్య' మను నది ద్విపాద యుక్తమైనది. సాంగత్య ఎరడే పాదగళు—

రతి గీత "చెలువు ఖా" రతి గీత 'సపన్నె
ప్రతి లక్ష్మి 'సొబగు రూ' పివళు'

ఇందు ద్విపద కన్న ఒకమాత్ర ఎక్కువగ నున్నది
ప్రాఙ్నన్నయ యుగమున లభించిన మొట్టమొదటి పద్యమయ

---

11. కన్నడ కైపిడి యను గ్రంథమున తెనుగు ద్విపద లక్షణము చెప్ప బడినది. తెలుగి నల్లి ద్విపద—పు. 180.

హసి దుబం 'దనరింగ' 'శనదీయ' 'బేకు'
శిశు గలగె 'హాలెణ్ణె' గళ నడసి' 'బేకు'

ఎరడు ద్విపద కూడిదరే చౌపది

లక్షణ ·

ఎసెద చౌపదగె పదునెయి మాత్రెగళు
ససినె యతి యొంట రొళు పసరి సులిరలు

12. అప్పకవీయము. 4-264

శాసనము.[13] పండరంగని అద్దంకి శాసనము [14] క్రీ. శ 848 నాటి దీ శాసనము ఇందు తరువోజ పద్యముగలదు

తరువోజ పద్యపాదము ద్విపదయొక్క ఒక పాదమును రెట్టింపు చేయుటచే నేర్పడినది అనగా నిందు ప్రతి పాదమునకు మూడింద్ర గణములు ఒక సూర్య గణము మరల మూడింద్రగణములు ఒక సూర్యగణము నుండునన్నమాట దీనియందును యతిప్రాసాది నియమములుండును. ద్విపద ఛందము నట్లే స్వీకరింప నిచ్చగింపని శిష్టులు మార్గ కవితానుయాయులు, దానిని రెట్టింపు చేసి, వృత్తఛాయను దానికొసగి తృప్తినొందిరి తర్వోజనుండియే యేల ద్విపద యేర్పడి యుండరాదని యెవరైనను ప్రశ్నింపవచ్చును పద్యము లేర్పడు సంప్రదాయమునుబట్టి చూచినచో చిన్న చిన్న పాదములు గల పద్యములే ప్రారంభ దశలో నుండిన వనియును, పెద్ద పెద్ద పాదములు గల పద్యములు తరువాత నేర్పడిరవనియును చెప్పవచ్చును [15] కావున తరువోజ కన్న ద్విపద ప్రాచీనమైనదనియును దానినుండియే తర్వోజాదు లేర్పడిన వనియును, స్పష్టముగ తెలియుచున్నది పాదనియమము లేకుండి ద్విపద గాన యోగ్యమై తనరారుచుండుట వలన కూడ దాని ప్రాచీనత స్పష్టమగుచున్నది ఏలయనగా మొట్టమొదట దేశీయ పద్యములకుగాని, పాటలకు గాని పాదనియమ మున్నట్లు కాన్పించదు "తెలుగు కవిత ఏక పదమై, ద్విపదమై, త్రిపదయై, చతుష్పదమై పరిణతి చెందునట్లు కానవచ్చు చున్నది ఏక పదములగు పాట

---

13, 14. ఇంతకంటె పూర్వము నాటి శాసనములలోగూడ ద్విపద రగడలున్న టులు పరిశోధకులు చెప్పుచున్నారు. క్రీ శ. 600 ప్రాంతమునాటి రేనాటి చోళుల శాసనములలో పుణ్య కుమారుని మాలెపాడు శాసనమున ద్విపదగతి రగడ గలదని శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారు వ్రాసిరి. అటులే, వెంకియ్య చోళుని దొంగలసాని కనుమ శాసనమున మహాక్కర గలదని ముట్లూరి వెంకటరామయ్యగారు వ్రాసిరి.

15 రగడలను పరిశీలించినచో నివి కొంతవరకు స్పష్టపడును మొదటిదగు హయ ప్రచార రగడలో పాదమునకు త్రిమాత్రా గణములు నాల్గుండగా, దీని రెట్టింపు వలన 'తురగవల్గన' ఏర్పడుచున్నది.

లును, ద్విపదలగు ప్రబంధములును, త్రిపదాది సంయుక్తములై, సంపూర్ణ గాన యోగ్యములగు యక్షగానములును, సలక్షణ చతుష్పాద వృత్త కవితా సమన్వితములగు భారతాది గ్రంధములును వాఙ్మయ వీథిని ప్రథమ, ద్వితీయ, తృతీయ చతుర్థ ఘట్టములు"[16]

"తలకాని తలంబ్రాలు దంపెటి చోట

దరుణులచే సొంపు దనరు దర్వోజ"—8- 50

అని విన్నకోట పెద్దన్న కావ్యాలంకార చూడామణిలో తర్వోజను స్త్రీలుల్లాసము కొరకు పాడుకొను దంపుళ్ళ పాటగా చెప్పినాడు స్త్రీలు పాడుకొను అనేక పాటలలో ద్విపదయొక్క విభిన్న రూపములే కాననగుచున్నవి దీనిని బట్టియు దీని రూపాంతరమగు తర్వోజ ప్రాచీన శాసనములందుండుటయు, ద్విపద ప్రాచీన కాలమందధిక ప్రచారము కలదిగా, తెలియుచున్నది దీని ప్రాచీనత యెంతటిదో నిశ్చయముగా జెప్పలేకపోయినను జానపదులందు దీని జన్మ కలిగిన దనుట మాత్రము నిశ్చయము "అనియత కర్తృత్వము, అజ్ఞాత కర్తృత్వము, అనియమవంతయు, నయినయిది పండితులచే సంస్కరింపబడి సాహిత్య ప్రపంచమునకు తీసికొని రాబడి యుండును[17] తరువోజ యను పదము ధృవాపదమునుండి నిష్పన్నమైనది ధ్రువపద, తరుపద తరువోజ, అని దీని రూపాంతరములు కొఱవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికలో ధ్రువాపద ప్రబంధములను చెప్పినాడు నన్నయభట్టు తరువోజయనియే వాడుటవలన నప్పటికే అది తరువోజ యను రూపము నొందినట్లు భావింప వచ్చును ప్రాచీన కవులు తరువోజను వాడిరి గాని, తరువాతి కవులెవ్వరును వాడలేదు. ఇందు మూడు, అయిదు, ఏడు గణములకు యతి యుండును అద్దంకి శాసనములోని తరువోజ యీ లక్షణముల నన్నిటిని గల్గియున్నది. అందు మూడవ పాదమునందలి అయిదవ గణము "గొరల్చియ" అను పదముగు చున్నది. ఇది "జల" మగుచున్నది కాని 'జల' మింద్ర గణములలో చేరదు కాబట్టి భంగ మేర్పడి లక్షణ వైరుధ్యమేర్పడుచున్నది కాని 'ల్చ' అనుదానిని

16. ఉదాహరణ వాఙ్మయ చరిత్ర, పు. 8.

17 శాసన తెలుగు దేశ సాహిత్యము

తేల్చి పల్కినచో హ్రస్వమయి గణము నలమగును అపుడది యింద్రగణము లలో చేరి లక్షణమునకు సరిపోవును ఆ కాలమున నిట్లు 'ల' ను తేల్చి పల్కు నాచారముండినట్లున్నది ఈ సంప్రదాయము కన్నడమున నక్కడక్కడ గలదు [18] యుద్ధ మల్లుని బెజవాడ శాసనము నందలి ఒక మధ్యాక్కరలో నొకయెడ 'గొరగల్గా' కనుదోట కూడ నిటులే యున్నది. 'ల్గా' ను దేల్చి పల్కినచో "నల" మగును తేల్చి పల్కకపోయినచో నది సంయుక్తాక్షరమై గణము సగమగును. కాని సగ మింద్రగణము కాజాలదు లేకపోయిన నా కాలమున జల, సగములు కూడ నింద్రగణములుగా పరిగణించెడి వారని భావింపవలెను కాని కన్నడమున నిట్టి సంప్రదాయమున్నటుల తెలియుటచే వానిని తేల్చి పల్కు నాచారముండెడిననియు, గణ భంగ దోష మేర్పడ లేదనియు, భావింపవలెను.

తెలుగునందలి రెండవ పద్యమయ శాసనము కందుకూరు శిలాశాసనము ఇది కందుకూరునందు లభించుటచే దీనికి పేరు వచ్చినది _ ఇదికూడ గుణగ విజయాదిత్యుని నాటిదే ఇందు సీస పద్యము గలదు సీస పాదములే కాని గీత పాదములు గుర్తింప వీలు లేకున్నవి ఈ సీస పాదమును పరిశోధకులు రకరకములుగ పఠించిరి.[19] ఇందలి సీస పద్యము పూర్తిగ లేక చాల పదములు ఖిలమయిపోయినవి ఇది సీసపద్యమని మొట్టమొదట కనిపెట్టినవారు శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు ఈ శాసనమందును పండరంగడే వర్ణింప బడినాడు. ఇందలి విశేషములు, సంస్కృత సమాస ఘటితములై రచనా సౌష్ఠవమునకు తార్కాణము లగుచున్నది. ఇందు కేవల యతి మాత్రమేగాక ప్రాస యతి కూడ నుపయోగింపబడినది

శ్రీ నిరవద్యుండు చిత్తజాతి సముండు
శివపద పర రాజ్య సేవితుండు.

అను ప్రథమ పాదమున కేవల యతియు,

"బలుడు నన్నృత రిపు బలుడు నాహవరావ
దండ మోద్య నిఘాసనుండ గణిత.

---

18. శాసన పద్యమంజరి—పీఠిక పు. VIII

అను ద్వితీయ పాదమున ప్రాస యతియు గలదు ఇట్లే మరల తృతీయ పాదమున ప్రాస యతియు, చతుర్థ పాదమున కేవల యతియు, నుపయోగింపబడినవి ఇందలి తేటగీతి సరిగ తెలియుట లేదు కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు చూపిన పాఠమున మొదలు చివర నిట్లుగలవు

గీ తని పతు పాతి ... ...
... ... ... ...
... .
. స్పష్ట విభవ గౌరవేంద్ర"

దీని యారంభము ఆటవెలదికి గాని, తేటగీతికి గాని చెందదు చివరి పాదములోని గణములు, రెంటికిని సరిపోవును నన్నయకు పూర్వము సీసముల చివర ఆటవెలదులను మాత్రమే వాడెడివారని శ్రీ నిడదవోలు వెంకటరావుగారు దెల్పిరి[20] ఈ శాసన పద్యములు శాసన పద్యమంజరియందుదాహృతము కాలేదు

సీస పద్యముకూడ ద్విపద నించుక మార్పు చేయుట వలననే ఏర్పడినది. ద్విపదయందలి మూడింద్ర గణములను, రెండు సూర్యగణములను ఒక్కచోట చేర్చినచో సీసపద్య పాదమగును సీసమునకు ప్రతి పద్య పాదమునను, ఆరింద్రగణములు, రెండు సూర్య గణములుండును ద్విపద గణముల క్రమమును కొంచెము మార్పుచేసి, ఒక పాదముగ్గా గూర్చి అటువంటి నాల్గు పాదములను ఒకచోట చేర్చుట వలన సీస పద్యమగుచున్నది కానియిందు ద్విపదలోవలె ప్రాస నియమములేదు ద్విపద తరువోజగా రూపొందిన తరువాతనే సీస పద్యముగా పరిణమించి యుండును.[21] తరువోజ యందారింద్ర గణముల మధ్య

---

20 తెనుగు కవుల చరిత్ర, పు. 126.

21. తెలుగు ఛందో వికాసము, పు. 84

నొక సూర్యగణమున్నది. ఈ సూర్యగణము తనకు ముందు వెనకల నున్న నింద్రగణములకంటె భిన్నమైనది పాదమధ్యమువ నున్న ఈ భిన్నగణము పాదాంతమున గూర్పబడుటవలన, సీసపద్య మేర్పడినది ఇదికూడ తరువోజ వలె రెండు ద్విపద పాదముల వలన నేర్పడినదగుట వలన నిందుగూడ వానిలో వలె యతిస్థానములు పెరిగినవి కాని తరువోజలో ఒకే ఒక యత్యక్షర ముప యోగింపబడును సీసమునకూడ మొదటి దశలో నిటులేయుండి యుండ వచ్చును కాని నేఁటట్టి నియమమేమియులేదు తరువోజలో వలె సీసమున ద్విపద పాదములు యథాతథముగ లేకపోవుటవలనను, పాదము రెండు భాగము లుగ విడివడుట వలనను రెంటి యందిట్టి భేద మేర్పడి యుండవచ్చును తరు వోజలో నాల్గవ గణము సూర్యగణము, ఏడవ గణమింద్రగణము సీసములో నాల్గవ గణమింద్ర గణము, ఏడవ గణము సూర్యగణము రెండిటిని మొత్త మెన్మిది గణములు మొత్తమారింద్రగణములు, రెండు సూర్యగణము లుండును ఇంచుక మార్పుచేసిన తరువోజ సీసమగును

క్రీ శ. 849 నాటిదైన చాళుక్య భీముని ధర్మవర శాసనమున[22] గూడ సీసమున్నది ఇది స్పష్టముగ నున్నది దీనియందుగూడ పండరంగని విజయ యాత్రయే వర్ణింపబడినది దీని యందలి సీసపద్యము చివర ఆటవెలది గలదు కందుకూరి శాసనమున తేటగీతి యున్నదని యంగీకరించినచో 9 వ శతాబ్దము నాటికి ఆటవెలది తేటగీతలు రెండును ప్రచారమందుండినట్లు చెప్పకొనవచ్చును లేదా తెలుగు కవుల చరిత్రకారులు చెప్పినట్లు ఆటవెలది మాత్రమె సీసముల

---

22 ...నరరామ విభుతోడ, నెడతెగ బోయల నడరి జొన్నెలో హాసనం బెక్కి రాపాను నొడచిన వల్లభు కాల్వున నెల్లనెఱుగ కన్నరా భూపతి వెన్నాణిలో జూపెా (చె) సంకిలాండనుజెసి బంకదంచు బై పచ్చిన బెండ్లైన చోడని చేకొని కాచె భూలోక మెఱుగ

ఆ. వె కిరణపురము దీపాల నిరుతంబు దతెవాడు
నచలపురము సొచ్చె నచరితుండు
పల్లభుండు గొణికెనల్లుండు పంచిన
పండరంగుచూరె పండరంగు

చివర వాడెడి వారని యంగీకరించినచో కందుకూరి శాసనమున నున్నది యాట వెలది యని భావింపవలెను, ఈ శాసనమునందలి సీసమున ఆటవెలది యందు గూడ ప్రాసయతి యుపయుక్తమైనది,

క్రీ, శ 837–94 ప్రాంతమునాటి యుద్ధమల్లుని బెజవాడ శాసనమున మధ్యాక్కరలు గలవు ఈ శాసనము బెజవాడ మల్లేశ్వరస్వామి యాలయమున నొక రాతిమీద మూడు ప్రక్కల చెక్కబడినది వీనిలో మొదటి అయిదు పద్యములు పూర్తిగనుండి, ఆఱవ మధ్యాక్కరలో మొదటి పాదమున నాల్గు గణములు తరువాత ఒక్క అక్షరము మాత్రమే యుండి అసంపూర్తిగా వదలి వేయబడినది యుద్ధమల్లుని ప్రశంస యున్నది ఇందలి మధ్యాక్కరలలో తత్సమ పదములు, సంస్కృత సమాసములు కొద్దిగా నుండి, ఎక్కువ పాలు తెలుగు పదములతో గూడి సులభమగు శైలిలో నున్నది ఈ మధ్యాక్కరలు తెలుగునందు మొట్టమొదట రచింపబడిననైనను, వీని గమనము ప్రసన్నముగ నుండి ధారావాహిగా నున్నది

మధ్యాక్కర కూడ ద్విపద నుండి యేర్పడిన దేశి వృత్తము ద్విపదలోని రెండింద్ర గణములును, ఒక్క సూర్యగణమును ఇనుమడించుటచే ఒక మధ్యా క్కర పాద మేర్పడుచున్నది అనగా నిందు ప్రతి పాదమునకు రెండింద్ర గణములు, ఒక సూర్యగణము, మరల రెండింద్రగణములు ఒక సూర్యగణము నుండును ఈ యక్కరలయిదు విధములుగ నుండును అక్కరలు కన్నడ మున గూడ నున్నది, ఇవి కన్నడాంధ్రములకు సమానమైనది. కన్నడమున తెలుగునందుకంటె పూర్వము నుండియే సాహితీ కృషి పొసగుచుండినందువలన ఈ శాసన కాలమునాటికా భాషయం దక్కరల ప్రయోగ మవిరళముగ నున్నది కన్నడమున గూడ నవి యయిదు విధములుగ నున్నవి. ఈ రెండు భాషలలోని అక్కరలకురు సామ్యమధికముగను, భేద మించుకయు గాననగుచున్నది. పేర్లలో కొంత భేదమున్నది తెలుగులో సూర్యగణము లుండుచోట్ల కన్నడ ములో విష్ణుగణము లుండును అనగా నల, నగ, సల భ, ర, త లే కాక, మగణ, సగణ, గురువు కూడా నుండును. అనగా, సగగ, సహ, సలల, భల

భగ, మల, సవ, సహ, రల, రల, నన, రగ, తగ, లేకాక, మగ, నగగ, ములు కూడ నుండును

ఇందు మహాక్కరనుండి అల్పాక్కరవరకును ఒక్కొక్క గణము తగ్గుచు వచ్చినది మధ్యాక్కరలయందు తప్ప తక్కిన యక్కర లన్నిటి యందును చంద్రగణము గలదు. మధ్యాక్కరలలో తప్ప తక్కిన వానిలో మొదట సూర్యగణమున్నది తెలుగున రెండవది మధ్యాక్కర కన్నడమున దీనికి సమానార్థకమైన పేరు, మూడవ యక్కరకు నడువణ యక్కర అని గలదు. గణములను బట్టి చూచినచో మూడవది సరిగ నడుమన నున్నది అందువలన కన్నడ నామము సార్థకమైనదిగ తోచుచున్నది సరిగా మధ్యకు విరుగునది, అనగా మూడు గణములపైని యతి యుండుటవలన మధ్యాక్కర యని పేరు వచ్చినదని చెప్పుకొనవచ్చును కాని పూర్వకాలమున అనగా శాసన కాలమునందును, నన్నయ కాలమునను, అయిదవ గణాద్యక్షరమే యతిస్థాన ముగ నుండెను. నన్నయ యట్లే యతిని వేసినాడు కాని కవిజనాశ్రయమున నాల్గవ గణాద్యక్షరమే యతి స్థానమని చెప్పబడినది ఎఱ్ఱాప్రెగడ ఆరణ్య పర్వ శేషమున నాల్గవ గణాద్యక్షరమునే యతిగా నిల్పినాడు అతడు కవిజనా శ్రయ మతము ననుసరించి యుండును ఐదవ గణాద్యక్షరమును యతిగా నిల్పి నపుడు మధ్యకు విరుగుట లేకపోయినను, అపుడు కూడ మధ్యాక్కర యను పేరే యుండినది మధుర, అంతర అల్పాక్కరలు మహాక్కరలో నంతర్భూతము లగును. కాని మధ్యాక్కర మట్టుకు గాదు అట్టి వానిమధ్య నిది యుండుటవలన దీనికి మధ్యాక్కర యని పేరు గల్గినదని చెప్పవచ్చును కన్నడమున దీనికి దారె యక్కరయని పేరు

క్రీ. శ. 1075 నాటి (నన్నయ కాలమున) దీక్షాసి శాసనమని సీస మాలికలు గలవు ఇవి నన్నయ సీసమువలె ధారా శుద్ధి కల్గి మనోహరముగ నున్నవి సీసమాలిక చివర ఆటవెలది గలదు

నన్నయకు పూర్వమందున్న యీ పద్యముల శాసనములను పరిశీలిం చుట వలన రెండు విషయములు స్పష్టమయినవి. మొదటి దీ శాసనములందు

దేశి పద్యములే కాని, సంస్కృత వృత్తములు గానరాకుండుట, రెండవది దేశి పద్యములన్నియు నవాదిగా, దేశమున నిల్చిన ద్విపద ఛందస్సు యొక్క వికారములే యగుట కాని ద్విపదను మార్చి వృత్తరూపము నొసగుటతో సంస్కృత పండితుల సంస్కారము గలదనియే చెప్పవలెను వారు దానిని మార్చి సంస్కృత వృత్తమున వలె నాల్గు పాదములను గూర్చి యతి ప్రాసాది నియమముల నేర్పరచిరి

ఇవిగాక, ఇప్పటికి లభించిన క్రీ శ 6 వ శ. నాటి రేనాటి చోళుల తెలుగు వచన శాసనములలో గొన్నిటియందు, రగడ, ద్విపదలున్నటుల పరిశోధకులు దెల్పియున్నారు ఈ 6వ శతాబ్దమునాటి తెలుగు శాసనములలో మొట్టమొదటిది పుణ్య కుమారుని మాలెపాడు శాసనము ఇది రేనాటి భూదానమును తెలుపు వచన శాసనమైనను, దీనిలో రగడ పాదము కూడ మిళితమై యున్నది వచనములోని "రేవణకాలు", "వృద్ధణకాలు", దాతల పేర్లు రగడ కన్వయించుచున్నవి[23]

"ఇళ్ప్రస పన్నస పెన్వారె ఇశెనేనికిన్ ఇందు రెండవ పాదము లేకపోయినను, వాక్య రచన పద్యానుగుణముగ మారియున్నది. రగడ విలక్షణముగానున్నది తాళానుకూలముగ పంచ లఘు గణములు లేవు వడి స్థానము 11 నుండి 14 మాత్రకు మారినది ఎంత మారినను, ద్విరదగతి రగడలో ఇరువది మాత్రలును, 'ఇ–ఇ' వడియు మారలేదు. రెండవ పాదము లేనందున ప్రాస నియమ మెట్టిదో తెలియదు ఈ శాసనమంతయు గేయపద్ధతిని రచింపబడినదని శ్రీ వేకుమళ్ళ కామేశ్వరరావుగారు నిరూపించినారు. క్రీ శ. 6 వ శతాబ్దము నాటికి గేయములు లేనిచో ఇట్టి గద్యలో రగడ పాదము దొర్లియుండదుగదా

---

23 భారతి ఫిబ్రవరి–1954, దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డి
ఇవి రెండును సుప్రసిద్ధ చారిత్రకులు, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ప్రకటించిన క్రమపాదములె. ఇది చోడ మహారాజునాటి దాన చరిత్ర.

2 రెండవది, వెంకయ్య చోడుని దొంగల శాని శాసనము దీనియందు మహాక్కర గలదని విజ్ఞుల యభిప్రాయము

ఇంకను, క్రీ శ 1147 నాటి కేతన ప్రెగడ యొక్క శాసనమునను, క్రీ శ 1148 నాటి కామి దేవి శాసనమునను, క్రీ శ 1150 నాటి వీరచోడుని శాసనమునందును, తరువోజ పద్యములు గలవు [24]

ద్విపద దేశీయ ఛందస్సునుట క పపత్తులు

ద్విపదనుండి జనించిన తరువోజ, సీస, మధ్యాక్కరలు దేశి పద్యము లని యంగీకరించినవే గదా! అదిగాక దేశీయ చందస్సునకును సంస్కృత చందస్సునకును ముఖ్య భేద మొకటి గలదు సంస్కృత వృత్తము లక్షర గణాన్వితములు

సంస్కృతమున గూడ మాత్రాగణములున్నవి గాని వానికిని తెలుగు మాత్రాగణములకును యత్కించిద్భేదము గలదు సంస్కృతమున మాత్రా గణములకు సమమగు మాత్రలుండును కాని తెనుగున నిట్లు గాదు ఈ భాషలో మాత్రాగణములు రెండు, మూడు, నాల్గు గురువులను ప్రస్తరించి లఘువు ముందర మరొక లఘువును చేర్చుట వలన నేర్పడినట్టివి

కం ద్వి త్రి చతుర్గురు భవములు,
ధాత్రీధర! రెండు యడమదక్కిన గణముల్
మత్రేంద్ర చంద్రులన జను,
మాత్రాది గణంబు మొదల మాత్రలిడంగన్

—అనంతుని చందో దర్పణము, 1-10

24 ద హిం. శాసన సంపుటి, 6-643
ద హిం శాసన సంపుటి, 6-947
ద హిం. శాసన సంపుటి, 6-791

కావున నీ గణము లన్నిటియందును సమానమగు మాత్రలుండవు రెండు గురువులను ప్రస్తరించగా నేర్పడిన గణములకు సూర్యగణము లనియును, మూడు గురువులను ప్రస్తరించగా నేర్పడిన వాని కింద్రగణములనియు, నాల్గు గురువుల ప్రస్తారమున నేర్పడిన వానికి చంద్రగణము లనియు పేర్లు ఒక్కొక్క విభాగమున నేర్పడిన నీ గణములలో మొదటి రెండు గణములును తెలుగున విడువబడినది మన భాషయందు మాత్రమే గాక, తక్కిన ద్రావిడ భాషలలోను గణ ప్రస్తార పద్ధతి యిటులే యున్నది

కన్నడమున రెండు గురువుల ప్రస్తారమున నేర్పడిన దానికి బ్రహ్మ గణములనియును, మూడు గురువుల వలన నేర్పడిన వానికి విష్ణు గణములని యును, నాల్గు గురువుల వలన నేర్పడిన వానికి విష్ణు గణములనియును, నాల్గు గురువుల వలన నేర్పడిన వానికి రుద్రగణములనియును పేర్లు. కాని కన్నడ మున తెలుగున వలె నీ గురువులను ప్రస్తరించగా నేర్పడిన గణములలో మొదటి రెండును విడువబడలేదు కన్నడముననూ, తమిళముననుకూడ విషమ మాత్రాగణములే తమిళమున గురు, లఘువులకు బదులుగా 'నేర్, నిరై' అను యక్షరము లున్నవి నేర్ అనునది ఒక లఘువైనను కావచ్చును. లేక ఒక గురువైనను కావచ్చును. లఘువుపై హల్లు లేక అర్ధమాత్ర, గురువుపై నొక హల్లు నిల్చినను, 'నేర్' అగును కావున నేర్ అనునది నాల్గు రకములుగా నుండి, గురు, లఘువులను దనలో నిముడ్చుకొనుచున్నది ఈ నాల్గు రకములైన "నేర్" అనుదానికి ముందొక లఘువును చేర్చినచో "నిరై" యగును కాబట్టి 'నేర్' నాల్గు రకములైనట్లే "నిరై" కూడా నాల్గు రకములగు ననుమాట. తెలుగు కన్నడములలో రెండు, మూడు, నాల్గు గురువులను ప్రస్తారము చేసినట్లు గనే, ఆ భాషలో రెండు పేర్లను గాని, ఒక "నేర్"ను గాని, ఒక 'నిరై' ను గాని, రెండు "నిరై" లను గాని, ఒక నేర్‌ను గాని చేర్చుటచే రెండు శీర్ష గణ ములు (రెండక్షరములు) ఏర్పడును ఇందొక నేర్ అనునది కూడ ఒక గణ మగును. ఈ భాషయందేకాక్షర గణములకు "ఒకశైచ్చీర్" అనియును, రెండ క్షర గణములకు, 'ఉరిచ్చీర్' లేక 'అశిరియ ఉరిచ్చీర్" అనియు పేర్లు

కాబట్టి "గురులఘు స్వరూపమగు" ఛందోక్షరముల విషయముననే కాక, తత్ప్రస్తారము, గణ వర్గీకరణము, విషయములలో గూడ సంస్కృత ఛందో

రీతికిని, దక్షిణదేశ భాషలలోని ఛందో రీతికిని, భేద మగపడుచుండుటచే, నీ రెండును మూలభిన్నము లనియు, నిటీవలి కాలమున వీనికి లక్షణ మేర్పఱచిన సంస్కృత పండితులా దేశీయ చ్ఛందో మార్గములను, సంస్కృత చ్ఛందో రీతుల కనుగుణముగ సంస్కరించి, లక్షణ మేర్పరుచుటచే నిట్లేర్పడెననియు తలంపవలసియున్నది. ఈ దక్షిణ దేశీయ రచనా రీతులే ప్రాకృత్యములో గూడ గ్రహింపబడినపుడీ దక్షిణ దేశీయ మాత్రాగణ పద్ధతిని వాని కన్వయింపజాలక కేవల మాత్రా సంఖ్యా పద్ధతినే యవలంబించి, ఇన్ని మాత్రలో లేక, ఇన్ని గురువులో లఘువులో నుండవలెననియు, సామాన్య నియమబద్ధముగాని, యేర్పాట్లతో లక్షణము చేసిరి. ఈ ప్రాకృత ఛందస్సులోని మాత్రా నియమము గలిగిన "జాతులు" అనువర్గములో జేరిన పద్యములలో ననేకములు దేశీయ ములే కానవచ్చుటకు సందేహము లేదు కాని వైదిక చ్ఛందస్సులో మాత్రా సంఖ్యా బద్ధము అగు పద్యములు లేవా యను ప్రశ్న వెంటనే బయలుదేరక మానదు కాని యవియు మాత్రా సంఖ్యాబద్ధములు గావచ్చునుగాని, దక్షిణ దేశీయచ్ఛందో రీతులను బోలినవైన మాత్రాగణ బద్ధములు మాత్రము కాజాలవు ఈ దేశీయ గురు లఘు సంకేతమునకును, గణ నియమ పద్ధతికిని, సంస్కృత ప్రాకృతములందలి దానికిని గల యీ భేదమును బట్టియు సంస్కృత ప్రాకృతములలోను, తెలుగు కన్నడములలోను గల కొన్ని ఛందో రచనల నామములందు గల సామ్యమును బట్టియు, మాత్రాగణ నియమ బద్ధము లగు నీ దేశీయ రచనలు, కొన్ని అతి ప్రాచీన కాలముననే సంస్కృత ప్రాకృతములలోని కెక్కిన దనియు, దానికి లక్షణము నేర్పరచునపుడీ దక్షిణ దేశీయమగు మాత్రాగణ నియమ పద్ధతి నవలంబించని సంస్కృత ప్రాకృత లాక్షణికులు కేవల మాత్రా సంఖ్యా నియమ పద్ధతిని లక్షణ మేర్పరచి, యెట్లో తమకంతకు, బూర్వము పరిచితమగు గురు లఘు పద్ధతితో సమన్వయము చేయ దలపడిరనియు నిశ్చయింపవలసి యున్నది [26] ఇందువలన నీ ద్విపద దేశీయ చ్ఛందస్సే కాని సంస్కృత ప్రాకృత భవము గాదని తెలియుచున్నది

---

26 దక్షిణదేశ భాషా సారస్వతములు-దేశి, కోరాడ రామకృష్ణయ్య, పు, 20 -204.

(2) తెలుగు ద్విపదకు సమానమైన ఛందో రచన లితర ద్రావిడ భాషలలో గానవచ్చుచున్నవి. ద్విపద మళయాళమునందలి "కళ్యాణి"తో సరి పోవుచున్నది

"మల్లెపు రప్పెట్టు పిన్నాలె సీత
కల్యాణి నీదేవి శ్రీరామ రామ

తెనుగున ద్విపద కధిక ప్రచారము గలిగినట్లే కన్నడమున త్రిపద కధిక ప్రచారమున్నది. ద్విపద యొక్క మొదటి పాదమునందలి సూర్యగణ మింద్రగణముగా మారి, తరువాతి రెండు పాదములలో నొక్కొక్క యింద్ర గణము తగ్గుట వలన త్రిపద యేర్పడుచున్నది

| | | | | |
|---|---|---|---|---|
| ఇం | ఇం | ఇం | ఇం | |
| | ఇం | ఇం | సూ | త్రిపద |
| | ఇం | ఇం | సూ | |

ద్విపదయందు నాల్గు మాత్రల గణములను మూడింటిని, ఒకమూడు మాత్రల గణములను ఉపయోగించుట వలన, చౌపద యేర్పడుడు. ఇదేప్రకారము పంచ మాత్రల గణములనే యుపయోగించినచో కర్ణాట చతుష్పద యేర్పడును. అందు మూడయిదు మాత్రల గణములు ఒక మూడు మాత్రల గణము ఉండును చౌపదగా మారిన ద్విపదయందు చివరి గణములలో ఒక మాత్ర నెక్కుడుచేసి -అనగా సూర్యగణమునకు ఒక మాత్రను చేర్చి చతుర్మాత్రా గణము చేసినచో మధురగతి రగడ అగుచున్నది దక్షిణదేశీయ భాషలలోని దేశీయ రచనలు చాలమట్టుకు 3, 4, 5 మాత్రల గణములతో నిర్మితమైనట్లు కాన్పించుచున్నది ద్విపద భేదము వలన మధురగతి రగడ యేర్పడినట్లు తక్కిన గణముల సంయోగము వలన, నితర రగడ లనేకము లేర్పడు చున్నవి. "తాతం భట్టు 'చింతామణి యను లక్షణ గ్రంధమున[27] "లక్ష్మీ కల్యాణము నందలి రేకలు" అని "నీరజోదరురాణి నీలవేణికిని" అని ద్విపద పాదముదాహరింపబడినది ఆ లక్ష్మీకల్యాణ మొక యక్షగాన గ్రంధము గావచ్చును కాని యందలి రేకు లనునవి ద్విపద పాదములవలె నుండుట యిట గమనించదగినది 'ఆయాయి

27. తంజావూరు సరస్వతీ మహలు క్యేటలాగు, నెం. 779 – (ఆంధ్ర) యక్షగాన వాఙ్మయ చరిత్ర పు 260-261).

రగడ భేదము రేకులు పెక్కులమరు'నని యన్నాడుగదా లక్షణసార సంగ్రహ కర్త (3–102) అనగా నొక్కయెడ ద్విపదకు, రగడకు కూడ బాంధవ్య మేర్పడిన దన్నమాట [28] ఆ బాంధవ్యమును మనము పైని చూచితిమి. ఈ రగడలు తెనుగున మాత్రమే గాక, నితర ద్రావిడ భాషలలోను గానవచ్చుచున్నవి ఇవి దేశీ ఛందస్సునకు చెందినవి. అప్పకవి తెనుగున "వైతాళీయంబు రగడ లనేక విధములుగ నుండు నందు సవిధ రగడలను మాత్రము వివరించెద"నని తొమ్మిది విధములగు రగడలను చెప్పగా, కన్నడమున నాగవర్మ, మందానిల, లలిత, ఉత్సవ, యను మువ్విధములగు రగడలను చెప్పినాడు తెలుగున మధుర గతి రగడవలె కన్నడమున మందానిలము నాల్గు మాత్రల గుణములతో గూడినది

తెనుగు మధురగతి రగడ—

నాలుగు మాత్రలు నాపిన గణములు
నాలుగు రెంటికి సలిపిరమణములు — అప్పకవి

కన్నడ మందానిలము —

శ్రీకరు ణేశా! శుతి రతి దేశా
శ్కో కనిఘర్షాశో భితహ ర్షా

కన్నడ లలిత తెలుగు ద్విపద గతితో సమానముగ నున్నది

ద్విపదగతి రగడ —

కరమొప్ప, పంచ లఘు గణ చతు, ష్టయముచే,
విరమంబు, రెంటిపై, ద్విరదగతి, పేరచే,

కన్నడ లలిత —

అల్లిమా, మరదల్లి, మల్లికా, లత యెల్లి,
యెళె యసుగె, మరదల్లి, జళరుహా, కరదల్లి

---

28 ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర—పు 260—261, అనుబంధము.

ఇది అయిదు మాత్రల నాల్గు గణములతో గూడినది ఈ ద్విరదగతితో మళయాళము నందలి మిశ్రకాకళి సమముగ నున్నది

మళయాళ మిశ్రకాకళి —

జనిమృతి ని,వారణం, జగదుదయ కారణం,
చరణ నత, చారణం, చరితమధు, పూరణం

దీనియందైదు మాత్రల గణములు నాల్గు ఏ క్రమమందైన నుండవచ్చును

కన్నడ ఉత్సవ ఆరు మాత్రలు గల్గిన నాల్గు గణములతో గూడి యుండుట వలన తెలుగున ఆరు మాత్రల నాల్గు గణములు గల్గిన తురగవల్గ రగడతో సమానమైనది

ఉదాహరణములలో ప్రయుక్తములగు కళికోత్కళికలు రగడ భేదములే.

కళిక (1) వెండియు త్రిభువన వినుతి సమేతుడు
మండిత సద్గుణ మహిమోపేతుడు

ఇందు నాల్గు మాత్రల నాల్గు గణములు.

( ) వెండియు భక్తాభివృద్ధి చెందిన వాని
బంధ మాయాచార పథము ద్రుంచిన వాని —

ఇందయిదు మాత్రల నాల్గు గణము లున్నవి.

ఉత్కళిక — "భువనో, పకారా, భవమో, దవీరా,
భక్తి సం,యోగా ము,క్తి సంభోగా"

( ) సంస్కృతమున రగడలు లేవు గాని, కాలక్రమమున నివి సంస్కృతమునను నొకటి రెండు పట్టుల ప్రవేశము గాంచినవి. సోమదేవసూరి (క్రీ.శ. 959) యశస్తిలక చంపువున నొక రగడ (ద్విరదగతి) ఉన్నది ఇందు ప్రతి రెండు పాదములకు అంత్యానుప్రాసము గూడ గలదు రాజరాజు కోరుమిల్లి శాసనమున గూడ 24 పాదములు గల ద్విరదగతి రగడ అంత్యానుప్రాసయుక్తముగ దొర్లిపోయినది. ఇందు ద్వితీయాక్షరప్రాసయు, వర్ణయతియు

నట నట గలవు పాల్కురికి సోమన సంస్కృత బసవోదాహరణమున రగడలు గలవు [29]

(4) ఇంత మాత్రమే గాక, కొన్ని పాటలు గూడ యతిక్రించి ద్విపద ముతో రగడలే యగుచున్నవి.

(1) శ్రీ శంభు తనయునకు
సిద్ధ గణ నాథునకు
వాసిగల దేవతా పండితునకూ — ఇది అయిదు మాత్రల గణములతో నేర్పడినది.

(2) ఓ బొజ్జ గణపయ్య
నీ బంటు నేనయ్య
ఉండ్రాళ్ళ మీదికీ దండు బంపూ — ఇది యును నయిదు మాత్రల గణములతో నేర్పడినదే.

(3) జో జో చిదానంద – జో జో ముకుందా
జో జో కృపాపాంగ – జో సుందరాంగ జో –

ఇది గూడ నయిదు మాత్రల తోడిదే

(5) ఇవి మాత్రమే గాక, నింకను నితర దేశి రగడలగు షట్పదులు, ఓలలు, సువ్వాళులు మున్నగున వన్నియు రగడ భేదములే అందువలన ద్విపద భేదములే శ్రీ యస్వీ జోగారావు గారు, తమ ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్రలో యక్షగానములలో ప్రయుక్త మయిన ద్విపదలను చెప్పిరి

1 సువ్వాల ద్విపద.

సువ్వి సువ్వాల యనునివి దంపుళ్ళ పాటలుగా ప్రసిద్ధములు. అనేక యక్షగానములందు, ప్రయుక్తములు ఇది లక్షణ సారసంగ్రహమున పేర్కొన బడినది. (3–102) అప్పకవీయమున సువ్వాల కొక లక్ష్యము గలదు [30]

---

29. తెలుగు భాషలో ఛందో రీతులు, రా దా శర్మ, పు 184.
30. అప్ప కవీయము. 4–403.

'అక్షక హరి విక చాంబురు హాక్ష
యక్షపసఖనుత యదుకుల దక్షా' సువ్వి సువ్వాలే
సువ్విసువ్వాలే యనున దూత పదము పల్లవి వంటిది.

2. గౌరీ కల్యాణము

ఇది స్త్రీలు పాడు పెండ్లి పాట జక్కన విక్రమార్క చరిత్ర. (4-130 179) అనంతుని భోజరాజీయము (4-87) కాక మాని మూర్తి పాంచాలీ పరిణయము (4-23) మల్లన రాజశేఖర చరిత్రలందు దీని ప్రసక్తి గలదు కొన్ని యక్షగానములందివి ప్రయుక్తమైనవి ద్విపద వికారముగ బాసిల్లును

ఉదా - మాతృ భూతన పారిజాతా పహరణమునుండి–

'శ్రీ రుక్మిణీలోల చిర సుగుణ జాల
కారుణ్య మయశీల కల్యాణ చేత
(గౌరీ కల్యాణమే వైభోగమే)

అప్పకవీయమున 'పెండ్లి పాట' యను పేరఁ బాదాంతమున 'గౌరీ కల్యాణమే వైభవమే' యన్న యూతపదముతో నొక లక్ష్యమున్నది అవి యచ్చముగా పూర్వోక్తమైన సువ్వాల పదమే ఊతపదము మాత్రము మారినది

3 లక్ష్మీ కల్యాణము

ఇది గూడ గౌరీకల్యాణమువంటి యొక పెండ్లి పాట. ఇది వెంకటనాథుని పంచతంత్రమున పేర్కొనబడినది (4–360)[31] ఇదియు నచ్చముగా ద్విపదయే యక్షగానములందు ప్రయుక్తమైనది. ఉదాహరణమునకు హేమాబ్జ నాయికా స్వయంవరమునుండి –

శృంగార మమరంగ చెలువ మన్నారు
చెంగమ్మ పెండ్లికి చెలులార రారె
నిత్యకల్యాణంబు పచ్చతోరణము
హెచ్చైన కదలి రాజంట నే ప్రొద్దు– ఇందూతపదముగానరాదు

---

31 ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర

(6) తేటగీతి, ఆటవెలది కూడ మాత్రాగణములైన సూర్యేంద్ర గణముల కూర్పుచే నేర్పబడుచున్నవి ఆటవెలది మాత్రాఛందస్సులోనిది దేశి నుండి యుత్పన్నమైనది. సీసపద్య పాదమునకు నాటవెలది రెండు పాదములు హెచ్చుతగ్గుగా సమత్వమే గలదు అందు వలన సీసమునకును, ద్విపదకును పొత్తున్నట్లే ఆట వెలది సీసములకు పొసగుచున్నది [32]

సీ॥ గ్రుడ్డిన యితివి నీవు కుంటి దానను నేను
నగిరి కె ట్లు మనము నడప గలము

ఆ వె గ్రుడ్డి నయితి నీవు కుంటిదా నను నేను
నగరి కెట్లు మనము నడవ గలము

ఇటులే సీసమునకును తేట గీతికిని సంబంధము గలదు

సీ॥ చెలియ కం టివె నీవు సిరు లొాలు కు సుమబాల
భాగ్యవం తుండైన భర్త బడయు

తే గీ. చెలియ కంటివె నీవు సిరులొాలు కు సుమ
బాల భాగ్య వం తుండైన భర్త బడయు

ఇదే విధముగ తేటగీతి, ఆటవెలదులకు సంబంధము గలదు

ఆ వె అఖిల సుకవి కృతుల యందున లరుచుండు
తే గీ. అఖిల సుకవికృ తులయందు నలరు చుండు
ఆ వె. విజయ పాండ వులకు వినుముజ యిమగును
తే గీ విజయ పాండవు లకువిను ముజయ మగును

తేటగీతికిని ద్విపదకును పొత్తు గలదు.

తే గీ బాలచంద్రుని బద్ధ భా వంబె చెంగి
బాలచం ద్రునిబద్ధ భావంబె చెంగి

ద్విపద వికారముగ భాసిల్లుచున్న సీసమును భరతుడు దేశి రచనగా పేరొాని మాత్రాచ్ఛందముగ గ్రహించినాడు. దీని నెలదు నాట్యశాస్త్రమున

32. తెలుగు ఛందోరీతులు, గి. వేం సీతాపతి.

పేర్కొనినాడు. దీని లక్షణము నీతడు మాత్రల సంఖ్య తోడను, నక్షరముల సంఖ్యతోడను జెప్పినాడు.[33] దీని కాతడు చెప్పిన లక్షణమును చూచిన తెలుగు సీసమని తెలియుచున్నందున నాతని కాలమునకే యిది ప్రచారమందుండియుండు నని భావింప వీలగుచున్నది.

ద్విపదకును, సీసమునకును నొక్క భేదము కానబడుచున్నది ద్విపదలో ప్రాస యుండగా, సీసమున ప్రాసనియమములేదు తెలుగున కొన్ని పద్యములకు ప్రాస యుండి, కొన్నిటికి లేకపోవుట వలన తెలుగు పద్యములలో జాత్యుపజాతి భేదమేర్పడినది సీసము వలెనే తెటగీతికి కూడ ప్రాస నియమము లేదు ఈ రెంటికి లాక్షణికులు ఉపజాతులలో చేర్చినారు

"జాతులు కందాదిక ముప
జాతులు గీతాదికములు సరసిజ నయనా"[34]

ఈ యుపజాతులలో యతి మాత్రమే యుండును గాని ప్రాస యుండదు కాని ప్రాస యతిని వేయవచ్చును ఈ యుపజాతుల మూలముననే తెలుగు భాష కన్నడము కంటెను, ప్రాచీన దక్షిణదేశీయ చ్ఛంద స్సంప్రదాయము నెక్కుడుగా నిల్పుకొన్నట్లు దోచును సీస గీతములకు ప్రాస లేకపోవుట ఆ సంప్రదాయము నిల్పుకొనుటయే. వీనిలో దేశీయగణములగు సూర్యేంద్ర గణము లిష్టము వచ్చినట్లు రావచ్చును ఆరింద్రగణములు, రెండు సూర్యగణములు ననగా, ప్రతి పాదమునకును నింద్రగణములలో లఘువుతో ప్రారంభమగున వైనను రావచ్చును ప్రాస యున్న ద్విపదాదుల కిట్లు వీలులేదు వానిలో మొదటి పాదమున మొదటి గణము గుర్వాది యైనచో లఘ్వాదిగను నుండ వలెను

"గురు లఘువులలో నెయ్యది
సంహార ప్రథమ పాద ముఖమున నిలిచెన్,
ధర నుప జాతులు చక్కగ
బరగ నిలుచు నవియె నాల్గు పదముల మొదలన్"

---

33. దక్షిణ దేశ భాషలు — దేశి, కోరాడ రామకృష్ణయ్య
34 అప్పకవీయము, 4—263.

"ధరణిన్ జాతుల కాదివర్ణ మొకడే తప్పంగ రాదెల్లెడన్
హరి తజ్జాతి గణంబులైన నది యిట్టట్టైన గావచ్చు మం
దర ధారీ! యుపజాతులం బ్రథమవర్ణంబున్ యదేచ్ఛంబుగా
సొరిదిం జెప్పగ వచ్చు బ్రాసములు నిల్పున్వాళ్ళకై యొక్కచోన్ "[35]

కన్నడమునం దిట్టి నియమము లేదు ప్రాచీన ద్రావిడ భాషా నియమమును నిల్పుకొన్న తమిళమున గూడ కొన్ని పద్యములకు ప్రాస నియమము లేదు వెన్బా పద్యములలో ప్రాసనియమ మున్నదిగాని 'అగవల్పా' పద్యములలో లెదు పాదమునకు నాల్గు చొప్పున సూర్యేంద్రగణములు గలిగిన తెలుగు రచనము పాదమున నాల్గు శీర్లు గల తమిళ అగవల్పా వంటివి

దక్షిణదేశ భాష లొకే మూల,బీజమునుండి ఏర్పడినవని యెట్లు భావింపుచున్నామో అట్లే తద్భాషా సాహిత్య ఛందోరీతులు కూడ ఒకే మూల బీజము నుండి ఏర్పడినట్లు స్పష్టమగుచున్నది తెలుగునందలి ద్విపద అనేక ఛందస్సులకు మూలమగుటయే గాక, గణ ప్రస్తార పద్ధతి యందును, స్వరూపమునందును ఇతర ద్రావిడ భాషలయందలి రచనలతో పోలియుండుటవలన నిది యీ దేశభాషలకు సంబంధించిన దేశి సాంప్రదాయిక ఛందస్సే యని తెలియుచున్నది

సంస్కృతమున లేని యతి ద్విపద కుండుట, తెలుగు పద్యమునకు సంస్కృత కన్నడములందు లేని యతి యుండుట ఈ భాషకు గల విశిష్టత సంస్కృతమున గూడ యతి యున్నదిగాని, అది విచ్ఛేద రూపకమగు యతి 'యతి ర్విచ్ఛేదక సంజ్ఞకః' అని అందు చెప్పబడినది సంస్కృతమున పద విచ్ఛేదము లయ నాశ్రయించుకొని యుండును లయానుగుణముగ పదము ముగిసినపుడు చెవి కింపుగ నుండును లయ యన్నది ఛందస్సునకు సహజమైనది కవి కల్పనలలో యతి యుద్వేగమును కల్పింపక మధురముగా పద్యమును చదువుట కుపయోగపడుచున్నదని చెప్పబడినది [36] శ్రుతి శుభగత్వము

35 అప్పకవీయము, 4–448, 449

36. 'ఏవం యథా యథోద్వేగః సుధియాం నోప జాయతే
తథా తథామధురతా నిమిత్తం యతి రిష్యతే॥

నకు యతి యవసరమని "అనుక్త యతిః కర్తవ్యం కార్యా శ్రుతి సుఖాయతః" అని కూడ చెప్పబడినది కావున సంస్కృతమున యతి విరామ రూపముగనే వాడబడుచున్నది కాని యిది తెలుగున నట్లుగాదు తెలుగు యతి యతిచమత్కారమై మనోహరముగ నున్నది ఇది తుల్యాక్షర రూపమైనది కన్నడ కవులు సంస్కృత విచ్ఛేద యతిని గూడ నుల్లంఘించినారు కాని తెలుగువారు అతిసుందరమైన ఈ సావర్ణ్య రూపమగు యతిని ప్రవేశపెట్టిరి ఈ తుల్యాక్షర యతి గూడ దక్షిణదేశ భాషలకు సహజసిద్ధమైనట్లు తెలియుచున్నది. ఈ యతి దృష్ట్యా తెలుగు 'తమిళ'ములకు సన్నిహిత సంబంధమున్నట్లు కాన్పించుచున్నవి యతి ప్రాసలు తమిళమున 'రాడై' యను వానితో సంబంధము గలిగియున్నవి. 'రాడై' యనగా మైత్రియని యర్థము. అనగా నిది యక్షర మైత్రి ఇందలి 'మోనై త్తొడై' అనునది యతిగానున్నది. ఇవి ఒక్కొక్కటి ఎనిమిది విధములుగ నున్నవి. అడిమునై, ఇణైమోనై, పొఱిప్పుమోనై, ఒరూ ఉమోనై, కూళైమోనై, మేల్ కమవాయ్ మోనై, కేల్ కమవాయ్ మోనై, ముఱ్ఱుమోనై. ఇందలి పొఱిప్పు మోనై యనునదొక పద్యములోపథమ గణాద్యక్షరముతో యతి వేయుట ఇందు రెండు నాల్గవ గణముల తొలి యక్షరములకు కూడ యతి వేయవచ్చును. ఇది పాదమునకు నాల్గు గణములను గల్గియున్న పద్యములను గూర్చి చెప్పినట్లుగ నున్నది దీనికి మన ద్విపద ఉదాహరణముకాగలదు

ఉదా ద్వి- సురపతి త్రయంబు సూర్యుడొక్కండు
విరమంబు రెంటిపై వెలయు నొక్కండు

ఒరూ ఉమోనైకి మొదటి నాల్గవ గణాద్యక్షరమునకు యతియుండును దీనికి తెలుగునందలి ఆటవెలది, తేటగీతలు, ఉదాహరణముగా నిల్చును. ఈ రెండిటికిని తప్ప తమిళమునందలి తక్కిన భేదములకు తెలుగు శిష్టవాఙ్మయమున ఉదాహరణములు లేవు. తమిళ భాషలో నీ మైత్రి తప్పక యుండవలెనను నియమము లేదు. అది యైచ్ఛికము.

తమిళ భాషలోని 'ఎదుగై త్తొడై' తెలుగునందలి ప్రాసతో సమానముగా నున్నది. ఇదికూడ నందెనిమిది విధములు. కాస మోనైతోడై వలె దీనిలో

గూడ అందలి కొన్ని భేదములకు మాత్రమే మన శిష్ట వాఙ్మయమున నుదాహరణములు లభ్యమగుచున్నది.

1 అడి యెదుగై,

ఇది ప్రాస యన్నమాట. పద్యముయొక్క అన్ని పాదములలోని రెండవయక్షరములు మైత్రి గల్గియుండవలెను తెలుగున ఉపజాతులలో చేరిన సీస, గీతములకు తప్ప తక్కిన వానికన్నిటికిని ఈ లక్షణము చెల్లును అందు కూడ ప్రాసయతి వేసినచో నిదెయున్నటులె భావింపవచ్చును

"శిక్షించె నెవ్వాడు చేటుకై సభలోన
జెడుమాటలాడిన చేది విభుని
రక్షించె నెవ్వాడు ద్రౌణి బాణమ్ముచే
చిదియకుండఁగ బరిక్షిన్నపాలు"

2 పాటిప్పెదుగై

అన్ని పాదములలోని గణములలో నొక దానిని విడిచి, యొకదాని రెండవ యక్షరములు మైత్రి గల్గి యుండుట ప్రాస సీసము దీని కుదాహరణముగా గానవచ్చును

'వేదండవరదుండు వేధోంశగాంగుండు
కాదేన శయనుండు యాదవేంద్రు

3 ఒరూఉచెదుగై

అన్ని పాదములలోను ప్రథమ, చతుర్థ గణములలోను రెండవ యక్షరములు మైత్రి కల్గియుండుట. దీనికి ఉదాహరణము అర్ధచంద్రిక కాగలదు

అర్ధచంద్రిక అక్షర హరి వికచాంబురు హాక్షున్
యక్షపసఖ యుత యదు కుల దక్షున్

ముదై ౹చుగై.

ఇందన్ని పాదములలోని అన్ని గణముల రెండవ యక్షరములు మైత్రి గల్గియుండును దీనికి మధురగతి రగడ యుదాహరణము కాగలదు.

'కరధృత కరుహుని – గిరిహితకరణుని
గరుహాస ఖరుచిని – గరుడఖగధరుని
ఖద ఘన కిరవిని – ఖర తరకరగుని
గరళముఖరిపుని – గరధర కరతుని'

కావున తెలుగున తుల్యాక్షర రూపమున నున్న యతియు ప్రాసయు, దక్షిణ దేశ భాషలలొ మధ్యకాలమున నెరువు తెచ్చుకొనినవిగాక, క్రీస్తు శకారంభము నాటికే తమిళ వాఙ్మయమున నిల్చియున్న ప్రాచీన కవితా సంప్రదాయ సిద్ధమైన 'తొడై' యనుదానితో సంబంధము గల్గియున్నట్లు తెలియుచున్నది. పాల్కురికి సోమనాథుని ఈ క్రింది ద్విపదము నీ యభిప్రాయమునకు పుష్టిని చేకూర్చుచున్నది

"దేశిగా వచియింతు ద్విపదకు వళ్ల
బ్రాసంబులును బొందుపడగ దావేయు "

ప్రావళ్ల చేర్చుటచే దేశిగా వచియించగలనని బాస చేసినను అటులే వేరొక చోట–

''ప్రాసయైనను యతిపై వడియైన
దేసిగా నిలిపి యాదిప్రాస నియతి, పం చ.

అందును తెలుగున నీ యతిప్రాసలు స్వతస్సిద్ధములైనట్లును, నివి తెలుగు వాఙ్మయ సీమంతినీకంఠము నలంకరించు మంగళ సూత్రముల వంటివనియును కొఱవి గోపరాజు సింహాసన ద్వాత్రింశతియందు జెప్పినాడు విక్రమార్కుని దివ్యపీఠము నెక్కబోవు భోజునకు బాంచాలి చెప్పిన కథలో పురోహితుని కుమారుడు దేశములు తిరిగి వచ్చి, తాను చూచిన విశేషములను తెల్పినాడు.

క గణములు గణవర్ణంబులు
గణతారలు గణరసములు గణదేవతులున్
గణజాతులు గణ ఫలములు
గణుతింపగ నొక్క విధమ కవితల కెల్లన్"

వ ఇట్టి విధంబయ్యును నంధ్రమండలంబునం గోణ దేశమునం దెలుగుం గవితకు బ్రాలు వళ్లనను నియమంబులు చూచినాడ నని యియ్యెడం దఱచు గాకుంట నపూర్వం బవధరింపుము

శా పుణ్యస్త్రీకి గుణంబు మంగళ గుణంబు న్పొమ్ములై యొప్పగా
బుణ్యస్త్రీకి సువర్ణ మౌక్తిక సురూప వ్యక్తి భూషాకృతుల్
గణ్యంబౌగతి సంస్కృతంబునకు వాగర్థంబు శబ్దంబు లా
వణ్యాకారములౌ దెనుంగునకు బ్రాల్వళ్ళుం గడున న్నియల్

గీ పలు తెఱంగులైన పలుకులు గలిగియు
బ్రాలువళ్లు లేసి మేలు గవిత
వన్నెలెల్ల గూర్చి వ్రాయుచో గాటుక
వన్నెలేసి ప్రతిమ వ్రాతబోలు

క తప్పక వళ్లను బ్రాలును
ముప్పిరి గొన దగిన శబ్దములు మెఱుగెక్కం
జెప్పిన కవితా చాతురి
యొప్పము వెట్టిన పసిండి యొఱపున మెఱయున్[37]

యతికి రూపాంతరము వడి లేక వళి. 'ఆద్యోవళిః ద్వితీయోవర్ణః ప్రాసః' యని యాంధ్ర శబ్ద చింతామణిలో వళిగా పేర్కొనబడినది కవిజనాశ్రయమున 'చరణాద్యక్షరమే వడి—"అని వడిగా పేర్కొనబడినది. కావ్యాలంకార చూడామణి, ఛందోదర్పణము, లక్షణ సార సంగ్రహములందు 'వడి' యనియే గలదు వడిని గూర్చి శ్రీ గిడుగు సీతాపతి గారిట్లు చెప్పిరి 'వడి అంటే

37. సింహాసన ద్వాత్రింశతి—ప్రథమ భాగము, ఆశ్వా 4-ప 188—193.

మార్గమని అర్థము. పద్యపాదము విశ్రాంతి ననుసరించి రెండు భాగములు కాగా, ఆ భాగముల మొదటి అక్షరములు పాద భాగములకు మార్గములు చూపినట్లుండుటచేతను, మొదటి భాగముయొక్క ప్రథమాక్షరముతో (పాదాద్యక్షరముతో) రెండవభాగము మొదటి యక్షరము మైత్రి గలదిగా, ఉండవలెనన్న విషయము ఆచారమై ఉన్నది కనుకను వడి (వళి) అని మీద చూపించిన స్థలములలో లాక్షణికులు ప్రయోగించి యుందురు [38]

తెలుగు ఛందో వికాసమున దీనినిగూర్చి యీ విధముగ నున్నది. 'వడి యనగా వేగమని యర్థము గలదు పాదమందలి పూర్వోత్తరార్ధములు విరామము ననుసరించి, విడిపోయినపుడు ప్రథమార్ధము నుండి ద్వితీయార్థమునకు విడుపడుతనము కలుగకుండునట్లుగా వేగము సాధించుటకు గాను, తిరిగి ప్రథమాద్యక్షరమునే ఉపయోగించుట జరిగినది వడి (వేగము) సాధించుటకు తిరిగి ఉపయోగింపబడదు వేగము సూచించుచున్నది కావున పాద ప్రథమాక్షరమునకు వడి యని పేరు గలిగినదని భావింపవచ్చును శడల కభేదమున్న దృష్టితో వళి యన్న పేరు కూడ వాడుకలోనికి వచ్చినది [39] ఇరువురు చెప్పిన యర్థముల లోన నెక్కుడు వ్యత్యాసము కానవచ్చుటలేదు విరామము కల్గినపుడు పద్య గమనము కుంటుపడక సాగిపోవలె ననుటయే యర్థము

వళి యనగా మడత యని యర్థము పద్యము రెండు ముక్కలయి మడత వేసినట్లు సుందరముగ రూపొందునని గూడ ననుకొనవచ్చునేమొ

వళి (వళీ) అనగా అరవమున మార్గమని అర్థము. ఈ యతి కేవలము తుల్యాక్షరములకే గాక, అక్షరముల ఉత్పత్తి స్థానమును బట్టి 'అకుహ విసర్జనీయానాం కంఠః' మొదలుగా చెప్పబడిన అక్షరములకు పరస్పరము మైత్రిచెల్లినది. ఒకే స్థానమున పుట్టిన యక్షరము లన్నిటికిని ఒకదానితో మరియొకదానికి యతి వేయుటవలన యతులలో ననేక భేదము లేర్పడినవి.

---

38. తెలుగు ఛందోరీతులు పు

39. తెలుగు ఛందో వికాసము, పు.

తెనుగున నీ యతి ప్రాసలు ప్రాచీన కాలమునుండియు నుండినట్లు ఇందలి సామెతలు, జంట ఊత పదముల వలన తెలియుచున్నది. అందువలననే సంస్కృత వృత్తములను తెలుగులోనికి తెచ్చిన నన్నయాదులు వానికి సంస్కృతమున లేని యతి ప్రాసలను తెచ్చిపెట్టి దేశీయతా ముద్రను సౌందర్యమును నొసగుచు వచ్చిరి.

ఈ యతి ప్రాసలను రెంటిని కలిగి ద్విపద దేశీయ చ్ఛందమే యనుచున్నది.

కవిత్వము నాల్గు విధములుగ నుండునని చెప్పుచు వార్తాకకవి రాఘవయ్య లక్షణ దీపికలో మధుర కవిత్వమును గూర్చి యీ విధముగ చెప్పినాడు. 'ఆశు,మధుర, చిత్ర విస్తార కవిత్వంబులన పిలసిల్లె అందు . . మధుర కవిత్వంబన్నది నాటకాలంకారములు, విభక్త్యధి దేవతోదాహరణములు. కళికోత్కళికలు, సప్తతాళ నటనలు, నట్టొట్లు, గీత ప్రబంధములు,చతుర్భద్రిక, అష్టభద్రికలు. బిరుదావళి, నామావళి భోగావళి, రంగఘోష, జయఘోష, చతురుత్తర సంఘటనలు, యక్షగానంబున వెలయుపదంబులు, దరువులు, ఏలలు ధవళంబులు, మంగళ హారతులు, శోభంబులు, ఉయ్యాల జోలలు, ఒక్కుల రేకుపదంబులు, చందమామ సుద్దులు, అష్టకంబులు, ద్విపద, త్రిపద, చతుష్పదాష్టపదులు, నివి మొదిగా నన్నియు లయ ప్రమాణంబుల నొప్పి, మృదుమధుర రచనల ప్రసిద్ధంబైన యవి మధుర కవిత్వంబు" ఈతడు మధుర కవితలో చేర్చిన వన్నియును దేశి రచనలేగదా! మధుర కవిత్వమున చేరిన వానిని, దేశీయ ఛందస్సులుగా, మాత్రాగణ బద్ధములుగా, నెంచి అప్పకవి పలువాని కుదాహరణముల నొసగినాడు దీనిలో మాధుర్య గుణమధికముగా నుండుటవలన నివి మధుర కవితా శాఖలో చేరియుండును మాధుర్య గుణమును పెద్దన్న యిట్లు చెప్పినాడు

"పటు బంధంబులు మృదుల
స్ఫుట విన్యస్తాక్షరములు బూరిత రస సం
ఘటిత పదార్థంబులు నె
చ్చట నగు మాధుర్య మనగ జను నది కృతులన్[40]

40. కావ్యాలంకార చూడామణి, పు. 464.

ద్విపద మధుర కవితా శాఖకు చెందినది నన్నయ 'మృదుమధుర చిత్ర విస్తర నవరస భావ భాసుర వచన రచనా విశారదులయిన" మహాకవు లాస్థానమున సుండినట్లు చెప్పినాడు గావున నప్పటికే ద్విపద వంటి మధుర కవితాశాఖ, తద్రచనలు చేయుచున్న కవులును నుండినట్లు, ఆ కవితా శాఖ వ్యాప్తియం దుండినట్లును తెలియుచున్నది ఈ శాఖ తెలుగు భాషకు సహజమును స్వతంత్రమునునై యున్నదనుటలో సందేహము లేదు శ్రీనాథ మహాకవియు 'మృదు, మధుర, చిత్రవిస్తర, కవితావిలాస వాగీశ్వరులగు 'కవీశ్వరులను' పేర్కొనినాడు.

మధుర కవితా శాఖకు చెందిన ద్విపద దేశీయచ్ఛందస్సనుటలో విప్రతి పత్తి యేముండను?

మాత్రాచ్ఛందో బద్ధములగు ద్విపద కావ్యములు, కవిత్వాంశముతో బాటు గేయ భావమును కలిగి "పాఠ్యే గేయేచ మధుర"మై మార్గ విధానమునకు చెందిన పద్య కావ్యములవలె గాక సామాన్యజనులలో ప్రచారమునంది యున్నవి. ఏ వాఙ్మయమందైనను నీ పద కవిత్వమే పద్య కవిత్వముకంటె ముందు పుట్టి పెరుగును. కాని యిది ఎంత నిరాడంబరమును నిసర్గ మధుర మును అయినను ప్రౌఢ వాఙ్మయమున స్థాన మాసింపక గాలిలోనే పుట్టి గాలి లోనే పెరుగును దీనికి సారస్వత ప్రతిష్ఠ సంపాదించి స్థిరత్వము నెలకొల్పుటకై పలువిధముల పాటుపడిన సంస్కర్తలే, ద్విపద కావ్యకర్తలు పాడదగిన పద కవిత్వము నెడ నొక కంటిని, పఠనయోగ్యమైన పద్యకవిత్వము నెడ రెండవ కంటిని బెట్టి యుభయ గుణములను ఏకము చేసి ఆ మహానుభావులు పరనము చేసిన రసాయనమే ద్విపద కవిత్వము "[41]

ద్విపద ఛందస్సును కావ్యోపయోగిగా తీర్చిదిద్దిన మహానుభావుడు పాల్కురికి సోమనాథుడు. ఈ ఛందస్సునం దుద్గ్రంథములను రచించి, కేవల గేయ రూపముగా నున్న ఆ ఛందమునకు సాహిత్య గౌరవమును కల్పించిన యశస్సు సోమనకే చెందును భాష, వస్తువు, ఛందము, మూడింటియందును,

41. గౌతమ వ్యాసములు, పు. 97.

తనకు పూర్వమందుండిన సంప్రదాయములను కాదని, వానియందు విప్లవము సాధించిన విప్లవ వీరుడీతడు సోమనాథుడు రచించిన ద్విపద కావ్యములు బసవ పురాణ, పండితారాధ్య చరిత్రలు వీని నీతడు, జనసామాన్యమున శైవమత ప్రచారోద్దేశముతో రచించినాడు ఇది మాత్రాగణ బద్ధమైనదైనందున కూర్చుట సులభము అదియునుగాక, ఇది గేయ భావమును గలిగి యున్నందు నను కావ్యమంతయు ఒకే ఛందములో (ద్విపదలో) నున్నందున, వృత్త కావ్యములందువలె, నప్పటప్పటికి నడక మారదు కావున సామాన్య జనులు పాడుకొనుటకు సులభముగ నుండును అందువలననే, సోమన మార్గ కవితా సంప్రదాయమున గద్య పద్యోక్తులతో సంస్కృత భూయిష్ఠ రచన గావించినచో ప్రజాసామాన్యమున శైవమతము వ్యాపించుట దుర్లభమని తలచి దేశిఛందమగు ద్విపదను చేపట్టి సులభమగు శైలిలో రచించెను. దీనినాతడే చెప్పికొనెను

"ఉరు తరగద్యప ద్యోక్తులకంటె
సరసమై పరగిన జాను తెనుంగు
చర్చింపగా సర్వసామాన్యమగుట
గూర్చెద ద్విపదలు గోర్కిదైవార,

"ఆరూఢ గద్య పద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠ రచన
మానుగా సర్వ సామాన్యంబు గామి
జాను తెలుగు విశేషము ప్రసన్నతకు

ద్విపదను గూర్చి యెవరైన నీసడింతురేమొ నని యెంచి గాబోలును, తాను చేయుచున్న ద్విపద రచనలు గూర్చి సమర్థించుకొనినాడు

"తెలుగు మాటలనంగవలదు వేదముల
కొలదియ కాజూడుడిల నెట్లనిన
బాటి తూమునకును బాటి యౌనేని
బాటింప సోలయు బాటియ కాదె"

"అటుగాన యాభివినుతానందితో క్తి
పటుగద్య పద్య ప్రబంధ సామ్యముగ
గావ్యకళా ప్రౌఢి గల్పింతు ద్విపద
కావ్యంబు భావ్యంబు గాన నట్లయ్యు"

... ... ...

"దేశిగా వచియింతు ద్విపదకు వళ్ల
ప్రాసంబులును బొందు పడగ దావలయు
ననుచు దదీయ సూక్తాక్షర పంక్తి
జెనకక యింతొప్ప జెప్పనే యనుచు
సన్నుతి జేయుచు సత్కవులలర
దిన్నని సూక్తుల ద్విపద రచింతు
సదియునుగా శ్రైహికాముష్మిక ద్వి
పద హేతువవుట ద్విపద నాగ బరగు
ద్విపదాంబురుహముల ధృతి బసవేశు
ద్విపదాంబురుహముల ప్రీతి బూజింతు"

నని బాస చేసికొని ద్విపద కావ్యములను రచించినాడు ద్విపద కేవలము వైదిక ఛందము గావుననే తత్స్వరూపమగు తెలుగు ద్విపదను సోమనాథుడు, 'వేద ముల కొలదియకా జూడు'దని హెచ్చరించినాడు వేదములు ఋషులు గానము చేసినవి. అట్లనే ద్విపదలు గాన యోగ్యములు

తెలుగు కవులు ఋషులే, కావున వారు గానము చేసినవి తెలుగు వేదములు.

పాల్కురికి సోమన కాలమునాటికి ద్విపద యెడ జనులకు గౌరవమున్నట్లు లేదు.[42] అందువలననే సోమన తాను చేయుచున్న ద్విపదను గూర్చి సమర్థించు

---

42. వేణుగోపాల శతకకర్త, ద్విపదనీవిధముగ నీసడించియున్నాడు. ఈ అవ హేళన సోమన కాలము నాటికిని యుండి యుండును. "ద్విపదకావ్యంబు ముది లంజ దిడ్డి కంత ..."

కొన వలసి వచ్చినది. ఇంత మాత్రమె కాక, సోమన ద్విపద రచనా పద్ధతి యందును, ఆ నాటికున్న సంప్రదాయములకు భిన్నముగ ప్రాస యతిని ప్రయోగింప వచ్చునను నియమమును ప్రవేశపెట్టినాడు

''జాతులు మాత్రాను సంధాన గణ వి
నీతులు గాన 'యనియతగణై' ర
నియును 'ప్రాసోవా' యనియు 'యతిర్వా' య
నియు జెప్ప ఛందో వినిహితోక్తి గాన
ప్రాసయైనను యతిపై వడియైన
దేసిగా నిలిపి యాది ప్రాస నియతి
తప్పకుండం ద్విపదలు రచింతు''

—పండితారాధ్యచరిత్ర, కృత్యవ తరణిక కవిజనాశ్రయ. కావ్యాలంకార చూడామణి మున్నగు లక్షణ గ్రంథములలో ద్విపదయందు ప్రాసయతిని గూర్చి యేమియు చెప్పబడలేదు. కాని, ఈతడు "అనియతగణైః. ''యతిర్వా'' "ప్రాసోవా''యని యుదాహరించిన సంస్కృత సూత్రములు ఏదో యొక లక్షణ గ్రంథములోనివై యుండును ఇవి సంస్కృతమునకుగాని, కన్నడమునకు గాని, సంబంధింపవని తెలియుచున్నది ఏలయన ఆ భాషలయందు, తెలుగులోవలె యతి లేదు కాబట్టి యీ సూత్రములు మాత్రాగణ బద్ధమగు తెలుగునకే సంబంధించినవి. అనియత గణ బద్ధములయిన, ఉత్సాహ, కంద. అక్కరాది జాతులందు ద్వితీయాక్షరపు ప్రాస నియమ మెుండుట వలన, ప్రాసయతి సమ్మతముగాదని, లాక్షణిక మతమైయుండును ప్రాస నియమము లేని సీస గీతాదులందు ప్రాసయతిచెల్లునను నియమము నేర్పఱచిరి సంగీతమును దృష్టియందుంచుకొని లాక్షణికులిట్టి నియమము నేర్పఱచి యుందురు అనియత గణబద్ధములగు ద్విపద మంజరీ ద్విపద రగడ మున్నగునవి పాడుట కనువుగ నుండుటచే, దీనియందు పూర్వము ప్రాసయతి నియతమై యుండియుండును. ప్రాత పాటలయందును పరంపరగ వచ్చు సామెత లందును, ప్రాస యతి వాడుక కానబడుచున్నది.

ఉదా "అత్తలేని కోడ లుత్తమురాలు

చలికి వెఱచినట్లు పులికి నే వెఱవ ''

ఈ ప్రాచీన సంప్రదాయము ననుసరించియే సోమన తన ద్విపద కావ్యములందు ప్రాసయతిని సంఘటించిన శ్రవణ పేయముగ నుండునని భావించి యుండును.

'అరూఢ గద్య పద్యాది సంస్కృత భూయిష్ఠ రచన మానుగా సర్వ సామాన్యము' గాదు గావున, లాను జాను తెలుగులో సరసముగా రచన చేయుదు నని ప్రతిన బూనినను, సోమన యా ప్రతిజ్ఞను పూర్తిగ నిర్వర్తించుకొనలేక పోయినాడు ఎన్నియో స్థలములందు సంస్కృత శబ్దములు దొర్లిపోయినవి. అనేక ద్విపద లొకే దీర్ఘ సమాసముగ ఘటితమైపోయినవి పండితారాధ్య చరిత్రయం దనేక స్థలములలో వేదవాక్యముల నట్లే యథాతథముగా నుద్ధరించి, ద్విపదలలో జొన్పినాడు బసవ పురాణమున నే ద్విపద కా ద్విపద విడివడి యున్నను పండితారాధ్య చరిత్రమున పాదద్వయ సమ్మేళనమును చేసినాడు

ద్విపదలో ప్రాసయతిని గూర్చి తడవిన అనంతరకాల లాక్షణికుడనం తుడు ఛందోదర్పణమున, మంజరీ ద్విపద లక్షణమును చెప్పుచు ప్రాస యతిని గూర్చి చెప్పినాడు

"శ్రీ మందిరాకారు జిత దైత్య ధీరు
గీర్తించుమో యన్య వర్తనుం డనుచు
యతి మాఱు ప్రాస మిట్లచ్చోట నిడక''

తరువాత తాళ్ల పాక చిన్నన్న ప్రాసయతి పాదద్వయ సమ్మేళనములను నిషే ధించుచు, ద్విపద లక్షణములను దెల్పినాడు (అష్ట. మ కల్యా. పు. 67) ఈతడు నిర్వచించిన నిష్కృష్టముగ ద్విపద లక్షణమును లాక్షణికులు కూడ నిర్వచింపలేదన్నచో నతిశయోక్తి గాజాలదు

ఈ విధముగ ద్విపద ప్రయోగమునందు రెండు మతము లేర్పడినవి

ద్విపద ఛందస్సు కూర్చుట సులభము, మాత్రాగణ బద్ధమగుట గాన యోగ్యము. తెలుగు భాషకు పదములకు, సరిపడునట్టి ఛందము, సరళమగు

భాషలో రచింపబడుట వలన, నెల్లరకును. గ్రాహ్యము నను నభిప్రాయముచే, మత ప్రచారమును ముఖ్యోద్దేశముగా గలిగి, ప్రథమ దశలో ద్విపద కావ్యములు రచింపబడినప్పటికిని, సోమనాథుడే, యీ నియమముల కపవాదముగా నిల్చి నాడని చెప్పవలసి వచ్చుచున్నది తర్వాతి కాలమున బయలుదేరిన ద్విపద కావ్యకర్తలును, తమ కావ్యములందు, దీర్ఘ సమాస రచనను చేసిరి సంస్కృత పద బాహుళ్యమును ప్రవేశపెట్టిరి ఇంతమాత్రమేగాక, ప్రబంధ సామాన్య మగు లక్షణముల నన్నిటిని ప్రవేశపెట్టిరి కావున కాలక్రమమున, ద్విపద కావ్యము లొక్క ఛందస్సునందు తప్ప తక్కిన విషయములందు పద్య కావ్యములనే పోలినవయ్యెను

కొంతకాలమైన పిమ్మట ద్విపద యందలి ప్రాసను విడిచిపెట్టి వ్రాయుటకు దొడంగినట్లు కానబడుచున్నది ప్రాస రహితమగు నీ ద్విపదకు మంజరీ ద్విపద యని పేరు ప్రాసయుత ద్విపదయే ప్రథమ దశయందుండిన దనియును, ఆ ఛందో రచన నింకను సులభమొనర్చుటకు తరువాత ప్రాస రహిత ప్రయోగమేర్పడిన దనియును దోచుచున్నది ద్విపద సులభమగు ఛందమను నభిప్రాయమును గలిగి, పండితేతరులైన కవులు దీని రచన కుపక్రమించి, దీనియందలి ప్రాస నియమమును గూడ తొలగించియుందురు. మంజరీ ద్విపద లక్షణము తొలిసారి మనకు ఆనంతుని ఛందోదర్పణముననే గానబడుచున్నది మంజరీ ద్విపదలో రచింపబడిన ద్విపద కావ్యములు పల్నాటి వీరచరిత్ర, కాటమరాజు కథ మొదలైనటువంటివి

ప్రాస సహిత మంజరీ ద్విపదల యొక్క కూర్పులో మంజరీ ద్విపదను గూర్చుటయే సుకరము కాని, ప్రాస సహిత ద్విపదయే, రెంటియందును, నధికముగ, శ్రవణ సుభగత్వమును గలిగించునదై, గానయోగ్యమై తనరారు చుండుననుటలో సందేహము లేదు

రెండవ ప్రకరణము

# శైవమత సంబంధ ద్విపదలు

## బసవ పురాణము

ఆంధ్ర భాషాయోషను ద్విపద విన్యాసముతో వివిధ భంగిమల నృత్యమాడించి యాంధ్ర వాఙ్మయ రంగమున నవీనరీతులను గల్పించి సహృదయుల యాదరాభిమానములను జూరగొన్న మహామహుడు పాల్కురికి సోమనాథ కవీశ్వరుడు వీరశైవ మతోద్ధరణకు, తన్మత ప్రచారోద్భూత వాఙ్మయరచనకును జీవితమును ధారవోసిన ధన్యుడు. ఆంధ్రవాఙ్మయమున తొలుదొలుత వీరశైవ ప్రచార బోధకమగు గ్రంథమును రచించిన వారిలో శివతత్త్వ సార కర్తయగు మల్లికార్జున పండితారాధ్యులే ప్రథము లగుచున్నారు అందువలననే పండితుని ప్రత్యక్షముగ నెఱుగకపోయినను సోమన యాతని యెడ విశేష గౌరవము కలవాడై యాతని చరిత్ర నొక గ్రంథరూపమున శాశ్వతపరచినాడు ఈతడు సంస్కృతాంధ్ర భాషలలో రచించిన ననేక గ్రంథములలో బసవ పురాణ పండితారాధ్య చరిత్ర లాంధ్ర ద్విపద కావ్యములు [1]

---

మల్లమ దేవీ పురాణ మను ద్విపద కావ్యమును కూడ నీతడు రచించినట్లు చెప్పుదురుగాని యాకృతి యలభ్యము ఈతని యితరకృతులు (1) అనుభవ సారము, (2) చెన్నమల్లు సీసము, (3) వృషాధిప శతకము, (4) చతుర్వేద సారము, (5) బసవోదాహరణము, (6) బసవ రగడ. సంస్కృతమున (1) సోమనాథ భాష్యము, (2) రుద్రభాష్యము, (3) వృషభాష్టకము, (4) బసవోదారణము, (5) బసవాష్టకము, (6)బసవ పంచకము, (7) అష్టోత్తర శత నామగద్య, (8) నమస్కారగద్య, (9) పంచప్రకారగద్య, (10) అక్షరాంకగద్య, కర్ణాటమున (1) బసవ రగడ, (2) బసవాద్య రగడ, (3) సద్గురు రగడ, (4) గంగోత్పత్తి రగడ

ఈ రెండు కృతులను వీరశైవమత ప్రతిపాదకము లగుట వలన వీనిని గూర్చి చర్చించుటకు పూర్వము వీరశైవమత ధర్మమును గూర్చి తెలిసికొనుట యప్రస్తుతము కాజాలదు

'శివస్య ఇదమ్' అను వ్యుత్పత్తివలన శైవ శబ్ద మేర్పడినందున శైవ మతము మంగళ మూర్తియగు శివుని గూర్చి దెల్పునది యని తెలియుచున్నది. శివ శబ్దము 'చవ్వ' యను ద్రావిడ పదమునుండి ఏర్పడిన దనియును చవ్వ యనగా తెలుపని యర్థమనియును కొందరి తలంపు. శైవ మతము భరత ఖండములోని ప్రాచీన మతము. హరప్పా, మొహంజొదారో త్రవ్వకములందు శివలింగము లభించిన సంగతి యెల్లరకును విదితమే. ఈ ప్రాంతపు నాగరికత క్రీస్తు పూర్వము కొన్ని వేల సంవత్సరముల పూర్వపు నాటిదని భూగర్భ పరిశోధకుల యభిప్రాయము ఇంతమాత్రమే గాక, శ్రుతి, స్మృతి, పురాణేతిహాసములు శివాగమములు శైవమత ప్రాచీనతను వేనోళ్ళ చాటుచున్నవి అవయవ రహితమగు జ్యోతిర్లింగమునకు చిహ్నముగ శివలింగమును శైవు లారాధింతురు. శైవమతమున సామాన్య శైవము, మిశ్రశైవము, శుద్ధశైవము, పూర్వశైవము, శ్రౌతశైవము, మార్గశైవము, వీరశైవము, సామాన్య వీరశైవము, విశేష వీర శైవము, నిరాభార వీరశైవము నను పది విధములగు భేదము లున్నవని శివాగమములు చెప్పుచున్నవి

ఈ మార్గము లన్నిటి యందును వీరశైవమే యుత్తమమనియును ముముక్షువులు దీనినే యనుసరింపవలె ననియును చెప్పబడినది "గురువు హస్తమస్తక సంయోగమున జిత్కళాన్యాసమొనర్చి ఆణవ కార్మిక మాయామలములను వేధా మనుక్రియాత్మక త్రివిధ దీక్షలచే దగ్ధమొనర్చి భౌతిక శరీరమును లింగ శరీరముగ జేసి ప్రసాదించిన యిష్ట లింగమును స్థూల శరీరమున గండమునగాని, శిరమునగాని, భుజమునగాని, వక్షమునగాని ధరించుచు సూక్ష్మ కారణ శరీరములనిక్షిప్తమయిన ప్రాణ భావ లింగములతో దాని కవినాభావమున నైక్యానుసంధానము నలవరించుకొనుచు హస్తాంభుజ పీఠమునందుంచికాని యనన్య చిత్తముతో నర్చించుట, ప్రణవ సహిత శైవ పంచాక్షరీ మంత్రము వినా మఱియే యితర మంత్రములను మననము చేయకుండుట, ఇష్టలింగార్చన కన్న భిన్నములయిన

కర్మముల నెల్ల బరిహరింపుట శరీరముచుండి యిష్టలింగము ప్రమాద పతిత మైనను వెంటనే ప్రాణత్యాగ మొనరించుట, లింగైక్యమైనపుడు సాధకుని యిష్ట లింగము నాతని హస్తాంబుజ పీఠముననే యుంచి యర్చించి యాతనితో ఖనన మొనరించుట వీరశైవ లక్ష్యము."[2]

మాతా సతీ సుతాదుల భ్రాంతిని విడిచి పుచ్చి తనలోని శివాంశమును జ్ఞానశక్తిని మేల్కొనునట్లు చేయుటవలన అణవ మలము దగ్ధమగును. కుల మతాభిమానములను విడిచి, సర్వత్ర యాత్మస్వరూపమును గాంచుటచే మాయా మలము తొలగును. కార్మికమలము ధనరూపమున మానవులను బీడించును తన కున్నదానితో సంతృప్తి జెందుచు తనకున్న ద్రవ్యాదులను గురులింగజంగములు కర్పణ గావించి వారి తీర్థప్రసాదములను స్వీకరించుటవలన కార్మిక మలము తొలగిపోవును

వీరశైవమునకు ప్రధాన దీక్ష లింగధారణము లింగము షడక్షర మంత్ర రూపమని శైవాగమములు నుడువుచున్నవి వీటికి సదాచార, శిష్టాచార, లింగా చార, గణాచార భృత్యాచారములు విహితము లయినవి ఇటులే అష్టావరణములు గూడ చెప్పబడినవి విభూతి, రుద్రాక్షధారణము, గురుమంత్ర లింగ జంగమ పాద ప్రసాదము అష్టావరణములు వీరశైవులుగూడ వేద ప్రామాణ్యము నంగీక రించిన వైదికులేగాని, యవైదికులు గారు 'యాతేరుద్ర శివా తనూర ఘోరా పాపకాశినీ తయాన స్తను వాశంత మయాగిరి శంతాభిచా కశీహి" ఇత్యాది శ్రుతి వాక్యములు లింగ ధారణమునే సూచించుచు బోధించుచున్నవని వీరశైవుల మతము

కుల మత వివక్షత లేకుండ, స్త్రీ పురుష భేదము లేకుండ నందరికిని దీక్ష యొసగబడుచున్నది గురుని హస్త మస్తక సంయోగమున దీక్షితునకు భౌతిక శరీరము లింగ శరీరముగ రూపొంది వేరొక జన్మ కల్గుచున్నది కావున గురువుయొక్క హస్తపద్మమే వీరి జన్మస్థానమనియు, వీరిని గురుకరోద్గరజనితు లనియు చెప్పుదురు ఏకగురు పీఠమునకు చెందిన శిష్యు లెల్లరును నేకోదరుల

---

2. బసవపురాణము, పీఠిక, బండారు తమ్మయ్య, పు. ౧–౪

పంటి వారై వారందరును వీరము యొక్క గోత్రమునే గలిగి, సగోత్రికులుగ నుందురు కాంతి జన్మము నశింపజేసికొనిన పిమ్మట మరల తమ పూర్వ గోత్ర సూత్రముల స్మరింపగూడదు. ఒక వీరము వారు తక్కిన నాల్గు వీరముల వారి తోడనే వివాహాది సంబంధ బాంధవ్యముల గల్గియుండవలెను బ్రాహ్మణులు వైశ్యులు శూద్రులు మాలలు మున్నగు నష్టాదశ వర్ణముల వారు వీరశైవులై కులభేదమ లను నిరసించినట్లు బసవ పురాణమువలన తెలియుచున్నది

వీరశైవులకు లింగపసాయిత శస్త్రధారణము (బసవన ఖడ్గము) కూడ విహితమైనది వీరీ శస్త్రములను బూని శివభక్తి హీనులను, శివద్రోహులను, జైన మతస్థులను చంపుచుండిరి బసవన యాజ్ఞచే జగదేవుడు వీరతాంబూలము గైకొని బిజ్జలుని సంహరించెను పిమ్మట నాత డాత్మహత్య గావించుకొనెను. వీర చిహ్నమగు నీ శస్త్రధారణ వలననే బహుశః దీనికి వీరశైవమను నామ మేర్పడి యుండును

కలియుగమున శైవమతము క్షీణింపగా, శివుని పంచవదనోద్భూతులగు నీ పంచశైవాచార్యులేగాక, ప్రమథులుగూడ భూలోకమున నవతరించి, తన్మతో ద్ధరణ గావింతురని వీరశైవుల విశ్వాసము క్రీ.శ పంద్రెండవ శతాబ్దమున దక్షిణదేశమున క్షీణించుచున్న శైవమతము నద్ధరించుటకు కర్ణాటదేశమున,నందీ శ్వరుడు బసవేశ్వరునిగను, నాంధ్రదేశమున, ప్రమథు డొకడు మల్లికార్జున పండితారాధ్యులుగను జన్మించినట్లును వారు చెప్పుదురు వీరిరువురి చరితలను గానముచేసి ప్రజలలో నా మతమును వ్యాపింపజేయుటకై భృంగీశ్వరుడు పాల్కు రికి సోమనాథుని రూపమున జన్మించి ఈ మత వ్యాప్తి కెనలేని సేవ జేసినాడు. సోమనాథుని కులగోత్రముల గూర్చి పండితులలో నేకాభిప్రాయములేదు. కొంద రీతని నారాధ్య బ్రాహ్మణు డనగా మరికొంద రీతడు సహజ వీరశైవుడని వాదించు చున్నారు

కాలము

ఆతని కులగోత్రముల గూర్చి యెంత తీవ్రమగు వాద ప్రతివాదములు గలవో నంత కెక్కుడుగ నాతని కాలమును గూర్చి వాద వివాదము లున్నవి.

పలువురు విమర్శకులు, చారిత్రకులును పాల్కురికి సోమన ద్వితీయ ప్రతాప రుద్రుని కాలమున నుండెననియే భావించిరి

వీరశైవ సంప్రదాయము ననుసరించి సోమన తన కులగోత్రాదికము లను గూర్చి యేమియు చెప్పకొనలేదు వీరశైవులకు తండ్రి యీశ్వరుడు తల్లి పార్వతి. దీని ప్రకారముగనే తా నీశ్వరకులజుడనని చెప్పికొనియు, బసవపురా ణమున తలిదండ్రుల పేర్లను చెప్పినాడు. తల్లి శ్రియాదేవి, తండ్రి విష్ణురామ దేవుడు. వీరి నామములు సోమనాథుడు మొదట బ్రాహ్మణుడుగ నుండి పిమ్మట బసవ భక్తి ముదురగా వీరశైవు డయ్యెనని వాదించువారి కుపకరించుచున్నవి. ఈతడు భవుల దర్శనాదికములను గూడ పరిహరించినట్లు "భవి జన సమాదరణ సంభాషణాది సంసర్గ దూరగుడ" నని చెప్పికొనెను

బసవ పురాణము ప్రధానముగ బసవేశ్వరుని చరిత్రమును చెప్పునదైనను నిందు ప్రసక్తాను ప్రసక్తముగ ననేక శివభక్తుల కథలు కూడ వర్ణింప బడినవి పూర్వ మొకనాడు నారదుడు కైలాసమున కేగి శివునకు భూలోక వృత్తాంత మును దెల్పి అట శైవమతము క్షీణదశ యందున్నదని కావున శివభక్తి వ్యాపింప జేయుటకు శివుని భూలోకమున కవతరింప వలసినదని వేడినాడు. తనకును నందికేశ్వరునకును నిసుమంతయు భేదము లేదు గాన, నంది కేశ్వరుడే భూలోకమున మర్త్యుడుగా నవతరించి శైవమత వ్యాప్తిని గావించునని శివుడు దెల్పెను ఈశ్వరుని పనుపున నందికేశ్వరుడు శ్రీశైలమునకు పశ్చిమ భాగమున కర్ణాట దేశమున హింగుళేశ్వరమునందు మండెగ మాదిరాజు దంప తులకు బసవేశ్వరుడుగ జన్మించినాడు ఈత డుదయించిన సమయమున కప్పటి సంగమేశ్వరు డేతెంచి బసవన్న తల్లియగు మాదాంబతో నామె కుమారునకు లింగార్పితము గాని దేదియు గుడువబెట్ట వలదని బోధించి యదృశ్యుడై యరిగెను.

బసవేశ్వరునకు గర్భాష్టకమున తండ్రి యుపనయనము జేయుదుననగ, వీరశైవుడయినందున తన కుపనయన మవసరము లేదని దెల్పి, బ్రాహ్మణ్యమును గాయత్రిని గర్హించి, వీరశైవ మతోత్కృష్టతను దెల్పి, వారు తనకు తలి దండ్రులే గారని పలికి సోదరి యగు నాగాంబతోగూడ నిలు వెడలి

శివాలయమున కేగినాడు బిజ్జలుని దండనాయకుడైన బలదేవుడు శివభక్తునకే గాని, భవునకు, తన పుత్రిక నీయనను తొల్లిజేసిన బాసదలంచి, ఆమెను బసవేశ్వరునకిచ్చి వివాహము గావించినాడు బసవేశ్వరుడు అచటనుండి భార్యతోడను, సోదరితోను కదలి కప్పడి సంగమేశ్వరుని దర్శనార్థమేగినాడు కప్పడి సంగమేశ్వరుడు, బసవేశ్వరునకు, శివభక్తి జెడనాడు ఖలులను చంపుమని యుపదేశించినాడు ఈ యుపదేశానుసారముగనే బసవన తరువాత, అల్లయ్య మధుపయ్య లను శివభక్తుల కకారణముగనే బిజ్జలుడు కన్నుల నూడబెఱికింపగా, జగదేవు డను వానిచే బిజ్జలుని చంపించెను

బసవేశ్వరుడు కల్యాణ కటకమున కేతెంచి బిజ్జలునకు దండనాయకుడై శివభక్తుల నిచ్చలు పూజించుట వీరమాహేశ్వరాచారమును సల్పుచుండెను

బసవని మహిమలను వర్ణించుచు కవిచే, అతడు వంగకాయలను లింగములుగ నొనర్చినట్లుగను, జొన్నలను ముత్యములుగ జేసినట్లును ననేక కథలు జెప్పబడినవి

ఒక సమయమున ఒకానొక మిండజంగముడు బసవని కడకేతెంచి "వచ్చి యీ యర్థంబు వలయు నింతయును, నిచ్చినగాని యొండేనొల్ల" నని యడిగినాడు. అపుడు బసవడు పెట్టెలలోనున్న మాడలను ఉన్నవియున్నట్లుగనే ఆ మిండ జంగమున కొసగినాడు బసవనితోనున్న మంత్రులిది చూచి బిజ్జలునితో నీ సంగతి విన్నవించిరి రాజు మిక్కిలి కుపితుడై బసవ దండనాయకుని రప్పించి, బండారమంతయు పాడుచేయుచున్నాడని పల్కి తన ధనమును తన కప్పగించి పొమ్మనగా బసవన కొలదిగా నవ్వి, తనకీశ్వరుడే జంగమ సేవకై ధనము నిచ్చినాడనియు, రాజు బండారమునుండి తాను ధనమును దొంగిలలేదనియు చెప్పి పెట్టెలను తాళములను బిజ్జలున కొసగినాడు. బిజ్జలుడు వానిని చూడగా, నందు మాడలు ఉండవలసిన వానికన్న నధికముగ నుండినవి. ఏమి భక్తుల మహిమలు! ఈ సందర్భమున బసవడు బిజ్జలునితో పల్కిన పల్కులు భక్తిరసముతో తొలకాడుచు రమణీయముగ నున్నవి.

"పరమేశు భక్తియన్ సురతరువుండ
హరు భక్తియన్ కనకాచలంబుండ

గొమారి భక్తి చింతామణి యుండ
సోమార్ధ ధరు భక్తి సురధేనువుండ

మృగపతి యెద్దైన మేయునే పుల్లు'' యని తన పరమేశ్వర భక్తి నిధానము వలననే జంగమోర్చనలకు పలయు ధనమును బడయుచున్నాడనని పల్కినాడు పిమ్మట భక్తియను మహదైశ్వర్యము గల్గిన తాను, ఇతరుల ధనముల కాశపడనని పల్కెను

ఇదే విధముగ నింక ననేక భక్తులు గావించిన వర్యలకు కుపితుడై బిజ్జలుడు బసవేశ్వరుని నిష్ఠురము లాడుచుండగా, బసవన యా భక్తుల మహిమలను బిజ్జలున కెరిగించుచు, ఎప్పటికప్పుడాతనిని సమాధాన పరచు చుండెను.

బసవేశ్వరుడు తన భక్తులనుచు మాల మాదిగలతో గలసి తిరుగుచు వారికి మ్రొక్కులిడుచు, వారు గుడిచినది తాను కుడుచుచు, మరల సభ్యునివలె ఏమియు నెఱుగనట్లు మిమ్ములను కలియుచున్నాడనియు, ఒక్కమాటలో చెప్ప వలెనన్నచో కల్యాణపట్టణమంతయు మాలల పాలయ్యెనని భూసురులందరును బిజ్జలునికి విన్నవించిరి. ఇక వర్ణము లన్నియు భ్రష్టములయ్యెననియు, నీతు లన్నియు సమసిపోయినవనియును, ఇట్టి వారిని శిక్షింపకున్న రాజునకు పాపము వచ్చును తెలిసిన పిమ్మట చెప్పకపోయినచో నా పాపము పురోహితుల నవశ్యము బొందును. కావున నీతో మేము విన్నవించితిమని వారు రాజుతో పల్కిరి "రాజానుమతో ధర్మ" మని చెప్పబడుటవలన ధర్మమును రక్షించి ధర్మవిరుద్ధులను శిక్షించుట రాజు కర్తవ్యము. రాజు ఈ సంగతిని విని కోపగించి బసవనను పిలువ పంపెను బసవన శివనాగమయ్య యను మాలవానిని అందల మెక్కించుకొని చేయిచ్చుకొనుచు సభకేతెంచినాడు బిజ్జలుడు నగరి వాకిట యందు వెలుపలి కొల్వున గూర్చుండియుండగా బసవేశ్వరుడెంతమాత్రమును నులుకక ఉన్నతమైన సింహాసనముగ తనపై చీరవెట్టి "పిలిచిన పని యేమి పృథివీశ" యని యడిగినాడు బిజ్జలుడు కోపముతో నిట్లు పల్కినాడు

"ఆది దలంప రష్టాదశవర్ణ
భేదంబులని నేడు పేర్కొన్న యవియొ

కుల సంకరము సేయ గూడునే మాల
గలిపితి కల్యాణ కటక మంతయును
నీతల బుట్టెనే నిటలాక్షుభక్తి
నీతి హీనుఁడ కుర్యనే వర్షమింక
బండునే యింక మీరుండిన భూమి''

అపు డవార్యవీర్యుడును సద్భక్తి పండితుడునగు బసవేశ్వరుడు పేరు బ్రాటి మాలలు (బ్రాహ్మణులనే పాల్కురికి సోమునాథుడిట్లు వ్యవహరించినాడు) గోహత్యాదికములు గావించిన పాతకులనియు వారి మాటలను విశ్వసింప వలదనియు, జాతులను మొదట వేదములే పేర్కొనినవో లేక విధి కల్పించినవో తెలియ రాదనియు, వేదము రెండు జాతులను పేర్కొనుచున్నదనియు చెప్పినాడు అవి ప్రవర్తకము, నివర్తకము శివభక్తులు నివర్తకులు. శైవులు ప్రవర్తకులు—

''మాలల ఈ తారిటి మాలల పచ్చి
మాలల మాటలు వోలునే వినగ
వేదంబు లాదియో విధికల్పితంబు
లాదియో జాతుల కది యెట్టు లనిన
జను వేదచోదిత జాతులు రెండు
వినుము ప్రవర్తకంబును నివర్తకము
భవకర్మ సంస్కారి భువి బ్రవర్తకుడు
శివకర్మ సంస్కారి భువి నివర్తకుడు
సన్నుత వేదార్థ చరితంబులుండ
మొన్న బుట్టిన కులమ్ముల మాటలేల
సృష్టిక్రమగునట్టి జాతులు గావె
యష్టాదశంబులు నవి యేల చెప్ప''

శివభక్తుడు శివునికి ప్రతిబింబమూర్తి, భవియైనవా డా విషయము నెఱుగలేక, ఆ భక్తుని మానవునిగా భావించును శివభక్తగణముల మహిమ వర్ణింప నలవిగాదు

‘‘కరి వైరితోడ గుక్కలు వోల్ప సరియె
కరితోడ గ్రామ సూకరములు సరియె
పడిగంగతో వెడ ప్రంతలు సరియె

. . .

శివనాగుమయ్యతో జెనటు లీ ద్విజులు
అవనిళ సరియు గాదని రొట్టులనిన
భక్తుండు శ్రీపతి పండితుండీశు
భక్తుని కిల గోపి బ్రాహ్మణులైన
నెనయన్న నాలుకనే గోసి వైతు
ననుచు ననంత పాలుని సభాస్థలిని
నెక్కొనగా జంద్ర నిప్పులు గాదె
చక్కన పొత్తి పర్చడమున ముడిచె
దానేమి జెప్ప భక్తానీక మింద్ల
జ్ఞానంబులకు ద్విజు ల్సరి రామి వినవె”

శివభక్తుల కెనయగు వారెవ్వరును లేరు బ్రాహ్మణులు వేదాధ్యయనము చేయుదురనుట విశేషముగాదు తగు శిక్షణ నిచ్చినచో శ్వానములు గూడ వేదములు వల్లె వేయగలవని జెప్పి, పూర్వము కల్లి దేవయ యను శివ భక్తునకు బ్రాహ్మణులతో వివాదమేర్పడగా, నీతడు తన శునకమును పిలిచి, ‘నేవేదమందైన నెత్తి యందొక్క రావనుష్ఠింపుమా యీ విప్రు లెదుర” నని దానితో పలుకగా, నది

“యకలంక మృదు మధుర కళానియుక్తి
సుకర నాదోక్తి విశుద్ధ స్వరమున
నుదాత్తానుదాత్త స్వరిత ప్ర
చయములు సాంగమై సంధిల్లి తనరఁ

పదమును గ్రమమును బాటయు జటయు
విదితంబుగా నాల్గు వేదంబులందు

నొక్కొక్క రావెత్తి యొగి ననుష్ఠించిన దనియు కావున విప్రులు భక్తగణముల యిండ్ల స్నానములకు కూడ సరిపోరని నొక్కి వక్కాణించినాడు విప్రులు చేయు తర్కవాదములందు శబ్ద కోవిదత్వము తప్పవేరేమియు లేదు ఇట్టి తర్కవాదములు చేయుచున్న ద్విజులతో నొక శివభక్తుని చెప్పు వెట్టి చూచిన నది ఊరియందుగల ఘాసులంపరికంటె గురువుగా నుండినదట. కావున విప్రులు భక్తగణముల చెప్పుతోనైనను సరిగాదు ఇట్లు లనేక నిదర్శనములను జూపి బసవేశ్వరుడు విజ్జలునకు శైవ భక్తుల మహిమను విశద పరచినాడు

ఈ కథల నన్నిటిని విన్న బిజ్జలునకు కోపము మితిమీరినిని దోష విహ్వలుడయి యాతడు బసవేశ్వరునితో, 'శివభక్తుల ఆధిక్యమేమి, వారి దేహమునుండి పాలు కారునా?' యని పల్కగా, బసవేశ్వరుడటులే యగునని పల్కి శివనాగుమయ్య శరీరమును లింగపసాయత శస్త్రముతో చీరి ఆతని దేహమునుండి కారిన పాలను బిజ్జలునకు చూపించెను

మలత్రయ రహితమై శివభక్తుని శరీరము రుధిర మాంసాకృతము గాదని చెప్పుట విశ్వసనీయమగు విషయము గాదు ఇది కేవలము భక్త్యావేశముచే నొడలెరుంగక వర్ణించిన తీరు శరీరధారు లందరకును శరీరగతమగు ధర్మము లొక్క విధముగనే యుండును. నేడు మహాయోగులును, పరమ ఋషులు నగు మహాత్ముల సంగతి జూచుట లేదా? శ్రీ రామకృష్ణ పరమహంస అనేక మానవుల వలె, 'రాచకురుపు'తో బాధపడి మరణించెను శ్రీ రమణ మహర్షి చివరి రోజులలో కీళ్ళవాతముతోను, వ్రణము చేతను పీడితుడయ్యెను ఎంతటి భక్తునకైనను యోగికైనను శరీరమున్నంత కాలము తద్ధర్మములను వీడుట శక్యము గాదు

బిజ్జలుడు వారి మహిమ నంగీకరించి తన తప్పు కావుమని వారిపాదముల కొరిగి వారివద్ద సెలవు గైకొనెను మరియొకప్పుడు బసవడు విషమారగించియు ద్విగుణీకృతమగు తేజముతో నలరుచు తన మహిమను బిజ్జలున కెరిగించెను.

బసవన విషమూరగించిన విషయము సత్యము గాదేమోనని కొందరు తలంపవచ్చును కాని భక్తులు పరాత్పరునిపై అఖండమగు విశ్వాసముంచి యాతడే వారిని రక్షించునని విశ్వసింపవచ్చును కృష్ణ భక్తామృతమును సతతము గ్రోలుచుండిన మీరాబాయి విషము నారగించి తేజస్ఫూర్తియై యుండి నటుల చెప్పబడుటలేదా! భక్తున కఖండ విశ్వాసమే యావశ్యము

ఇట్లుండగా బిజ్జలుడు బసవని మహిమను భక్తి మహాత్త్వమును నెఱిగికూడ యట్లుగ నజ్ఞానముచే నంధుడై, అల్లయ్య, మధుపయ్యలను శివభక్తుల కండ్లను కారణముగనే వారియెడ యే దోషమును లేకపోయినను నూడ బెరికించినాడు. ఈ కృత్యము వలన బసవేశ్వరుడు మిక్కిలి యలుక జెందినాడు వారిరు పురకును కండ్లు నొసగి, శివభక్తుల కిక నీ పురియందుండ రాదని పల్కి తాను మునుపు శివద్రోహిని చంపుదునని చేసిన బాసను చెల్లింపుమని జగదేవునితో చెప్పి, తాను కప్పడి సంగమేశ్వరమునకేగి, సంగమేశ్వరునిలో నైక్యము జెందినాడు. బసవేశ్వరుని యాజ్ఞ చొప్పున, జగదేవుడు బిజ్జలుని పొడిచి, అతని తలను గోసి పొట్టలో బెట్టి కట్టినాడు తదుపరి జగదేవుడు పుత్రమిత్రకళత్రా దులను చంపి, తననుగూడ చంపుకొని శివలోకమునకేగినాడు బసవని శాప కారణముగా, కల్యాణ పట్టణమంతయు కళావిహీనమైనది బిజ్జలుని సంతతి యంతయు నశించినది ఈ జగదేవుడు కాకతి ప్రోలరాజు కాలమున అనుమ కొండపై ముట్టడి సాగించిన జగదేవుడు కావచ్చునని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు భావించిరి [8] ఈ జగదేక మల్లుడు పశ్చిమ చాళుక్యుల సామంతుడు

ఈ గ్రంథ తృతీయశ్వాసమున ముగ్ధభక్తుల కథ లనేకములు వర్ణింప బడినవి ఈ కథలను చదువ గదువ మనసు ద్రవీభూత మగును. సర్వాత్మనా పరమేశ్వరుని నమ్ముకొని, భక్తి భావము గలిగియున్నచో నాతడు భక్తుల కొనగనిడిలేదు ఈ కథలలో బెజ్జ మహాదేవి కథ, ఉడమూరి కన్నప్పకథ, గొడగూచి కథమన్నగు సందర్భములలో సోమనాథుడు కపట కాలుష్యము

---

8. బసవపురాణము, పీఠిక, పు. 57.

లేని పరిశుద్ధమగు ముగ్ధ భక్తిని ప్రదర్శించి, జాను తెనుగు పలుకుబడులతో మధుర మంజులముగ సొంపు గూర్చుచు రచించినాడు

బసవేశ్వరుడు మాత్రమే గాక, ఇతర శివభక్తులుకూడ సామాన్యమానవ శక్తి కతీతమగు కార్యములొనర్చి నట్లిందువర్ణితమైనది ఇందు వర్ణితమైన భక్తులలో కొందరు బసవేశ్వరుని సమకాలమువారే చెన్న బసవన్న, అల్లమ ప్రభువు, మడివాలు మాచయ్య, సకలేశు మాదిరాజయ్య, కిన్నర బ్రహ్మయ్య, కలకేత బ్రహ్మయ్య, మోళిగ మారయ్య, కన్నప బ్రహ్మయ్య, ముసిడి చౌడయ్య, ఏకాంత రామయ్య, తెలుగు బొమ్మయ్య, అల్లయ్య, మధుపయ్యలు, శివనాగుమయ్య, మున్నగు వారు బసవేశ్వరుని సమకాలమున నుండిన భక్తులు.

ఇందలి ఏకాంత రామయ్య చారిత్రక పురుషుడు. ఈతడు జైనులతో పంతములాడి తన శిరమును శివున కర్పించి మరల బడసిన మహిమోపేతుడు. ఇతని యిచ్చాను సారముగ కదంబ వంశీయుడగు కామదేవ మహామండలేశ్వరుడు, ధార్వార్ మండలములోని హులగ్గేరి యందలి సోమనాథేశ్వరునకు దానుగల్లులోని మల్లిహల్లి గ్రామమును దానమిచ్చి యొక శాసనమును వేయించెను[9] ఈ శాసనమున కాలము లేదు కామదేవుడు, క్రీ శ. 1181-1203 వరకు పరిపాలించెను కావున శాసనమా కాలమునాటిదై యుండును ఏకాంత రామయ్య యా ప్రాంతము వాడని తెలియుచున్నది

ఈ గ్రంథమునందు ముగ్గురు మాదిరాజులు గలరు. బసవపురాణ శ్రోతలతో నొకడగు గొబ్బూరి సంగనామాత్యుని తండ్రి మండెగ మాదిరాజు[10] బసవేశ్వరుని తండ్రి కూడ, మండెగ మాదిరాజనియు, అతడు హింగుళేశ్వరాగ్రహారమందుండిన వాడనియు నిందు చెప్పబడినది[11] కాని నిరుపురును మండెగ మాది రాజులని పేర్కొనుటవలన సోమన కొంత పొరపడినాడేమోనని తోచు

9 శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఈ శాసన సారమును తమ బసవ పురాణ పీఠికలో నొసగిరి, పుటలు 52-54

10 బసవ పురాణము, పుటలు 6-7

11 బసవ పురాణము, పు 28.

చున్నది గౌబ్బూరి సంగనామాత్యుడు పాల్కురికి సోమనాథునకు సమకాలికు డగుట వలన అతని తండ్రి విషయమై పొరపడి యుండజాలడు బసవన తండ్రి విషయమై యాతడు పొరపడి యుండును "ఆ పక్షములో డాక్టరు చిలుకూరి నారాయణరావు పంతులుగారు సూచించినట్లు మన గోత్ర ప్రభువు మాదిరాజనియు, బసవని తండ్రి కాశ్యప గోత్రుడగు చంద్రమను డనియు దలంచుటయే సమంజసము"[12] ఇందలి యింకొక మాదిరాజు సకలేశ్వర మాదిరాజయ్యగారు [13] ఈతడేడు నూరేండ్లు జీవించెనట బసవేశ్వరుడు కల్యాణ నగరమున కేతెంచనప్పటి కీతడాఱువందల యేబది యేండ్ల వృద్ధుడు. మల్లికార్జున పండితుడు శివతత్త్వ సారము నాటికీతడు లింగైక్యము నందినట్లుగ తెలియుచున్నది

క భూతలమున నిది యెంతయు
నూతన మని పొగడ నేడు నూరేండ్లు మనం
దే తనరు భక్తి ప్రదిపురా
రాతీ! సకలేశ మాదిరాజయ్య శివా!"

బసవ పురాణము - పురాణ లక్షణములు :

బసవ పురాణమునకు పురాణమను పేరున్నను ఇది పంచలక్షణ విశిష్టమైనట్టిది కాదు ఇది జైనపురాణ సంప్రదాయము ననుసరించి వ్రాయ బడినట్లును, జైన పురాణము వలెనే దీనికిని సోమన బసవన పురాణమని పేరిడి నట్లును, బసవ పురాణ పీఠికలో శ్రీ జి.వి సుబ్రహ్మణ్యంగారు వ్రాసిరి. "కేవల జ్ఞాన సిద్ధిచే ముక్తులైన తీర్థంకరుల జన్మ మహిమాది విశేషముల ప్రతిపాదించుచు తన్మత ప్రచారానుగుణముగ నిర్మింపబడినవి జైన పురాణ

---

12. ఆంధ్రకవి తరంగిణి, సం 3. పు 104

13 బసవ పురాణము, పు. 205

ఇందలి పుటల సంఖ్యలు బండారు తమ్మయ్యగారి పరిష్కృత బసవ పురాణము ననుసరించి చూపబడినవి.

ములు ఇట్టి పురాణములు మత ప్రవక్తలను భగవన్మూర్తులుగ భావించి, భజించుటకును, తన్మతానుయాయులగు మహాత్ముల వైశిష్ట్యమును మహిమలను గ్రహించుటకును, పరమత ఖండన, స్వీయమత పోషణానుసరణాదుల కైన పరిజ్ఞానము నందించుటకును, నేర్పడిన కథాకావ్యములుగ రూపొందినవి (బ పు పీఠిక) ఇందు సమకాలికులే పురాణపురుషులుగ కీర్తింపబడిరి కన్నడమున ప్రసిద్ధ జైనకవుల తీర్థంకరుల చరిత్రలను పురాణములుగ కవులు చెప్పిరి. పంపకవి ఆది జైన తీర్థంకరుడు పురుదేవుని చరిత్రను ఆదిపురాణమను పేర సమకూర్చెను పొన్నకవి పదునాల్గవ తీర్థంకరుని చరిత్రను శాంతి పురాణమను పేరుతో వెలయించెను రన్నడు అజిత పురాణమున రెండవ జైన తీర్థంకరుని చరిత్రను వర్ణించెను

తమిళమునందలి పెరియ పురాణము కూడ యిట్టి గ్రంథమే ఇందరువది మువ్వురు శివభక్తుల చరిత్రలు-వారిలో కొందరా కాలమునందుండిన వారే-వర్ణింపబడినవి కాన నిది ఆర్షము ఆద్యమునైన సంప్రదాయము కాక నవీనము దేశీయమునైన కావ్య నిర్మాణ ప్రక్రియగా రూపొందినదని గ్రహింప వీలగుచున్నది బసవపురాణమీ సంప్రదాయముననుసరించి పురాణాఖ్యము ధరించి ప్రథమ వీరశైవ పురాణమై వాసికెక్కినది. ఇట్టి రచనల కిదియే తెనుగున శ్రీకారము చుట్టినది (బ. పు పీఠిక) జైన పురాణము లందలి పంచజన మహా కల్యాణములను సోమన తన కథకును, మతమునకును అనుగుణముగ నుండునట్లు మలచుకొని ప్రతిభావంతమగు రచన చేసెను జైన పురాణములందు గల త్రిషష్టిశలాకీ పురుష చరిత్రలుండుట వలన సోమన దాని స్థానే అరువత్తి మూవుర నైనాళ్ల చరిత్రను ప్రవేశపెట్టెను.

## బసవేశ్వరుడు - వీరశైవము

ఈ గ్రంథమున శైవమత ప్రాశస్త్యమును జాటుటకై సోమన, పరమతములను ఖండించి దూషణకూడ గావించినాడు భవుల సహవాససంస్పర్శనే వర్జించిన సోమన యిట్లు చేయుటలో వింతలేదు. బసవేశ్వరుడు తనకుపనయనము వలదని తండ్రితో జెప్పిన సందర్భమంన బ్రాహ్మణ్యమును గర్హించినాడు. (పుట 40—41)

అన్యదేవతా స్మరణము వలనకే ఇరువదెన్మిది కోట్ల నరకములు సంప్రాప్తించునట.

"దర నన్య దేవతా స్మరణ మాత్రమున
నిరువదెన్మిది కోట్లు నరకంబు లొందు'

బసవేశ్వరుడు జగదేవునకు సవరద నాచయ్యకథను జెప్పు సందర్భమునను, శివనాగుమయ్య కథలోను బ్రాహ్మణ నింద గావింపబడినది కర్మమార్గమనునది యవలంబనీయము గాదనియు శైవమే యవశ్య యనుసరణీయమనియు చెప్పినాడు సవరద నాచయ్యకు పూర్వము కవల లుదయించిరి. వారొక్క బాలునికొరకే శివలింగమును సిద్ధపరచుకొనిరి. వేరొకనికి సిద్ధపర్చుకొనలేదు. కావున రెండవవాడు (అర్థోదయమైనపుడే లింగ ధారణ జరుపవలెనని శైవుల నమ్మకము) పథహీనుడయ్యెనని విసర్జించివారు! ఇది ఆరోక్తిమార్గము. ఇట్టి

"మంగళంబగు భక్తి మార్గముండంగ
వెంగలులై కర్మవిధియాది చెసుట
స్మృతి తేన సహ సంవనేత్తని ప్రోయ
మతిహీనులకు నేల గతమగు బుద్ధి? (పుట 570)

షష్ఠాశ్వాసమున జైన (బౌద్ధము కూడ) మతము ఖండింపబడి, శైవ మత పారమ్యము నిరూపింపబడినది. జైన మతము మానవుని నారాధించునది. అది అవైదికము. ఈ ఆశ్వాసమున శివ జీవ భేదము కూడ వివరింపబడినది. ఈ వీరశైవులు కేవలము తమ భక్తి పారమ్యమును చాటుకొనుట మాత్రమేగాదు పరమతస్థులను ముఖ్యముగ నా కాలమున వీరికి ప్రధాన ప్రతిస్పర్థులగు జైనులను చంపించినట్లుకూడ పెక్కు కథలున్నవి. పిళ్ళనైనారను శివభక్తుడు (జ్ఞాన సంబంధి) మధుర పాండ్యుని కాలువున జైనమతమును ఖండించి, శైవమత పారమ్యమును స్థిరపరచి, జైనులను చంపిచాడు. (పు. 413)

శివలెంక మంచయ్య యను శివభక్తుడు శ్రీ కాశియందు విశ్వేశ్వరునకు తన పది వ్రేళ్ళను (పూజించి) అర్పించి, మరల బడయుచు, వీర మాహేశ్వర వ్రతమును సల్పుచుండెను వీర శైవమతము క్షీణ దశయందుండగా దాని నుద్ధరించుటకై నందీశ్వరుడు బసవేశ్వరునిగా నవతరించినాడని బసవపురాణము చెప్పుచున్నది క్షీణదశయందున్న ఈ మతమునందు పెక్కు సంస్కారణలను గావించి యీ మతమును ప్రజలలో విపుల వ్యాప్తిగాంచునట్లుగ జేసినాడీతడు బసవేశ్వరునకు పూర్వము వీర శైవ దీక్ష పడయుటకు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులకు, కొంత కాల వ్యవధి నియమింప బడుచు, కొన్ని కఠిన నియమములు ఏర్పరుపబడి యుండెనేమొ' బసవేశ్వరుడు ఇట్టి కఠోర నియమములను సడలించి, అష్టాదశ వర్ణముల వారును వీరశైవ దీక్ష నొందుటకర్హులని చెప్పియుండును క్షీణ దశయందున్న యీ మతము నుద్ధరించుటకై వీలగునంత మందిని ఆ మతమున జేర్చుకొని, ఆ మతము విశేషవ్యాప్తి బలమును పొందునట్లు చేసియుండును వీరశైవ మతమును సాధనముగ గైకొని, యాతడు జాతి వర్ణ, కుల రహితమగు సంఘమును స్థాపింప బూనుకొనెను మాలమాదిగలను కూడ నీ మతమున జేర్చుకొనినట్లు శివనాగుమయ్య మున్నగు వారి కథల వలన తెలియుచున్నది గురుడు హస్త మస్తక సంయోగముచే దీక్ష నిచ్చి మలములను పోగొట్టినచో దీక్షితుని తొంటి కులములు నశించునని చెప్పిన వీరశైవ సంప్రదాయమునకు బసవేశ్వరుడు విస్తారమగు నర్థమును గల్పించి, వారికి సహభోజనాదిక రూపమగు పొత్తున గల్పించి (సంఘ) సంస్కరణ గావించి యుండును

"ఎట్టి దుర్జాతిని బుట్టిన నేమి
యెట్టును శివభక్తుడిల బవిత్రుండు" (పు 532)

"అతిశయ లింగ దీక్షితుడైన యట్టి
వ్రతి నంత్యజుండని మతి జూడనగునె" (పు 530-31)

"గురుకరస్పర్శచే గుల మొక్కడౌట
యెరిదియే యట్ల యంత్యజుడు నగ్రజుడు

ధర నుమా మాతా పితా రుద్ర యనగ
సరినొక్క దల్లి ప్రజలకు వేఱెద్ది? (పు 561)

"ఆటు గాన కులహీను లన నెట్లు వచ్చు
నిటలాక్షు భక్తుల నిఖిలేశ్వరుండ" (పు 580)

ఈ తడిందిట్లు వీర శైవమును ప్రతిపాదించినను, కథతో మేళవించి సహజముగా నున్నట్లు జూపుట వలన, విసువు జనింప కుండును.

కవితా విశేషములు

ఆంధ్రీకరణముతో నారంభింపబడిన తెనుగు సారస్వత వీధిని స్వతంత్ర కావ్యరచనను గావించిన వారిలో నీతడే ప్రథముడు అనేక దేశ భాషలతో పాటు సంస్కృతమున గూడ పండితుడయ్యు నీతడు దేశభాషపైనను ఆంధ్రగర్ద పైనను అభిమానమును జూపి దేశీయ చందస్సును చేపట్టి, జాను తెనుగుపై వలపు పచరించుకొని కావ్యరచన సాగించినాడు "ద్విపద కావ్యంబు ముదిలంజ దిడ్డి కంత" యను నిరసన మాతని కాలమున కూడ నుండియే యుండును. అందువలననే అతడు తాను ద్విపద కావ్యమును వ్రాయుటకు హేతువులను జెప్పి సమర్థించుకొనవలసి వచ్చినది బసవ పురాణమును ధూర్త విప్రుడు నిరసించుటకు గల కారణములలో నది ద్విపద యగుట యొకటి కాని, ఐహికాముష్మిక ద్విపద హేతువైన ద్విపదతో సర్వేశ్వరుని ద్విపదాంబురుహముల పూజింతునని బాస చేసి కావ్యరచనకు గడంగినాడు.

కీ శే పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారీతని గ్రంథములను మిక్కిలి ప్రశంసించిరి

ఈతడు జాను తెనుగుపై వలపు గొనినను సంస్కృతముపై వ్యామోహము వీడినట్లు లెదు. జాతీయత యవసరమగు తావులందు జాను తెనుంగు నుపయోగించి, గంభీరములగు సందర్భములందును మత వివాదములు చేసి సిద్ధాంత స్థాపన చేయు సందర్భమునను నీతడు సంస్కృత పదములను లెక్కకు మిక్కిలిగా వాడుటయే గాక, శ్రుతి స్మృతి, ఉపనిషదాదులనుండి వాక్యములను యథాతథముగ వాడినాడు.

ఒక వస్తువును గాని పాత్రమును గాని సమగ్రముగ వర్ణన చేసి పాఠకుల మనః ఫలకముపై చిత్రించును ఇందలి సకలేశ మాదిరాజయ్యగారి కథయందలి శ్రీశైల వర్ణనము, మల్లమను వర్ణనము ఇందుకుదాహరణములు కాగలవు. సకలేశ మాదిరాజయ్యగారి కథవలన సోమనాథుని సంగీత వైదుష్యముకూడ వెల్లడియగుచున్నది అర్థ శబ్దాలంకారాదులకై నెచటను తడవులాడుకొనక, స్వాభావికములగు ప్రకృతి వర్ణనల గావించి, పలుతావులందు స్వభావోక్తులనే ప్రయోగించినాడు రసపుష్టి కొరవడినపుడే కవి యలంకారములకై ప్రాకు లాడునేమొ ప్రతిపాదింప దలచిన విషయము, పాఠకుల మనస్సుపై చక్కగ హత్తుకొనుటకు అనేక ఉపమానములలో సవిస్తరముగ దానిని వర్ణించును.

మతిహీను లగువారికి శివభక్తి ప్రాప్తింపదు ఈ విషయము నెన్ని యుపమానములతో విశద పరచినాడో చూడుడు

"నెఱి నెన్ని మాఱులు నీళ్ళలోపలను
గొఱుపడం బుడికిన మఱి తెల్లనగునె
యే నాట ద్రొద్దల నెంత గట్టినను
శ్వానంబుతోక దాఁజక్కన యగునె
మానక జలములలోననే ప్రొద్దు
నానిన శిల మెత్తగా నేర్చునెట్లు
ఎడపక పాలు దానెన్ని పోసినను
విడుచునే సర్పంబు విస మొకింతైన
బొలుపుగా దేనియ వోసి నూఱినను
నిలదీయనై యుండునే వేపనార" (పుట 570-571)

"అల్పాక్షరముల ననల్పార్థ రచన
కల్పించుటయె కాదె కవి వివేకంబు"

అని చెప్పికొనునుగాని. యీతనిని వాచకుడనియే చెప్పవలసి యున్నది కొంత వర్ణనము గావించి తక్కిన దానిని పాఠకులకు విడిచిపెట్టక సవిస్తరముగ వర్ణించు స్వభావ మాతని కావ్యములందు గాననగును. ఈతని యీ గుణమును

నావన సోమనాథుడు బాగుగ ననుకరించెను. శివభక్తిపరవశుడై, భక్తి రస పూరితములగు రచనం గావించిన నితడు విష్ణు భక్తుడైన పోతనకు మార్గ దర్శకుడైనాడు సోమన ఈ క్రింది ద్విపదలను,

"క్షీరాబ్ధి లోపల గ్రీడించు హంస
గోరునే పడియల నీరు దాగ్రివంగ
జాతఫలంబులు చుంబించు చిలుక
'బాగ్రితి బూరుగు మ్రాని పండ్లు గన్గొనునె
రాకామల జ్యోత్స్న ద్రావు చకోర
మాకాంక్ష సేయునే చీకటి ద్రావ
విరిదమ్మి వాసన విహరించు తేటి
పరిగొని సుడియునే బబ్బురి విరుల? (తృ ఆ పు 124-25)

భక్త శిఖామణి పోతన 'మందార మకరంద" అను సీస పద్యమున...అనుక రించినాడు అటులే సోమన బసవేశ్వరుని వర్ణింపుచు,

"వెనుక చీకటి యుండ దనకేపి తేజ
మనుగతి దీపంబు గనుగొని నవ్వు
సన్నుత లింగ ప్రసాద మగ్నతన
యున్నట్లు చను గుడ్చు నూరకయుండు
శివ సుఖామృతమును జేగ్రుమ్మరించి
చవి నూచు మాడ్కి హస్తము లొరిగించు
శివపద ధ్యాన నిశ్చేష్టితావస్థ
ధవులు చందమున దావెలుగందు" (ప్ర ఆ పు. 36-39)

ఇత్యాదిగా రచించిన ద్విపదలనే పోతన "వైకుంఠ చింతా వివర్జిత చేష్టుడై యొక్కచో నేడుచు నొక్కచోట" (సప్త ఆ. ప 103) అను పద్యమున ననుకరించియుండును

ఈతడు సూర్యాస్తమయాది ప్రకృతి వర్ణనలను కథావృత్తాంతముతో మేళవించి చక్కగ వర్ణించి ఒక యెడ పుట్టు శబ్దమును చమత్కారముగ ప్రయోగించినాడు

"పుట్టు సావెఱుగని యట్టి మహాత్ము
డిట్టలంబుగ నీదు పుట్టమడ్గెడిని
పుట్ట మీవేగ మీ పుట్ట మిచ్చినను
బుట్టము మనము...... (పు 129)

సోమన పంచమాన, శ్లేష యమకాను ప్రాసాది నానాముఖ కృతవై చిత్ర్యమును ప్రదర్శించెను

ల్లవో భామల యుల్లంబు లెఱిగి,
గొల్లవాడై నను గోరునే కవయ
నొల్లని వెలయాలి నొల్లని నృపతి
నొల్లని చెలి బాయ నొల్ల డనియు (పం చ పురా. పు 331)

అను సోమన ద్విపదలు,

ఒల్లని సతి, నొల్లని పతి
నొల్లని చెలికాని, విడువనొల్లని వాడే
గొల్లండుగాక ధరలో
గొల్లండును గొల్లకవునె గుణముగ సుమతీ"

అను సుమతి శతక పద్యమున కొజ్జబంతులై యుండును

ఈతడీ కావ్యమునందు పెక్కు సామెతలను జాతీయములను, నానుడులను, ఊతపదములను విరివిగ ప్రయోగించినాడు

ఈతడు భాషా విషయమున జాను తెనుగును వ్యవహారమున నున్న భాషను కొంతవరకు ప్రయోగించినాడు ఈతడనేక వైరి పదములను సమాసములను గూర్చినాడు వైరి పదము దోషమని పండితారాధ్య చరిత్ర యందు గర్హించియు మరల వీనిని ప్రయోగించుట చూడగా నీతడు భాషా విషయమున నెక్కుడు శ్రద్ధ జూపక, మతమునకును, ప్రతిపాదక విషయమునకును ప్రాధాన్యము నిచ్చినట్లు కానబడును కాని యిట్టి పదములను స్వల్పముగ నన్నయ శ్రీనాథాది కవులు ప్రయోగించిరి. 'దీపకంభము', 'చౌదళాబ్జము', 'ముల్లోక

పద్యంబు', 'ముల్లోక నాధుడు', 'ముల్లోకనుతుడు', 'నిత్యపడి', 'నిత్యనేమంబు' 'సర్వాంగకచ్చడకు', 'భక్తకూటువము', 'మజ్జన భావి', 'ఇతర వేల్పులు', 'తపనిధి', 'తపరాజు', 'తపరాజవల్లభుడు', 'సిరిమహాదేవాది సురలు', 'ధర్మకవిలె' మొదలగువానిని ప్రయోగించినాడు. మఱువకు అనుటకు బదులు వాడుకలో నున్నటులు 'మఱొకు' అనియు,'అభిమానకర్తె' యనియు 'తదీయ'కు బదులు, 'తదియ్యం' యనియు, 'కొను'కు బదులు, 'కో' యనియు ప్రయుక్తిము గావించినాడు

ఏతెంచారగించి, ఎలుగు వినేతెంచి, కరిగున్నదనుచు, కట్టెగ సల్లంత, పులుగుచు సుమియుచు, ఏటునడీల్గడే, కృగుండువాడు, అంజలి ముందెత్తునమ్మా తొ9లోన, మున్నగు క్త్వార్థ కేకార సంధులను, పత్తిరీ గొడ్డునందు, పడతర్ఘ్య పణ్యముల్, కంచేడు వాడలు మున్నగు ఇకార సంధులును, సత్య మాహేశ్వరు లింఢ్ల, గతి హీనులింఢ్ల, ఇతరులింఢ్లెన వేల్పులొడయంత, శివభక్తులింఢ్ల, మా భక్తులొద్ద, పురోహితులసు మతము మున్నగు షష్ఠీ సమాసమున అకార లోపము గావించిన సంధులను,

ఈశుకు, కంతుసంహరుకెన, కరికాల చోడుకు పుడమీశు కొల్వుకు, మొదలగు కుషష్ఠికి నకారము రాని ప్రయోగములను,

ఎఱుగరె జైనులారెన్నడు మీరు, ఓడులారేటికి, మున్నగు సంబోధన సంధులను జేసినాడు

'మహ' బదులు 'మా'ను వాడెను. 'ఈ మా జనము' ఇట్టి నియమము కర్ణాట భాషయందు గలదట.

"మహచ్ఛబ్దక్కుద్భవిక్కుం మా దేశం దోష
ఎల్ల సంస్కృత పదం పరక్కొదవ లోదం."

అని శబ్దమణి దర్పణమున గలదు.

ఛందో వ్యాకరణ విశేషములు

శివకవులు కొంత ఛంద స్స్వాతంత్ర్యమును వహించిరి. పీరికి మార్గ దర్శకుడు పాల్కురికి సోమనయే

సోమన ద్విపదలో తన కాలమున ప్రచారమున లేని ప్రాసయతిని, వాడినాడనియును. అద్దానిని సమర్ధించుటకై 'ప్రాసోవా' 'యతిర్వా' యను సంస్కృత సూత్రముల నుదాహరించి నాడనియు పైన చెప్పికొంటిమి అటులనే యీతడు మ. సగ, ఇంద్రగణములను, గగస సూర్య గణములను వాడి యున్నాడు ఇది కవిజనాశ్రయకారుని మతమునకనుసరించియున్నది

"అంధక కరిదైత్య వ్యాఘ్రలాలాజ — బ పు,
లంధ రాదుల సిద్ధ శనము సేయండె"—పు 483

ఇందలి కరిదైత్య 'సగ'ము ఇది నేటి వాడుక ననుసరించి ఇంద్ర గణములలో జేరదు అటులే,

"శునక గార్ధభ మ్లేచ్ఛ శుకదుర్దురాది
జనిత మునీంద్రాది జాతములెల్ల"—బ పు పు 631

ఇందు మగణము ప్రయుక్తమైనది అదియు నేడు ఇంద్రగణముగ పరిగణింప బడుట లేదు కాని, ప్రాచీన కాలములో దెనుగున కూడ కర్ణాట చ్ఛందోను సారముగ సూర్యేంద్ర చంద్రగణములకు బ్రహ్మ విష్ణు రుద్ర గణములన్నియు నటులే మార్పు లేకుండ యుండినట్లును, అందువలననె యుద్ధమల్లుని బెజవాడ శాసనమునందును, నన్నయగారి మధ్యాక్కరలయందు నిట్టి గణములు గాన నగుచున్న వనియును కేచిస్మృతము తెలుగులో రెండు మూడు ఛందమున బుట్టిన గణములలో అనగా సూర్యేంద్రగణములలో మొదటి రెండును విడువ బడినవి. సూర్యగణములలో గగ, సగణమును, ఇంద్రగణములలో మగణ, సగణములును విడువబడినవి అనంతాదుల మతమున ఇవి విడువబడినవి. కాని కవి జనాశ్రయకారుని మతము ననుసరించి విడువబడలేదు సోమన కవి జనాశ్రయకారుని మతమునే యనుసరించెనని భావింప వీలగుచున్నది.

శ్రీ బండారు తమ్మయ్యగారు, పై రెండు ద్విపదల యందలి పాఠములు సరియైనవి గావనియు, అందలి, 'కరిదైత్య' యనుటకు బదులు, కొన్ని వ్రాత ప్రతులలో మదగజ, సామజ, సింధుర, అను పాఠములు కానవచ్చుచున్న వని చెప్పి, సింధుర శబ్దమును గ్రహించినారు అటులె 'మ్లేచ్ఛ'కుబదులు 'మచ్చ'

యని దానిని స్వీకరించిరి. లేదా పై శబ్దముల నటులే గ్రహించినచో 'వ్యా', 'మ్లే' లను తేల్చి పల్కినచో, 'త్యా', 'భ' లఘువు లయి గణ దోషము తొలగు నని నుడివిరి

"ప్రేమం బెలర్పంగ 'భృత్యాపరాధ
స్వామి నోదండ' యన్చదువు నిష్ఠించి" — బ పు. 247

"పాయక శ్రుతి రసాన్న క్తస్య జిహ్వా
గ్రేయని యె ప్రొద్దు మోయుగావునను" —పు 385

అను ద్విపదల యందు రాధ జిహ్వా యనునవి సంయుక్తాక్షర పూర్వకములగుట వలన గలములకు మారు గగములగుచు గణ భంగ మేర్పడుచున్నది సంస్కృతమున వాదాంతస్థం వికల్పేన' అను ప్రమాణమును బట్టి పాదాంత మందలి లఘువు గురువు గావచ్చును కాని గురువు లఘువు కాజాలదు' మరియు తెనుగున కీవిధి చెల్లదని కొందరి యభిప్రాయము కాని పాద ప్రథమాక్షరము సంయుక్తాక్షరమైనపుడు తత్పూర్వ పాదాంత వర్ణము నొత్తి పలుకక యవసరమైనచో లఘువుగా జేసికొనవచ్చునని, వృత్త రత్నాకర శ్లోకముల నుదాహరించి శ్రీ తమ్మయగారు చెప్పినారు కాని సోమన 'నగ' ముపయోగించి చాడనుటలో నిబ్బంది యుండబోదు ఒకవేళ వీనిని లఘువులుగా బలించి, లక్షణ దోషమును పరిహరింపబూనుకొనినను, అట్టి లఘుత్వము సైతము సాధ్యము కాని ప్రయోగములు పండితారాధ్య చరిత్రలో కాననగుచున్నది

"మూకకు నెగయుచు బుస్సు మున్సనుచు"—అనుదాని యందలి పదము బుస్సు కాదనియు, నది ముస్సన ననుకరణ పదమనియు, సోమనాథుని కాలమునకు ముకార యతి లేదనియు బసవ పురాణ పీఠికలో శ్రీ వేటూరి వారు వ్రాసిరి కాని యిది బుస్సే యగుననియు సోమన ముకార యతినె వాడెనని శ్రీ తమ్మయ్యగారు నుడివిరి అప్పకవి మాత్రమే గాక, అంతకు పూర్వపు లాక్షణికులగు కస్తూరి రంగకవి, అనంతుడు మున్నగు వారీ యతిని పేర్కొనియే యున్నారు సోమన ముకార యతినే వాడియుండును నవీన సంప్రదాయ ప్రియుడైన యాత డాతని కాలమున నిట్టిది లేకున్నను, ము విభక్తిక యతి

సామాన్యమున నిట్టి దానిని వాడియే యుండును ఈతఁడు ము విభక్తి ముకారములు రెంటితో గూడ పువు బుభులకు యతిని గూర్చియె యున్నాడు

"పుడమీశ మీ ధనంబునకు జేసాప"
"భువి నరువాద్దర్షి ముప్పురలోన"
"పొందుగా బసిడి కొమ్ములు గౌరి జయలు"

ప్రాస విషయమున కూడ నీతడు కొంత వైలక్షణ్యమును ప్రదర్శించినాడు. కర్ణాట భాషా లాక్షణిక మతము ననుసరించి యీతడు శాంత ప్రాసము, వర్గ ప్రాసము సమీప ప్రాసము పూర్ణార్ధబిందు ప్రాసము సంయుతా సంయుత ప్రాసయును గూర్చినాడు

ఈతడు నామా ఖండ యతిని ప్రయోగించినాడు
"మఱియు నేకాంత రామయ్య నా నొక్క
"మఱియును శివనాగు మయ్య నానొక్క
ఖండమై తనరు నాగ హస్తమున
'చేయడు లెంక మంచెన పండితునకు
శ్రీ రమణుండు మంచెన పండితవర్య

ఈతని గ్రంధములలో నిట్టి ప్రయోగ విశేషములు కొన్ని కానవచ్చినను, ఈతని రచన అసాధారణ సౌందర్యముతో నలరారుచుండు ననుటలో సందేహము లేదు ఛందోభాషా విషయమున నాతడవలంబించిన దేశీయతయు, శివతత్త్వాను భవమున నోలలాడుచు తన్మయుడై పొందుచుండు నావేశమును, నీ యసాధారణతకు గారణములని విమర్శకుల తలంపు, "పడి బాఱు జలమున కొడలెల్ల కాళ్లు, చడిచేయు బసవన్న కొడలెల్ల భక్తి" యని యాతడు బసవని గూర్చి పల్కిన పల్కులు స్వవిషయమునగూడ వర్తించును.

బసవేశ్వరుడు — బిజ్జలుడు

బిజ్జలుడు పశ్చిమ చాళుక్య చక్రవర్తియైన మూడవ తైలపుని ఓడించి, కళ్యాణ పట్టణము నాక్రమించి. క్రీ. శ 1162 నుండి 1168 వరకు నేలిన కలచురి వంశస్థుడు, (1145-62 వరకు మూడవ తైలపుని సామంతునిగ

నుండెను) బసవేశ్వరుడు బిజ్జలుని దండనాయకుడుగ నుండినట్లు బసవ పురాణమువలన తెలియుచున్నది కాని బిజ్జలుని శాసనములలో నొక్కదాని యందును బసవేశ్వరుడుదాహృతుడు కాలేదు అందువలన నీతడు చారిత్రక పురుషుడు కాడేమోనని పలువురు తలంచుచుండిరి కాని మన యదృష్టవశమున బసవేశ్వరుని జన్మస్థలమగు బాగెవాడికి సమీపమందుగల అర్జున వాడ శివాలయమున శా. శ, 1182 లో యాదవ కన్నడ నృపాలుని దండనాథుడు చావుండ సెట్టి బసవేశ్వరునకు నాల్గవ తరమువాడైన హాల బసవ దేవునకు గావించిన దానమును దెల్పు శిలాశాసనము లభించినది అందు బసవేశ్వరుడు పేర్కొనబడినాడు [18]

ప॥ మత్తం తర్ద నాద గ్రామ బాగవాడి పురవరాధీశ్వర మాదిరాజన
తనూజం బసవ రాజన మహిమ యంతెందడె

క॥ మంగళ కీర్తి పురాతన
జంగమ లింగైక భక్తి నిర్భర లీలా
సంగం సంగన బసవం
సంగతి యం మాళ్కె భక్తి యొళగ నవరతమ్"

ఇందువలన బసవేశ్వరుడు కేవలము పురాణ పురుషుడు గాదనియును, చారిత్రక పురుషుడనియును తెలియుచున్నది

బసవేశ్వరునకు దండనాయక పదవి నొసగిన బిజ్జలుడు పశ్చిమచాళుక్య రాజైన మూడవ తైలపుని నోడించి కల్యాణ రాజ్యము నాక్రమించిన కలచుర్య వంశ బిజ్జలుడే కాని ఈతడు చాళుక్య వంశస్థుడుగాడు సోమనాథుడు ఈతనిని పుత్రులను చాళుక్యులుగ భావించి నమస్కార గద్యలో, "సాధిత చాళుక్యేంద్రియ నమో" "శాపనిహత చాళుక్యాయనమో" అనియును పండితారాధ్య చరిత్రమున,

"అవనిలో చాళుక్యులను వారు హరుని
కవిలెను దుడిపించి కల్యాణ కటక

---

11 Epigraphica Indica, Vol. XXI part I,

మీడిత భక్తి మహిమ్మిత పేర్మి
బాడుగా శపియించె బసవన మంత్రి"

అనియు వ్రాయుట పొరపాటు వలన జరిగియుండును బిజ్జలుని బసవేశ్వరుని ఆతడు ప్రత్యక్షముగ నెఱుగకుండుట వలన వినికిడిని బట్టి వ్రాసియుండును. ఇటులే నీతడు

"అంత రాజ్యార్థమై యని చేసి యతని
సంతాన మెల్ల నిస్సంతాన మయ్యె"
"బ్రమసి యమాత్యాది భటవర్గ మెల్ల
చమలోన జచ్చిరి సమరంబు సేసి"
"బసవని సత్య శాపముగా జేసి
పసి చెడి కటకంబు పాడయ్యె నంత"

"వినియొనంతయు నట సనియెగూడలికి" బ.పు పుట. 560

అని బిజ్జలుడు మరణించిన వెంటనే యాతని సంతానమంతయు నశించినదని వ్రాయుట గూడ సత్యము గాదు అతని పుత్రులు కొంతకాలము రాజ్యము చేసినట్లు చరిత్ర చెప్పుచున్నది. బిజ్జలుడు క్రీ. శ 1168 ప్రాంతమున మరణింపగా నాతని పుత్రుడు రాయమురారి సోని దేవుడు మున్నగు వారు క్రీ శ. 1182 వరకు కల్యాణమును పాలించిరి క్రీ శ. 1182 లో మూడవ తైలపుని కుమారుడు నాల్గవ సోమేశ్వరుడు వీరి నోడించి కల్యాణ పట్టణమును మరల స్వాధీనపరచుకొనెను, అటులే బిజ్జలుని సంతతి యంతయు నశించి కల్యాణము పాడుపడిన పిమ్మట బసవేశ్వరుడు కూడలి సంగమేశ్వరుని యందైక్యము చెందినట్లు వ్రాసినదిగూడ సత్యము గాదు. క్రీ. శ 1168 వ సంవత్సరమున బిజ్జలుడు మరణించిన కొలది కాలమునకే బసవేశ్వరుడు లింగైక్యము జెందెను

పండితారాధ్య చరిత్ర

సోమన ప్రౌఢ నిర్భరవయః పరిపాక కాలమున, పండితారాధ్య చరిత్రము రచించినట్లు గ్రంథము చెప్పక చెప్పుచున్నది ఇది యీతని కృతులలో చివరిది యని యెల్లరంగీకరించినదే ఈ గ్రంథము కవిత్వ వైభవమునందేమి, మత ప్రవచన విషయమునందేమి, సర్వ విధముల తక్కిన గ్రంథములకు మించుచున్నది ఇది ప్రధానముగ మల్లికార్జున పండితారాధ్యుల జీవిత చరిత్రనుల్లేఖించు గ్రంథమైనను, నిందుగూడ బసవపురాణమునందు వలె ప్రసక్తానుప్రసక్తముగ ననేక శివభక్తుల కథలు వర్ణింపబడినవి. పండితుని ముఖమున శైవేతరమత సిద్ధాంతముల నన్నిటిని ఖండించి పాల్కురికి సోమన యిందు వీరశైవమతోత్కర్షను స్థాపించినాడు ఇది దీక్ష, పురాతన, వాద, మహిమ, పర్వత ప్రకరణములను గలిగి యున్నది.

దీక్షా ప్రకరణమున పండితారాధ్యుల లింగ ధారణ దీక్ష, లింగార్చన, బసవన వృత్తాంతము, సూర సానమ్మ, కిన్నర బ్రహ్మ, మున్నగు శివభక్తుల కథలును వర్ణితములైనవి ఇట్లీతడు వీరశైవాచార మార్గమున నుండగా భూసురులిది జూచి వైదిక బ్రాహ్మణుడగు పండితుడును వేద విదుడును నగు నాతనికి విభూతి రుద్రాక్షములను దాల్చుటయు, లింగ సన్నిహితుడై పాదోదకమును ప్రసాదమును గొనుటయు తగునా? యది వైదిక మార్గమా? బ్రాహ్మణుడగు పండితుని వీరశైవాచారదీక్షను చూచి బ్రాహ్మణులు ఆపత్తి దెల్పగా, నాతడు వేదములందుగూడ లింగధారణ మహిమ, విభూతి రుద్రాక్షధారణ మహిమలను, అటులే పాదోదక ప్రసాద మహిమలును పేర్కొనబడినని దెల్పి, వానిని ధరించు విధానమును అందువలన గల్గు మహిమయు, వారికి దెల్పి యీ మతము సవైదికమేననియు, బ్రాహ్మణులకు కూడ నవశ్య మనుసరణీయమనియును దెల్పి వారి సంశయ నివృత్తిని గావించినాడు.

పురాతన ప్రకరణమున పండితారాధ్యుడు తన మహిమచే వెల్లగొండ మహాదేవయ్యకు పాదములను మొలపించిన కథయు, ఇంకను శివభక్తిచే నిట్టి మహిమలను గాంచిన పురాతన భక్తుల కథలును వర్ణితములయినవి. పండితారాధ్యుని వలెనే యపారమగు తమ శివభక్తి మహిమచే దుర్ఘటమగు నట్టియు

కార్యముం నాచరించిన పురాతన భక్తుల కథలను జెప్పుచు బెలిదేవ వేమునారాధ్యుల కథను కవి వర్ణించినాడు ఈ బెలిదేవ వేమునారాధ్యుడు తన యద్భుత మహిమ వలన మరణించిన రాజును పునరుజ్జీవితుని గావించినాడు

వాద ప్రకరణమున పండితారాధ్యుడు వెలనాటి చోడుని సభయందు వేదవాద, కర్మవాద, కాలవాద, వేదాంత, సాంఖ్య చార్వాక, పాంచరాత్ర, జైన, బౌద్ధ వాదములను (మతములను) ఖండించి శైవమతోత్కర్షను ప్రతిష్ఠాపింపుట వర్ణితమైనది ఇందు షట్త్రింశ తత్త్వనిర్ణయములను శివోత్కర్షతయు శ్రుతిస్మృతి పురాణేతిహాసముల ప్రమాణముతో గూడ పండితారాధ్యుడు ప్రతిపాదించినాడు. పండితారాధ్యుడీ విధమున శైవమత పారమ్యమును స్థాపింపగా బౌద్ధుడోర్వలేక శివునియొక్క చంద్రరేఖాధారణము, బ్రహ్మముఖావిర్భావము, కపాలాస్థిమాలా చర్మ ధారణము, ఉమా పతిత్వము, భిక్షాటనము, గంగాధరణము, త్రివిక్రమ ఖండనము, హరిహరాభేదము, గరళ ధారణము, నగ్నత్వము, దక్షాధ్వర ధ్వంసములు, శివుని యాధిక్యమును నిరూపింప జాల వనగా, పండితుడవన్నియును శివుని యాధిక్యము నెట్లు స్థాపించుచున్నవో నిరూపించినాడు

మహిమ ప్రకరణమున వెలనాటి చోడుని శాప వృత్తాంతము, పండితుడు శివేతరులను జూచి శివ నిందను వినికందువలన గలిగిన పాపమును విముక్తి గావించుకొనుటకు మహా ప్రమథగణ సంకీర్తనము, రుద్రగణ సంకీర్తనము, యోగాచార్యగణ సంకీర్తనము, షోడశ గణ సంకీర్తనము, దశగణ సంకీర్తనము త్రయోదశ గణ సంకీర్తనము చేసి, గణ సహస్ర నామములు పఠించుట, శివునకు తన నేత్రద్వయము నొసగి మరల రెండు నేత్రములనేగాక, మూడవ కన్నునుగూడ బొందుట, బసవన దర్శనార్థము, పండితుడు కల్యాణ కటకమునకు బోవుట, మధ్యే మార్గమున బసవన కప్పడి సంగమేశ్వరునియందు లింగైక్యము నందెనను వార్తను విని విలపించుట పండితుడటనుండి శ్రీశైల పర్వతమునకు పోవ సంకల్పించుటయు వర్ణితములైనవి రేమయ దేవయలను వారు వాదమున నోడిపోయిన బౌద్ధుని పట్టి వధింపగా. పండితుడాపనిని తానే విధించితినని రాజుతోననెను. రాజపు దాతని కక్షిదండన మాచరింపదలచగా

పండితుడు తనను తానే దండింపకొనెదననియు, రాజు దండింప నవసరము లేదనియు పల్కి కండ్లను మూడు పర్యాయములు తానూడ బెరికికొందుననియు తాను పరమ వీరశైవుడైనచో ఆ కండ్లను మరల పొందుదునని ప్రతిన చేసి రెండు పర్యాయములట్లే గావించెను. మూడవ పర్యాయము చోడుడు క్రోధము పట్టలేక, తానే కింకరులచేత పండితుని కండ్ల నూడ బెరికించి, జీళ్ళపాల్ తెప్పించి నిండబోయించినాడు ఈ కార్యమునకు పండితుడు క్రోధము పట్టలేక, వెలనాటి చోడుడును, ఆతని వంశము నాశనమై పోవుదురని శాపమొసగినాడు అటులే రాజు సమూలముగ నాశనమైపోయినాడు

పర్వత ప్రకరణమున పండితుడు శ్రీశైలమునకు పోవుటయు, అట భక్తిభావముచే నాతని శ్రీ పర్వతము లింగాకారమున భాసించుటయు ఇట్లు లింగాకారమున భాసించిన గిరి నెక్కుట కిచ్చగింపక పండితుడద్దాని మహిమను సంస్తుతించి, దోసమయ్య యను తన శిష్యుని నొకనిని చేర బిలిచి, శ్రీశైల పర్వతమునెక్కి, మల్లికార్జున స్వామిని దర్శించి తన భక్తిని స్వామికి నివేదింపవలసినదని పంపుటయు, గురువునాజ్ఞను శిరసావహించి, దోసమయ్య పర్వతము నెక్కుచుండగా శ్రీశైల మల్లికార్జునస్వామి అతనికి వృద్ధ తపోధనుని వేషముతో నెదురయి, మల్లికార్జున పండితుడును తామును మిత్రులమని దెలిపి, అతని కుశల మడుగుట శివలింగమయ మగు శ్రీగిరి నీ పాదములతో నెక్కుట దగదనియు, శరీరము లేకుండ గిరి నెక్కుట సంభవింపదుగావున తన్ను శ్రీగిరి మల్లికార్జునుని పాదములందైక్యము గావించుకొనవలసినదని స్వామిని పండితుడు ప్రార్థించుట శ్రీగిరి మల్లికార్జునుడు భక్తుని ప్రార్థన నాలకించి అతనిని తనయందు లీనముగావించుకొనుట పిమ్మట నాతని సంతతి గులసతీ సమేతముగ లింగోదరమున లీనమగుట, మొదలగు వృత్తాంతములిందు వర్ణింపబడినవి.

పండితుడు _ వీరశైవము

బసవేశ్వరుడు లింగధారణ సంప్రదాయమును, మల్లికార్జున పండితుడారాధ్య సంప్రదాయ శైవ మతమును నాంధ్రదేశమున వ్యాప్తమొనర్చిరి. పండితుడు వేద ప్రామాణ్యము నంగీకరించి సవైదికమగు వీరశైవమునే

స్థాపించునట్లు తెలియుచున్నది[19] అయినప్పటికిని పండితారాధ్యుడు బసవేశ్వరుని వలె ఉపనయనాది సంస్కారములను విసర్జించి జాతిమత వివక్షతలను పాటించని వీరశైవము నంగీకరించినట్లు గానరాదు తన బ్రాహ్మణ్యమును త్యజించి, వీరశైవ మత సంఘమందీతని జేరమని బసవేశ్వరుడు కోరగా, నితడు "భక్తిమీది వలపు బ్రాహ్మణ్యంబుతో పొత్తు బాయలేను నేను బసలింగ"యని సమాధానము చెప్పివేట్లు చెప్పుదురు. మరియు బసవేశ్వరుడు తనకుపనయన మక్కరలేదని తండ్రితో దెల్పి యిల్లు వెడలిపోగా నీతడుపనయనాది సంస్కారములం పొందియే లింగధారణాది సంస్కారములను పొంది వీరశైవుడైనట్లు పండితారాధ్య చరిత్ర వలన తెలియుచున్నది, ఈతడు శ్రుతి, స్మృతి, పురాణేతిహాసములందు మంచి నిష్ణాతుడు వీని ప్రామాణ్యముల నంగీకరించి వీని నాధారముగ గొనియే నీతడు వెలనాటి చోడుని సభయందు శైవేతర మతములను ఖండించి శివమత పారమ్యమును స్థాపించినాడు

వేదవాద నిరసనము

వేదములు నిత్యములనుట సత్యము గాదు. ఏల యనగా, షట్త్రింశ తత్త్వము లందును నయిదవ తత్త్వ మాకాశ తత్త్వము. ఆకాశ గుణము శబ్దము, శబ్ద స్వరూపము లయినవి వేదములు, ప్రకృతి లేనిది శబ్ద గుణ ముదయించుట సాధ్యము గాదు వేదములకు చరణ వ్యూహ సూక్తము యుండుటవలన వీనిని స్వయంభువు లనుట సత్యముగాదు.

జగదాదికి ఆదియైన శివుడే అనాది అందువలననే శ్రుతి అతనిని 'జగతాం పతయే నమో' యని ప్రస్తుతించుచున్నది కావున జగము లనాదులు గావు, మరియు నీ జగములు వేదములచే కల్పింపబడలేదు ఇంతియగాక, వేదములకు గూడ తండ్రి శివుడని శ్రుతి "శివో మేవమే పితతా" యని చెప్పుచున్నందున వానిని స్వయంభువు లనుట చెల్లదు ఈ వేదములు రుద్రాక్ష విభూతులను ధరించుచున్నవి మరియు నివి ఈశ్వరుని ప్రసాద పాదోదకములను

---

19 కొన్ని సందర్భములను బట్టి బసవేశ్వరుడును వేద ప్రామాణ్యము నంగీకరించినట్లూహింప వీలగుచున్నది

భోగించుచున్నవని "వేదాశ్చ కామయంతే", 'రచశ్నామి" యను శ్రుతి వాక్యముల వలన తెల్లమగుచున్నారి. "పంచాక్షరేస్థితా, వేదాశ్చ శాస్త్రాణి'' యను ప్రమాణ వాక్యమువలన, బంచాక్షరియందు వేదములు లయమగుచున్న వనియును నందువలననే వేదములు నిత్యములును, స్వయంభువులును గావని తేటపడుచున్నది, ఈ ప్రపంచ మంతయును శివుని వలననే కల్పింపబడినది త్రిజగదాధారము. కొరకాతడే జలకూర్మ ఫణీంద్రులను నిర్మించినాడు, "జనితా పృధివ్యా'' జనితాగ్నేర్జని తాసూర్యస్య" జనితేంద్రస్య, జనితాదివిష్ణో", 'పితా దేవతా సృష్టా', దేవాశ్చ పశవస్సృష్టా, ఇత్యాది ప్రమాణ వాక్యములు శివుడే ఈ సర్వసృష్టిని గావించెనని చాటుచున్నది అతడు 'లింగ మధ్యే జగత్సర్వం' మని తననుండియే సృష్టిని గావించినాడు

అద్వైతమత ఖండన

శివ జీవుల కభేదము చెప్పుట సరిగాదు జీవులెల్లరును పశువులు, ఈశ్వరుడు జీవులను అనగా పశువులను శాసించు పతి, అందువలననే అతడు పశుపతి, 'రుద్రః పశూనామధిపతి' యనియు, 'పశుపతయేచ నమో' యనియు, పశుపతయే నమోనమో' యని శివుని పశుపతిగా శ్రుతులు పేర్కొనుచున్నవి. మరియు శివుడు తానే పశుపతి నని చెప్పికొనినాడు ''అహమేవ పశూనామధి పతి", జీవులు పశువులు, ప్రకృతి యావృత్తమైన పాశము దిని రెంటికిని పతి రుద్రుడు గోపాలుడు పశువులను పాశముక్తులను గావించునట్లుగ శివుడు మానవులకు తృష్ణాదులను మాసిపి, బంధమోక్షము నొసగును ఇట్టి జీవులకు ముక్తినొసగుట కీశ్వరుడె సమర్థుడు గాని, అన్యులు గారు. సుఖ దుఃఖవార్థి నిమగ్న జీవరాసులు సదా శివు దయానూన సంపద ముఖ్యులై సాలోక్యాది ముఖ్య పదములను పొందుచున్నారు ఇందువలన శివుడు జీవుడను మాట పొసగదు జీవుడు శివుని వశమందుండు భృత్యుడు కావున శివజీవులు భిన్ను లనుటయే సరియగును గాని, వారి కభేదము చెప్పుట సరిగాదు భవబంధ మోక్షాద్యవస్థలు గల్గిన జీవుడు శివుడనుటకు వీలుగాదు. ''పరమేశునకు జీవ పంక్తికి మేరు, పరమాణు సంగతాంతరము" గలదు, ''తనకంటె నీశుండు దాలేడు వేఱ యనువాడె లోకాయతుడు.''తన్ను దానెఱిగినచో మానవుడీశ్వరుడు

గాజాలడు, ఈశ్వరుని దాసి యగును కావున మాయానుగతమైన యద్వైత మత వాదము నిలువజాలదు ఈశ్వరుని స్వామి భృత్య భావముచే గొలిచిననే ముక్తిగలుగును, చిట్టచివరిగ, అద్వైత మతమును, 'అచ్ఛాదిత జ్ఞాన తుచ్ఛ మార్గము, ప్రచ్ఛన్న బౌద్ధము, పరమ నాస్తికము'' నని ఖండించినాడు ఇదే విధముగ నీతడు సాంఖ్యవాద, యోగవాద, పాంచరాత్రవాద, బౌద్ధ, జైన వాదములను ఖండించి, పరమశివుని యొక్క ఇందుధారణ, గంగా, ధారణాదులను, భిక్షాటనములు, శివునియొక్క న్యూనతనుగాక, యాధిక్యమునే చాటుచున్నవని దెల్పి, శివపారమ్యమును స్థాపించినాడు

పండితారాధ్యుని ముఖమున అద్వైత మతమును ఖండింపజేయునపుడు పాల్కురికి సోమన, అతని శివతత్త్వసారమున నున్న భావములను, వాక్యములను కొన్నిటిని యథామాతృకముగ జొన్పించినాడు. పండితుడు శివతత్త్వసారమున నద్వైతమును తీవ్రముగ ఖండించి, కసి తీర దూషించెను ''పరమేశ్వరునికి, పరమ క్లేశాత్ములగు పశు, జీవుల కుండెడి యంతరము, ధాత్రీ ధర పరమాణువులకు గల యంతరము వంటి''దని శివతత్త్వ సారమున నుండగ, సోమన,

''భవబంధ మోక్షాను పాదితావస్థ
అవిగల్గు జీవుడు శివుడన దగునె
పరమేశునకు జీవ పంక్తికి మేరు
పరమాణు సంగతాంతరము దోపంగ''

అనినాడు,

''కలదన నోపక లేదని పలుకగ నేరకయు
మూక బధిరుల క్రియ నిమ్ముల నద్వైతుల తమ లోపల
వగతుర''ని—శివతత్త్వసారమున నున్నదానిని, సోమన
''కలదనగా నోపకయును లేదనియు
బలుక నేరక మూక బధిరుల క్రియను
బరగు భువన భిన్న భావంబు జూచి
యరయ నద్వైతుల మనగ దావెద్ది?

శివతత్త్వ సారమున "ఆరాధ్యుండారాధకు డారాధకమనగ లేని యద్వైత దురాచార కృత సర్వహాన్యాకారస్థితి"—యని గలదానిని పండితారాధ్య చరిత్రమున సోమన,

> "ఎఱుగంగ బడువస్తు, వెఱిగెడి తాను
> నెఱుకయు నను మూడు తెఱగులు భువిని
> బరగి యబాధిత ప్రత్యయ మగుచు
> నరయ నానాగతి నవగతంబగుమ"

అని వర్ణించినాడు

"ప్రత్యక్షాది ప్రమాణ బాధా బాహ్యం బత్యనుచిత మద్వైత" మని పండితు డనగా, సోమన, గర్వాంధ వృత్తి, సత్కర్మేతరంబు, సర్వ ప్రమాణ విచార దూరంబు" అనినాడు "అద్వైత విమూఢునకు లోకాయతునకు భేదమ్ము గలదే"—యని పండితుడనగా, సోమన,

> "తనకంటె నీశుండు దాలేడు వేఱ
> యనువాడకాడె లోకాయతుడనగ"—యనినాడు ఇదేవిధముగ,

"స్వేచ్ఛాచారులు మిథ్యావిచ్ఛేదన వేదశాస్త్ర విప్లవవాదుల్, ప్రచ్ఛన్నదోష, లజ్ఞానాచ్ఛాదిత దుష్టచిత్తు లద్వైతులు"—అనియు దుర్మదులగు మాయావాదులు శివతత్త్వసారమున నున్నదానికి, సోమన,

> "ఇచ్ఛాదిత తుచ్ఛ మార్గమ్ము
> ప్రచ్ఛన్న బౌద్ధంబు పరమనాస్తికము
> నద్వైత మైన మాయావాదమతము
> విద్వద్విరుద్ధంబు వేదాంత మగునే"—

యని ద్విపదలలో నిషేధించినాడు "గత శిఖాగాయత్రీ యజ్ఞోపవీత నాస్తిక లజ్ఞుల"ని పండితు డద్వైతులను దూషించినాడు.

ఇట్లు శివ పారమ్యమును శైవ మతోత్కర్షను స్థాపించిన పిమ్మట పండితుని ముఖమున సోమనాథుడు హరిహర తారతమ్యమును దెలయబఱచి శివాధిక్యమును నిరూపించినాడు

శివమత పారమ్యమును స్థాపించుటకై వాదము నొనర్చు సందర్భమున పండితు డితర మతములను నానాప్రకారముల దూషించినాడు దీనివలన సోమన (పండితారాధ్యుల వీరశైవ మతావేశము, వెల్లడి యగుచున్నది శివుడు పశుపతి బ్రహ్మాదులగు నితర దేవత లెల్లరును, పశవులు, ఎంతటి యావేశము! దీనికి శ్రుతి ప్రమాణమును మాపెట్టినాడు కవి "రుద్రః పశూనామధిపతి"—బ్రహ్మాదయః పశవః—ఇటులె నింకొక యెడ "అంతమాధవ విరించ్యాది పిపీలికాంత పశువులకు నధిపతి శివుడు" అని దెల్పినాడు.

## అరువత్తు మూవురు శైవ నైనార్లు

తమిళ దేశమున మిక్కిలి ప్రసిద్ధి కెక్కిన ప్రాచీన శైవ భక్తులు 'అఱువత్తి మూర్ నైనార్లు, వీరఱువది ముగ్గురు వీరు క్రీ. శ. నాలుగైదు శతాబ్దములందు జెందినవారు వీరి చరిత్రములను శేక్కిలార్ అను తమిళ కవి "పెరియ పురాణ" మను గ్రంథమున వర్ణించినాడు ఈ అరువత్తి మూవురు పెరియ పురాణమునందు మాత్రమే గాక, కన్నడ సంస్కృత గ్రంథములందు గూడ వర్ణితములైరి ఈ అఱువది ముగ్గురు శైవభక్తులలోను సోమనాథుడు కొందరి చరిత్రను పండితారాధ్య చరిత్రమందును కొందరి చరిత్రను బసవ పురాణమందును వివరించినాడు.[21] సోమనాథుడు పండితారాధ్య

---

21 కన్నడమున 1. 'అఱువత్తు మూవుర పురాతన చరితె' 2. త్రిదష్టి పురాతన చరితె. 3 అఱువత్తు మూరు పురాతన శరణ చరిత్ర' శివ గణ దరగళె

సంస్కృతమున 1. స్కాంద పురాణము, 2. శివరహస్య 3. శివ భక్త మాహాత్మ్యములు

తమిళమున 1. పెరియ పురాణము

చరిత్రమున మహిమ ప్రకరణమందు యోగాచార్య గణ సంక్షేపమున నరువత్తు మూరు నయనార్లను పేర్కొనినాడు

స్కాంద పురాణముకంటె పూర్వమే పెరియ పురాణము రచింపబడినదనియును, ఇది స్వతంత్ర మగు గ్రంథమనియు కొందరి యభిప్రాయము.

"Still the question has been raised as to which in the original, the Tamil or the Sanskrit? Sekkilar professes to base his account on Tiruttondattogei of Saint Sundaramurthi and the Tiruttondar Tiruvandadi of Nambi yander Nambi (vide verses 57 to 39 of Tirumalaichirappu, though in the same chapter he introdnces Upamanyu Maharshi as narrating the story to his disciples at the entry of saint Sundaramurthi who was a contemporary of Saraman Perumal is more or less fixed as the eighth century after Christ, Any how the Sanskrit work could not be earlier than Saint Sundara's time and the dates of Nambi yandar Nambi and Sekkilai have also been fixed as the tenth and eleventh centuries respectively Sekkilar was the prime minister in the court of Kulottunga Chola who reigned from 1070–1108 A D and whom he refers to as Anapaya Chola, We are inclined to think that the Tamil work is the original of the two and the introduction of Upamanyu Maharshi in the Chapters on Tiruttondachirappu has been availed of by the Sanskrit translation and the Sanskrit version has thus been given out as narrated by Upmanyu The other version in Sanskrit called Agastya Bhakta Vilasa in which the narrator is the great sage Agastya differs in some details ftom the Periya purana and Upamanyu Bhakta Vilasa But that this should have come into existence before the twelth century and before the rise of the great Veerasaiva leader Basava is equally certain"[23]

---

23. పెరియ పురాణము (అనువాదకులు జె ఎమ్ నల్లస్వామి పిళ్లై. ఉపోద్ఘాతం 'పు (88)

కాని పెరియ పురాణ కర్త 'కులోత్తుంగునికి తరువాత ఒక శతాబ్దమయినా తరువాతివాడై పాల్కురికి సోమనాథునికి సమకాలికుడు' కావలెనదియును, కాన సోమనాథునికి పెరియపురాణము సంగతి తెనియదనియును డా. చిలుకూరి నారాయణరావుగారభిప్రాయపడిరి [24]

అరువత్తు మూవురులలో యాభై యిద్దరు మాత్రమే బసవ పురాణ పండితారాధ్య చరిత్రలలో వర్ణితులైరి. తక్కినవారిని గూర్చి వీరిలో నేమియు లేదు పెరియ పురాణమున పేర్కొనబడిన, అమరనీతి, చాక్కనాయనార్లను, సోమన అరువత్తు మూవురులలో చేర్చకపోయినను, గొప్ప శివ శివభక్తులనుగా బసవ పురాణ పండితారాధ్య చరిత్రలలో పేర్కొనినాడు.

కావ్య విశేషములు

తాను కావ్యము నిట్లు రచింతునని కావ్యారంభమున ప్రతిన గావించినాడు.

"సత్కృతి యన నూత్న సంగతి దనర
తొమ్మిది రసములు దులుకాడు దాని
యిమ్మడి వర్ణన లెసగంగ ద్విగుణ
మగు నలంకారంబు లసరారు దాని
ద్విగుణార్థ భావముల్ దీటు కొనంగ
దేట తెనుగున ద్విపద రచింతు"

ఈ కావ్యమును చదివిన పిమ్మట నీ ప్రతిజ్ఞను నిర్వహించుటలో నీతడు సంపూర్ణముగ కృతకృత్యుడైనాడని తెలియును కావ్యకళను గూర్చి అతడీ విధముగ జెప్పినాడు

ఉరుతర గద్య పద్యోక్తుల కంటె
సరసమై పరగిన జాను దెనుంగు
చర్చింపగా సర్వసామాన్య మగుట

---

24. పండితారాధ్య చరిత్ర- పీఠిక, పు. 83.

గూర్చెద ద్విపదలు గోర్కి దైవార
దెలుగు మాట లనంగ వలదు, వేదముల
కొలదియకాజూడు డిల నెట్టు లనిన
బావి తూమునకును బాటి యౌనేని
బాటింప సోలయు బాటియకాదె
అల్పాక్షరముల ననల్పార్థ రచన
గల్పించు టయ కాదె కవి వివేకంబు
అలరుచు బసవని దలచు తలంపు
బలుపున గై సేసి భావమ్ము మెఱసి
యకలంక లింగ రహస్య సిద్ధాంత
సకల వేద పురాణ సమ్మతంబైన
యాతత బసవ పురాతన భక్త
గీతార్థ సమితి యే మాతృక గాగ
బూరితంబై యొప్పు పూసలలోన
దారల క్రియ బురాతన భక్త వితతి
చరితలలోపల సంధిల్ల బసవ
చరితమే వర్ణింతు సత్కృతి యనగ"
"అరూఢ గద్య పద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠ రచన
మానుగా సర్వసామాన్యంబు గామి
జాను తెనుగు విశేషము ప్రసన్నతకు"
"జాతులు రచనా ప్రణీతులు గావ్య
నీతులు రీతులు నేతులుట్టంగ
వరకవుల్ గొనియాడ వర్ణన కెక్క
ధర జెప్ప గృతియు నుద్యత్కృతి"   (పం. చ. 1-9-20)

"వర్ణును బెరుగు బిసుకు బిలిబిలి
కృతుల్ గృతులె...   (పం. చ. 1-20)

పటుగద్య పద్య ప్రబంధ సామ్యముగ
గావ్య కళా ప్రౌఢి గల్పింతు ద్విపద
కావ్యంటు భావ్యంబు గాన" (పం చ 1–29)

"తిన్నని సూక్తుల ద్విపద రచియింతు" (పం. చ. 1–2ౘ)

పురాణ వస్తువుల కందమును గూర్చి కావ్య వస్తువుగా 'నూత్న సంగతి'ని కూర్చినా డీ కవి. అందువలన నీ కవిని గూడ నాదన సోమనవలె నవీన గుణ సనాథుడని తెలుపవచ్చును

ఈతడు కథావస్తువున కొక క్రొత్తదనము నాపాదించినాడు ఇతనికి పూర్వము శైవ కావ్యములు రచింపబడినవి కాని, సోమనాథుని గ్రంథము వానికన్న విలక్షణములు అటులే వీరశైవ మత సిద్ధాంత ప్రచారముకొరకే గ్రంథములను రచించినను, ఆ సిద్ధాంతమును సిద్ధాంతముకొరకు చెప్పుచున్నట్లు గాక, కథతో మేళవింపి పాఠకుల కేమాత్రము విసువు జనింపకుండ తన కావ్యమును సాగించుకానినాడు

అనేకులగు భక్తుల కథలను చెప్పినను వాని నొకే చోట చేర్పి, అవి వేరు వేరు కథలు కానట్లుగ చెప్పి కావ్యత్వము నాపాదించినాడు అతనికి తెలిసిన, అనేక పాండిత్య విషయములను, కథతో మేళవించి చెప్పి, ప్రత్యేక ముగ వాటిని తన పాండిత్య ప్రకటన కొరకు చెప్పునట్లుగ తోపింపజేసినాడు

వేద వేదాంత స్మృతి పురాణేతిహాసములలోని వాక్యములను యథాతథ ముగ నుద్ధరించి, వానిని ద్విపదలతో సొగసుగ నదుకుగొనునట్లు గూర్చి కవితాధారలో లయింపజేసినాడు.

వేదశాఖలు పురాణములు, ఉపనిషత్తులు, రాగములు, అభినయ భేద ములు, పండ్లు, కాయలు, పుష్పములు మనుష్యులు ఇట్లు వీని పేళ్ళను మాత్రము ఉల్లేఖించి పుటలను నింపినను, విసువు జనింపకుండ ద్విపదలను సాగించినాడు. ఎన్నియో స్థలములందు పునరుక్తి గావించినాడు. కాని అతని కవితా ప్రవాహములో నవి పునరుక్తుల వలె దోచవు.

ఇతనికి పూర్వము పదకవిత్వమునకు, పాటలకు మాత్రమే నుపయోగ పడుచుండిన ద్విపద చ్ఛందస్సును మహా కావ్యోపయోగిగా తీర్చిదిద్దిన యశస్సి తనికే చెందును. ఇంతమాత్రమేగాక, ద్విపదలలోని మాత్రాగణములను ఆ యవస్థల కనుకూలపడునట్లుగ మలచుకొని రచన కొక సౌందర్యమును చేకూర్చి నాడు. ఇదే విధముగ, సంస్కృత భూయిష్ఠ రచనలను త్రోసి రాజని, జాను తెనుగున, దేశి ఛందమున స్వాతంత్ర్యముగ కావ్యమును రచించి, అప్పటి పండితుల నెల్లరను సవాలు జేసినాడు ఈతడీ విధముగ దేశీయములగు పలుకు బళ్ళను, నానుళ్ళను మూడువంతులుపయోగించినను, వలసిన సందర్భములందు దీర్ఘ సంస్కృత సమాసములను చేయక పోలేదు

అనుప్రాసాది శబ్దాలంకారముల కై ఎచ్చటను తడవులాడుకొనలేదు

ఉపమానములను కుప్పలు తిప్పలుగా నుపయోగించినాడు. ద్విపద నీతడు రోకటి పాటగా గాక, దానిని మహా వేగముగ, అనేక గతులలో ఒయ్యార ములతో నడిపించి, ద్విపద ఛందస్సున నితఃపూర్వము లేని సొగసు నాపాదించినాడు

వీరశైవేతరులకపరిచితులైన శివభక్తుల పేర్లు, కథలను వారికి విసువు జనింపకుండునట్లుగనే అనేకసార్లు శ్రవణ కుహరములలో ధ్వనించునట్లుగ చెప్పినాడు

ఈతని జాను తెనుగు సొగసు నీ క్రింది ద్విపదలలో తిలకింపవచ్చును—

"కందర్ప హరు జూచు క్రమమున జూచు
దగిలించు తాపించు దండడి గొల్పు
నిగుడించు, నిష్ఠించు నేమించు నాచు
సంధించు సాధించు జన జొన్పు నునుపు
వరసుతుల్ జనకుని వడి గౌగిలించు
కరణి నెక్కొన నీలగళు గౌగిలించి" (దీక్షా పు 176-77)

మహా కావ్యమున నవరసము లుండవలెనని పండితారాధ్య చరిత్రమున నాయా సందర్భములలో నాతడు వానిని పొందుపరచెను లక్షణ గ్రంథములలో చెప్పబడిన శృంగారమునకును నిందలి శృంగారమునకును భేదము గలదు. ఈతడు బసవేశ్వర పండితారాధ్యులను నాయికలుగాను, శివుని నాయకుని గాను వర్ణించి, అద్భుత భక్తి శృంగారములను ప్రతిపాదించెను. నంబి పరమ నాచుల కథలో కొక్కోక శాస్త్రము నంతటిని యిమిడించి సోమన ఆ రసమున తనకు గల పాండిత్యమును ప్రకటించెను ఆంధ్ర కావ్యములం దరుదుగా గానవచ్చు స్వచ్ఛమైన హాస్యము పండితారాధ్య చరిత్రలో పెక్కుచోట్ల చూపట్టును. దక్షాధ్వర ధ్వంసము, ప్రళయ లీల మున్నగునవి వర్ణించు సందర్భమున రౌద్రరసము గోచరించును బసవని నిర్యాణ వార్త విని పండితుడు విలపించునపుడు కరుణ రసము పొంగి పొరలు చుండును. మడివాలు మాచయ్యా మున్నగు భక్తుల చరిత్రలందు వీర రసము, మల్లికార్జున దోసయ్యలు శ్రీశై లాది అద్భుత దృశ్యములను చూచు సందర్భమున అద్భుత రసము వెల్లివిరియు చున్నది. వెలనాటి చోడుని వంశ క్షయ వర్ణనమున భయానక రసమును, పండితారాధ్యుని నిర్యాణ సందర్భమున శాంతరసమును పుష్టి నొందినవి

రస విషయమున వలె, వర్ణనల విషయమునకూడ నీ గ్రంథము పరిపుష్టి నొందినది మహా కావ్యమున అష్టాదశ వర్ణన లుండవలెనని లాక్షణికులు చెప్పిరి పండితారాధ్య చరిత్రమున ఆ వర్ణన మూడు నాల్గు రెట్లు హెచ్చయినట్లు కానవచ్చును.

ఒక్కొక్కప్పుడొకే వస్తువు ననేకోపమానములచే నెంత సొగసుగా రచించునో చూడవచ్చును శ్రీగిరిని వర్ణించుచున్నాడు.

''జను సర్వ పర్వత సార్వభౌమాద్య
తను బేర్చు శ్రీ గిరీంద్రంబు దానదియు
ననుపమ ప్రమథ గణస్థాన వేది
మునుల ముముక్షుల మూల బండరువు
బాగొందఁ బర్వతు పండిన తపము
ప్రోగైన మూర్తి శంభుని యశోరాసి

గరువు గట్టిన మహాకాశంబు శ్రుతుల
శిరము, ఘనీభవించిన పరంజ్యోతి
దఱగని పుణ్యంబు తపనిధి నుతుల
గుఱి సదాశివుని యంకుర మద్రిజాత
వలపలి ఖరి, భక్తవరుల యిర్వేల్పు
సలనంబు లేని విజ్ఞానాబ్ధిఁ కడలు
ధృతి ముద్దగించిన దివ్యామృతంబు
లత గదిగొన్న మూల స్తంభ మనగ
జెలువారునట్టి యా శ్రీశైల శిఖర'' (దీక్షా, పు. 8).

ఈ గ్రంథమున సామెతలు, ఉపమానములు కుప్పలు తిప్పలుగా వాడబడినవి. ఇట్లే జంట పదములు, ఊతపదములు జాతీయములు మొదలగునవి కొల్లలు

సోమనాధుని ద్విపద రచన

"బసవ పురాణములో ద్విపద పాదములు సాధ్యమయినంత మట్టుకు దేనికది ప్రత్యేకముగా ఉండి, ఒక పాదములోని తుది పదము రెండో పాదము లోనికి సంక్రమింపలేదు. సంక్రమణము చాల కొద్దిచోట్ల మాత్రము జరిగినది. అందుచేత బసవపురాణ ద్విపదలు రోకటి పాటలుగా ఏర్పడినవి పండితారాధ్య చరిత్రములో సోమనాధుడు ద్విపద ననేక విధములుగా నడిపించినాడు దాని కెంత స్వాతంత్ర్యము నివ్వడానికి సాధ్యమవుతుందో అంత స్వాతంత్ర్యమును ఇచ్చినాడు గణ విభజనము చేసుకుంటే అది ద్విపదగా కనిపిస్తుందికాని, సర్వ సాధారణముగా పండితారాధ్య చరిత్రమును చదువుతున్నప్పుడు మనకు ఛందస్సు మీద గురుతే ఉండదు క్షణ క్షణమునకున్ను ద్విపద నడక మారి పోతూ వుంటుంది. మహాసముద్రము లోని అలల వలె పదము లనేక విధము లుగా ప్రవహిస్తూ ఉంటవి ఆ అలలొకప్పుడు భంగము పొందుతవి. ఒకప్పు డభంగములుగా నడుస్తవి ఒకప్పుడు చిన్న అలలు, మహాతరంగములు లేస్తూ ఉంటవి. అవి మనలను క్రిందికి మీదికి, ఈ ప్రక్కకు ఆ ప్రక్కకు అన్ని

ప్రక్కలకు ఊగులాడిస్తూ, ఒకప్పుడు లాలించి, ఒకప్పుడు జోకొట్టి ఒకసారి పైకెత్తి ఒకసారి క్రిందికి పడవేసి, అనేక విధములుగా మనకు సంతోషము కూరుస్తవి. ఇట్టి రచనలో ప్రాస యతులు పడితే నేమి? ఒకచోట ఒక అక్షర మిటు పోతేనేమి, అటుపోతేనేమి? ఆ కవితాలయముతో తన మనస్సునుకూడా లయము చేసుకోలేని వాడరసికుడు "[25]

పండితారాధ్య చరిత్రమున సోమన శ్రుతి, స్మృతి, పురాణేతిహాసముల నుండి వాక్యము లననేకములను యథాతథముగా నుద్ధరించి, ద్విపదలలో సందించి నాడు, కాని, అతడుదాహరించిన వాక్యములు ఒక్కటికూడ, పూర్తిగ ఒకచోట నిమడలేదు ద్విపదలలో అని చేరడానికి కష్టమయినది కనుకనే దాని నాతడు అనేక భాగములుగ (విభజించి) తెగగొట్టి ద్విపదలలో నదికినాడు.

"తపశ్రియం మరుతో మర్జయంత రుద్ర యత్తేజనిమ చారు చిత్రమ్" అని ఋక్సంహితలో నున్న దానిని,

"... వీర భక్త స్థల చిత్తు,
లయి 'మరుతో మర్జయంత' నా శ్రుతి జ
నిన 'రుద్రయతే జనిమ చారు చిత్ర' మనదె (దీక్షా. పుట. 46)

యని ద్విపదలలో పొందించినాడు ఇందు తపశ్రియం యను భాగమునకు చోటు దొరకలేదు అటులే కూర్మ పురాణమున

"యశ్రాద్ధ కాలే హర భుక్త శేషం
దదాతి భక్త్యా పితృ దేవతానాం
తేనైన పిండైశ్చ తిలై ర్వామి శ్రై
రాకల్ప కోట్యాం పితరః సుతృప్తాః" అని

గలదానిని ద్విపదలలో పొందించిన విధమును గనుడు.

---

25 పండితారాధ్య చరిత్ర, ఉపోద్ఘాతము, చి. నా. పుటలు 173-174,

"ఓలిన 'యచ్ఛ్రాద్ధకాలే' యనంగ
జెనసి తా 'హరభక్త శేషం దదాతి'
యన హర భక్త శేషాన్న పానములు
వివిరి 'భక్త్యా పితృ దేవతానా' మ
న వినుడు పితృ దేవ నివహంబులకు దొ
డంగి 'తేనైవ పిండైః స్సలిలైః' ర
నంగ బిండము దర్పణము సమర్పింప
బ్రాప్తి 'నాకల్ప కోట్యాం పితరస్సం
తృప్త' నాపితృ కోటి దృప్తి నొందంగ"

ఇందు 'సంతృప్తాః' సంతృప్త అయినది, పిండైశ్చ 'చ' లోపమొందినది.

సోమన తన కావ్యమున (పండితారాధ్య చరిత్రమున) ప్రాస యతి నవిరళముగ వాడినాడు ఈ వాడుట వలననే అది 'అప్రమాణం, బనాద్య' మనియు 'సోమన పతితుడు మధ్యవళ్ళు బెనచి' కావ్య రచన చేసినాడని, విప్రులు ఈసడించిరి కాని సోమన, తాను గావించిన కార్యమును సమర్థించు కొనుటకు, ద్విపదలలో ప్రాసయతిని వాడుట లాక్షణిక సమ్మతమే యని

"... 'అనియత గణై' ర
నియును 'ప్రాసోవా యనియును, 'యతిర్వా'య
నియు చెప్పు ఛందో వినిహితోక్తి' గలదని ప్రమాణమును చూపినాడు.

ఇట్లీతడు ద్విపదలలో ప్రాసయతి వాడకమును ప్రమాణముతో కూడ సమర్థించి నను, పండితారాధ్య చరిత్రలో నున్న ముప్పది రెండువేలకు పైగా ఉన్న ద్విపదంలో, నించుమించు రెండువందల ద్విపదలలో మాత్రమే ప్రాస యతిని వాడినాడనియును, అనికూడ (1) అనుప్రాసావేశము వచ్చినప్పుడును, (2) సంస్కృత వాక్యముల కనుకరణము గావించినప్పుడు మాత్రమే ఉపయోగించి నాడని శ్రీ చిలుకూరి నారాయణరావుగారు తమ ఉపోద్ఘాతములో దెల్పినారు[26] అను ప్రాసావేశమున కుదాహరణము

26. పుట 172-173

"...శ్రీ పర్వత క్షేత్ర
వాసులు యామ్యకైలాస చూడా వి
భాసిత కీర్తి విభ్రాజిత మణులు
వీర భుక్తి చిరముక్తి కర భక్తిరతులు
వర ధర్మ ధర కర్మహర ధర్మ వరులు
గృతకృత్య హిత భృత్య ధృత సత్య రతులు
హరతంత్ర గురుమంత్రి పరతంత్ర చరులు
ధన్యులు, సుకృత పదాన్యులు విగత
దైన్యులులోకైక మాన్యులు..."

ప్రాస యతిని వాడినప్పు డీతడు మొదటి పాదములో ప్రాస యతి రెండవ దానిలో యతి

మొదటి పాదములో యతి, రెండవదానిలో ప్రాసయతి

"ధన్యులు, సుకృత పదాన్యులు, విగత
దైన్యులు, లోకైక మాన్యులు పరమ"

ప్రాస విశేషములు

సంస్కృత భాషలో ద్వితీయ, చతుర్థ పాదాంత లఘువు గురువుగా నెన్నబడును 'పాదాంతస్థం వికల్పేన' అనునదిందులకు ప్రమాణము కాని తెనుగున కీవిధి వర్తింపదు

(1) "ఎనయంగ నమృతత్త్వ స్యైశెనయనగ" (పం. 1-70)
ఇందు త్వ గురువు కావలసి యుండగా లఘువైనది

(2) "దృష్టంబు మఱియును దేవాశ్చ పశవ,స్స్పృష్టాయనగ" (పం 1,580)
ఇందు పాదాంతమున నగణ ముండవలసి యుండగా సగణమున్నది

(3) "భగ్నంబు నొంద న బ్రహ్మా న విష్ణుః" (పం. 1, 535)
ఇందు పాదాంతమున గలమునకు మారుగ గగ మున్నది

(4) స్నా - త యతి

"ధారాంబువుల గృత - స్నానులై వరుస' (పం. పర్వ 291)

(5) ఋ - రు యతి

"రు రు వర్ణ దేహంబు ఋగ్వేదమునకు'' (పం దావ 523)

రెండు పాదములలోను ప్రాస యతిని మూడు విధములుగ వాడినాడు

బసవ పురాణమునందు వలెనే నిందుకూడ నీతడు, వ్యాకరణము విషయమున స్వేచ్ఛా సంచారము గావించినాడు - "యజమానులిండ్లు, హరిభక్తులిండులు. భక్తులింట్ల, బొబ్బిడుచు, పన్నగునే వంటి అకార సంధులను, వావెఱుంగుననిని, పోడిమెఱింగి, తిత్తొలిచి, మొసలీడ్వంగ నల్మడై, ఎగిరెగి రాడువారు, ప్రొద్దుపోయిటురా, నిర్మాలమైరి యాదట, నిషిద్ధమందెట్టి, కోటి పల్లావరధ్వజదేవు, పెరువు మట్టపుర్యారు, వంటి యికార సంధులను,-ఒప్పారి వటూరి, వంటి ఉకార సంధులను, ముద్దాడాడుము వంటి ఆమ్రేడిత సంధులను గావించినాడు

ఇటులే, నిత్య వేయేసి మాడలు, అధమపాఱులు, పండిత మల్లన్న, బిల్వపత్తిరి, రుద్రాక్ష పక్కెరల్, పంచవన్నియలు, వీర యాదెయ్య, కర్తాను సారి వంటి మిశ్ర సమాసములను గావించినాడు.

సాన్నిధ్యత, కాళిదాసి, భక్తసమూహి, శంకరదాసి వంటి ప్రయోగములను గావించినాడు

సోమనాథుడు దీనియందు వర్ణించిన విషయ బాహుళ్యమును బట్టి ఈ గ్రంథము నొక వాఙ్మయ సర్వస్వముగా భావింపవచ్చును

## నవనాథ చరిత్ర

ద్విపద వాఙ్మయ ప్రపంచమున లబ్ధ ప్రతిష్ఠితుడైన గౌరనామాత్యులే యీ కృతి రచయిత. ఈతని వంశాదికములను గూర్చి హరిశ్చంద్రోపాఖ్యానమున దెల్పియున్నాను ఈతడు హరిశ్చంద్రోపాఖ్యానమును గూర్చి నవనాథ

చరిత్రయందుగాని, నవనాథ చరిత్రనుగూర్చి హరిశ్చంద్రోపాఖ్యానమున గాని ప్రస్తావింపక పోవుటవలన నీ గ్రంథ రచనల పౌర్వాపర్యములను నిర్ణయించి చెప్పుట సులభము గాదు కాని రచనా ప్రౌఢిమనుబట్టి జూచినపుడు హరిశ్చంద్రోపాఖ్యానమే పరిపాకమగు వయస్సున రచింపబడినదని తోచుచున్నది

నవనాధ చరిత్ర శాంతి భిక్షారాయని ప్రేరేపణ వలన శ్రీశైల మల్లికార్జున స్వామి కంకితము గావింపబడినట్లు గ్రంథకర్త చెప్పెను శ్రీగిరి కవి పద్యకావ్యముగ రచించిన నవనాధుల చరిత్రను ద్విపద కావ్యముగ రచింపమని గౌరనామాత్యుని బిలిచి చెప్పినాడట ఇందువలన శ్రీగిరి కవి గౌరనామాత్యునకు పూర్వమే దీనిని పద్య ప్రబంధముగా రచించినట్లు తెలియ వచ్చుచున్నది కాని నేడది లభ్యము కాలేదు.

ఈ గ్రంథము శైవమతమునకు సంబంధించిన నాధ సంప్రదాయమునకు చెందినదగుట వలన నాధ సంప్రదాయమును గూర్చి కొంత తెలిసికొన వలసి యున్నది ఈ నాధ సంప్రదాయము పాశుపత మత శాఖయందంతర్భూత మయినదని కొందరు తలంపగా కొందరిది బౌద్ధమతముతో సంబంధించినదని తలంచుచున్నారు [26] మరికొందరు, కాపాలిక మతస్థులు గూడ నాథ సంప్ర దానుయాయులే నని తలంచుచున్నారు [27] ఈ సంప్రదాయి ప్రవర్తకు లందరి నామములును నాధ శబ్దముతో ముగియుట వలన నీ సంప్రదాయమునకు నాథ సంప్రదాయమను ప్రసిద్ధి యేర్పడినది ఈ నాధ సంప్రదాయము వంగదేశము నందే జనించినదని విమర్శకులు యభిప్రాయము [28] నాధ సంప్రదాయములు విభూతి రుద్రాక్షలను, త్రిశూలమును ధరించుట వలనను సర్పములను పూజిం

26 "The Natha cult seems to be synchronous with the Buddhist Sahajiya cult"—Cultural Heritage of India, Vol IV - p 297.

27 "ఇన్ బాతోంసే యహ్ అనుమాన్ హోతాహై కి కాపాలిక్ మార్గ్‌కా స్వతంత్ర అస్తిత్వ థా, జో బాద్‌మే గోరఖ్ పంథీ సాథువోం మే అంతర్యుక్త హోగయాహై" —నాథ సంప్రదాయ్ పు 7

28. Cultural Heritage of India, Vol. IV p 280.

చుట వలనను, శివరాత్రి మున్నగు పర్వ దినములందు శివపూజలను జరుపుట వలనను, నీ మతము శైవ మతాంతర్భూతమైనదనియే చెప్పవచ్చును. ఈ మత ప్రవర్తకులలో ముఖ్యుడగు గోరక్షనాథుని వీరు భైరవుని యవతారముగ భావింతురు గోరక్షనాథుని గురువగు మీననాథునివలననే నీ మతము శైవాంశము జొచ్చి యుండవచ్చును వీరి తీర్థయాత్రా స్థలములను మున్నగువానిని జూచినచో నీ మతమునందు శాక్త సంప్రదాయ సిద్ధాంతములు గూడ నున్నటులు గానవగును వీరు పరమతత్త్వము నొకదాని నంగీకరించినట్లు గానబడదు ఈ ప్రపంచ సృష్టికర్త యొకడు గలడు. అతడనాది సిద్ధుడు, నిరంజనుడు శూన్యుడు, అతడే ఆదినాథుడు, సృష్టికి పూర్వము సర్వవ్యాప్తమగు నంధకార ముండినది ఆదినాథునకు సృష్టి గావింప వలెనను కోర్కె జనింపగనే ఆ శూన్యము నందొక బుద్బుద మేర్పడినది ఇదియే అండము. ఈ అండమును పొదుగగా, దానియందుండి ఆది నాథు డుద్భవించినాడు అండముయొక్క రెండు భాగములును ఈ విశ్వముయొక్క అధోర్ధ్వ భాగము లయినవి. ఆది నాథుని ఘర్మ జలమునుండి అతని భార్య కేతకి లేక మనస్సు ఉద్భవించినది ఆదినాథుని సంపర్కము లేకయే ఆమె ముఖమునుండి బ్రహ్మ, లలాటమునుండి విష్ణువు, యోనినుండి శివుడును జనించిరి కొంతకాలము గడిచిన పిమ్మట ఆది నాథుడు తన పుత్రులను పరీక్షింపగోరి ఒక పాడుపడిన శవాకారమున వారి యొద్ద కేతేరగా, బ్రహ్మ విష్ణువు లద్దానిని తమ తండ్రిదిగా గుర్తింపలేకపోయిరి శివుడు మాత్రము దానిని తండ్రిదిగా తెలిసికొని సోదరులలో కలిసి దానికి దహన సంస్కారములను గావించినాడు ఆదినాథుని భస్మమునుండి నాథ సంప్రదాయ ప్రవర్తకులలో ముఖ్యులయిన పంచాచార్యులు జన్మించిరి నాభి నుండి మీననాథుడు, కపాలమునుండి గోరక్షానాథుడు, (ఘర్మజలమునుండియని కొందరందురు), అస్తికల నుండి జాలంధర నాథుడు శ్రవణేంద్రియములనుండి ఖణికుడును, పాదములనుండి చౌరంగి నాథుడును జన్మించిరి

మత సిద్ధాంతములు

(1) జనన మరణముల కతీతమగు 'సహజ' స్థితిని పొందుటయే వీరి లక్ష్యము ఈ స్థితియందద్వైతుల వలెనే వీరును ద్వంద్వాతీతులగుదురు. ఇట్టి

స్థితి యందిక పరమాత్మ జీవాత్మ వంటి భేదముండదు జీవుడే ఆ స్థితినందు చున్నాడు.

(2) జనన మరణములు సుఖ దుఃఖాది బంధములు మనుష్యుని యొక్క కామక్రోధాదులుం వలనను, తృష్ణాదుల వలనను కలుగుచున్నవి ఇవి కల్గుటకు మనుష్యుడే కారకుడు.

( ) నిర్వాణమును వీరు విశ్వసింపరు నిజమగు యోగి కర్మలను గావింప వలసిన యావశ్యకత లేదు

(4) 'సహజ' స్థితి నొందుటకు యోగి గురు వొసగిన యుపదేశములను అనుసరించుచు బిందుధారణను, ప్రాణాయామము, చిత్త నిరోధమును నవలంబింప వలెను

(5) సహజ స్థితి నొందుటకు సూర్య చంద్ర స్థానములను సంయోగ పరుపవలెను. శరీరము నందలి ప్రాణ ప్రవాహక శక్తిని నాశ మొనర్చుచున్న కాలాగ్నియే సూర్యుడనబడుచున్నాడు శరీరమందు శాశ్వత రూపమున నున్న పదార్థమే చంద్రుడన బడుచున్నాడు ఈ చంద్ర సూర్య స్థానములను యోగ పరచుట-యిదియే హఠయోగ మన బడుచున్నది-వలననే వీరు సహజ స్థితిని పొందుచున్నారు.

(6) రస వాదమును గూడ యోగ మార్గమున కుపకరించునట్లొనరించు కొందురు

(7) కాయి సాధన వీరి ముఖ్య సిద్ధాంతములలో నొకటి మానవ శరీరము నందలి చంద్రస్థానమున అమృతము లేక సోమరసము గలదు ఈ చంద్ర స్థానము సహస్రార చక్రమునకు దిగువ భాగమున గలదు. ఈ చంద్ర స్థానమునందున్న అమృతము శరీరమునందెల్లడల స్రవించుచున్నందువనే మానవుడు ప్రాణధారి యగుచున్నాడు ఈ సోమరసము నాభి స్థానమున గల సూర్యునిచే దగ్ధము గావింపబడుచున్నది. సోమరసమీ విధముగ నశించుట వలననే మానవుడు మృతి జెందుచున్నాడు. అమృతత్వమును బడయుట కీ

సోమరసమును సూర్యునినుండి కాపాడవలెను ఇది చేయుట యెట్లు? చంద్రస్థానమునుండి జిహ్వకు దిగువ భాగము వరకును బంకనాళ మనునది గలదు ఇది సర్పాకారమునకునుండి రెండు వైపులను ముఖములను గలిగియున్నది దీనినే యోగపరిభాషయందు శంఖిణి యనుచున్నారు అమృతము స్రవింపబడుచున్న ఈ నాళముఖము దశమ ద్వారమనబడుచున్నది. ఈ దశమ ద్వారమును బంధించివేయవలెను లేకపోయిన మనుష్యుని యొక్క ముఖ్య ధనము కాలము లేక సూర్యునివలన హరింపబడుచున్నది ఈ దశమద్వారమును బంధించి అమృతమును కాపాడుటకనేక విధములగు మార్గములు 'హఠ' యోగ సంప్రదాయమున తెల్పబడినవి. నాలుకకు వెనుకవైపునకు బంకనాళము వరకును త్రిప్పి, ఆనాళముఖమును బంధించి, భ్రూకుటి మధ్యమున దృష్టిని నిలుపవలెను ఆ నాళ ముఖ మీ విధముగ బంధింపబడుట వలన అమృతము శరీరము నందెల్లెడల ప్రవహించి వృథాగాదు దాని నిపుడు యోగియే త్రావును ఈ అమృత రక్షణమునే కొందరు కుల, లేక కుండలిని శక్తిని మేల్కొలుపుట యని భావించుచున్నారు కుండలినీ శక్తి నాభిస్థలమున గలదు ఈ శక్తిని మెల్కొల్పి సహస్రార చక్రము వరకు పంపుటవలన అమృత రక్షణ జరుగును.

'నాథ' అను పదమున కర్థ మీ విధముగ నిర్వచింతురు 'నా' అనగా అనాది రూపమును, థ'యనగా (భువన త్రయము) స్థాపింపబడుట యనియును నర్థము జెప్పుట వలన, నాథమతమనగా, భువన త్రయము యొక్క స్థితికి కారణమయిన అనాది ధర్మమని తెలియుచున్నది ఇందువలననే గోరక్షుడు నాథుడని యనబడుచున్నాడు [31] మరి కొందరిట్లు చెప్పుదురు 'నా' యనగా మోక్ష మొసగుట యందు దక్షమయిన నాద బ్రహ్మము యొక్క జ్ఞానము గల్గించునదనియును, 'థ' యనగా, జ్ఞానము స్థగిత మొనర్చునది యనియును

---

31 'నకారో నాది రూపం థకారః స్థాప్యతే సదా
భువన త్రయ మేవైకః శ్రీ గోరక్ష నమో స్తుతే"
(రాజగుహ్యము, నాథసంప్రదాయ్. పు. 3)

దెల్పి అజ్ఞానమును తొలగించి నాద బ్రహ్మ సాక్షాత్కార మొనర్చునది 'నాథ' శబ్దము దెల్పుదురు[32]

గొరక్ష నాథానుయాయులు కర్ణ మధ్య భాగమున కుండలములను ధరింతురు ఈ కుండల ధారణమునకు (ముద్ర) వీ రనేకాధ్యాత్మి కార్థములను తెల్పుదురు 'ముద్ర' యనునది "ముద్ 'ర' యను ధాతువుల వలన నేర్పడిన దని దెల్పుదురు 'ముద్' అనగా ప్రసన్న మగుట, 'ర' యనగా తీసికొనుట ఈ ముద్ర జీవాత్మ పరమాత్మలకు చిహ్నమని వీరి విశ్వాసము దీనివలన దేవతలు ప్రసన్న మగుటయే గాక, అసురులు దవ్వులకు పారి పోవుదురుగాన, నిది సాక్షాత్కల్యాణ దాయిని యగు ముద్ర యని వీరు తలంతురు. దీనిని ధరించుటకు కర్ణమందు రంధ్రమును జేయుట ఆవశ్యకము దీనిని వీరు(పిన్న)చిరు కత్తితో గావింతురు జాలంధర కణిక నాథులు కర్ణకుండలములు ధరించెడి వారో లేదో నేడుపలభ్యమగుచున్న సామగ్రిని బట్టి దెల్పుట కష్టము వీరు ధరించెడి కర్ణకుండలములు పెక్కు లోహములతోను, దంతములతోను, లేడి కొమ్ముల తోను, గావింపబడుచుండెడివి, ధనికులు స్వర్ణ ముద్రలను గూడ ధరించెడి వారు. వీరు కర్ణకుండలములను మాత్రమేగాక, శిరమునందు కిరీటము,నడుమున మేఖల, తలపాగ, ఆసనము, కమండలము, దండము వ్యాఘ్రచర్మము, కౌపీనము, జోలె మున్నగువానిని ధరించెడివారు వీరి యీ చిహ్నములనుబట్టి చూచినచో మను చరిత్రయందు ప్రవరుని యొద్దకేతెంచిన సిద్ధుడు నాథమతాను యాయుడని ఊహింప నవకాశము గలుగుచున్నది[33] నాథయోగులు ధరించు ముద్రాది చిహ్నములను మీన నాథుని వేషధారణమును గౌరన వర్ణించెను.[34]

ఈ సంప్రదాయమును ప్రచారము గావించిన వారు మూల నవనాథులు వీరెవ్వరను విషయమున భిన్నాభిప్రాయములు కలవు, మహార్ణవ తంత్రమున

32. శ్రీ మోక్ష దాన దక్షత్వాత్ నాద బ్రహ్మాను బోధనాత్,
స్థగిత జ్ఞాన విభవాత్ శ్రీనాథ ఇతి గీయత్" (శక్తిసంగమతంత్రము, నాథ సంప్రదాయ్, పుట 3)

33 మను చరిత్ర – ప్ర ఆ. పు. 59

34 నవనాథచరిత్ర – ప్ర ఆ పు 27, 28, ద్వి. ఆ. పు 82

గోరక్షనాథుడు జలంధర నాథుడు, నాగార్జునుడు, సహస్రార్జునుడు, దత్తాత్రేయుడు, దేవదత్తుడు, జడ భరతుడు, ఆది నాథుడు, మత్స్యేంద్ర నాథుడును నవనాథులుగ పేర్కొనబడిరి మరికొన్ని గ్రంథములందు భిన్న నామధారులు పేర్కొనబడిరి జ్ఞానేశ్వర చరిత్ర యందు పండిత లక్ష్మణ రామచంద్ర పాంగారకర్ పీరి గురు పరంపర ని విధముగ నొసగినట్లు హజారీ ప్రసాద్ ద్వివేదీ గారు చెప్పియున్నారు[35]




నవనాథులెవరను విషయమున భిన్నాభిప్రాయము లున్నవని పైన తెలిసికొంటిమి గౌరన, మీన నాథుడు, సారంగధరుడు, గోరక్ష సిద్ధుడు, మేఘనాథ సిద్ధుడు, విరూపాక్షుడు, నాగార్జునుడు, ఖణికుడు, వ్యాళి సిద్ధుడు, తోరకున్నాథుడు, అను నవనాథుల చరిత్ర గ్రంథమున వర్ణించెను

మీన నాథుడు

మీన నాథుని జన్మప్రకారము గౌరన యీ క్రింది విధముగ వర్ణించెను ఒకానొక సమయమున శివుడు కైలాసమందు కొలువుండెను ఆభక్త మందారుని కొల్చుటకో యనునట్లు వసంత ఋతు వేతెంచినది. ఇట్లు వసంతో

35. నాథ సంప్రదాయ్, పు. 82

దయము కాగానే శివుడు రజతాద్రిపై వనకేళి సల్పగోరి పార్వతీ దేవితో గూడ వనమున విహరించుచు జలక్రీడాదులను గావించుచుండెను శివ పార్వతులిట్లు క్రీడించుచున్న సమయమున, శివుని రేతము జలములందు పడగా, దానిని ఆ మిష బుద్ధిచే నొక మీనము మ్రింగినది ఆ మత్స్య గర్భమున మహాదేవుని వీర్యము వలన నొక పురుషు డుద్భవిల్లెను ఇది యిట్లుండగా శివ పార్వతులు వినోదములను చాలించి, యొక తరుస్థలిఆసీనులై యుండగా పార్వతీదేవి పరమేశ్వరుని యధ్యాత్మ విద్య యుపదేశింప వలసినదని వేడగా, శివుడామె ననుగ్రహించి చతుర్ముఖ యోగములలోని మతములను, వాని యభ్యాస విధులను, పరకాయ ప్రవేశ విద్యను, రాజ యోగమును, ఉపదేశించెను శివుడు వీని నుపదేశించుచుండగా, పార్వతి యానంద రసవార్ధిమగ్నయై 'ఊ' కొనుట మరచినదట అట్లామె యూరక యుండగా మీన గర్భమునందున్న పురుషుడూకొనుచుండగా శివుడాశ్చర్యము నొంది "మనుజ వాక్యము లివిగావు పరికింప నీటిలోపలి నుండి యెవడా యూకొనుచున్న వాడొకడు విచిత్ర మీ కీలు తెలియుదమింక"ని తానుపదేశించుట ఆపెను. అపుడా మీన గర్భస్థ పురుషుడు "పరమేశ యింక, గలయంత వట్టును గడమ కారుండి, ఆనతి యిచ్చి కృతార్థుగావింపు మూనిన దయ"నని శివుని వేడగా, శివుడాపురుషునితో 'నీ వెవ్వరవు? ఎట్లిట కేతెంచితి'వి? మున్నగు వివరములను అడుగగా, ఆతడు మీన గర్భస్థుడయిన విధము నంతటిని దెల్పి, "... ఆ యోగ విద్యావిధంబు, వినుచుండి యంతయు విని విని గిరిజ, యూకొన మఱచిన నూకొనుచుంటి"నని దెల్పి యాతనిని మన్నింప వేడుకొనెను ఈశ్వరు డీ విషయము నంతటిని పార్వతికి దెల్పి తన పుత్రుని మత్స్యోదరము వెలువడి రమ్మనెను ఆతడటు లేతెంచి, తండ్రి పాదాబ్జములకు నమస్కరించి నిల్చుండగా, పార్వతి యా పుత్రుని కౌగిట చేర్చి అనుగ్రహించినది శివుడాతనికి వరమొసగెదను వేడు మనెను అపుడా పుత్రుడు పార్వతికి తెల్పిన యోగ రహస్యములోని కడమ భాగమును దెల్పి తనను కృతార్థుని జేయవలసినదని వేడికొనగా, శివుడు "తనయ యీ యోగ విద్యా రహస్యము లొనర గర్భస్థుని కొసగ గావింక వినుము చెప్పెద నది వివరంబుగాగ" నని దెల్పి, ఆ కుమారుని సిద్ధాసనమున కూర్చుండ బెట్టి, హస్తమస్తక సంయోగముచే దీక్ష నొసగి, మొదటి నుండియు యోగ

రహస్యముల సన్నిధిని దెల్పి అఖిల సత్ సిద్ధులకెల్ల గురుడవై వర్తింపు చుండుమని దెలిపి, మీనోదరము నుండి వెల్వడినందున నాతనికి మీననాధుడను పేరిడి (మత్స్యేంద్రనాధుడనునది కూడ యీతనికే మరియొక పేరని విజ్ఞుల యభిప్రాయము) పార్వతీ పరమేశ్వరు లాతని జూచి సకల తీర్ధములను సేవించి గుహా నివాసుడవై యోగాభ్యాసమున నుండమని తెలిపిరి.

కొంతకాలమునకు కలియుగ మారంభమయినది, (ఇట్లనుటవలన నీకథ కలియుగమునకు పూర్వమే జరిగినట్లు భావింపనంసియున్నది) ఈశ్వరుని యానతి చొప్పున మీననాధుడు తీర్థములు, గిరులు దేవాలయములు తిరిగి మాళవ దేశము జొచ్చి, అట రాజ రాజ నరేంద్రుడు ధర్మబద్ధుడై పరిపాలించుట నెరిగి, మాంధాత పురమునకు సమీపమునగల కాంతారమున గిరి గుహాయందుండి యోగాభ్యాసము చేయుచుండెను కొంతకాలమైన పిమ్మట గోరక్షా, చౌరంగి, విరూపాక్ష, ఖణికాదులకు దీక్ష నొసగి, పశ్చిమాంబుధి తీరమున కేగినాడు ఆ సమయమున నడవి రాజు మృతి జెందగా, పరకాయ ప్రవేశముచే మత్స్యేంద్రుడా రాజు శరీరమున ప్రవేశించి, మరల తాను వచ్చువరకును తన శరీరమును జాగ్రత్తతో కాపాడుమని శిష్యులకు తెలిపి, సంసారసుఖము ననుభవించుట కేగినాడు మీననాధుడు రాజై పండ్రెండుగురు భార్యలను వివాహమాడి, రాజభోగముల ననుభవించుచుండెను కొంతకాలమున కాతనికి పెద్ద పట్టమహిషి యందు పుత్రు డుద్భవిల్లెను మీననాధుడానందనుని మోహమున జిక్కి తన తొంటి విజ్ఞానమునంతటిని మరచియుండగా, అతని నా భోగ విముఖుని గావించి మరల యోగ మార్గమునకు తెమ్మని చౌరంగినాధుడు గోరక్షనాధుని పంపినాడు గోరక్షనాధుడు రహస్య ప్రకారమున మీననాథుని దరికి జేరి ఈశ్వరు డుప దేశించిన రాజయోగము నంతటిని మరచి యిట్లు సుఖ భోగముల ననుభవించుట తగదుగాన, మరల తన శరీరమున ప్రవేశించి, యోగమార్గ రతుడు కావలెనని హెచ్చరింపగా, సంసార సుఖములందలి వాంఛ యింకను దీరలేదనియు కాన తాను రాజాలనని పలుకగా, గోరక్షకుడు మరల మరల నాతనిని హెచ్చరించి విఫలుడై తుదకా పుత్రుని మోహముననే నాతడు రాకున్నాడని యెరిగి, ఆ

పుత్రుని గొని తెచ్చి మత్స్యేంద్రుని యెదుటనే ఖడ్గముతో నరికివైచినాడు మత్స్యేంద్రనాధు డపుడు తన యజ్ఞానము నంతటిని తెలిసికొని గోరక్షకునితో నేగి, యధాప్రకారము యోగమార్గమున జరింపు మండెను.

మీననాధుడు లేక మత్స్యేంద్రనాధుడు నాధ సంప్రదాయ ప్రవర్తకులలో ప్రధమాచార్యుడు నేపాల్ దేశీయులీతనిని అవలోకేశ్వరుని అవతారముగ కాలమార్గ ప్రవర్తకుడుగ భావింతురు అనేక సాధన మార్గములకీతడు ప్రవర్తకుడని ఆయా మతస్థులు విశ్వసింతురు ఈతనినిగూర్చిన కథ లనేకములు సామాన్య ప్రజలలో వ్యాపించియున్నవి ఈ కథ లన్నిటిలో విభిన్నాంశము లనేకము లున్నప్పటికిని, సామాన్యాంశ మొక్కటి గలదు గోరక్షనాధుడు (ముఖ్య) శిష్యుడని ఎల్ల కథలును ఉద్ఘాటించుచున్నవి

మీననాధుడు శివునియొక్క వీర్యము వలన మత్స్యోదరమున జన్మించి మత్స్యేంద్రుడు, మీననాధుడు నను నామములను పొందినట్లు గౌరన వర్ణించినాడు. ఈతడీకథ నెందుండి గ్రహించెనో యెరుగరాదు. మత్స్యేంద్రనాధుని నామము అనేక రూపాంతరములతో అనేక స్థలములందు కనబడుచున్నది యోగ సంప్రదాయమందీతడు 'మచ్ఛందర నాధుడు'గ పేర్కొనబడినాడు సంస్కృత గ్రంథములందు మత్స్యేంద్రనాధుడుగనే యున్నది మత్స్యేంద్రనాధుడు రచించిన పుస్తకములు కొన్ని నేపాలు దర్బారు పుస్తకాలయమందున్నవి, అందు 'కౌలజ్ఞాన నిర్ణయమనునది ఒకటి[36] 'కౌలజ్ఞాన నిర్ణయము' యొక్క లిపిని బట్టి మహామహోపాధ్యాయ, పండిత హర ప్రసాద్ శాస్త్రిగారీ గ్రంథము క్రి శ. తొమ్మిదవ శతాబ్దమున రచియింపబడియుండునని నిర్ణయించిరి డా ప్రబోధ చంద్ర బాగ్చిగారు, పై కాలజ్ఞాన నిర్ణయముతో బాటు మత్స్యేంద్రనాధుడు రచించిన, మరి నాల్గు పుస్తకములను—అకుల వీరతంత్రము—ఎ, అకుల వీర తంత్రము—బి, కులానందము, జ్ఞానకారిక-సంపాదించి ప్రకటించిరి అందు వీరీ గ్రంథముల రచనా కాలము, హరప్రసాద్‌శాస్త్రిగారు చెప్పినటుల తొమ్మిదవ శతాబ్దము కాదనియు, క్రీ శ. పదునొకండవ శతాబ్దమయి యుండుననియు

---

౩౬ నాథ సంప్రదాయ్, పు ౩౭

నిర్ణయించిరి. ఈ పొత్తములందు మీననాథుని నామమనేక విధములుగ పేర్కొనబడినది కౌలజ్ఞాన నిర్ణయమందు–మచ్ఛఘ్నపాదుడు, మచ్ఛేంద్ర పాదుడు, మీనపాదుడు' అని గలదు ఆకుల వీరతంత్రములందు, మీనపాద మచ్ఛేంద పాదులని గలవు కులానంద మందు 'మత్స్యేంద్ర' యని గలదు. జ్ఞానకారిక యందు 'మచ్ఛింద్రనాథపాదు' డని గలదు మచ్ఛింద్ర, మచ్ఛిఘ్న, మచ్ఛేంద్ర, మచ్ఛేంద మున్నగుపదములన్నియు మత్స్యేంద్ర యను శబ్దము యొక్క అపభ్రంశరూపములయి యుండును. గాని, మత్స్యేంద్ర శబ్దముయొక్క ప్రాకృత రూపమయియుండునని చెప్పజాలము ఈతనికి మత్స్యేంద్ర నాథుడను పేరు ఏల గల్గినదను విషయముపై విమర్శకు లనేక విధములగు యూహలను వెలిబుచ్చియున్నారు హరప్రసాద్‌శాస్త్రిగారీతడు మత్స్యములను బట్టి చంపు చుండెడి వృత్తియందుండెనని అనిరి 'కౌలజ్ఞాన నిర్ణయము'ను బట్టి[37] ఈతడు బ్రాహ్మణ జాతియందు సంభవించినట్లు తెలియుచున్నది అందీతని కథ యిట్లు గలదు 'కులాగమ శాస్త్రమును కార్తికేయు డపహరించి సముద్రమందు పార వైచినాడు ఆ శాస్త్రమును వెలికి తీయుటకై శివుడె, మత్స్యేంద్రనాథుని అవతార మెత్తి, సముద్రములోని కేగి, ఆ శాస్త్రమును మ్రింగినమత్స్య మొక్క గర్భమును చీల్చి ఆ శాస్త్రమును పైకి తెచ్చినాడు అందువలననే అతడు 'మత్స్యఘ్న'డని పేర్కొనబడినాడు తంత్రాలోకమందు ఆ తాన వితాన వృత్త్యాత్మకమగు జాలమును విచ్ఛిన్న పరచు వాడుగ పేర్కొనబడినాడు[38]' 'మచ్ఛ' అనగా చపల చిత్తవృత్తి యనియు, దానిని నాశము చేయు వాడను నర్థమున తంత్రా లోక టీకాకారుడు జయరథుడు వివరించి యున్నాడు[39] ఇవన్నియు నిట్లుండగా, గొరన శివుని వీర్యము వలన మీనోదరమునుండి అతడు జన్మించినట్లు ఎట్లు వ్రాసినాడో తెలియవచ్చుట లేదు.

---

౩౭ "మచ్ఛాః పాశాః సమాఖ్యాతాశ్చపల చిత్తవృత్తయః'
ఛేదితాస్తు యదాతేన మచ్ఛన్దస్తేన కీర్తితః"

౩౮ రాగారుణగ్రంథి విలాపకీర్ణ యో జాల మాతాన వితానవృత్తి
కలోచ్ఛితం బ్రాహ్మ పథే చకార స్యా మే సమచ్ఛంద విభుః ప్రసన్నః"

౩౯ నాథ సంప్రదాయ్, పు. 44-47.

సాహిత్యమందు మీననాథుని గూర్చిన కథ వేరొక విధముగ నున్నది

దేవతల సృష్టి మొదట జరిగినది. పిమ్మట నలుగురు సిద్ధులు సృష్టింప బడిం వారు మీననాథుడు, గోరక్షనాథుడు, జాలంధరనాథుడు, ఖణికుడు, పిమ్మట గౌరీదేవి జన్మించినది ఆమెను శివుడు వివాహమాడినాడు. సిద్ధులు నల్వురును వాయుభక్షణము గావించుచు తపస్సు చేయుచుండిరి ఒకపర్యాయము శివుడు పార్వతికి జ్ఞానోపదేశమును క్షీరసముద్ర తీరమున గావించుచుండగా మీననాథుడు రహస్యముగ మత్స్యము వేషము ధరించి, సముద్రము లోపలినుండి దానిని వినసాగెను శివుడు దీనిని తెలిసికొని మీననాథుని ఒకప్పుడు ఈ జ్ఞానము నంతటిని మరచిపోదువని శపించినాడు

నల్గురు సిద్ధులును నాల్గు దిశలందు తపము గావించుట కేగిరి. కొంత కాలము జరిగిన పిమ్మట పార్వతి వారికి వివాహము గావింప దలచినది. శివుడు వారికి కామవికారము లేదని ఆమెతో పల్కగా, పార్వతి వారిని పరీక్షింప దలచి వారి నందరను బిలచి, భువనమోహనమగు స్త్రీరూపమును దాల్చి, వారికి భోజ నము లిడినది ఆమె సౌందర్యమునకు పరవశుడై యిటువంటి స్త్రీ లభించినచో ఒకరాత్రి ఆమెతో గడపవచ్చునుగదా యని మీననాథుడు తలపోసెను పార్వతీ దేవి యాతని తలంపెరిగి, అతడు 'మహాజ్ఞానము' నంతటిని మరచి, కదలీదేశ మందు పదునారువందల మంది స్త్రీలతో కూడి కామోపభోగముల ననుభవించు చుండునని శాప మొసగినది జాలంధరనాథు డట్టి రూపవతియగు స్త్రీ గృహమున సేవకుడుగ నుండినను జీవితము ధన్యమగును గదా యని భావింపగా, పార్వతి యాతడటులే రాణి గృహమందు సేవకుడగునట్లు శాప మొసగినది జాలంధరుని పుత్రుడు[40] యిటువంటి స్త్రీకొరకు కాళ్ళుచేతులు నరుకబడినను జీవితము సఫల

40 ఈతని పుత్రుని ప్రసక్తి కథాభాగమున యింతకు పూర్వ మెచ్చటను గాన బడలేదనియు, ఇచట మాత్రమే కనుపించుచున్నదనియు ద్వివేదిగారు వ్రాసిరి అందువలన ఈ శాపము చౌరంగినాథుని పుత్రునకుగాక చౌరంగి నాథునకే కలిగినదని మనము ఊహించవచ్చును
—నాథ సంప్రదాయ్. పు 46

మగునుకదా యని భావించినాడట! దీనికి ఫలముగనే అతనికి కామార్తురాలగు సవతితల్లిచే అవమానింపబడి కాళ్ళుచేతులు నరుకబడునని శాపము లభించినది ఋషికు డిట్టి సుందరికొరకు ప్రాణములనయినను అర్పింతునని భావింపగా నాత డటులే కావలయునని శపించినది గోరక్షనాథుడు మాత్రము కామ వికారము నకు లోనుగాక యిటువంటి సుందర స్త్రీ తనకు ప్రేమమయ మాతృమూర్తిగ లభించిన నెంత బాగుండునో యని తలచినాడు. పార్వతీదేవి అతని నింకను ననేక విధములుగ పరీక్షించి వరముల నొసగి పంపినది పార్వతీదేవి శాప ముల ప్రకారము, నాథసిద్ధులందరును తమతమ శాపముల ననుభవించుచుండిరి. గోరక్షనాథుడు తప మొనరించుచుండగా, ఋషికు దేతెంచి, అతని గురువయిన మీననాథుడు 'మహాజ్ఞానమును' మరచి కదలీదేశమందు స్త్రీలతోకూడ విహరించు చున్నాడనియును, అతనికింక మూడు దినములు మాత్రమే యాయువు గలదని దెలిపి, మొదట యమధర్మరాజు నికేతనమున కేగి, గురువున కాయు క్షీణత లేకుండ గావించినాడు పిమ్మట మీననాథు డున్న కదళీదేశమున కేగి, అట మీన నాథుడు, పట్టపు రాణులతోగూడ విహరించుచుండెనని తెలిసికొని, నర్తకి వేష మును ధరించి, మీననాథుని సమక్షమున కేగినాడు. అట మృదంగ ధ్వనిచే, గోరక్షనాథుడు మీననాథునకు పూర్వజ్ఞానము నంతటిని స్మరణకు దెప్పించి, జ్ఞానోపదేశమును గావించినాడు మీననాథు డద్దానితో చైతన్యవంతు డాయెను రాణు లాతని పుత్రుడయిన, బిందునాథుని [41] అతని సమక్షమునకు గొనితెచ్చి, అతని మరల మోహింపజూచిరి. కాని గోరక్షకు డా బాలకుని జంపి, మీన నాథుని తనతోగూడ గొనిపోయి, ఆ బాలకుని మరల పునరుజ్జీవితుని గావించి, తత్త్వోపదేశమును గావించినాడు.

యోగ సంప్రదాయావిష్కృతియందు కూడ మత్స్యేంద్రనాథుని కథ స్వల్ప భేదములతో నించు మించిదే విధముగ నున్నది.

నాథ చరిత్ర యందీవిధముగ నున్నది మీననాథుడు రాజు మృతశరీర మున ప్రవేశించి సంసార వ్యామోహమున నుండగా. హరిద్వారక్షుండు జరిగిన

---

41. గౌరన మంజునాథుడని రచించినాడు.

యోగుల సమావేశమున నొక యోగి, గోరక్షుని గురువు సంసార లంపటమున జిక్కుకొనినాడని, ఆతని నవహేళనము గావించినాడట అపుడు గోరక్షుడు మత్స్యేంద్రనాథునియొద్ద కేగి ఆతని పూర్వ జ్ఞాన స్మృతిని కల్గించి తోడ్తెచ్చి నాడు ఇందు గూడ నితడు రెండు పర్యాయములు సంసారచక్రమునందు తగు ల్కొనినట్లు వర్ణింపబడినది పిమ్మట మత్స్యేంద్ర గోరక్షనాథులు కదళీవనమున కేగి యోగవిషయములను చర్చించుచుండిరి

ఈ కథలు దేనియందును మీననాథుడు శివుని వీర్యమువలన జనించినట్లు చెప్పబడలేదు ఈతని మహిమను స్పష్టీకరించుటకు గౌరనయే ఈ మార్పును గావించి యుండును ఈ కథల నన్నిటిని పరిశీలింపగా, ఈ క్రింది అంశములు స్పష్టపడుచున్నవి

1. మత్స్యేంద్రనాథుడు గోరక్ష నాథుని గురువు
2 మత్స్యేంద్రనాథుడును చౌరంగినాథుడును సమకాలికులు
3 మత్స్యేంద్రనాథుడు యోగమార్గ ప్రవర్తకుడుగ నుండియు, స్త్రీల సంసర్గమును కూడ నుండెననుట ఇది వామాచార సాధన యేమో నని విమర్శకులు తలంచుచున్నారు [42]

మత్స్యేంద్రనాథుడు కదళీ దేశమున రాజు శరీరమున పరకాయ ప్రవేశము చేసి స్త్రీలతో సుఖించెనని వర్ణితమైనది ఈ కదళీ దేశమునకే స్త్రీ దేశమను నామాంతరము గలదనియు, స్త్రీదేశమనునది పూర్వము హిమాలయపర్వత ప్రాంతమందలి బ్రహ్మపురమున కుత్తర భాగమనియు చెప్పుదురు కామరూప దేశమే స్త్రీదేశమని కొందరి తలంపు మహాభారతమందలి ఆరణ్యపర్వమునకూడ కదళీ వన ప్రసక్తి గలదు [43] ఈ కదళీదేశమందు అశ్వత్థామ, బలి, వ్యాసుడు, హనుమంతుడు, విభీషణుడు, కృపాచార్యుడు, పరశురాముడు, వీరేడ్గురును చిరంజీవులుగ సదా నివసింతురని గలదు ఈ కదళీ వనమునకు పైగా, దురా

42 నాథ సంప్రదాయ్, పు. 52, 58

43. వన పర్వము, అ 146.

రోహ పర్వతము గందనియు, ఆ పర్వతము వరకు మనుష్యు లేగలేరనియు, సిద్ధులు మాత్రమే ఆ పర్వతమును చేరగలరనియు హనుమంతుడు భీమునితో చెప్పినట్లు గలదు [44] దీనినిబట్టి యీ కదళీవన మనునది నేటి డెహరాడూన్ నుండి ఋషీకేశ, బదరికాశ్రమములను, వీని కుత్తరములో హిమాలయ ప్రాంతము వరకు గల ప్రదేశము కదళీ వన ప్రాంతమని కొందరి తలంపు [45] కాని స్త్రీదేశ మనునది, కామరూపమేనని మరికొందరు తలంచుచున్నారు కాని స్త్రీ దేశము కామరూపమే ననియు (నేటి అస్సాము ప్రాంతము) మత్స్యేంద్రనాథుడు కామ రూప ప్రాంతమందలి చంద్రగిరి యను ప్రదేశమున జన్మించి, అటనే మొదట ఒక ప్రకారమగు యోగ మార్గావలంబకుడుగ నుండి పిమ్మట స్త్రీలసాహచర్యము ప్రాధాన్యము వహించునట్టి వేరొక్క మార్గము నాత డవలంబించెననియు, శ్రీ హజారీ ప్రసాద్ ద్వివేదీ గారభిప్రాయపడిరి [46] వీరిటు లీ ప్రాంతము పూర్వ ప్రాంతమున నున్నదని యభిప్రాయపడి యుండగా గౌరన, మత్స్యేంద్రనాథుడు పొంగారు పశ్చిమాంబుధి తీరమునను, మంగళావృతమగు మహనీయమైన పుట భేదనము డాయబోవుడు వేళ"—అట పురీశుడు మృతుడయినట్లును, ఆ మృత శరీరమున నీ యోగి ప్రవేశించినట్లు రచించినందున అతడు స్త్రీల సంసర్గము తో గడపిన దేశము పశ్చిమాంబుధి తీరమున నున్నది కాని పూర్వ సముద్ర ప్రాంతమున గాదని భావింపవలసియున్నది. కాని 'నా చరిత్ర' యందు

---

44 వన పర్వము. అ 146, 92-93

45 నాథ సంప్రదాయ్, పు. 55.

46. "ఇన్‌సారే వక్తవ్యోంకా నిష్కర్ష్ యహ్ హైకి మత్స్యేంద్రనాథ్ చంద్ర గిరి నామక్ స్థానమే పైదాహుయేథె, జో కామరూప్‌సే బహుత్ దూర్ నహీ... ఇతనా నిశ్చిత్ హై కి వహ్ స్థాన్ పూర్వ భారత వర్ష మే కామరూప్‌కే పాస్ కహీం థా; ...శురూ శురూమే వహ్ ఏక ప్రకార్‌కీ సాధనా కి ప్రవర్తలే చుకేథె, పంతు బాద్‌మేకిసీ ఐసీ ఆచార్ మే జా ఫర్‌నేథే కిన్‌మే స్త్రీయోంకా సాహచర్య ప్రధాన్‌థా ఔర్ యహ్ ఆచార్ బ్రహ్మచర్య జీవన్‌కా పరిపంథీథా, వే ఇన్ స్థాన్‌మే ఇస్ ప్రకాకే నయే ఆచార్‌మే ప్రతీ హుయేథే, వహ్ స్థాన్ స్త్రీ దేశ్, యా కదలి దేశ్‌థా, తో కామరూప్ హీ హో సకతా హై"—

నాథ సంప్రదాయ్, పు. 55-56

కామరూపమున, మత్స్యేంద్రుండు తపము గావించుచున్న సమయమున. నా దేశపు రాజు మృతి చెందెననియుఁ మీననాథుడందు ప్రవేశించెననియు చెప్పి, 'కామరూపమును' స్పష్టముగ పేర్కొనుట వలన, మత్స్యేంద్రుడేగినది తూర్పు సముద్ర ప్రాంతమునకే నని మనము నిశ్చయింపవచ్చును గౌరన కేవలము పశ్చిమాంబుధి తీరమని మాత్రమే చెప్పినాడుగాని, కదళీవన స్త్రీ దేశములను గూర్చి గాని కామరూపమును గూర్చి ఏమియు పేర్కొనలేదు కళింగ, బంగాళాది దేశములు సంచరించినట్లు చెప్పెనుకాని, కామరూపమును గూర్చిచెప్పలేదు లేక ఈ విషయమై పండితులతో ఏకాభిప్రాయము లేదేమొ, ఏలయనగా, గౌరన యీ దేశము పశ్చిమాంబుధి తీరమున నున్నదనుటయు మాత్రమే గాక, గోరక్షనాథుడు మరల నీతనిని గొని పోవుచున్న సమయమున, వీరు నర్మదా నదిలో గృత స్నానులైరనియును (పు 96) పిమ్మట యుజ్జయినీ పురమున కేగి మహాకాళిని గొల్చిరనియును (పు 168) చెప్పినాడు నర్మదానదియుఁ ఉజ్జయినీ పురియు, నేటి మధ్య ప్రదేశ్ ప్రాంతము లోనివి కావున గౌరన యుద్దేశ్యమున, మత్స్యేంద్రనాథుడు రాజుగ నుండిన దేశ మీ మధ్య ప్రదేశ్ ప్రాంతమునకు సమీపమున నుండియుండవలయును. ప్రథమాశ్వాసమున గౌరన మీననాథుడు మాళవ దేశమున తపము గావించుకొనుచుండెననియు, తరువాత ఆ దేశపు రాజ కుమారుని సారంగధరుని సిద్ధులతో చేర్చుకొనెనని వ్రాయుట కూడ ఈ యూహకు బలమును గూర్చుచున్నదే నవనాథ చరిత్ర పీఠికా కారులు నవనాథుల చర్యలకు ప్రధాన రంగము మహారాష్ట్ర దేశ భాగముగా గనపడుచున్నదని వ్రాసిరి

## సారంగధరుడు

ఈతడు మీననాథుని తొలి శిష్యుడుగ పేర్కొనబడినాడు సారంగధరుని కథ చాలాకాలమునుండి ఆంధ్ర దేశమునకు సంబంధించినదిగను, రాజమహేంద్ర వర రాజునకు సంబంధించినదిగను నెన్న బడుచున్నది ఇట్లెందుకు భావింప బడుచున్నదో తెలియదు ఒకవేళ దీనికి కారకుడు 1[?]వ శతాబ్దమున నుండిన త్రిప్పకవియే యయి యుండవచ్చును ఈ కథ రాజమహేంద్రవరమును పరి పాలించిన రాజరాజ నరేంద్రునకు సంబంధించినదిగా ప్రజల యందు విశ్వాస మేర్పడిన పిమ్మట ఈ కథా విశేషముల కా ప్రదేశములందు స్థల నిర్దేశమును గూడ

నేర్పరచి యుందురు రాజమహేంద్రవరమున నిప్పటికిని సారంగధర మెట్ట, సారంగధరుని కాలుసేతుల నఱుకబడిన స్థలము, చిత్రాంగి మేడ, మున్నగు వానిని చూపుచు నీ కధను ప్రజలు విశేషముగ చెప్పుకొందురు అప్పకవి సారంగధరుని గూర్చి చెప్పిన కధ యిది అప్పకవి తెనుగున ఘన కావ్యము నొకదానిని చేయవలసి యుండగా, అతనికి స్వప్నమున, నాతని కులదైవమగు కామెపల్లి గోపాలకృష్ణు డగపడి

"స్వశ్రేయసమబ్బు నీకు నిక సిద్ధము నన్నయ ఫక్కి యాంధ్రముం
జేయుము మా యనుగ్రహముచే గవు లచ్చెరువంది మెచ్చగన్"

అని చెప్పినాడు కాని, నన్నయ (రచించిన ఆంధ్ర శబ్దచింతామణి) ఫక్కిని గూర్చి యప్పకవి కేమియును తెలియదు కావున దానిని గూర్చి కూడ యా దైవము అప్పకవికి వినిపించినాడు నన్నయభట్టు మొట్టమొదట 'ఆంధ్ర శబ్ద చింతామణి' యను లక్షణ గ్రంథమును రచించి, దానికి లక్ష్యముగనే భారతము నాంధ్రీకరించినాడు కాని తన రాఘవ పాండవీయమును నన్నయ యణచివేసినాడను క్రోధమును బూని, భీమన ఆంధ్ర శబ్ద చింతామణి నణచి వేసినాడు అట్టి గ్రంథము అణచివేయ బడుటవలన, నాంధ్రమున సూత్ర సంపాదన లేకపోయినది. ఇట్టు సూత్ర సంపాదన లేకపోవుటచే ఆదిని శబ్ద శాసన మహాకవి చెప్పిన భారతములో నేది రచింపగాబడెనో దానిని కాని దెనుగు పలుకు మరొకట్టిటి గూర్చి చెప్పగా రాదని దక్షవాటి కవి దాతసుడొక నియమమును జేసినాడట! కాని దక్షవాటి కవి దాతసుడనగా భీమనయే గాని, వేరొకడుగాడు, అతడే నన్నయ భారతమున చెప్పిన వాక్కులే ప్రమాణముగా గైకొన వలెనని చెప్పెననుట అంతగా విశ్వసనీయములు గాకున్నవి. కాని నన్నయ రచించిన యాంధ్ర ఫక్కి నెరిగిన వాడు రాజరాజ నరేంద్రుని పుత్రు డయిన సారంగధరుడు గలడనియు అతడు శైశవమున నన్నయ రచించు నపుడే నాతని యొద్ద పఠించెననియు, సారంగధరుడు తండ్రి కాళ్లు సేతులు నఱికింపగా, మత్స్యేంద్రనాథుని కృపవలన, నాతనికి శిష్యుడై, సిద్ధుడై "మొన్నటి కీలక సంవత్సరమున" మతంగ పర్వతమువద్ద నీ వ్యాకరణమును బాలసరస్వతి కొసగెననియు, దానికితడు టీకను వ్రాసెననియు. ఈగ్రంథము,

మతంగ పర్వమున గల విప్రునొకని వలన, అప్పకవి గృహము చేరెననియు, దానిని రచించుటలో తానాతనికి తోడ్పడుదుననియు, నా గోపాలకృష్ణుడప్పకవికి చెప్పెనట

కాని శాసనమువలన గుర్తింప దగినవరకును రాజరాజున కమ్మంగదేవి, దేవదేవి యను భార్యలును, రాజేంద్రచోళుడను పుత్రు డుండినట్లును మాత్రమే తెలియు చున్నది. కాని, రత్నాంగి, చిత్రాంగియను భార్యలు గాని, సారంగ ధరుడను పుత్రుడుగాని ఉండినట్లు తెలియుటలేదు. రాజరాజు పుత్రుడయినచో సారంగధరుడప్పకవి కాలమునాటి కారువందల యేండ్ల వాడయి యుండును ఈ కిథ నంగీకరించినచో దీనిని కూడ మనము విశ్వసింప వలసి యుండును కాని యీ కథను అప్పకవియే కల్పించెనని ఊహింప వీలగుచున్నది గౌరన, సారంగధరుడు మాళవ దేశాధిపతి, రాజమహేంద్రుని కుమారుడని ప్రశంసిం చెన ఇంకను సారంగధర చరిత్రను ప్రబంధముగ సూర్చిన చేమకూర వేంకటకవి (17వ శ) కూడ నీతడు మాళవ దేశాధీశుడనియె ప్రస్తుతించెను

"మహిని రాజరాజనరేంద్రుడు మాళవపతి
రాజరాజ నరేంద్రుడు రాజరాజు
ననగ పేరెన్నికకు నెక్కి యతిశయిల్లు
నింద్ర విభవుండు రాజమహేంద్ర విభుడు"

(సారంగధర చరిత్ర 1-౬)

'విషాద సారంగధర'ను నాటకముగ తీర్చిదిద్దిన ధర్మవరము కృష్ణమాచార్యులు గారుకూడ "మాళవ దేశపు రాజగు రాజరాజనరేంద్రుని సభను వర్ణింపుమ"ని మాళవ దేశముగనే పేర్కొనిరి సారంగధర చరిత్రను ద్విపదలుగ తీర్చి దిద్దిన బాణాల శంభుదాసుడు, కూచిమంచి తిమ్మకవులు మాత్రము వీరిని ఆంధ్ర దేశస్థునిగ వర్ణించిరి అప్పకవి చెప్పిన కథ నాధారముగ జేసి కొనియో, లేదా ఆంధ్ర దేశమునకు సంబంధించినదని చెప్పినచో నాంధ్రులు ఉత్సాహవంతముగ వినదురనియో వీరిట్లు రచించియుందురు. మహారాష్ట్ర

దేశస్థులగు ధార్వాడ కంపెనీ వారీతనిని మాళవాధిపతిగనే పేర్కొనిరి [47] కావున నీతడు మాళవాధిపతి యనుటయే సమంజసముగ నుండును. కాని నామ సామ్యమునుబట్టి ఈ కథకాంధ్రదేశముతో సంబంధము గూర్చబడి యుండును మాళవదేశాధీశుడు రాజమహేంద్రుడని గౌరన తెల్పియున్నాడు మన రాజమహేంద్రవరమును పాలించిన రాజరాజునకుకూడ రాజమహేంద్రుడను పేరున్నట్లు, నన్నయ భారతమున పేర్కొనబడినది ఈ నామ సామ్యమునుబట్టి పొరబాటు దొర్లియుండవచ్చును భాస్కరశతకమున, సారంగధర చిత్రాంగు లిర్వురును పేర్కొనబడిరి

ఉ "అంగన నమ్మరాదు తన యంకెకు రాని మహా బలాఢ్యు వే
భంగుల మాయలొడ్డి చెఱుపందలపెట్టు, వివేకియైన సా
రంగధరుం బదంబులు కరంబులు గోయ జేసె దొల్లి చి
త్రాంగి యనేకముల్ నుడువ రాని కుయుక్తులు పన్ని భాస్కరా!"

కాబట్టి భాస్కరశతక కర్త కాలమునాటికే కథ కాంధ్ర దేశములో మాత్రమే గాక, రత్నాంగీ చిత్రాంగులతో గూడ ముడిపెట్టబడినట్లు పై పద్యమువలన తెలియుచున్నది

"అప్పకవి దీని నా సారంగధరుని కథతో ముడిపెట్టుట కనువగునట్లుగా నాతని కొక సిద్ధుడు తెచ్చియిచ్చెనని యొక చిన్న సూచన యొక ప్రతిలో మాత్రము పీఠికలో గానవచ్చు చున్నదని" తెల్పి ఆ పద్యములను ఈ గ్రంథ పీఠికా కారు లుదాహరించియున్నారు [48]

ఈ పద్యములందు బాలసరస్వతి సిద్ధుడు సారంగధరుడని కాని యాతడు ఆంధ్ర దేశపు రాజకుమారుడనిగాని చెప్పలేదు. ఇంతమాత్రమేగాక, 'నన్నయ మహాకవి యెవరు, సిద్ధుడెవ్వడని అమితాశ్చర్యమును ప్రకటించి వీరిర్వురకును సంబంధ మేమియు లేనట్లుల చెప్పినాడు

---

47 భారతి, మార్చి, 1940–ఒంగోలు వెంకట రంగయ్య

48 నవనాథ చరిత్ర – పీఠిక, పు. XXI

క్రీ శ. 1560 ప్రాంతము వాడయిన దోనేరు కోనేరనాథకవి తన ద్విపద బాల భాగవతమున చంద్రవంశరాజపుత్రులను వర్ణించుచు చంద్రవంశమున చాళుక్య భూపాలునకు జగదేక మల్లుడు, నాతనికి విష్ణువర్ధనుడు, గలిగిరనియు నాతనికి రత్నాంగి యందు విమలాదిత్యుడు, నాతనికి భానుమతి యందు రాజ రాజనరేంద్రుడు గలిగెననియు ఈ రాజరాజనరేంద్రుడు రాజమహేంద్ర పుర మును రాజధానిగ గట్టి వేంగి దేశ మేలెనని దెలిపి,

"ఆ రాజమణి కార్యుడగు పెద్దకొడుకు
సారంగధరుడని శాంతుడై యుండి
ఆసక్తి చినతల్లి యైన చిత్రాంగి
చేసిన యాపద చెచ్చెర గడచి
అనఘుడై చౌరంగి యను సిద్ధుడయ్యె
జననాథ సేతను జగతిపై నిలిచె
అతడె యా దేవతాభ్యాసంబునందు
ప్రతిలేని మొదటి పర్వంబుల మూడి
నందె తెనుంగున నా నన్నపార్యు
డందఱు వెఱగందునట్లుగా నుడువ
అతడు శ్రీకాంత యందాత్మజు గనియె
చతురతో పేంద్ర భు జాళుక్య భీము"

అని గ్రంథాంతమున దెల్పియున్నాడు కాని యీతడు కూడ సారంగధరు నకు నన్నయ ఫక్కితో సంబంధము నేమియు వర్ణింపకుండుట వలనను, యీ వంశక్రమమున చెప్పబడిన నితర రాజులు జగదేకమల్లు, విశ్వేశ్వర, కృష్ణ కందాళ రాయ, కల్యాణ బిజ్జలులు పశ్చిమదేశము లేలిన వారగుటవలనను, ఈ వంశక్రమము రాజమహేంద్రవరమును పాలించిన రాజరాజ నరేంద్రునకు సంబంధించినదిగ తోపకున్నది "ఆ వంశములోని వాడే యైన మాంధాత

పురాధీశుడగు రాజరాజును నామ సామ్యముచే రాజమహేంద్రవర పట్టణమున కధిపతిగా వర్ణించి యాతని కుమారుడగు సారంగధరుని కూడ పేర్కొని పీనిని విజయనగరాధీశుడైన చిన తిమ్మనృపాలుని పూర్వ పురుషులనుగా కవి వర్ణించి యున్నాడు." కావున సారంగధరుని కడకు అప్పకవి ద్వారానే నాంధ్ర దేశముతో సంబంధము కల్పించబడినదని భావింప వీలగుచున్నది.

గౌరన చెప్పిన సారంగధరుని కథ ప్రసిద్ధమే. చిత్రాంగి నీతడు రాజరాజు యొక్క భోగకాంతగా వర్ణించినాడు. తండ్రిచే కాలు సేతులు నరకబడి యడవిలో నేడ్చుచు పడియుండిన సారంగధరుని మత్స్యేంద్రనాథు డోదార్చి, తనయొద్ద సిద్ధుల నన్నిటినొసగి, కృతార్థుని గావించినాడు. ఆ మొండెముల నుండి కరచరణములు మొలచినవి అవి యెరుపులై యుండుటవలన మత్స్యేంద్రు డాతనికి చౌరంగి యను నామమొసగినాడు 'రంగ వర్ణంబై మొలచె, గరములు పదములు గమనీయలీల, నెరుపులై యున్న జాడెరిగి యాతనికి, నరుదార చౌరంగి యను నామ" మొసగినాడు సారంగధరుడీ విధముగ చౌరంగినాథు డయునాడు

గౌరన కథానుసారముగ నీతని జన్మస్థలము మాళవదేశము మత్స్యేంద్రనాథుని విషయమై భిన్నసంప్రదాయముల వారియందు భిన్నభిన్న కథలున్నట్లుగనే చౌరంగినాథుని విషయమున గూడగలవు టిబెట్టు దేశమున పరంపరగ వచ్చుచున్న చౌరంగనాథుని వృత్తాంత మీవిధముగనున్నది. రా వల్పిండి, జైన గ్రంథాలయమున నీతనిచే రచింపబడినవని చెప్పబడుచున్న "ప్రాణ సంకలి"[49] యను గ్రంథము గలదు. ఇందీతడు తాను 'సాలబాహుండను' రాజ పుత్రుడయినట్లు చెప్పికొనెను. తాను మత్స్యేంద్రనాథుని శిష్యుడను, గోరక్షనాథుని సబ్రహ్మచారియు ననికూడ చెప్పికొనెను. సవతి తల్లి వలన నీతని కాలు సేతులు నరుకబడిన కథకూడ యిందు గలదు

---

49 ఈ గ్రంథము చౌరంగినాథ విరచితము కాదేమోనని శ్రీ హజారి ద్వివేదీగారి యభిప్రాయము. నాథ సంప్రదాయ్, పు. 128.

వచ్చితిరి.) ఇట్టి 'నీ-నీయిర్' అనునవి తమిళ ప్రసిద్ధమగు 'అమ్' ప్రత్యయాంత రూపము లనుట యెట్లు పొసంగును? మఱియు 'అమ్' ప్రత్యయము సాధారణ ముగాఁ గ్రియలపై నిల్చి వానిని నామములనుగా మార్చు స్వభావముగలదని వెనుక వచించిన (కాల్డు. ౨౭౯ పుట) (౭౫ II విష. చూడు) విషయము లను దొరగారు స్మరింపక యిట 'యాన్-యామ్' మున్నగు శబ్దముల విషయ మున నుపయోగించుట మిక్కిలి వింత!

౧౦౭. V విష:—"'నా-యా-ఆ' అనువాని వ్యుత్పత్తి:—ద్రావిడోత్తమ పురుష సర్వనామము యొక్క ప్రాథమిక రూపముల వరుస 'నా-యా-ఆ' అను నదియు మధ్యమ పురుష సర్వనామముల వరుస (ముందు వివరించు రీతిని) 'నీ-యీ-ఈ' అనునదియు నగు నపుడు వాని ప్రప్రథమ రూపములు 'ఆ-ఈ' అనునవే యని నిర్ణయింపనగును. ఈ రెండు సర్వనామము లందును దుల్యముగా నున్న 'న' కారము వ్యక్తిని బోధించుచుండఁగా నందలి 'ఆ-ఈ' శబ్దము లుత్తమ మధ్యమ పురుష భేదములను బోధించును. కాఁగా నస్మద్యుష్మ చ్ఛబ్దములగు 'ఆ-ఈ' అనునవి తదిదం శబ్దములగు 'ఆ-ఈ' శబ్దముల కభిన్నము లనఁదగును. ఈ పద్ధతిలో నొక యనివార్యమగు విరోధము తోఁచుచున్నది. ద్రావిడ భాషలలోను నిండో యూరపియను భాషలలోను 'అ' కారము విదూరస్థితిని 'ఇ' కారము సమీపస్థితిని 'ఉ' కారము మధ్యస్థితిని దెల్పు చుండఁగా నీ పద్ధతిలో నన్నిటికన్నను సన్నిహితమగు తన్ను బోధించు నుత్తమ పురుషార్థమును 'ఆ' శబ్దము బోధించుట యెట్లు పొసఁగును? కాని నిర్దేశ సర్వనామముల (అ-ఇ-ఉ) యీదూరాదూరార్థముల వాడుకకు నియ తత్వము కానరాదు. ఉదా:—తమి. 'అవ్విడమ్=(ఆ చోటు) మీరు'. 'ఇవ్వి డమ్=(ఈ చోటు)=మేము.' అని గౌరవార్థకమగు వాడుక వెలసియున్నది. ఇట్లె మలయాళమునందును 'అద్దేహమ్=(ఆదేహము) నీవు. అజ్ఞు=(అక్కడ) నీకు. ఇద్దేహమ్=(ఈ దేహము) నేను. ఇజ్ఞు=(ఇక్కడ) నాకు' అను వాడుకలు వెలసి యున్నవి" (కాల్డు. ౩౭౧, ౩౭౨ పుటలు).

"అకారము మొదటిదియు సుఖ ముఖోచ్చారణము గలదియు నగుట చేత నది యుత్తమ పురుషార్థక మయ్యెను. ఇకారము పై రెండు విషయము లందును రెండవదే యనఁదగును గాన మధ్యమ పురుషార్థక మయ్యెను. చీనా భాషలోను నిట్లె 'అ' కార మస్మదర్థక మనియు 'ఇ' కారము యుష్మదర్థకమనియు 'ఎడ్కిన్స్' దొరగారు చెప్పిరి. తమిళ మలయాళ కన్నడములలో నిట్లు 'ఉ' కారము 'అకార-ఇకారము'లకు నడిమి యుచ్చారణము గలదైయుండ దాని యర్థము మధ్యస్థితిని దెల్పుట ద్రావిడ భాషలయొక్క వింత స్వభావము.

"చేమకూర వేంకటకవి సారంగధర చరిత్రకు పీఠిక వ్రాయుచు నందా కథను మూలమనదగిన చౌరంగికథ నవనాథ చరిత్రము లందిట్లు గలదని ఈ క్రింది కథను వేదము వేంకటరాయ శాస్త్రిలుగా రిచ్చియున్నారు రుద్రపుర మున భువనేశ్వరుడను రాజు గలడు అతనికి చంద్రావతి, శోభావతి యను నిద్దరు భార్యలు శోభావతి సపతిని వేలార్చుటకై యామెపై అంకులు మోపి గర్భిణియగు నామె నరణ్యమునకు వెడలగొట్టించెను ఒక శివాలయముకడ నొక గంధర్వకన్య ఈమెకు మత్స్యేంద్రవ్రతము నుపదేశించెను చంద్రావతియు మునుల యాశ్రమమున నొక సుతుని గని చంద్రశేఖరుడని మునులచే నామ కరణము చేయబడిన యాతనికి మత్స్యేంద్రోపాస్తి నుపదేశించెను ఒకప్పుడు భువనేశ్వరుడు యజ్ఞము చేయుచుండగా మునీశ్వరులతోగూడి ఈకుమారు డచ్చ టకు బోవుటయు యజ్ఞభూమికడ ముని శిష్యులతో బంతులాడుచున్న ఈ కుమా రుని శోభావతి చూచి మోహించి, యాతని బంతి తన చేటికచే దెప్పించికొనెను. బంతి యడుగబోయిన చంద్రశేఖరునకు శోభావతికినిగను పావుర మడగబోయిన సారంగధరునికి చిత్రాంగికి జరిగిన వృత్తమే జరిగినది శోభావతీ ప్రేరణం బున రాజు చంద్రశేఖరుని కాలు సేతులు తలారులచే నరికించెను మత్స్యేంద్ర నాథ స్మరణముచే నాతడు కాలు సేతులు మరల బడసి తల్లి యొద్దకు బోయెను రాజు తథ్యమును దెలిసికొని శోకింప మత్స్యేంద్రనాథు డాతనిచే ప్రాయశ్చిత్త ముగా నొక శివాలయము నిర్మింపజేసెను అదియే బదరికాశ్రమమున భువే శ్వర మను పేర నున్న శివాలయమట!"[50]

చౌరంగ శబ్ద వ్యుత్పత్తిని గూర్చి వేదము వేంకటరాయశాస్త్రిగారు, ఈ విధముగ చెప్పియున్నారు [51] "మోర్స్వర్తుగారి మహారాష్ట్రి నిఘంటువు నందు 'చౌరంగ' శబ్దమునకు కాలు సేతులు కప్పివేయబడుటఅనియు, చౌరంగణ అను పదమునకు కాలు సేతులు తెగగొట్టబడుట యనియు అర్థము లున్నవి షేక్స్ పియరుగారి హిందూస్తానీ నిఘంటువులో 'శారంగి' అనగా కత్తిసాములో నొక విధమైనదనియు, కత్తిత్రిప్పుటలో యెదుట నున్న జంతువు యొక్క నాలుగు

50 నవనాథ చరిత్ర పీఠిక పుటలు, XXIV-XIV

51 భారతి, మార్చి, 2940, పుటలు, XXIF-XIV

కాళ్లను ఒక్క దెబ్బతో తెగగొట్టుట యనియు నున్నది. ఈయాధారములను చూపిన మూల పదము 'చౌరంగి' అని యుండి యుచ్చారణ భేదములచే సారంగ అని మారి యుండవచ్చునని తోచుచున్నది" కాని గౌరన సారంగధరుని నాల్గు మొండెములనుండి రక్తము కారుచు అవి యెరుపు వర్ణము గల్గియుండినందున నాతనికి మీననాథుడు 'చౌరంగి' నాథుడను నామమిడినట్లు చెప్పెనుడు[52] పంజాబీ సంప్రదాయమున కూడ చౌరంగి పదమీ యర్థమునే వాడబడినట్లు కాననగు చున్నది.

సారంగధరుని కథ వంటిది కన్నడ వాఙ్మయమున గూడ 'కుమార రాముని కథ' గలదని యీ గ్రంథ పీఠికలో చెప్పబడినది.[53] మహారాష్ట్ర భాషయందుకూడ గలదు దీనినిబట్టి సారంగధరుని కథ మిగుల ప్రాచీనమైన దనియును, ఆయా దేశముల వారీతని కథను తమ తమ దేశ పురుషులతోను, స్థలములతోను ముడిపెట్టుకొని రనియును, నిట్టి సందర్భమున నీ కథ పెక్కు మార్పులు చెందినదనియు తెలియుచున్నది ఆంధ్రులీకథను రాజరాజ నరేంద్రు నితో ముడిపెట్టుటలో యాశ్చర్యము లేదు. ఈ కథను తమ తమ దేశమునకు సంబంధము కల దానిగ చెప్పికొనినపుడు కథలయందలి వ్యక్తుల నామములను గూడ యాయా దేశముల వారు వారికి తోచిన విధముగ మార్చికొనిరి తెలుగు వారు రత్నాంగీ, చిత్రాంగులను రాజరాజును దెచ్చిపెట్టికొనిరి భాస్కర శతకము కాలమునకే ఈ కథను రత్నాంగీ, చిత్రాంగులతో సంబంధ మేర్పడి నదని పై యుదాహృత పద్యమువలన తెలియుచున్నది దీనిని సత్యమని నమ్ముట కొక చిన్న యాధారము గలదనియును, నెల్లూరు జిల్లా కొవ్వూరు తాలూకాలో పెమ్మారెడ్డి తాళెపు పొలములో నొక ప్రదేశమునకు 'చిత్రాంగికోట' యనియు, యిదే కొవ్వూరు తాలూకా యందు బుచ్చిరెడ్డి పాళెమునకు రెండు మూడు మైళ్ల దూరమున నుత్తరమున ఎల్లబెలువు యొద్ద 'రత్నాంగికోట' గల దని చెప్పుచున్నారు

---

52. అనగా, నాల్గు స్థంములందును రంగునుగల్గిన వాడు, అను నర్థమున ప్రయోగింప బడినదని చెప్పవలసియున్నది
53. నవనాథ చరిత్ర, పీఠిక, పు 25.

మత్స్యేంద్రనాథుడు సారంగధరునకు దీక్ష నొసగిన కొంతకాలమునకు మాల్యవంతమున కేగదలచి తనకు నిత్యమును దుగ్ధముల నొసగి తన్నతి భక్తితో సేవించుచుండి గోపాల బాలకునికి దీక్షనొసగమని సారంగధరునకు చెప్పెను. కాని కొంత కాలమయిన పిమ్మట సారంగధరుడు గురువును దర్శింపవలసి, గోపాల బాలకునికి దెల్పకుండగనే మాల్యవంతమున కేగెను. గోపాల బాలుడు సారంగధరుని గుహలో గానక, వెదకుచు, పరితాపము చెందుచుండగా, మత్స్యేంద్రనాథుడు స్వప్నమున గానుపించి, జరిగిన సంగతిని చెప్పినాడు తన యాజ్ఞానుసారము గోపాల బాలునికి దీక్ష నొసగనందున సారంగధరునిపై కినుక వహించి, అతనికి సిద్ధ సంతతి లేకుండు నని శాప మొసగినాడు అయినను తా నొసగిన యోగ విద్య, కాయ సిద్ధి మున్నగున వన్నియు నెప్పటివలె సిద్ధించు నని అనుగ్రహించినాడు

## గో ర క్ష నా ధు డు

ఈతడు జన్మచే గోపాలుడని గొంత రచించెను గోవులను రక్షించు చుండెడివాడు గావుననే గోరక్షనాథుడయ్యెను ఈతడే మాంధాత పురమున మీననాథునకు నిత్యము దుగ్ధముల నొసగి సేవించుచుండెను ఈతనిని భక్తి తాత్పర్యములను మదియందు మిక్కిలి సంతసిల్లి మీననాథు డీతనికి దీక్ష నొసగి శిష్యునిగ స్వీకరింప దలచి, సారంగధరునితో దీక్ష నొసగ మని దెల్పగా, నాతడు గురువును దర్శింపనలెనని కౌతుహలముచే నాతనికి దీక్ష యొసగకనే వెడలిపోవుటచే, మీననాథుడు స్వయముగ గోరక్షనాథునకు దీక్ష నొసగినాడు. ఈతడు మహా యోగి పుంగవుడై యుండుటయేగాక, మీననాథుడు సంసార సుఖమున బడి కొట్టుమిట్టాడుచున్న సమయమున మరల నాతని యోగమార్గమున ద్రిప్పినాడు పిమ్మట నీతడు గురువు నాజ్ఞను శిరసావహించి యనేక శిష్యులకు దీక్ష నొసంగినాడు దతన ఘోరకుడు, లోకనాధుడు, అచ్యుత నాధుడు, గగన నాధుడు. అవధూతనాదుడు, చంద్రనాధుడు, మయూర సిద్ధుడు, బాల గోవిందుడు, మున్నగు వారీతని శిష్యులు ఈ శిష్యుల నెల్లరను తోడ్కొని యీతడు దేశ సంచారము గావించుచు, శ్రీశైల పర్వతమున కేతెంచి మహిత యోగానంద మగ్నుడై యుండగా, అల్లమ ప్రభువు గోరక్షకుని యొద్ద కేతెంచి అతనికి యోగ తత్త్వమును, శివ రహస్యమును దెల్పి యహంకారమును పారద్రోలినాడు.

అల్లమ ప్రభువువలన జ్ఞానసారము నంత విని తెలిసికొని, మహిమోపేతుడై విరాజిల్లినాడు

## మేఘనాధసిద్ధుడు

మేఘనాధుడు, ఒక శివయోగి వలన విప్ర దంపతులకు జన్మించినాడు యీ విప్ర దంపతు లొకనాడు వనమున గ్రుమ్మరుచు, ఒక కొలనిలో నీరు ద్రావ బోయిరి అపుడొక వ్యాఘ్రము మేతెంచి యా విప్రుని బట్టి సంహరించినది. వనితపైకూడ నది పడబోవుచుండగా, అచట వేటకై యేతెంచిన రాజొకడా పులిని జంపి యామెను కాపాడినాడు. భర్త మరణించిన పిదప తనకు జీవించుట దగదని పల్కి యా వనిత పుత్రుని యా భూవరున కప్పగించి, భర్తతోగూడ సహగమనము గావించినది చనిపోవుచున్న సమయమున నామె తన పుత్రుడొక శివయోగి యనుగ్రహమువలన జన్మించినాడనియును. మేఘములు ఫెళఫెళా రావ మొనర్చుచు గర్జించుచు వర్షించు సమయమున నా పుత్రు డుదయమయి నాడనియును తెల్పినది. ఇట్లామె మరణించిన పిదప మీననాధుడట కేతెంచి యా బాలుని వృత్తాంతము నంత నా విభునివలన విని, ఆ బాలుని బ్రోచుట ధర్మమని తెల్పి ఆతనికి సిద్ధి నొసగుమని తెల్పి గోరక్షుని జూచి కుమారున కుపదేశము గావింపుమనినాడు అపుడు గురు నాజ్ఞ శిరసావహించి, గోరక్షుడా విప్ర తనయుని సిద్ధాసనస్థునిగా జేసి విభూతి స్నానము జేయించి, మత్స్యేంద్రుని శివుని మనమున దలచి, హస్తమస్తక సంయోగమున నాతనికి దీక్ష నొసగి, యోగ సంప్రదాయము నుపదేశ మొనర్చి సిద్ధుల నన్నిటిని నొసగి, సిద్ధ శరీరునిగా గావించినాడు మేఘధ్వనివలన ఇతడు జన్మించుటవలన నీతనికి మేఘనాధుడను నామ మొనర్చినాడు

## విరూపాక్షనాథుడు

మేఘనాధుని తల్లిని వ్యాఘ్రము ముఖమునుండి రక్షించిన భూవిభుడే విరూపాక్ష సిద్ధుడు మహారాష్ట్రాధినాధుని పుత్రుడితడు ఒక దిన మరణ్యమున వేటకేతెంచి, యొక పుళిందునిచే, నట గల యొకే యొక కపోతము

యొక్క గుండెను మ్రింగినచో భూపతియు, శిరమును మ్రింగినచో సిద్ధుడును, మాంసమును దినినవాడు అకలి దప్పికలు లేక పెక్కు సంవత్సరములు బ్రతుకునని తెలిసికొని, ఆ కపోతము నతి ప్రయాసపై బాణముతో గొట్టి, మాంసము నా పుళిందున కొసగి, శిరమును దాను తిని, గుండెను అన్న కొసగి నాడు పూర్వ భవమున తెలియక తల్లిని గవసిన కారణమున మిక్కిలి పశ్చాత్తాపము నొంది, తాను సిద్ధుడు కావలెనని తలంచుచు గంగలో పడి మరణించినాడు మీననాథుడు విప్రసుతునకు దీక్ష నొసగి సిద్ధ శరీరము నొసగిన పిమ్మట తనకుగూడ సిద్ధ దీక్ష నొసగుమని వేడికొని తన జన్మ వృత్తాంతము నంతటిని అతనికి తెల్పికొనినాడు మీననాథు డాతని కోరిక మన్నించి, ఆతనికి గూడ గోరక్ష నాథునిచే దీక్ష నిప్పించినాడు

## నా గా ర్జు ను డు

ఇతడొక రాజు కుమారుడు ఇతడు జన్మించిన వెనుక నొక సిద్ధు డేతెంచి యీతడు రాజు కాడనియును, నొక సిద్ధుడగు ననియును తెల్పినాడు. తండ్రి యీతని కాయా ప్రాయములకు దగినట్లుగ విద్యా సంస్కారోపనయనాది సంస్కారములను గావించి వివాహమును గావించు తలంపున నుండెను ఆ సమయమున నీ కుమారుడు వేటాడుటకై యరణ్యమున కేగినాడు అట వేటాడుచు నొక సూకమును తరుముచు తన పరివారమును విడిచి చాల దవ్వేగినాడు. త్రోవ గానక యడవిలో తిరుగుచుండగ, నెదుట నొక యురగ కళేబర మొకటి గానబడినది. దానిని గాంచి మార్గమున నేగువారెవ్వరైనను, సర్పమని భ్రమించి భీతి చెందుదురో దలచి దానిని చేయి బిగించివేయగా నది పోయి, చేరువన జపము గావించుచున్న యొక మునీశ్వరునిపై బడినది అతడు మిక్కిలి కోపించి రాజకుమారుడు మదముచే పన్నగ శవము నాతనిపై వైచినందున సర్పరూపము నొందుగాక యని శపించినాడు. రాజకుమారుడు తాను ఎవ్వరైనను భయపడుదు రని యా యురగ శవమును దూరమునకు వైచుచుండగా, నాతనిపై ప్రమాద వశమున పడిన దనియును, నెరుగక గావించిన దోషమునకై తన్నిట్లు శపించుట భావ్యము గాదనియు, క్షమించి శాప మోక్షమును వినిపించవలయుననియును దీనుడై ప్రారించినాడు మునీశ్వరు డా రాజకుమారునివలన దోష మేమియును

లేదని యెరిగి, తా నకారణముగ శాప మొసగినందులకు మిక్కిలి చింతించినాడు అయినను తన శాప మమోఘము గావున నది యనుభవించియే తీరవలయు ననియు, కాశి కేగి అట నా తనువును విడిచి పాపముక్తి ని పొందవలెనని తెల్పినాడు రాకుమారుడు ఇంద్రకీల పర్వతమువద్ద శైల సానువులయందు జరియింపుదు నని నిశ్చయించుకొనినంతనే పరమేశు డటకు ధర్మదేవత రూపమును దాల్చి యేతెంచి అకారణముగ శాపము నొసగినందులకు చింతించుచు పశ్చాత్తప్తుడైన ముని పుంగవుని గాంచి, ఊరక చింతిల వలదని ఊరడించి, పూర్వ భవమున నొనర్చిన యొకానొక దోషము కతన, నాతడిట్లు ఉరగరూపము నొందుటకై శాపము నొందినాడని తెల్పినాడు పూర్వజన్మమున నీతడొక రాజపుత్రుడై జన్మించి, వేటాడుటకై గహనమగు నొక యరణ్యమును జొచ్చి, లెరువునయున్న ఘోర భుజంగ కుబుసము నొకదానిని గాంచి, ఆ మార్గమున నేతెంచు విప్ర దంపతుల నుడికింప దలచి, ఉరగ కందుకమును దలదూర్చుకొని చొచ్చి దారుణ లీల వడి బుస్సురనినాడు. ఆ నాదమునకు భీతిల్లి విప్రసుతుడు వణకుచు ప్రాణములను విడిచినాడు. అపుడా విప్రవనిత పాముపలె తన ప్రాణ విభుని వెఱపించిన దోషమునకు సత్యముగనే సర్పము కావలెనని శపించినది కాన నీ భవమున సర్పము కావలసి యున్నదని ధర్మదేవత ఆ మునికి తెల్పినది. మీననాధుని పాద స్పర్శవలన నీతనికి శాప మోక్షము గల్గునని కూడ దెల్పి ఆ మునీశ్వరుని యాశ్రమమున కేగుమనియు, ఆ మునీశ్వరునకుకూడ,నృపున్ని వలెనే సిద్ధ పదము చేకూరు ననియును తెల్పి ఊరడించినది

ధర్మదేవత నుడివినట్లుగనే మీననాధుడు ఋక్షకుని యాశ్రమమును జేరబోవునపు డరణ్యమున పాము నడుమును దిగ్గర ద్రొక్కగా, నది సర్ప రూపమును విడిచి నర రూపమును దాల్చి మీననాధునకు దన వృత్తాంతము నంతయు విన్నవించినాడు తనకు శరీర సిద్ధి ప్రసాదింపుమని వేడగ, మీన నాధు డాతనికి దీక్ష నొసగి, అర్జున కోటరమున నురగ రూపమున నుండుట వలన నాతనికి నాగార్జునుడను నామ మిడినాడు మీననాధుడు మతవ్యాప్తి గావించుటకును, శిష్య పరంపర నభివృద్ధి గావించుటకును తన శిష్యుల నెల్లరును, దేశ సంచారము గావింపుమనగా, నాగార్జును డాంధ్ర దేశమున కేగినట్లును గౌరన రచించినాడు

"మళయాళ బర్బర మగధాంధ్ర పాండ్య
చోళ భూములు చన జొచ్చె విజ్ఞాన
శీలి నాగార్జున సిద్ధు డింపార" (సం. అ-పు 2 1)

నాగార్జునుడు మహీమండలము నెల్ల కలయదిరిగి, యొక్కని దనపేర వెలయ సిద్ధుని జేసి వివిధౌషధముల, మణి మంత్రయోగాది మర్మ కర్మలను, మణిమాది సిద్ధుల నాత్మ ప్రణీత, రసవాద శాస్త్రంబులు దెలిపి, "యాతని నాంధ్ర దేశమునకు బొమ్మని యనిపినాడు నాగార్జునుడు ప్రాలేయగిరి కరిగి మీననాథుని చరణాబ్జములను సేవించుచుండెను

నాగార్జున శిష్యుడు రసవాద పాటవముచే, లోహముల నన్నిటిని పసిడి గావించు నేర్పును గల్గి జగమెల్ల ద్రిమ్మరుచు, శ్రీశైల పర్వత ప్రాంతమున కేగి, తన వాద విద్యావిశేషముచే నా పర్వతము నంతటిని పసిడి గావించి సిద్ధు లెల్లరి యందును నాగార్జున శిష్యుడు ప్రసిద్ధుడను పేరును వహింతునని పల్కినాడు. ఆ గిరి నంతటిని హాటక మయము గావింపబూని ఔషధముల నన్నిటిని సిద్ధ పరచుకొనియుండగా శ్రీ మహా విష్ణువచట కేతెంచి, పర్వతము నంతటిని బంగారము గావించినచో పృథ్వియందు ధర్మ మంతయు నశించుననియును, నిట్టి దోషమును చేయబూనిన నాతని చంపవలెననియును. శిక్షింపగలవా రుపేక్షించినచో దోషమని దెలిసి అతనిని తన సుదర్శనముచే ఖండించినాడు రసవాద సిద్ధులలో నీతడు కడు ప్రసిద్ధుడని తెలియుచున్నది.

## ఖణికాఖ్యుడు

నాగార్జునున కురగము గమ్మని శాప మొసగిన మునీశ్వరుడే ఖణికాఖ్య సిద్ధుడు. మీననాథుడు నాగార్జునకు దీక్ష నొసగి సిద్ధుని గావించిన పిమ్మట నీతడు పనివాళ్ల పాడుచు వంగిన మేను, ముడివడి మడిమెలు మోపవ్రేలాడు జడలును వలచేతి జపమాలికయును, గాలి దూలబడెడు గడ్డంబు జంక, బోల నునిచిన భూతి బుజ్జికాయమును, దూగాడు కుండలంబులును, ధరించి మీననాథుని కడ కేతెంచి యాతని పదములకు నమస్కృతులు గావించి తనకు శారీర సిద్ధి నొసగుమని వేడినాడు. అట్లు వేడగా మీననాథు డాతనితో తపము చేసికొనుచున్న

ఆతనికి సిద్ధత్వము తగదని పల్కి యాతని నా మార్గమునుండి మరల్ప బ్రయత్నించినాడు అప్పుడా మునీశ్వరుడు తనకు సిద్ధి నొసగవలసినదని వేడికొనినాడు

మీననాథు డాతని ప్రార్థన నంగీకరించి,యాతనికి నాగార్జున సిద్ధునిచే దీక్ష నొసగించి సిద్ధుని గావించినాడు. మత్స్యేంద్రు డాతనికి నామము నొసగుచు 'నీతడు తన యజ్ఞానమునకు ననుతాపమున బడి యఘమెల్ల బాపు, కొనె ధర్మ బుద్ధి కెక్కుడు ఖణి గల్గి, కావున నీయోగి ఖణికాహ్వాయమును, భూవలయంబున బొగడొందుచుండు'నని తెల్పినాడు

యోగ సంప్రదాయ నిష్కృతి యందీతడు కరణిపానాథుడుగ బేర్కొనబడినాడు ఇందీతనిగూర్చిన కథ యీ విధముగ గలదు ఒకసారి బ్రహ్మ సరస్వతీదేవియొక్క సౌందర్యమును గాంచి విభ్రమోపేతుడుకాగా అతని తేజస్సు స్ఖలితమైనది దాని నాతడు గంగానదియందు విడిచినాడు ఆ నదినుండి యది యొక గజముయొక్క కర్ణమున ప్రవేశించినది గజకర్ణమునుండి హరిద్వార సమీపమున నీ యోగి జన్మించినాడు

## వ్యాళి సిద్ధుడు

ఈతడు కళ్యాణ కటకము చేరి దేవతానిలయమున నుండగా, ప్రజ లెల్ల రాతనికడకేతెంచి యాతని మహిమను గనుగొని రాజునకు తెల్పిరి రాజాతని మహిమను తెలిసికొని తన యాస్థానమునకు రప్పించుకొని నవరత్నమయ మగు పీఠమున నాసీనుని గావించి యాతనినిగూర్చిన వివరములను ప్రశ్నింపగా, నాతడు తన్నుగూర్చి యీ విధముగ చెప్పికొనెను

''రసయోగ శాస్త్ర నిర్మాతయై మహిమ
నెసగు నాగార్జున కేను శిష్యుడను
వ్యాళి నా పేరా మహాత్ముని కరుణ
నోలి చతుర్వేద యోగ భేదములు

వలయు మంత్రౌషధ మర్మ కర్మములు
తెలిసితి దేహ సిద్ధియును సిద్ధించె
నా గురునాధు నాతని నెల్ల కడకు
నీ గతి బుచ్చ జరియింపుచున్నాడ"          (సం అ పు-౬4౮)

తాను కాయసిద్ధికూడ నెఱుగుదు ననియును, సలసల క్రాగుచున్న తైలమున జరాకృశీభూతమగు మనుజుడు (యోగసాధన సాగక యున్నపుడు) పడి చచ్చి ముద్ద యైనచో నా దేహమున నౌషధావరిపై చినచో నా దేహమునుండి అతడు "ఘన వజ్రదేహుడై కలిత లావణ్య, వినుత యౌవన లీల వెడలి యేతెంచి యిలకెల్ల రౌదయడై యెదు రెఱదులేక, బల పరాక్రమముల" చే భాసిల్లునని తెల్పినాడు ఆ పల్కుల నాలకించి రాజు మరణించిన వ్యక్తి మరల పునరుజ్జీవితుడగుట తా నెందును కని విని యెఱుగలేదనియును, ఔషధములను నమ్మికొని మరణించుట కెవ్వడును సిద్ధపడడనియు, నివి కైతవ క్రియలుగాని నిక్కువము గాదనినాడు అంతల కాసిద్ధుడు క్రాగుచున్న నూనెలో నొకనిని పడవేయుమనియును మరల నాతనిని బడయ లేకున్నచో తన ప్రాణముల నిత్తుననినాడు. అట్లు ప్రాణత్యాగ మొనర్చుట కేమను సంసిద్ధులు గారనియును అందువలన అతనినే నూనెలోని కుఱుక మని తెల్పి, పిదప నుపయోగింపవలసిన యౌషధముల నొసగినచో అతడు బోధించినట్లుగ వైచెదమనినాడు. సిద్ధుడందుల కంగీకరించినాడు గాని రాజులను నమ్ముటకు వీలు లేదనియు, వారు సదా కుటిల వర్తనులును, ననృత భాషా పరాయణులును నగుటవలన తా నౌషధములను అతనికి గాక మంత్రివరుల కొసగెద ననినాడు తాను తప్త తైలమున నుఱుకుదు నరియును, పిమ్మట నౌషధములను తాను నుడివిన విధముగ వేసి తనను బ్రతికింప వలెననియు, అట్లొక వేళ చేయకపోయినచో"

"... విప్రుని గోవు
జాయ స్త్రీ బాలుని జంపిన గతికి
గురు భామ దోబుట్టుగును దమ తల్లి
దెరలక పట్టి పొందినవాని గతికి

జేవాడి బసిడి ముచ్చిలు వాని గతికి
బోవు వారగుదురు..." అని (పుట 26)

వారు కనుక ఒకవేళ నా యౌషధములను వేయనీయకుండునట్లుగ జేసినచో నాతని రాజ్యపదము భంగుననియు, నాతడు సర్వనాశనమగుననియును శాప మొసగినాడు. పిమ్మట నాతడు కాగిన తైలమున బడెను. పిమ్మట నాతని దేహముపై నౌషధములు వైచుటకు సచివులు పూనుకంతలోనే తనకు దెల్పకుండ వేయవలదని రాజనినాడు. అతడు పట్టుదల వహించి మొట్టమొదటి యౌషధమును నెరిగి వేయించినాడు. దానిని ప్రయోగించగనే సిద్ధుని శరీరము, శుద్ధ విశదవర్ణమున, సంయుతంబై మార్దవోపేతమై యొప్పినది. దానిని వీక్షించి నృపాలుడు సిద్ధుని పల్కులు నిజములని తెలిసికొని యీత డొకవేళ బ్రతికినచో, ప్రపంచమున కంతటికిని తానే రాజగునని చింతించి కడమ మందులను వైచకుండ మాన్పించినాడు. మంత్రులు అట్లు చేయుట దగదని వారించినారు. కాని రాజు వారి మాటలు చెవిని పెట్టక, వారిని నివారించినాడు. చేయునదిలేక వారు కన్నీరు కార్చుచు మిన్నకుండిరి. ఆ సిద్ధుని శాపవశమున రాజు సమూలముగ నాశనమయిపోయినాడు. వ్యాళి సిద్ధుడు ప్రజలెల్లరును బల్లిదుడని పూజింపుచుండ బెంపొందినాడు.

## గోరక్షనాథుడు

సిద్ధులు రసవాద, కాయసిద్ధి, మున్నగు విద్యలలో మాత్రమే గాక స్త్రీ వశీకరణ విద్యయందు కూడ నిపుణులుగ నుండిరేమో, గోరక్షనాథుడు, గోరక్షనాథుని శిష్యుడు. ఈతడు, సౌరాష్ట్ర దేశమునందు సోమేశుని దేవాలయమున నుండినపు డా దేశాధిపతి యీతని మహిమనుగూర్చి తెలిసికొని తన పురమునకు తోడ్కొని పోయినాడు. ఈ సిద్ధుడు స్త్రీల వశీకరణ విద్య నెఱుగునని తెలిసికొని తాను కోరిన స్త్రీని తనకు వశమయి తనవద్దకు వచ్చునట్లుగ చేయుమని కోరినాడు. రాజు కోర్కను మన్నించి తన మంత్రశక్తిచే నటులే రప్పించినాడు. రాజా సిద్ధుని మహిమకు మిక్కిలి మెచ్చుకొని అతనికి కనకాంబర భూషణాదుల నొసగి గౌరవించినాడు. అది యెల్లను తన కవసరము

లేదనియును తనకు గురువువలన లభ్యమయిన యోగ ముండగా యితరార్థములతో పనేమియు లేదనిచెప్పి వెడలిపోయినాడు. కాని రాజులు మత్సర పూరితులు. ఇట్టి స్త్రీ వశీకరణ విద్య గల్గి యున్నందున నా యోగి 'ఎవ్వని ప్రియభామినై న,నెలమి రప్పించి నిజేచ్ఛ గ్రీడింప, గలవాడు వీని నే గతినైన జంపవలయు నంచు' ఆత్మ నూహించి అతనిని బట్టి జంపుటకు తన పరివారమును బంపినాడు. కాని వారాతనిని నెన్నివిధముల జంప ప్రయత్నించినను విఫలులైరి అతని యోగశక్తి ముందర వారి ప్రయత్నములు ఫలింపలేదు. ఇక వారేమియు గావింపలేక నాతని నొక పెద్ద లోతైన మడుగులోనికి త్రోసివైచి పైన రాళ్ళు వైచి అతడిక నందుండి లేవజాలడని యెంచి నృపునికీ వార్త నెఱిగింప నేగిరి. ఇట నీ గోరక్కుడు వేవేగముగ బంధన విరహితుడయి, వారికన్న పూర్వామ నృపుని యెదుట కేతెంచి, తన్నుకారణముగనే చంపదలచిన రాజు సమూలముగ నాశన మగునని శాప మొసగి యేగినాడు. ఈ గోరక్కనాథుడే కొంతకాలమయిన పిమ్మట కృష్ణ కందార భూపతిచే, మీననాథు డాచమనము గావించిన స్థలము నందలి పవిత్ర జలములను మరల వచ్చుటకు శివాగారమును నిర్మింపజేసినాడు (ఒకనాడు కృష్ణ కందార భూపతి యీ గర్తమందలి జలమున గ్రుంకులిడగా, నాతని నంతవరకును పీడించుచున్న కుష్ఠువ్యాధి నయమైనది ఆ జలములు చాల తక్కువగ నున్నవని యింకను పెద్ద చెరువుగ త్రవ్వింపవలెనని యాతడు ప్రయత్నింపగా, అసలు జలమే మాయమైనది రాజెంతయో విచారించి జలదేవత కోరిక ప్రకారము నుమజ బలినీయబోవుచుండగా గోరక్కుడీ వృత్తాంతమును విని రాజుతో నట శివాగారమును నిర్మింపజేయవలసినదని అట్లు గావించినచో పాతాళ వివరములోనికి పోకుండ జలములు నిల్చునని తెల్పినాడు)

## మత్స్యేంద్రనాథుడు — కౌలజ్ఞానము

నవనాథులను గూర్చిన చరిత్రలను తెలిసికొనిన పిమ్మట వారుపదేశించిన మత స్వరూపములను గూర్చి గూడ కొంత తెలిసికొనుట యావశ్యకమగుచున్నది 'కౌలజ్ఞాన నిర్ణయ'మున కౌలజ్ఞాన మార్గ ప్రవర్తకులలో మత్స్యేంద్రనాథుడే ప్రథమాచార్యుడుగా పేర్కొనబడినాడు. మత్స్యేంద్రనాథుడు వివరించిన కౌలజ్ఞానమతము శాక్తమతమే. దీనికి బౌద్ధ మతముతో నెట్టి సంబంధమును నున్నట్లు తోచదు.

ఇందుకుపయోగింపబడిన 'కుల' శబ్దమునకు శక్తియు, అకుల శబ్దమునకు శివుడనియు వీరర్థమును చెప్పుదురు. కులాకులములకు సంబంధమును స్థాపించుటయే కౌలమార్గ సిద్ధాంతము[54] శివుడు వర్ణ విభేదము లేనివాడును, ఆద్యంత రహితుడును నగుటవలన నాతడకులుండయినాడు. శివునకు ప్రపంచ సృష్టి గావింపవలెనని, జనించిన కోర్కెయే శక్తి ఈ శక్తినుండియే సమస్త పదార్థములును ఉత్పన్నములయినవి, శక్తి శివునకు ప్రియురాలు, అయినప్పటికి శక్తి శివుల కెట్టి భేదమును లేదు. శక్తియే సృష్టికి హేతువగుట చేతను, నీమెను, కులమని (వంశమని) అనుకున్నాడు శక్తియొక్క ప్రాపు లేక శివుడెట్టి కార్యమును జేయజాలడు. 'ఇ' కారము శక్తివాచకము, శివశబ్దమునుండి యికారమును తొలగించినచో 'శవ' మగుచున్నది[55] ఇటువంటి శక్తి నుపాసించు శాక్తేయులే కౌల మార్గావలంబకులు

కౌల మార్గావలంబులు భోగములను యోగమార్గమునకై విసర్జింప నవసరములేదని భావింతురు గోమాంస భక్షణము వీరికి విహితమైనదట, గోమాంసమును నిత్యము భక్షించువాడే సత్యమగు కౌల సాధకునికి మత్స్యేంద్రనాధుని వచనాను సారముగ హఠయోగ ప్రదీపిక యందు దెల్పబడినది కాని గోమాంసమనుదానికి యౌగికార్థము చెప్పబడినది 'గో' అనగా జిహ్వ అనియు, దానికి తలక్రింది జరచి తాళు ప్రదేశమునకు గొనిపోవుటయే గోమాంస భక్షణమందురు. దీనినుండి యెల్లప్పుడును అమృతము స్రవించును ప్రబుద్ధగారు (కర్ణకుండలములను ధరించు) నేటి నాధ సంప్రదాయ యోగులు లింగపూజ యొనర్తురనియు, (దాసుల కోరికలను) నణచివేయుట సాధన మార్గమునకు పరిపంధియని భావింతురనియు నుడివిరి ఈ నాధ సంప్రదాయకులు పురుషుని యొక్క పరిణామము స్త్రీయని భావింతురు అందువలన వీరు వామాచారము

---

54 కులం శక్తి రితి ప్రోక్త మకులం శివ ఉచ్యతే
కులే కులేస్య సంబంధః కౌల మిత్య భిధీయతే"
—సౌభాగ్య భాస్కరము, పు. 53 - నా.సం పు 61.

55 "శివో పి శవతాం యాతి కుండలి న్యా వివర్జితః"
—దేవీ భాగవతము, నా.సం.పు. 62

నకు ప్రాముఖ్యము నొసగుదురు. కౌలజ్ఞాన నిర్ణయమున మత్స్యేంద్రనాధుడు వివరించిన 'చక్రపూజ' యిప్పటికిని వ్యాప్తి యందున్నది. కాని యిది రహస్యముగను, గోప్యముగను నుండవలెనని భావింతురు

కౌల సాధకుల యొక్క ప్రధాన కర్తవ్యము కుండలినీ శక్తిని మేల్కొల్పుటయే, శక్తియే మహాకుండలినీ స్వరూపమున జగత్తునందు వ్యాపించినది. ఈ కుండలినీ శక్తియున్న స్థలముననే శివశక్తులు కలియుచున్నవి. శివశక్తుల యొక్క ఈ సామరస్యమే పరమానందస్థితి, ఈ ఆనందము లభించిన పిమ్మట సాధకున కిక చేయదగిన దేమియును లేదు

మత్స్యేంద్రనాధుడు 'అకుల వీర తంత్రమందు' కౌలజ్ఞాన సాధనకు 'ద్వంద్వాతీతు'డగుటయే పరమ లక్ష్యముగ పేర్కొనినాడు "అధకిం బహునోక్తేన సర్వ ద్వంద్వ వివర్జితం" ఇట్లు సాధకుడు అద్వైత జ్ఞానమును సంపాదన గావించి ద్వంద్వాతీతుడై పరమానందము ననుభవింపవలెను

## గోరక్షనాధుడు - యోగ సంప్రదాయము

మత్స్యేంద్రనాధుడు కౌల మార్గావలంబకుడుకాగా, గోరక్షనాధుడు యోగ సంప్రదాయ మార్గావలంబకుడు ఈతడు పాతంజలాదులు చెప్పిన పూర్వ యోగ సంప్రదాయ మార్గమునే యనుసరించినట్లు కానబడుచున్నది. ఈతడు చెప్పినది ముఖ్యముగ హఠయోగము దీనియందు ప్రాణాయామము ముఖ్యము. 'హఠయోగమున, 'హ' అనగా సూర్యుడు, 'ఠ' అనగా చంద్రుడు నను నర్థములు చెప్పబడినవి ఈ సూర్యచంద్రుల యోగమే హఠయోగము. ఇట్టి చంద్ర సూర్యులను దానికి కొందరు వాయు ప్రాణ వాయువులను నర్థములను దెల్పగా మరికొందరు పింగళ యిడనాడులని దెల్పుదురు ఇందువలననే యిడ పింగళనాడులను నిరోధించి సుషుమ్న మార్గముగుండ ప్రాణవాయువును సంచరింపజేయుటయే హఠయోగమందురు ఇందుగూడ కుండలినీ శక్తి నుద్బోధ పరచుట ముఖ్య సాధనముగ జెప్పబడినది.

నాడీ శుద్ధుల వలనను ఆసనముల వలనను, ప్రాణాయామము వలనను సుషుమ్నా మార్గము తెఱచుకొనును. కుండలినీ శక్తి ఉద్బుద్ధమయిన పిమ్మట

శూన్యపదమునుండి సాధకుడు అఖండరూపమున నిఖిల బ్రహ్మాండ మందెల్ల ప్పుడు ధ్వనిత మగుచున్న అనాహద నాదమును వినును హఠయోగమనగా ప్రాణవాయు నిరోధనమే!

కుండలినీ శక్తి ఉద్బుద్ధమయి శివునితో సామరస్యమును జెందినపుడు పిండ బ్రహ్మాండైక్యమయినదని చెప్పబడును. ఇదియే యోగులు కాంక్షించు కైవల్యావస్థ – సహజ సమాధి స్థితి దీనిని మించిన ఆనంద మింకొకటి లేదు ఈ స్థితి నందుట గురువు కృపవలన జరుగును వేదములవలన గాని, జ్ఞానము వలన గాని వైరాగ్యము వలనగాని యీ స్థితి పొందబడదు

మత్స్యేంద్రనాథ గోరక్షనాథు లుపదేశించిన సిద్ధాంతముల పరిశీలనవలన వీరిరువుర సిద్ధాంతములందును మార్గములు భిన్నములయినను లక్ష్య మొక్క-టియేయని తెలియుచున్నది అదియునుగాక, వీరి మార్గములందుకూడ భేదములకన్న ఐక్యములే ఎక్కువగ నున్నట్లు తెలియుచున్నది, ఈ నాథ సిద్ధులందరును ఒకే సంప్రదాయావలంబకులయినప్పటికిని, అందరును ఒకే మార్గము నవలంబించినట్లు గానరాదు మత్స్యేంద్రనాథుడు కౌలమార్గమున, గోరక్షుడు యోగమార్గమును నవలంబించినట్లుగ, వీరియందు కొందరు (శైవ) కాపాలిక మత సిద్ధాంతములును, మరికొందరు పాశుపత శాఖ సిద్ధాంతములను, కొందరు బౌద్ధమత వజ్రయాన సహజయాన సిద్ధాంతములను నవలంబించినట్లు కానబడుచున్నది.

గోరక్షకుడు స్త్రీ వశీకరణాది శక్తులను గూడ గల్గి యుండినట్లు (వామాచారముల ననుసరించి నట్లూహింపవచ్చును) అతని శిష్యుడు గోరక్కుని కథలో, రాజున కీతడు కోరిన స్త్రీని మంత్రశక్తిచే రప్పించి యిచ్చుటవలన తెలియుచున్నది. ఇటులే యీ సిద్ధులు రసవాద కాయసిద్ధి మున్నగు శక్తులను గల్గి యుండినట్లును నాగార్జున వ్యాళి సిద్ధుల కథలవలన దెలియుచున్నది రసవాద సిద్ధు లౌషధములను తయారుచేయుదురు

హరిశ్చంద్ర చరిత్రమందు "కవిశిరః కంపంబసేయ బదరించి వీనుల పండువుగా నీ కావ్యమును విరచింతు"నని చెప్పికొనుటయేగాక, అందు సరస

సాహిత్య లక్షణ విలక్షణుడనని కూడ జెప్పికొనినాడు ఈ ద్విపద యందిట్టి విశేషము లేమియు గానరావు ఇందుబకు తోడిది విషయ ప్రధానమైనదిగ నున్నది దానియందువలె దీనియందు రచనా చమత్కృతి, భావనా ప్రౌఢిమ గానవచ్చుట లేదు ఈ గ్రంథ మందీతడు షష్ట్యంతములను రచించినాడు. షష్ట్యంతములను రచించిన ద్విపదకవులలో నీతడే ప్రథము డగుచున్నాడు. హరిశ్చంద్ర కావ్యమున కృతిపతియే లేకపోవుటవలన గాబోలును. అందు షష్ట్యంతరచన గానరాదు

రంగనాథ రామాయణము నందువలె నిందుగూడ నీతడు శ్రీ మల్లికార్జున శ్రీ మహాదేవు పేర గ్రంథమును రచించినాడు

గౌరన యొక్క పరిపక్వ కవితా రచనా సామర్థ్య మిందు గానరాక పోయినను, రెండు గ్రంథములందును కొన్ని సందర్భముల భావ సామ్యము మాత్రమేగాక, భాషా సామ్యమును గానబడుచున్నది నవనాధ చరిత్రలో ముక్తి శాంతరాయల కొలువు వర్ణనము, హరిశ్చంద్రలోని దేవేంద్ర సభవర్ణ మును పోలి యున్నది.

"కర్పూర హిమజల కాశ్మీర మిశ్రిత
దర్ప సారాంబు సిక్త ప్రదేశమును
దపనీయ జాల కాంతర గత ధూప
విపుల సౌరభ సమన్విత గంధ వాహ
వాసిత దశదిశా వలయంబు నగుచు
భాసిల్లు నిజ సభా భవనంబునందు
శ్రీ సముజ్జ్వల రత్న సింహాసనమున
నాసీనుడై బిరుదందె బాగొంద" (నవ చ. పు ౩—౬)

"గలిగి నానా ధూప గంధ బంధురము
గర్పూర చందన కాశ్మీర మిశ్రిత
దర్ప సారాంబు సిక్త ప్రదేశంబు
నిరుపమ నిజ సభా నిలయంబునందు
బరగు చింతామణి భద్ర పీఠమున
దనర నాసీనుడై......" (హరి పు, )

ఇదే విధముగ కాశీ గంగాది వర్ణనం సందర్భమున కూడ సామ్యము గాన బడుచున్నది కాశియందు కాలాముఖ పాశుపతులు మున్నగు వారున్నట్లు నవనాథ చరిత్రయందు వర్ణింపబడినది

ఈ గ్రంథమున కూడ సీతడు హాస్య రసము నొండు రెండు పట్ల పాఠకులకు చవిచూపించినాడు హరిశ్చంద్రోపాఖ్యానమునందలి కాలకౌశికుని పాత్ర వంటిదే యిందలి వంచక పురోహితుని పాత్ర ఈ పాత్రయొక్క వికృతాకార చేష్టాదికములే నవ్వుపుట్టించును ఈపాత్రద్వారా తన కాలమునాడు కొందరు పురోహితు లొనర్చు మోసకార్యములను వర్ణించియుండును నిజమున కీ కథకు నవనాథసిద్ధుల కథలతో నెట్టి సంబంధమును గానబడదు ఒక్కసారి కొన్ని కొన్ని పేర్లనే రచించి పాఠకులకు నవ్వు పుట్టించు నేర్పరి గౌరన

"పప్పుకూటికి నాల్గు భాస్కరు కైదు
అప్పల కారు జంధ్యాల కేశవుకు
బదుమూడు గోవిందభట్టు పిన్ననికి
రేర విర్థలకు బంద్రెండు దోరాల
వీరయ కెనిమిది వీధి మాధవుకు"

ఇట్టి పేర్లా కాలమున బ్రాహ్మణులు సామాన్యముగ గల్గియుండిరేమో, పండితారాధ్య చరిత్రలోకూడ నీ పేర్లు గానబడుచున్నవి

"దామోదరప్పన్న వామనకూచి
చప్పట్ల పెద్ది యంశము నూరబోతి
పప్పుకేశవుడు సంభవుల మాధవుడు
దోనయ భట్టును ధూర్త విర్ధలుడు"

ఇట్టి పేర్లు పల్నాటి వీర చరిత్రయందును గలవు ఈ కవి గావించిన శ్రీశైల వర్ణన నిసర్గ మనోహరముగ నున్నది (పు 218)

స్త్రీల మనోగతి నెఱుగుట దుర్ఘటమని ఇందురెండు పట్ల దెల్పినాడు

"కుసుమ సౌరభములు గుది గ్రువ్వవచ్చు
నిసుక బొమ్మల నీట నీదింపవచ్చు
వానగండ్లు గుడుల్, గవడి గట్టపచ్చు
గాని యింతుల మనోగతి గానరాదు" (పు 6 )

"అంఘు మత్తేభ కర్ణాగంబుకంటె
గడు చంచలము కలకంఠుల మనసు
చిత్రాంగి తన కల్ల చెప్పనేయిపుడు" (పు 62)

"నా కోరు కోర్కెలు నాకు సిద్ధించె
చీకుకు దృష్టియు చెవిటికి వినికి
యాకొన్న వానికి నభిమతార్థములు
మూకుకు వాకు రుగ్మన కౌషధంబు
సాకమైనట్టి మీ పదచరణములు" (పు 120)

ఈ ద్విపదలు

"మూకం కరోతి వాచాలం
పంగుం లంఘయతే గిరిం
యత్కృపామహంవందే
పరమానంద మాధవం" అను శ్లోకమును పోలియున్నవి

గౌరన శివకవి కాకపోయినప్పటికిని యీ గ్రంధమున భాషా వ్యాకరణా దుల విషయమున కొంతవరకు వారి ననుసరించినట్లు తెలియుచున్నది.

అప్పకవి చెప్పిన ఋవళి వలన ఋ-రి లకు మాత్రమే యతి చెల్లును. కాని 'ఋ-రు' లకు ఉచ్చారణ యందు సామ్య మున్నప్పటికి యతి చెల్లునని యే లాక్షణికుడును చెప్పలేదు కాని యీ ఉచ్చారణ సామ్యమునుబట్టి కొందరు

కవులీ యతిని ప్రయోగించిరి ఇట్టి యతి మహాభారత శల్య పర్వమున గూడ గలదు. గౌరన నవనాథ చరిత్రమున యిట్టి యతిని ఒండు రెండు స్థలము లందు బ్రయోగించినాడు

"తొడరి దొప్ప దోగి ధృతి దుప్పదూలి (2-57)
"నృపునితో నొంతు రెండును గాగ జెప్పి (1-41)
"కృపచేసి వెళ్ళి పోగొట్టిన నైన (2-60)
"కొలువగా వచ్చితి కృపగలమాడ్కి (1-29)

ఇదే విధముగ నీకడు 'ఉ—పు' లకు గూడ యతి సామ్యమును బాటించినాడు. ఇట్టి యతినిగూడ లాక్షణికులు నిర్వచింపరేమగాని ఉచ్చరణ సామ్యమును బట్టియే కవులు గూర్చియుందురు.

''ఒక్కని డించి పోవుటయు భీతిల్లి (6-93)
''ఉండంగ దగిన దావులను (4-177)

ఈ కవి గ్రంథమందు అట్టి అనుదానికి 'అటి' యనియు, ఎచ్చరించు అను దానికి 'ఎచరించు' అనియును ప్రయోగించినాడు ఇటులే ఊలమాలగుడుచు, బొతళించు, మున్నగు యపూర్వ శబ్దములను వాడియున్నాడు ఇదే విధముగ, చూడామణున్న, శంకణు మాత్రంబు, ఎల్లందు, నిత్య తెసగునే, సట్టడవందు మున్నగు సంధులను పుడమీశుడు, ప్రవిమల పోగులు, అపసడి, మాల్యవంత మహీధరము, మహదేవుడు మహరాష్ట్రము, మహదేశము మున్నగు సమాసము లను మాత్రమే గాక, శుద్ధ వ్యవహార రూపములని చెప్పదగినటువంటి, 'రాయి నేర్చిన రీతి, సరసమై తనర, బనస్త్రిరినీకు, పంద్రాడాయేట, బ్రాహ్మలు తప్పించుక పోవు, రుగ్మత, మునగు దానినిగూడ ప్రయోగించినాడు నట్టక నడురేయి, పడారము, సొకసొకలు అంత స్తము వంటి శబ్దములుగూడ నీ గ్రంథమున దొర్లిపోయినవి.

యతి విషయమున వలె ప్రాస విషయమునకూడ నీతడు విశృంఖలత్వ మును జూపినాడు. ఈతడు సబిందు నిర్బిందు ప్రాసములను, ఱ, ర ప్రాస లను గూర్చినాడు.

# నవచోళ చరిత్ర

గ్రంథకర్త పోలిశెట్టి లింగకవి పదునాల్గవ శతాబ్ద ప్రాంతమువాడు కుల గోత్రాదికము లేమియు నీ గ్రంథమువలన తెలియుట లేదు శైవుడు, శైవమత సంప్రదాయము ననుసరించియే కులగోత్రాదికము లేమియు ప్రస్తావించుకొన లేదని తెలియుచున్నది

''క్షితిని 'మాతా హిమగిరి సుతా' యనగ
నతిశయ రీతి 'పితా రుద్ర యనగ'
బాంధవుల్ శైవులు భక్తులౌనగ
... ... ...
శంకర దాసయ్య శరణ వంశజుడ
శంకర దాసయ్య శరణ గోత్రజుడ
మూలమౌ శ్రీ గురు బూజించు శ్రీల
లీల మను పోశెట్టి లింగము నాగ, బరగినవాడ''

ఈతడు కుమ్మరి కులమునకు చెందిన వాడనియును, శంకర దాసుని వంశమునందు జన్మించిన వాడనియును నీ గ్రంథ పీఠికాకారులు రచించిరి.[56] ఈ గ్రంథమునకు మూలము కన్నడ గ్రంథము కృతి ప్రేరకుడు చకిలాల లింగప్ప శ్రీరామిలపల్లి నివాసియగు మృత్యుంజయస్వామి కంకితముగా రచించినను, గ్రంథమునందంతటను లింగప్పనే సంబోధించినాడు చకిలాల లింగప్ప కన్నడ గ్రంథమును తెలుగున ద్విపదగా రచింపమని చెప్పినట్లున్నను, ఆ కన్నడ గ్రంథమేదియో నెవ్వరు రచించిరో స్పష్టముగా చెప్పబడలేదు 'ఆర్యులు చేసిరి' అని మాత్రమే గలదు ఇతడు నవచోళ చరిత్ర మాత్రమే గాక, మలహణచరిత్రము, శంకర దాసయ్యచరిత్రము, వీరసంగయ్య దేవచరిత్రము, శిష్య ప్రబోధము నను ద్విపద కావ్యములను రచించినట్లు అవతారికలో చెప్పికొనెను కాని నేడవి యేవియు గన్పట్టుట లేదు.

56 నవ చోళ చరిత్ర, పీఠిక, పు 5

నవచోళ చరిత్రయందు కరి కాళ చోళుడు విక్రమ చోళుడు, ఉత్తుంగ చోళుడు, వర వీర చోళుడు, ఉత్తమ చోళుడు, అవివర చోళుడు, వర్మ ధర్మ సత్యేంద్ర, మనుజేంద్ర చోళులును, నవ చోళ చక్రవర్తులయొక్క చరితలు వర్ణింపబడినవి కాని యీ గ్రంథమందు వర్ణింపబడిన విషయము లెంతవరకు చారిత్రక సత్యములో నెఱుంగరాదు వీర శైవుడైన కవి భక్త్యావేశముచే వారి చరిత్రలను భక్తి పూర్ణములుగ కల్పనలతో రచించినాడు కాని వారి జీవిత కాలములందు సంభవించిన చారిత్రక ఘట్టముల కంతగా ప్రాధాన్య మొసగినట్లు గానరాదు అందుచలననే చారిత్రకులీ గ్రంథమును ప్రామాణిక గ్రంథముగా నంగీకరింపకున్నారు

"The Nevacola Caritra a Vira Saiva compilation available in a Kanarese and a Telugu version, the Brihadisvara - mahatmya or the Cola Vamsa Caritra in Sanskrit, of which there is a Tamil translation among the Makanzie Manuscripts, and the Kongudesa-Rajakkal also in the same collection of manuscripts are the leading examples of this class But Fleet has observed (I A XXX pp 6 7) the fanciful nature of such works and their utter want of reliability for any purposes of early history are disclosed at once by the very slightest thoughtful examination ' [5]

## కరికాళుడు

చోళ చక్రవర్తి, శివభక్తి దురంధరుడు. కావేరియొక్క మహిమ నెఱిగి, దానికి కట్టకట్టి సప్త సంతానములలో నొక దానిని నిర్మింపవలెనని పుణ్యమును సంపాదింపవలెనని యెంచినాడు ఈ కట్ట కట్టుటకై తన సామంతుల నెల్లరను పిలువబంచినాడు అతని యాజ్ఞానుసారము అందరు సామంతులు నేతెంచిరి కాని, భాస్కర చోడ, ముక్కంటి చోడులు రారైరి. భాస్కర చోడుడు వెట్టి చేయుటకు రాకపోగా, నాతడు నిత్యము సూర్యున కర్పించు రస రసాన్నములపై కరికాలుడు తన యానను పెట్టినట్లు భృత్యులచే కబురంపినాడు

5 ది చోళాస్, ప్ర- 1 పుట 2'

అతనిచే ప్రతినిత్యము సూర్యునకర్పితములైన మూడు అర్ఘ్య పాత్రలను సూర్యునికడకు బోనీక ఆకాశమున నాపివానిని కరికాలుడు పెట్టిన యాన నెఱిగి వెంటనే భాస్కర చోడుడు కట్టికట్టైదనని బాస చేయగా, సూర్యుఁ డాతని నైవేద్యము నారగించెను నాస వెల్లింపుటకై భాస్కరచోడుడు కరికాలుని యొద్దకు వెట్టి చేయుట కేగెను

శ్రీ నేలటూరి వెంకట రమణయ్యగారు విభవ సంవత్సరము, పుష్యమాస భారతియందు ప్రకటించిన పున్నత్తి శాసనమున 'కరికాలుడు భోజుడను రాజుచే సూర్యుని కర్పితములైన మూడు అర్ఘ్య పాత్రములను సూర్యుని కడకు బోనీక ఆకాశమున నాపి భోజుని దాసునిగా జేసెను" అని గలదు ఈ శాసనస్థ భోజుడే ప్రకృత కవిచే భాస్కరచోడుడుగా పర్ణితుడైనాడు ఈ భోజుని గూర్చిన ప్రస్తావన ఒప్పిలిసిద్ధి, కొణిదెన శాసనములందు గూడ గలదని వారు దెల్పిరి

"ఇను పాదము లర్చింపగ
జను భోజుని యర్ఘ్య మంత్ర జలపాత్రలు దా
విను వీధి నాగ బంచెను
ఘనముగ దన యాన నొడిచి కరికాలుడిలన్"

---

58 వారు ప్రకటించిన శాసన విషయ మిది "చంద్రమౌళియొక్క పాదపద్మమునందలి భృంగమగు కరికాలుడు ఇక్ష్వాకుని (?) వంశమున బుట్టెను, ఆ రాజు ఈశ్వరు నారాధించి సర్వ సంపదలను సమృద్ధి పఱచుటకై స్వర్ణ వృష్టిని కురిపించెను త్రినేత్రపల్లవుడను నృపుని గర్వితునిగా నెఱిగి వాని ఫాలలోచనము భగ్నము చేసెను భోజుడను రాజుచే సూర్యుని కర్పితములైన మూడు అర్ఘ్య పాత్రలను సూర్యుని కడకు బోనీక ఆకాశమున నాపి భోజుని దాసునిగా జేసెను ఇక్ష్వాకు వంశ ప్రభువులకు రాజధానియు, మనుష్యులకు శుభావహయునగు యయోధ్యనుండి, బ్రాహ్మణాదులగు నాల్గు వర్ణముల వారిని కొనివచ్చి పల్లవరాజు దేశమునందు రాష్ట్రములను నగరములను, ఇచ్చి శ్రీ పర్వత చ్ఛాయయందు ప్రతిష్ఠించెను. అచ్చట తన పేరట లింగ ప్రతిష్ఠ చేసెను —భారతి, విభవ —పుష్యమాసము, పుట. 85–91

ఈ భోజుడు వాకాటక రాజై యుండునని వారనిరి కాని కొందరు చారిత్రకులీ విషయములను సత్యములని విశ్వసింపకున్నారు ఇట్టి అభూత కల్పనలన్నియు కరికాలుని మహిమాన్విత పురుషునిగా వర్ణించుటకే చేయబడినవని తలంచుచున్నారు [59]

ఇదే విధముగ నాభిజాత్యముచే కరికాలుని వెట్టి కేతేరకుండ ఆతనిచే మూడవ నేత్రమును భగ్నము గావింపబడినవాడు ముక్కంటి చోడుడు. ఈతడీశ్వర వరప్రసాద జనితుడుగ వర్ణింపబడినాడు కాళహస్తి పట్టణమందు కాళహస్తీశ్వరుని మహిమచే నొక కన్యకకు మూడవ నేత్రము గల్గి జన్మించిన కారణ శరీరుడు ఆతని కడకు కరికాలుని భృత్యు లేతెంచి కావేరి నదికి కట్ట కట్టుటకై వెట్టి కనేకమంది సామంత నృపతు లేతెంచిరనియును, ఆ కార్యమున కాతడు కూడ రావలసినదని కరికాలుని యాజ్ఞగా నివేదించగా, ముక్కంటి చోడుడు కోపోద్దీపితుడై ఈశ్వరుని శ్రీపాద జలజ షట్పదుడనైన తన్ను, తన్ను తానెఱుగని కరికాలచోడుడు పిలువ బంపినాడని బల్కి భృత్యులను మరలి పొమ్మనినాడు అపుడా భృత్యులు శివభక్తి దురంధరుడైన కరికాలునితో వైరము పెట్టుకొనుట తగదని యాతనికి హితవును జెప్పిరి పీరు కరికాలుని మహిమను వర్ణించుచు, 'నవని రాజుల కెల్ల నాద్యుండతండు' అనిరి కవి యిట్లనుట అతిశయోక్తియే చోళవంశమున కాది పురుషుడుగ వర్ణితుడుగాని అవని రాజులకెల్ల ఆద్యుడు గాడు ఈతడు భోజుని వశపరచుకొనిన తరువాత ఉత్తరాపథమున హిమాలయ పర్వతములవరకు తన రాజ్యమును వ్యాపింపజేసెనని పులవర్తి శాసనమున జెప్పబడినది ఈ వృత్తాంతము 'సిలప్పదికారమ్' అను తమిళ పురాణమునను[60] పుణ్యకుమారుని మాలెపాడు శాసనమునను గలదు. ఇది కూడా అతిశయోక్తులతో కూడిన సత్యదూరమగు విషయమేమొ !

ముక్కంటి చోడుడు వారి ప్రత్యుత్తరమును విని, కరికాలుని భృత్యులను పట్టి త్రోయింపగా వారు కరికాలుని వద్దకేగి సంభవించిన వృత్తాంతము నంత

---

59. ది చోళాస్, పుట 41

60 ది చోళాస్, పు. 44

టిని విన్నవించిరి. ఈశ్వరుడు మూడవ కన్నిచ్చినందుననే నాతడట్లు గర్వితుడై వెట్టి చేయుటకు రాకున్నాడని తలచి శివుని ప్రార్థించి, కరికాలుడతనిపై యాన నిడినాడు ఈయనచే ముక్కంటి చోడుని మూడవ కన్ను మాయమైనది తన కన్నులు ఘాయము కాగా, ముక్కంటి శివుని కారణ మడిగినాడు శివు డాతనికి ప్రత్యక్షమై మూడవ కంటి నిచ్చుటకు తనకు శక్యము గాదనియు, తన ప్రియభక్తుడయిన కరికాలు డాన పెట్టినందున తానటులు గైకొంటిననియు, భక్తుని యాజ్ఞ మీరుట తనకు వశముగాదని, ఆ భక్తవరుని వద్దకేగినచో, ఫాలనేత్రము నాతడే మరల నిచ్చుననియు దెల్పినాడు. ఈశ్వరుని యాజ్ఞ చొప్పున ముక్కంటి చోడుడు కరికాలుని వద్దకు వెట్టి చేయుట కేగినాడు కరికాలు డాతని కెదురేగి స్వాగతము బలికి, భక్తజన సులభుడైన శివుని తన యాన నెరవేర్చినందున అనేక విధములుగ సంస్తుతి జేసి ముక్కంటి చోడుని మూడవ నేత్రమును మరల నీయవలసినదని ప్రార్థించినాడు అతడు ఫాలలోచనమును మరల బడసె మునుపటి కంటె నెక్కువ మక్కువతో నుండెను కరికాల ముక్కంటి చోడు లిర్వురును భావంబు లేకమై పలు భక్తి మెఱసి, సావధానత ననేక ప్రసాదముల, సేవించి భక్త వాంఛితమున నుంచి' యుండిరి

ఇతడు త్రినేత్ర పల్లవుని గర్వ మడచు కథ మిక్కిలి ప్రఖ్యాతమైనది. ఈ విషయము పులవర్తి శాసనమున వర్ణితమైనది "త్రినేత్ర పల్లవుడను నృపుని గర్వితునిగా నెఱిగి వాని ఫాలలోచనము భగ్నము చేసెను" ఈ విషయమును తిక్కన నిర్వచనోత్తర రామాయణమునందును (అవతారిక పు 18)పాల్కురికి సోమన పండితారాధ్య చరిత్ర పురాతన ప్రకరణములోను ప్రస్తుతించినారు.

ఈ విషయము కొణిదెన ఒప్పిలి సిద్ధి శాసనమున పేర్కొనబడినది

క॥ కావేరి దరులు గట్టగ
వేవే పల్లవుడు దనదు వెట్టికి రామిన్
దావా నదుటి కనువో
గావడి గరికాల విభుడు గాలందుడిచెన్"[62]

61. ది చోళాస్, పుట. 44

62. ద. హిం. శా. 4

ప్రతి యాంధ్ర చోళ శాసనమునను, "చరణ సరోరుహ విహత విలోచన పల్లవ త్రిలోచన ప్రముఖాఖిల పృథివీశ్వర కారిత కావేరీ తీర కరికాలకుల రత్న ప్రదీప"యని వర్ణితమైన పంక్తులే స్పష్టమునే తెల్పును. ఈ త్రినేత్ర పల్లవుని కంచిరాజుగా శ్రీ వెంకట రమణయ్యగారు చెప్పిరి. పూర్వ పశ్చిమ సముద్రములకును కృష్ణా కొల్లడములకును నడుమ నున్న దేశము నేలిన ప్రభువు చాళుక్య వంశమునకు మూల పురుషుడైన విజయాదిత్యునితో పోరాడి వీరమరణము నొందెను. ఇతడు శైవ మతాభిమాని అనేక శివాలయములను నిర్మించెను. తుది కతనికి కరికాలునితో విరోధ మేర్పడినది. పరాజితుడై కప్పము గట్టినాడు. కంచి రాజ్యము చోళుల స్వాధీనమైనది. త్రిలోచనుడు ధరణికోట రాజధానిగా గుంటూరు మండలమును పాలించుచుండెను

కరికాలుడు కావేరికి కట్ట కట్టించిన విషయము మొట్టమొదట పుణ్యకుమారుని మాలెపాడు శాసనమున పేర్కొనబడినట్లున్నది [64] కరికాలుడు కావేరి కట్టకట్టుట, త్రినేత్ర పల్లవునిపై ఆతని విజయమును గూర్చి శ్రీ నీలకంఠ శాస్త్రిగారిట్లభిప్రాయపడుచున్నారు,

Nothing can be more typical of the manner in which legends grow than the way in which this story mingles with another stream of legend centring round Trinetra Pallava, and culminates in the celebrated jingle of the late Telugu Coda Plates! "Carna Saroruha Vihata Vilocana Pallava - Trilocana Pramukha Khila prithivisvara Karitha Kaveri tira" which has been made the basis of conclusions of the highest importance to the chronology of early South Indian History "[64]

ముక్కంటిని భంగము చేసిన విషయ మెటులున్నను,కరికాలుడు త్రిలోచన పల్లవుని గర్వము నణచి, యాతనిపై విజయమును సాధించెనన్నది చారిత్రాత్మక సత్యమై యుండును. వీ రిర్వురు మరల సఖ్యముగ నుండి, 'కరికాల చోడ భూవరుని యానతిని వరుసడి తన రాజ్య పదమున కరిగె' అని కవి రచించినది

---

63 ది చోళాస్, పు 44

64 చోళాస్ పుట 44

సత్యమై యుండదు ఇది ఊహాకల్పనమై యుండును కరికాల చోలుడు తన భక్తి మహిమచే స్వర్ణవర్షమును కురిపించెనను ఐతిహ్యము గలదు కొన్ని శాసనములందును గ్రంథములందును నీ విషయము చేర్కొనబడినది కాని లింగకవి యీ విషయమును ప్రస్తావింప లేదు. పిట్టవ్వ యను భక్తురాలి భక్తికి మెచ్చి ఈశ్వరుడే భట వేషము దరించి కరికాలునకు వెట్టి జేయుట కేతెంచి, పిట్టవ్వ యొక్క మాహాత్మ్యము నాతని కెరిగించును పిమ్మట మాదర చెన్నయ్య మహిమను చూపి అతని భక్తి ననేక విధముల పరీక్షించి, కైలాసమునకు గొంపోవును

## విక్రమ చోళుడు

ఈతడు కూడ కరికాల చోళునివలె నపారమగు శివభక్తి గలవాడు. ఈతడు రాజ్యపాలనము చేయుచుండిన యొకానొక సందర్భమున దిగ్విజయ యాత్రకు బయలుదేరి కొంత దూర మేగిన పిదప గహనమగు నొక యరణ్యమున దేవాలయమును పూజాది విధులును లేని యొక శివలింగమును గని, భక్తిలోలుపత చేత, అచటి లింగమునకు ఆలయ నిర్మాణాదులను గావించి కైంకర్యములను చేసి, చిట్టపురకీశ్వరుని ప్రసన్నము చేసికొని, ప్రత్యక్షము గావించుకొని ఈశ్వరుడు తన పురముననే వెలసి పూజాదులను గైకొనునట్లుగ వరమును వడసినాడు కొంతకాలము జనిన పిదప నీశ్వరుడు పూసల నయనారుని భక్తికి ముగ్ధుడై యాతనియెద్ద నుండిపోగా విక్రమచోళుడీశ్వరుడు తనయొద్ద కేతేరకున్నాడని గండకత్తెర వేసికొని ప్రాణ త్యాగము చేయబూనెను ఈశ్వరుడపు డాతనికి ప్రత్యక్షమై అతని నా యుద్యమమునుండి వైదొలగించి పూసల నాయనారుయొక్క మహిమ నాతనికి దెలిపి, పిమ్మట సాయుజ్య మొసగి మన్నించినాడు.

విక్రమచోళుడు మొదటి కులోత్తుంగుని పుత్రుడనియు నీత డుత్తర సరిహద్దులను పటిష్ఠపరచుకొనుటకు విజయవంతములైన ప్రయత్నములు చేసినట్లును చరిత్రవలన తెలియుచున్నది ఈతని శాసనములలో నొక ప్రశస్తి భాగమున నీతడు చిదంబర మందలి నటరాజస్వామి ఆలయమునకు నిత్యాదా

లను, దానాదికములను చేసినట్లు గలదు [67] కవి వర్ణించిన ఆలయ మా నటరాజ స్వామి యాలయమే అయి యుండవలెను.

## వ ర ధ ర్మ చో ళు డు

తన పుత్రుడు సత్యేంద్ర చోళునిచే గోవత్సము మృతి నొందగా, తన పుత్రునకును అదే దండన మొసంగి తన ధర్మబుద్ధిని ప్రకటించుకొని శివునిచే మరల గోవత్సమును బడసినాడు

## స త్యే ం ద్ర చో ళు డు

ఇతడు కూడ తండ్రివలె ధర్మాసనమున న్యాయ ధర్మములను నిర్వర్తించు చుండెను. ఒకసారి తన పుత్రునివలన, ఒక పేదరాలి పుత్రుడు రథముక్రింద పడి మరణింపగ నాతడు తన శిరమును ఖండించుకొనెను ఆతని మరణమును గాంచి తక్కిన వారెల్లరును శిరములను ఖండించుకొనిరి. చివరకు రాజు వరధర్మ చోళుడును తన శిరమును ఖండించుకొన సంసిద్ధుడగుచుండగ నీశ్వరుడు ప్రత్యక్షమై నాతని నా పూనికనుండి విరమింపజేసి, చనిపోయినవారి నందరును బ్రతికించి యెల్లరను కైలాసమునకు గొంపోయెను

గోవత్సమును చంపిన పుత్రునికి మరణదండన విధించిన వరధర్మ చోళుని కథ 'మణిమేకలై' యను తమిళ కావ్యమునందు వర్ణింపబడినది [68] దీనిని చోళ చరిత్ర కాధార గ్రంథముగ గ్రహింతురు కాని ఈ వరధర్మ చోళుడు చారిత్రక పురుషుడో కాదో తెలియదు

## వీ ర చో ళు డు

నిత్యము ఈశ్వరుని సహస్ర కమలములతో నర్చించు నియమము కలవాడు. శివుడాతని భక్తికి మెచ్చి యాతనికి సాయుజ్యము నొసగ నిచ్చగించి, యొక దినమున నా వేయి పుష్పములలో నొకదానిని తగ్గించినాడు ఈశ్వరుని

---

67 చోళాస్, రెండవ భాగము—పు 62

68. The Colas, k A N. Sastry, P I p. 38.

వేయినామములకు వేయి పుష్పముల నర్పించు నియమము కలిగిన యాతడు, ఆ దినమున నొక పుష్పము దరిగి యుండుటకు గడుంగడు విచారించి ఆ పుష్పము నకు బదులుగ తన సహస్రాబ్జములు గలిగిన శిరమును అనగా సహస్రార చక్రమును గల్గినదని భావము – శివున కర్పింపవలెనని కరవాలముతో శిరమును ఖండించుకొనబోయినాడు ఈతడట్లు శిరమును ఖండించుకొనబోవుచుండగా, శివుడు ప్రత్యక్షమై తన్నాతడు విడువకుండ నుండుటయే తన యభీష్టమని దెలిపి, విమానముపై నెక్కించుకొని కైలాసమునకు గొనిపోయినాడు వీర రాజేంద్రుడు వీరచోళుడు ఈతడు రాజేంద్రచోళుని తృతీయపుత్రుడు ఈతని సోదరు లిర్వురు, మొదటి రాజాధిరాజు, మరియు రెండవ రాజేంద్రుడు అనువారు ఈతడు క్రీ శ 1063 నుండి 1069 వరకు రాజ్యము చేసినట్లు తెలియుచున్నది ఈతడనేక యుద్ధములను చేసి బిరుదులు గాంచిన వీర చక్రవర్తి యని, చరిత్ర వలన తెలియుచున్నది కవి వీటి నన్నిటిని తడువ లెదు ఈతడు చిదంబర నటరాజేశ్వరాలయమునకు దానాదికములను గావించినట్లు శాసన ప్రమాణము లున్నవి కవి ఈతని శివ భక్తిని గూర్చి మాత్రమే చెప్పెను

## ఉత్తమ చోళుడు

ఇతడు పరమ వీరశైవాచారుడైన చక్రవర్తి ఇతడు గాంధారా దిత్యుని పుత్రుడ. చోళ రాజులలో ప్రముఖుడు కవి యీతని శివభక్తినిగూర్చి మాత్రమే వర్ణించినాడు.

ఇంకను ఉత్తుంగ, అహివర, మనుజేంద్రచోళుల శివభక్తి పారమ్య మీ గ్రంధమందభివర్ణితమైనది

ఈ గ్రంధము చరిత్ర ప్రధాన గ్రంధము గాదు. మత విషయక గ్రంధము అందువలననే కవి ఆయా చోళ రాజుల కాల మందలి చారిత్రక ఘట్టములను రాజకీయ విప్లవములను తడవక, ఆ రాజుల యొక్క శైవ మహిమలనే వర్ణించినాడు ఈ కవి గ్రంధమున ననువు చూచుకొని శైవమత సిద్ధాంతములను, తత్త్వమును ప్రతిపాదించినాడు. విక్రమచోళుని కథేతివృత్త సందర్భమున, శివ పూజా ప్రకారము, పూజోపకరణాదుల ప్రభావము,

పుష్పార్చన మహిమ, నైవేద్యము, షోడశోపచారముల మహిమ, దీప ప్రభావములను దెలిపినాడు. పూసల నాయనారి కథా సందర్భమున, సాత్త్వికాది గుణ విచారము, అంతఃకరణానుభవము బంధ మోక్షములు, యమనియమాది వివేచనము స్వయంప్రకాశ ధ్యానరీతి, నానానుభవము, యోగధారణ, మొదలగు వానిని వివరించినాడు కఠినములైన వేదాంత విషయములను సుబోధకమైన భాషలో సరళమైన శైలిలో వర్ణించి సామాన్య జనుల కందుబాటులోకి దెచ్చినాడు

శైలి సాధారణముగనుండి, ఒడుదుడుకులు లేక సాగిపోయినది. క్లిష్ట పదముల కూర్పుగాని దీర్ఘసమాస రచనగాని ఎందును కనబడదు చందో వ్యాకరణ నియమోల్లంఘన మెచ్చటను చేయబడలేదు ప్రాస నియమము పాటింపబడినది

(1) "జను బిందు వను మనోన్మని జనిత సూక్ష్మ" (ద్వి, అ, పు 59)

(2) నలి నెన్న కాల వేళల ప్రమాణంబు (ద్వి, ఆ, పు, 51)

(3) భావింప దమకు దామే పీఠుచుండు (ద్వి, ఆ,—పు, 62) మొదలగు చోట్ల ప్రాస యతిని వాడినాడు

భైరవ రాజు కథా సందర్భమున సాయంకాల ప్రాతఃకాల వర్ణనలను చేసినాడు ఇది మత ప్రధాన గ్రంథమైనందున దీనిలో వర్ణనాదుల కెక్కుడు తావు లేకపోయినది.

ఇతడు గార్లపాటి లక్ష్మయ్యగారి శిష్యుడు "లింగకవి గార్లపాటి లక్ష్మణకవిని వీరభద్రేశ్వరీ విజయ సాహసములను వీర రసమున వివరించిన కవిశేఖరుడుగా వర్ణించినాడు "నన్నచోళ చరిత్రము చారిత్రక దృష్టితో వీక్షించు వారల కెట్లు గన్పట్టినను గన్పట్టుగాక! శాస్త్రీయ దృష్టితో జూచినచో మతాను రాగము ఆముష్మిక పరాయణత మున్నగు నమేయ విషయములతో నిండైనదై, సాటిలేని యుత్తమోత్తమమగు గ్రంథముగా గన్పట్టక తప్పదు తరుణత బుద్ధులకు సైతము గహనమనిపించు శాస్త్రవిషయములను వెలువరించుటలో నియ్యది

అద్వితీయమగు గ్రంథము పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్ర గ్రంథము తర్వాత పక్కని శైలియును మనోహరమగు విషయ వివేచనా పరిపాటియును, ఉత్తమమగు దార్శనిక సిద్ధాంత వివరణమును, భక్తినిష్ఠా పరత్వమును వెల్లడించు శైవ గ్రంథములలో నిద్యది మేటియగు గ్రంథము. శాస్త్రీయ విషయములను వివెచన సేయుటలో నీ కవికి గల శక్తి యసాధారణ మైనది" 70

కావ్య శిల్పమునకూడ నీ గ్రంథ మద్వితీయమైనదే. కవి తన కల్పనా ప్రౌఢిమచేత సందర్భములకు తగినట్లుగ జేసిన కొన్ని వర్ణనలు కావ్య సౌందర్యమును నినుమడింపజేసినవి, ఉదాహరణ కీతడు గావించిన కావేరీ వర్ణనలు గనుడు.

"శిష్టతరంగముల్ చిందులు వార
గట్టిన పురిబట్టు గాసెయు గాగ
స్థిర కరంబగు మేటి తిరుపులు మేన
బరగ దాల్చిన చక్రబటువులు గాగ
హర్షంబు దనర మ్మాదొాళ జాలంబు
వరుస పీడిన జటావళులును గాగ
ప్రణుతాబ్జ దళము లాభరణముల్ గాగ
ఫణి ఫణామణి గణ ప్రభలును గాగ
స్ఫుటతర రక్తాబ్జములు నెన్నబడిన
నిటల తటాంబ కోత్కట వహ్ని గాగ
వెలి నురుగులును వావిరి నెన్నబరగు
పలుచని నెఱపూత భస్మంబు గాగ
ప్రస్ఫురన్మృదు జలము ప్రబలి యౌననగ
సరవి గప్పిన కరి చర్మంబు గాగ

70 పీఠిక, పు, 10-11.

రాకీర కలకంఠ రాజ హంసాది
మూకలు ఋాజించు మునులును గాగ
విరిదమ్మి కెందమ్మి విరు లర్థి నెన్న
విరివి బూన్పు ప్రసాద విరులును గాగ
సలలిత పద్మ రసంబుల గ్రోలు
కల తుమ్మెదలు నీలకంఠములోల్ గాగ
బుద్బుద జాలంబు భువి నెన్న నరిమ
ి ద్భుత స్ఫటికాక్ష మాలికల్ గాగ
నది యొప్పె శ్రీ విశ్వనాథుండు ననగ"

కావేరీ నదిని శ్రీ విశ్వనాధుడుగా వర్ణించిన కవి కల్పనా పాటవ మపార మైనది ఇటులే యీతడు భైరవరాజు కథా సందర్భమున గావించిన ప్రాతః కాల సంధ్యాది వర్ణనలు సొగసై తనరారుచున్నవి

## సానంద చరిత్ర — భద్రకవి లింగకవి

కృష్ణదేవరాయల యనంతరమున పాలించిన నచ్యుత దేవరాయల కాల ము న క్రీ శ 1530-42 ప్రాంతమున దక్షిణ దేశమున వెలసిన కవి యీతడు. ఇతని చరిత్ర మింతదనుక కవి చరిత్రల కెక్కలేదు ఇతడు రెండు ద్విపద కావ్యములను రచించెను 1 దేవాంగ పురాణము, 2 సానంద చరిత్ర ఇతడు కూడలి సంగమ క్షేత్ర నివాసి ప్రసిద్ధ శైవ భక్తుడగు దేవర దాసు మయ్య వంశీయుడు రామయ ప్రభునికిని, నమలాంబకును బుత్రుడు. ఇతని వంశవర్ణనము బట్టిచూడ నీతడు రాజ్యాధికారియను సందేహము గలుగవచ్చును

"ధరణిపై దేవర దాసయ్య వంశ
వరనిధి సంపూర్ణ వార్ధి చంద్రుండు
దురిత దూరుడు శివ దోహారగండ
బిరుద ప్రతాప గంభీర వర్తనుడు

చరితార్థ వరితుండు సత్య సంధుండు
సరసుండు శివధర్మ శాస్త్ర కోవిదుడు
పరమ శివజ్ఞాన భరితాత్ముడనగ
బరగిన రామయ ప్రభు కూర్మిసుతుడు"

(దేవాంగ పురాణ-అవతారిక)

"జంగమకుల వార్ధి చంద్రోదయుండు
లింగైక నిష్ఠా విలీన మానసుడు
...                ..                ...
భాసిల్లు రామయ ప్రభు వరేణ్యుండు
తనదు పాతివ్రత్య ధర్మ మార్గమున
అనసూయ కెనయైన యమలాంబవలన
గనిన పుత్రుడు భద్రకవి లింగ విభుడు

(సానంద చరిత్ర యవతారిక)

ఇతడు తన గురువు కాళహస్తి సంగమేశ్వరుడని చెప్పుకొనినాడు

'చిరభవాంబుజ హస్తి శ్రీ కాళహస్తి
గురు సంగమేశ్వరు గొనియాడి పాడి"

## కాలము

లింగకవి తన దేవాంగ పురాణమును రచియించునాడు పడవీడున కధిపతియగు శ్రీ కాళహస్తీశుడను నొక మహాపురుషుడున్నట్లుగా నిట్లు చెప్పినాడు —

ఇందు పేర్కొన బడిన కాళహస్తీశ్వరుడు కృష్ణదేవరాయని వెనుక విజయనగర సామ్రాజ్యమును పరిపాలించిన యచ్యుత దేవరాయల కాలమునాడు (క్రి శ. 580—1542) ఇతడా కాలమున పడవీడును పాలించుచున్నట్లీ క్రింది శాసనములు కన్పట్టుచున్నవి.

ఉత్తరార్కాడుజిల్లా, దేవకీ పురమున బృహదంబాదేవి యాలయమున శాసనములు— (1) శా శ 1462, క్రి శ. 1580 పడవీడు తిరుమలేశ్వరుని

వసంత మండప నిమిత్తము భూదానము, (2) శా శ 1452–1530– దేవకీ పురము దేవాలయము – ధర్మకర్తృత్వము (శ్రీ కాళహస్తి నాయకుడు), (3) శా శ 1454–1532 ఇందులో స్పష్టముగా కొండమ నాయకుడను వాడు ఆ కాలమున గొల్లలను దేవాలయమునకు సేవకై వినియోగించుటకు పడవీడును పాలించుమన్న కాళహస్తీశ్వర నాయకుని యనుమతిని బొందెనని కలదు (4) శా శ 1454–1532 దేవాలయమునకు ప్రతి మగ్గముపైని 11 పణములు పన్ను కట్టుటకు శాసనము ఇందు కాళహస్తీశ్వరుడు పేర్కొనబడినాడు [71]

పై శాసనముల ననుసరించి, లింగకవి యచ్యుత దేవరాయల కాలము వాడనుట నిశ్చయము

"శ్రీమతి నుద్భవించిన పాలకురికి, సోమనాథేశ్వరు సొంపుతో గొలిచి, రంగద్విశాలాంతరంగంబునందు, రంగనాథుని కవిరాజున్ను దలచి, యసమాన చరితు ప్రత్యగ్ర కల్యాణ బసవేశు బిడుపర్తి బసవేశు గొలిచి", యని పూర్వ కవులలో పాల్కురికి సోమనాథ, రంగనాథ పిడుపర్తి బసవేశ్వరులను నుతించి నాడు పిమ్మట శివభక్త గణమునకు నమస్కృతులిడి గ్రంథారంభమును గావించినాడు

సానంద మునియొక్క చరిత్ర ఇందు ప్రస్తుతింపబడినది. ఇతడు శివభక్తుడు శివ పంచాక్షరీ మంత్ర మాహాత్మ్యముచే సానందుడు యమలోక వాసులను నరక బాధలనుండి విముక్తులను గావించిన చరిత్ర మిందు వర్ణితమైనది. ఒకసారి వీరభద్రయ్య సోదరుడగు మహత్తయ్య సానంద సన్మునీశ్వరుని చరిత్రను ద్విపదగా రచియింపగల మహానుభావులగు కవీశ్వరులెవ్వరును లేరే యని చింతింపుచుండగా, వీరభద్రయ సోదరునితో, ధరమీద వీరభద్రస్వామి కరుణ, కరమొప్ప కావ్య లక్షణ పరిజ్ఞాత, గలడు జంగమ పాద కమల శేఖరుడు, విలసిత గురుభక్త విజ్ఞానధనుడు, రమణీయ శివకవి రాజన్య హృదయ కమల మిత్రుడు భద్రకవి లింగ ఘనుడు, నెఱయ నాతని కంటె నేర్పరిగలడె, నెఱి వెన్న చేబట్టి నెయ్యేల వెదక, గర్ణ శోభితములుగా గొన్ని కథలు, వర్ణించి

71 ఎపిగ్రాఫికా రిపోర్టులు, 1913 పు, 14, 45, నెం 364,374 373, 377

నాడు కావ్య ప్రబంధములు" అని దెల్పి యాతని చింతా జ్వరమును పోగొట్టి నాడు

## రచనా విశేషములు

ఒకచోట ముక్త పదగ్రస్తమును ప్రయుక్తము గావించినాడు

"ఎడపక యుడు వీథి కెగసిన యట్టి
బడబాగ్ని కాబోలు బడబాగ్ని గాదు
బాలేందు శేఖరు ఫాలాగ్ని కీల
జాలంబు గాబోలు సౌధంబు గాదు
రాశి కెక్కిన కోటి రవి బింబదీప్తి
రాశి గాబోలును రాశియుగాదు
స్తోకంబు గాని పిష్యత్ప్రభాలతల
మూక గాబోలును మూకయు గాదు
భాసిల్లు సానంద మునీశ్వరుని
భాసుర దివ్య పుష్పకంబు గాబోలు"

ద్విపద సానందోపాఖ్యానము ననుసరించి కోట శివరామకవి ఐదాశ్వాసముల పద్య ప్రబంధముగను, కొండమడుగు పురుషోత్తమకవి మూడాశ్వాసముల పద్య ప్రబంధముగను రచించినట్లు తెలియుచున్నది

## ప్రభులింగ లీలలు

దీనిని పిడుపర్తి సోమనాథుడు వైశ్యుడయిన నెల్లూరి రామలింగామాత్యుని కోరికపై కన్నడమున చామరసు[72] రచించిన ప్రభులింగ లీలను తెనుగున ద్విపదలో రచించి, సిద్ధ వీర దేశి చక్రపర్తి కంకితము గావించెను ఇతని వీరశైవ దీక్షా బోధను కన్నడమునుండి తెనుగున ద్విపదలో రచించిన పిడుపర్తి బసవన పుత్రుడు పిడుపర్తివారు పాల్కురికి సోమనాథునకు శిష్య

72 చామరసు క్రీ శ. 480 ప్రాంతము వాడని కిట్టెల్ దొరగారు తమ కర్ణాట నిఘంటువునందు లిఖించిరి పిడుపర్తి సోమన క్రీ శ 1520 ప్రాంతము వాడని యొక మతము గలదు

ప్రశిష్యులై, "శివుని భక్తులకును, శివునకుంగాని కవిత చెప్పని ప్రతినగాన" అని వీరి శైవ మత ప్రచారమునకే తన జీవితమును ధారవోసినారు. వీర శైవాచార సంప్రదాయము ననుసరించి యీతడు తన గోత్ర సూత్రాదులను చెప్పికొనలేదు. ఇతడే ద్విపద కావ్యమునేగాక, సోమనాథుడు రచించిన ద్విపద బసవ పురాణమును పద్య కావ్యముగ నేడాశ్వాసములలో రచించి తండ్రి యయిన బసవశౌరి యాజ్ఞానుసారము సోమనాథునకే యంకితము గావించెను. ఇతడు క్రీ శ 1450 ప్రాంతమున జనించి క్రీ శ 1480 ప్రాంతమున గ్రంథ రచన సాగించి యుండును.

గ్రంథరచన కుత్సాహము గల్పించిన నెల్లూరి రామలింగయ్య కాంచీపుర నివాసి. కర్ణాట కావ్య మెవ్వరికిని దెలియదు గాన నద్దానిని తెనుగు జేయుమని కోరినాడు.

కలకంఠు భక్తుల కరుణ గన్పట్టు
చిరుతొండ నంబి విశిష్ట వంశజుడు
అసదృశ జ్ఞాన క్రియాశక్తి భక్తి
రసికుండు నెల్లూరి రామలింగయ్య
నన్ను రప్పించి మన్నన గారవించి
...   ...
కవిత కర్ణాట కావ్యంబు గాన

ప్రభులింగ లీలలయందు ప్రధానముగ, నల్లమప్రభుని మాహాత్మ్యలీలలు వర్ణితములైనవి. అల్లమప్రభునితో పాటితర శివభక్తుల మహిమలు కూడ నిందు ప్రసక్తాను ప్రసక్తముగ వర్ణింపబడినవి. అల్లమ ప్రభువు మహిమ నాల కించి, పార్వతి, ఆతనినెట్లైనను వంచింతునని పరమ శివునితో పంతమాడి, తన తామసకళను 'మాయ'లను పేర జన్మించుటకు భూలోకమునకు పంపినది. ఎట్లైనను అల్లముని పట్టి తెమ్మని మాయ కాదేశించినది. విటవేషమున చరించు నుండిన అల్లముని గాంచి, మాయ యతనిని, విటుడని మద్దెలకాడని భ్రమించి, ఆతని మోహించినది. అల్లమప్రభువు మాయకు లోబడకపోయెను. ఆమె యాతనిని బలవంత పరచగా నాత డదృశ్యుడయ్యెను. మాయ యత్నమిట్లు

వమ్మైపోవుటవలన పార్వతి దుఃఖించినది చివరకు, శివుని యాజ్ఞానుసారము, తన సాత్త్వికకళను అక్కమహాదేవిగా భూలోకమున జనింపజేసినది; అల్లమ ప్రభు నామె భక్తిజ్ఞాన వైరాగ్యములచే లోబరచుకొనినది ఇది యిందలి ప్రధాన కథ. లింగాష్టకము, కైలాసగతి, మాయోత్పత్తిగతి, మాయావిలాసగతి, మాయావిరహగతి, విమలమాయా ప్రసంగగతి, మాయాప్రభువు సంవాదగతి, బసవయ్యగతి, అక్కమహాదేవిగతి, అక్కమహాదేవి వైరాగ్యగతి, గొగ్గయ్య కథ, ముక్తాయకథ, సిద్ధరామయ్యకథ, ప్రభువు కల్యాణపురమునకు వచ్చుట, మునులు శంకరమాహాత్మ్యమును దెల్పుట, ఇష్టలింగయ్యగతి, జ్ఞానోపదేశగతి, ప్రాణలింగైక్యగతి, గోరక్షునిగతి, మునులకుపదేశగతి, శూన్యసింహాసనగతి, బసవడు ప్రభువు నెదుర్కొనుగతి, బసవన ప్రభువున కాహారమిచ్చుగతి తత్త్వోపదేశగతి, ప్రభువు మహిమను పరమేశ్వరుడు పార్వతికుపదేశమిచ్చుగతి, అనునవి యిర్వదైదుగతులు ఒక్కొక్క ఆశ్వాసమున 5 గతులు వర్ణింప బడినవి

ఇది వీరశైవ గురువులలో బహు ప్రఖ్యాతుడును, శివుని యవతారము గను నెన్నబడుచున్న అల్లమ ప్రభువు యొక్క నిర్వదైదు గతులను వర్ణించు గ్రంథము కన్నడమందు దీనిని 'చామరసు' రచించినట్లుగ కవియే చెప్పినాడు.

అల్లమ ప్రభుని కరుణ వలన తన సాత్త్విక కళయగుయక్క మహాదేవి లింగ ప్రసాదము నంది శ్రీగిరి కేగినదనియును, బసవేశ్వరుడు మున్నగు భక్తులు (ప్రమథులు) భక్తిపారవశ్యముతో నోలలాడి పరమ వీరశైవాచార సంపన్నులై రనియును నెరిగి పార్వతి అల్లమ ప్రభువున కారు మతములును నదికాక, వీరశైవమతమే ఏల సమ్మతమైనదని యడిగినది అపుడు శంకరుడు చెప్పి నాడు.

"వీర శైవ మనంగ వేద వేదాంత
సార మెట్లన్నను షడ్దర్శనములు
ధర్మార్థ కామామృతంబులు నాల్గు
నర్మిలి సాధింపుడని చెప్పు నిందు
కర్మ ఫలంబుల కడకు బోనార్తి
నిర్మల మోక్షంబు నిలుపంగ జప్పు
కర్మ లంపటులు స్వర్గంబు దుర్గతియు

దుర్మదులై పొందుదురు మరి పిదప
జీవ హింసలు కర్మ జీవులు దవులు
జీవ హింసలకును శివుడు మెచ్చడు
శివుడు మెచ్చిన గాని శివు కృప లేదు
శివు కృప లేకున్న జెందదు ముక్తి
కావున నిష్కర్మ కాములై వీర
శైవులె మోక్షంబు సాధింతురు"

అని వీరశైవమత ప్రాశస్త్యమును తెల్పినాడు.

## కా వ్య వి శే ష ము లు

మత ప్రబోధక గ్రంథమైనను నికవి తేటలూరుశైలిలో మనోహరముగ రచించినాడు. తెలుగు జాతీయములను సామెతలను ఎన్నిటినో నుపయోగించినాడు.

"సిరికి మోకాలొగ్గు సిరకునియట్లు"
"నెరపింప బోయి తా నెరపి నట్లయ్యె"
"తాజారి పడి చేల లిప్ప వాడుదురె"
"నిప్పున చెదలంటునె..."
"మంగలమున జాజుల వేయుట సరసత్వమగునె?"
"వెఱ్ఱి దీటినది రోకలి తలజుట్టురో యన్న మాట జోక"
"ముక్కు గోయుట కాక ముకురమ మీసలెన?"
"ఎనుము దన్ను నటంచు నెంచి గుఱ్ఱంబు
వెనుకకు బోయిన విధిమయ్యె నట"
"ఎలుకతో గోపించి యింట జిచ్చిడ్డగతి"
"పేస కోపం బెల్ల పెదవుల చేటు"
"కొఱవి పుచ్చుక తలగోకు కొనంగ నఱిముఱి తలతురా"
"పాల నింత తోడంపిన ఘృతమగుంగాక
జలము తోడఱట నాణ్యము గాని యట్లు"

"కోపమాపగ లేక కొంపలో గొజపి
దోపునేగాని యేమను వార్నగండె"
"పువ్వుల కతమున దుంగ తంకెత్ర"

సందర్భముగల్గినపుడెల్ల సామాన్య సత్యముల నుగ్గడించి కావ్యమునకు సౌందర్యము నాపాదించినాడు తనకు పుత్రులు లేరని చింతించుచు సుజ్ఞాని యాత్మ గతమున భావించిన విధమును గనుడు

"మానంబు చాలని మగువయు నుచిత
దానంబు సేయని ధన పతిత్వంబు
జ్ఞానంబు లేని పూజా విధానంబు
ధ్యానంబు చాలని తపమును సుతుడు
లేని మానవుడును లెక్కకు సరియె?" (పుట. 40)

పలు సందర్భములందు కవి తనయపారమగు శివ భక్తిని వెల్లడించుకొనినాడు. (పుట 44)

ఈ కవికి కూడ తన గురువయిన సోమనవలె శివభక్తితో పాటు బసవేశ్వరుని యందలి భక్తి కూడ నిరుపమానమైనది

"బసవ నీ నామంబు ప్రస్తుతించినను
బసవ నీ గుణములు పనివడి విన్న
బసవ నిన్ గీర్తింప బసవ నిన్గన్న
బసవ నీ మంత్రంబు పలుమారు నుడువ
బసవ నీ రూపు లోపల దలపోయ
బసవ నీ భక్తి సంపద పొగడినను
భక్తి రహస్యము భక్తు లెరింగి
యుక్తితో లింగ సాయుజ్య మొందెదరు"

ఈ కవి బాహ్య శుద్ధి, బాహ్యాడంబరముల కంటె అంతః శుద్ధియే మోక్షప్రాప్తి కవసరమని తలచినాడు

ఒక్కొక్కప్పుడీ కవి వక్కని యొడుపుతో వ్రాయును.

"పురహర్త వని నిన్ను భూషింతు నేని
నరయ గోపంబు లేదణుమాత్రమైన
స్మర వైరి వని నిన్ను సన్నుతి సేయ
నరమేన గిరి కులేశాత్మజ లేదు
నర రూప ముపమింప వర్ణింతు నేని
నిరుపమ, నిర్లేప, నిర్మల తనుడవు"

ఒక విషయమును పలు రకములగు ఉపమానములతో జెప్పి పరితల మనఃఫలకములపై దానిని హత్తుకొను నట్లుగ చిత్రించును రాజునకు శివభక్తి యింపుగాకుండెనను విషయమునేమి సుందరముగా వర్ణించినాడో గనుడు,

"అర్క తేజము గూబ కనువు గానట్లు
మూగకు మాట లింపులు గాని రేవ
యీగకు సౌరభ్య మింపు గానట్లు
కోపికి శాంతంబు గూడని యట్లు
పాపికి పుణ్యంబు ఫలియించనట్లు
ముక్కిడి కద్దంబు ముదము గానట్లు
రోగి కౌషధ మెందు రుచియింపనట్లు
నాగ కంకణు భక్తి నర పాలు మతికి
ననుమతి గాకున్న..."

ఈ కవి కూడ నితర ద్విపద కావ్యకర్తలవలె చామరసావి, చెఱుకాకు వంటి సంధులను జణప్రయోగమును గావించినాడు

ఉదా: "శచి యునింద్రుడోర, మా శౌరి, యోశీర (పుట. 19)

ఇట్లే కవి యిది మత ప్రాతిపదిక కావ్యమైనను తన కావ్య రచనా పటిమచేత దీనికి కావ్యత్వము నొసగ ప్రయత్నించినాడు అల్లమ మహా ప్రభువు మహిమ నాంధ్రరసజ్ఞులకు చవి చూపిన కవి మహానుభావునకు నమో వాకములు.

తెలుగు ద్విపద 'ప్రభులింగలీలల' నాధారముగా, గంజాము జిల్లా పర్లాకిమిడి తాలు కా, తులగాము గ్రామ వాస్తవ్యుడగు తులగాన నీలకంఠకవి, "మాయా విలాసమ"ను[74] గ్రంధమును రచించినాడు. ఇది అముద్రితము దీనిని పాఠ్యలోకమునకు దెల్పినవారు శ్రీ కత్తి సాంబమూర్తిగారు[75]. మూల కధ నెట్టి మార్పు లేకయే యనువదించినట్లుగ వీరు చెప్పిరి.

పెక్కు పాట్లనుబడియు మాయ అల్లముని నిర్జింపజాలక వెడలిపోయిన కధమాత్రమే "మాయా విలాసము' న నీలకంఠకవిచే వర్ణితమైనది.

"పాలకురికి సోమనాధుని ద్విపద బసవ పురాణమునకు సంస్కృత భాషలో బరివర్తనమేర్పడి వ్యాస ప్రణీతమని లిఖింపబడినట్లు పిడుపర్తి సోమ నాథుని ద్విపద ప్రభులింగలీలకు కూడ నొక పరివర్తన మేర్పడి సూతుడు శౌనకాది మునులకు జెప్పినట్లు భవిష్యత్పురాణములోనిదిగా బేర్కొనబడినది. దానిని షోలాపుర వాస్తవ్యులును, లింగాయక శ్రేష్ఠులునగు కీ. శే. శ్రీ వారతి మల్లప్పగారి ద్రవ్య సాహాయ్యమున దేవనాగర లిపిలో మఱూరు మరాధ్యకులగు శ్రీ మల్లికార్జునశాస్త్రిగారు ప్రకటించినారు. దానినిబట్టి తెనాలి వాస్తవ్యులు శ్రీ ములుగు చంద్రమౌళిశాస్త్రిగారొక వచన కావ్యమును సంగ్రహముగా రచించి 1922 వ సంవత్సరములో బ్రకటించిరి.......ఈ క్రింది సంగతుల వలన భవిష్యత్పురాణాంతర్గతమని ప్రకటింప బడిన సంస్కృత ప్రభులింగ లీల పిడుమర్తి సోమనాథుని యాంధ్ర ద్విపద కావ్యమును బట్టి వెలసిన నవీన గ్రంధమని సువ్యక్తము కాగలదు."

పిడుమర్తి సోమన గ్రంధము నాధారముగా, కొచ్చెర్లకోట రామకవి, నడకుపిదు రామన కవియు, పద్య కావ్యములను రచించినారు.

---

74 భారతి, అంగీరసము, భాద్రపద మాసము

75 భారతి, అంగీరసము, ఫాల్గునము.

# చొక్కనాథ చరిత్ర

పరమశివుడు మీనాక్షీదేవిని పరిణయించి పాండ్యరాజు మలయధ్వజున కిల్లపు టల్లుడై మధురా ప్రజలను పునీతుల జేసిన పుణ్యకథ యిందు వర్ణితమైనది "శైవ సాంప్రదాయ దృష్ట్యా దీని ప్రాశస్త్యమటుండగా, కావ్యముగా నిది ప్రసాద గుణ పూర్ణమగు రసవాహిని "

ఈ కృతికర్త పచ్చ కప్పురపు తిరువేంగళరాజు ఈ కవియొక్క తాత తిమ్మరాజు అతని సోదరుడు అప్పలుడు వీరిద్దరును తమ పాండిత్యముచే కర్ణాటాధీశ్వరుడగు ప్రౌఢ దేవరాయలను మెప్పించి, యాతనిచే బచ్చ కప్పురపు రాజులని ప్రసిద్ధి వహించిరట వీరు భట్రాజులు

"అనముండు మీ తాతయగు తిమ్మరాజు
తన తమ్ముడప్పలు దాను నిమ్మహిని
ప్రౌఢుడై విద్యల బరగు మెప్పించి
ప్రౌఢ రాయలచేత బచ్చకప్పురము
రాజు నాబడె......"

ఈ తిమ్మరాజు పుత్రుడు తిప్పరాజు. ఈతని కుమారుడే ప్రకృత గ్రంథకర్త తిరువేంగళ రాజు ఈ కవి చెయ్యేటివరిని ఓరుగంటమ్మయను పేర వెలసిన ఏకవీరా దేవి భక్తుడు

ఈ కావ్యము గోళ్ల బసవ భూపాల పుత్రుడయిన చిన రామ నృపతి కోర్కెపై నాతని యగ్రజుడగు పెదరామ నృపతి కంకితమీయబడినది ఈ సోదరు లిర్వురును అచ్యుత దేవరాయల యొద్ద సామంతులు కమ్మవంశస్థులు. రామనాడులోని తిరువత్తూరు నేలినవారు పిప్పాల గోత్రజులు వ్యాసతీర్థుని ప్రియ శిష్యులు

- ఈ కృతిపతియు నాతని సోదరుడును. క్రీ శ 1538–40 ప్రాంతమున నుండినట్లు వారు వేయించిన శాసనములవలన తెలియుచున్నది. కావున కవియు నా కాలము వాడేయనుట తెల్లము.

సుందరేశ్వరుడు యుగయుగమున పదునాఱుగా, నాల్గు యుగములందును గావించిన చఱువది నాల్గు లీలలిందు విస్తరింపబడినవి. అతడు వర్ణింపబోవు చతుష్షష్టి లీలలను వరుసగా కవి యీ గ్రంథారంభమున వర్ణించినాడు:

"వృత్రాసురుని హత్య విబుధేంద్రునకును
చిత్రంబుగా బట్టి సెలగిన లీల
తగమెచ్చి యైరావతంబు శాపమ్ము
నగణితమ్ముగ దీర్చి యడపిన లీల
చతురుడై యా పతంజలియు సన్మునులు
స్తుతియింప నాట్యంబు జూపిన లీల

వినుతింప బశుపతి వేషంబు దాల్చి
ఘన కావ్యులకును మార్గము జూపు లీల
జమ్మి కూపంబును సాక్షి కప్పించి
నెమ్మితో దాసందు నెగడిన లీల
యీ యరువది నాల్గు నేకాంకధరుని
పాయని లీలలై భాసితంబులగు" (ప్ర అ.పు—12—16)

ఈ గ్రంథము స్కాంద పురాణార్ధ సారము. సోమనకు బసవేశ్వర భక్తి యంతటిదో యీ కవికి చొక్కనాథుని భక్తి యంతటిది. ఈ క్రింది ద్విపదలు సోమన రసనానుకరణములుగా నున్నవి.

"చొక్కనాథా యన్న శుభములు సెందు
చొక్కనాథా యన్న క్షుద్రమ్ము లుడుగు
చొక్కనాథా యన్న సురుగు దోషములు
చొక్కనాథా యన్న సులభమ్ము ముక్తి
చొక్కనాథా యన్న సుగుణమ్ము గలుగు
చొక్కనాథా యన్న జూచు దారాద్రి
చొక్కనాథా యన్న శూరత్వ మొసగు

చొక్కనాధా యన్న సురనాధుపదవి
వెయ్యేల శ్రీ చొక్క విభుడన్న జాలు
జాయు బ్రాహ్మ హత్యాది పాపమ్ము లెల్ల"

ఈ కావ్యమునకు చొక్కనాధ చరిత్ర, చొక్కనాధ విలాసము, చౌషష్టి లీలా విలాసము, మధురా పురాణము, ననియు నామములు గలవు "హాలాస్య మాహాత్మ్యము మధురా ఖండమునని నామాంతరములుగల నంస్కృత పురాణ గ్రంధమునకు దొరికినంతలో నిదియే మొదటి తెనుగు సేత యని యూహింప నగుచున్నది"

కాళహస్తి మాహాత్మ్యమున గల నత్కీరుని కధకును, నీ కవి వర్ణించిన కధకును కొంత భేదము గలదు కాళహస్తి మాహాత్మ్యమున, నత్కీరుని కుష్ఠరోగ పీడితునిగా కావలెనని శివుడు శపించినట్లును, మరల. కైలాసగిరి దర్శనమును శాపాంతముగ చెప్పినట్లును, అందువలన, శాపమును బాపి కొనుటకు, నత్కీరుడు, శైవ క్షేత్రముల నన్నిటిని దర్శించుచు వచ్చి కాళహస్తి యందు, బ్రహ్మరాక్షసి చేతిలో చిక్కుకొని, కైలాసగిరి దర్శనార్థమేగి శాపము నుడిపికొన జాలనని దుఃఖించినట్లును, అపుడు సుబ్రహ్మణ్యేశ్వరుడు ప్రత్యక్షమై, కాళహస్తి దక్షిణ కైలాసమనియు, దానిని దర్శించినాడు గాన, నాతనికి ముక్తి గల్గుననియు దెల్పి కైలాస పదమును గల్పించి నట్లును వర్ణింపబడినది

కాని యీ గ్రంధమందు శివు డాతనిని కుష్ఠరోగ పీడితుడు కమ్మని శపించినట్లు లేదు. అటనున్న పొందామర నరసిలో ద్రోసినట్లు వర్ణితమైనది. మరియు నత్కీరుడు శైవక్షేత్రముల నన్నిటిని దర్శింప యాత్ర వెడలినట్లు వర్ణింపలేదు.

ఈతడు కూడ శైవకవి యయినను, సోమనాథాదుల యందున్న ఆ మతా వేశమిందు గానరాదు ఇందును ఆటనట ఏకపాద ద్విపదలు

"నిరవైన రస వాద మిచ్చిన లీల" (ప్ర.ఆ — పు 14)

వంటివియు

'సర్వే సకిల లోకేశు, జల ప్రోత, ముమ్మెలత్రాయిరైె' వంటి ప్రయో గములును గాన బడుచున్నవి.

## మల్లాది చరిత్ర

అముద్రితము.[74] ఇది నాల్గాశ్వాసముల ప్రబంధము

కర్త మరింగంటి వెంకటాచార్యుడు క్రీ శ. 1700 ప్రాంతమువాడు.

పూర్వము కృతయుగమున నలకాపుర మందాదిరాజను శివభక్తుడొక డుండెను. ఆతడు వైరాగ్యముచే, సంసారసుఖములను త్యజించి హిమవన్న గములందు తపముచేయుచు, నారదునివలన, "అపుత్రస్య గతిర్నాస్తి"యని తెలిసికొని, శివునిగూర్చి తప మొనరించి యాతని వరమున, కర్ణములనుండి, గిరిరాజను పుత్రుని గని అలకాపురమునకు పట్టము గట్టినాడు ఇతడు కర్ణమున జనించినందున, నీతని కులమువారందరు కర్ణ కులమువారని వినుతికెక్కిరి ఇతడికి సిద్ధిరాజు, ఆదినాథుడు అను పుత్రులు, రేణుకయను పుత్రి (వల్మీకమున జన్మించిన ఆదిశక్తి) గల్గిరి రేణుకను జమదగ్నికిచ్చి వివాహము గావించెను. జమదగ్ని రేణుకలకు మొదట జంపన్న, పిదప విష్ణ్వంశమున పరశురాముడును జన్మించిరి. (పిమ్మట నిట పరశురామ కార్తవీర్యార్జునుల కథ వర్ణితమైనది) క్షత్రియకులమును నిస్సంతువుగా జేయుచున్న పరశురాముని జూచి వెరగండి సిద్ధిరాజు తండ్రి కెరిగింపగా, నాతడు (గిరిరాజు) తాము క్షత్రియులుగా నున్నచో పరశురాముడు తమ్ము తప్పక సంహరించునుగాన, క్షత్రియవృత్తిని విడిచిపుచ్చి సెట్టివేషములు ధరించి, శివభక్తపూని మల్లారిని (మలహరి) పూజింప వలెనని దెల్పినాడు సిద్ధిరాజటులే మల్లారిస్వామి పూజ గావించి మల్లారి

---

74 శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ—ఆర్. నెంబరు 338 (ఎ), కాగిత ప్రతి

తనయుడై మహిచంద్రవంశగురు సోమనాథుడౌ గురువాజ్ఞనుగొని మల్లారిదేవుని పూజించి పరశురామునికి ప్రతిస్పర్ధియగు తనయుడు గల్గుగునట్లును మల్లారి దేవుడు తమ కులదైవమగునట్లును, వరమును బడసినాడు అప్పటినుండి, సిద్ధమసెట్టి భూనాయకులకు, మల్లారిగోత్రము ప్రసిద్ధి లోనికి వచ్చినది. ఈతనికి అనమల్లు, చినమల్లు, చనరావమల్లు, సిరిమల్లు, సిద్ధమల్లులను నైదుగురు పుత్రులును, చంద్రావతియను పుత్రికయు జన్మించిరి

పిమ్మట, రేణుక పుత్రి గౌరాంబ చక్కదనమున, అనమల్లునకు దగినదని నారదుని వలన నెరిగి. సిద్ధమసెట్టి పెండ్లికొరకు పరశురామునకు రాయబారమంపగా, వారికందరనవమానపరచినాడు పరశురాముడు అపు డనమల్లుదేతెంచి ఏదోయుపాయముచే గౌరాంబను తెచ్చెదనని పక్కి రత్నాల సెట్టివెషమువేసికొని, మాహూరీపురికేగి, గౌరాంబకు తన వార్తను సందేశమును పంపి ఆమెను పురమునకు గొనివచ్చి వివాహమాడినాడు పరశురాముడీ వార్త నెరిగి యుద్ధమునకు వచ్చి యుద్ధమందు మున్ను మహేశుడొసగిన సమ్మోహ నాస్త్రమును ప్రయోగింపబూనగా, మల్లారిదేవుడు ప్రత్యక్షముగావచ్చి, పరశు రామునిగ్రక్కున గదిసి, పార్వతియంశమున పుట్టిన గౌరాంబను అనమల్లునకిచ్చి వివాహము గావింపవలెనని దెల్పినాడు పరశురాముడందులకు సమ్మతింపగ, మల్లిశెట్టిని పిలిచి. శివుడు తమ చెలియనలైన చంద్రావతిని పరశురామునకొసగి వివాహముగావింపవలెనని దెల్పెను. ఈరీతిగ మల్లారిదేవు డుభయవర్గములవారికి శుభముల నొనగూర్చెను

వీరి పెండ్లిండ్లలో రక్తములో కొంచెము తడిపిన శెల్లాలు-వస్త్రములను వధూవరులకు కట్టబెట్టినట్లు వర్ణింపబడినది ఇందు వర్ణితమైన రెండు వివాహము లందును నటులేవర్ణింపబడికదా అది యెక్కడి యాచారమో!

ఈతడు గావించిన కొన్ని వర్ణనలు సొగసుగానున్నవి యుద్ధ క్షేత్రమును సముద్రముతో పోల్చినాడు

"రక్తముల్ వారి పూరంబులు గాగ
అరి వీరు వక్త్రమ్ము లబ్జముల్ గాగ,

బిసవైన గొడుగులు ఫేనముల్ గాగ
పతగ తిట్టలు సీపు పొపలు గాగ,
ఘన కూబకము లెంద్రకాయలు గాగ
బెడిదంపు కరకస్కో బన దొబ్బ్ర గాగ,
జనుల కోలాహమె శైవాలములు గాగ
గనుపట్టె నాశ్చర్యకరమై మహోత్స"

పౌర కాంత లలమల్లిని పిలిచి యాతని సౌందర్యమును వర్ణించిరి

"అనువొప్ప నితడు జయంతుడై లేను
దనరగ ననిమిషత్వము లేదు చూడ
జలజాక్షి యీతడు చంద్రుడై లేను (వ్యావహారిక ప్రయోగము)
లలిమిందునట్టి కళంకము లేదరయ
హరి యితండు మనమాత్మలో నెంచిన
పురహరు డనుపను బుద్ధి నూహింప
మృగ డమరు త్రిశూలు లేవు చూడ (ఏకపద ద్విపద)
సురపతి యితడని...

పేరికి సెట్టని యెడి పేరింతయేగాని—వంటి ప్రయోగములను గావించినాడు. కొన్నియెడల సంస్కృత సమాస రచనయు గానవగును

## బ స వ వి జ య ము

**అముద్రితము**[75]

కర్త నల్లనగండ్ల నారనారాధ్యుడు

గ్రంధారంభమున కొంత గ్రంధపాతమైనది. బసవని జీవితచరిత్రయే ఈ గ్రంధమందలి ప్రధానేతివృత్తము సోమనాధుడు (పాల్కురికి) (వేద విరుద్ధమైన) శైవమతము నవలంబించినట్లు ప్రతాపరుద్రునితో చెప్పగా నాతడు సోమనను పిల్వనంపుట, అతడు పదీ పటలావృతుడై నేగుదెంచుట, పిమ్మట

75 శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ, ఆర్. నెం. 565.

తన మహిమను జూపుటకు మడివాలు మాచయ్య యను రజక భక్తుని పంపి బ్రాహ్మణులతో వాదము చేయించుట, మాచయ్య వారితో వాదముచేసి, వారి నందరనోడించి, "దైవంబులకు రాజు తగ సదాశివుడు, అక్షర నిగమాదు లన్నిటి రాజు"లో శివుని పరదేవతగా నిరూపించుట, ఈ నిరూపణకు రాజు వారిని మెచ్చికొని మారారి భక్తుల మహిమలను నిరూపించుట కెవ్వరికిని సాధ్యము గాదనియును వారదృుతమహిమోపేతులనియును ప్రశంసచేసి, వారికి జాగిలి మ్రొక్కి విభూతి పీఠ్యముల నొసగి వారిని సత్కరించి వారిచే దీవనల నందికొనుట, అటగల విప్రులందరును పాల్కురికి సోమేశుని యనేకవిధముల ప్రస్తుతించుట, యిందు వర్ణితమైన యంశములు

ఇందుకూడ బసవ పురాణమునందువలె కథ యారంభము గావింప బడినది

ఇది మూడాశ్వాసముల పరిమితమగు గ్రంధము ఓరుగంటి నగరమునకు పాల్కురికి సోమనాధుని రాక, అతడును మడివాలుమాచయ్యయును బ్రాహ్మణులతో వాదము చేసి ఓడించుట, సోమేశ్వరుని విజయము, శిలాద మహాముని తపము, నందికేశ్వరుడు బసవేశ్వరుడుగా జననమొందుట, అనిమిషుని చరిత్రము, బసవన చరిత్రము, తామ్రపట్టు విఖ్యాత వ్యాఖ్యానమును బసవన బిజ్జలునకు దెల్పుట, శివుని నేత్రమున మన్మధుడు భస్మీభూతుడగుట, కుమార స్వామి జననము, చెన్న బసవన్న జననము, ప్రధమాశ్వాసమున వర్ణితములైనవి.

చిత్తరు బొమ్మల కథము, సౌరాష్ట్రరాజు కథ, నీళ్ళ కడవలు వరదప్పి పారిన చరిత్రము, మిండ జంగముల కథయు, ముక్కవ్యాధుల కథయు ద్వితీయాశ్వాసాంతర్గత వృత్తాంతము.

తృతీయాశ్వాసమున బిజ్జలుని చరిత్రము, బసవని మాహాత్మ్యము వినిన చోళరాజు బసవని గొల్వనేతెంచుట, చోళుడు కైలాసమున కేగుట, శ్రీశైల

మాహాత్మ్యము, చామంతిరాజు కథ, బొల్లమనయనారు కథ, మారయ్యను శివుడు కైలాసమునకు గొనిపోవుట, బోళా శంకరుడు సత్య శంకరుడై గురుని యందైక్యమగుటయు వర్ణింపబడినవి.

బసవ విజయమను గ్రంథమునే తుమ్మలపల్లి నాగభూషణకవి, పద్య కావ్యముగ రచించినాడు వీరిలో నొకరి కావ్యము నింకొకరు జూచి రచన ప్రారంభించి యుందురు కాని వీనిలో నెవరు ముందు రచించిరో తెల్పుటకు మాత్రము సాధ్యముగాదు. తుమ్మలపల్లి నాగభూషణకవి కాలము క్రీ శ. 1750 ప్రాంతమని శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రిగారు తమ వీర శైవాంధ్ర చరిత్ర[76]లో వ్రాసిరి కావున నీ కవి యాతనికి పూర్వుడైనచో క్రీ శ. 1700 ప్రాంతము వాడును, అర్వాచీనుడైనచో క్రీ శ. 1800 వాడును నై యుండును. ఈ గ్రంథకర్త లిర్వురును ఒక్క పోలికనే గ్రంథారం భాద్యంతములను గావించిరి రచనా సందర్భముల నొకేవిధముగ తెల్పుకొనియున్నారు

## మఱి బసవ పురాణము

**అముద్రితము**[77]

గ్రంథకర్త బచ్చు సిద్ధకవి కల్యాణపురవాసి యైనటువంటి, మఱి-అనగా, ప్రసిద్ధ వీరశైవాచార్యుడైన బసవేశ్వరుడు గాక, వేరొక బసవని చరిత్రమిందు వర్ణితమైనందున దీనికి మఱి బసవ పురాణమను పేరిడినట్లు చెప్పుకొన్నాడు. ఈ కవి వీరశైవుడు. పాల్కురికి సోమన యడుగుజాడలలో నడచినట్లుగ నున్నది. సోమన తన కథాశ్రోతగా పాలకురికి సూరనార్యు నెన్నుకొనినట్లుగనే చరలింగ మర్దల పర్వతార్యు నీకవి కథాశ్రోతగా ఎన్నుకొనినాడు ఇంతమాత్రమే గాక, నీతడు ఛందో వ్యాకరణాది విషయములలో గూడ నాతనినే యనుసరించినట్లు చెప్పికొనెను.

---

76 వీరశైవాంధ్ర వాఙ్మయ చరిత్ర, పు. 179

77 మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము, డి నెంబరు 978, కాగిత ప్రతి.

"ఇలఁ బాలకురికి సోమేశుండు మున్ను
దౌలగ ప్రాస యతుల్ద్విష్టపదందు
లలి రచించుట యది లక్ష్యంబుగాను
అలమి రేఫ ఒకారములు శివకావ్య
ముల యందు వెల్లు తప్పుల గావుగాన
ఆ పాల్కురికి సౌమి ననుమతి నేను
దీపిత ప్రాస యతిచ్ఛంద సరణి
నా మహా గురుదేవు నానతి యట్ల
శ్రీ మెఱయంగ రచించితి నిపుడు
శోభిల్లు తత్కధా సూత్ర మంతయును"

ఈతనికి శైవ దీక్ష నొసగిన గురువు సిరిపురి వీరసింగయ దీనినీతడు సింగయకే కృతి నొసగినాడు గ్రంధారంభమున పాల్కురికి సోమనకు ప్రణతు లొనర్చినాడు

లింగము పల్లి పురమున మరి బసవడను శివభక్తుడు వీరశైవాచారమును జంగమారాధనమును జరుపుచునుండెను జంగమార్చన గావించుటయే శివార్చన గావించుటయని యార్యులవలన నెరిగిన వాడై ఈతడు తనకున్న సర్వస్వము ను. జంగముల కర్పించి, శివానందపూర్ణుడై యుండెను బసవడు, శీలమే శివుని నిజాలయమని యెరిగి, శీల సత్ప్రాణియై యుండి, వికారము లన్నిటికిని మనమే మూలమని యెరిగి, మనస్సును నిగ్రహపరచుకొని, కోర్కెల మాయ లందుబడక శివభక్తి తత్పరుడై యుండెను. ఇట్టి బసవని సద్భక్తిని జూచి భక్తులందరును, "బాపురే బసవయ్య బసవాంశజుండ, బాపురే బసవయ్య ప్రవిమల భక్త, బాపురే బసవయ్య ప్రఖ్యాత చరిత, యేపుతో నీ మహిమెరింగి నుతింప ప్రాపుగా నితరులకేపారవశమె" అని ప్రస్తుతించిరి. ఈ విధముగ శివారాధనకే తన జీవితమును ధారవోసిన ధన్యుడీ బసవడు

ఈ కవి గ్రంథమును గురించి యిట్లు చెప్పుకొనినాడు

"ఆరూఢ చిక్క వీరాచారి ఘనుండు
శ్రీరమ్య మతి తోడ జెప్పిన యట్టి
నాటకాలంకార చాటు శబ్దార్థ
పాట మాలాప నిబంధ నారూఢ
బంధుర విలసత్ప్రబంధ హృద్యోక్తి
సంధాన లాలిత బంధ సమ్మతిని"

ఇట బంధసమ్మతి యనగా ప్రబంధ సమ్మతి నని యర్థము గావచ్చును

ఇది అయిదాశ్వాసముల ప్రబంధము ఇందును పాల్కురికి సోమన బసవ పురాణమునవలెనే బసవేశ్వరుని చరిత్ర ప్రధాన కథేతివృత్తము దానియందు వలెనే దీనియందును ప్రసక్తానుప్రసక్తముగ అనేక శివభక్తుల కథలు వర్ణింపబడినవి కేవలము యితివృత్తము, ఛందోవ్యాకరణాది విషయములందు మాత్రమే గాక, రచనా రీతులయందును, వర్ణనా విధానమునందును పాల్కురికి సోమన యడుగుజాడలలోనే నడచినాడు శైలియంతయుగూడ బసవ పురాణ శైలినే పుణికి పుచ్చుకొని నట్లున్నది

"నే దెచ్చి తూము దానెరింగ్రొత్తగట్టు
పాపి క్రొత్తది గాదు ప్రఖ్యాతి మహిని
పాపి యోమునుపట్టి పాపిని సరియె
పాపి గట్టిన తూము పరగ క్రొత్తనరు"

"సోమన ఇది పాపి తూమునకు పాపి సరి యౌనేని" మొదలగు ద్విపదలవలెనున్నవి

ఇవి కూడ సోమనవలె భక్తి పారవశ్యముచే బసవన కీర్తనలో మునకలు వైచుచున్నాడు.

మరి బసవా యని మది బరించినను
కరణేంద్రియంబులు కడకేగు గాదె

మరి బసవా యని మది బరించినను
వరపును నుదుచి యా వ్రాలు జెడదె"?

ఈ పొత్తమున మూడువంతులు జంగమార్చన విశేషమును గూర్చియే వర్ణిత మైనది

మన శరీరము పృధివి, లింగము వృక్షము జంగమ మాక్షేత్రమున, పండిన ఫలము జంగమునితో కూడ నారగించినదే రుచికరముగ నుండును

అనేక విధములుగ వర్ణింపబడిన జంగమార్చన మహిమలనుగూర్చి పుస్తకమునందెల్లెడల గనవచ్చును జంగమ లింగములకు భేదము లేదు పాలలో నేయివలె వారిద్వురకును నభేదము. శివ ప్రీత్యర్థమై చేయబడిన పాపము కాదనియు, అది ధర్మతుల్య మగుననియు శివుడు భక్తులకు సెలవిచ్చినాడు.

"మన్నిమిత్తం కృతం పాపమనగ కరమర్థి ధర్మాయ కల్పతే యనగ, భువి మామనాదృత్య పుణ్యంచయనగ"

"శివ హితార్థంబుగా జేయు పాపములు
నవి యెల్ల పుణ్యంబు లవని లోపలను
శివునికి దూరమై సేయు పుణ్యములు
నవియెల్ల పాపంబులగు విచారింప"

ఇందు మడివాలు మాచయ్య 'అల్లమప్రభువు' మోళిగయ్య మొదలగు ముప్పదికిపైగా శివభక్తుల చరిత్రలు వర్ణితములైనవి

ఇంకను విమలదేవయ్య, భాషియయల్లమయ్య, దేమరసయ్య, ధూర్జటి, శంకరదేవుడు, సివిగుణుడు, లింగప్ప, మాచలదేవి, దాచలదేవి, రాజన బ్రహ్మయ, మొదలగు భక్తుల చరిత్రలు వర్ణితములైనవి.

ఈ కవి పెక్కు కర్ణాట పదములను వాక్యములను నుపయోగించినాడు భక్తుల పేర్లు కూడ కన్నడములే. వీరు కర్ణాటదేశమందలి సుప్రసిద్ధభక్తులై యుందురు హెండద మారయ్య, కంతెయ మల్లయ్య, లింగప్ప, మనసద మారయ్య. వీరందరును కర్ణాట దేశీయులే.

ఈ కవి రచనా విధానమందు పాల్కురికి సోమన యడుగుజాడలలోనే నడచుకొనినందున, అతని కించుక యర్వాచీనుడై యుండుననియు, కాన 15వ శతాబ్దాంతమువాడై యుండుననియు భావించవచ్చును

## శివరహస్య ఖండము

అముద్రితము[79]

ఈకృతి రచయిత వింటి సిద్ధన కుమారుడయిన దౌబళకవి అవతారికలో కవి తన్నుగూర్చి యేమైన చెప్పికొనెనో లేదో, కృత్యవతారిక లేనందున తెలియ వచ్చుటలేదు. గ్రంథాంత భాగమునుబట్టి యీ కృతికర్త దౌబళ కవియని తెలియుచున్నది

"అని జానకి హృదయాధీశు పాద
వనజ మరంద సేవన వరభృంగ
మగువింటి సిద్ధన నాత్మ సంభవుడు
సుగుణాఢ్యు డౌబళ సుకవి శేఖరుడు
... ...
స్కంద పురాణ శంకర సంహిత నేడు
అందును శివరహస్యాఖ్య ఖండమున

79 మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము డి. నెంబరు 1012, కాగితప్రతి

దేవకాండము జెప్పి ధీయుక్తి దాత
భావించి బుధజనుల్ ప్రస్తుతి సేయ"

కవి పదునైదవ పదునారవ శతాబ్ది ప్రాంతమువాడై యుండవచ్చునని రచనను బట్టి తోచుచున్నది. ఇందు అసుర, వీర, సంభవ, మహేంద్ర, యుద్ధ, దేవ, దీక్షాకాండలను సప్తకాండలు గలవు

కాని ప్రస్తుత మిందయిదుకాండలు దేవకాండంతమువరకు మాత్రమే గలదు. దీక్షాకాండ నష్టమైనదేమో తెలియరాదు. ఉన్న కాండములలో గూడ కొన్నిటి కాద్యంతములు లేవు. ఇది స్కాంద పురాణాంతర్గతంబైన శంకర సంహితలోని శివరహస్య ఖండమున కనువాదమని తెలియుచున్నది

అనువాదము మూలానుసరణముగానే యున్నది

సంభవ కాండయందు పార్వతి దక్షుని పుత్రియని యనిపించుకొన నిష్టములేక పర్వత రాజపుత్రిగా జన్మించుట రజతాద్రిపై తపమాచరించుచున్న శివుని సేవకై పార్వతి నియుక్తురాలగుట, తారక శూర పద్మాసురుల సంహారము పార్వతీ పరమేశ్వరులకు జన్మించిన కుమారస్వామివలన జరుగునని బ్రహ్మ దేవతల నూరడించుట, మన్మథ సంహారము, రతి విలాపము, పార్వతీ పరమేశ్వరుల కల్యాణము, కుమారస్వామి జననము, దేవతలు కుమారస్వామిని సేనాపతిగా పొందుట, తారకు నాతడు ద్రుంచుట, వర్ణింపబడినది. ఈ కాండాంతము లేదు.

శూరపద్మ, సింహవక్త్రి తారక ముఖాది నిఖిల దనుజుల చరిత్రలు జననంబాదిగా నా సురకాండమున వర్ణితములైనవి. ఈ యాసురులందరును, దేవతల నిడిన యనేక బాధలను గూడ నిందు వర్ణించినాడు, ఆసుర కాండాంతమున కూడ కొన్ని ద్విపదలు లుప్తమైనట్లు కానవగును.

వీరమహేంద్ర కాండములలో కుమారస్వామి వీరబాహుని మూలముగ శూరపద్మునియొక్కయు, అతని పట్టణమైన వీరమహేంద్రపురముయొక్కయు

సంగతిని తెలిసికొనుట. వీరబాహుడా పురమున కేగినపు డటగల రాక్షసులకు తన బలమును రుచి చూపుట, యీ వృత్తాంతమును గుహునకు ఇంద్రాదులకు నెఱిగించుటయు, వర్ణితములైనవి. ఈ కాండమున కాద్యంతములు లేవు.

శూరపద్ముడు తన పుత్రుడైన భానుకోపుని కుమారస్వామిపై యుద్ధ క్షేత్రమునకు పంపుటతో యుద్ధకాండ ప్రారంభమగును. భానుకోపుడు వీరబాహునితో యుద్ధముచేయుట, శూరపద్ముడు యుద్ధభూమి కేతెంచి వీరబాహు, కుమారస్వాములతో బోరుట, భానుకోపుడు మడియుట, సింహవక్త్రాసుర వీర బాహుల యుద్ధము, కుమారస్వామి యుద్ధక్షేత్రమున కేతెంచుట, శూరుడు మందర పర్వతమును దెప్పించి యుద్ధస్థానగత రాక్షసులను పునరుజ్జీవితులను జేయుట, శూరుడు చక్రవాక పక్షిరూపము దాల్చగా, ఇంద్రుడు మయూర రూపమును దాల్చి యుద్ధమొనర్చుట చివరకు మామిడిచెట్టు రూపమును దాల్చి మాయావియైన శూరుని కుమారుడు శక్త్యాయుధముచే గూల్చుట. శూరుని శరీర శకలములనుండి, కుక్కుట మయూరము లుద్భవింపగా, వానిని ద్రోవదలచి కుమారస్వామి కటాక్షవీక్షణము వానిపై ప్రసరింపగా, నజ్ఞానమును బాసి, గుహునకు నమస్కరించి నిల్వగా, సంతసించి వానిని తనకు ధ్వజ వాహనము లుగానుండ మన్నించినాడు

యుద్ధ కాండమారంభమునుండియు గలదు ఈ కవి యిష్ట దైవము శ్రీరాముడైనట్లు తెలియుచున్నది కాండారంభమును కాకుస్థ కుల సోముడైన కౌసల్యా రాముని నుతితో నారంభించినాడు ఈతడు కాళిదాసు నొక్కనిని మాత్రమే స్మరించినాడు. కాళిదాసు కుమార సంభవమునందలి భావములను గైకొనుటవలన కాబోలు నొక్కనిని మాత్రమే స్మరించినాడు. మరి యే యితర సంస్కృత కవులనుగాని, ఆంధ్ర కవులనుగాని స్మరింపలేదు. యుద్ధ కాండాంతము గూడగలదు

దేవకాండము ఆద్యంతములలో గూడ పూర్తిగ నున్నది. ఇందు కుమారస్వామి అపరాచలమున కేగుట అట మునులందరును ఆ అచలముననే నిల్వ వలసినదని వేడగా వారి కోరికను మన్నించి ఆతడటనే నిల్చుట, దేవ

సేనా కుమారస్వాముల కల్యాణము, వల్లీ కల్యాణమును వర్ణింపబడినవి. వల్లీ దేవసేనలను కుమారస్వామి పెండ్లియాడుటకు గల కారణము పూర్వ జన్మమున వారు తన్ను భర్తగా బడయగోరి తపమాచరించుటయె ఇందు ముచికుందుని వృత్తాంతము గూడ వర్ణితమైనది ఇది దేవకాండకథ ఈ కాండాంతము గలదు అంతమున కాండము చదివినందులకు ఫలము కూడ జెప్పబడినది

దీక్షాకాండమును రచించినట్లు కవి చెప్పెనుగాని, నదియిందులేదు. నష్టమైపోయినదేమొ

ఈ గ్రంథమందలి కవిత్వము రసవంతమై, యించుకప్రౌఢమై యొప్పారుచున్నది శైలి యెచ్చటను కుంటువడక, ధారావాహిగా సాగి పోయినది తెలుగు సంస్కృతపదము లీకవి కవనములో సమపాళ్లగా మేళ వించుకొన్నవి. ఈతడు గావించిన వర్ణనాదులు సోయగముల నింపుకొన్నవి. ఉదాహరణమునకు దేవకాండమందలి మనోవతియను బ్రహ్మపట్టణ వర్ణనమును చూడవచ్చును.

ఇదేవిధముగ శూరపద్మాసురుని పట్టణమైన వీరమావేంద్ర పురవర్ణన గూడ సొగసుగా నున్నది

భస్మీభూతుడైన మన్మథుని జూచి రతి విలపించు ఘట్టము కరుణ రసస్ఫోరకముగా నున్నది.

"చక్కటి వారలలో జక్కనివాడ
వక్కట యారూప మణగెనే నేడు
తలిదండ్రులును యన్నదమ్ములు చుట్ట
ములు లేక ననదనై పురుషుడవీవు
గలవని నమ్మిన కాంత నన్ను
దలపక విడిచి పో దగునె ప్రాణేశ
హానాథ నిస్సేతువైనట్టి నీర
మానీరజము బాసి యరిగెడు లీల

దిక్కెవ్వరును లేక దీన భావమున
బొక్కెడు నను డించిపోయితే నేను
నా వల్ల నేర మెన్నటికైన గలదె..."
...   ...
హా జీవితేశ్వర హా పంచ బాణ
హా జగన న్మోహన హా కీర వాహ"

ఈ రతీ విలాపమునందలి ద్విపదలు కొన్ని, కాళిదాసుని కుమార సంభవమందలి శ్లోకమున కనుకరణములుగా కన్పట్టుచున్నవి 'చక్కని వారలలో చక్కనివాడ' నునది "ఉపమాన మభూ ద్విలాసినాం కరణం యత్ తవకాన్తిమత్తయా తదిదం గతమీదృశీందశాంసవి దీర్యేఖరినా, ఖలు స్త్రియః యను కాళిదాసుని శ్లోకమువలె నున్నది ఇటులే 'హానాథ నిస్నేతువైనట్టి సీర, మానీరజము బాసి యరిగెడు లీల' యను ద్విపద

'క్వనుమాంత్వదధీన జీవితాం వినికీర్య క్షణ భిన్న సౌహృదః
నలినీం క్షత సేతు బన్ధనో జల సంఘాత ఇవాసివిద్రుతః'

యని కాళిదాసుని శ్లోకములోని భావమును పుణికి పుచ్చుకొనినట్లున్నది. 'నావల్ల నేర మెన్నటికైన గలదె, నీవొనరించిన నేరంబు గలదె, నేడు నేరములేని నేరంబుగాదు, జోడు వాని యలంప బూనుట తగునె'—ఈ భావము కాళిదాసుని యీ క్రింది శ్లోకమున గలదు-

"కృతవానసి, విప్రియంనదమే ప్రతికూలం నచతే మాయాకృతః
కిమకారణ మేవ దర్శనం విలపన్త్యైరతయేన దీయతే"

"హృదయేవససీ తి మత్ప్రియం
యదవోద స్తవ వైమి కైతవమ్
ఉపకార పదం నచేదిదం
త్వమనజ్గః కథమక్షతారతిః" ఈ శ్లోకమే ఈ క్రింది ద్విపదలలో పొదిగింపబడినది.

"మరుదెప్పుడును రతి మదినే వర్తిల్లు
నను జన వాక్యంబు లకృతంబులయ్యె
ఆ వచనములె సత్యము లగునేని
నీవు దగ్ధుండవైన నే నిల్చుటెట్లు"

ఈతని సంస్కృత పద ప్రయోగమునకు, అసురేశుడనువాడు యుద్ధభూమి కేతెంచు వర్ణన యుదాహరణ కాగలదు.

"చటుల డిండిమ వెణు ఘర్ఘర ప్రకర
భేరీ మృదంగ గంభీర సంరావ
చారు గండస్థల సంస్రవద్గంధ
నిహితలోహ స్తంభ నిగళ ప్రముక్త
బహు హస్తి బృంహిత స్పర్శనోద్యోగ
సహకార తురగ హేషా ఘోష వంది
సహిత మాగధ యూధ సంతత స్తోత్ర
సంభ్రమ ద్రధ చక్ర సందోహ నేమి
సంభ్రమ ధ్వని ధనుర్జ్యానాద సుభట
కృత సింహ నాధ సక్ష్వే ళాట్టహాస
జిత మహాకల్పాంత సింధు కల్లోల
గంభీర ఘోషుడై కాంచన కుంభ
శుంభ దాకీర్ణ భాసుర మణి చ్ఛత్ర
పరివృతాననుడైన బహు దైత్య సైన్య
చరణ దేవాశ్వ చరఖుర న్యాస
సంజాత భూరేణు జాత సంఛన్న
కంజాత బాంధవ ఘన మండలాష్ట
హరిదంతరిక్షుడై యసురేశ్వరుండు"

యుద్ధ భూమికి పయనమైనాడు ఆయా ఘట్టములకు తగినట్లుగా రస పోషణ మును గావించి కావ్యమునకు గౌరవము నాపాదించినాడు రాక్షసులు దేవతాదు

లను పీడించినపుడు భయానకరసము, యుద్ధ సందర్భమున వీర రసము, యుద్ధ క్షేత్ర వర్ణన యపుడు బీభత్సము, వల్లీ దేవసేనల కల్యాణ సందర్భ మున శృంగార రసము, వీరులు యుద్ధమున మరణించిన సందర్భమున వారి యాప్తులు శోకించిన పట్టులందు కరుణ రసములును పోషింప బడినవి.

కొన్నిచోట్ల కవివాడిన యుపమలు సుందరముగా నున్నవి కుమార స్వామి పెండ్లి పీటలమీద దేవసేనను వీక్షించినాడు అపుడట ఒక పద్మముపై పండ్రెండు తేంట్లు వాలినట్లున్నదట దేవసేన మోము పద్మముగను, కుమార స్వామి కండ్లు తుమ్మెదలుగను నుపమింప బడినవి. "ఆరుమోముల సామి యతివ నెమ్మోము, కూరిమి మీరగ గన్గొనుచున్న వేళ, తామరమీద ద్వాదశ తేంట్లు వ్రాలె, నేమొ కోయన నొప్పె నిందీవరాక్షి" దేవసేనా వల్లీ విహాహ సందర్భమున, శోభనములు, గౌరీ కల్యాణము మొదలగు వానిని పాడినారని యును, సప్తపది లాజ హోమము, అరుంధతీ దర్శనములను వర్ణించినాడు దేవ సేన పెండ్లి నాల్గు దినములు జరిగినదట. "చెవి నిల్లు గట్టుక చెప్పితి" వంటి నుడికారముల నందందుపయోగించినాడు. కుమారస్వామి మీది విరాళికి తాళలేక యామె తపన జెందుచు, గుహా గుహా యని వలవించుచుండగా, బోయస్త్రీ లామెకు గాలి సోకినదని వివిధములైన నివారణోపాయములను దెల్పుదురు. 'సోకుడు గాబోలు చూపింపలేను, లేకున్న గిరి గుహాలీ లేమ యదితలంచు అని బలుక్రువారును అందులో కొంద రెనసి యా చెలినింట యిట వుండసీక చేసి కావలిబెట్టి బెరచి రన్నారు దీనికిప్పుడు నేమి దేవర కిడిన చల్లనయ్యానని సాంబ్రాణి జాల, కొల్లలుగా దెచ్చి కుంభంబులందు పాల పొంగలిబెట్టి బలియొన రించి, చాల సన్నుతిచేయు సమయంబునందు" దీని వలన నాడు సోకుడు వంటి వానిపైన, బలులపైన ప్రజలకు నమ్మకముండినట్లు తెలియుచున్నది

## శంకర సంహిత

**అముద్రితము**[80]

ఇది స్కాంద పురాణాంతర్గతమగు శంకర సంహితకు తెలుగుసేత,

---

80 తంజావూరు సరస్వతీ మహలు గ్రంథాలయము, ఎమ్. 266, ఎమ్. 267 కాగిత ప్రతులు

కాని గ్రంథ మసంపూర్ణముగ నున్నది. ఆద్యంతములులేవు రెండుప్రతులున్నవి గాని రెండును నట్టులే యున్నవి. ఆశ్వాస విభాగము గానరాదు ఒక్కచోట గ్రంథ మధ్యమున ఆసురకాండమని మాత్రము గలదు. గ్రంథకర్త యెవరో తెలియదు.

"శ్రీగిరి నాధు జిత దైత్య యోధు
యోగి చిత పయోజ ద్విరేఫు
సకల లోకాధారు సంతతోదారు
కుకురాంక సంహారు మంజులాకారు
వేద శీర్షాగమ విపిన సంచారు" అని యీశ్వర స్తుతితో గ్రంథారంభమును గావించి, వ్యాస వాల్మీకాది యాది కవులను నుతించి కావ్యరచన కుపక్రమించినాడు సూతుడు శౌనకాది మునీశ్వరులకు జెప్పిన కథ యిది

ఇది శివరహస్య ఖండ భాగమే ఇందు సంభవ, అసుర, వీరమాహేంద్ర యుద్ధ, దేవ, దక్ష ఉపదేశ కాండల కథ గలదు

దాక్షాయని యని పిలువబడుట కిష్టములేక, పర్వతరాజ పుత్రిక పార్వతిగా జనించుట, దేవతలు, శివుని మనస్సు పార్వతిపై లగ్నము చేయుటకై మన్మధుని తపోవనమునకు బంపుట, ఆట మన్మధుడు శివునిచే భస్మీభూతుడగుట, యిత్యాది కథతో గ్రంధారంభము గావింపబడినది.

తదుపరి కుమారస్వామి దేవతల సేనాపతియిగుట, తారక, శూరపద్మాసుర, సింహవక్త్రిల జననము, వారు శివునిగూర్చితప మొనర్చివరములనుబడసి బ్రహ్మాది దేవతలను క్షోభపెట్టుట (సురసయనెడి రక్కసికిని, కశ్యప మహర్షికిని జన్మించిన వారు శూరపద్మ, సింహవక్త్రి, తారక, అజాముఖులు, వీరుగాక వారి ఘర్మ జలములనుండి అనేక వేలమంది రాక్షసులుద్భవించిరి) అజాముఖి దుర్వాసులకు వాతాపీల్వలు జనించుట, వాతాపీల్వ లగస్త్యునిచే మరణించుట, సముద్ర మధన వృత్తాంతము, విష్ణు పమృతమును పంచి యిచ్చు నెపముతో మోహిని రూపమును గైకొనుట, ఆ మోహిని యాకృతిని జూచి శివుడు మోహిం

చుట, యిర్వురును సురత క్రీడ సల్పగా, వారికి శాస్త్ర జనించుట ఆ సమయమున వారి శరీరములందు జనించిన ఘర్మజలము గండకీ నదిగా పారుట, అందు కాంచన గర్భ శిలలు గల్గుట, ఆ శిలలలో కొన్ని వైష్ణవమూర్తులై విలసిల్లుట, ఆ మూర్తులను పూజించువారికి మహాపుణ్యము గల్గునని చెల్పుట వరకు గల కధ లభ్యమగుచున్న గ్రంథమున గలదు ఇది ఎమ్ 268 నెంబరుగల గ్రంథము.

ఎమ్ 267 నెంబరుగల గ్రంథమున సుమారకస్వామి శూర పద్మాసుర, సింహ వక్త్రాది రాక్షసులను జంపు వృత్తాంతము కొంతవరకు గలదు ఎమ్ 267 నెంబరుగల తాళపత్ర గ్రంథమున గల యారంభము ఎమ్ 268 దానినే పోలియుండుట వలనను, ఎమ్. 266 గ్రంథములోని తరువాతి కథా భాగమిందుండుట వలనను, ఎమ్ 267 ను, ఎమ్ 266 ను, ఒకే గ్రంథమని భావింప నగును

రెండు ప్రతుల యందలి శైలియు నొకే విధముగ నుండుట వలన, విని యొకే కవిచే నొకే గ్రంధముగా రచింపబడిన ప్రతియొక్క రెండు భాగములని భావింప వీలగుచున్నది

మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున గల[31] 'శివరహస్య ఖండము' కూడ శంకర సంహితకు తెలుగు సేతయే. ఒకే గ్రంథము నిర్వురు తెల్గు సేయుటవలన వారి యనువాదము లెట్లున్నవో పోల్చి పరిశీలించ వీలగు చున్నది

మన్మధుడు మొట్టమొదట బాణ సంధానము చేయగా నది చేతినుండి జారిపడినది అపుడు రతీదేవి దానిని దుశ్శకునముగా నెంచి, 'కరుణించి కాముని కాచుకోరయ్య" యని దేవ మనుష్య తిర్యగ్జాతుల నందరను ప్రార్థించినది. పిమ్మట మన్మధుడు రతీదేవి శంకించి నట్లుగనే, శివుని కంటి మంటయందు భస్మీభూతుడు కాగా, రతి విలాపించు ఘట్టమున కరుణ రసము నొలికించినాడు కవి

"నిను వాసి నిమిషంబు నేల నేనుండ
ననుడించి పోవుట న్యాయమే నీకు

తనకు చూచితె తల్లి దండ్రులు లేరు
తనకు బాంధవు లన్నదమ్ములు లేరు
యెవరితో యీ దుఃఖమే జెప్పికొందు
నెవరింక చల్లార్తు రీ శోక వహ్ని"

ఇదే ఘట్టమున జౌబళకవి రచించిన ద్విపదలివి.

"తలిదండ్రులును యన్నదమ్ములు చుట్ట
ములు లేక ననదనై పురుషుడ నీవు
గలవని నమ్మిన కాంత నన్ను
దలపక విడిచి పోదగునె ప్రాణేశ"

అతని చక్కదనమును తలచుకొని విచారించుచు నామె పల్కిన పలుక్కులుగా నీకపి రచించిన ద్విపదలు .

"చూచు వారల మనసుల గ్రహించు
నీ చక్కతనమెల్ల నేడెందులోయె
శైలజ పత్రంబున చక్కగానుండి
జలబిందు వందుండి జారిన రీతి"

జౌబళ కవి రచించిన ద్విపదలు,

"చక్కని వారలలో జక్కని వాడ
వక్కట యీ రూప మణగెనే నేడు"

ఈ సందర్భముననే కాళిదాసు 'ఉపమాన మభూద్విలాసినా' అను శ్లోకమును రచించినాడు

ఇంకను నామె,

"మును నిమ్న పరిహాసమునకు పూదండ
కొని కొట్టినది నేడు కొదువగా యెంచ

నీకపరాధంబు నే జేయలేదు
నాకు గావపరాధి నాధి యిట్లుండి
కనకాంగి నీ మది కదలక యుందు
నని పల్కుదువు తొల్లి యది కల్లలయ్యె
దైవమాయని యురస్థలి మోదుకొనుచు
భావంబు కలగ లేపైట తొలగ
మీటిన విచ్చు చన్ మిట్టలమీద
కాటుక కన్నీరు కాల్వలై జార" పలుమారు విలపించి
మూర్ఛిల్లినది.

ఇతడు గావించిన చంద్రోదయ వర్ణన సుందరతరముగ నున్నది.

"కరకుచు తిరుగ నక్కడ తూర్పు దిశను
తొగలకు రెండు కంతుని నేస్తకాడు
వింటి దొర జోడు పద్మ సైదోడు
కదలి పుట్టిన వాడు కళలకు వీడు
వెడమచ్చ కలవాడు వేల్పుల కూడు
చుక్కలు గమికాడు చూపట్టె మింట"
"కప్పుకలంచునే గంభీర జలధి"

"బంగారు వాలని కోపుకొందురె బాళికొని వెర్రులైన" వంటి జాతీయము లతో తీరు తీయములుగ రచించినాడు

ఇట్టి సుందర రచనలతో గూడిన యీ గ్రంథము కొంత లుప్తమైపోవుట మన దురదృష్టము

---

81. డి. నెంబరు 1012.

## బ్రహ్మోత్తర ఖండము

ఆముద్రితము[81]

తాటియాకు ప్రతి కర్త యాదాటి వేంకటనారాయణ. రామతీర్థమున వెలసిన నరసింహస్వామి భక్తుడీతడు ఇందు ప్రస్తావనాంశములేదు. కృతిపతి కొమరగిరి సుబ్బయామాత్యుడు ఇది స్కాంద పురాణాంతర్గతమగు బ్రహ్మోత్తర ఖండమందలి మందరయను బ్రాహ్మణునియొక్కయు, పింగళ యను వేశ్యయొక్కయు కథకు ద్విపదానువాదము ఇది పూర్వజన్మ కృత శివయోగి పూజాసత్కార ప్రధాన వర్ణనాత్మకమైన కథ

అవంతీ దేశమున మందరయను బ్రాహ్మణుడుగలడు అతడు పింగళిక యను వేశ్యాలోలుడుగా నుండెను వీరిర్వురిట్లు కాలము గడుపుచుండగా, వారి యొద్దకు (వృషభ) ఋషభ[82] యోగి, పరమశైవ సంపన్నుడేతెంచును. వారిర్వురును కలసి యాతని కతిభక్తితో సకలోపచారములను చేయుదురు ఆ వృషభయోగి వీరి యింటియందొక దినముండి మరుసటిదినము వెడలి పోవును కొంతకాలమైనపిదప మందర బ్రాహ్మణుడు మరణించును వృషభ యోగిని పూజించిన పుణ్యఫలమున జన్మాంతరమున నాతడు దశార్ణవరాజు పుత్రుడు భద్రాయువుగా జన్మించును

శివయోగికి గావించిన పూజాఫలమువలన, పింగళ వేశ్య జన్మాంత రమున సీమంతినీగ చిత్రవర్మ చిత్రాంగదుల కుమార్తెయై జన్మించినది. ఆమెకు భద్రాయువుతో బాల్యాత్ప్రభృతి స్నేహ మేర్పడినది భద్రాయువునకు పదునాఱు సంవత్సరముల ప్రాయమగునాటికి వృషభయోగి యేతెంచి, ఆ బాలునకు శ్రుతిస్మృతి పురాణముల నుపదేశించి, సర్వరక్షాకరమైన శివ కవచమను స్తోత్రము నుపదేశించి శత్రు విజయమునుగాంచు తెఱగు నెఱి గించెను. కొంతకాలమునకు భద్రాయువు తండ్రి దశార్ణ దేశరాజు వజ్ర బాహువునకు మగధదేశపు రాజుతో వైరమేర్పడగ, భద్రాయువా సంగతి

81. మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారము, ఆర్.నెం. 1543 తాటియాకుప్రతి

నెఱిగి, శివయోగి యొసగిన విజయశంఖ, విజయఖడ్గములతో శత్రు సంహారము గావించి తండ్రికి బంధమోక్షమును గావించెను పిమ్మట వృషభయోగి యాదేశానుసారము సీమంతినిని వివాహమాడి తల్లిదండ్రులతో సుఖముగ నుండెను.

గ్రంథాంతమున కవి తన్నుగూర్చి యీ విధముగ చెప్పికొనినాడు.

"ఇదివర రామతీర్థైశ్వర్య నృహరి
సదమల చరణాంబుజాత నిష్యంద
పటుతర మకరంద పాన ప్రమత్త
చటుల భృంగా యిత స్వాంతుడు పుడు(?)
సరసుండు యాదాది సద్వంశ జలధి
పరిపూర్ణ హిమకర ప్రాయుండుత్తముండు
గురుతర కౌండిన్య గోత్రోద్భవుండు
సురుచిరాప స్తంభసూత్ర పారకుండు
నరనుత వెంకటనారాయణాఖ్య
వరపండితుడు మహావైభవంబలర"

సుబ్బయామాత్యునిపేర గ్రంధమును రచించెను. ఈ సుబ్బయామాత్యుడీతని గురువేమొ. పై ద్విపదలవలన నీ గ్రంధకర్త యాదాటి వేంకటనారాయణుడు, రామతీర్థ నృహరి భక్తుడనియును, కౌండిన్య గోత్రుడనియును. ఆపస్తంభ సూత్రుడనియును దెలియుచున్నది 16వ శతాబ్ద ప్రాంతమువాడై యుండును. గ్రంథప్రాశస్త్యము నీవిధముగ దెల్పుకొనెను.

"విరచించు శబ్దార్థ విశ్రమ ప్రాస
సురుచిరాలంకార శోభితంబగుచు
రసికులు బుధకవి రాజులు మెచ్చ
నసదృశ గతినొప్ప నా హరి కరుణ
కరము బ్రహ్మోత్తర ఖండంబునందు
నరుదు మీరగ ద్వితీయాశ్వాసమయ్యె"

# సురా భాండేశ్వరము

అముద్రితము[84]

కవి గురవయ్య ఈతడు తనకు స్వప్నమందు శ్రీరామచంద్రుడు కానబడి ఈ సురాభాండేశ్వర కృతిని ద్విపదగా వెలయింపజేసి తనపేర నంకితముగావింపుమనినట్లు తెల్పుకొనినాడు విఘ్నేశ్వరాది దేవతాగణస్తుతితో గ్రంధారంభమును గావించినాడు కుకవులను లక్ష్యపెట్టనవసరములేదని తెల్పెను క్లుప్తముగా నిందలికథ యిది.

కాశిలో నొక మధు విక్రయుడుండెడివాడు అతని భార్య బహు రూపవతి ఆ కాశియందే వేద వేదాంగములందు నిష్ణాతుడైన విప్రుడొక డుండెను ఒక దినమాతడు గంగానదిలో స్నానముచేయుచు మధు విక్రయుని భార్యను దండాలికనుగాంచి ఆమెరూప సౌందర్యమున కబ్బురపడి మదోన్మత్తుడై ఆమెను వెన్నంటి దరికిజేరి తన కోర్కెను దీర్చమని వెడికొని నాడు గాని యామె యంగీకరింపక, వెడలిపోగా, నామె భర్తయందలి భయముచే నూరకుండెను కాని యామెపై తమకము నాపుకొనలేక మరల యామెచెంతకుచేరి యామెను బ్రతిమిలాడి తన కోర్కెను దీర్పకున్నచో ప్రాణములను విడుతునని శపధము చేసినాడు అతడు చనిపోయిన నిజముగా తనకెక్కడ బ్రహ్మహత్యా పాతకము తగులునోయని యామె తన గృహమున కాతని గొనిపోయి, యాతని కోర్కెను దీర్చినది. కాని యింతలో భర్త యేతేరగా, నాతనిని సురాభాండమున దాచి భర్తతో తను గావించిన తప్పిదమును దెల్పి తన్ను చంపి కైవల్యపదమునకు బంపమని వేడినది ఇంతలో సురాభాండముననున్న విప్రుడు బ్రహ్మరంధ్రమున ప్రాణములను విడిచినాడు. ఆమె భర్త మధువిక్రయుడు సురాభాండమున బ్రాహ్మణుని ఉంచినందుల కామెను నిందించి తనకు బ్రహ్మ హత్యా పాతకము సంభవించునని తలచి, ఆత్మహత్యకు పూనుకొనెను ఆతనిభార్య శివుని ప్రార్థింపగా, సురాభాండమున

---

84 మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము, డి నెం. 1207, కాగితప్రతి

నీశ్వరుడు ప్రత్యక్షమై సురాభాండేశ్వరుడయ్యెను.

ఈ కవి యవతారికలో నన్నయాది కవులను స్మరించినాడు.

"కవితార్థధుర్యు వాగనుశాసనార్యు
కవితా విరాజి తిక్కన సోమయాజి
మొదలగు కవిరాట్ప్ర మూహంబు దలచి
పదపడి శ్రీ గురుపదముల కెఱగి
లలి సురా భాండేశ్వరంబును ద్విపద
దెలుగు సేయగా గొంత దివిరి యున్నంత"

ఈ కథను కాశీ ఖండమందుండి గ్రైకొనినట్లు కవి చెప్పినాడు

"అని కాశికా ఖండమందొప్పియున్న
ఘన సురా భాండేశు కథయును ద్విపద"

కవి తండ్రి రావుల పురవాసియైన వేంకట నరసింహుడు బాదరాయణ గోత్రుడు, దీనినీతడు శ్రీరామచంద్రుని పేరుమీదుగా రచించినాడు. (అవతారిక)

నాకీ గ్రంథముసంపూర్తిగ లభించినది బైండు చేయుటలో కొన్ని పుటలు వేరొక గ్రంథములో చేర్చబడినట్టు కానబడుచున్నది.

ఈ కవి పురాణాంతర్గత కథను గ్రైకొని దానిని వర్ణనాదులచే పెంచి ఒక చక్కని శృంగార రసమయ కావ్యముగా తీర్చిదిద్దినాడు. ఇందు సామాన్య మగు ననేక వర్ణనలతోపాటు చంద్ర మన్మథోపాలంభనములు గూడ గలవు. సాయంకాలముకాగా వేద బ్రాహ్మణునకు మధువిక్రయి భార్యయొక్క విరహముచే విరాళి హెచ్చినది. మన్మథు నుపాలంభింపజొచ్చినాడు.

"మార నీ బయిసార[88] మారులేక
సూరెల గారింప సురియల నొంప

88 (1) బయిని — నాశన మగుట యని యర్థము. బయిసి ఆరు — భవిష్యచ్ఛబ్ద భవము, బయిని (యీ పదము చిత్తూరు ప్రాంతమున వ్యవహార మున గలదు). కడపమండలమువాడయిన పెద్దన దీనిని ప్రయోగించినాడు.

త్వమునసే మిక్కిలి న్యూనమగుచో నదియు తరబాదిప్రత్యయములను బొందును. దానికంటె తక్కువగానున్నది. లేదని యర్థము భాసించును. నీచులు ఒక తెగకు చెందినవారుందురు. వారిలో గూడ ఉచ్చ నీచభావము తప్పక యుండును. ఒకే విధమగు నీచత్వము ఎల్లరియందు ఉండదు. ఆ స్థితిలో నూటికి అరువదిపాళ్ళు మంచి గుణములు కలవాడొకడు, ఏబది పాళ్ళు మంచి గుణములు కలవాడు మరియొకడు అను రీతిని భేదము వారిలో నుండును. ఆ సంఘమున నూటికి నూరుపాళ్ళు చెడుగుణములు కలవాడు 'నికృష్ట తరః' అను పదముచే వాడబడును. నీచభావమున వానికంటె నీచుడు మరియొకండు లేడను భావము భాసించును. ఈ పద్ధతిలో నీచత్వమున ఆధిక్యముండుటచే నచట నట్టి ఉత్కర్షమును గ్రహించి తరతమ ప్రత్యయములు ప్రవర్తింప గలవు.

అట్లే ఉత్తములు ఒక తరగతికి చెందియుంచురు. వారిలో నూటికి పదిపాళ్ళు చెడు గుణములు కలవాడొకడు, అయిదుపాళ్ళు చెడుగుణములు కలవాడు మరియొకడు, అను రీతిని తారతమ్యము నియతముగా నుండును. నూటికి నూరుపాళ్ళు మంచిగుణములు కలవాడు సర్వోత్తము డగును.

ఇట్లే ఏమియులేదను నర్థమును బోధించునపుడు 'న' శబ్దమునకంటె తరబాదులు ప్రవర్తించును. 'నతరామ్'. 'న' శబ్దమునకు అభావమర్థము. అభావమనగా లేమి. ఆ లేమిలో గూడ ఏమియులేదనెడి స్థితిని పై శబ్దము సూచించును. లేమిలో పరమావధి ఉత్కర్షముగా భావింపగా తరబాదులు ప్రవర్తించును. ॥6॥

*అవతారిక* — గోతరా (ఈ రెండు గోవులలో ఈ గోవు ఉత్కృష్టమైనది) 'అశ్వతరః' (ఈ రెంటిలో ఈ యశ్వము ఉత్కృష్టమైనది) అను ప్రయోగములు కానవచ్చు చున్నవి. ఇచట ఉత్కర్షమునకు కారణమగు గుణము ఏదియు శబ్దవాచ్యమై లేదు. గోత్వము, అశ్వత్వము అను జాతులు మాత్రము భాసించుచున్నవి. అవి ఎల్ల వ్యక్తులకు సమానములే కాన, ప్రకర్షహేతువులు కానేరవు కాగా పై ప్రయోగముల కుపపత్తి యెట్లు? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ నాపేక్షతే నిమిత్తం చ ప్రకర్షే వ్యాపృతం యది ।
ద్రవ్యస్య స్యాదుపాదానం ప్రకర్షం ప్రత్యనర్థకమ్ ॥ 7

(ద్రవ్యమ్) = ద్రవ్యము, ప్రకర్షే = అతిశయము చూపదలచినపుడు, వ్యాపృతమ్ = వ్యాపారముతో గూడిన అనగా విశేషముగానున్న, నిమిత్తమ్ = నిమిత్తమును, న + అపేక్షతే + చేత్ = అపేక్షింపనిచో, ప్రకర్షం + ప్రతి = ఇతర వస్తువులకంటె తనయందున్న ఉత్కర్షమును గూర్చి అనగా దానిని వ్యక్తపరచుటకై, ద్రవ్యస్య = ద్రవ్యముయొక్క, ఉపాదానమ్ = స్వీకారము, అనర్థకమ్ = ప్రయోజనము లేనిది, స్యాత్ = కావలెను. నిరూపింపదలచిన అతిశయము వ్యక్తముకానందున 'గోతరా' అను ప్రయోగమే లేకపోయెడిని అని భావము.

"పని విని సురాభాండేశ్వరంబు
వినిపింతు జగములలో వినువారికెల్ల
బులిగడ్డ వంగాబ్ది పూర్ణచంద్రుడను
వెలయంగ నారనాభిఖ్య సత్కవిని
పదునొప్ప నీ సురాభాండేశ్వరంబు
నిగవొంద శివకథ నీ పుణ్య చరిత"

ఈతనియొక్క శైలి నెఱుగుటకు విప్రుడు జూచి మోహించిన యీాడె వనిత సౌందర్యమును వర్ణించిన ద్విపదలు సహాయకారిగ నుండును.

"పగడంపు తోడీదు బాల కెమ్మోవి
జిగి వజ్రములను బోలు జంట (?) పలువరుస
ముద్దుగారెడు మోము మెఱుపైన తీరు
అద్దంపు (?) వెలుగైన చెక్కిళ్లు
...       ...
పసగల్గి తాంబేటి ఖ్యాతి మీగాళ్లు
పొసగ ధర్మంబుల పోలు అరికాళ్లు"

ఈడిగ దంపతులకు ప్రత్యక్షమైన యీశ్వరుడిట్లుండెను

"ఏనుగ చర్మంబు యెమ్మెతో గప్పి
ఘనమైన పులితోలు కడుమీద గప్పి
(?) (వు)న పేరులువేసి భూతివెస, లాచి
రమణించి దం మృగ త్రిశూలములు చేపట్టి
కవగూడి కండలో కంకణంబుల్బాను
వుడకాజు మోముపై నొప్పగా నమర
ఒకచేత పరశు వకచేత జింక
అకలంకమున బట్టి అతి మోదమునను"

**ఇం**దనేక స్థలములందు **పాదుకొ**నుట కనువుగ నుండునట్లు దీర్ఘములను చేర్చుట **మాత్రమేకాక,** పాదములందొండురెండక్షరములనుజేర్చి గణ భంగమును **కూడ** **జేసినాడు** కవి. దీనిని ద్విపద కావ్యమనుటకంటె ద్విపద వికారమగు రచన **యనుట** యుచితముగ నుండును ఈ కవి కాల మెరుగరాదు ఈతడును 16వ 17వ శతాబ్దముననే యుండియుండును.

## సోమవార మాహాత్మ్యము

అముద్రితము[87]

కృతికర్త శ్రీగిరి మల్లికార్జునస్వామి గ్రంధారంభమున కాని, గ్రంధాంతమునగాని తన వంశాదికములనుగూర్చి చెప్పికొనకపోవుటచే నీతని గూర్చిన వివరము లేమియు తెలియుట లేదు. ఈతడు శైవుడు. శైవ సంప్రదాయము ననుసరించి కులగోత్రాదికముల ప్రస్తావన చేసికొనలేదు, సోమవార మాహాత్మ్యమునుగూర్చి నందీశ్వరుడు మును లెల్లరకును జెప్పినట్లుగ గ్రంధారంభము గావింపబడినది. సోమవారమునాడు నక్తము చేసినచో చతుర్ముక్తి లభించును, అట్లు నక్తము చేయు నాతడు శివుని సారూప్యమును బొందును. ఒక సోమవార ముపవాసమున్న కోటి యేకాదశు లుపవాసముండు ఫలముకన్న నధిక ఫలము లభించును అన్ని సోమవారములను ఫలము నిచ్చునవైనను, మాఘ కార్తీకమాసమునందలి సోమవారము లధిక ఫలప్రదములు

ఇట్లు సోమవార ముపవాసమున్న గలుగు ఫలములను విశదీకరించి, పిమ్మట సోమవార వ్రతవిధానమును ఉద్యాపన విధానమున చెప్పినాడు

ఈ వ్రతక్రమమును, ఉద్యాపన విధానమును విన్న వశిష్ఠుడు, ఈ వ్రతము నొనరించి శూలి సన్నిధికేగిన వారెవరైనను గలరాయని ప్రశ్నింపగా

87 మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము డి. నెం. 1019 కాగితప్రతి.

నట్టివారున్నారని, నందికేశ్వరుడు వసిష్ఠునకు ధనపాలశెట్టి కథను దెల్పినాడు. పురహారుని పువ్వుల పూజించుటవలన, ఈ ఫలము గలుగునట

"ఒక పువ్వు శివు బూన్ప నొక యజ్ఞ ఫలము
ధూపంబు లిచ్చిన ధూర్జటి జేరు
దీపంబులిచ్చిన దివ్య దేహంబు
నైవేద్య మిచ్చినా(న) నరజన్మ ముడిగి
శివుని సాయుజ్యంబు జేరు నిశ్చయము

. . .

పరుల తోటల పువ్వులు వనబత్తిరియు
నవిదెచ్చి పరమేశు కర్పించెనేని
పూజ చేసిన ఫలము పొసగు జెరిసగము"

ఇది మంజరీ ద్విపద వికారమైన గేయచ్ఛందస్సులో వ్రాయబడినది. పాడుట కనువుగా నుండుటకై పాదాంతములందనేక స్థలములందు దీర్ఘములు సాగింపబడినవి. కవిత్వము పేలవముగా నున్నది చెప్పదగిన విశేషము లేమియు గానరావు "కర్ణామృతంబైన కథలు చెప్పెదను" అని బాస చేసికొన్నను కథలు కర్ణామృతముగా నెంతవరకున్నవో దెల్పుట కష్టము. ఈ కవి కాల మెరుగరాదు. కవిత్వమునుబట్టి చూచినచో 16, 17 శతాబ్దముల మధ్యకాలమువాడై యుండునని తోచుచున్నది.

శ్రీగిరి మల్లికార్జున కవికృతమైనదిగాక, వేరొక సోమవార మాహాత్మ్య మొకటి ద్విపదలో గలదని శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రిగారు తెల్పిరి. కాని దాని ప్రతి వివరణములు వారు తెల్పలేదు

"ఇది యాద్యంత రహితముగ నుండుటచే దీనికర్త యెవరో తెలియరాదు. ఇందు కార్తిక సోమవార మాహాత్మ్యము ప్రతిపాదింపబడిన కథలు గలవు."

మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార నివేదిక (Trinniel catalogue of Telugu Mss 1919-22, Vol iv, Part 3 Pages

**1655-1558).** లోగల 'సీమంతినీకథ' కూడ సోమవార మాహాత్మ్యమును ప్రతిపాదించు కథయే దీనికర్త ఈవని భద్రకవి. ఈ గ్రంథమునుగూర్చి యీ నివేదికలో నిట్లుగలదు గ్రంథకర్తపేరు వీరభద్రకవి ఈవని గ్రామ వాస్తవ్యుడు శ్రీపతి పండితారాధ్య వంశ్యుడగు మల్లనారాధ్యులకిది యంకితము సేయబడినది. కాని. ఈ కృతికర్త ఈవని వీరభద్రకవి కాడనియు, మహాదేవ కవియనియును శ్రీమతి ఆదిలక్ష్మిగారు వ్రాసిరి (పరిశోధన సంచిక 8 జూన్–జూలై 1956)

## ఘటికాచల మాహాత్మ్యము

అముద్రితము[88]

ఇది యొక లఘు ద్విపదకృతి ఇరువది పత్రములు గలది. **కర్త కాలువపల్లి అర్చన మంత్రి.**

"శ్రీనంద వరకులాశ్రిత లక్ష్మిదనరు
వనర భారద్వాజ వరగోత్ర శుభగు
డనగ గాలువపల్లి యతుల వంశ్యుండు."

**ఈతని** తండ్రి రామసుబ్రతుడు. తల్లి అక్కమాంబ కథ **ఘటికాచల మాహాత్మ్యము**లోని చిన్నిగాథ

"అసమాన బలుడైన యంజని తనయు.
పొసగంగ వేడుక పొలుపేది దనర
ఘటికాచలంబను ఘనగిరిమీద
నిటలాక్షుదగ గూర్చి నెమ్మితో వేడ్క
పటుతర నేమంబు పరగ వహించి
గట్టిగా బ్రహ్మ పట్టము గోరి వేడ్క"

సాధించుట యిందలి యితివృత్తము

---

87. వీరశైవాంధ్ర వాఙ్మయము పు 225

88 ఆంధ్ర సాహిత్య పరిషత్తు పుస్తక భాండాగారము సం. 20.

## మూడవ ప్రకరణము

# శాక్తమత సంబంధ ద్విపదలు

శక్త్యుపాసనకు సంబంధించినది శాక్త మతము శక్తి పూజ భారత దేశమున ప్రాచీన కాలమునుండి ఉన్నది. ఇది వేదకాలమునుండి ఉన్నదని, పురాణ పురుషులు, కృష్ణుడు, వసిష్ఠుడు మొదలగువారు శక్తి పూజలను చేయుచుండినట్లును కొందరి మతమై యున్నది

శక్తిని భక్తులు అనేకరూపములలో ఉపాసించుచున్నారు ఆమె కనేక దేవాలయములు నిర్మింపబడినవి శక్తి ఉపాసన, ముఖ్యముగ, తంత్ర పూజలతో కూడుకొనినదని మనవారి విశ్వాసమై యున్నది శక్తిని అనేకమంది అనేక రూపములతో తమకిష్ట దైవముగ నుపాసించుచున్నారు. త్రిపురసుందరి, లలిత, కాళి, భువనేశ్వరి, చండీశ్వరి మొదలగు నామములచే నామె నుపాసించుచున్నారు

## నింబజా మాహాత్మ్యము[1]

అముద్రితము

కర్త కన్నడ (బడగలనాటి) నరసకవి ఇందలి యితివృత్తము బ్రహ్మాండ పురాణాంతర్గతమగు దేవమల్లుని కథ దేవీ మాహాత్మ్య కథలు. ఈతడీ కథను తొక్కడము మన్నారుజెట్టి యను నాతని ప్రేరణపై ద్విపద కావ్యముగా రచించినట్లు చెప్పికొనెను కవి దేవమల్లు కులమునకు సంబంధించినవాడు. వీరు విశ్వామిత్రుని వంశీయులు

---

1 తంజావూరి సరస్వతీమహలు గ్రంథాలయము, నెం. ౨౮౬ తాళపత్రము.

"నను పిలిపించు మన్నన లాచరించి, నరస కవీంద్ర విన్నప...శిరసు నాపదములచేరిచి మ్రొక్కి, భూషణంబు లొసంగి పొసగంగ వినయ భాషణంబుల యుక్తపద్ధతిననియె, దేవమల్లుని కధ దేవి మాహాత్మ్యమీ విధంబని శాఖ లేర్పాటుగాగ, రమణ బ్రహ్మాండ పురాణ సంహితుల విమలమౌ దశవిధ గోత్రము శేర్పడగ, తెనుగున తేటగా ద్విపద కావ్యంబు నొసరించి రఘుపతి కొప్పించుమనిన"

ఈ గ్రంధము నీతడు,ఏకవీరా మాహాత్మ్యము,నింబజామాహాత్మ్యము నని రెండుపేర్లతో పేర్కొనినాడు. మన్నారుజెట్టి యాదేశానుసారముగ ధేనునాశము గరిడిలోన రఘురామాంకితముగ నీగ్రంథమును రచియించినాడు. శ్రీరామ స్తుతితోడనే గ్రంథమును ప్రారంభించినాడు

ఈ కవి పూర్వకవుల స్తుతిలో రంగనాధుని, గౌరన, బట్టేపాటి తిమ్మ యను, చిన్నన్నను స్తుతించినాడు

"ఘనమైన ఆదిమ కవులను నుతించి,
భువన త్రయంబున బూజ్యులైనట్టి
కవి రంగనాధుని గౌరన కవిని
తివిరి బట్టేపాటి తిరుమల కవిని
వన్నెలు గుల్కంగ వర్ణింప నేర్చు
చిన్నన్నగారిని చింతించి యితర"

ఈతడు బట్టేపాటి తిరుమల కవిని నుతియించుటవలన నీతడు తప్పక క్రీ.శ. 1750నాటికి తరువాతివాడని స్పష్టముగా తెలియుచున్నది. కాని ఎంతటి అర్వాచీనుడో తెలియదు. పదునెనిమిదవ శతాబ్దపు మధ్యగాని అంతమునగాని, పట్టణములలో శ్రేష్ఠమైన కటకమను పట్టణమందు, నింబజ, ఏకవీర యనియెడు నామములుగల దేవి వెలసినది ఆమె నింబవృక్షమునందమరుట వలన నామెకు నింబజయను ప్రసిద్ధి యేర్పడినది. పూర్వము తారకాసుర, వజ్రదంష్ట్రులు శివునిగూర్చి తపమొనర్చి, 'బలమవధ్యంబు ప్రబలసంపదలు,

బలసూదనాదుల భంజించ నేర్పు, మాయాదిచిత్ర నిర్మాణ సంతతులు, యేయెడనైనవశియించియు ండు.పీలు నూరుదారల కత్తి నొసటిపైబడిన దారిదప్పని యట్టి ధైర్యంబు నొసగి, తనరక్తి బిందుధరణిపైబడినఁ దనుజుండౌనట్లుగా దయతోడ నొసంగు"మని వరములను పొందిరి వారొక పర్యాయము, దేవత లతో యుద్ధమొనర్చి, అమరావతీ పట్టణమును నాశనమొనర్చి అచటి స్త్రీలను హింసింపగా, వారు నింబజాదేవిని స్మరించి తమను రక్షింపమని వేడికొని అతడి వంటి వీరుడే వేరొక డుద్భవించి, వానిని సంహరింపగలడని శాపమొసగిరి. బ్రహ్మ, దేవతలకొరకు దేవమల్లుని సృష్టించి, అస్త్రశస్త్రాదులచే చావని వజ్రదంష్ట్రిని ముష్టియుద్ధమున జయించి మృతుని గావింపవలెనని దెల్పెను. ఆతడును వల్లెయని వజ్రదంష్ట్రిని పురమునకేగి. ఆతనినచట గానరాక, నింబజాదేవి నువాసించి, ఆమె కరుణవలన, నాతని మాయల నన్నిటి నెరిగి, యుద్ధమున నాతని నిహతుని గావించెను ఈతని సాహసమును దేవత లందరు మెచ్చుకొని సంతసిల్లిరి మును లంద రీతనికొరకు మానవకన్య కాంచనమణి ప్రభను సృష్టించి యాతని కిచ్చి వివాహము గావించిరి. వీరిరువురకును పది మంది పుత్రు లుదయించిరి

ఈ నింబజాదేవియే పూర్వము మహిషాసురుని, నిశుంభుని, రక్తబీజాదు లను సంహరించినది ఈమెయే చండముండాది రాక్షసులను నిర్జించిన శక్తి స్వరూపిణి.

ఇందలి కవిత నిర్దుష్టమై తనరారుచున్నను, ప్రౌఢత యెక్కువగా కానరాదు.

గ్రంథాంతమున విజయ సంవత్సర భాద్రపద శుద్ధ దశమి నాటికి నెల్లూరి వీరరాఘవ పెరుమాళ్ళ కుమారుడు కన కాజెట్టి వ్రాయించినది అని కలదు. కవి తంజావూరి మహారాష్ట్ర రాజుల కాలమున క్రీ శ. 1470 ప్రాంతమువాడు కాదగును.

## చౌడేశ్వరి కథ[2]

కర్త యెవ్వరో తెలియదు శక్తి - చౌడేశ్వరి రూపమును మహిషాసురుని మర్దించి దేవతలను రక్షించిన విధమును వర్ణించు లఘు కృతి

"శ్రీ రుచిరాకార శ్రిత జనాధార
ధారా ధర శ్యామ దైతేయ భీమ"

అని దేవతా ప్రార్థనతో గ్రంథారంభమైనది.

మహిషాసురుడు దేవతల ననేక విధములుగ బాధింపుచు, నింద్రునితో యుద్ధ మొనర్చి, యాతని నోడించినాడు. అమరేశ్వరుడు తన పరివారముతో కూడ పారిపో జొచ్చినాడు అమరవల్లభు డమరావతి కేగి, దైత్యుల నిర్జించు నుపాయమునుగూర్చి చింతించుచుండగా, బృహస్పతి

ఏతెంచి, హరియు విరించియు అంబికావరుడు
వెరవొప్ప గలుగంగ వెరవేల నీకు"

అని యోదార్చి అంబుజ భవున కీ వార్తను దెల్పమనినాడు. అతడటులే దెల్పగా, శక్తి యింద్రునకు వాహనాదికముల నొసగి దీవించినది

అట పుత్రార్థియై తపము చేయుచున్న తొగమౌని దేవిని ప్రత్యక్ష మొనర్చుకొని మున్నూట అరువది వేల తనయుల దయచేయుమని వేడినాడు. దేవి అటులే యనుగ్రహించి యంతర్ధానమైనది ఆ మౌని తన తనయులను 'వీర చౌడకు శాస వెలయంగ జెప్పి అటనుండి గదలినాడు.

మహిషాసురుడు పరమ సంతోషమున నుండెను ఇంద్రుడు శక్తిచే పొందిన యాయుధ, వాహనములనుగొని తొగమౌని పుత్రులతోకూడ మహిషాసురాదులపై యుద్ధమునకుపోయి, మహిషుని చంపెను. దానవుడట్లు చావగనే హరి బ్రహ్మాదులు శక్తిని జేరి "ఆది కన్యవు నీవె, ఆ బ్రహ్మ వీవె" యని

---

2 తిరుపతి శ్రీ వెంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ, ఆర్. నెం. 994 – తాళపత్ర ప్రతి.

ప్రస్తుతించి చండముండాది నిఖిల రాక్షసులను సంహరించి, లోకమున చాడాంబ యని ప్రసిద్ధి నొందుమని పల్కిరి.

పిమ్మట తొాగమౌని ఏతెంచి, తన మున్నూట అరువది మంది పుత్రుల కును ఆమె నిలవేల్పుగ నుండుమని వేడగా నామె యందుల కంగీకరించినది.

గ్రంథాంతమున గ్రంధము చదువుట వలన నగు ఫలశ్రుతి చెప్పబడినది. ఇందు మధ్య మధ్య ననేక పత్రములు కానరాకున్నవి.

నాల్గవ ప్రకరణము

# వైష్ణవ మత సంబంధ కావ్యములు

## (1) రామాయణ సంబంధములు

## రంగనాథ రామాయణము

"జాతే జగతి వాల్మీకౌ కవిరిత్యభిధా భవత్
కవీ యితి తతో వ్యాసః కవయ స్త్వయిదండినః"

ప్రపంచమున వాల్మీకి యుదయించగా కవియను శబ్ద మేర్పడినదట. ఈ కవి శబ్దమునకు ద్వివచనపు సౌభాగ్యము వ్యాస భగవానుని వలన గల్గినది. ఆది కవియగు వాల్మీకి రామాయణ కావ్యమును రచించి భారతీయులకు కవితా భిక్ష నిడినాడు. రామాయణ కథ నెరుగని భారతీయుడుగాని, దానిని చదివి యానందింపని వాడు గాని, యుండడనుటలో విప్రతిపత్తి యుండబోదు. ఇట్టి రామాయణ మాంధ్రమున ననువదింపబడిన వానిలో రంగనాథ రామాయణమే ప్రప్రథమమైనది. సంస్కృత రామాయణము పార్యేగేయేచ మధురము. తెనుగునకూడ నటులే నుండవలెనను తలంపుతో నీతడు ద్విపదచ్ఛందమున, పండిత పామర జనరంజకముగ రచించి, యాంధ్రుల యభిమానమునకు పాత్రుడైనాడు.

గ్రంథావతారికలో దీనిని గోన బుద్ధారెడ్డి రచించి నట్లున్నను[1] ఏతద్గ్రంథ కర్తృ విషయమై భిన్నాభిప్రాయము లున్నవి దీనికి రంగనాథ రామాయణమని ప్రసిద్ధి యుండుటవలన, మొల్ల రామాయణమను నామము మొల్ల రచించుట వలనను, భాస్కర రామాయణమను పేరు భాస్కరుడు రచించుట వలనను నేర్పడినటులే, దీనిని గూడ రంగనాథుడను కవియే రచించి యుండునని నిశ్చయింపవచ్చును. రంగనాథుడు బుద్ధారెడ్డి యాస్థాన పండితుడై

1. గ్రంథావతారిక.

యుండును. ఏ ప్రలోభమునకో గురియై కాని, లేక, రాజుగారి వత్తిడి వలనగాని అతని పేరిడి యుండును

పూర్వ కవు లనేకులు తమ కవిస్తుతులలో రంగనాధునే పేర్కొనిరిగాని, బుద్ధారెడ్డి కవి నెవ్వరును పేర్కొనలేదు

అనంతామాత్యుడు, కొఱవి గోపరాజు, కుమ్మర మొల్ల, వెన్నెలకంటి సూరన, నూతన సూరకవి కూచిమంచి తిమ్మకవి, రాజలింగకవి, అప్పకవి. ద్విపద మార్కండేయ పురాణకర్త నరసింహకవి, రాజశేఖరకవి, లింగకవి మొదలగు వారు రంగనాధుని స్తుతించిరి

ఈ రామాయణకర్త అచ్చవెల్లి రంగనాధుడని పౌత్రపి వేంకట రమణకవి. "లక్షణ శిరోమణి"యను లక్షణ గ్రంధమున పేర్కొని, ఈ రామాయణము నుండి యుదాహరణల నొసగినాడు అచ్చవెల్లి రంగనాధుడు రామాయణం ద్విపద విశ్వామిత్ర శబ్దమునకు రెండవ యర్థ చరణాది అచ్చుకు నిత్య సమాస యతి ప్రయోగం లక్ష్యం

(1) ద్వి॥ ఎక్కడ గురుడని యెఱుగని నీకు
అకటా గురుడు విశ్వామిత్రుడయె"

(2) అచ్చవెల్లి రంగన్నగారు రామాయణం ద్విపద 1 వ పాదార్థమున సహజ స్వర యతి లక్ష్యం.

ద్వి॥ ఎసగ దివ్యుల బెంప ఋషుల రక్షింప
నసురుల శిక్షింప నవని బాలింప[2]

ఈతన యింటిపేరు, వెలిచేటి వారని యొక ప్రతీతి యున్నట్లు శ్రీ చాగంటి శేషయ్యగారు తెల్పిరి[3] పై యుదాహృత ద్విపదలు రంగనాధరామాయణము లోనివే. కొందరీకవి చక్రపాణి రంగనయని3(b) భావించిరి.

---

2. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, సం. 5[1]—భాగములు III & IV

3. ఆంధ్రకవి తరగిణి, సం VI

3 (b) సింహావలోకనము - రంగనాధ రామాయణము (వేటూరి ప్రభాకరశాస్త్రి.

రంగనాధుడే రామాయణమును రచించె ననుట కింకొక కథగూడ వ్యాప్తిలో నున్నది. రంగనాధుడు కోన బుద్ధారెడ్డి యాస్థాన పండితుడు. నన్నయ భారతముండగా, పద్యకావ్యమును రచించినచో తనకు పేరు ప్రఖ్యాతులు రావని భావించి, ద్విపద కావ్యమును రచించెనట; ఈతడు ద్విపద రామాయణమును రచింపు చుండగా, మంత్రి భాస్కరుడు రామాయణమునే పద్య కావ్యముగ రచించి, రాజుగారికి కృతి యిచ్చుట కేగగా, బుద్ధారెడ్డి, తన యాస్థాన పండితుడయిన రంగనాధుని రామాయణమును దక్షిణ హస్తముననను, భాస్కరుని కావ్యమును వామహస్తముననను స్వీకరించెనట అందువలన భాస్కరుడు కోపగించుకొని అట్టి యరసికుడగు రాజునకు కృతినిచ్చుటకన్న గుఱ్ఱముల గాచువానికిచ్చుట మేలనిపల్కి, సాహిణి మారణునకు కృతి యిచ్చెనని చెప్పుదురు. కాని సాహిణి మారణుడు, గుఱ్ఱముల గాచువాడుకాడనుట కనేక దృష్టాంతములున్నవి అయినప్పటికిని, నీకథ కేవల కల్పితమని భావింప నక్కరలేదు కొంత సత్యముతోబాటు కల్పన కూడ మిళితమై యుండును

కవులు గ్రంథములను రచించి, తామాశ్రయించిన ప్రభువుల పేరిడుట ఆంధ్ర సాహితీలోకమున నరుదుగాదు

బిల్హణీయమను కావ్యమును పిండి పెద్ద కృష్ణస్వామి యనునాతడు వ్రాసినట్లవతారికలో గలదు కాని దీనికర్త చిత్రకవి సింగరార్యుడని తెలియు చున్నది అతడు రాఘవ వాసుదేవీయమను ద్వ్యర్థికావ్యమును రచించెను. ఇది అముద్రితము మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున గలదు. ఇందీతడు బిల్హణీయమును రచించినట్లు చెప్పికొనినాడు కాని బిల్హణీయ యవతారికలో పిండి పెద్ద కృష్ణస్వామి రచించినట్లును, సింగరార్య కవి కుమారుడు నారసింహార్య కవి కృష్ణస్వామిని కృతి వ్రాయుమనినట్లును గలదు. కాని అశ్వాసాంతమందొక చక్ర బంధము గలదు. ఈ చక్రబంధమున కవి పేరు చిత్రకవి సింగరార్యుడనియే గలదు [4] దీనివలన తేలినదేమనగా. సింగరార్యుడు చనిపోయిన పిమ్మట అతని పుత్రుడు ధనమునకో, మరి యెందులకో. తండ్రి రచించిన కావ్యమును

4 ఇందుమూడవ వలయమున కవి పేరు, ఆరవ వలయమున కృతి భర్త పేరు నుండును.

కృష్ణస్వామి పేర మార్పిడి చేసియుండును ఆశ్వాసాంతమందున్న చక్రబంధ మును, తెలియకయో లేక తెలిసియో, లోకమునకు సత్య మెప్పటికైనను తెలియునుద్దేశ్యముతోడనో, అటులేవదిలివేసెను. ఇదేవిధముగ రంగనాధుడు కూడ ఏదే నొక ప్రబలమగు కారణముచే గ్రంథమును రచించి, బుద్ధారెడ్డి పేరిడి యుండును. దీని నెరిగిన వారిమూలమున, దీనికి రంగనాథ రామాయణమని ప్రసిద్ధి వచ్చి యుండును. దీనికి కవి కేవల రామాయణ మనియే పేరిడినాడు. కవి మూలముననే దీనికి పేరు ప్రచారమునకువచ్చి యుండును.

ఈ గ్రంథకర్త బుద్ధారెడ్డియే యని శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు అభిప్రాయపడిరి.[5]

"ఆది కవీశ్వరుడైన వాల్మీకి
యాదరంబున బుధ్యులందరు మెచ్చ
జెప్పిన తెఱగును శ్రీరామచరిత
మొప్ప జెప్పెద గదాభ్యుదయ మెట్లనిన"

అని కవి తాను వాల్మీకి మహర్షి చెప్పిన రీతినే ఆంధ్రీకరించుచుంటినని చెప్పి కొనినను, మూలమునలేని కొన్ని కథల నిందు ప్రవేశపెట్టి కావ్య కన్య కెనలేని సొగసును తెచ్చి స్వతంత్ర గ్రంధమనునట్లుగ తీర్చిదిద్దినాడు. కాని యీతడు ప్రవేశపెట్టిన కథలన్నియు నధ్యాత్మ రామాయణమున గలవు వాటినీతడు "పద కవిత్వ ఖని నుండియే" గైకొనినాడనుట యుచితముగాదు. అవి అద్భుత కల్పనలతోకూడిన కథలగుటచే పదకవితాశాఖయందును ప్రాచుర్యము గల్గియుండును కొన్నిటిని పదకవిత్వము నుండియు గైకొనెను.

బాల కాండమున అహల్య పాషాణముగ పడియుండి శ్రీరాముని పాదరజ స్పర్శచే శాపవిముక్తురాలయి స్వరూపమునందినట్లే కవి వ్రాసెను గాని, వాల్మీకి రామాయణమున నట్లులేదు. అహల్యను, బహు వర్షములు భస్మశాయినిగ.

---

5 రంగనాధ రామాయణము పీఠిక, పుటలు 2—3 (ఆంధ్ర విశ్వకళా పరిషత్తు ప్రచురణ)

నిరాహారురాలుగ నుండుమని గౌతముడు శపించినట్లు వాల్మీకి వ్రాసెను.[6] శ్రీరాముడట కేతెంచిన పిదప శాపమోక్షము గల్గునని చెప్పెను

ఇంద్రుడు గౌతముని తపమును చెఱుప బూని, కుక్కుటమై కూసి, గౌతముని అనుష్ఠాన కార్యమునకు పంపి అహల్యతో క్రీడించినట్లు చెప్పబడినది కాని యింద్రుడు కుక్కుట రూపమున నేతెంచినట్లు కూడ వాల్మీకి రామాయణ మున లేదు అందాతడు ముని వేషమున నేతెంచినట్లు గలదు [7]

శ్రీరాముడు వచ్చువరకును, అహల్య నిరాహారురాలుగ నుండి వాయు భక్షణము చేయుచుండ వలెననియు, అప్పటి కామె పూతాత్మురాలగుననియు, గౌతమ మహర్షి, గడువు నిడినట్లు తెలియుచున్నది. గౌతమాశ్రమమున కేగు నప్పటికి శ్రీరాముడింకను బాలుడు. అహల్య శాపవిముక్తురాలయి, సంపూర్ణ తేజ ముతో వెలుగుచుండగా, శ్రీరాము డామె పాదములకు నమస్కరించినాడు ఇంత మాత్రమే వాల్మీకి రామాయణమున గలదు

తరువాతి కాలమున వైష్ణవులు శ్రీరాముని మహిమ నతిశయింపజేసి, వైష్ణవ మతమును వ్యాపింప జేయుటకై అహల్య శిలారూపమున పడియుండగా శ్రీరాముని పాదరజముచే నామెకు మానవత్వము కల్గినదను కథను కల్పించిరి. "రామోదశరథాత్మజః" యని మాత్రమే వాల్మీకమునందుండగా, "వైకుంఠ ధాము డవాప్త కాముండు, లోకకరక్షణ కళాలోల చిత్తుండు, రాముడై వచ్చి పురాణ పురుషుడు" అని యీ కవి వ్రాసెను.

"The cult of Rama therefore, must have come into existence about the eleventh century The ceremony in connection with his birth on the 9th of the bright half of caitra is given in Vrata Kanda by Hemadri, who flourished in the thirteenth Century That writer as well as Vradha Haritra gives the models of worshipping him as an incarnation along with others on certain occassions, so that it appears that his wor-

---

6. బాలకాండ, పు 315 (48)

7. బాలకాండ, 48-165.

ship as an incornation has been of a longer duration than that based on terms of equality with Vasudeva Krishna" [8]

అహల్యను శిలగ పడియుండుమని గౌతముడు శపించినట్లు పద్మపురాణ అధ్యాత్మ రామాయణములందు గలదు. "రాతినాతిగజేసె నీ పదరజమటుంచును ఖ్యాతిగా విని ప్రీతితో నెఱ నమ్మితిని నా పాతకము బెదబాపు తండ్రి" అను కీర్తన ఈ భావము గేయ కవిత్వమున. దేశమున బహుళ వ్యాప్తిలో నుండెనని దెల్పుచున్నది.

అయోధ్యాకాండమున శ్రీరామ పట్టాభిషేకమునుగూర్చి తెలిసికొనిన మంధర పట్టాభిషేకమును భంగము చేయుటకు వాల్మీకి కారణము నేదియు దెల్పలేదు. "సా దహ్యమానాకోపేన మన్థరా పాపదర్శినీ" అని మాత్రమే అందు గలదు. ఆమె స్వభావముచేతనే కుటిలురాలని అందుండగా, రాముడు బాల్యమున తన కాలును విఱిచినందున అతనిపై పగ సాధించుటకే అరణ్య మునకు పంపు వెరవు నాలోచించినట్లు చెప్పినాడు ఈ మార్పంత సొగసుగ లేదు కొందరకు స్వభావసిద్ధముగనే దుష్టత్వముండును. వారిలో మంచితనము వెదకినను కానరాదు మంధర యట్టిది. ఆకారణముగనే రామునిపై నీసు వహించి. అడవులకు పంపించినదనినపుడే. యామె దౌష్ట్యము పరాకాష్ఠ నొందును.

శ్రీరాముడు సీతాలక్ష్మణ సహితుడై అరణ్యవాసమునకు బయలుదేరి, గంగానదీ ప్రాంతమునకు వచ్చెను అట సంధ్యాది విధులను నిర్వర్తించిన పిమ్మట సీతారాము లిర్వురను తృణశయ్యపై నిదురింపగా, లక్ష్మణుడు, అరణ్య మందున్న పదునాలుగేండ్లును తాను నిదురపోకుండ, తన యన్ననుకాపాడుదు నని వ్రతమును బూనగా, నిద్రాదేవి యాతనివద్దకువచ్చి. తనకు వర్తింపనిక తావెది యని యడుగగా, "నూర్మిళ యందు నహరహంబులును, ఇనియుండు మంత నీ సమయంబుదీర్చి. వచ్చిన గైకొందు నిన్నని" ఆమెను ఊర్మిళవద్దకు పంపినాడట. ఈ కథ నీకవి, జానపద వాఙ్మయ క్షేత్రమున బహు ప్రసిద్ధి గాంచిన "ఊర్మిళాదేవి నిద్ర" నుండి గైకొనియుండును. లక్ష్మణుడప్రమత్తుడై

8. Vaishnavism & Saivism R.G Bhandarkar, Page 47.

సీతారాముల నెల్లవేళలను రక్షించుచుండినటులు మాత్రమే వాల్మీకి రామాయణ మున గలదు. నిద్రాదేవి నూర్మిళవద్దకు పంపినందుననే రేయింబవళ్లెప్పుడును, ఊర్మిళ (పదునాల్గు సంవత్సరములును) నిద్రవోయినట్లు జానపద వాఙ్మయ కథలలో గలదు.

అరణ్య కాండమున వాల్మీకి రామాయణమున లేని జంబుకుమారుని వృత్తాంతమును ప్రవేశపెట్టి శూర్పణఖ రామలక్ష్మణులవద్ద కేతెంచుటకు పూర్వ రంగమును గల్పించినాడు. అందువలన నీ కథ నిట చేర్చుటెంతయు నౌచితీవంతముగానున్నది, ఇది అధ్యాత్మ రామాయణమున గలదు. ఇది 'లంకాయాగము'ను గేయమునందును గలదు.

లంకాయాగమున శూర్పణఖ పుత్రుడు చక్ర భూపాలుడనియు, అతడు చంద్రునిగూర్చి తపమొనరింపగా, నాతడే ఖడ్గమును బంపెననియు గలదు. రంగనాథ రామాయణమున జంబుమాలి సూర్యునిగూర్చి తప మొనర్చినట్లు గలదు.

మారీచుడు మాయ మృగ వేషమున శ్రీరామచంద్రుని దవ్వులకు గొనిపోయి అట రామబాణముచే హతుడై, 'హాలక్ష్మణా, హాసీతా'యని యరవగా, సీత, యది రాముని యార్తానాదమని భావించి, లక్ష్మణుని రామ సహాయార్థమేగమని నిర్బంధ పరచినిది. అపుడు లక్ష్మణుడు, "పర్ణశాలకు చుట్టు బరులేదు వ్రాసి, వర్ణించి యీ బరుల్ వడిదాటకమ్మ, ఎవ్వడే నీ బరుల్ వెసదాటివచ్చు, నవ్వీరవరు తల లలియు నాక్షణమె" అని పర్ణశాలకుచుట్టును నేడు బరులు వ్రాసినట్లు ఇందుగలదు. ఇది యవాల్మీకీయము

యుద్ధ కాండమున నీకవి గావించిన మార్పులు లెక్కకు మిక్కుటములు.

సీతను మరల రామున కిచ్చివేసి, అతనిని శరణు వేడవలసినదని విభీషణుడన్నకు హితముపదేశింపగా రావణుడందులకలిగి సభలో విభీషణుని తన్నినట్లే కవి వ్రాసెను. రావణుడు విభీషణుని తన్నినట్లు మూలమున వ్రాయబడలేదు. దెబ్బలు తిని విభీషణుడు తల్లియొద్ద కేగగా, ఆమె యాతని దుఃఖకారణము నెఱిగి అతని వలననే తమ వంశము నిల్చునని యెఱిగి,

అతని నాశీర్వదించి, శ్రీరాముని శరణు వేడుమని పంపినది. వాల్మీకి రామాయణమున విభీషణుడు తల్లి యొద్ద కేగినట్లు లేదు. రావణుడు తన హితమును వినకపోగా, వెంటనే యాతడు శ్రీరాముని వద్ద కేగినట్లున్నది.

శ్రీరాముడు వానరుల సహాయముతో సేతువును నిర్మించుచుండగా, నొక ఉడుత కూడ సేతు నిర్మాణమునందు సహాయపడినట్లును అందుకు మురిసి శ్రీరాము డద్దానిశరీరముపై దక్షిణ కరాగ్రముతో దువ్వినట్లును, వెంటనే దాని వెన్క భాగమున త్రిరేఖ లమరినట్లును గలకథ యిందు వర్ణితమైనది

నాగపాశ బద్ధుడైన లక్ష్మణుడు మరణించినాడని భావించి రాముడు దుఃఖించుచుండగా నారదుడట కేతెంచి, రాముని కాతని విష్ణుత్వమును జ్ఞప్తికి దెచ్చి, గరుడుని స్మరించుటవలన నాగపాశము లూడునని దెల్పినట్లిందు వర్ణితమైనది నారదాగమనము మూల రామాయణమున గానరాదు

ఈతడు ప్రవేశపెట్టిన యమూలక గాధలలో సులోచనా వృత్తాంతము రసవంతమైనది [9] "రంగనాథ రామాయణమునందలి రచన చాల శుద్ధమైనది, బిగువైనది మితిచెప్పుడు మీఱనిది ధారాళమైనది" నగుటచేతను, సులోచన కథాసందర్భమునందలి రచన యనేక సందర్భములతోను, యతి ప్రాసాది దోషములతోను కూడికొని యుండుటచేతను, నిది ప్రక్షిప్తమని యెంచ వీలగును.

కాలనేమి వృత్తాంతమున రాక్షసులయొక్క "ప్రతి క్రియా కల్పనా చతురత" మనలను ఆశ్చర్యమగ్నులను చేయుచున్నది అది యటుండ, రావణ శక్తిచే మూర్ఛపడి యున్న లక్ష్మణుడెపుడు పునరుజ్జీవితుడగునాయని, తహతహపడు పాఠకుల కీ యవాంతర కథవలన కలిగిన కాలయాపనము, భరింప రాని యుత్కంఠతను గలిగించి, దుర్భర సంశయాస్పదమైన పరిస్థితిని

9 ఇది ప్రక్షిప్తమని కొందరి భావము సులోచన కథ తులసీ రామాయణమున కూడ గలదుగాని, విమర్శకులు దానిని గూడ ప్రక్షిప్తమని భావించుచున్నారు

సృష్టించి, అంతమున చేకూరిన మేలును ఇనుమడిగా, ముమ్మడిగా, అసాధ్య యోగ్య మొనర్చు చున్నది"[10] ఇది కూడ, అధ్యాత్మ రామాయణము నుండియే గైకొనబడి యుండును "లక్ష్మణ మూర్ఛ"[11] యను జానపద గేయమున కూడ, కాలనేమి వృత్తాంతము వర్ణితమైనది

శుక్రుని యుపదేశానుసారముగ రావణుడు, శ్రీరామునితో యుద్ధమొనర్చి విజయము నొందుటకు వలయు శక్తిని బడయుటకు పాతాళ హోమము నొన రించిన కథ యిందు గలదు. ఇదియు అవాల్మీకీయమే. ఇది అధ్యాత్మ రామా యణమునందును, జానపదుల కథల యందును[12] గలదు కాని అంగదుని సహాయముచే శ్రీరాముడా హోమక్రియకు విఘ్నము కల్గించి, రావణుని జయించెను.

శ్రీరాముడెన్నిసారులు నరికివేసినను, రావణాసురుని కరశిరములు మరల మరల మొలచుచునే యుండును శ్రీరాము డందులకు చింతాక్రాంతుడై యుండగా, ఆగ్నేయాస్త్రమును ప్రయోగించి. రావణుని నాభియందున్న అమృత కలశము నింకింప చేయుమనియును, అట్లుచేసినచో నాతడు మరణించు ననియు, విభీషణుడు తెల్పును ఈ ఘట్టముకూడ యవాల్మీకీయమే. ఇదియు అధ్యాత్మ రామాయణమున గలదు

యుద్ధకాండమున గల "సౌమిత్రినవ్వు" జానపదగేయ సాహిత్యమున ప్రచారములో నున్న "లక్ష్మణ దేవర నవ్వు"కు ప్రతికృతి. పదునాలుగేండ్ల గడువు ముగిసిన పిమ్మట సభలోనున్న లక్ష్మణుని నిద్రాదేవి యావహింపగా లక్ష్మణుడు కలకల నవ్వినాడు అట్లాతడు నవ్వగా, సభలోనున్న ప్రతిఒక్క రును, నాతడు తమదోషములను దలచియే నవ్వుచున్నాడని బాధజెందిరి. అపుడు శ్రీరాము డాతడు నవ్విన కారణ మడిగి తెలుసుకొని అచటివారి వ్యధను పోగొట్టెను.

---

10 రంగనాథ రామాయణము, పీఠిక, పుట, 15

1 . దీని రచయిత, వైశాఖపురవాసి కలగర్ల వెంకట రామయ్య

12 ఆంధ్ర జానపద గేయ సాహిత్యము, పుట, 62

"బాలకాండమున అయోధ్యలో బయలుదేరి రామకథ, క్రమముగా ఆర్యావర్తమును, దండకారణ్యమును, కిస్కింధారాజ్యమును, సముద్రమును దాటి యుద్ధకాండమున లంకలో ప్రవేశించి కించిదవశిష్టముగా, అచటనే ముగియును. ఈ తుది ఘట్టమునగాని రావణునియొక్కయు, అతని సంసారము యొక్కయు స్థితి గతులను గూర్చి పాఠకులకు యథార్థ జ్ఞానము నవకాశము ఉండదు. అందుచే లంకాపట్టణము దయ్యాల కొంపారామనియు, రావణుడు దయ్యాల దైవమనియు, అతని దారపుత్రులు భూత ప్రేత పిశాచములనియు తలచుకొని భయపడుదురు ఆ సంసారముయొక్క నిజస్వరూపమును ఎరుగవలెనన్నచో ఈ రంగనాథ రామాయణమునే చదువవలయును. ఆ రావణ గృహము దైవభక్తులకు, నీతి శాలులకు, పతివ్రతలకు, వీరమాతలకు, వీరపత్నులకు ఆకరము."

రావణుని తల్లి కైకసి ధర్మానువర్తిని రావణుని కోడలు సులోచన పతిభక్తి పరాయణ. రావణుని భార్య మండోదరి పరమపతివ్రత, వీరవనిత కుంభకర్ణుడు రామభక్తుడు సాక్షాత్తు రావణుడు కేవల మసురుడు గాడు. అతడి యందాసుర ప్రవృత్తితోబాటు దైవ ప్రవృత్తియు గలదు తనకు గొప్ప బలపరాక్రమము లున్నవని యహంకరించెడివాడు కాడు. అట్టి బలపరాక్రమములు దన శత్రువైన శ్రీరాముని యందుండగా, దానిని మెచ్చుకొను ధీరోదాత్తుడు. శ్రీరాముడు సాక్షాద్విష్ణువని యెరిగిన జ్ఞాని.

కవి గ్రంధారంభమున,

"పదము లర్థంబులు భావముల్గతులు
పదశయ్యలర్థ సౌభాగ్యముల్ యతులు
రసముల కల్పన ల్ప్రాసి సంగతులు
నసమాన రీతులు నన్నియు గలుగ

... ...

శ్రీరామ చరిత

మొప్ప జెప్పిన ... ... నని ప్రతినజేసి దానిని సర్వవిధముల నెఱవేర్చుకొనెను. ఇతని భాష మిగుల ప్రసన్నమై, ధారావాహిగా నున్నది.

అన్వయ కాఠిన్య మించుకయులేక, చక్కని జాతీయములతో నొప్పారుచు రస వంతముగా నుండి. చదువ చదువ నాహ్లాదము గొల్పుచుండును ఈతని కవిత్వ మున తెనుగు పదము లధికముగను, సంస్కృత పదములు స్వల్పముగను నున్నవి అయినను అచ్చటచ్చట సంస్కృత సమాస రచన గావింపక పోలేదు

ఈతని యాంధ్ర పదముల కూర్పు చక్కగనున్నది ఇతని ఉపమాన సామాగ్రికూడ సుందరముగ నుండును శ్రీరామచంద్రుడు ఖరదూషణాదుల సేనలను చీకాకుపఱచి చంపినాడు అప్పటి యుద్ధభూమి, హతశేషులైన నాయకుల శరీరములతో భోజన సామాగ్రివలెనున్నదని కవి యుపమించెను. ఇటులే యుద్ధకాండమున రావణుని శోకమును సముద్రముతో నుపమించినాడు.

"పరితాప మనియెడి బడబాగ్ని గలిగి
పెరిగెడి లాలయన్ ఫేనంబు గలిగి
వెడలు కన్నీరను వెల్లువ గలిగి
కడలేని వగవను కరుడలు గలిగి
ప్రకట రోదనమను రావంబు గలిగి
చకితత్వ మనియెడి చలనంబు గలిగి
మునుకొని శోక సముద్రుడై పెద్ద
వెనుబడి యెంతయు వికలుడై" యుండెను.

కొన్ని యెడల ఒకే పదమును నానార్థములందుపయోగించెను.

పుండరీకంబుల బోలు పారువారు
పుండరీకాక్షుల బోలు పారువారు
పుండరీకచ్ఛాయ బోలు పారువారు
పుండరీకొన్నతి బోలు పారువారు" (యుద్ధ పు 87)

అటనట అర్థ శబ్దాలంకారుదులను వాడి కావ్యమునకు సౌందర్యము సంపాదించెను. ఒక యెడ శ్లేష నుపయోగించెను.

"అరతానంద భోగాస్పదంబగుచు
బాతాళమును బోలె బరగినదాని
మహనీయ శతకోటి మహిమచే నింద్రు
మహితాలయము వోలె మానైన దాని
నిఖిలంబు నందును నెఱడు తేజమున
శిఖి నివాసము వోలె చెలువైన దాని" (యుద్ధ, పు. 343)

కుంభకర్ణుడు రామునితో యుద్ధమనగా కొలువుండుట గాదనియు, వానరులను నమ్ముకొని తనతో యుద్ధమునకు రావలదని,

"ఘనమైన పురుష రాక్షస భాషణములు
సనకాది యోగీంద్ర సన్నుతులు గావు
ఉరవడి బరతెంచు నుగ్రదానవులు
పరిచారికా మర ప్రతతులు గావు
చలమున నార్చు రాక్షస భటోత్తములు
నలిబాడు తుంబురు నారదులు గారు
వ్రాలుచు నీ మీదవచ్చు నా గాలి
యల పట్టంబుల యనిలంబు గాదు
యుద్ధరంగం బమృతోదధి గాదు
యుద్ధంబు మఱి కొలువుండుట గాదు. (యుద్ధ. పు. 361)

అని పల్కిన ద్విపదలు పోతనగారి, మహిమతో నుండంగ మధురాపురము గాని పొలుపార వైకుంఠ పురము గాదు.[13] అను పద్యమును బోలి యున్నవి.

అప్పకవి దీనిని ప్రామాణిక గ్రంథముగా నంగీకరించినను, దీనియందక్కడక్కడ కొన్ని ఛందో వ్యాకారణ దోషములు గన్పట్టు చున్నవి.

"అనఘ గంగా యమునలు గూడి యునికి" అనుచోట యతి భంగమును. (అయో. 105)

---

13. భాగవతము, దశమస్కంధము.

"ఓరి యా వానరుడున్నాడో లేడో
వెరవారగా నాకు వివరించి చెప్పు" (యుద్ధ పు. 298)

అనుచోట ప్రాస దోషమును సంభవించినవి, ఇట్లే 'అటువంటి', 'ముందెత్తు', 'మంచీడ్చి', వంటిక్వార్థకేకార సంధులును 'పుత్రనుచు', వంటి ద్రుత సంధులును, కుషష్టికి ముందు నగాగములేని ప్రయోగములను, 'యాత్రమము కేతెంచి', 'జాంబవతు కనియె', దోడుక పొయ్మిన' 'తోక గాల్పించుక' మొదలగు కానునకు కాదేశము వచ్చు ప్రయోగములను గావించెను రేఫ శకట రేఫ సౌకర్యమును గావించినాడు. కాని యిట్టి దోషములైనను, స్వల్పముగా నుండి చంద్రుని యందలి కళంకము వలె గాన బడరాకున్నవి

పింగళి లక్ష్మీకాంతముగారు, శాసనాధారములచే నీకవి, క్రీ శ. 1215 ప్రాంతము వాడని నిర్ణయించిరి గాని నీ కావ్యమంతటి ప్రాచీనమైనదాయను విషయమాలోచింపదగినది

మధుర మంజులములగు తేట తెనుగు పదములతో, నసమానములగు లలిత శబ్దార్థ సంగతు లలరగ, నీ రామాయణమును రచించి, ఆంధ్రులకు సకల పురుషార్థ ప్రదమగు రామకథామృత మొసగిన నీ కవి స్తుత్యర్హుడు

## ఉ త్త ర రా మా య ణ ము

ఇది కాచ భూపతి, విఠ్ఠలరాజు నను సోదర కవులచే రచింప బడినది. ఈ సోదర కవులిర్వురును తాము పూర్వ రామాయణమును రచించిన బుద్ధారెడ్డి పుత్రులమని దెల్పికొనిరి వీరు తమతండ్రి యాజ్ఞచే, తండ్రి రచించిన పూర్వ రామాయణానంతరమున ఉత్తర రామాయణమును రచించి రామకథేతి వృత్తాంతమును సంపూర్తి గావించినట్లు చెప్పుకొనిరి దీనిని కూడ రంగనాథుడే రచించి, ఈ సోదర కవుల పేరిడియుండును

ఇందు కథ రావణ జన్మాదినుండి నారంభించి, శ్రీరామావతార సమాప్తి వరకు వర్ణింప బడినది. ఇందుకూడ యథావాల్మీకముగా గాక, మూల భిన్నమగు కల్పనలు గావింపబడినవి.

(1) విశ్వ శ్రవసుని కూడవలెనను తలపుతో నాతని భార్య కైకశి యుండగా నాతడెట్టి చలనమును లేక యుండెననియును. మాల్యవంతుడు దోషి యని చెప్పుటకు గాను, పంజరమున చిక్కుకున్న పక్షికథ నొకదానిని యవాల్మీకీయమును ప్రవేశ పెట్టినాడు.

(2) రావణుడు బ్రహ్మదేవుని గూర్చి తపమొనర్చి అమృతనాభి నరులకెవ్వ రికిని కానరాకుండు నట్లుగ వరమును బడసినట్లు వర్ణితమైనది, వాల్మీ కమున లేదు.

(3) రావణుడు మాంధాతతో పోరాడి నట్లును, పులస్త్యు డేతెంచి, వారికిర్వు రకును సంధి గావించినట్లును వర్ణించినాడు.

(4) వాలి సుగ్రీవుల జనన ప్రకారము వర్ణితమైనది గౌతమపత్ని యహల్య నింద్రుడు గూడినపుడు వాలి జన్మించెను. అదే ప్రకారము వేరొక సమయమున ఋతుమతియైన యహల్యను సూర్యుడు గూడినాడు అపు డామెకు సుగ్రీవుడు జన్మించినాడు. అహల్యకు గౌతమునివలన జన్మిం చిన పుత్రిక అంజనాదేవి

(5) ఇందుగూడ ఇంద్రుని శాపముచే అహల్య పాషాణముగా బడియుండె ననియే వర్ణింప బడినది

(6) ఆంజనేయుని జన్మ ప్రకారము వాల్మీకి రామాయణమున లేదు. అతని జన్మ ప్రకారమిందు విస్తరింప బడినది. పూర్వ మొకసారి పార్వతీ పరమేశ్వరులు వినోదలీలల దేలుచు, వన విహారముల దేలియాడుచు మర్కట కూటమును గాంచి, ఆ విధమున క్రీడింప వలెనని కోర్కె వొదమగా, వారా రూపులను ధరించి, క్రీడించి పిమ్మట తమతొంటి రూపములను ధరించిరి కొంత సేపయిన తరువాత, గౌరికి గర్భ మెంతయు భారముకాగా, నామె దానిని దాల్పలేక, పరమేశునితో మొర వెట్టగా, పరమేశుడు దానిని గైకొని, భూదేవికొసగినాడు కొంత కాలమైన పిమ్మట శంకరుని యొద్దకేతెంచి, తాను సప్తకులగిరులను,

సప్తసముద్రములను, స్థావర జంగమాదులను మోచుచున్నను ఈగర్భమును దాల్పజాలపని మొరవెట్టుకొనినది అప్పుడా గర్భమును పుచ్చుకొని శివుడు వేయేండ్లు ధరించి పిమ్మట వాయువున కొసగినాడు. వాయువు దానిని వేయి సంవత్సరములు ధరించినాడు. అపత్యార్థియై కేసరిపత్ని యంజనాదేవి వాయువును గూర్చి తపమొనరింపగా వాయువాగర్భఫలమును అంజనాదేవి కొసగినాడు అంజనాదేవియును నద్దానిని గైకొని, ద్వాదశ మాసములయిన పిమ్మట హనుమంతుని కనినది

(7) వాలి, సుగ్రీవుల జన్మప్రకారమున కింకొక కథనుకూడ నీ కవి వర్ణించెను ఒకసారి బ్రహ్మ మేరుపర్వతముపై తపమాచరించు చుండగా వెలువడు కన్నీటిని చేతి యందలి యిలపై విడువగా దాని తేజమునుండి ఋక్ష విరజుడను వానరుడుద్భవించినాడు ఒకనాడీ ఋక్ష విరజుడు వనములో బ్రహ్మసరమను నొక కమలాకరము చెంతజేరినాడు అతడద్దానిలో తన ప్రతిబింబమును జూచి వేరొక వానరమున్నదని అది తన వైరియని భావించి, దానిని పట్టుటకై యందు దిగినాడు. వానరము నందుగానక పైకిలేచినాడు. కాని అతడు పైకేతెంచునప్పటికాతని రూపము మారి యాతడొక లావణ్య మూర్తియగు వానరస్త్రీగా మారినాడు. అపుడటనుండి యింద్రుడేగుచు, ఆమె సౌందర్యమునకు ముగ్ధుడై వీర్య స్ఖలనము గావించినాడు. యటులే యస్తమించు చున్న నినుడుగూడ నామె సౌందర్యోపకృష్టుడై వీర్యస్ఖలనము చేసినాడు. ఇంద్రుని వీర్యమాకాంతయొక్క వాలమును తడుపగా, వాలి యను పుత్రుడుదయించినాడు. అటులే సూర్యుని వీర్యము గ్రీవముపై నొల్కగా సుగ్రీవుడను పుత్రుడు జన్మించినాడు ఇంద్రుడు తన సుతునకు కాంచన మాలిక నొసగినాడు మరుసటి దినమున ఋక్షవిరజునకు యథా ప్రకారమున తొంటి మగరూపు సిద్ధించినది ఈ కథ వాల్మీకి రామాయణమున గానరాదు.

(8) రావణుడు సీతను పట్టుటకు గలకారణము వాల్మీకి రామాయణమున గానరాదు శ్రీరామచంద్రుడు సాక్షాద్విష్ణువని యెరిగియే రావణుడాతనితో

వైరమును కోరి సీత నపహరించి యాతనిచేత మరణము నొందినాడని యిందు వర్ణితమైనది

(9) నారద ప్రేరితుడై రావణుడు శ్వేత ద్వీపమునకేగి యచటి స్త్రీలచే పరాభూతుడైన కథకూడ వాల్మీకి రామాయణమున గానరాదు.

10) సీతారాములు సుఖులరై గడుపుచున్న సమయమున, ఒకానొక రక్కసి యేతెంచి, శ్రీరామునియొద్ద యిద్దరు వనితలున్నారని సీతతో దెలిపి ఆమె కనుమానము జనింపజేయును. సీత యా మాటలను విశ్వసించి శ్రీరామునివద్దకేగి ఆ వనితల వృత్తాంతము నడుగగా కుంభజుడు తనకొక పర్యాయమొక విల్లు, రెండమ్ముల నొసగి, "ఈ బాణ రాజంబు లెలమితో మీకు బ్రాబల్యముగ పనులొనగూర్చి నీకును నాధరణీ తనూభవకు, జేకొని పుత్త్రులై చెలగి జన్మించి భువనంబు తానస బొగడత కెక్కి యవనికి రాజులై యతిశయిల్లగను గలరంచు" చెప్పినాడు. కాబట్టి వాని విధమును దెలిసికొనుటకు తాను వాపియయ కొనినాడనని దెల్పినాడు అత్పుడవి మానినులై యుండు విధమెట్టిదియో దెల్పుమనగా శ్రీరాముడు మదిలో భావింపగా నా శరద్వయము వనితాకృతులు దాల్చి శ్రీరామునకు మొక్కి మరల, తొంటి రూపములను గైకొనినవి. దాని నంతటిని కనిన సీతాదేవి, వేరొక్క దినమున శ్రీరాముడు లేని సమయమున నేతెంచి నా శలేరములను విరిచి పొడి పొడిచేసి దానిని నీళ్లలో గలిపి త్రావినది వెంటనే సీతామహాదేవి గర్భము ధరించినది. ఈ కథ వాల్మీకి రామాయణమున లేదు

11) వాల్మీకి శత్రుఘ్ననకు పూర్వ రాజు మిత్రసహుని చరిత్ర చెప్పుట వాల్మీకి రామాయణమున లేదు

12) గృధ్రోలూక గృహ వివాదము శ్రీరాములు తీర్చుట వాల్మీకి రామాయణమున లేదు

ఈ విధముగ నిందుకూడ యమూలక భిన్నగాధలను కొన్నిటిని కల్పించి ఉత్తర రామాయణమును రచించి రామాయణమును సంపూర్తి గావించెను.

రావణుడు సీతను పట్టుటకు గల కారణమును దెల్పు సందర్భమున కవి విష్ణువు యొక్క వైభవము నధికముగ వర్ణించినాడు. దీని వలన సీతనికి విష్ణునియందు భక్తి యధికమేమొనని తోచుచున్నది. ధర్మముయొక్క ఔత్కృష్ట్యము నొకచోట చక్కగ వివరించినాడు.

"రాజు ధర్మముతోడ రాజ్యంబు సేయ
భూజనులను ధర్మబుద్ధినుండుదురు
ధర్మంబు దప్పక ధరణి పాలించు
నిర్మలాత్ములు గంద్రదు నిత్య సౌఖ్యములు
పొలి పొలి ధర్మంబు భూలోకసుఖము
పరలోక సౌఖ్యంబు బ్రాపింపజేయు
సచరాచరంబైన సకల లోకముల
నచలిత ధర్మంబు యమర రక్షించు
ధర్మంబు రాజుల ధరణి యేలించు
ధర్మంబు శరణాగత త్రాణకీర్తి
గలిగించి రక్షించు గాన ధర్మమున
గలుగని యర్థంబు గలదె లోకముల
ధర్మంబునా నొండు తలపోయలేదు
ధర్మ స్వరూపంబు ధరణీశ వినుము
దానంబు సేయుట దయగల్గియుంట
మానుగా పెద్దల మన్నింపమనుట
వంచన సేయక వలయుబేహార
మంచితగతి నాదుబడియె ధర్మంబు"

## శ్రీ రా మా య ణ ము

కర్త శ్రీ కట్టా వరదరాజు. దీనిని గూర్చి పీఠికలో శ్రీ నిడదవోలు వెంకటరావుగారీ విధముగ రచించిరి "శ్రీ కట్టా వరదరాజ కవి కృతమైన ద్విపద రామాయణము తెనుగు భాషయందలి ద్విపద వాఙ్మయ శాఖకేగాక

రామాయణ వాఙ్మయమునకు ప్రత్యేక విశిష్టత చేకూర్చిన మహాగ్రంధము. ద్విపద వాఙ్మయ శాఖలో గ్రంధపరిణామమున దీనిని మించిన గ్రంధములేదు. రామాయణ ద్విపదలలో నధికవ్యాప్తిగల రంగనాధ రామాయణమునకు కాల క్రమము ననుసరించిన నిది ద్వితీయమే యైనను, యధా వాల్మీకముగ మూల గ్రంధము ననుసరించుటలో నిది యద్వితీయమని చెప్పనొప్పును "

కట్టా వరదరాజు కరికాళ చోళుని వంశమున జనించెను. వీరి వంశ మూలపురుషుడగు కరికాలుడు కావేరికి కట్ట కట్టించుటచే వీరు కట్టావారు అయి రట. తాను శ్రీరామచంద్రుని వంశీయుడ నగుటచే తనకు రామాయణ రచనా ర్హత గలిగినదని అతడు గ్రంధారంభమున చెప్పుకొనెను.

"ఇనకులంబున వేంకటేశుండు మున్ను
జనియించి తన పుణ్యచారిత్రమెల్ల
బోయకులంబున బుట్టు వాల్మీకి
సేయనందు ప్రమోద చిత్తుండు గాక
అర్క వంశమున నీవై జనియించి
తార్కాణ గాగానే తత్కధామృతము
రచియింపుమనియె శ్రీరామచంద్రునకు
నీచరిత ప్రీతిగదా నిజాన్వయము
తన చరితంబు కీర్తనసేయు వినుట
తనయులచే గాదె తామున్ను వినియె" (అవతారిక)

ఈతడు క్రీ శ 1650 ప్రాంతమువాడు కట్టా వరదరాజు తండ్రి హరిదాసురాజు దాన శాసనమొకటి కడపజిల్లా మాధవపుర గ్రామమునన్నది. ఇది, 1636-37 సంవత్సరము నాటిది. కాన, వరదరాజు కూడ సుమారీ కాలము వాడే ననుటకు సందియము లేదు. క్రీ శ 1674 ప్రాంతమున తంజావూరు పరిపాలించిన ముద్దళగిరి యాశ్రయమున నుండిన గణపవరపు వెంకటకవి, - తన ప్రబంధ, రాజ వేంకటేశ్వర విజయ విలాసమున నీతవి

శ్రీరంగ మహాత్మ్యమునుండి ఒక పద్యమును సంగ్రహించెను [14] కాన నీతడం తకించుక పూర్వికుడై యుండును. ఇదిగాక నీతడు శ్రీరంగ మాహాత్మ్యమందు స్తుతించిన ఆంధ్రకవులలో అల్లసాని పెద్దన కూడ గలడు. అల్లసాని పెద్దన క్రీ. శ. 1535 వరకు జీవించియుండెను కాన నీతడు 17వ శతాబ్దము మధ్య భాగమున నుండెనని భావింపవచ్చును

ఈతని యితరకృతులు, పరమభాగవత చరిత్ర, శ్రీరంగ మాహాత్మ్యము. ఇందలి ప్రథమకృతి పరమభాగవత చరిత్ర, శ్రీరంగ మాహాత్మ్యము రెండవది. ద్విపద రామాయణము మూడవది

గ్రంథము నీతడు మూలానుసరణముగ రచించెను. అమూలకమగు కథల్ల నేమియు చెప్పలేదు. రచనా పద్ధతిలో కూడ, మూలమునే యనుస రించెను ఒండు రెండు పట్టులందు, మూలముకంటె కొంచమధికముగ చేర్చెను. శ్రీరామచంద్రుడు, చైత్రమాస నవమీ తిథియందు కర్కాటక లగ్నమున జనించినట్లు మూలమున నుండగా, నీతడు శ్రీరాముడు జనించినది బుధవారమని తెల్పినాడు బుధవారమను మాట మూలమున లేదు. ఇది భాస్కర రామాయణమున గలదు

ఈతడు కూడ అహల్యను గౌతముడు రాయిగా పడియుండుమని శపించి నట్లు వర్ణించినాడు, పెంపు చేయవలసినచోట జాతివార్తా చమత్కారములతో పెంపుచేసి రచచి గావించెను

సీతాకళ్యాణమునకు ముందు జనకమహారాజు దశరథునికి పంపిన శుభ లేఖ విజయనగర సామ్రాజ్యమున రాయసము వారు వ్రాసెడు వక్కాణ ననుసరించియున్నది

"శ్రీమన్ మహా మండలేశ్వర
రేందు కులోత్తమాహీన ప్రతాప
జనక మహారాజ చంద్రులంగారు

14. ఏకతాళయిన పీర మద్దెల రవం బేకంబుగా నట్టువల్ అనునది.

మన వంశ దశరధ మనుజేశునగరి
చాలు మనసులకు సంప్రీతి బంపు
మేలువార్త నిరుద్ధ మితమున కేము
అందరు బదిణామ మచటి మీరాజు
నందు యోగక్షేమ ముప్పటప్పటికి
వ్రాసియంపునది మా వైదేహి బెండ్లి
చేసెద మిపుడు మీ శ్రీరామునకు
మీరాజువారును మీ పురోహితులు
చారులై ఖరుల గౌసల్యాది సతులు
రావలెనని తమ రాజుతో దెలుప
గావలె" ననెడి వక్కాణ జదివింప"

(బాలకాండము, పు '209-204)

దశరధుని మేల్కొల్పుచు, "తీరుపు డిక నామతీర్థాదికములు"[15] అని సుమంత్రాదులు పల్కిరి ఇది వైష్ణవ సంప్రదాయమును ప్రవేశపెట్టుటకే కవి చేసెను.

"అజకుమారకః భాస్కరాన్వయ జలధి
రజ నీకరః సమస్తరాజ మూర్ధన్యః
దాన దీక్షా దురంధర వైరిరాజ
మానసీ రాకర, మధన కృపాణ
సత్యవాక్య ప్రతిష్ఠా సంప్రదాయ
అత్యంత నియత ధర్మాచార నిపుణ
దశరథేశ్వరః యవ—ధార..."

(అయోధ్యాకాండము, పు. 284)

శ్రీరాముడు రావణుని వధించిన యనంతరము, బ్రహ్మహత్యా దోషము దొలగుటకు రామేశ్వరమున రామలింగేశ్వర ప్రతిష్ఠ నొనర్చెనని వాల్మీకి

15. అయోధ్యా కాండ, పుట 312.

రామాయణమున నుండగా నీ కవి, శ్రీరాముడు విభీషణునికి శ్రీరంగేశు నొసగెనని రచించినాడు. శ్రీరంగమాహాత్మ్యమునందు గల యీ కథను వైష్ణవుడైన యీ కవి తన గ్రంధమున ప్రవేశ పెట్టి యుండును (రంగనాథ రామాయణమున రామలింగ ప్రతిష్ఠ జేసినట్లే గలదు). (యు కాం. 12002–12314)

ఇంద్రజిత్తు నాగపాశములచే లక్ష్మణుని, వానరులను బంధించినపుడు, నారుదుడేతెంచి, గరుడుని స్మరించినచో, అతని రాకవలననే, ఆ పాశము లూడిపోవునని యుపదేశించెను ఇది వాల్మీకమున లేదు

రావణ వధా సమయమున విభీషణుడు రామునికి గావించిన యుపదేశము వాల్మీకమున లేదు. ఇది ఆధ్యాత్మ రామాయణమున గలదు.

**కవితా విశేషములు** కట్టా వరదరాజు రామాయణములోని ద్విపదపంక్తు లనేకములు రంగనాథ రామాయణమున జేరినవని శ్రీ నిడదవోలు వెంకటరావుగారు తమ పీఠికలో సోదాహరణముగ జూపియున్నారు.

ఈతని, ద్విపద రచన సరళమై, ప్రసన్నమై తనరారుచున్నది దీర్ఘమగు వర్ణనలను చేయు సందర్భమున, సంస్కృత సమాస రచననే చేయును.

ఉదా "కాంచన దళ రత్న కందళ కర్ణి
కాంచిత కమల వనాభిశోభితము
మకరంద రసలోల మదచంచరీక
నికరగాయన గాన నిబిడీ కృతంబు
శౌనకాది మహాసంయమి శ్రేష్ఠ
మానితాశ్రమ లసమాన కూలంబు
మానిత సురత సంభ్రమ రణ దివిజ
మీనేక్షణా మణీ మేఖలావరము''

చిన్నన్న జెప్పిన ద్విపద లక్షణముననుసరించినవాడు. ప్రాసలు యతులు గాని, పాదాంత పదమధ్యవిటుపులు గానరావు ఏ ద్విపద కాద్విపద విడివడు

నట్లుగ రచించినాడు. మరియు, పాదాంతమున పాద మధ్యములందును ప్రాసల నుపయోగించి, రమణీయమగు రచన గావించినాడు.

"దాసుల నర్థిని చాసుల సుపరి
ధానుల వివిధాభి ధానుల సదవ
ధానుల రుచిరోపధానుల సావ
ధానుల జయ సంవిధానుల సప్రి
ధానుల బహు యాతుధానులం గనుచు

(సుం. కాండము, పుట 21)

తేట తెనుగు రచన కివి యుదాహరణ గాగలవు

"రవి లేని దినము సారధి లేని రథము
కవి లేని కీర్తి యంకము లేని పోటు
ప్రీతి లేని వాడు తీర్పరి లేని సేన
ధృతి లేని తెగువ కూరిమి లేని చెలిమి
దొర లేని సీమ చంద్రుడు లేని రాత్రి
తరి లేని సంధ్య మంత్రము లేని జపము
సతి లేని గృహము వాసన లేని పూవు
భృతి లేని కొలువు కోయిల లేని వనము
శ్రుతి లేని పాట శూరులు లేని కోట
కత లేని రచన నిల్కడ లేని మాట"

గ్రంధావతారికలో తానీ విధముగ కావ్యమును రచింతునని బాసచేసినాడు

"... ..నవరసంబులు పిచ్చిలంగ
జల్లి మాటలు నపశబ్దములన్ జజ్జుట్ట
టల్లికల్ ప్రావలం దదుకు బల్కులును
పునరుక్తములు వట్టి బూదెలు కాకు
దెనుగు లీ చలును సందిగ్ధముల్ ప్రాలు
మాలికల్ కటువు లేమలుపులు కొసరు

లాలంబములు వెట్టి యతకడంబులును
చాయలెత్తులు లర్థ చౌర్యముల్ పెట్టు
జాయలు లేక లక్ష్మణ సమ్మతముగ
నందమై సుకవులౌ రాయన చెవుల
విందుగా గపురంబు, వెదచల్లినట్లు
ధ్వనులు వ్యంగ్యములు వింతలు వాసనలును
మినుకులు జిగిబిగి మెరపడుల్ జాతి
వార్తలు సుపమలు—వర్ణనాంశములు
మూర్తి మద్వాక్యముల్—ముద్దులు చూప
నొకమాటకన్న వేఱొకమాట వింత
యొకపాదమున కన్న—నొకపాద మొఱపు
నొకదశంబున కన్న నొకదశంబంద
మొక యుత్తరము మింప నొక యుత్తరంబు
వెలయంగ ద్విపద గావింప చిత్తమున
దలచి...... ”

ఈతడనేక జాతీయములను, వాడి, రచనకు సొగసును కూర్చినాడు ఇతని కవితలో శాబ్దిక చమత్కారములు గాననగును. ఒండు రెండుచోట్ల 'సీతంబుతోక పీవికి నాస్తిగాన విజముగాతోక పీవికి నాస్తిజేసి” యని శ్లేషను గూడ వాడినాడు (సుం. కాం. 4106–7)

“అహిరి బొడిన యనువుగా నేడ్చి”
“చేతగాదని వాని చెవి మెలిపెట్టి ప్రోత్రితుమే”
“సామజోతమము దీర్చగనైన పనికి”
“దోమలు పూని పొందునే కార్యసిద్ధి”
“తన్ను గట్టు త్రాళ్లు తా దెచ్చినట్లు”
“కత్తి మీది సాము”
“మిన్ను విఱిగి పై బడినట్లు”
“ఆవ దిన్నటులు”

"గుదికమిర్రింగిన సిద్ధుడు"
"వింజ మాకిడినట్లు"
"పుట్టెడు కన్నీరు"
"గువ్వ కరిగొని యడుగు"
"కయ్యంబునకు మీది కాలు ద్రువ్వేరు"
"తద్దినములు పెట్టుట"

ఈతడు వ్యవహారమునందున్న పదముల ననేకములను ఉపయోగించి యున్నాడు —కిటుకులు దీర, అద్దిలా యీ బాపనాన, ఆలి పోతనము, పొదిలంబుగాబోయి, గ్రామ సింహముయి, కమలధి, కమలాకరము (సముద్రము), ఒళ్ల (ఒడలు–రూపాంతరము) గరువించుట (గర్వించుట), చాడె (ఉడ రేక కొప్పు), కుపసము (దుప్పసము), విగ్రహించు, దీవెన, చిగణించు, దిడ్లు (పల్లకీపై పరచెడు ముతక గుడ్డలు) వరుతము, హల్లోహలము, క్రిమి యించుట, అజాహారము మర్చులు (మీదకట్టడములేని మిద్దెదిల్లు), తన్నీరు తిత్తులు (మంచినీటి తిత్తులు), అక్కటికించి, ఉక్కోగులు (గతుర్రాజు) నిబద్ధి సజ్జారములు, (సామజాగరములు), కలెబడి, ఓగ్గెకవుంగలించి, కవుసత్వ పొదవు గుబ్బలి, మున్నగునవి

చందో వ్యాకరణ విశేషములు: చేతురు, కోతురు, పట్టుక, చేసుకవంటి ప్రయోగముల వివరములు, కుషష్టికి నుగాగము రాని ప్రయోగములు–చేయు ధాతువునకు, చేసు, ప్రథమావిభక్తి, డు ప్రత్యయ లోపము, ।—పృధుల పెన్నెత్తి గుంపు, వంటి వైరి సమాసములును, ప్రయుక్తమైనవి

దీర్ఘముపైనెఱ సున్నలను గూర్చి, ప్రాసకూర్చినాడు.

"కోంతి కూటున మూక గొలుపంగ వట్టి
కాంతారమున జనక సుతావరుండు"
"తాండి కాండముల నాధరహణోక్తముగ
"నేండు నూర్జాహుతులిచ్చి తావేల్చి"

14)

"తోంచెను వానికి దుర్నిమిత్తములు
కొంచె బాతెరు సిక కొలగాడు వాడు"

ఆయా సందర్భములకు తగిన రసము నీ కవి నేర్పుతో నావిష్కరింప జేసినాడు సీతను పర్ణశాలయందు కానక శ్రీరాముడు విలపించిన ఘట్టమున కరుణము, కిష్కింధాకాండమున సీతకై రాముడు విరహము చెందినపుడు విప్రలంభ శృంగారము వర్ణితములయినవి

## రా మా య ణ ము[16]

అముద్రితము

కర్త ఏకోజీ, తుక్కోజీ తనయుడు ఈ 'రామాయణ కర్తయయిన ఏకోజీ క్రీ.శ 1676-1688 వరకు తంజావూరును పాలించిన మొదటి ఏకోజీ యనికొందరు పొరపడిరి కాని యీతడు తన వంశాదికమును గూర్చి చెప్పి కొనిన యవతారికా భాగమునుబట్టి చూడగా, నీతడు క్రీ శ 1737వ సంవత్సర మున తంజావూరును పాలించిన రెండవ యేకోజీ యనియును తుక్కోజీ తనయు డనియును తెలియుచున్నది.

ఈతడు విఘ్నేశ్వర కల్యాణమును నాటకమునుగూడ రచించెను ఇది శాహాజీ మహారాజు రచించిన విఘ్నేశ్వర కల్యాణము ననుసరించి వ్రాయబడి నట్లు తెలియుచున్నది. ఈ గ్రంథమున తనతల్లి రాజ హంసాంబిక యని చెప్పి కొనినాడు

దీనిని యథావాల్మీకముగ రచించినట్లు అవతారికయందు చెప్పెను. ఈకవి మహారాష్ట్రుడైనను చక్కటి తేట తెనుగు పలుకుబడులతో రచించెను. అన్య దేశ్యపదము లెచ్చటను గానరావు వ్యాకరణ విరుద్ధ ప్రయోగములు లేవు. యతి ప్రాసాది దోషములు లేవు

---

16 తంజావూరు సరస్వతీ మహాలు గ్రంథాలయము, 852, ఎమ్. తాళపత్రములు.

(1) గౌతమ శాపముచే అహల్య రాయిగా పడియుండి, రామపాదధూళి స్పర్శచే స్త్రీగా మారినట్లుగ నిందు రచింపబడినది.

(2) విభీషణుడు రావణునకు బుద్ధి చెప్పగా నద్దానిని సహింపలేక రావణుడు నిండు సభలో విభీషణుని తన్నినట్లు, విభీషణుడు శ్రీరామచంద్రుని శరణుపొంద నటనుండి వెడలి పోయినట్లు

(3) రావణుని గంభీర విగ్రహమును మొట్టమొదట జూచి శ్రీరాముడు మెచ్చుకొని, ఆతడు కనుక దుష్టవర్తనుడు కాకుండినచో పదునాల్గులోకములకును పూజ్యుడని భావించెనని యు వర్ణించెను.

"ఇట్టి తేజమ్ములు నిట్టి సంపదల
గట్టిగా జూడ రాక్షస కులంబునను
పుట్ట డొక్కండు వీడు పుట్టి వింతగను
క్రూర కర్మముల గైకొన కుండెనేని
యీరేడు జగముల కితండు పూజ్యుండు
జాలిన భుజశక్తి వీడి విని భటుల
కాలరుద్రునైన గడు మ్రింగగలడు

(4) కుంభకర్ణుడు రావణునకు బుద్ధి గరపు సందర్భమున యుద్ధ నీతిని వివరించినాడు

"మతిగల మంత్రుల మంత్రానుమతుల
కృత కార్యములు బరికించునే విభుండు
నాగి ప్రభుమంత సముత్సాహశక్తు
లగణిత ఫలదంబులై వాని కమరు
పతి దేశకాల విభాగంబు లెరింగి
చతుర జన ద్రవ్య సంపద గలిగి
కార్యంబు మీదగు కార్య మూహించి,
కార్య విఘ్న ప్రతీకారంబు దెలిసి
... ...

పగవాని భుజశక్తి భావించి సంధి
తగు బుద్ధిమై జేయ తంపోయవలయు
నటగాక బలశూన్యుం డగుట చింతించి
పటుసత్వుండై శత్రుపై నెత్తవలయు
విడిసిన బలము వివేకించి మీద
విడిసి మార్తుర గెల్వ వెరపొందవలయు

—— ——

నీ యారు గుణముల నెరింగి వర్తించు
నాయవని పాలుండభివృద్ధి బొందు'

ఈతని శైలిపై యుదాహృత ద్విపదల వలన తెలియుచున్నది.

## విభీషణ బుద్ధి[17]

అముద్రితము[17]

విభీషణుడును, ఇతరులును రావణునకు బుద్ధి జెప్పుట యిందలి ప్రసక్త విషయము. ఆద్యంతములు గానరావు కవియెవరో తెలియదు. ఇది ఏదేని రామాయణములోని భాగమేమొ,

"అక్కడ రావణుండఖిల మంత్రులను
తక్కక రావించి తగవారి కనియె
మంత్ర కోవిదులార మర్కటుడొకడు
ఱంత్రంబు చూపిన చందాన వచ్చి
లంఖిణి జంపి యాలంక శోధించి
పంకజానన సీత పరికించి కాంచి
... ... ...
కార్యంబు, దాటక మున్నె మీతజ్ఞత మెరసి

17 తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయము, ఎమ్ 395 కాగితప్రతి.

యిది కార్యమని చెప్ప డిందరు లెస్స
యదియ సేయుదుము మేలగు తెరగైన"

యని రావణుడు తన వారిని కార్యాలోచన మడుగుట నుండి యాయా గ్రంథ మారంభమగుచున్నది రావణుని మంత్రులందరును తమ కిచ్చవచ్చినట్లు దెల్పుచు రాముని గెల్చుట యసాధ్యము గాదని పల్కుచుండగా, విభీషణు డడ్డుపడి వారు తెల్పునది నిజము గాదనియును, రామబాణాగ్ని లంకను దహించివేయుటకు పూర్వమే సీత నాతని కొసగి, శరణు పొందమని హితమును జెప్పెను. కాని రావణున కీ యుపదేశ మెంతమాత్రమును రుచింపదు. సభను చాలించి లేచి పోయెను. యుద్ధాంతమున నాతని తల్లి చిట్టచివరిసారిగా, సీతను శ్రీరామున కొసగి, అతని శరణు పొందమనును కాని రావణునకు శ్రీరాముడు సాక్షాత్తు శ్రీ మహావిష్ణు వనియును, తన్నుద్ధరించుటకే భూలోకమున నవతరించినా డనియును తెలియుటవలన తల్లి యుపదేశమును పెడచెవినిపెట్టి శ్రీరామ చంద్రునకు మ్రొక్కుట తనకు చేతగాని పనియని దెల్పినాడు. రావణుని పల్కులను విని అతని తల్లి సభాస్థలినుండి లేచి వెడలిపోయినది. ఉపలబ్ధమగు గ్రంథమింతటితో సమాప్తమైనది

## శ త కం ఠ రా మా య ణ ము[18]

**అముద్రితము.**

ఇందు డెబ్బది పత్రములు గలవు. గ్రంథము సమగ్రముగ లేదు. ప్రస్తావనాంశము, కవి వంశాదిక విశేషములు లేవు. దీని ప్రారంభమిట్లు గలదు

"శ్రీ మహితానంద శృంగారకరము,
కామితార్థంబులు కడు మోద మమరి
అలమేరు కాంతుల నఖుల నడుమ
వెలయు శాకద్వీప వేదికాస్థలిని

---

18 ఆంధ్ర సాహిత్య పరిషద్గ్రంథాలయము, గ్రం.సం 20.

సిరి దనరు పట్నంబు సరగుననొకటి"

ఇందలి శైలి మిక్కిలి సరళముగనున్నది.

చేదరాఘవరెడ్డి రామాయణము అముద్రితము

ఈ ద్విపద రామాయణ శిథిలప్రతి పరిశోధకమండలి అనుమకొండలో గలదని గోలుకొండ కవుల సంచిక పుట 406లో తెల్పబడినది

ఇవిగాక, తాళ్ళపాక అన్నమాచార్యులు, రామాయణమును "ప్రవిమల ద్విపద ప్రబంధ రూపమున నవముగ" రచించినట్లు చిన్నన్న అన్నమాచార్య చరిత్రలో (8-17) తెల్పెను కాని నేడిది లభ్య మగుట లేదు

గణపవరపు వేంకటకవి (1630–80) విరచిత బాలరామాయణము కూడ నేడలభ్యము.

## మైరావణ చరిత్ర

కర్త కాచన. దీనినిగూర్చి గ్రంథ పీఠికాకారులిట్లు వ్రాసిరి "ఈ మైరావణ చరిత్రను రచించిన కవి "కాచన"యని యూహించుట కాధారము లున్నవి తంజావూరు సరస్వతీమహల్ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార ప్రతి యందు కవినామధేయము కన్పడుచున్నది.

ఈ రెండు ప్రతులును నేక కర్తృకములా లేక భిన్నకర్తృకములా యని చర్చించినపుడు పాఠ భేదములున్నను, కథాసంవిధాన పద్ధతి, శైలి మున్నగు వానినిబట్టి చూడ నేకకర్తృకములనియే నిర్ధరింప వీలగుచున్నది. ఈ పరిష్కరణము శుద్ధముగా తంజావూరు ప్రతి ననుసరించి యున్నది. కవినామవంశ ప్రతిపాదకములగు పద్యములను మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారపు ప్రతి ననుసరించి యథామాతృకముగ నిందు పొందుపరుచుచున్నాము.

"కౌశిక గోత్రమున ఘనతకు నెక్కి
సర్వవిద్యలయందు జతురుడై యున్న

నలరంగ మల్లాది యయ్యలన్నకును
రమణి రత్నంబైన లక్కమాంబకును
నొక సుతుడు ధీరుడు వంశాన్వయుండు
శ్రీహరి కులజుడు చిట్టియ సోదరుడు
కదమర్థితోడుగ కాచనసువాడ''

కౌశిక గోత్రోద్భవుడగు మల్లాది అయ్యలన్నకును లక్కాంబకును జన్మించిన వాడు 'కాచన'యని దీనినిబట్టి తెలియుచున్నది. శ్రీగిరి కుత్తరముననున్న చెలులూరను గ్రామమునగల హరిచెన్నకృష్ణునకు తన గ్రంథము సంకితము చేసినాడు

శ్రీరామ పట్టాభిషేక సమయమున శ్రీరామచంద్రుడు, హనుమంతుని పరాక్రమమును ప్రశంసించుచుండగా, వసిష్ఠుడు, శ్రీరామునకు హనుమంతుడు, మైరావణునిచే, పాతాళలంకలో బందీకృతులైన రామలక్ష్మణుల నెట్లు విముక్త పరచి గొనితెచ్చినది వివరించి మైరావణ చరిత్రను దెల్పును

ఇందలిది మంజరీ ద్విపద వికారమగు రచన. ఎట్టి ఛందోనియమమును గాని పాటించినట్లు గానరాదు పెక్కుచోట్ల ప్రాసయతులను వాడినాడు.

మైరావణుడు రామలక్ష్మణులను గొనిపోవునపుడు, హనుమంతుడు వగచుచుండగా, అంగదాదులు హనుమంతునకు ధైర్యము చెప్పిన సందర్భమున గల ఈ క్రింది ద్విపదలవలన ఈతని శైలిని తెలియనగును.

''ఏల వగతువయ్య యితరుని భంగి
వగచుట కార్యమే వాయుతనూజ
నీవిట్లు వగచిన నిందెవ్వరైన
దలపోసి చూచిన దక్షులున్నారె?

భానుండు లేని భూపట్టంబు కరణి
జంద్రోదయములేని శార్వరి భంగి
బతిలేని సతి భంగి, పార్థివ రహిత

మైనను గార్యంబు లట్లుండగాను
జెలగి వారధి దాటి సీత నమ్మించి
తెఱగొప్ప సేనల దెచ్చి చేర్పించి
మాయల మాటల మరి కోలుపోయి
తావ్యర్థమైపోయె దరువరేశ్వరుడు
అని నిన్ను బలుకుదు రఖిల దేశముల
బోరి బోరి జానకి పొలియు నంతంత''

తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయమువారు ప్రకటించిన మైరావణ చరిత్రయు, శ్రీ వెంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థయందు డి. నెం 1177న వర్ణితమైన మైరావణ చరిత్రయు భిన్న కర్తృకములని భావించెదను. కాని, ఆ ప్రతికి అద్యంతములు లేనందున గ్రంథకర్త యెవరో తెలియదు. కాని రెంటికిని కథారంభ విషయములోను, అటనట ప్రస్తావనాంశములోను భేదములుండుట తెల్లము.

## మై రా వ ణ చ రి త్ర[19]

అముద్రితము [19]

కర్త పోలుమంచి బసవన, ఈతడు జన్నమ్మ, మల్లమంత్రుల కుమారుడు.

''వారిపుత్రుడ బసవనను పుంభావ
శారద నిపుణుడ సత్కవీశ్వరుల
పాదాబ్జ భృంగమై పరగినవాడ
మోదాస రఘుకుల ముఖ్యుడైనట్టి
శ్రీరామ విభునికి క్షితి నంకితముగ
మైరావణ చరిత్ర మహిమ జెప్పెదను''

---

19 ఆంధ్ర సాహిత్య పరిషద్గ్రంథాలయము గ్రం.సం. 2610.

ఇందలి కవిత పైరెంటి యందుకంటె సరసముగ నున్నది ఇది ద్విపదచ్ఛంద మునవే గలదు మాతంగి మైరావణునకు హితమును చెప్పగా, నాతడద్దానిని నిరాకరించి ఆమెతో బదులు పల్కిన ఈ క్రింది ద్విపదలు కవియొక్క శైలి నెఱుగుట కుపయుక్తము కాగలవు.

"శరణంబు... వేడను శాంతంబు విడిచి
... ...
శత్రువు గని పాఱి చచ్చుట కంటె
జిత్రాసి ధారలచే దెగమించి
వృత్రారి పథమున వెలయుట లెస్స
నేత్ర బిబ్బోకాంగి నీవు పొమ్మనిన
దైవాజ్ఞ గడవగ దరమె యెంతైన
దావెతనొంది మాతంగి శోకమున
బోయెను మదిజాల బొంగి లోపలికి"

ఈ కావ్యకర్త క్రీ శ. 1740 ప్రాంతమునాటి వాడై యుండును.

ఇదిగాక, ఆంధ్ర సాహిత్యపరిషత్పుస్తక భాండాగారమున, మరిరెండు మైరావణ చరిత్రలు (గం సం 896, మరియు, 1590) గలవట, ఇందు 1590 సంఖ్యయందు వర్ణింపబడినవి మంజరీ ద్విపదలో రచింపబడినది. "దీనిని గూడ ద్విపదకావ్య చక్రవర్తులగు తాళ్ళపాకవారే వ్రాసియుందురు. వ్రాత కొంచెము భేదముగనున్నదని వివరణము వ్రాసినవారు వ్రాసిరి

పాతూరితిమ్మయ విరచితమగు వేరొక మైరావణచరిత్ర. ఆర్ నెం.602న వర్ణితమైనది, శ్రీవేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థయందు గలదు. ఈ పాతూరి తిమ్మయ శ్రీవత్స గోత్రుడు. పేరమంత్రి సుతుడు, అమ్మయామాత్యుని సుతుడు, తుమ్మపూగి నివాసుడు, ఇదియు ప్రాస సహిత ద్విపద యందే రచింపబడినది.

## మైరావణ చరిత్ర[20]

అముద్రితము.

గ్రంథమున కాద్యంతములు లేవు ఇది లఘుకృతి. కర్త యెవ్వరో తెలియదు వ్రాలుతప్పు లధికముగా నున్నవి. కథేతివృత్తమును చెప్పుటలోనే గాని వర్ణనాదులను గావించుటలో కవి యౌత్సుక్యమును చూపలేదు. గ్రంథమందు చెప్పుకొన దగిన విశేషము లేవియు లేవు.

ఇంకను చంద్రగిరి చిన్నయ్య, (ఆ. కా. సూ. పు. 157) త్రైప లక్ష్మీ నరసింహ శాస్త్రి (ముద్రితం) కవిరంజనీ ముద్రాక్షరశాల, చిత్తూరు, (882) బసవప్ప కవి, Telugu Academy- ఆకారాద్యముల దిత గ్రంథ సూచిక (I Part 18) ఆ సా ప ప. నెం. 1590- మైరావణ చరిత్రలున్నటులు తెలియుచున్నది

## 2. భాగవత సంబంధములు

## ద్విపద భాగవతము దశమ స్కంధము

ఈ కృతికర్తమడికి సింగన. ఇది పోతన భాగవతము కంటె పూర్వము రచితమైనది.* మడికి సింగన దీనిని మాత్రమేగాక, పద్మపురాణము, వాసిష్ఠ రామాయణము, సకలనీతి సమ్మతమను గ్రంథములను రచించెను. సింగన పద్మ పురాణమును శాలివాహన శకము 1342 అనగా క్రీ శ. 1420 సంవత్సరమున దెనిగించి ముగించినట్లు దానికృత్యంత పద్యము వలన దెలియుచున్నది. వాసిష్ఠ రామాయణము పద్మపురాణమునకు దరువాత రచింపబడినదగుటచే నది క్రీ శ 1420కి దరువాత రచింప బడినది. "ఈ రెండు కావ్యములకు నడుమ సింగన్న భాగవత దశమ స్కంధమును గూడ దెనిగించి కందనామాత్యునకే

---

20 శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ, డి. నెం. 1177.

* పోతన (ని వెంకటరావు)

యంకిత మొనరించెను సింగన కృత భాగవత దశమ స్కంధము నాకు లభింపలేదు అటు తరువాత నీకవి సకలనీతి సమ్మతమను నీతి గ్రంథమును సమకూర్చెనని రామకృష్ణ కవిగారు చెప్పుచున్నారు. వీనినన్నిటిని విచారించి చూడగా మడికి సింగన్న 1430వ సంవత్సరము వరకైనను జీవించెను.[21]

బమ్మెర పోతన క్రీ శ 1400–1470 ప్రాంతముల నుండెనుగాన మడికి సింగన పోతన సమకాలీనుడగుచున్నాడు

ఈ గ్రంథము సంస్కృత భాగవత దశమ స్కంధమునకనుసరణమే అయినను సంస్కృతాంధ్ర భాగవతము లందువలె నిందు పూర్వోత్తర విభజన గానరాదు ఇందు కథ మధురా కాండము, కల్యాణ కాండము జగదభిరక్షణ కాండము అను మూడు భాగములుగ విభజింపబడినది ఈ గ్రంథము సంపూర్ణ ముగలేదు అక్కడక్కడ గ్రంథమున పంక్తులు లోపించినవి. గ్రంథ మక్రూర స్తుతితో ప్రారంభమై, ధర్మరాజు రాజసూయ యాగము, శ్రీకృష్ణుని వృత్తములతో సమాప్త మగుచున్నది

శ్రీకృష్ణుడు మధుర యందున్నపుడు జరిగిన వృత్తాంతమంతయు మధురా కాండము. శ్రీకృష్ణుడు రుక్మిణీదేవిని కల్యాణ మాడుటతో ప్రారంభమై, ఆతడష్ట మహిషులను, పదునారు వేల గోపికాస్త్రీలను వివాహమాడుట మొదలగు శ్రీకృష్ణ కల్యాణ పరంపరలతో పాటు, ఉషానిరుద్ధుల కల్యాణ కథకూడ కల్యాణకాండమున చేర్పబడినది

జగదభిరక్షణకాండమందు శ్రీకృష్ణుడు లోకకంటకులైన జరాసంధ, శిశుపాల, దంతవక్త్రాదులను చంపి లోకక్షేమమును సంస్థాపించు వృత్తాంతము గలదు ఈ విభజన గర్గ భాగవతము ననుసరించి చేయ బడినట్లు తెలియు చున్నది

శ్రీకృష్ణుడు మధురయందున్నపుడు జరిగిన కథావృత్తాంతమంతయు మధురా కాండము.

---

21 ఆంధ్ర కవుల చరిత్ర. ప్ర. భా. పు. 976.

శ్రీకృష్ణబలరాములు సాందీపునియొద్ద విద్యాభ్యాసము పూర్తిగావించిన పిమ్మట గురువును దక్షిణ గోరుమని శ్రీకృష్ణుడే "గురులార యే నీకు గురు దక్షిణార్థ మిరవార దరమిడి కొనివత్తు దయవేడు"మని వేడినట్లు సింగన వర్ణించెను. కాని పోతన భాగవతమున బలవంతుడైన కృష్ణుని జూచి గురువే మృతుడైన తనపుత్రుని దెచ్చి గురుదక్షిణగా నీయమని వేడినటులు గలదు.[22]

ఇదేవిధముగ రుక్మిణి తన్ను వివాహమాడవలసినదని శ్రీకృష్ణునియొద్ద కంపిన భూసురోత్తముడు ఆమె సౌందర్యమును శ్రీకృష్ణునెదుట వర్ణించుటను సింగన యిట్లు రచించెను.

"అనఘాత్మ భీష్మకుండను విదర్భేశు
తనయ రుక్మిణియను ధవళాయతాక్షి
తనుమధ్య యుత్ఫుల్ల తామరసాక్షి
గరుడ కిన్నెర యక్షగంధర్వ సతులు
దొరయలేరా యింతితో నీడుబోల్ప"[23]

ఇట పోతన అంగాంగి వర్ణనకంటె వేదవిదుడైన భూసురునిచే సింగన గావించిన వర్ణనయే సమయోచితముగను, ఉదాత్తముగను నున్నదేమో!

శ్రీకృష్ణుడు బాణాసురుని బాహుహవు లనన్నిటిని తెగనఱుకగా, నీశ్వరు డాతనికి నాల్గుచేతులను ప్రసాదింపుమని కృష్ణుని ప్రార్థించెనట.

"నీ భక్తుడననేల నిగిడి యే ప్రొద్దు
మాభక్తుడీతడు మా ప్రాతవాడు
మాన్యుడు ప్రహ్లాదు మనుమని కొడుకు
ధన్యాత్ముడగు బలి తనయుడు గాన
నీతని కరుణించి యిచ్చితి నాల్గు

---

22 పోతన భాగవతము దశమస్కం. ప 1412–1414.

23 కల్యాణ కాండ పుట 66.

24 ద్విపద భాగవతము పుట 153.

చేతులు నిను పూజ చేసెడికొరకు
నీ భక్తులగువారు నెఱిమాకు ప్రియులు
మా భక్తులగువారు మరి నీకు ప్రియులు
గాక నెందును వేరు గలదయ్య మనకు?
శ్రీకంఠ . . . "

కవి హరిహరాభేదమును చాటుటకే నిట్లు శివకేశవుల సంభాషణను ప్రవేశ పెట్టెనేమొ ఇట్టి సంభాషణ పోతన భాగవతమున గానరాదు

నృగమహారాజు కథ తరువాత ద్విపద భాగమున సుదీర్ఘమగు వసంత ఋతువర్ణన గలదు. ఈ వసంతాగమనవర్ణన పోతన భాగవతమున లేదు బల రాముడు వ్రేపల్లె కేగుటకు పూర్వరంగముగ నీ వసంతఋతువర్ణన యిందు గావింపబడి యుండును.

"శ్రీమద్భాగవతములో రసవంతమైన భాగము దశమస్కంధము దీనిని సంగ్రహించి తెనుగుజేయుటలో మడికి సింగనార్యుడు కవితాశక్తితోపాటు విషయములను బెంచియో, క్లుప్తపఱచియో ఘట్టములను ప్రతిపాదించుటలో దన విమర్శనాజ్ఞానమును జూపియున్నాడు "[25].

ఈతడాంధ్ర కవులలో నన్నయ తిక్కనాదులను మాత్రమే స్తుతించి నాడు ఈతని కవిత్వములో సంస్కృత సమాసములు జొచ్చుకుపోక జాతీయ ములగు తెలుగు పలుకుబళ్ళతో మధుర మధురముగానున్నది

కవి గ్రంథమున ఋతువర్ణన, యుద్ధవర్ణన, సౌధవర్ణన, పెక్కు స్థలములందు గావించినాడు. యుద్ధవర్ణన మనేకచోటులందు గావించినను విసుగు జనింపజేయక వైవిధ్యము నాపాదించి నాడు. ఈతడొక యెడ యుద్ధక్షేత్రమును కొలనుగ వర్ణించి, తిక్కనవలె బీభత్సమగు నద్దానిని రమణీయముగ వర్ణించెను.[26]

---

25 ద్విపద భాగవతము పీఠిక పుట 143.

26 కల్యాణ కాండ పుట 144

బాణాసురుని వేయి బాహువులు శ్రీకృష్ణునిచే ఖండింపబడినవి అపుడు బాణుడు పూచిన మోదుగవలెనున్నాడని కవి యుపమించెను

"బలితనూభవు వేయి బాహంవుల్ త్రుంచి
యేది నెత్తురు గ్రమ్మ నేపార మేను
పూచిన మోదుగు బొలుపార నతడు
హరి పాదాంబుజములకందంద మ్రొక్కి"

వర్ణనంను గావించినపుడీత డతిస్వాభావికముగ నొనర్చి మన కన్నులయెదుట చిత్రము నిల్చినట్లుగ వర్ణించును అందందు కవిగావించిన శ్రీకృష్ణుని వర్ణన, సాయంకాల, ఆమనివర్ణన లిందుల కుదాహరణములు గగలవు

''పరిమార్చినతడు'', ''రుక్మిణిబ్బంగి''వంటి సంధులచ్చటచ్చట గలవు అప్పకవియంతటి వాడీతనిని లాక్షణిక కవిగా పరిగణించుటవలన, వీనిని మహాకవి ప్రయోగములుగ నెంచవచ్చును.

రుక్మిణీకల్యాణ సందర్భమున సుముహూర్త మాసన్నమైనట్లు "ఆయెడ ఘడియార మరనిసి దైవజ్ఞులాయితమాయితమని ప్రీతి బలుక" ఘడియారమును జూచి తెలిసికొనినట్లు వ్రాసినాడు కావున సింగన కాలమునాటికి ఘడియారము లుండినట్లు తెలియుచున్నది. ఈ కాలమున ఘడియారముండినట్లు ఇన్ని దినములు మనకు క్రీడాభిరామమువలననే తెలియుచుండెను.

## బా ల భా గ వ త ము[27]

కృతికర్త దోనేరు కోనేరనాథకవి. ఈకవి దీనిని చంద్రగిరి తిరుమల

---

27 ఇది అవతారికా రహితముగ (నాల్గాశ్వాసములు మాత్రము) ముద్రితమైనవి. దీని యవతారికయందు ఆరవీటిరాజుల వంశచరిత్ర యొసగబడినది. ఇది ఆరవీటి రాజవంశ చరిత్ర నెరుగనగు నాధారములలో ముఖ్యమయినదని శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు దీనినుద్ధరించి క్రీశ 1928 జూన్ భారతిలో ప్రకటించిరి.

రాజు ప్రేరణచే నతని తమ్ముడయిన తిమ్మరాజుపేర రచియించినాడు. ఈతడే బాలభాగవతమును పద్యకావ్యముగ రచించి చినతిమ్మరాజు తండ్రియగు తిమ్మ రాజుకు కృతి యొసగినాడు కవి యీ గ్రంథమునకు బాలభాగవతమని నామ మిడినను నిందలి రచన ప్రౌఢమై తనరారుచు, సుందరమై పాఠకుల కింపు కూర్చున దనుటకు తిమ్మరాజు తనపేర రచించిన పద్యబాలభాగవతమునె మరల చినతిమ్మరాజుపేర ద్విపదకావ్యముగ మరల రచింపమనుటయే తార్కాణము.

ఇందీతడు షష్ఠ్యంతముల నుపయుక్తము గావించెను.

బాలభాగవత సంస్కృత భాగవతమునకు పోతన భాగవతమునకు కథలో నంతగా భేదము లేదు. తత్త్వోపదేశమునందే అవి వేరుపడుచున్నవి. వేదాంత విషయములను ప్రతిపాదించుచోట్ల కోనేరునాథకవి విశిష్టాద్వైత సంప్రదాయాలనే విశేషముగా ప్రతిపాదించినాడు ధ్రువోపాఖ్యానము, నృసింహావతార ఘట్టము, పురంజనోపాఖ్యానము దక్షాధ్వరధ్వంసము వామనావతారఘట్టము మున్నగుస్థలములందాతని విశిష్టాద్వైతతత్త్వము గోచరించును వాసుదేవ మయ బ్రహ్మము, శేషశేషితత్త్వము, మున్నగు ప్రయోగము విశిష్టాద్వైతతత్త్వ ప్రతిపాదకములే

ఇది పండితులు మెచ్చు కావ్యము పెక్కుచోట్ల చక్కని శబ్ద చిత్రములను చొక్కపు నర్థవైభవములను చూపినాడు. శబ్దరత్నాకరమున దీని యందుండి ప్రయోగములు గైకొనబడినవన్నచో దీని ప్రామాణికత్వమును వేరుగా నిరూపింప నవసరము లేదు. ఈతడు వైష్ణవ పురాణము ననుసరించి భాగవతమును చెప్పినట్లుగ చెప్పికొనినాడు.[28]

ఈతని రచన పెక్కు స్థలములందు పోతన రచనానుకరణముగనే యున్నది. పోతనగారి "ఇంతింతై "[29] యను పద్యమునకు,

"ఇంతయై యింతయై యినమండలమున
కంతయై యంతయై యట చంద్రు దాటు

---

28 పీఠిక పుట 31.

29 అష్టమ స్కందము పుట 622.

యింతింత యనరాక యెల్లదిక్కులును
వింతగా గప్పెడు విరివి గైకొనుచు
చిటుక వేసిన యంత సేపులో శిరము
పటుపద్మజాంకంబుపై చిప్పనాక
పెరిగి రెండడుగుల పృథివియు మిన్ను
సరభసంబుగ గప్పిన సంప్రీతి నిలిచె"

ఇదేవిధముగ గజేంద్ర మోక్ష ఘట్టమునను, ప్రహ్లాద చరిత్రమున, శ్రీకృష్ణ నిర్యాణ ఘట్టమునను దశమస్కంధమునను, అనేక ద్విపదల రచనా సందర్భమున పోతనగారి రచనా విధానమునే అనుకరించెను

ఈతడు ప్రళయకాల సముద్ర ప్రవాహవర్ణన ఘట్టమున శ్లేషను రచించెను.[30]

"ఘనతర సంఘాత సంఘట్ట
కనదుగ్ర ఘుమాఘుమాకారవర్జితము
. . .
ఐ యుండి నారాయణాశ్రయత్వమున
బాయక సజ్జన భావంబు పోలె
ద్యక్త గోత్రాను కులాచారమహిమ
సక్తిమైదుష్ట ప్రచారంబు పోలె
సరయాశుగాపాత చలిత కీలాల
భరమయి కదన భూభాగంబు పోలె
లోక త్రయాక్రాంతి లోలుపంబగుచు
వైకంఠు కుబ్జ తావ్యవహృతి పోలె
వరహిత కరయాన పాత్రోప్రయోగ
విరహితంబై లోభి విత్తంబు పోలె
భ్రమ భంగ కల్పిత ప్రాచుర్య భణన

30 బాల భాగవతము పుట 132–134

సమయమై యద్వైత శాస్త్రంబ పోలె
రాజిల్లు కల్యాంబురాశి పూరంబు"

కొన్నియెడల అనుప్రాసన నందముగా వివరించెను

"సామంబు లవిహార జన తమోమిహార
ధామంబు లపవర్గ దాన ప్రభావ
సీమంబు లన ప్రకాశించు
నామంబు లతి పాషనములు సత్యముగ"[31]

గోపికాస్త్రీలు జలక్రీడ లాడుచు ఒకరినొకరు పరిహసము చేసికొనుట, చంద్రోదయవర్ణనలను చక్కని తేట తేనుగుమాటలతో కూర్చినాడు

ఈ కవి క్రీ,శ 1547 ప్రాంతములవాడు తాని గ్రంథమును శాలి వాహన శకము 1469 నాటికి వ్రాసి ముగించి ఆరవీటి బుక్కరాజునకు మునిమనుమడు, అళియ రామరాజునకు జ్ఞాతియు, సమకాలికుడు నయిన అవుకు చినతిమ్మరాజు కంకితమొసగినాడు. ఈ కవి తండ్రి దోసూరి నాగయ్యామంత్రి అశ్వలాయన శాఖీయుడు

ఈ యవతారికలో నీ వంశపు రాజుల కాలమున జరిగిన యుద్ధముల ప్రస్తావన కూడ గలదు

ఇందు నవమ స్కంధ రాజవంశ చరిత్రకనుబంధముగా పరీక్షితునుండి చినతిమ్మ భూపాలుని వరకు గలవంశ వర్ణన గ్రంథాంతమున గలదు.

పరీక్షిత్తునకు, జనమేజయుడు, అతనికి వైశంపాయయనుడు, ఆతనికి శతానీకుడు అతనికి, అశ్వమేధదత్తుడు, క్షేమేంద్రుడు, క్షేమేంద్రునకు సోమేంద్రుడు, ఉత్తుంగ భుజుడు, అతనికి నందుడును జనించిరి. పరీక్షిత్తునుండి నందుని వరకు 1050 సంవత్సరములని విష్ణుపురాణము చెప్పుచున్నది

నందునకునరమేధదత్తుడు, శుభచిత్తుడు, శుభచిత్తునకు, చతురాత్మజుడు

31 బాల భాగవతము పుట 47.

చతురాత్మజునకు కుంతియందు, దేవధీరుడు, అవహమల్లుడును సత్యవ్రత యందు త్రిభువనమల్లుడు, మలిదేవియందు చళుక్య భూపాలుడు జనించిరి.

ఈ చళుక్యుని నుండి, యీ వంశము వారికి చన తిమ్మని వరకు చాళుక్యులని పేరుగలిగినది. చళుక్యునికి, సోమాంబయందు జగదేకమల్లుడు జనించెను ఈతడు సంగీత చూడామణియను లక్షణ గ్రంధమును రచించెను. జగదేక మల్లునికి గౌరాంబయందు భువనైక మల్లుడు, ఉదయ భూనాయకుడు, కోమలదేవి యందు విష్ణువర్ధనుడు, రత్నాణి యందు విమలాదిత్యుడు భానుమతియందు రాజరాజనరేంద్రుడు, రాజరాజ నరేంద్రునికి సారంగధరుడు— ఈతని పినతల్లి చిత్రాంగి— ఈతడే చౌరంగి యను సిద్ధుడయ్యెను. అతనికి చాళుక్య భీముడు అతనికి ఉపేంద్ర గజపతి, అతనికి ఔహత్తమల్లుడు, విశ్వేశ్వరుడును జనించిరి. ఇందు విశ్వేశ్వరుడు అలంకారసారంబును, సంగీత కౌస్తుభము నౌహత్త మల్లుడును రచించిరి జౌహత్త మల్లునికి గొంతీదేవియందు రాయపితామహుడు జన్మించెను రాయపితామహునికి సుకుమార జనపతి. ఆతనికి సోమేశనృపతి ఆతనికి, కృష్ణకందాళరాయడు, జనించిరి. కృష్ణకందాళ రాయనికి, దేశింగ రాయడు, ఆతనికి కల్యాణ బిజ్జలుడు, బిజ్జునకు, హేమల్లరాయడు, చౌహత్త మల్లుడు, భువనైకమల్లుడు, రాయవిభాళుడు నను నల్గురు పుత్రులు గల్గిరి ఇందు హేమల్లరాయనికి, వీహెమ్మడి భూవిభుడు అతనికి, హేమభూపాలుడు అతనికి, పెద్దహెమ్మడి, చిన్నహెమ్మడులు జనించిరి చిన్నహెమ్మడి సింగల దేవియందు రాఘవేంద్రుని, చండాంబయందు తార పిన్నయ్యను గాంచెను.

తాత పిన్నమనుండి గల వంశవృక్షము నవతారికలో నొసగినాడు

కొందరీ కవిని అయిదవ తరగతి కవిగా పరిగణించిరి.[32] అది సరియైన విమర్శగాదు ద్విపదకావ్యకర్తలలో నీతనికి ప్రముఖస్థానము గలదు.

---

32 సమగ్ర ఆంధ్ర సాహిత్యం, సంపుటము— 9, పుట 31

## భాగవతము[33]

అముద్రితము.

కర్త చేకుమళ్ల రంగశాయి. ఈతడు దీనిని మాత్రమే గాక, వీరరాఘవశతకము, కృష్ణదండకము, జానకీ పరిణయ యక్షగానము, వాణివిలాస వనమాలిక కృతులను గూడ రచించెను. ఈతడు భాగవతము ప్రస్తావనలో "విద్యానిధి పుష్పగిరి తిమ్మ సుకృతి యీకృతికి సాహాయ్య పరుడుగా స్కంధముల్ పదియును రెండు" అనియును, సనయుడు మత్సహ శ్రోతయునైన గిరిధైర్యనిథి, పుష్పగిరి తిమ్మనార్యవరునిసుమిత్రు విశ్వామిత్ర గోత్రు, చారుకవిత్వ సుజ్ఞాన రహస్య సారఙు, దిమ్మన సత్కృవి బిలిచి"— అని, అతడు తనకీ గ్రంథమును రచించుటలో సహాయపడెనని కృత్యవతరణిక లోను, స్కంధాంతములందును చెప్పెను దీనివలన నీతని కాలమును నిర్ణ యింప వీలగుచున్నది పుష్పగిరితిమ్మన క్రీ శ 18 వ శతాబ్దపుటుత్తర భాగమున నుండెనని కవుల చరిత్రయందు కందుకూరి వీరేశలింగముగారు నిర్ణయించిరి కావున రంగశాయి కూడ అదే సమయమున నుండెనని దెలియు చున్నది. ఈతని తాత చేకుమళ్ల తిప్పామాత్యుడు ఈతడు శ్రీవత్సగోత్రుడు. ధర్మపురి నృసింహస్వామి భక్తుడు, రామభద్రుగురుని శిష్యుడు. రంగశాయి, మాతాపితలు, తిమ్మమ, కప్పరామాత్యులు కృతి తిరుపతి వేంకటేశ్వరస్వామి కంకితము గావింపబడినది.

ఈతడు పండ్రెండు స్కంధములను పూర్తిగ రచించినట్లు చెప్పికొనెను గాని, నేడుపలబ్ధమగు గ్రంథమున నాల్గవ స్కంధమున పృథుచక్రవర్తి చరిత్రము వరకు మాత్రమే గలదు భాగవతమును ద్విపదగా రచింపుటకీ క్రింది కారణమును చెప్పెను.

"చదివిన పండిత జనులకునైన
మొదటనే తెలియ దింపుగ సంస్కృతంబు

---

33 శ్రీ వెంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ. ఆర్ 765, కాగితప్రతి,

తెలుగు సంస్కృతమును తెలిసిన గాని
— — పద్యకావ్యమర్థంబు
ద్విపద — —
కావున లోకోపకారమాయత్న" మిది యని చెప్పికొనెను

ఈ గ్రంథము నీతడు పోతన రచనానుసారముగ రచించెను.

ఈ రెండు యుదాహరణముల వలన నీతడు పోతన రచనా విధానము నెట్లనుకరించెనో స్పష్టముగా దెలియును

(1) హరికథలట

"అఘశోషణములు జిహ్వాప భూషణములు
సుకవి తోషణములు— —
—నుపనిషత్తులు చాటు పలుకు"

(2) శ్రీకృష్ణ నిర్యాణ సందర్భమున ధర్మజుడు శ్రీకృష్ణుని గూర్చి యర్జునునీ విధముగ ప్రశ్నించును

"బ్రహ్మణ్యు డాత్మ శరణ్యు డీశ్వరుడు
బ్రహ్మాది దేవతా ప్రార్థనియుండు
సకల జగద్భద్ర సంస్థానకర్త
వికసిత ధవళారవిందలోచనుడు
మహా—(సుధ) ర్మా (మ)ధ్య పీఠి
రహి బొందియున్నాడె రాముని గూడి
ఆ రామకృష్ణుల యాత్మ నెఱింగి
సారామల వినీతి సలుపుకా
ముని న్నెల్ల ప్రొద్దు మన్నించి
గారాము సేతురు గద బంధులెల్ల"

ఇదే సందర్భమున పోతన, "అన్నా ఫల్గున, భక్తవత్సలుడు, గోవిం

దు డా పన్నానీక శరణ్యుడీశుడు జగదభ్రాదాను సంధాయి" యిత్యాదిగా శ్రీకృష్ణునిగూర్చి ధర్మజుడడిగినట్లు వ్రాసెను

## భా గ వ త ము - దశమ స్కంధము

అముద్రితము

కర్త రత్నాకరము గోపాలకవి,[35] ఇంతీతడు తన్నుగూర్చి 'రత్నాకరాన్వయరాశి పరిక్షీర, రత్నాకర సుధాకర భాసితుండు, రాజిల్లుకృష్ణమరాజ నందనుడు, రాజిత సత్కళా విపక్షుడు, గోపాల సత్కవి కుంజరుండనంగ" నని చెప్పికొనెను పూర్వభాగమును మాత్రమే యీతడు ద్విపదీకరించెను.

తన రచన యందనేక దోషము లున్నవనియును, వాసిని మన్నింపవలసి నదనియును గ్రంథాంతమున దెల్పెను

వ్రాంతప్పులు శబ్దములు...
చాలంగ గలవు శబ్ద సంగతు లెరుగ
గేలిం—బెట్టక—తిట్టక
పోలంగా దిద్దరయ్య బుధజనులారా"

ఇట ఛందోభంగమైనది

ఈ ప్రతిని "నారాయణం మాదెన్న కొమారుడు బాల యారంణ" క్రీశ 9-7-1669 నాటికి వ్రాసి పూర్తి చేసినట్లు గలదు.

గ్రంథపాతము హెచ్చుగాగలదు మధ్య మధ్య అనేక ద్విపద పంక్తులు లోపించినవి.

రుక్మిణీ వివాహ ప్రస్తావనతో గ్రంథమారంభించి రుక్మిణీ కల్యాణములతో సమాప్తము గావించెను. గ్రంథమును కృష్ణార్పితముగా రచించెను. గ్రంథాంత

---

34 శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ — ఆర్. 784, తాళపత్రము

35 ఈతడే ద్విపద సౌగంధికా ప్రసవాపహరణము కర్త.

మున గ్రంథమును కృష్ణునిపేర వెలయించు సందర్భమున ముక్తపదగ్రస్తము నుపయుక్త మొనర్చెను,

"వారణేంద్రావన—వనధిసంచార
చారమస్థాన రాజన్మండరాగ
రాగ విదార తనూజమిత్ర
భోగకారణ రణ భూమిప్రతాప
తాపసేంద్రాధార ధారాసహస్ర
దీపిత సాధనాంధీ భూత దైత్య
బృంద బృందావనర్థిక మహానంద
నంద కందర ధరానంద సౌజన్య
జన్య భూదళిత దౌర్జన్య రాజన్య
జన్యామనాన్య శాంత నైపుణ్య
పుణ్య గ్రహ మహాముఖ్యసంకాశ"

లక్షణ విరుద్ధ ప్రయోగములు గానరావు. ఈ కవికూడ పెక్కు స్థలము లందు పోతన రచన ననుకరించెను. శ్రీకృష్ణుని గానక గోపికలు.

"నల్లనివాడు మా నలిన లోచనుడు
మల్లియలార మీమాటునలేడె
మదన గోపాలుడు మమ్మేలువాడు
కదళికా తరులార కానరె మీరు
పూతన నవలీల బొరిగొన్నవాడు
చూతవృక్షములారా చూడరే మీరు
కలికి శ్రీకృష్ణుని కంతు సన్నిభుని
తిలక భూజములార తెలియరె మీరు"

అని వెదకిరి. ఈ పైద్విపదలు పోతనగారి 'నల్లనివాడు, పద్మ నయనంబులవాడు' అను పద్యమును పోలియున్నది.

ఇందటనట ఏకపద ద్విపదలు గలవు. కవి క్రీ శ, 1690 ప్రాంతము వాడు.

## రుక్మిణీ కళ్యాణము[37]

అముద్రితము

అసమగ్రము, తుది మొదళ్లు లేవు. కర్త యెవ్వరో దెలియదు పెక్కు చోట్ల గ్రంథపాతము గలదు "ఇది మడికి సింగన రచించిన భాగవతము లోని భాగము కావచ్చునని" శ్రీ నిడదవోలు వెంకటరావుగారు అనిరి గాని అతని గ్రంథమున రుక్మిణీ కల్యాణ ఘట్టము మిక్కిలి సంక్షిప్తముగ నున్నది. కాన యిది అందలిది కాజాలదు. చేకుమళ్ల రంగశాయి తాను భాగవతమును పూర్తిగ రచించినట్లు చెప్పికొనెను. మరియు అతని రచన చాలా సందర్భము లందు పోతన రచనానుకరణముగ సాగినది, ఈయుపలబ్ధమగు రుక్మిణీ కల్యాణ భాగముకూడ పోతన రచనానుకరణముగనే యున్నది కావున ఒక వేళ యిది చేకుమళ్ల రంగశాయి కృతమగు భాగములోనిదైనచో కావచ్చును.

రుక్మిణీ దేవి శ్రీకృష్ణునిగూర్చి విరహము చెందుచుండ ఘట్టమునుండి గ్రంథము లభ్యమగుచున్నది. చెలులు రుక్మిణిని అనునయింపు చున్నారు

"మొగమెత్తి చూడవే మోహనవాణి
చేడియముద్దురా చిలుక తోమారు
లాడి మముగూడి యాడవేతల్లి

— —

ముకురంబు జూడవె ముకుర బింబాస్య
పికముల బిలువవె పికవాణి నీవు
జడియకు నింక నో సాంకవగంధి
సీ...గ వెరచును శుకములయ్యేదుట"

37. శ్రీ వెంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాసంస్థ ఆర్.నెం.200— కాగిత ప్రతి.

రుక్మిణీదేవిపంపిన భూసురుడు కృష్ణునున కామె సౌందర్యమును వర్ణించి నపుడు, పోతన రచనానుకరణము గానరాదు ఈ కవి గావించిన వర్ణన యిది

"ఈరా బింబంబు లీడెన్ను వెల్గు
శ్రీరామదామ యిచ్చెలువ మోమునకు
సరసిజ పత్రముల్ సరిపోలు వెల్లు
హరిహరి జగతిలో నతివ కన్నులకు
భూధరంబునైన బురుణించు వెల్లు
మాధవ మాధవ మగువ గుబ్బలకు

ఈ కవి గావించిన పురవర్ణన, సౌధవర్ణన మొదలగునవి విస్తృతములై రమణీయములై తనరారుచున్నవి. రుక్మిణీదేవి సౌందర్యమును పలుచోట్ల వర్ణించెను ద్వారకానగరవర్ణన పేర్కొనదగినది

నానాదేశ గతులైన భటులు శ్రీకృష్ణుని కొల్చిరి. అందుకర్ణాట దేశస్థులు,

"బారో యాలకమ్మ బంధను కృష్ణ
తారో యాహరిగె సాధన మాడబేకు"

అనియు, ద్రావిడ దేశస్థులు

"అయిత్త మాగివందిరి మున్నె పీన్నె
యాయుధం గొండు సీయంగవా యనుచు"

కొల్చిరి. ఇటులే యింకను వివిధ దేశస్థులు తమతమ భాషలలో కొల్చి నట్లు వ్రాయుటచే. నీతని అన్యభాషా జ్ఞానము తెలియుచున్నది.

'కనకతప్పెటలు', 'హెగ్గాళలు' వంటి ఒండు రెండు ప్రయోగములు తప్ప కవిత్వము నిర్దుష్టముగా నున్నది పోతనను అనుకరింప అనేక స్థలము లందు ప్రయత్నించినాడు, కాని, సఫలీ కృతుడు కాలేక పోయినాడు.

'పిలువక వచ్చిన పేరంటమునకు' వంటి జాతీయాదుల నటనట ప్రయు క్తము గావించి, రచనా రామణీయకతను ద్విగుణీకృతము గావించినాడు

## అష్టమహిషీ కల్యాణము

కర్త తాళ్ళపాక చిన్నన్న ఇదియాతని ప్రథమ కృతి.[38] కావుననే ఇందీతడు ద్విపద యొక్క లక్షణ ప్రాశస్త్యములను విపులముగను, నిష్కృష్ట ముగను నిర్వచించెను. లక్షణ గ్రంథకర్తలు కూడ నీతనివలె నిర్వచింప లేదనినచో నతిశయోక్తి గాదేమొ, ఈతడు తన కృతుల నన్నిటిని అలమేలు మంగాంబికకే అంకితము గావించెను. "జలజాతవాసిని చనుబాల పుష్టిచే కవితా రచనను నేర్చె" నట క్రీ శ. 1550 ప్రాంతమువాడు

తాళ్ళపాకవారు సాహిత్య క్షేత్రమున నొక విశిష్ట స్థానమునాక్రమించిరి. వీర వంశమున నందరు కృతికర్తలే. వీరి వంశమూల పురుషుడు ఆధ్యాత్మ, శృంగార సంకీర్తనములను, శృంగార మంజరిని రచించి పదకవితా పితామహు డని బిరుదుగాంచిన అన్నమాచార్యుడు. కృతి, కీర్తన, అనినేడు పిలువబడు చున్న సంగీతరచనకు అన్నమాచార్యులకాలమునాడు పదమనియు సంకీర్తన మనియు వాడుక యుండినట్లు గలదు అన్నమాచార్యుల మనుమడే తాళ్ళపాక తిరువేంగళ నాథుడు ఈతడే చిన్నన్నయని ప్రసిద్ధి గన్నవాడు ఈచిన్నన్న ద్విపద కవిత్వమునకు పేరెన్నిక గన్నవాడు [39]

శ్రీకందుకూరి వీరేశలింగము పంతులుగారు కవుల చరిత్రయందు తాళ్ళ పాక చిన్నన్న యనునాతడష్టమహిషీ కల్యాణమును, తాళ్ళపాక తిరువేం గళ నాథుడు పరమయోగి విలాసమును రచించిరని వ్రాసి, వారిని వేర్వేరు కవులనుగా గ్రహించిరి వారికప్పటికష్టమహిషీ కల్యాణము లభింపక పోవుట వల ననే వారట్లు పొరపడిరి ద్విపద హరివంశము, ఆంధ్రవేదాంతము, చక్రవాళ మంజరి వేంకటేశోదాహరణము మున్నగువానిని దనించిన పెద తిరుమలయ్య యీతని తండ్రి ఈతని ద్విపద హరివంశము నేడు లభ్యము కాలేదు.

---

38. ఉషాకల్యాణము, పరమయోగి విలాసము అన్నమాచార్య చరిత్రము, ఇతని యితర గ్రంథములు.

39 "చిన్నన్న ద్విపద కెరగు" నని యీతని గూర్చియె తెనాలి రామకృష్ణుడు చెప్పెను.

ఈతడు కావ్యంబు చెప్పి శ్రీవేంకటేశు మెప్పించి మకరకుండలములను గొంటిననియు, దినములో వేయి ద్విపద లింపొంద వినుత వర్ణనలతో విరచించు వాడనియు చెప్పికొనెను ఇంతేగాక "కవిశిరఃకంపయోగ్య ప్రతి ద్విపద నవబిరుదాంకుండ" నని చెప్పికొనెను ఇందీతడు కుకవి నిందను గావించెను.

శ్రీకృష్ణావతార ఘట్టమునుండి ప్రారంభింపబడి అతడష్ట మహిషులను వివాహమాడు పర్యంతముగల కథ యిందువర్ణితమైనది. మొదటి మూడాశ్వాసములందును శ్రీకృష్ణుని జననము, అతని బాల క్రీడలును వర్ణింపబడినవి.

విషపావకావృత విపులాంతరిక్ష
కషణ ఫణాళి రంగస్థలిగాగ
జండపద్ధతి భోగసర్వంబు చెదర
జండ మరీచి చంచత్కుండలములు
మండిత నిజగండమండలీ యుగళి
దాండవంబాడంగ దాండవంబాడి (ద్వి అ పు 68)

వ్రతమాచరించునపుడు సచేలస్నానమే విహితము. వ్రతనిష్ఠలై యున్న సందర్భమున నట్లు చేసిననే వ్రతఫలము గల్గును గోపికాస్త్రీలు జలక్రీడా సమాసక్తులయిన సందర్భమున చేలలను గట్టుపైనిడి వివస్త్రలై, యున్నందు ననే శ్రీ కృష్ణుడు వారి పుట్టముల నపహరించినాడు వారు 'శ్రీకృష్ణా' యని కరద్వయమును ముకుళించి యాతనికినమస్కరించుటవలన వారుగావించినదోషము వలని పాపము దొలగి పోయినది. అపుడు శ్రీకృష్ణుడు వారి వస్త్రములను వారి కిచ్చివేసెను శ్రీకృష్ణుడు వారివస్త్రముల నపహరించుట కాముకత్వమునగాదు. వారు చేసిన దోషమును మన్నించి కరుణాపూరితుడై వారి పాపమును గాచు టకే. ఇది యిప్పట్టున శ్రీవైష్ణవులు చేయు విమర్శ, దానినే చిన్నన్న.

"చేలలు సడలించి చిరతరపుణ్య
శీలలు జలకేళి సేయంగ దగునె
ప్రణతులొనర్పుడు పద్మాకళత్ర
మణికి యాదవ శిరోమణికి మీకిట్టి

యనుపమ దోషంబు లడగుదమంబు
నినుగాంచి తొలగి పోయినమాకి్క" (ద్వి.ఆ —పు 72)

రుక్మిణి శ్రీకృష్ణునకు, సందేశమును బంపినపుడు, భూసురుడు, రుక్మిణి దేవి శిశుపాలునకు దగదని చెప్పుచు.

"కామధేనువు పాటు షండై నయట్టి
సోమయాజికి గాక శునకార్హమగునె
నిగమ గోచర రుక్మిణీ దేవి నీకె
తగుగాని యెంతైన దగదు చైద్యునకు"

అని శ్రీకృష్ణుని సోమయాజితోడను,శిశుపాలుని శునకముతోను, రుక్మిణిని కామధేను స్తన్యముతోడను ఉపమించెను పోతన యీసందర్భమున "సింహము పాలి సొమ్ము గోమాయువు గోరు చందమున మత్తుడు చైద్యుడు...వడిదాగాని పోయెద నంచునున్నవాడ"[40]ని రచించెను

రుక్మిణీదేవి వివాహసందర్భమున కవి ఆంధ్ర సాంప్రదాయమును వివరించినాడు వివాహోత్పూర్వము వధూవరల నడుమ తెరపట్టుట, శుభముహూర్తమాసన్నము కాగా వధూవరులొకరి శిరముపై నొకరు "సగుడ జీరము నుంచుట" మంగళసూత్ర ధారణ, తలంబ్రాలు పోసికొనుట, లాజ హోమము మున్నగు విశేషము లన్నియు వర్ణితములైనవి, పిమ్మట కృష్ణుడు, జాంబవతి, సత్యభామ. కాళింది, మిత్రవింద, నాగ్నదితి (సత్యకీర్తి) భద్ర, లక్షణలను వివాహమాడిన యుదంతములను వివరించెను

ఈ గ్రంధమున కీతడష్టమహిషీ కల్యాణమని పేరిడినను అయిదాశ్వాసముల గ్రంథములో మూడాశ్వాసములందు శ్రీకృష్ణ జనన, బాల్య క్రీడలనే వర్ణించినాడు తుది రెండాశ్వాసములందే కృష్ణుడష్ట మహిషులను వివాహమాడిన కధ గలదు. ఇందీతడు,

"ఆ రీతి నుడువక యలఘు శబ్దార్థ
సౌరసరీతి రసప్రభావముగ

40 దశ. పూ భా.ప 1074.

గులికి కస్తురి పిఱె గోసిన కరణి
దెలికప్పురపు గ్రోవి దెఱచిన సరణి
విరివాది పొట్లంబు విడిచిన మాడ్కి
బరిమళించుచు గవుల్ బళి బళి యనగ
గవిత చెప్పిన సులక్షణుని గవీంద్రు
దవునందురే నేర్పినట్లు జెప్పెదని"

ప్రతిన గావించి, యందుసర్వదాకృతకృత్యుడయ్యెను ఇందెనిమిది కల్యాణములను వర్ణించినను అన్నిటిని ఒకేమాదిరి వర్ణింపక వైవిధ్యమును గల్పించి పాఠకులకు విసువు జనింపకుండునటులు రచించెను. ఇది యీతని ప్రథమకృతి యగుట వలననో మరి యే కారణముననో దీనియందీతడు గోమూత్రికా బంధము, భ్రమకము వంటి శబ్దాలంకారములను వాడెను.

శ్రీకృష్ణుడు రుక్మిణీదేవిని గొనిపోవుచుండగా వివిధదేశములవారు తమ తమ భాషలయందు శ్రీకృష్ణుని సంస్తుతి చేసిరి.

"బారైయలో తమ్మ బందను కృష్ణ
తారాయాహరిగె సాధన మాడ బేకు
అనుచు గర్ణాట దేశాగతానేక
ఘనవీర భటులు చెంగటజేరి కొలువ
అయిత్త మాఘ వందలి మున్ని బన్న
ఆయుధం గొండు నియంగెవాయనుచు
వివిధ వాక్యములచే వేర్వేర బిలిచి
ద్రవిడ సద్భటులు చెంతజేరి కొలువ
అసో ఆడె ఆగె హరి జగన్నాథ
దాసు హే బలు ఖండ దారురే యటంచు
నంతంత దాటి సాహసము చూపుచును
వింతగా గాళింగ వీరు లేతేర
వెండియు దేశాధి విభులు శ్రీవిభుని
దండిమై నిట్టు నుద్దండత గొలువ" (పు. 191-192)

వివాహ సందర్భము లందలి వర్ణనలలో వైవిధ్యము నెట్లు చూపెనో అటులేకవి శ్రీకృష్ణుడొనర్చిన యనేక యుద్ధముల నాయా సందర్భములకు దగినట్లు భిన్న భిన్న విధములుగ వర్ణించి వీర రసము చిప్పిలునట్లుగ జేసెను.

సంధ్యావర్ణనము గావించుచు నొక సందర్భమున సీతడు గావించిన నక్షత్రవర్ణన మనోహరముగ నున్నది

"కడిది మున్నమృతంబు గరుడుండు గొనుచు
గదువడి జనగ దత్కలశంబు తొలకి
చెదరి యాకసమున జింది చూపట్టు
తుదలేని యమృతంపు తుంపరులనగ
వికసించు చేమంతి విరుల చందమున
బ్రకటంబులై కనుపట్టె దారకలు" (పుట 219)

ఈ పొత్తమునందు కంటె సీతని శైలి ఉషాకల్యాణ, పరమయోగి విలాసములందు నిగ్గులు దేరి. ప్రౌఢమై యొప్పారు చున్నది

## ఉ షా క ల్యా ణ ము

కర్త తాళ్ళపాక తిరువేంగళ నాధుడు దీని సీతడు హరివంశ మార్గోక్తముగనే జెప్పినటు లవతారికయందు జెప్పెను బాణాసురుని పుత్రిక యగు ఉషాకన్య శ్రీకృష్ణుని మనుమడగు అనిరుద్ధుని పరిణయమగుటయే ఇందలి యితివృత్తము. ఈగ్రంథము సీతడిష్టదైవమగు నలుమేలు మంగ కంకితము గావించెను. అలమేలు మంగకు కావ్య సమర్పణజేయు సందర్భమున షష్ఠ్యంతము లను రచించెను.

"శ్రీహరి పత్ని కుర్వీ సపత్నికిని
మోహన గాత్రి కంభోజ నేత్రికిని
— —
నిర్మలాచారకు నిర్వికారకును

ధర్మ చేలకు నిత్య భవ్య శీలకును
— ...
జలజ కంధరకు సజ్జన ధురంధరకు
పొలుపొంద నంకితంబుగ —" 41

ఈతడు హరివంశ మార్గోక్తాను సారముగ రచించినట్లు చెప్పుకొనినను, నిది హరివంశమునకు యథాతథమగు ననువాదముగాక స్వేచ్ఛానువాదమని చెప్పవలసి యున్నది మూలము నెంతయో సంగ్రహపఱచినాడు

ఉషానిరుద్ధులను బాణాసురుడు కారాగార బద్ధులను గావించినపు డనిరుద్ధుడు తన్ను ముక్తిని గావింపవలసినదని కోటవతీ దేవిని వేడుచు ముప్పది మూడు శ్లోకములలో నామెను స్తుతించినట్లు సంస్కృత గ్రంథమున గలదు. కాని తెనుగు ద్విపద గ్రంథమున నీ ప్రార్థన లేనే లేదు

(2) పార్వతీ దేవి ఉషాకన్యకు స్వప్నమందు కనబడి దాంపత్యసుఖము గల్గునని వరము నొసగిన పిమ్మట, అనిరుద్ధుని గాంచక పూర్వమే, ఉష నిజ రమణుని ప్రాప్తి విషయమై చింతించుచు మిక్కిలి విరహతాపము నొందినట్లును, సఖీ జను లామెకు శైత్యోపచారాదులను గావించినటులును మూలగ్రంథమున గలదు కాని, గ్రంథమునందు దేమియు లేదు. ఇప్పట్టున రాజదేవి వైద్యుని రప్పించి ఉషాకన్య శరీర గ్లానిని పరీక్ష చేయించినటులు కూడ మూలమున గలదు

(3) ఉషాకన్యయొద్ద కేతెంచుటకు పూర్వము గూడ అనిరుద్ధునకు భార్యలుండినటులు చెప్పబడినది గాని, అటులు చెప్పుటచే ప్రస్తుత కథౌచిత్యము కొరవడునని భావించి కాబోలు, చిన్నన్నదానిని గూర్చిన ప్రస్తావన యిందు చేయలేదు

(4) అనిరుద్ధుడు స్వప్నమున సాక్షాత్కరించిన పిమ్మటనే, ఉష విరహతాపము నొందినట్లును, సఖీజనులు శిశిరోపచారాదులను గావించినట్లును

---

41. ఉషా కల్యాణము, పుట, 3

చిన్నన్న మార్పు గావించినాడు ఇట్టి రచనయే పొగసుగా నున్నది కాని వినుకలిచేతనే నాయికా నాయకులు విరహతాపము నొందినట్లు పూర్వ కావ్యము లందు వర్ణితమైనది

(5) విరహ తాపమును సహింపలేక ఉషాకన్య చంద్రోపాలంభనము గావించినది ఇది మూలగ్రంథమున గానరాదు తన కాలమునాటి సాహితీ మార్గముననుసరించి చిన్నన్న దీనిని తన గ్రంథమున చేర్చియుండును.

(6) ఉషానిరుద్ధుల సురతకేళీ వర్ణనము మూలమున విస్తారముగ గలదు కాని ఆంధ్ర గ్రంథముననిది విడిచి వేయబడినది

(7) పరపురుషుడొకడుషాంతఃపురమున ప్రవేశించినట్లు బాణ కింకరులు బాణున కెరిగింపగా, నాత డనిరుద్ధుని దండించుటకు నాయకులను బంపును వా రనిరుద్ధుని చంపుటకు ప్రయత్నించుచుండగా, ఉష మిక్కిలి దుఃఖితు రాలయ్యెను ఉషాకన్య సఖి చిత్రరేఖ నారదుని స్మరించును అపుడాతడా కాశమున నిల్చుండి, అనిరుద్ధనకెట్టి భయము నులేదని పల్కి ధైర్యమును గొల్పును ఈ సందర్భమున నారదాగమనము తెలుగు గ్రంథమున లేదు

(8) శ్రీకృష్ణుడు బాణాసురునిపైకి యుద్ధమునకు బోవ సంసిద్ధుడై సౌపర్ణుని మనమున స్మరించును. సౌపర్ణుడేతెంచి శ్రీకృష్ణునకు వలగొని నమస్కరింపగా కృష్ణుడాతని హస్తమును నివిరి భూషణాదులు ధరించి యాతనిపై యుద్ధమునకై శోణితపురమున కేగినటులు చిన్నన్న వ్రాసెను. ఈ సందర్భమున మూలమున గరుత్మంతుని సాహస వీర్యము అనేక విధములుగ శ్రీకృష్ణుడు స్తుతించి చివరకు భూత భవిష్యద్వర్తమాన కాలములందాతనితో తుల్యులగు వీరులెవ్వరును లేరని ఆతని నుత్సాహపరచినట్లు గలదు.

(9) శ్రీకృష్ణుడు గరుత్మంతుని ప్రశంసించిన పిమ్మట గరుత్మంతుడు మరల శ్రీకృష్ణుని అనేక శ్లోకములలోస్తుతించును. ఇవికూడ ఆంధ్ర గ్రంథమున విడిచి వేయబడినవి.

(10) శ్రీకృష్ణుడు బాణాసురుని చంపుటకు చక్రమును గైకొనగా

బాణాసురుని రక్షింపుట కేగమని పార్వతీదేవి శివుని పంపినట్లు మూలమున గలదు కాని పార్వతి ప్రేరణ తెనుగు కావ్యమున సూచింపబడలేదు

(11) యుద్ధ భూమియందు పడియున్న బాణాసురునితో శ్రీకృష్ణుడాతని ననుగ్రహించి పరమేశ్వరుని సన్నిధికేగి నృత్యము చేయమనుచు బాణాసురుడటులు చేయగా, పరమేశ్వరుడు ప్రసన్నుడై యాతనికి కరద్వయము ననుగ్రహించును. ఈ సందర్భమున బాణాసురుడు పరమేశ్వరుని సుదీర్ఘముగ స్తోత్రము చేసినట్లు సంస్కృత గ్రంధమున గలదు చిన్నన్న దీనిని విడిచి పుచ్చెను మూలమున బాణున కీశ్వరుడనేక వరముల నొసగినట్లు కూడనుండ చిన్నన్న కరద్వయమును మాత్రమను గ్రహించినట్లు వ్రాసెను

(12) ఉషా వివాహానంతరము శ్రీకృష్ణాదులు ద్వారకానగరమునకు పయనమై పోవుచుండగా, బాణాసురుడు తన ధేనువు నొకదానిని వరుణుడు స్వాధీనము గావించుకొని పాతాళ లోకమున నుంచికొనెననియును, దానిని గొని తన కీయమనియును వేడినాడు శ్రీకృష్ణుడందుల కంగీకరించి, గరుడునితో కూడ పాతాళ లోకమునకేగి, వరుణునితో యుద్ధమొనర్చి బాణుని గోవును ముక్తి గావించినాడు ఈ కథ నంతటిని చిన్నన్న వదలివేసెను ఈతడీ గ్రంధము నుషాకల్యాణముతోడనే ముగించినాడు

(13) శ్రీకృష్ణుడు ద్వారకానగరమున కేగినపుడు పౌరజనులాతనిని పూర్ణకుంభముతో నెదుర్కొని స్వాగత మొసగిన వర్ణన మూలమున విస్తారముగ గలదుగాని, తెనుగున లేదు

(14) సంస్కృతమున గ్రంధాంతమున మరల శ్రీకృష్ణస్తుత్యాదులు గావింపబడినవిగాని తెనుగున పునరావృతమగునని కాబోలు నది లేకయే కావ్యము సమాప్తము గావింపబడినది

ఒకటి రెండు తక్కువగా ప్రబంధ వర్ణనలన్నియు నిందుగలవు శైలి కూడ ఆ కాలపు శైలినే పుణికి పుచ్చుకొనినట్లున్నది హర పార్వతులు జలక్రీడ సల్పిన జలాకర వర్ణనము, యుద్ధభూమి, యుద్ధ వర్ణనలు మొదలగునవి సుందరముగ నున్నవి.

చిన్నన్న మార్పు గావించినాడు ఇట్టి రచనయే సొగసుగా నున్నది కాని వినుకలిచేతనే నాయికా నాయకులు విరహతాపము నొందినట్లు పూర్వ కావ్యము లందు వర్ణితమైనది

(5) విరహ తాపమును సహింపలేక ఉషాకన్య చంద్రోపాలంభనము గావించినది ఇది మూలగ్రంధమున గానరాదు తన కాలమునాటి సాహితీ మార్గమననుసరించి చిన్నన్న దీనిని తన గ్రంధమున చేర్చియుండును.

(6) ఉషానిరుద్ధుల సురతకేళీ వర్ణనము మూలమున విస్తారముగ గలదు కాని ఆంధ్ర గ్రంథమునదిది విడిచి వేయబడినది

(7) పరపురుషుడొకడుషాంతఃపురమున ప్రవేశించినట్లు బాణ కింకరులు బాణున కెరిగింపగా, నాత డనిరుద్ధుని దండించుటకు నాయకులను బంపును వా రనిరుద్ధుని చంపుటకు ప్రయత్నించుచుండగా, ఉష మిక్కిలి దుఃఖితు రాలయ్యెను ఉషాకన్య సఖి చిత్రరేఖ నారదుని స్మరించును అపుడాతడా కాశమున నిల్చుండి, అనిరుద్ధునకెట్టి భయమునులేదని పల్కి ధైర్యమును గొల్పును ఈ సందర్భమున నారదాగమనము తెలుగు గ్రంధమున లేదు

(8) శ్రీకృష్ణుడు బాణాసురునిపైకి యుద్ధమునకు బోవ సంసిద్ధుడై సౌపర్ణుని మనమున స్మరించును. సౌపర్ణుడేతెంచి శ్రీకృష్ణునకు వలగొని నమస్కరింపగా కృష్ణుడాతని హస్తమును నివిరి భూషణాదులు ధరించి యాతనిపై యుద్ధమునకై శోణితపురమున కేగినటులు చిన్నన్న వ్రాసెను. ఈ సందర్భమున మూలమున గరుత్మంతుని సాహస వీర్యము లనేక విధములుగ శ్రీకృష్ణుడు స్తుతించి చివరకు భూత భవిష్యద్వర్తమాన కాలములందాతనితో తుల్యులగు వీరులెవ్వరును లేరని ఆతని నుత్సాహపరచినట్లు గలదు.

(9) శ్రీకృష్ణుడు గరుత్మంతుని ప్రశంసించిన పిమ్మట గరుత్మంతుడు మరల శ్రీకృష్ణుని అనేక శ్లోకములలోస్తుతించును. ఇవికూడ ఆంధ్ర గ్రంథమున విడిచి వేయబడినవి.

(10) శ్రీకృష్ణుడు బాణాసురుని చంపుటకు చక్రమును గైకొనగా

సోమన తండ్రి ధర్మమంత్రి తల్లి లక్కమ సిద్ధ కొండన యీతని సోదరులు లేకేరావు ఒకయూరిపేర ఇది కలియుగమున స్వర్గము వంటిదని కవి యభిప్రాయము.

ఈతడు బలభద్రవిజయమను నీ కావ్యమును మాత్రమేగాక, బిల్హాద చరితమను పద్యకావ్యమును, శివరాత్రి మాహాత్మ్యమను వచన కావ్యమును, లక్షణదేవీ కల్యాణము, రంభా శుక్ర సంవాదమను యక్షగానములను రచించినట్లు చెప్పికొనెను

ఈ కావ్యవస్తువు భాగవతమునుండి గైకొనబడినది దుర్యోధనుని కుమార్తె లక్షణను స్వయంవర సమయమున శ్రీకృష్ణ జాంబవతీకన్యలకు జనించిన సాంబుడెత్తుకొనిపోగా, దుర్యోధనాదులు సాంబునితో పోరాడి యాతనిని తమ నగరికి గొనిపోయి బంధింతురు. ఈ విషయమును నారదునివలన నెఱిగి శ్రీకృష్ణ బలరాములిర్వురును యాదవ సైన్యమునంతటిని ప్రోగుచేసికొని కౌరవులపై యుద్ధమునకు బయలుదేరి మార్గమధ్యమున రైవత పర్వతమున విడియుదురు కృష్ణాదులు నిదురపోవుచుండగా, బలభద్రుడీపాటి స్వల్ప కార్యమునకు శ్రీకృష్ణుడును, యాదవ సైన్యమవసరము లేదని భావించి వారికి తెలియకుండగా తానొక్కడే కొంతసైన్యముతో గూడ నేగి కౌరవులతో పోరాడి లక్షణ సహితుడై సాంబుని గొనివచ్చుటయే యిందలి కథ ఇది బలభద్రుడు గాంచిన విజయమగుటచే బలభద్ర విజయము

కవి. క్రీ శ 1410 ప్రాంతమువాడు ఈతని శైలి మాధుర్యవంతులు సంస్కృత పదములుగల్గి ప్రౌఢమై యున్నను, నాతి కఠినమై గంగాస్రవంతి వలె ఎక్కడను కుంటుపడక ధారాళముగ సాగిపోయినది గ్రంథారంభమునను, గ్రంథాంతమునను గూర్చి యిట్లు చెప్పుకొనెను

"మాట లెల్లను వింతమాటలై చెలంగ
తేటైన కృతులందు తేటయై నిగుడ
నవరసాలంకార నటనలు మీర
కవిరాజు లొగి శిరః కంపంబు లాయ" (గ్రంథారంభము)

చిన్నన్న మార్పు గావించినాడు ఇట్టి రచనయే సొగసుగా నున్నది కాని వినుకలిచేతనే నాయికా నాయకులు విరహతాపము నొందినట్లు పూర్వ కావ్యము లందు వర్ణితమైనది

(5) విరహ తాపమును సహింపలేక ఉషాకన్య చంద్రోపాలంభనము గావించినది ఇది మూలగ్రంథమున గానరాదు తన కాలమునాటి సాహితీ మార్గముననుసరించి చిన్నన్న దీనిని తన గ్రంథమున చేర్చియుండును.

(6) ఉషానిరుద్ధుల సురతకేళీ వర్ణనము మూలమున విస్తారముగ గలదు కాని ఆంధ్ర గ్రంథమునందిది విడిచి వేయబడినది

(7) పరపురుషుడొకడుషాంతఃపురమున ప్రవేశించినట్లు బాణ కింకరులు బాణున కెరిగింపగా, నాత డనిరుద్ధుని దండించుటకు నాయకులను బంపును వా రనిరుద్ధుని చంపుటకు ప్రయత్నించుచుండగా, ఉష మిక్కిలి దుఃఖితు రాలయ్యెను ఉషాకన్య సఖి చిత్రలేఖ నారదుని స్మరించును అపుడాతడా కాశమున నిల్చుండి, అనిరుద్ధునకెట్టి భయమునులేదని పల్కి ధైర్యమును గొల్పును ఈ సందర్భమున నారదాగమనము తెలుగు గ్రంథమున లేదు

(8) శ్రీకృష్ణుడు బాణాసురునిపైకి యుద్ధమునకు బోవ సంసిద్ధుడై సౌపర్ణుని మనమున స్మరించును. సౌపర్ణుడేతెంచి శ్రీకృష్ణునకు వలగొని నమస్కరింపగా కృష్ణుడాతని హస్తమును నివిరి భూషణాదులు ధరించి యాతనిపై యుద్ధమునకై శోణితపురమున కేగినటులు చిన్నన్న వ్రాసెను. ఈ సందర్భమున మూలమున గరుత్మంతుని సాహస వీర్యము అనేక విధములుగ శ్రీకృష్ణుడు స్తుతించి చివరకు భూత భవిష్యద్వర్తమాన కాలములందాతనితో తుల్యులగు వీరులెవ్వరును లేరని ఆతని నుత్సాహపరచినట్లు గలదు.

(9) శ్రీకృష్ణుడు గరుత్మంతుని ప్రశంసించిన పిమ్మట గరుత్మంతుడు మరల శ్రీకృష్ణుని అనేక శ్లోకములలోస్తుతించును. ఇవికూడ ఆంధ్ర గ్రంథమున విడిచి వేయబడినవి.

(10) శ్రీకృష్ణుడు బాణాసురుని చంపుటకు చక్రమును గైకొనగా

లకు నీరాజన మిచ్చుటకై యెత్తిన పసిడి పళ్ళెరము వలె నున్నదని వర్ణించుట భావుకులగు కవులు జేయగల వర్ణన ఈవర్ణన యెంత మనోహరముగా నున్నదో:

ప్రాచీ దిశాకాంత బల మాధవులకు
రాచ మెచ్చుగను నీరాజనంబెత్త
యసమాన నవకుంకుమాంకితంబైన
పసిడి పళ్ళెరము చేపట్టెనో యనగ
గాయత్రి మంత్రి తార్ఘ్యము లిచ్చి విప్రు
లాయుతంబుగ మ్రొక్క నర్కుండు వొడిచె"

ఈతడి యీ క్రింది ద్విపదలు భాగవతమునందలి పోతన పద్యములకు[44] ద్విపదానువాదములై యున్నవి.

"ఏ దేవు భృత్యులై యింద్రాది సురలు
యాదరంబున గొల్తు రనిశంబు వరుస
తెరలి యే దేవు మందిర మెంత దివిజ
వరస భూవిభవ భవ్య స్ఫూర్తి జెందు
సఖులతో నే దేవు చరణంబు లొత్తు
నఖిల లోకైక మాతైనట్టి లక్ష్మి
తివిరి యే దేవుని దేహ కళాంశ సం
భవులము పద్మజ భవులము మేము
... ... ...
అట్టి కృష్ణునకు బ్రహ్మాండ వేల్పునకు
పట్టభద్రులంబోలు పట్టభద్రునకు
చెంది ప్రేమ మరాళ చిహ్నంబు లెల్ల
బొందరాదంట యద్భుత మిది కాదె"

ఈతడనేక స్థలములందు జాతీయముల నుపయుక్తము గావించినాడు.

---

44. ఆంధ్ర మహాభాగవతము.

"చిగురుగొమ్మకు చేప సింహాలపీద"
"గురువు కన్నను గుడ్డు మీరె."
అనయ నెక్కినవారి కేనుగ కురుచగనం
బోలు పల్లనకట్టు కన్నట్లు"
"నెరిగుడి మింగువానికి గళ్ళోని
వరలింగ మొగి నట్ట పడియంబు గాదె"
"ఎలుక పిల్లి మెడగంట గట్టునె"
"మూరెడువారు బారెడు గుంగుట పాడిగాదు"
"బచ్చలి కూరకు పరికింప దురద హెచ్చు"
"కలిసి ఉన్న దొంగకు చాకిరేవు చదరమైనట్లు"
"గారదాకిన మీలంబుగతి చారుదెంచుట"
"చేతులు పొడమైన గన్నతల్లి కౌగిటం జేర్చు రక్కరిక రీతి"
"చక్కెర యెరువుగా నిచ్చి మొలుపంబెట్టిన
"వేములు తియ్యనగునె"
కుక్కతోకను ఒక గుండు గట్టినను చక్కనౌనె
తొంటి చందంబె కాక"
"గుంటి మీది చీంబోతువలె తన చేతిలో
నృపుల వలసినట్లు శాయవలె"
"చక్కం బూచిన చీమ సైతంబుగాను తొక్కితే
గరచు, జోచులం జెప్పనేల"
"మెడ మచ్చ గలిగిన ఊరపిచ్చుక శివు-డౌనె"
ఇందలి ప్రధాన రసము వీరమని చెప్పవలసి యున్నది

ఇందటనట గణ భంగ దోషములు, సూర్యగణములను ప్రయోగింప వలసిన స్థలము లందు యగణ జగములున్నవి ఇవి లేఖక ప్రమాదములేమో ఏలయనగా ఇట్టి వొండురెండు స్థలములందు మాత్రమే యున్నవి కవిత్వ మన్ని యెడలను నిర్దుష్టమై యించుక పౌఢమైయున్నది.

ఈతడు పోతన భాగవతమును జూచెనుగాని, అంతకింముక పూర్వమే రచింపబడిన మడికి సింగన భాగవతమును జూచినట్లు లేదు

## 3. ఇతరములు

### పరమయోగి విలాసము

తాళ్ళపాక తిరువేంగళనాథ కృతమగు నీ ద్విపద ప్రబంధము పన్నిద్దరు వైష్ణవాచార్యుల చరిత్రను వర్ణించునది.

అలమేలు మంగా శ్రీ వేంకటేశ్వరుల నుతించి, తండ్రియగు తిరుమలయ్య కంజలి యిడి, గురువైన, పరమాచార్యుడు వాధూలపతి నప్పగారి స్మరణతో గ్రంథారంభమును గావించెను ఈతడు స్మరించిన యప్పలాచార్యులు వాధూల వంశావతంసుడైన నన్నాపి యప్పలాచార్యుడై యుండును ఈతనికే "కందాడై కోవిల అణ్ణన్" అని ప్రసిద్ధి శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు తెనాలి రామకృష్ణుడు, ఆతని సమకాలికులను[45] గూర్చి చర్చగావించి, వైష్ణవ గురువులైన అప్పలాచార్యులు ముప్వురు గలరని నుడివియున్నారు వీరిలో క్రీ.శ. 1547 నాటి శాసనమున పేర్కొనబడిన యప్పలాచార్యులే చిన్నన్న గురువై యుండదగును

సకలాంధ్ర ప్రబంధములందును విడువబడని స్వప్న వృత్తాంతమిందు కూడ గలదు ఈతడొక కావ్యమును రచింప వలెననితలపోయుచున్న సమయమున వేంకటేశుడు కలలోన గానుపించి, ద్రవిడ ప్రబంధమును తెనుగున ద్విపద రూపమున రచింపుమని యానతిచ్చెనట

ఈ గ్రంథమందు పండ్రెడుగురు వైష్ణవాచార్యుల చరిత్ర ప్రస్తుతింపబడినది. ఇందు మొదటి ముప్వురాళ్వారులు, పొయ్గై, భూత, పేయాళ్వారులు పురాణపురుషులు — చారిత్రక పురుషులుకారు పురాణపురుషులు వీరొక్క్కరు

---

45 భారతి, మార్చి, 1941.

విష్ణు ప్రశంసాపూర్వకముగ నూరు శ్లోకములను చెప్పినట్లు ప్రసిద్ధి పీరి కాలమును గూర్చి చర్చించుచు దినేన్స్ చంద్ర సర్కార్, M A,, P R S, PhD. గారిట్లు చెప్పిరి "They often refer to the avataras of Vishnu' especially Trivikrama and Krsna and cannot be assigned to a date earlier than the Gupta age, as has sometimes been suggested "[46]

రంగాచార్య. ఎం ఏ ఎల్ టి గారు పీరిని గూర్చి యిట్లు వ్రాసిరి.

"The first three Alvars are technically known by the names of Poygai, Pudam (Bhuta) and Pey These very names indicate the great feature of their life They are called Spirits and mad beings, because in their self-forgetfulness and divine vision they laughed, wept, danced, and sang like people who had lost their senses. God absorbad and God enamoured they wandered from place to place adressing pslams to the manifestations (arcavataras) of Visnu in the different Villages of Tamilnad The three Tiruvandadis (the tiruvandadi is a type of Tamil verse, where the last portion of a previous line is the commencement of the next The Tiruvandadi of the first three Alvars is one of the earliest works in this style and gives a clue to their Chronology Their songs are for this reason regarded as the earliest sections of the Nalayira Prabandham, by which name the hymns of the Alvars came later on to be collectively called

భార్గవముని, దేవకామిని, కనకాంగులకు జన్మించిన తిరుమళిశై యాళ్వారు నాల్గవయాళ్వారు ఇతనికే భక్తిసారుడని నామాంతరము గలదు

భక్తిసారుడు తన తేజము నొరులెరుగకుండవలెనని మేదరివలె శూర్పములను విక్రయించుచు విష్ణుపద ధ్యానమున నుండి కొంతకాలమైన పిమ్మట ఒక గుహయందుండ సాగెను ఈతడు విశేషమగు మహిమగలవాడు' ఒకపర్యాయము

---

46 కల్చరల్ హెరిటేజ్ ఆఫ్ ఇండియా, సం 4, పుట 143

47 Cultural Heritage of India, Vol. I.P. 166.

పార్వతీ పరమేశ్వరులకు తన మహిమను జూపి వారిచే హరిదాసులు మహిమాన్వితులని పొగడబడినాడు ఈతని మహిమను చాటు అనేక కధలు వర్ణితమైనవి.

ఈతడును ద్వాపరయుగము 862,900 సంవత్సరమున జనించినట్లు గురు పరంపర వలన తెలియుచున్నది చారిత్రకముగ క్రీ॥ శ 720 సంవత్సరమని తెలియుచున్నది క్రీ॥ శ 600-630 వరకు పాలించిన పల్లవ మహేంద్రవర్మ సమకాలీకుడని కొందరందురు

## నమ్మాళ్వారు

ఆళ్వారులందరిలోను నీతడు మిక్కిలి మహిమాన్వితుడుగ నెంచబడుచున్నాడు. బ్రాహ్మణేతరుడు చెల్లాల కులజుడు విష్వక్సేనాంశ సంభూతుడు ఈతడు జనించిన వెంటనే హరి సూతికాగృహమున కేతెంచి జ్ఞానోపదేశమును గావించినాడు ఆ జ్ఞానామృతముచే పరితృప్తుడై ఆచిన్నిబాలుడు సర్వజగమును మరచి ఏడ్వకుండగా, ఆ బాలుడు యోగి యని భావించి నాధనాయికి వానిని కురుకేశుని మందిర ప్రాంగణమున గల తింత్రిణీ వృక్షము మొదల మెత్తని పొత్తులు పఱచి పరుండిబెట్టినది. తల్లిదండ్రులు తనను వీడిపోయిన పిమ్మట నమ్మాళ్వారు తరుణ భావమును దాల్చి తింత్రిణీ వృక్షమునందలి కోటరమున వసతి యేర్పఱచుకొని యోగాసనస్థుడై మౌనము వహించి పదునారు సంవత్సరములుండెను. పదునారవయేట యోగనిద్రనుండి మేల్కాంచి విష్ణునిపై ననేక పద్యములు చెప్పగా, అర్చావతార రూపమున నున్న విష్ణుని మూర్తులన్నియు నాతని చుట్టును గూడి, తము బాడుమనుచు, కారిసుతుసి వేడికొనగా, అతడటులే నీరజోదరుని వర్ణించి వేదములను ప్రబంధ రత్నములుగా కూర్చినాడు. ఈతనికి శఠకోపక, పదాంకుశముఖులని నామాంతరములు.

ఈతడు విష్ణు స్తుతి పరకముగ నాల్గు విధములగు పద్యభాగములను రచించెను. అవి తిరుచిత్తమ్, తిరువాశిరియమ్, పెరియ తిరుపెందాది మరియు తిరువాయి మొఱి ఇవి నాలాయిర ప్రబంధమందు మిక్కిలి ముఖ్యమగు భాగములుగ నెంచబడుచున్నవి. వీనిని శ్రీ వైష్ణవులు నాల్గు ద్రావిడ వేదములుగ

భావింపుదురు ఈ విషయమును స్వప్నముగా నమ్మాళ్వారులే తన శిష్యుడగు మధుర కవితో చెప్పెను

తక్కిన ఆళ్వారుల రచనల కంటె నీతనిరచనలే, దక్షిణ దేశమున వైష్ణవుల కనుసరణీయములు నయ్యెను. ఈతని రచనలు సాధారణ భక్తులకు భావస్ఫోరకములుగనుండుటే గాక కవి వేద వేదాంతముల యొక్కయు, గీతా భాగవతముల యొక్కయు సారము లనిపించును ఈతడు శ్రీవైష్ణవ మతము యొక్క ముఖ్య సిద్ధాంతములను బోధించుట వలన తరువాతి యాచార్యులీతనిని "కూటస్థు"డనిరి

## మధుర కవి ఆళ్వారు

నమ్మాళ్వారు శిష్యుడు ఈతని జన్మ సంవత్సరము క్రీ శ 797 అని చారిత్రకులు నిర్ణయించిరి గురుపరంపరవలన నీతడు కలియుగము 8 వ సంవత్సరమున జనించినట్లు తెలియుచున్నది ఈతడు జన్మించిన వెంటనే యోగ సామ్రాజ్య పద పట్టభద్రుడై మాధవునిపై మధురమగు కవితను చెప్పుట వలన నీతనికి మధురకవి యను నామ మిడిరి

## కుల శేఖరాళ్వారు

ఈతడు కేరళ దేశాధిపతి విష్ణు పదాయత్త చిత్తుడై భాగవతులను సేవించుచు ఐహిక భోగముల నన్నిటిని త్యజించి, తుదకు రాజ్యమును కూడ విసర్జించి వైష్ణవ ఆళ్వారుడాయెను అపర రుక్మాంగదుడని ప్రసిద్ధి గాంచినట్టియు, పరమ వైష్ణవుడను నైన చేరవంశ భూపాలుడు ధృఢవ్రతునకు, శ్రీమహావిష్ణువుయొక్క కౌస్తుభాంశమున కుక్కుట నగరమున కలియుగమున మాఘమాసము పునర్వసు నక్షత్రమున నీతడు జనించెను ఈతడు కలియుగము 27 సంవత్సరమున జనించినట్లు గురుపరంపర వలన తెలియుచున్నది చారిత్రకముగ నీతడు క్రీ శ 767వ సంవత్సరమున జనించినట్లు నిర్ణయింపబడినది

ఎల్లప్పుడును భాగవత సేవయందే మునిగియుండెను భాగవతుల రాక

పోకలకెట్టి యుద్ధంకులుకు లేకుండ నేర్పాటు గావించెను ఈతనిని వైష్ణవ సేవ నుండి, మరల్చి రాజ్యకార్యాసక్తుని జేయదలచి, మంత్రులొకసారి యీతని భూషణములను దాచి, వైష్ణవులే వాటిని దొంగిలించిరనియును వారి నికమీద సభకు రానీయ వలదనియుననగా, కులశేఖరుడు వైష్ణవులు ముమ్మాటికిని చోరులుగారని ప్రతినజేసి, అద్దానిని ఋజువుపరచుటకు, సర్పమున్న ఘటము నొకదాని పెట్టినాడు అపుడు అందుండి సర్పమునకు బదులుగా, శ్రీరామ చంద్రుడు ప్రత్యక్షమై యాతని భాగవత భక్తిని నిరూపించినాడు. ఆ ప్రత్యక్ష మయిన శ్రీ రామచంద్రుని స్తుతింపుచు, ద్రవిడ ప్రబంధమును, పెరుమాళో 'తిరుమొళి'ని రచించెను ఇదిగాక యీతడు ముకుంద మాలను గూడ రచించె నని కొందరి తలంపు విష్ణుమూర్తి యీతని భక్తికి మెచ్చి, యీతని పుత్రిక యగు [illegible] తను తన కిచ్చి వివాహము జేయుమనగా, అటులేగావించినాడు

ఒక పర్యాయము రామాయణమున సీతాపహరణ ఘట్టమును విని సీతకు కల్గించిన కష్టమునకై రావణుని వధింతునని లంకాభిముఖుడై పోవుచుండగా, శ్రీరంగస్వామి ప్రత్యక్షమై విమానమున వైకుంఠమునకు తోడుకొని పోయెను భండార్కరుగారీతడు క్రీ శ 2వ శతాబ్ద పూర్వార్ధమున నున్నట్లు చెప్పిరి [50]

## తిరుప్పాణాళ్వారు

ఈతడంత్య కులజుడు ఉద్రైయూరు (నేటి తిరుచనాపల్లి) నగరమందు కార్తీక మాసమున రోహిణీ నక్షత్రమందు శ్రీ మహావిష్ణువు యొక్క శ్రీవత్సాంశ మున జనించెను ఈతని కాలము క్రీ.శ 841 ప్రాంతము ఈతడు వీణాగానము సేయుచు విష్ణుని సుతింపుచుండెను, నాలాయిర ప్రబంధమున నీతడు "అమలన్ అడిప్పదాన్" అను భాగమును రచించెను

## తొండరప్పొడి యాళ్వారు [విప్రనారాయణుడు]

తంజావూరి క్షేత్రమున శ్రీహరి యొక్క వన మాలాంశమున బ్రాహ్మణ దంపతులకు జన్మించెను జనని గర్భమందే సకలము నెఱిగిన మహిమోపేతుడు కావేరీ తీరమున పుష్పోద్యానమును నిర్మించి, ఫలపుష్పములను శ్రీరంగస్వామికి సమర్పించి కైంకర్యము చేయుచుండెను ఈతని కైంకర్యమునకు శ్రీమహా

50 Vaishnavism & Saivism, Page 50

విష్ణువు తృప్తినొందెను, తన లీలా వినోదము నాతనికి చూపదలచి, దేవదేవియను వేశ్యవలయందీతడు చిక్కుకొన్నట్లుగ జేసి పిదపకు ముక్తినొసగినాడు.

ఈతడు వనమాలిక, ప్రబోధకి యను కృతుల రచించెను. వీనిని నేటికిని భక్తులాదరముతో చదువుదురు తాత్కాలికముగ మానవుడు చేయు అపరాధము లన, తప్పిదములను భగవంతుడు విశేషముగ దయామయుడై క్షమించునో సంగీతములు వివరించుచున్నవి ఇవియే నాలాయిర ప్రబంధమందలి "తిరుమాలై" "తిరుపళ్ళి ఎళుచ్చి" యను భాగములు ఈతడి బోధ ఈ క్రింది విధముగ నున్నది

Should men live one hundered as the Vedas say one half will be wasted in sleep, the fifty remaining will be likewise wasted in childhood, boyhood, sensualty, hunger, disease and old age !

O dweller in Srirangam's temple! I desire birth no more"[51] (Translated by J S, M Hooper)

ఇట్టి భావమునే భాగవతమునందు ప్రహ్లాదు డుపదేశించినాడు "శతవర్ష పరిమితంబైన జీవితకాలంబున నియతంబై యుండు, నందు సగమంధకార బంధురం బయిన రాత్రి రూపంబున నిద్రాదిప్రవహారంబుల నిరర్థకంబు లగును, తక్కిన పంచాశ ద్వత్సరంబులందును బాల్య కైశోర వయో విశేషంబుల వింశతి హాయనంబులు గడుచు గడమ ముప్పది యబ్దంబులు నింద్రియంబులచేత పట్టుబడి దురవగాహంబు లైన కామ క్రోధ లోభ మోహ మదమత్సరంబులను పాశంబులం గట్టుపడి విడివడ సమర్థుండు గాక ప్రాణంబుల కంటె మధురాయమానంబైన తృష్ణకు లోనై..." యుండునని చెప్పినాడు[52]

---

51 Indian Inheritance-Bhavan's University, P 156

శ్రీమదాంధ్ర మహా భాగవతము, సప్త, స్కం 213.

## పెరియాళ్వారు

శ్రీ విష్ణువు యొక్క గరుడాంశమున జన్మించి. శ్రీ విల్లిపుత్తూరునందు 'వటపత్రశాయి' కైంకర్యము చేయుచుండిన వైష్ణవ భక్తాగ్రేసరుడు. ఈతడు క్రీ.శ 725 నాటివాడని చారిత్రకుల యభిప్రాయము. వైష్ణవ పూజా వివర్ధను దగుట వలన విష్ణుచిత్తుడను ఖ్యాతి గల్గినది. సుందరమగు పుష్పోద్యానము నొక దానిని బెంచి, శ్రీ వటపత్ర శాయికి సుమదామ కైంకర్యమును జేయుచుండెను. ఈతడు శ్రీ మహా విష్ణువుకు ప్రియభక్తుడై యుండెను కాన, పాండ్యరాజు పర తత్త్వ నిర్ణయము చేయుటకై యేర్పరచిన సభ కీతనిని బంప వాదము చేయించి "సయేష సర్వ భూతాంతరాత్మా పహతపాప్మా దివ్యోదేవో ఏకో నారాయణో హరిః" అను వాక్యానుసారముగ, విష్ణు పారమ్యమును స్థిరీకరింపజేసినాడు శాస్త్రార్థ జ్ఞానములేని విష్ణుచిత్తుడిట్లు చేయగల్గుట విష్ణుని యనుగ్రహమే కారణము. జ్ఞానము లేని విద్యకంటె విద్యలేని జ్ఞానము గొప్పదని దీనివలన తెలియుచున్నది. భక్తి సర్వోత్కృష్టమైనది. నాలాయిర ప్రబంధమందీతని రచన 'తిరుప్పల్లాండు'

## గోదాదేవి

భూదేవ్యంశమున అయోనిజగ జన్మించినది. విష్ణు చిత్తునకు పుష్పోద్యానమున లభించుట వలన నాతడీమెను బాలికవలె పెంచసాగెను విష్ణు చిత్తుడు ప్రతి దినము వటపత్రశాయికి గొనిపోవు మాలలను తాను ముదట ధరించి, పిమ్మట అతనికి పంపుచుండెడది వటపత్రశాయియు ఆమె ధరించిన మాలలను ధరించుచు కొండదాకుచుండెను ఒకనాడు ఆమె మాలను మొదట ధరించుటను జూచి విష్ణుచిత్తుడు దానిని గొంపోక వేరొక దానిని స్వామికి గొనిపోగా, స్వామి ఆమె ధరింపని మాల తానొల్లననియు, ఆమె మొదట ధరించినదే తనకు కావలె ననియు, ఆమెను తాను వివాహమాడుదుననియు దెల్పెను ఇందువలననే ఆమెకు చూడి కుడుత్తాళ్, చూడి కుడుత నాంచారి యనిపేర్లు గలవు ఇట గోదాదేవియు, క్రమముగ రంగనాథుని యందు భక్తి గల్గినదై యాతనినే పరిణయ మాడు దునని నిశ్చయించుకొనినది. శ్రీరంగనాథుని పతిగా బడయుటకు, మార్గశీర్ష మాసమందు వ్రతము నాచరించి, రంగనాథునిపై నొక ప్రబంధమును రచిం

నది. ఈమె రంగనాథునిపై రచించిన కెంతు స్తోత్రములును, నాలాయిరప్రబంధమందలి 'తిరుప్పావై' మరియు, నాచియార్ తిరు మొళి' మొత్తమామె రచించినవి నూటదెబ్బది మూడు గీతములు ఇవి మిక్కిలి గూఢమగు నర్థమును గలిగియున్నవి

తాళ్ళపాక చిన్నన్న సంకీర్తనములు రచించెనని కొందరనుచున్నారు గాని, ఈతని సంకీర్తనలేమియు లభింపలేదు తాను రచించినట్లెచ్చటను చెప్పికొనలేదు కాని గోదాదేవి వివాహ సందర్భమున రంగనాథుని మేల్కొల్పుచు రచించిన శ్రీరంగరాజ ప్రబోధన ద్విపదలు అపూర్వగేయ మాధుర్యమును గల్గియుండి, ఇతని సంకీర్తనలు మనకు లభింపని కొరతను దీర్చుచున్నవి ఇట్టి వింద పదింటిని రచించెను మచ్చున కొకటి

"అరుణ బిబం బుదయాద్రిపై నిలిచె
బలపల వేగి పీడ్వద మబ్బు లడగె
నలరుచు బూదేవియల సోన గురిసె
బాలించి కరుణ చొప్పడ యోగ సిద్ర
చాలించి శ్రీరంగశాయి మేల్కొనవె"

## తిరుమంగై యాళ్వారు

చోళ మండలమున శ్రీహరి యొక్క కార్ముకాంశమున జనించెను ఈతరు క్రీ శ 776 ప్రాంతముల నుండినట్లు చారిత్రకుల యభిప్రాయము పరకాలయోగియని యీతడికి ప్రసిద్ధి. చోళరాజునొద్ద మంత్రిగ నుండెను భాగవత సేవకు రాజుగారి బొక్కసమునుండి ధనమును వెచ్చింపగా రాజాతని హింసించి నగరినుండి వెడల తరిమినాడు ఇక పరకాలుడు చేయునది లేక, ''తనగూర్చి చేయు నధర్మంబు ధర్మ'' మని శ్రీహరి మునుపు నుడివినాడుగాన, వైష్ణవార్థముగ చోరవృత్తినవలంబింపనిశ్చయించి నాడు భార్యతో కూడ సాగరతీరమున గల మహారణ్యము నొకదానిని చేరి వైష్ణవ సాహసమునకు పెనుమాళిగలుకట్టించి, సముద్ర తీరమునకు నిత్యము వచ్చు వోడల లోని బేహారులవద్ధ ధనమును కొల్లగొట్టి భాగవతారాధన చేయుచుండెను

ఒకపర్యాయమాతని కీవిధముగ కూడ ధనము లభింపకుండగా, శ్రీమహా విష్ణువే, అతని వద్దకేగి ధనమును సమకూర్చి, పిమ్మట స్వస్వరూపమును జూపి, భక్తున కష్టాక్షరీ మంత్రము నుపదేశించినాడు అతని వాత్సల్యము సాటిలేనిది శ్రీహరి దివ్య స్వరూపమును నుతింపుచు, తిరుమంగై యాళ్వారు పది పద్యముల నల్లెను. మరియు శ్రీవిష్ణువియొక్క యవతారములను నుతింపుచు, నవరసములు చిప్పిలు నట్లుగ, మరివేయి ఎనుబది నాల్గు పద్యములను చెప్పెను నాలాయిర ప్రబంధమందలి యీతని రచనల, పెరియ తిరుమొళి, తిరుక్కురాండకమ్, తిరునే దుండాండకమ్, తిరువేలు కూరిరుక్కై, సిరియ తిరుమాడల్, పెరియ తిరుమాడల్, ఈ మాడల్ రచనలందు భగవంతుడు నాయకుడుగను జీవుడు నాయకుని కొరకై విరహాగ్నియందు తపించుచున్న నాయికగను చిత్రింపబడిరి ఈతని యీ ఆరు విధములగు రచనలును నమ్మాళ్వారు రచించిన నాల్గు రచనలకు తరువాత చేర్చవలెనని వైష్ణవుల యభిప్రాయము. నమ్మాళ్వారు రచనలను నాల్గు వేదములుగను, పరకాలయోగి రచనలారు వేదాంగములు గను భావింపబడుచున్నది నాలాయిర ప్రబంధమందు వీరిర్వురి రచనలే యధిక సంఖ్యలో నున్నవి ఈతని గీతములు మొత్తము ఒక వేయి మూడువందల అరువది యొకటి (1361)

బౌద్ధ జైనులను వాదమున నోడించి చోళరాజుచే బహుమానింపబడినాడు శైవాచార్యుడైన జ్ఞాన సంబంధుని తన కవిత్వముచే మెప్పించినాడు. ఈ జ్ఞాన సంబందరు పల్లవరాజైన మొదటి నరసింహ కాలమున నుండెను నరసింహవర్మ క్రీ॥ శ 650–68 వరకు రాజ్యముచేసెను పరకాలయోగినాతి సమకాలీనుడైనచో నాతడేడవ శతాబ్దమున నుండినట్లు భావింపవలసియున్నది కాని అధికసంఖ్యాకులు చారిత్రకు లీతడు 8వ శతాబ్దమున నుండినట్లు భావింపుచున్నారు కాన పైకథ యెంతవరకు సత్యమో చెప్పజాలము

హరిపూజకంటె హరిభక్తులపూజ ఘనము. అట్టి పూజగావించిన పరకాల యోగికి విష్ణువు ప్రత్యక్షమై కరుణించినాడు

క్రీ॥శ 850 ప్రాంతములనాటికి ఆళ్వారుల భక్తిమార్గము ముగిసి, ఆచార్యుల జ్ఞానమార్గ మారంభమయినది. ఆళ్వారుల బోధలకును, ఆచార్యుల బోధలకును గొంత భేదమున్నది. ఆచార్యులు తమ బోధలను కేవలము ద్రావిడ ప్రబంధముల నుండి మాత్రమేగాక, సంస్కృతమందున్న మతగ్రంథములను నుండియుచేకొనుచుండిరి. వీరు కేవలము భక్తిని మాత్రమే ప్రధాన సాధనముగ నంగీకరింపక భక్తితోపాటు కర్మజ్ఞానములుకూడ భగవంతు నెఱుగుటకు సాధనములని బోధించిరి. వీరు వేదోపనిషత్తులు భగవద్గీతలకును, ద్రావిడ ప్రబంధమునకు నొకవిధముగ సమన్వయమును గల్పింప జూచిరి. వేదోపనిషత్తులయందు వివరింపబడిన పరతత్త్వమే ద్రావిడ ప్రబంధమందును జెప్పబడినదని వారు బోధించిరి. కావుననే వీరికి ఉభయ వేదాంతికులను ప్రసిద్ధి యేర్పడినది. వీరాళ్వారులను తమ మార్గ దర్శకులుగ పూజనీయులుగ భావించిరి. వారి నాలాయిర ప్రబంధమును వేద తుల్యముగ సంభావించి, దేవాలయాదులందును, గృహములందును పఠనీయముగు గ్రంథముని గౌరవించిరి. నేడు శ్రీ వైష్ణవు లాచరించు ఉపవాసాదికములు, పూజలు, దాన ధర్మములు పండుగ పబ్బములు, ఈ ఆచార్యులు ప్రవేశపెట్టినవే. నేటి శ్రీవైష్ణవ సంప్రదాయము నంతటిని వీరేర్పరచినదే. కావుననే వీరు శ్రీవైష్ణవులకు పరమ పూజనీయులు.

## నా ద ము ని

ప్రథమ వైష్ణవాచార్యుడు ప్రబంధమందలి రచనా సౌందర్యమున కబ్బురపడి యోగ మార్గముకంటె వీనియందలి గీతములద్వారా, భగవంతుని, సాధించుట యనువుగా నుండునని భావించి, ఆ ప్రబంధమును వెలుగులోనికి దెచ్చి మిక్కిలిగా వ్యాప్తిని గలిగించెను. నాలాయిర ప్రబంధమును ఒక్కొక్క భాగమునందు వెయ్యేసి పద్యములుండునట్లుగ నాల్గు భాగములుగ విభజించినాడు. ఆయా పద్యములయొక్క ఛందస్సు ననుసరించి యాతడిట్లు విభజించెను. ప్రస్థాన త్రయముతో, దీనికి సమన్వయము చేకూర్చి, తన స్వగ్రామమగు వీరనారాయణస్వామి యాలయమున దీనిని పఠించు నేర్పాటు గావించెను. ఈతని తోడనే శ్రీ వైష్ణవమున కొక నవచైతన్యము స్ఫూర్తి, వ్యాప్తిగలిగి, దానికొక నూతన యుగమేర్పడినది. "యోగరహస్య"మను గ్రంథము నితడు రచించెను.

కాని నేడది యలభ్యము. వేదాంత దేశికులీ గ్రంథముచుండి యుదాహరించిన వాక్యములు మాత్రము లభ్యమగుచున్నవి ఈతడి రెండవకృతి, న్యాయతత్త్వము ఆచార్య యుగమందు విశిష్టాద్వైత మత సిద్ధాంతమును తెల్పు కృతులలో నిదియే మొట్టమొదటిది

## యామునాచార్యుడు (ఆళవందారు)

నాథముని పుత్రుడగు ఈశ్వరముని పుత్రుడు పుండరీకాక్ష రామమిశ్రుల యనంతర మీతడు, ఆచార్యుడయ్యెను. పిన్న ప్రాయమునందే మహా భాష్య సూరియను గురువువద్ద వేదాది విద్యల నభ్యసించి చోళరాజు పురోహితుని వాదమున నోడించి[53] రాజుగారిచే అర్ధరాజ్యమును బడసినాడు రాజుగారి భార్య యామునాచార్యులను జూచి మిక్కిలి మెచ్చుకొని, "నన్నేల వచ్చితో తండ్రి" అని పల్కినది అప్పటినుండి యాతనికి ఆళవందారను నామమేర్పడినది.

ఈతడు సిద్ధి త్రయమును, జ్ఞానసిద్ధి, ఆత్మసిద్ధి, ఈశ్వర సిద్ధి అను కృతులను శ్రీహరి స్తోత్రము (స్తోత్రరత్నము) గీతార్థ సంగ్రహము, మహాపురుష నిర్ణయమను గ్రంథములను రచించెను స్తోత్రరత్నమందు విష్ణువును స్తుతింపుచు డెబ్బది పద్యములను రచించినాడు నిజమునకిది స్తోత్రము మాత్రమే గాదు అతడు శ్రీ మహావిష్ణువును శరణుపొంది ప్రపత్తిద్వారా అతనిని సేవించిన విధమును దెల్పుచున్నది ఈతని మరికొన్ని కృతులు శ్రీ చతుశ్లోకి, మహాపురుష నిర్ణయము, ఆగమప్రామాణ్యము

## రామానుజాచార్యులు

యామునాచార్యుని మనుమని మనుమడు, మహాపూర్ణుడు, తిరమలనంబి, గోష్ఠి పూర్ణుడు మొదలగువారిచే ఘన రహస్యములనెరిగినాడు గోష్ఠి పూర్ణుడు రామానుజునకు పరమ రహస్యము నుపదేశించి దీనిని అనధికారుల కొసగరాదని చెప్పినాడు. కాని కృపాంతరంగితుడైన రామానుజ స్వామి తనకు ప్రసాదించిన

గీతాచరమార్థమును[54] అందరు వినుచుండగ నుచ్చైస్స్వరమున నుచ్చరించినాడు అప్పుడాతని గురు దలిగి. "గురుతోడ బొంకిన వాని కరియ గతి యెద్ది తుడి

నరకమెకాని అని యనగా,రామానుజుడు రహస్యము నెఱిగి. అనేకులు శౌరిని జేరి, తానొక్కడును నరకమున కేగిననుమంచిదని పల్కగా గురువు మిక్కిలి సంత సించి, ప్రపంచమందలి సర్వులను నుద్ధరింప నేతెంచిన మహాపురుషుడీతడని పొగడి తనపుత్రునాతని శిష్యుడుగా జేసినాడు. రామానుజుడు హిందూ దేశమునందలి పుణ్యక్షేత్రముల నన్నిటిని దర్శించినాడు శ్రీరంగమున, ఏకదండి యతి శిష్యుల నోడించి, వేదాంతదీపము, వేదాంతసారము, గద్యత్రియము. గీతా వివరణము నను గ్రంథములను రచించినాడు కాశ్మీర దేశమున కేగినపుడు అనపి శారదాదేవి, "కప్యాసం పుండరీకమేవ అక్షణీ" అను శ్లోకము కీతడు దెల్పిన సుందరమగు అర్థమున కానందమొంది యెదురేతెంచి ఆదరించి నది పుణ్యక్షేత్రముల నన్నిటిని దర్శించి, మరల శ్రీరంగమున కేతెంచి, అట డెబ్బదినాల్గు సింహాసనములను శిష్యులను ప్రతిష్ఠించి. శేషశైల దర్శ నార్థమేగినాడు ఇట్లు శైలమునెక్కి చనుచుండగా. శ్రీ వేంకటేశుని ప్రసాద మును తిరుమల నంబి రామానుజునకు తెచ్చి యిచ్చెను.

శ్రీరంగమున కేతెంచి, శ్రుతి వాక్యముల నైక్యముగ శ్రీ భాష్యమును రచించి శిష్యులకు వేద వేదాంతములను బోధించిరి శివభక్తి పరుడగు ఆనాటి చోళరాజు వైష్ణవుడయిన నీతని బాధింపనెంచగా, నీతడు యాదవాచలమున కరిగి, యదుగిరీశ్వరుని ప్రతిష్ఠించి శ్రీరంగమునకు మరలు తలపున నుండగా నచటి వైష్ణవులందరును తామాతని నెడబాయలేమనియు. అతని విగ్రహము నైనను నొకదానిని నిల్పుమని వేడగా. రామానుజుడు తనరూపమున నర్చా విగ్రహము నొకదానిని జేసి, యటనిల్పినాడు

---

54 గీతయందలి చివరి శ్లోకము :

'సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ
అహంత్వా సర్వ పాపే భ్యో మోక్ష యిష్యామిమాశుచః"

పరమత దంతి పంచాస్యుడగుచు ఉభయ వేదాంత శాస్త్రజ్ఞులైన శిష్యులు వ్యాఖ్యానములు చేయుచుండగా, వైష్ణవమతమును సర్వతోముఖముగ వ్యాపింప జేసెను

## కవితావిభవము

మధురమగు పదములతో మంజుల మనోహరములగు ద్విపదలను గూర్చి మనమున కాహ్లాదమును గొల్పు నీతని కవిత నిర్దుష్టమైనది ఎటను వ్యర్థ పదములుగాని, పొల్లుపదములుగాని గానరావు ఈతడు ప్రబంధకవుల యుగ మున కించుక తరువాతి వాడగుట వలన ఆ యుగ ప్రభావమితని కవి తతో గాఢముగ గాననగును. కావ్యమున షష్ఠ్యంతములు రచించినాడు ప్రబంధ మునువలె నీ కావ్యమును పుర వర్ణనతో నారంభించినాడు. మధుర కవి కవిత్వమును ప్రశంసించు సందర్భమున తన కవితావైభవమును వ్యంగ్యముగ సూచించినాడు.

"పలికిన పలుకెల్ల పన్నీరు చెంబు
గులికిన చందాన గ్రొన్నెల సోక
వొలసిన రీతి కర్పూరంబులప్ప
లొలుకు కైవడి మంచు లుడుగుక మెఱయు
ననువున జల్లగా నమృతంపు సోన
చినుకు సోయగమున జీవ రత్నములు
మెలగెడు జాడ బ్రామినుకు వజ్రములు
తులగింప జలజల తూర్పెత్తినట్టి
మెలపున వలపు డెమ్మరలు వేడించు
నలువున గ్రొత్త కట్టాణి ముత్యములు
డాలించు సరణి బిటారంబు లొక్కట
గిలించు కరణి జక్కెరలుప్పతిలగ
మగనిపై గూర్మి రమా దేవి చూపు
నిగుడించు భాతి దేనియ లుట్టి పడగ
కవిత మాధవు మీద గావింప......"

భక్తి సారసకు హరిపాకడను విప్రుడు యాగారంభ సమయమున అగ్రపూజగావించి ఆర్ఘ్య ప్రదానములను సమర్పించినపు డితర విప్రులందు కీసు వహించి, అతనిని నిందించిన సందర్భమునందలి ద్విపదలు భారతమునందలి "ఋత్విజుండని విచారించి పూజించితే ....." అను పద్యానుకరణముగా నున్నవి,

సర్వ శాస్త్రజ్ఞులై చర్చింప వేద
పర్వతముల వంటి బ్రాహ్మణులుండ
చేర్చి బృహస్పతి పెకలివచ్చినను
జర్చింప గల ఘన శాస్త్రులుండంగ
నశ్వమేధాది పర్యంతముల్ దెలిసి
శాశ్వత మతులైన శ్రోత్రియులుండగను

— —

అగ్రజన్ముల కర్హ్యమగుచు శోభిల్లు
నగ్రపూజన మిచ్చునది యెట్టులోరి" (పుట 109-110)

ఈతడొక యెడ వైకుంఠమును వర్ణించుచు శ్లేషను వాడినాడు

"అమలమై యెపుడు ముక్తాశ్రితయగుచు
నమితమై పరమ హంసావృత యగుచు (పుట. 11)

చిన్నన్న మంచి భావనాపటిమ కలవాడు. ఇతడు యుద్ధభూమిని బీభత్సర మణీయముగ వర్ణించినాడు

"తొలంగు రక్తంబులు తోయ పూరములు,
శరములండ జములాస్యములు తామరలు
కనుగవల్ తొగలు మీగాళ్లు తాబేళ్ళు
మినుకారు నెరికురుల్ మిండతుమ్మెదలు
కరటి తుండములు వక్రములు కంఠములు
దరములు చామరల్ తరచైన నాచు,

ఘన శతాంగములు వక్రములు చక్రములు
పునుకలు వరహంసములుగాగ నొప్పు
(ప.యో వి. 6ఆ పు 392. ద్విపద 926–72)

ఈగ్రంధమందు వేర్వేరు భక్తుల చరితములు వర్ణితమగుటచే నీ కావ్యమందు వస్త్వైక్యము కొరవడిన దేమో యనిపించును కాని భగవంతుడను ఏక సూత్రముచే భక్తులను పుష్పముల మాల కూర్పబడినదని భావింపవచ్చును. ఇందలి నాయకుడు శ్రీ మహావిష్ణువు. భక్తులందరు నాతని పొందుకై తహ తహ జెందిన నాయికలు

## శ్రీవిష్ణు పురాణము [విష్ణు భక్త చరిత్రము]

గ్రంధకర్త చక్రపురి రాఘవాచార్యుడు—ఈతడే నలచరిత్ర ద్విపద కావ్యకర్త [55] గ్రంధము పూర్వోత్తర భాగములుగ విభజింపబడినవి. ఒక నాడు లక్ష్మీదేవి శ్రీహరిని గాంచి విష్ణుమాయ నెవ్వరు నెరుగజాలరనియును, ఎల్లప్పుడు నాతని పాదకమలములను సేవించిన వారికే పుణ్యము లభించుచున్న దనియును, కావున విష్ణువునకు మిక్కిలి యపకీర్తి లభించిన దనియును బల్కినది ఆమె పల్కులకు ప్రత్యుత్తరముగా శ్రీ మహావిష్ణువు లోక వృత్తాంతమును, నరుల దుష్కృత్యములను చెప్పి భక్తులు కానివారు యమ లోకమున బాధలనందురని దెల్పగా లక్ష్మీదేవి తన మహిమచే వారికెల్లరకును బాధావిముక్తి గావించి, సాయుజ్యము నొసగమని విష్ణుని వేడినది విష్ణువు తనతల్పమైన శేషుని జూచి, భూలోకమున వైష్ణవాచార్యుడుగా జనించి తన మతమును ప్రచారము చేసి, మానవులను దుష్కృత్యములనుండి మరల్చి నరకమునకు పోకుండ జేయుమనినాడు అపుడు శేషుడు, తన్ను స్మరించిన వారందరకు సాయుజ్య మొసగినచోతాను భూలోకమున జనించెదననినాడు విష్ణుడందులకు సమ్మతింపగా, శేషుడు రామానుజాచార్యుడుగా జన్మించి, వైష్ణవ మతమును వ్యాపింపజేసెను

---

55 ఈకవి వంశాదికములు నలచరిత్ర యందొసగితిని

ఈ గ్రంథము ప్రధానముగ వైష్ణవాచార్యుడైన రామానుజాచార్యుని జీవిత చరితను వర్ణించు గ్రంథముగ నున్నది రామానుజాచార్యుని జీవితవిశేషము లన్నియు వివరింబడినవి ఇందలి శైలి సౌలభ్యము నలవర్చుకొని, అసాధారణ ప్రవాహముతో సాగి పోయినది యమ కింకరులు పాపులను,

''మోములపై బల్లెములు మోపుకొనుచు
నేపూరు మెడలపై వేడి వాదులను
గ్రుక్కుచుండెడి పెద్ద కత్తుల మోది
ప్రక్క టెమ్ములపైని పరగ గ్రుద్దుచును
... ...
పడద్రొచ్చి ముదితలపై యాశలుంచు
వడిగల వాడని వాతెరక్రింద
గోరుల పోనిచ్చి కోయని యార్చి
భోరున యీడ్చి గొబ్బున లెమ్మటంచు''

బాధలను పెట్టెడివారట

బోయ వేషమున నేతెంచి రామానుజునికి అడవిలో మార్గమును జూపి అతనితో చాల దూరమేగి నందున, దప్పికగా నున్నదనియును, సమీప మున గల బావినీటిని తేవలసినదనియును విష్ణుమూర్తి అదృశ్యుడయ్యెను. అపుడు రామానుజుడు విష్ణుమూర్తికి గల్గిన యలసట యెట్టిదో యూహించెను.

''అరయుంగ మున్ను దైత్యాళి నిర్జించి
పరగగ వచ్చిన యట్టి బడలికో నీకు
కలశాబ్ధి దెచ్చుచో కడగి మందరము

బలిమి మోదిన నాటి బడలి కో నీకు
కరుణతో భక్తుల కాచేటి కొరకు
బరుపడి దిరిగెడి బడలికో నీకు

నేనెన్ని జలములు నీకు దెచ్చినను
దీన రక్షక దప్పి దీరునే నీకు'

ఇట్టి భావమునే పరమ యోగి విలాసపద్య కావ్యమున

"నిగమ చోరకుని ఖండించిన యలతయో
యబ్ధిలో గిరి మోచినట్టి యలతో"[57]

లక్ష్మీదేవి శ్రీమహావిష్ణువును "ఆది మూలమని" వర్ణించినది సంస్కృత భాగవతమున గజేంద్రుడు కూడ విష్ణువు 'నాదమూలం' మనియే నుతించెను

విష్ణు సేవకైనను, వైష్ణవ సేవకైనను ఎట్టి నీచ కార్యము నైనను జేయ వచ్చును లక్ష్య సాధనయే ముఖ్యము కాని, మార్గమెట్టి దైనను కావచ్చును

"అత్తరి దేహాపేక్ష వదలి
యాచార్య కొరకుగా నవనిలో యెట్టి
నీచ కార్యంబులు నెమ్మి జేసినను
యరయగా పాపంబు లేదని శాస్త్రములును
సరవితో బల్కును సత్యంబుగాగ''

శైవులు కూడ నిటులే విశ్వసింతురు వారికి కూడ శివుడు 'మన్ని మిత్తం కృతం పాపం ధర్మాయకల్పతే'' యని దెల్పినాడట బహుశః భక్తి ప్రతి పాదక మతములన్నియు నిట్టి భావములను దెల్పుచున్నవేమొ

పరమతావలంబియైన వెలనాటిచోడుని దర్శించినందున పండితారాధ్యుడు కన్నుల నూడబెఱికికొనగా యిందీ, రామానుజుని శిష్యుడు కూరుత్తాళ్వారుడు వైష్ణవేతరుడైన చోళుని దర్శించినందున కన్నుల నూడబెఱికి కొనెనట మతోన్మాద మట్టిది.

స్వమతాభిమానమేగాక, పరమత ద్వేషముకూడ నీతని యందు కాన

57 పరమయోగి విలాసము, 7—14.

బడుచున్నది. శైవులను పాషండలని, మాయావాదులనియు విందించినాడు.

"చిరునవ్వు నవ్వి యా చెనటి పాషండ
వరులతో చిక్కి యెవ్వడా యనియుండ
వలసెనే నీకు శ్రీ వల్లభా యనుచు
బలుకుచు చనుదెంచి పంకజోదరుని
మందిర ద్వార సీమను నిల్చి యుండ
నందునున్నట్టి మాయా వాదులెల్ల ..." 58

ఇంకొక స్థలమందు "ఇందిరాపతి పాద తీర్థమును భక్తి నౌదల నుంచిన వాని" నని శివుని వర్ణించినాడు. అక్కడనక్కడ జాతీయములనుపయోగించెను.

1 'మేదిని జలరాశి మేర దప్పినను, పోడిగా గట్టింప పొసగదెవ్వరికి,
2 పెంచెదనని చెట్టు బెట్టిన నాత, డెంచక గొట్టిన యేమనవచ్చు
3 కన్నపుత్రుల బట్టి కరకర జేయ, జనకుని వారులేమి సాధింపగలరె?
4. మండూరకరవలి క్రైపడి నిలమత్తగజము ముందరను గ్రామసూకరములు సమమె?
5. బడబాగ్నికి, హిమకణం బెంత, కలశజునకు నర్థికణములు సమమె

## కూరత్తాళ్వారు చరిత్ర[59]

అముద్రితము

"శ్రీరంగపురవాస శ్రీ రమాధీశ
వారిజ దళ నేత్ర వసుదేవ పుత్ర
మధు జనక బుధ స్తోత్ర మా మనోహర
కరి వరద మురవైరి కామాక్షి శౌరి

58. పుట. 89
59. శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ ఆర్. 361
ఏఫ్ 24 ఎ, 28ఎ.

హరి విష్ణు కేశవ హనుమాను దేవ
పురుహూత వందన భోగేంద్రశయన

యిత్యాదిగా నిష్ట దేవతా ప్రార్థన గావించి ఆళ్వారాదులను సంస్తుతి జేసి కూరత్తాళ్వారు చరిత్రను చెప్పగడంగినాడు కూరత్తాళ్వారు శ్రీ రామానుజుల శిష్యుడు. అతనిచే దీక్ష గై కొన్నవాడు ఇది మిక్కిలి చిన్న కృతి రెండు మూడు యాకులపైన మాత్రమే గలదు ఈ యాకులైనను అధికభాగము తునిగి, చినిగిపోయి యుండుట వలన ప్రతిపాద్య విషయము తెలియుట కష్టముగా నున్నది గ్రంథాంతమంచు ఇట్లు గలదు

"అంత నదృశ్య మయె నా స్వామి
యింతట విలసిల్లు యీ పుణ్య చరిత
మెవ్వరు వినినను యెవ్వరు చదివినను
యెవ్వరు వ్రాసిన యెలమి తోడుతను
మోహన గురుడిచ్చు మోక్షమట నిజము"

దీని కర్త యెవ్వరో యెరుగరాదు.

## శరణాగత ద్విపద[60]

అముద్రితము

రామానుజుల వారి స్తుతి రూపమగు లఘు కృతి కర్త యెవ్వరో తెలియదు

"శ్రీ కర గుణ ధామ శ్రిత జన స్తోమ
లోకేశ నుత నామ లోకాభిరామ
నమ్మిక గల్గిన నమ్మయాళ్వారి
సౌమ్యుగా జేయుము సుందర రూప

— —

60 శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ ఆర్ 861.

రక్షించు రక్షించు రామానుజాచార్య
రక్షించు రక్షించు రమ్య యోగీంద్ర'

యని గ్రంథంబు నారభించి,

''శరణు యోగి కులేశ శరణు భక్తేశ
శరణు సాత్త్విక బ ౹ప శర ౹ు గోవింద
శరణు సదానంద శరణు సర్వేశ
శరణు జొచ్చిన వాని దయ్యేన కావు
శరణు జొచ్చిన నన్ను సంతోషి జేయు
దిక్కెవ్వరును లేరు దీనుడ నాకు
దిక్కు మీరే గాక దిక్కెవరు గలరు?

అని వైష్ణవాచార్యుని శరణొంది.

రక్షింపు రక్షింపు రామానుజాచార్య
రక్షింపు రక్షింపు రమ్య యోగీంద్ర
రక్షింపు రక్షతో నన్ను
రక్షణము జేయు మా ,వర...యోగి''

యని గ్రంథమును ముగించినాడు

## భాగవత వైభవము[61]

అముద్రితము

కవి సుంకసాల తిరుమలకవి, హరితస గోత్రుడు.రఘునాధునిపుత్రుడు. గురువు కొక్కొండ భట్టరుడు, ఈతడొక కధను రచింపవలెననెడి యుత్సాహమున నుండగా నారాత్రి స్వప్నమున, లక్ష్మీదేవి సాక్షాత్కరించి, 'భాగవత

---

61. మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము. ఆర్. 1724

వైభవ'మను ప్రబంధమును తన్నామాంకితమగా రచింపమనినదట కావుననే గ్రంథమును

"శ్రీరంగ పతిరాణి జీమూతవేణి
సారసనిభ పాణి సైకత శ్రోణి
కమల జాండధారి కలుష సంహారి
మముగన్న వరిచింత మానికొమారి"

యని లక్ష్మీదేవి నుతితో నారంభించినాడు.

జగతిలో భగవదర్చన కంటె భాగవదర్చనయే ఉత్తమము యాగాదికములు, హరి పూజాదికములు భాగవతారాధనతో సరిరావు. పురుషోత్తముని పూజలు సల్పువారలకు ముక్తి లభ్యమగునోలేదో సందేహముగాని, భాగవతులను (హరిదాసులను) పూజించు వారికి ముక్తి లభ్యమగుననుటలో నెంతమాత్రమును సందేహము లేదు పరాశర, యాజ్ఞవల్క్యాది ఋషులు, వ్యాస వాల్మీకాది మునులును భాగవతుల మహిమను, భాగవతార్చన పెరిమను పలుపాట్లవివరించిరి.

అవివేకముచే జాత్యంధుల వలె నుండి, మార్గమును తెలియలేక యున్న జీవులకు త్రోవ జూపదలచి, విష్ణువు తనకును, తన దాసులకును కైంకర్య మొనరించి కడతేరమని చెప్పెను వారికి వలయు ధీశక్తి నొసగి, సాత్త్వికమార్గమేర్పరచి, శాస్త్రముల నొసగి, అతడే సర్వసాక్షిగా హృదయమున నిల్చి, తన్ను, తన భక్తులను పూజింపమని దెల్పినాడు. భాగవతాపచార మొనరించిన వారిని యమకింకరు లనేక బాధల నిడుదురు కవికాలము తెలియరాదు,

## శ్రీనివాస విలాస సేవధి

షష్టాశ్వాస పరిమితమగు నీ గ్రంథము శ్రేష్ఠలూరి వేంకటార్యుడను కవిచే రచితమై, శ్రీనివాసులను పేరుగలిగిన వేంకటాచలపతి విలాసములను, విహారములను వర్ణించు రసవత్తరమగు ద్విపద ప్రబంధము. శ్రీ వేంకటాచల పతియే

స్వయముగా కోరి కవిచే నీ కృతిని రచియించికొని కృతిగొనినాడు ఈతడొక కావ్యమును రచింప నూహించుచుండగా శ్రీ వేంకటాద్రీశ్వరుడు స్వప్నమున సాక్షాత్కరించి, శేషాచలేశు వైభవమును ద్విపదలో రచింప మనినాడట. దేవదేవుని యానతి ప్రకార మీతడీ గ్రంథమును రచించి యాతనికే కృతి నొసగి ధన్యుడైనాడు కృత్యాది నీతడు సంస్కృత ప్రాకృత ముఖ్య భాషల య దున, ద్రావిడాంధ్రములందు ను నరేక ప్రబంధములు రచించినట్లు చెప్పి కొనెను కాని, యీతని యితర గ్రంథములేవియు గానవచ్చుటలేదు ఈ గ్రంథ మునందే పడ్విధ ప్రాకృతులలో స్తుతించిన స్తోత్రములు మాత్రము గలవు

కవి అపస్తంభ సూత్ర, భారద్వాజ గోత్రుడు, లక్ష్మి కృష్ణమార్యుల పుత్రుడు గ్రంథారంభమున ఇష్టదైవమగు వేంకటాచలపతిని నలమేలుమంగను, శేషాహి సౌవర్ణ సేనాధిపులను స్మరించి, తన యాచార్యుడయిన వాధుల వంశావతంసుడు నగ్నాది అప్పలాచార్యుని స్మరించినాడు దీనినిబట్టి యీ కవి వాధుల వంశావతంసునకగు అప్పలాచార్యుని శిష్యుడైనట్లు తెలియుచున్నది వాధూల గోత్రజుడైన నితనికే, కందాడై అణ్ణుకోవిల్ అని ప్రసిద్ధిగలదనియును, నీతని అసలు పేరు వీర రాఘవాచార్యులనియు చెప్పుదురు ఈ యప్పలాచార్యుడు, మహా పండితుడు, వీరి పాండితీ వైభవమును గూర్చి గొనియాడుచు నొకరు.

"అపశబ్ద భయం నాస్తి
అప్పళాచార్య సన్నిధౌ'' అని పల్కగా, తెనాలి రామకృష్ణుడద్దాని

నపహాస్యము గావించుచు

''అనాచార భయం నాస్తి, శిష్య న్మాత్రస్య సన్నిధౌ"

అని పల్కెనని యొక కథ ప్రచారయిన నున్నది ఈ కథ యందలి నిజానిజము లెట్లున్నను, దీనివలన తెనాలి రామకృష్ణుడీ యప్పలాచార్యునకు సమకాలీనుడని తెలియుచున్నది పాండురంగ మాహాత్మ్య కృతిపతియగు విరూరి వేదాద్రి మంత్రికి కూడ నీ యప్పలాచార్యుడు గురువయినట్లు పాండురంగ మాహాత్మ్య అవతారిక పద్యముల వలన తెలియుచున్నది

తిరుపతి దేవస్థానమువారి శాసన సంపుటము లందలి క్రీ. శ. 1539 (శా శ. 1461) క్రీ శ 1544 (శా శ 1466) సంవత్సరమునాటి శాసనము లందు ప్రస్తుతింప బడిన, కందాడై యప్పళాచార్యులే విరూరి వేదాద్రి మంత్రికి గురువనియును, వీరిగ్వురును, క్రీ శ 1540-1550 సంవత్సరముల మధ్య నుండిరవియును డా॥ నేలటూరి వెంకట రమణయ్యగారు నిర్ణయించిరి ప్రస్తుత గ్రంధకర్తయగు శ్రేష్ఠలూరి వేంకటాచార్యు డనంతపుర జిల్లా చెట్లూరువాడయి నందున నీతనికి విరూరి మంత్రి గురువైన కందాళ అప్పలాచార్యులే గురువయి యుండును యెనుమల పెద్దన యొక్క తండ్రి పెదతండ్రులగురువీతని గురువై యుండజాలడు. దీనినిబట్టి యీ కవి క్రీ.శ 16 వ శతాబ్దమున నుండెనని నిర్ణయింపవచ్చును [66] శ్రీ వేంకటాచలపతి యీ కవిని, అనేక పురాణ ములలో గహనమై పెనుగొన్న కథ చిక్కుదీర్చి రచింపుమని అని యాదేశింపగా,

"వారాహ వామన బ్రహ్మాండ పాద్మ
గారుడాది పురాణ కథలు శోధించి
కసటు దేర్చి ప్రసిద్ధ కథ సంగ్రహించి
వెస చిత్ర కథ చాల విస్తృత ఫణితి
గదియించి పునరుక్తి కథ ద్రోచి మొదలు
తుద యేర్పరించి బంధుర సంగతులను
పూర్వోత్తర విరోధములు దోచనీక"

వేంకటాధీశుని భువనాద్భుత చరిత్రను ద్విపద కావ్యముగ తీర్చి దిద్దినటులు చెప్పికొనినాడు శ్రీ వేంకటేశుని గూర్చినకథలు వరాహ, పద్మ, గరుడమార్కండేయ హరివంశ పర్వ, వామన, బ్రహ్మాండ స్కాంద భవిష్యోత్తర శ్రీ వేంకటేశ్వర రహస్య పురాణములలో వర్ణితమైనది. ఈ పురాణములలో వర్ణితమైన

---

66 శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి కవి 17 శతాబ్ద ప్రారంభమున నుండియుండునని ఈ గ్రంధ పీఠిక యందు వ్రాసిరి.

వేంకటాచల మాహాత్మ్య భాగముల నన్నిటిని సంకలనము గావించి, తిరుపతిదేవ స్థానమువారు, "వేంకటాచల మాహాత్మ్య" మను పేర నొక గ్రంథమును ప్రకటించిరి కాని యీ గ్రంథమున నాయాపురాణ భాగములుగా నేర్పఱడిన రచనలు కొన్ని మూల గ్రంథములందు గానరాకపోవుటచే నీ కథలు భిన్నకాలములందు, భిన్న భిన్నకర్తలచే నాయాపురాణములందు జేర్పబడియుండునని విమర్శకుల యభిప్రాయము ఈ కవి వారాహ, వామన, బ్రహ్మాండ, పాద్మ, గారుడ, స్కాంద, మార్కండేయ పురాణములలో నీకథ యున్నదని చెప్పుట వలన నీతని కాలమునకే నీ పురాణములలో నీ కథాభాగములు చేరియుండినట్లు నిశ్చయింపవచ్చును ఈతని కాలమునకే నీ కథ లొక దానితో నొకటి పొందిక యేర్పడక, భిన్న భిన్న విధములుగ నుండుటను బట్టియే వేంకటాధీశుడు 'చిక్కుదీర్చి' రచింప మనెను

ఈ గ్రంథమున మొదటి మూడాశ్వాసములందును 'వేంకట ధరణీధర మహిమ'ను వారాహ పురాణ సరళిని వెలయించెను ఈ కథ యంతయు వరాహ పురాణమున గలదు శ్రీ మన్నారాయణుని ఆది వరాహావతారమే ఈ కథ కంతకును మూలము మున్నీట మునిగియున్న భూమిని పైకెత్తుటకై పద్మనాభుడు శ్వేత వరాహ రూపమును దాల్చి, దానిని పైకెత్తి శేషుని పడగలపై నిల్పి అఖిల భూచక్రమును దర్శించుచు నటనే విహరింప నిచ్చగల్గగా, చెంత నున్న గరుడుని జూచి, వైకుంఠమునందున్న రత్న నగరాజమును భూమికి తేవలసినదని యాజ్ఞాపించెను గరుడుడు నారాయణాద్రిని పెకలించి, నారాయణుని సన్నిధికి దేగా, నాతడు విహరించుచుండిన వనమునకు చెంతనున్న స్వామి పుష్కరిణీ సరస్సునొద్ద నుంచుమనెను దీనిని బట్టి భూమిపై స్వామి పుష్కరిణి యను నొక సరస్సు వెంకటాద్రి యను కొండ వెలసి యుండగా, దీనినే నారాయణాద్రిగా జేసినట్లు కానబడుచున్నది ఈ ప్రదేశమే వేంకటాచలము. దేవతలందరును వరాహ స్వామిని ప్రార్థింపగా, నాతడు, సేవింప నింపైన శ్రీనివాసుడయి నిలచి సురల కానంద మొసగెను వేంకటాద్రి మహిమను నిరూపించు శంఖణుడను చంద్రవంశపు రాజు చరిత్రను వర్ణించెను.

ద్వితీయా శ్వాసమున వేంకటాద్రి యొక్కయు, అచటి దైవము యొక్కయు మహిమను దెల్పుటకై ఆత్మారాముడను విప్రుని కథను వర్ణించెను పిమ్మట అటగలపదునేడు తీర్థముల కపిల, ఇంద్ర, విష్వక్సేన, శంఖ చక్రాది పంచతీర్థములు, అగ్నికుండ• బ్రహ్మ తీర్థములు, సప్తర్షుల పేరునగల సప్త తీర్థముల మహిమను వ్యక్తీకరించుటకే శోణపుర బ్రాహ్మణుని కథ చెప్పబడినది

పూర్వము శ్రీరామచంద్రుడు రావణుని వధించుట కేగుచుండగా, వేంకటాచలముపై తపమాచరించుచున్న యంజనాదేవియు, హనుమంతుడును, శ్రీ వేంకటేశ్వరుగాంచి, ప్రార్థించి• స్వామి పుష్కరిణిలో స్నానముజేసి, స్వామిచే వరమంది చనుమ''ని పల్కగా, శ్రీరామసౌమిత్రులు కపిసేనతోగూడ శైలేశుని భావించి, రావణుని మర్దించి, జయరమా జానియై సీతతోగూడ నయోధ్యకేగి పట్టాభిషిక్తుడై సామ్రాజ్య పదవిని బడసినాడు. కావున తొలియుగమునందలి వరహావతార కథా వృత్తాంతముతోబాటు, త్రేతా ద్వాపరయుగ కథలుగూడ నీ వేంకటాచల తీర్థ క్షేత్రములో సంబంధములు గలవిగా చెప్పబడినవి

ఈ యద్రి కీశాన్యమున గల వైకుంఠ గుహ గలదు శ్రీరామునితోగూడి యుండిన కపులకు, యిందు సాక్షాద్విష్ణువు విమానారూఢుడయి దేవులతోకూడ ప్రత్యక్షమయ్యెను

పంచమాశ్వాసమందలి కథ వామన బ్రహ్మాండ పురాణముల ననుసరించి చెప్పబడినది ఇందు వర్ణింపబడిన తీర్థాముల మహిములు• వానిని గురించినకథలును వామన పురాణోక్తిగ వర్ణింపబడినవి [67]

పంచమ షష్ఠాశ్వాసములందు వృషాసురుని వధించుటవలన వృషాచల నామము గల్గిన వృత్తాంతము, శ్రీనివాసుడు పద్మనీకాంతను వివాహమాడిన వృత్తాంతమును, కలియుగాగమమున చెన్నుని విహార లీలలు 'పురాణములను చదవి చెప్పినాడు

ప్రథమాశ్వాసమున సీతడు పేర్కొనిన పురాణములలో మిగిలినవి

---

67 శ్రీనివాస విలాస సేవధి, పు 177.

పాద్మగారుడములు. కాని యీ పురాణములందీ వృత్తాంతములు లేనందున దీని నీతడు భవిష్యోత్తర పురాణమునుండి గ్రైకొనియుండును ప్రథమాశ్వాసమున చెన్నుడు వైకుంఠమునుండి వేంకటాచలమును భువికి దెప్పించినట్లు చెప్పినాడు గాని అది యే పురాణమున నున్నదో వివరించలేదు వరాహమే శ్రీనివాసుడై నట్లు స్వామి పుష్కరిణీ తీరమునందలి శైలమె శేషశైలమైనట్లు ఊహింప వచ్చును ఈ యూహకు పంచమాశ్వాసమునగల వృషభాసురుని కథ పోషక మగుచున్నది. వృషభాసురుడొకనాడు శేషాచలమునుగాంచి, పూర్వమిది ఇక్కడ లేదు. దీని నెవరోమాయావి యొకడు గొనివచ్చి యిట నిల్పినాడనియును, వానిని ఖండింతుననియు, పల్కి అచ్చటనే వేటాడుచుండిన గోవిందుని మార్కొనినాడు గోవిందుడాతనిని వధించుటకు తన చక్రమును పంపగా, వృషభాసురునకు జ్ఞానోదయమై తన పేరున నట్టి నగమును వెలయింపవలసి దని నారాయణుని వరమువేడి వడసినాడు అప్పటినుండియు, నా నగము వృషభాద్రియను ప్రసిద్ధిగాంచినది

పిమ్మట పద్మినీ శ్రీనివాసుల కల్యాణ వృత్తాంతము వర్ణింపబడినది పద్మిని ఆకాశరాజు పుత్రిక ఒకరోజు మృగయావినోదార్థమై యేగిన శ్రీనివాసు డామెను గాంచి వలచి సాకెను పద్మినీ దేవిపై విరహముచే వెతచెందుచుండగా నాతని హృదయజ్ఞయయిన, వకుళ, అతని సంతాప కారణమును తెలిసికొని, అలమేలుమంగాదేవి యుండగా, వేరొక కాంత అతని నాకర్షించుట యెట్లు సంభవించినదనగా, శ్రీనివాసు డామెకు పద్మినియొక్క పూర్వ జన్మవృత్తాంత మును వివరించినాడు ఆమె పూర్వజన్మమున వేదవతి

షష్ఠాశ్వాసమున శ్రీనివాసుడు కలియుగమున అర్చాకృతినిదాల్చి, వేంకటాద్రిని వెలసిన రీతి దెల్పబడినది తొలియుగమున భూమినుద్ధరించిన శ్వేత వరాహ రూపమే, కలియుగమున శేషశైలమున నర్చాకృతిమూర్తిగా, నిలిచి, వసుడను నిషాదుడు పెంచుచుండిన, కొఱ్ఱ చేనును పాడుగావించి, అందు మూలమున నాతనికి, తానాక్షేత్ర దైవమని దెల్పుటయు, ఈ సంగతి తొండమాను రాజున కెరిగింపమని నిషాదుని పంపుటయు తొండమానుడు తనకు

స్వప్నమున సాక్షాత్కరించి, దైవము చెప్పినట్లుగ నా క్షేత్ర ప్రదేశమున కేగగా, నట శ్వేత వరాహమూపుట్టను జొచ్చుట, రాజు దానిని త్రవ్వించి, యందు పాతుకొనిపోయిన వేంకటనాయకుని యర్చాకృతిని గైకొని, దానికి మండప ప్రాకారాదులను నిర్మించి, దైవమున కుత్సవాదులను జరిపించుటయు వర్ణింప బడినది

భగవంతుని సాయుజ్యము వడయుటకు భక్తియే పరమ సాధనము ఇతరము లేవియు నవసరము లేదని ప్రమాణీకరించుటకు కుర్వపురి కుమ్మరి కథ వర్ణితమైనది

ప్రథమాశ్వాసమున స్వామిపుష్కరిణీ ప్రభావమును చాటుటకై రాజ్య భ్రష్టుడైన శంఖణుడను రాజునకు మరల రాజ్యము ప్రాప్తమయినకథ వరాహ పురాణ ప్రథమ భాగమునందలి షష్ఠాధ్యాయమున పండ్రెండు శ్లోకములందు వర్ణితముకాగా నీ కథను ఆంధ్రగ్రంథకర్త పెక్కువిధములుగ విస్తరించి, ప్రబంధరీతిని, రసవత్తరముగ రచించినాడు అటులె చతుర్థాశ్వాసమందలి మాధవసోమయాజి కథను బ్రహ్మాండ పురాణమునుండి గ్రహించి, వివిధవర్ణనా దులచే విస్తరింపజేసి రసవత్ప్రబంధముగ నల్లినాడు

ఈ కవి గ్రంథమును రచించు విధానమును జెప్పికొనినాడు —

'గడియించి తగు నలంకారముల్ మెరయ
చటులార్థ కల్పనల్ శబ్ద సందర్భ
మొకపొంద మాధుర్య ముల్ల సిల్లగను
వరుస పద్దెనిమిది వర్ణనల్ గలుగ
నతుల శృంగార వీరాద్భుత రసము
లతిశయింపగ విభావాది భావములు
భావుక భావ సంభావ్యత నలర
గావించి పటుమహా కావ్య లక్షణము
వెలయ దెనుంగున ద్విపద కావ్యముగ
భూసుత విఖ్యాతి పొసగ నల్పెదను"

ఈతడు చెప్పికొనిన దానిలో నతిశయోక్తి యెంతమాత్రమును గాను పింపదు. ఈ కావ్య కన్య రసభావములతోను నలంకారములతోను వర్ణనా సౌంద ర్యనుతోడను విరాజిల్లుచున్నది. ప్రథమాశ్వాసమున వైకుంఠపురవర్ణన,సముద్ర వర్ణన వేంకటాద్రి పర్ణనయు గావింపబడినవి. శంఖణుడనురాజు కథా సందర్భ మునస్వయంవర వర్ణన గలదు.ఋకువర్ణన నీ కవి విస్తృతముగనే గావించినాడని జెప్పవలసి యున్నది. దశరథుడు స్వామి పుష్కరిణీ తీరమున తపము జేయు సందర్భమున గ్రీష్మ వర్ష ఋతువులు వర్ణించబడినవి. ప్రథమాశ్వాసమునను, మాధవ సోమయాజి కథా సందర్భమునను వసంతర్తు వర్ణన గలదు చంద్రా ర్కోదయ వర్ణనలు సంధ్యావర్ణనలను నాయా సందర్భములకు తగినట్లు గావింప బడి, కథా సందర్భములలో పాత్రలతో ప్రకృతి సానుభూతి జూపుచున్నట్లుగ సూచింపబడినది. వీర శృంగారాద్భుత రసములాయా కథా వృత్తాంతములందు సందర్భానుకూలముగ వివరింపబడినవి. చక్రిరాజు యుద్ధము గావించి శత్రు వులను తునుమాడు సందర్భమున వీర రసము గలదు.

వైకుంఠ గుహాయందు వానరులు జొచ్చిపోవు పట్టున నద్భుత రసము గలదు. శృంగార రసము గ్రంధమున ముప్పాతిక భాగమున కానవగును. శంఖణుని కథయందు, మాధవ సోమయాజి కథ యందు, రంగదాసుడు గాంచిన గంధర్వ స్త్రీ జలకేళీ వర్ణనయందు, కుంతల సువర్చలల కథలయందు, పద్మావతీ శ్రీనివాసుల ప్రణయ వృత్తాంతమునందును శృంగార రసము జక్కగ పోషించబడినది,

మూర్తుల నీతడు కన్నులకు గట్టినట్లు వర్ణించినాడు. నారదుడెఱుకత వేష మును ధరింమట యిందుల కుదాహరణము కాగలదు

"రథమును రథము సారథిని సారథియు
ర్రథికుండు రథికుండు రౌతును రౌతు
తురగంబు తురగంబు దొరయును దొరయు" (3 ఆ పు. 145)

అని యీతడు గావించిన యుద్ధవర్ణన నన్నెచోడుడు గావించిన,

"కరిగరి భటు భటు దరదం
బరదంబు హయింబు హయము నని మొత్తములై''

యను వర్ణనను బోలి యున్నది,

మాళవాధిపుని పుత్రిక వివాహమును గూర్చి చింతించుచు నామె తండ్రి

"కులశీలములె యింపు గురు జనంబులకు
బలపరాక్రమములే భావించు తండ్రి
యమిత సంపదిరకు హర్షించు మాత
రమణీయ రూపము ప్రార్థించు కన్య''

చెప్పిన పల్కులు,

"కన్యా వరయతే రూపం మాతావిత్తం పితా శ్రుతం
బాంధవా, కులమిచ్ఛంతి మృష్టాన్న మితరే జనాః''

అను శ్లోకమునకు ఛాయగా గానవచ్చుచున్నది

గ్రంథమందు కొన్ని హిందూస్తానీ పదములు, వింత ప్రయోగములు గలవు "అసుటి మ్రొక్కులు, తలనీలములు, గద్దరి హొంతకాడు. రాణెము, ఇటుకు (శ్రమము, సంకటము) గోరియపట్టు నరాతులు, గాజరా సంధిందిఆదా'' మొదలగునవి.

దీనాయారము, ఇదహల్య, అతనుద్ధరించి. తళుకులగనో యనగ వంటి సంధుల నీతడు గావించెను.

చంపూ కావ్యములలో వైష్ణవక్షేత్ర మాహాత్మ్యము నుగ్గడించు గ్రంథములలో పాండురంగ మాహాత్మ్యమున కెట్టి స్థానము గలదో, ద్విపద కావ్యములలో దీని కట్టి స్థానము గలదని నిశ్చయముగ చెప్పవచ్చును. "ఇంతియే కాక వేంకటాద్రి మాహాత్మ్యమును, శ్రీనివాస విలాసములను వర్ణించు గద్యపద్యాత్మకములగు గ్రంధములున్నను నీ ద్విపద రచనయే చక్కని తెనుగుదనము

కలిగి, కావ్య లక్షణములతో గూడి వానికన్న మిన్నయై యున్నదని చెప్పదగి యున్నది "

# తి రు వా య మొ డి (టి)

కర్త కాంద్రవేటి రామానుజాచార్యుడు. ఈతని తల్లిదండ్రులు లక్ష్మాంబా తిరుమల గురులు ఈతడు తాను శృంగార కవి రాయడని ప్రఖ్యాతిగాంచి నట్లుపతాకలో చెప్పుకొనినాడు తిరువాయ్ మొడి అనునది సుప్రసిద్ధవైష్ణ వాచార్యుడు శతకోపుడని ప్రసిద్ధినొందిన నమ్మాళ్వారుచే, తమిళభాషయందు రచింపబడి ద్రావిడవేదమని ప్రఖ్యాతి నొందినది, ఇది వేదవేదాంతముల సార మంతయు నాల్గువేల పద్యములలో రచింపబడి నాలాయిర ప్రబంధమనియు ద్రావిడ వేదమనియు ప్రసిద్ధినొందిన దివ్య ప్రబంధమందలి భాగము దీని యందు వేయి పద్యములు గలవు దీనిని తాను ద్విపదీకరించుచున్న సంగతిని గూర్చి గ్రంథకర్త యిట్లు చెప్పికొనెను

"కారినందనుడనగా నుదయించి
శ్రీరాము పాదాబ్జ సేవచే మించి
చింత తరువున నిశ్చితంబు తోడ
సంతతంబును నిల్చి సకల వేదములు
సర్వ వర్ణములకు సతులకు గర్వ
పర్వమై చెలువొంద పాడిన యట్టి
తిరువాయి మొడి యను దివ్యకావ్యంబు
సరసమై శబ్దార్థ సంగతులొప్ప
సరసులు గొనియాడ సత్కవుల్ పొగడ
స్థిరమతి తోడనే ద్విపద గావింతు"

సీతారాముల కంకితముగా కృతిని రచియించినాడు. ఈకవి క్రీ.శ. 1600 శతాబ్దమునాటి వాడని శ్రీ మానవల్లి రామకృష్ణగారీ విధముగ రచించిరి "నాకు లభించిన రెండు తాళపత్ర ప్రతులును సుమారు 300 సంవత్సరములకు

తక్కువ కాని వైనందున నతడు మధ్యకవుల కాలము వాడని నిరాటంకముగ చెప్పవచ్చును"

ఈతని శైలి దెలియుటకై యొండు రెండు పాటలకు ద్విపదీకరణమును చూడనగును. మనక మను పాటకు [71]

"అనుపమంబైనట్టి యష్టాంగ యోగ
మున మనః కల్మషంబులు పాయచేసి
చిత్తవిజ్ఞానంబుచే గాంచి మఱియు
చిత్తు మాత్రము గాదు చేతను దకట
కడువడి నేత్రాది గమ్యమై పొలుచు
జడపదార్థంబులు చర్చింపగాదు
అనుపమ జ్ఞాన మహానందములకు
గనియై పొలుపొంది కాలత్రయమున
నారయంగా సమానాధిక రహిత
సారతర బ్రహ్మ సంజ్ఞచే బొదలు
నమ్మహాత్ముడు నాకు బ్రాణంబు గాగ
సమ్మతి నా హరి చరణముల్ గొలుతు"

## శ్రీ రం గ మా హా త్మ్య ము[72]

కవి ముకుందయోగి. కాశ్యప గోత్రజుడు. కోవిల కందాళ యజ్ఞ దీతని గురువై యుండును క్రీ శ 1560 ప్రాంతమువాడు

---

71 పుట 3

72 శ్రీ వెంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ — డి, నెం 1017 (రెన్" టి 893) కాగితప్రతి—ఇందలి కవిత సరసముగ నున్నది. ఇది క్రీ శ 1892 లో ప్రచురింప బడినట్టు తెలియుచున్నది. కాని నాకది లభ్యముకానందున లిఖితప్రతినే చూడవలసి వచ్చినది

ఘనుడైన కోవిల కందాళ యణ్ణ
ననిశంబు ప్రణమిల్లి యాబిరి మ్రొక్కి
...          ...          ...
ధాత్రి కశ్యపుండన తనరు సన్మాత్రని
గోత్రంబువాడు ముకుందాహ్వయుడును
మదినుబ్బి శ్రీ రంగ మాహాత్మ్య మేను
పదరక వినెడు శ్రీ పరమ వైష్ణవులు
దీపింప తెలుగున ద్విపద కావ్యంబు
గావింతు   ...   ...   ...

బ్రహ్మాండ పురాణమున గల శ్రీ రంగ మాహాత్మ్యమునకిది తెలుగు సేత.

నారదుడు శివుని శ్రీరంగ క్షేత్ర మహిమను దెల్పుమనగా, నాతడద్దాని మహిమను, దెల్పెను, బ్రహ్మతప మొనర్చి శ్రీ మహా విష్ణువును ప్రసన్నుని చేసికొనగా, నాతడు బ్రహ్మకు తన మహిమను, అవతారాది క్రమములును శ్రీరంగమందు తాను వెలసిన క్రమమును, శ్రీ రంగదాసుని సేవించుట వలన భక్తులకు కలుగు మహిమలును, విష్ణువేయే క్షేత్రములందేయేనామములతో కొలువబడుచున్నదో వివరింపబడినది,

## వరదరాజ మంజరి [లేక] కలియుగ మంజరి[74]

అముద్రితము

ఇది మంజరీ ద్విపదలో వ్రాయబడుట వలన దీనికి వరదరాజమంజరి యని పేరిడినట్లుగనున్నది గ్రంధనామ మిదమిద్ధమని నెచ్చటను పేర్కొన బడలేదు. గ్రంధాదిని మాత్రము 'కంచి దండక' మనియు, ముఖపత్రమున 'వరదరాజ దండక' మనియునున్నది ఇది దండక రూపమున లేదు, మరి దండకమని యేల పేర్కొన బడినదో తెలియదు ఈ గ్రంధమందు కంచి వరద రాజస్వామి యుత్సవ దినములు చక్కగ వర్ణింపబడినవి.

---

74 తంజావూరు సరస్వతీ మహలు గ్రంధాలయము, ఎమ్. 402 బి. డి. నెం, 29 , ఎన్ 402 (ఎ) డి నెం, 3-4—కాగిత ప్రతి

వైశాఖ పౌర్ణమినాడు స్వామి (వైకుంఠమునుండి) కంచికి వేంచేసి వరద రాజస్వామి యయినాడు, ఈ పూర్తిమోత్సవములను జరుపుచున్న యొక సందర్భమున కవి హరి చెంతకు జనినాడు,

భక్తు లుత్సాహ పూరితులై పాడుచు స్వామి నూరేగింపునకు గొనిపోయి, మరల సద్మమున కేతెంచునపుడు, "తిరుతేరుల నెలకొని వేంచేసెను. తిరుపీధుల వెంటను" అని బాడుచు హారతు లొసగి లోనికి గాని బోవుదురు

ఈ గ్రంథ రచయిత అప్పన సుకవి వివరము లేవియు చెప్పికొనలేదు.

"అప్పన సుకవియు నతి మోదంబున
మంజరి నవరసమయముగ చెప్పెను,"

ఈతడు పేర్కొనిన తాతాచార్యులెవరో తెలియదు తెనాలి రామకృష్ణునకు సమకాలికుడయిన తాతాచార్యు లయినచో నీతడు 17 వ శతాబ్దమువాడై యుండును.

దీనికే కలియుగమంజరి యని నామాంతరము లున్నట్లు తోచుచున్నది. తంజావూరు సరస్వతీ మహలు లైబ్రరీవారి క్యాటలాగున నివిరెండు భిన్న భిన్న గ్రంథములుగ గుర్తింపబడి అటులే పేర్కొనబడినవి కాని రెండును ఒకే గ్రంథమునకు రెండు భిన్న ప్రతులు. అయినను రెండింటి యొక్క గ్రంథారంభములు బిన్నముగ నున్నవి. కలియుగ మంజరి కందుకూరి పురసోమేశ్వర స్తవముతో నారంభముకాగా, వరదరాజ మంజరి, శ్రీరామ స్తవముతో నారంభింపబడినది, కలియుగ మంజరి అంతమున ఫలశ్రుతి గలదు

## ధర్మజ కృష్ణ సంవాదము[75]

అముద్రితము

కర్త నరసింహకవి, శ్రీకృష్ణుడు ధర్మరాజున కుపదేశించిన తత్త్వజ్ఞాన మిందు ప్రతిపాదిత విషయము. భారత యుద్ధానంతరము ధర్మజుడు, మిక్కిలి

---

75 తంజావూరు సరస్వతీ మహలు గ్రంథాలయిము, ఎమ్. నెం. 378— తాళపత్రప్రతి.

పరితప్తుడగుచు, తమవలె స్వజనులను చంపిన వారికి కలనైనను పుణ్యము లుండునాయని శ్రీకృష్ణునితో మొరవెట్టుకొనగా, ధర్మజాదుల నూరడింపుచు, నొక కథను దెల్పినాడు.

పూర్వము దివ్యాంగుడను ఋషి, తన పుత్రుడైన నాసికేతు నొకానొక కారణమున కోపించి యమపురికేగుమని శపించినాడు అతడును యమపురికేగి, యట యమపురియందు పాపులు పడు బాధలను జూచెను. వారి యాతనలను చూచి అతని మనసు ద్రవీభూతమై వారినెల్లరను వైకుంఠ వాసులను జేయ నిశ్చయించుకొనెను. యముడా నిశ్చయమునకు సుముఖుడుగా లేకపోవుటవలన నాతని సమ్మతిని వడయుటకై యాతని కజామిళోపాఖ్యానమును దెల్పి, పాపులు కూడ పుణ్యలోకముల కరుగుట కర్హులని దెల్పి, అటనున్న యెల్లవారికి నారాయణ మంత్రోచ్చారణ గావించెను ఆ మంత్రమట నరకవాసుల కర్ణరంధ్రముల దూరి, వారికి వైకుంఠవాస ప్రాప్తి నొసగినది

పిమ్మట నాసికేతుకుడు, మునీంద్రులయొద్ద కేగి తమ కావించిన కార్యమును దెల్పగా మునీంద్రు లందరును నద్దానిని దివ్యాంగునకు దెల్పిరి. దివ్యాంగుడును తనసుతుని పరమ ముదమున గ్రైకొని సతి కొసగినాడు.

ఈ కథను శ్రీకృష్ణుడు ధర్మరాజునకు దెల్పి, కర్మములు, ముఖ్యముగ తన భక్తులైన పాండవుల నేమియు చేయజాలవనియును, వారు సకల సౌఖ్యములతోను, చాలాకాలము సుఖముగ నుందురని దెల్పినాడు,

ఈ కవికాలము తెలియుటలేదు కవిత్వమున చెప్పదగ్గ విశేషము లేవియు లేవు

## విష్ణుమాయా విలాసము

కర్త కంకంటి పాపరాజు సోదరుడైన వరసింహకవి, క్రీ శ 17వ శతాబ్దమున నివసించెను. ఇది 'విష్ణుమాయా నాటక' మను పద్య కృతికి

స్వతంత్రానువాదము. ఈ పద్యకృతి చింతలపూడి యెల్లయయని కొందరనగా శేషయ్యగారు, మడికి అనంతయ్య యనుచున్నారు,[76]

ద్విపదకృతి రామాంకిరము, ఇది పంచమాశ్వాస పరిమితమైనది శ్రీ మహావిష్ణువు, తన మాయా ప్రభావముచే, అహంకార గర్వముచే నుబ్బుచున్న సత్యభామ మహలక్ష్మి బ్రహ్మ, మహేశ్వరుడు, నారదుల గర్వభంగ మొనర్చిన కథ లిందు ప్రస్తుతింప బడినవి.

## శృంగారమంజరి

ఇది తాళ్లపాక అన్నమాచార్యులు శ్రీ వేంకటేశునకు విన్నపము చేసిన మంజరీ ద్విపద రూపముననున్న కృతి గ్రంథము వేంకటేశ్వరాంకితము ఇందు కేవలము దేవతాస్తుతికి మాత్రమేగాక, భక్తుడైన తనయొక్క అనుభవమును, ఆధినివేశమును చక్కగ, చిత్రించినాడు. భక్తి శృంగారములు రెండును, భగవంతుని చేరుటకు సాధనములని ఈతని తలంపు

## చక్రవాళ మంజరి

ఇది మంజరీ ద్విపదలో రచింపబడిన కృతి, కర్త తాళ్లపాక పెద తిరుమలాచార్యుడు. ఇందు పద్మావతీ వేంకటేశ్వరులు నాయకీ నాయకులు. ఈతడు ప్రతి పాదమునను ముక్తపదగ్రస్తము ప్రయుక్తము గావించెను.

"అరయ జేపట్టి యనుభవం బొసగి
సగియించు గతి ఘర్మ జల మార విసరి
సరిలేని విరహంబు చల్లార్చి కలసి
కలసిగ్గు దేర్చి వేంకట శైలవాస
వాసవార్చితుడు శ్రీ వామాక్షతోడ
దోడ బ్రవేశించె దొల్లిటి నగరు.

---

76 ఆంధ్ర కవి తరంగిణి సం. 14, పు 189-209.

## అయిదవ ప్రకరణము

# వేదాంత సబంధ కావ్యములు

## [ఎ] శైవమత సంబంధములు

### వీరశైవ దీక్షాబోధ

గ్రంథకర్త పిడుపర్తి బసవకవి, పిడుపర్తివారు మొదటి నియోగి బ్రాహ్మణులు అనంతర కాలమున వీరు పాల్కురికి సోమనాథుని శిష్య ప్రశిష్యులై వీరశైవులైరి సోమనాథుని శిష్యుడయిన శివరాత్రి కొప్పయకీ బసవకవి మనుమని మనుమడు ఈతని కుమారుడయిన పిడుపర్తి సోమనాథుడు తన పద్య బసవ పురాణమున, తనతండ్రి శీలాదికములను వివరింపుచు, నారదు దీక్షాబోధను, పిల్లవైనారు కథను, బ్రహ్మోత్తర ఖండమును రచించినట్లు చెప్పెను గాని, నేడు గురుదీక్షా బోధతప్ప తక్కిన గ్రంథము లెచ్చటను గనుపట్టుట లేదు పిల్లవైనారు చరితను చెప్పినట్లే గ్రంథమున కూడ నీతడు చెప్పుకొనెను (పుటః౭)

వీరభూపాలుని యాదేశానుసారముగ నీకవి యీ గ్రంథమును రచించెను కర్ణాట దేశమునుండిన దేశికుడొకడేగుదెంచి కెరియ పద్మరసు సంస్కృత కన్నడములందు రచించిన దీక్షా బోధను తెనుగు జేయింప వలెనని కోరగా, వీరభూపాలుడు పిడుపర్తి బసవన కాకార్యము నప్పగించినాడు కన్నడమున పద్మరసు దీనిని రగడగా రచించెను ఈ వీరభూపాలు డే ప్రాంతము నేలినవాడో కవి చెప్పియుండలేదు ఇతని తండ్రి తిమ్మశౌరి యనియు, తాత వీరబాణుడనియు సూర్య వంశీయు డనియు, భారద్వాజ సగోత్రుడనియు మాత్రమే కవి చెప్పెను.

శివుని పూజించుటకు దీక్షార్హుడు కావలెను దీక్షారహితుడు లేక అదీక్షితుడు శివుని పూజించినచో బాపమని శివుడు శివరహస్యము నందానతిచ్చినాడు.

గురుపు లేక పూజించినచో నట్టి స్థలమున నుంత రాదని శివుడు తొలగి పోవును.

శివదీక్షను బడయుగోరువాడు భవులు గావించిన అన్నపాకములను భుజింపక, భవులైన తల్లిదండ్రులను విడువ వలెను. లింగమును ధరించిన పిమ్మట తీర్థముల కేగి మోక్షమును కోరుకొనుట వ్యర్థము అన్యదేవతలను జూడరాదు, భజింపరాదు. అట్లొక వేళ పూజించినచో శునక కాకాది జన్మల నొందును తనువున లింగమును ధరించి దాని నెపుడును విడిచియుండరాదు. ఒక వేళ నదె ప్రమాదవశమున పతితమైనచో ప్రాణములను విడుమట నీతి. దీనికి ప్రాయశ్చిత్త విధులు లేవు. శివదీక్షితునకు తరువాత ముఖ్యమగు విధి జంగ మార్చన శివముద్ర గలవా రెల్లరును పరమ జంగములని భావించి, వారి కెల్ల వేళల సపర్యలు జేయవలెను

గురువునందు భయభక్తులను గలిగి, గురువునకు, నీశ్వరునకు భేదము లేదని ఎరుగవలెను శంభుడే నరరూపమున నిల్చిన గురువుని భావింపవలెను తనకంటె పూర్వము దీక్ష గైకొనిన వానిని గురువుగా భావింపవలెను గురు వాక్యము శిష్యునకు మంత్రమూలము, ముక్తి మూలము

ఒకపుష్పములోని ఒక దళముతో శివుని పూజించినచో నాత డమరేంద్ర భోగముల నొసగును ఇట్టుండ పుష్ప వితానములచే పూజించువారికతడు సాయుజ్య పదము నొసగకుండునా? కాబట్టి అస్థిరమగు కోరికలను గోరి కాలము వృధాగావింపక హరునిజేరు ఉపాయమును చింతింపవలయును సన్మార్గానువర్తి యగుటకు గురు ప్రసాదము కావలయును గాన, గురువును జేరి ప్రేమతో గొలిచి నచో, గురువతని శక్తిసామర్థ్యముల నెరిగి, పాత్ర మెరిగి యుచితమగు పథ మున నిల్పును.

వీరశైవ సిద్ధాంతమున షట్ స్థల జ్ఞానము ముఖ్యమైనది ఈ షట్ స్థలములును, భక్తస్థలము, మాహేశ్వరస్థలము, ప్రసాదస్థలము, ప్రాణలింగ స్థలము, శరణస్థలము, ఐక్యస్థలము, ఈ ఆరు స్థానములను వీరశైవుడు భగవంతుని పొందు మార్గమున కారు సోపానముల వంటివి.

శైవభక్తి సముత్పన్నమైనవాడు. ఈ భక్తుడు తానాచరింపవలసిన ధర్మమును తెలిసికొని భగవతుంని దరిచేరవలయునను జిజ్ఞాసను గల్గి యుండుట భక్త స్థలము

నిష్పాపరుడై, శివతత్పరుడై బ్రహ్మాది స్థానములయందు వైముఖ్యము గల్గియుండువాడు మాహేశ్వరుడు భక్తి వైరాగ్యమును గల్గియుండి, వ్రత నియమాది కర్మలను నిష్ఠలకు నాచరించుచు, పూర్వస్థలముకంటె నెక్కుడు భక్తిని గల్గియుండుట మాహేశ్వర స్థలము.

ప్రతి వస్తువును శివుని ప్రసాదముగ స్వీకరించుట ప్రసాద స్థలము. పాప విదూరుడై మనః ప్రసాదమును గల్గియుండుట యని భావము. ఈ మువ్వురు భక్తులు కర్మ ప్రధానులు. వీరు పూజాది కర్మలకు ప్రాధాన్యము నొసగుదురు

చిదాత్మకమైన లింగ స్వరూపమును దెలిసికొని దానిని ఆత్మగా అంతర్జ్యోతిగా నెరుంగుట ప్రాణలింగస్థలము ఇట్లు తెలిసికొనిన వాడు ప్రాణలింగి.

శివుని యందు సర్వాత్మనా శరణు భావము గల్గి, శివుడు పతియనియు తాను సతి ననియు భావించుట శరణ స్థలము.

ద్వైత భావము నశించి భక్తుడు శివునియందు సంపూర్ణముగా నైక్యము నొందుట ఐక్య స్థలము ఇట శివునకును భక్తునకును భేద ముండక శివాద్వైత సిద్ధి సంప్రాప్తించును

శైవ దీక్ష లన్నిటి యందును లింగధారణ దీక్ష యుత్తమోత్తమమయినది. శివుడు నిరాకారుడగుటవలన అతని పూజించుట యెట్లని శిష్య జను లడుగగా, సద్గురుడు వారికి మోక్షము నొసగదలచి, ఆ శివుని దివ్య లింగాకృతిగా జేసి శిష్య సంతతి కొసగినాడు

ఈ లింగ మారు విధములగు నామములచే నొప్పుచున్నది. అది ఆచార లింగము, చరగురు లింగము, శివలింగము, జంగమ లింగము, సత్యప్రసాద

లింగము, మహాలింగము ఈ షడ్విధ లింగములును, 'భక్త మహేశ ప్రసాది ఘనతర ప్రాణ లింగైక్య శరణైక్య లలిత' యను షట్ సంఖ్యలచే నొప్పారుచున్న భక్త్యంగముల ననుసరించి యుండి, షడ్విధ భక్తులను గొల్చుట కనువుగ నున్నవి భక్తుడు తన యధికారమును గుర్తించుకొని పూజింపవలెను

శివపంచాక్షరీ మంత్రమునకును లింగమునకును భేదము లేదు. హస్తమున నొసగబడినది లింగమనియు, కర్ణమున జెప్పబడినది మంత్రమనియు భావింపక పరమ శివుని యొక్క స్థూల తనువు లింగమనియు, సూక్ష్మ తనువు మంత్రమనియు నెరుగవలెను. లింగ మంత్రములు వాచ్య వాచకములుగ నుండునని శివాగమములు జెప్పుచున్నందున, మంత్ర లింగముల నొక్కటిగా నమ్మి భజింపవలెను మరియు స్వామికి, యిష్ట ప్రాణ భావ లింగములను నామములు గలవు శివుని త్రికాలములను పూజింపవలెను శివుడు లీలార్థ మీ ప్రపంచమును, జీవులను సృజించి, జీవులందు కళాస్థితినంటి యున్నాడు ఈతడు జీవులగంటికి గానరాక, ఘటజలాగ్ర తైలబిందువువలె జీవుల మూర్థము లందుండును.

ఈ కవి తాను సోమనాధుని శిష్య ప్రశిష్యుడనని ఆశ్వాసాంత ద్విపదల యందు జెప్పికొనినాడు.

"ఆనియిట్లుకెర్వ పద్మార్యపురాణ
వినుతాగమ గ్రంథ వితతుల సాక్షి
గా విలిఖించి దీక్షా విధానంబు
గావించె రగడగా గర్ణాటభాష
నప్పరమార్థంబులను భవ మెరగి
చెప్పంగ ద్విపద జేసితి నేర్చినట్లు
యిది పాలకురికి సోమేశ్వరారాధ్య
సదమల శిష్య శిష్య ప్రశిష్యుండ
సకలమాహేశాంఘ్రిజలజ షట్పదుడ
సుకర శైవాగమ సూక్ష్మార్థవేది

సవిమల త్రివిధ ప్రసాద సుఖాను
శివ పూర్తి పిడుపర్తి బసవనాహ్వాయుడు

## యో గీ శ్వ ర వి లా స ము[1]

అముద్రితము

ఈ అముకృతికర్త సిద్ధేంద్రయోగి ఈతనినే దూదేకుల సిద్దప్ప యని కూడ నందురు ఈతడు శివకవుల సంప్రదాయము ననుసరించి తన తలిదండ్రులను గూర్చిగాని, వంశాదికిమునుగూర్చిగాని నేమియు చెప్పికొనలేదు. బాల బ్రహ్మలింగ (బాలబ్రహ్మేశ్వరము శ్రీశైలపాద క్షేత్రము) కృపాలబ్ధ కవితా సంపన్నుడని 'లీలబాలబ్రహ్మ లింగ విగ్రహవి శాలకృపాలబ్ధ సత్కవిత్వంబు చెప్పదొడగినాడు.

ఈతడు క్రీ శ 1750 ప్రాంతము వాడయి యుండునోపును, కాలజ్ఞాన వచనములను రచించిన సుప్రసిద్ధ పోతులూరి వీరబ్రహ్మంగారికి అత్యంత ప్రీతిపాత్రుడయిన శిష్యుడు దూదేకుల సిద్దప్ప" పోతులూరి వీరబ్రహ్మంగారు 17వ శతాబ్దమున నివసించియుండిరి అతని శిష్యుడయిన సిద్ధప్ప 18వ శతాబ్ద పూర్వార్థమున నుండెనని భావింపవచ్చును

ఈతడి వేదాంత గీతికలుకూడ పామర జనులలో వ్యాప్తినొందినది ఆ సిద్ధప్ప దూదేకుల సాయబు అని సామాన్య జనము తలంతురు కాని అతడు దూదేకుల సాయబు కాడు లింగాయత మతస్థుడు. యోగీశ్వర విలాసమును మాత్రమే గాక, అనేక పాటలనుకూడ రచించినట్లు చెప్పుదురు "బాబిత్ఖాను" అను మహమ్మదీయునకు శైవమత దీక్షనిచ్చి యా శిష్యునితో సహపంక్తి భోజనాదికము చేయుటచే నీ సిద్ధ యోగిని పామరజనులు సిద్ధప్ప యనియు, స్థూల దృష్టికి భ్రష్టుడుగాన దూదేకుల వాడనియు చెప్పుచుందురు, ఈతడు వ్యవసాయము చేసి ప్రత్తి పంగించుచుండుటచే దూదేకుల సిద్ధప్ప యను నన్వర్థ

---

1. బులటిన్—మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారము డి నెం 1177
2. ఆంధ్ర వాగ్గేయకార చరిత్ర, పుట, 454

నామము గల్గినది గాని, యాతకు నిజముగ దూదేకుల కులస్థుడు గాదసికొందరి మతము, ఈతడు కర్నూలు మండలము నందలి "నందికోట్కూరు" నివాసి. ఇచట ఇప్పటికిని నాతని బందుగులు గలరట "బొబిత్సాను' నానతిపైననే" బాల బ్రహ్మేశ లింగమునకు ఈ గ్రంథము నంకితము గావించెనట సిద్ధప్ప పీరు సాహెబు, అదంబీపీ కుమారుడని రజనీ కాంతరావుగారు వ్రాసిరి[3]

శైవ వాఙ్మయమున సుప్రసిద్ధుడైన అల్లమ ప్రభువు అక్కమహాదేవికి బోధించినట్లుగ శివయోగ సంప్రదాయమందు వర్ణింపబడినది

ఒకసారి కైలాసమును మించియున్న కల్యాణ పురమందు అల్లమ ప్రభువనుభవ గోష్ఠిలో నుండగా, అక్కమహాదేవి స్వామి వద్దకు వచ్చి, తనకు తత్త్వోపదేశమీయమని వేడగా, నామెననేక విధముల పరీక్షించిన పిమ్మట ప్రభు వందులకియ్యకొనెను ఆమె యందున్న త్రిమలములను పోగొట్టి, హస్తమస్తక సంయోగమున నామెకు దీక్ష నొసగి, పింగళ నాడుల స్వరూపము, పంచముద్రల లక్షణమును వివరించినాడు

అమృతత్వము సిద్ధించు మార్గమును దెల్పెదనని, రాజయోగము నల్లమ ప్రభువు దెల్పెను రాజయోగౌత్కృష్ట్యమును దెల్పిన పిమ్మటనది సాంఖ్యము, తారకము, అమనస్కములచే త్రివిధములుగ నుండునని వాని స్వరూపములు వివరించినాడు

జాగ్రత్స్వప్న సుషుప్తి, తురీయాద్యవస్థలకు సాక్షి భూతుడై పరమేశ్వరుడుండు ననియు, తురీయావస్థలో పరమేశ్వరుడొక్కడే చిన్మయుడై కేవలానంద స్వరూపముతో రమించుచుండుననియు ఉపనిషదాదులలో చెప్పబడిన విందు చక్కని సులభమగు ద్విపదపంక్తులలో సుబోధము గావింపబడినది ఇట్టి పరమాత్మకును నీకును భేదములేదని యెరిగి, తరంగ రహితమగు సముద్రము వలె, నిశ్చలమతివై యవస్థాతీతురాలవైనచో నిర్వాణ విలాసము ననుభవింతువని అల్లమ ప్రభువు శిష్యురాలి కుపదేశించెను.

---

3 ఆంధ్ర వాగ్గేయకార చరిత్ర పుట, 454

సర్వము పరమేశ్వరార్పణముగా జేసి, ఈ ప్రపంచమందలి సర్వమును లింగ మయముగా భావించి శివుని సర్వాత్మగా భావించి పూజింపవలెను. అపుడు మోక్షము కరతలా మలకమగును,

గురూపదేశమును విని పిమ్మట స్వామి పద కంజములకు మ్రొక్కి ప్రస్తుతింపగా, అల్లమ ప్రభు వామెను శ్రీ గిరి కేగి, అచట పాతాళ గంగా తీరమున నివాస మేర్పరచుకొమ్మని చెప్పెను ఆమెయు, మరణ జన్మాది దుర్మాయలు గెలిచి, శ్రీ శైల కూటాగ్రమునందలి పాతాళ గంగా తటమున నాక బిలమువద్ద నివాస మేర్పఱచుకొని శివజ్ఞానానంద రసవార్ధిలో తేలి యాడు చుండెను శ్రీశైలము శైవ పంచాచార్య సింహాసనములు గల క్షేత్రములలో నొకటి ఈ కవి యచటి యాచార్యుని యొద్ద శిష్యుడై యుండి యుండును. అందువలననే అక్క మహాదేవిని శ్రీశైలమున కేగమని ప్రభువు చెప్పినట్లు రచించెను,

ఇందలి శైలి సామాన్య జనుల కర్థమగుటకై సుబోధమై సమాసదూరమై, మధుర మంజుల మై యలరారుచున్నది ప్రసన్నముగను, ధారావాహినిగను నుండి, చదువునపుడు హాయిని గొల్పుచున్నది గహనమగు విషయములను కూడ నెంత చక్కని సలభమగు మాటలలో పొదిగించినాడో చూడగలము

"...తస్యమధ్యే వహ్ని శిఖా అణీయోర్ధ్వా
వ్యవస్థితః నీలలోహిత మధ్య స్థాద్విద్యుల్లేఖేవ
భాస్వరా, నీ వార శూక వత్తన్వీ, పీతా భాస్వ
త్యణూపమా, తస్యా శ్శిఖాయ మ ధ్యే
పరమాత్మా వ్యవస్థితః" ఇత్యాది ప్రవచనమును,
"అట్టి హృత్పంకే రుహము తుద ముట్టి
చట్టంపు నీలకంధరము మధ్యమున
గనుపట్టి మెరుపు సంగతి వరిముంటి
కొనరీతి సన్నమై గురుతుగా నిలిచి
యణు తుల్యమై పీరమై భూతలమున

ప్రణుత మంత్రాధార భావంబు దాల్చి
చెలువారు పాచక శిఖిదానిమీద
వెలుగు శంకరుడు సంచిదూ్రిపలీల

ఒక్కొక్కప్పుడు చక్కని యుపమానములను గూర్చి విషయమును సుబోధముజేయున మూడు మలములను పోగొట్టుకొనిననే గాని దీక్షార్హుడు గాడు మలములతో గూడియున్న వానికి దీక్ష నొసగినచో బీడునేలయందు వేసిన పైరువలె నిష్ప్రయోజన మగును

''యువతి మూడు మలంబు లున్నవారలకు
శివ దీక్ష మెచ్చి యిచ్చిన నేమి ఫలము
నేరుపుతో బీడు నేల రాజనము
పైరు వెట్టిన రీతి భాసిల్ల దనిన''

రాజయోగమును గోరి జనులు ప్రపంచము నందలి ఇతర విషయము లందాసక్తులు గారు ఈ సందర్భమున కవి రచించిన, ద్విపదలు, సోమరాధుని ''క్షీరాబ్ధిలోపల గ్రీడియ హంస, గోరునే పడియ నీరు ద్రావంగ'' మొదలుగా గల ద్విపదలను బోలి రమ్యముగా నున్నది

''తమ్మి మొత్తమ్ము చెంత చరించినట్టి
తమ్మి వోపునే ధూత్తూరములకు
దే రేని వెలుగు కోరెడి చకోరంబు
చేరునే దట్టంపు చీకటి కెపుడు
నెఱి బాల కదలి బొండిన మానునొక
మరగునె ధరగొంచమైన చెర్వులకు
లలిత మాకంద ఫలాస్తోక రసము
పలుమారు గ్రోలి వైభవమున సోలి
నెగడిన శుకమేగునే కొడిసిలకు
మిగులంగ నీ కృపా మేఘ బలంబు

ద్రావిన చిత్త చాతక పక్షి చనునె
యీ విశ్వమున జెంది యితర వాంఛలకు ?"

ప్రాథమిక శివ కవులు గావించిన ఛందో వ్యాకరణాది దోషములిందు గానరావు. ద్విపదకు ద్విపదకు తెగజెప్పు నియమ మిందు పాటింపబడినది

## మ నో బో ధ[4]

అముద్రితము

వేదాంత విషయ ప్రతిపాదకమగు నీ గ్రంథము ప్రాస నియమము లేని మంజరీ ద్విపదయందు కొలని గణపనారాధ్యునిచే విరచితమైనది ఈ కొలని గణపనారాధ్యుడే 'శివయోగసార' పద్య కృతికర్త 'మనోబోధ' యందు శివ కవుల సంప్రదాయము ననుసరించి తన కులగోత్రములను, వంశాదికములను చెప్పికొనలేదు గాని శివయోగసార కృత్యాదినిబట్టి యాతని వంశాదికములు గొంత దెలియుచున్నవి

శివయోగ సారము నీతడు తనకు మేనమఱదియు, గురువు నగు ఈడూరి నూకనారాధ్యునకు కృతి యొసగెను అతడు తనను రావించి చెప్పినట్లుగ కవి కృత్యాది యందు రచించిన ఈ క్రిందిపద్యమువలన, కవియొక్క గోత్రాదికములు తెలియుచున్నవి

"తన మేనమఱదియు దన శిష్యుడును లోకమాన్యుడైన
కౌండిన్య గోత్రు
సురుచిరాపస్తంబ సూత్రుని సిందులూరన్నయదేవుని
యన్నమనువ
గన్నయ రుద్రభూకాంతుని గణపతి దేవుని యాదిమూర్తికిని సద్గు

4 బులటిన్—మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము, సం 3, 1950 డి నెం. 2151-2152.

ణాస్పదయగు లక్కమాంబకు పుత్రుని దినమొప్ప గణపతి దేవ విభుని
సహిత గుణ ఫల్గు రాయ చౌహత్త మల్లు, నళినవాకారు ధీరు నన్యాంగనా స
హోదరుని నన్ను రావించి యుదిత వృత్తి, నస్మదీయ ప్రణామంబు లాదరించి."

ఈతడు నియోగి బ్రాహ్మణుడు ఆపస్తంభ సూత్రుడు. కౌండిన్య గోత్రుడు. తండ్రి యాదిమూర్తి, తల్లి లక్కమాంబ, తాత గణపతి అతని తండ్రి రుద్రదేవుడు ఈ గన్న యను మనుమగన్న యని యందురు ఈమనుమ గన్నయ రుద్రదేవుడు ఇందులూరి యన్నయ కగ్రజుడు ఈతడు గ్రంథ రచనా కాలమును గూర్చి జెప్పి యుండలేదు కాని ఈ కొలని గణపతారాధ్యుని ముత్తాతయైన రుద్ర దేవుడు ప్రతాపరుద్ర దేవుని వద్ద మంత్రిగా నుండెను మరియు నీతడిందులూరి యన్నయమంత్రి (రుద్రాంబ కుమార్తె రుయ్యాంబను వివాహమాడి, రుద్రాంబవద్దను ప్రతాపరుద్రునివద్దను మంత్రిగా నుండెను) కన్న మనుమడు ప్రతాపరుద్రుడు 1296-1323 వరకు పాలించినట్లు తెలియ నున్నది గావున, నితడు క్రీ శ 1400 ప్రాంతముల నుండెనని ఊహింపవీలగు చున్నది "వీరేశలింగము పంతులుగారు కవిని ఆధునికులలో జేర్చి యిన్నూరు సంవత్సరములకు ముందే యుండిన వాడయిన ట్లూహింపతగి యున్నాడని వ్రాసిరి శివయోగ సార కృత్యాది వారికి లభించి యుండనందున వారట్లువ్రాసి పేర్కొనియుందురు. వారికవిని యాది గణపతి దేవుడని పేర్కొనుటపొరపాటే."[5] ఈతని తాతయగు గన్నయ రుద్రదేవుడు కొలని ప్రాంతమును (నేటి ఏలూరు ప్రాంతము) పాలించుట వలన నీ వంశము వారికి కొలనివారను పేరువచ్చినది

శివయోగ సారమునకు పూర్వమే ఈతడు మనో బోధను రచించినట్లీ క్రింది శివయోగసారములోని పద్యము వలన తెలియుచున్నది,

---

5 ఆంధ్రకవి తరంగిణి, సంపుటము 5, పుట 261

క. పశుపాశ పరిజ్ఞానము
ను శరీర భవ విజయ మనో బోధమునా
విశదములగు నీ కృతు లస
దృశ గతి చెప్పితిని దేశి తెనుగున దెలియన్"

కవి మనస్సును సంబోధించుచు, విషయ లంపటము గాక శివ భక్తి యుక్తముగావలెనని చెప్పినాడు. భగవద్గీత, ఉపనిషత్తులయందు చెప్పబడిన వేదాంత విషయములను సామాన్య జనులకును బోధమగునట్లుగా, సులభశైలిలో విశదీకరించినాడు

హృదయ పద్మమున నీశ్వరుని స్థిరమగుభక్తితో నిలుపుకొని విజ్ఞానమను దీపమును వెలుగజేసి, శాంతిధారలచే నభిషిక్తుని గావించి అష్టతనూభవుడైన లింగమూర్తిని అష్టపుష్పముల పూజించి, నిర్మలమైన నుచ్ఛ్వాస నిశ్వాసములను (అనగా ప్రాణాయామముచే) కర్పూర హారతులచేతను, ధూపముచేతను నీశ్వరుని అర్చింపవలెను

పూజ లెట్టివి జేసినను నిబ్బంది లేదు. భక్తిభావమే ప్రధానమైనది స్థిర మగు భక్తి భావ ముండినచో పూజ లేవిధముగజేసినను తప్పలేదు పూర్వము కన్నప్ప పుక్కిట నీటితో శివుని జలకమార్చి మాంసపు ఖండములను నివేదన మొనర్చి కలకంఠుని గూడినాడు

ఈ మానవ శరీరము నశ్వరమైనది దీనిని నమ్ముకొని అనశ్వరమైన పర తత్త్వమును విస్మరించరాదు.

భావాతీతుడును, రూపవర్ణనాది రహితుడునునగు పరమేశ్వరుడు అను మానమున్నచో గానరాడు. "అనుమాన ముడిగిన కాని హరుని గానరాడు"— "సంశయాత్మాది వినశ్యతి" అనికదా ప్రమాణవాక్యము! అచంచలమైన విశ్వాస ముంచవలెను,

ఈతడు రచించిన ఈ క్రింది ద్విపదలలో పోతనగారి "అంధేందూదయ ముల్" అను పద్యమునందలి భావము దొర్లిపోయినవి ఇతడును పోతనయు

సమకాలీనులు. అందువలన నీతడు పోతన ననుకరించెనని చెప్పుట కష్టము ఒకే భావ మిర్వురి మహానుభావుల హృదయము లందును కల్గియుండవచ్చును.

"సకల వేదంబులు సకల శాస్త్రములు
చదవని నజ్ఞాని సారమే మెఱుగు
అలరుల తావికి నలరు నే మిడత ?
మృదు శంఖనాదంబు మెచ్చునే చెవుడు ?
కొమరారు నృత్యంబు గోరునే చీకు ?
కస్తూరి వెదకునే గ్రామ సూకరము ?
వెలయు సౌభాగ్యంబు వెదకునే గూబ ?
తనరార చతురత దనరునే యెద్దు ?
పాపాత్మునకు నేల భక్తుని క్రియలు ?
సంసార మాయల చలనంపు తీపు
మఱగిన నింకేల మాటల యింపు ?"

మహో బోధయందు తన "కుర్వీపై కాంతా సహోదరు" డను విశేషణ మును చేసికొనెను. శివయోగ సారమున, "అన్యాంగ నా సహోదరు"డని గలదు శివయోగ సారగద్యలో "శ్రీ గురుచెన్న సదాశివ యోగీంద్ర పదారవింద మధు కరాయమాన నిరంతర శివభక్తి సమాధాన" యనిచెప్పికొని, యిందు, "పరశివ యోగీంద్ర పాదారవింద పరిమళ స్యందన భ్రమర పుణ్యుండని" చెప్పికొనెను.

గహనములగు వేదాంత విషయములను సామాన్యుల కర్థమగు శైలిలో రచించి, యెల్లరకును అందుబాటులో గావించిన కొలని గణపనారాధ్యుడు వంద నీయుడు.

## శి వ జ్ఞా న మ ం జ రి[6]

అముద్రితము.

కర్త పరమానంద తీర్థ యతి అనుభవదర్పణ మితని వేరొక ద్విపద కృతి. తన గురువయిన దత్తాత్రేయ యోగి పుంగవుని స్మరించి కావ్యరచన కుపక్రమించినాడు. లోక రక్షణార్థము, సిద్ధులొనర్చిన కావ్యములలోని సారము నంతటిని దెల్పుచున్నాననియు నీ రహస్యము సాధన చతుష్టయ సంపన్నులయిన యధికారులకు మాత్రమే నీయదగినదనియును దెల్పెను. ఇది శివాద్వైత బోధక మగు గ్రంధము

గురుకటాక్షము లేనిది పరబ్రహ్మ విద్య సిద్ధింపదు ఆ గురువును సర్వాత్మనా నమ్మి శరణు పొందిన వానికే కాని యితరుల కధ్యాత్మ విద్య నీయరాదు లోకమున గల్గు దుఃఖము లన్నిటికిని మూలము కర్మమే ఈ కర్మము సంకల్ప రూపమైనది కర్మ క్షయమైనదో నిర్వికల్పస్థితి సిద్ధించును సంసారమును త్యజించి తిరిగినంత మాత్రాన సిద్ధి లభింపదు. విడువ వలసినది మమకార, ఆసక్తులుగాని శిఖాసూత్రములు గావు పిమ్మట అన్ని వేదాంత గ్రంథములందు వలెనే నిందుగూడ, పిండోత్పత్తి క్రమము శారీరకధర్మములు మాయ ఆవరించు విధానము రాజయోగము మొదలగునవి దెల్పబడినవి

ఈ కవి కపట సన్యాసుల యెడ తన నిరసన నొకటి రెండు స్థలములందు సూచించినాడు

"తమ్ము దామెఱుగ రధ్యాత్ములు గాన
మమతలు విడువ రున్మద చిత్తులగుచు
పూని శిఖాసూత్రంబులు దెంచివైచి
జ్ఞానుల మను గొని కపట మార్గమున

---

6. శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ గ్రంధాలయము.
   ఆర్ నెం. 194-కాగితప్రతి.

కావి గోచులు కట్ట కపటముల్ విడిచి
వావిరి నిస్పృహత్వము గల్గినట్లు
పరగహ్వారంబులు భావించుకొనుచు
పరగ గుహోత్యోదర పారీణులగుచు
పూర కోగుల రీతి నూరూర దిరుగు
వారి కెక్కుడిది నిర్వాణ పదంబు."

పై ఉదాహృత ద్విపదల వలన నీతని శైలి సరసముగ నున్నటులు దెలియ నగును.

## ఆత్మైక బోధము[7]

అముద్రితము

ఇది శివాద్వైతమును బోధించు వేదాంతగ్రంథము. లింగ గురుని శిష్యుడగు యోగానందావధూత బుద్ధియను చెలికి వేదాంత రహస్యములను బోధించినాడు. ఈ యోగానందావదూత స్వామియే 'గురుశిష్యసంవాదమ' ను వేరొక ద్విపద కావ్యమును (ఆర్. నెం 98) రచించెను అందాతడు పరమానంద శతకమును గూడ రచించినట్లు చెప్పికొనెను. ఈ గ్రంథమున తన కుల గోత్రాదికములను గూర్చిగాని, తల్లిదండ్రులను గూర్చిగాని ఏమియు చెప్పికొన లేదు. లింగ గురుని శిష్యుడని మాత్రమే చెప్పెను

"శ్రీ లింగగురునాజ్ఞ చిత్తంబులోన
భావించి యతనినే పట్టి కలయుచు
సావధానత పొంది సకియరో నేను
అతని యాజ్ఞ ధరించి యాత్మైకబోధ
విదితము లెస్సగా వినుపింతు మఱియు"

---

7 శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాసంస్థ గ్రంథాలయము, డి. నెం 2063, (ఆర్ 6 (సి)

ఇంద్రియలోలత చేతను, ఆశాతృష్ణల చేతను, మానవుడు తన స్వస్వరూపమగు నాత్మను తెలిసి కొనలేక దుఃఖితుడగు చున్నాడని దెల్పి, దేహోత్పత్తి జ్ఞానేంద్రియ కర్మేంద్రియముల గుణములు, పంచవింశతితత్వములు, మొదలగువానిని దెల్పి, యివి యన్నియు, బ్రహ్మ స్వరూపము గావనియు, అది వీనికంటె భిన్నమైనదనియును, దెల్పినాడు ఆ పరమాత్మను ఉపనిషాదాదులనేక విధములుగ వర్ణించియున్నవి నీలతోయద మధ్యస్థమైన విద్యుల్లేఖ వలె నుండు ననియు, శుక్ల కృష్ణ మూల మనియు. (పురుషం కృష్ణ పింగళం) ఉత్తమ పురుషుడనియు అతురుడనియు వర్ణింపబడిన ఆ పరమాత్ముని తెలిసికొని ముక్తిని బొందవలెను.

తాను నే ననెడి భ్రమను పొగొట్టుకొని అహంకారమును తొలగించు కొనినచో, తానే పరబ్రహ్మమగును ఇది అనుభవమువలన గలుగునది దీనివలన స్వరాజ్య సుఖ విభవమను భవమగును 'తత్వమసి' వాక్యార్థము నెఱిగి, బ్రహ్మ పదార్థము తానేయని తెలిసికొనవలెను కాని కొందరదితెలియలేక, పుడమిపైగల తీర్థముల నన్నిటిని సేవించి, రాళ్ళు రప్పలను గొలిచి. నదులలో మునిగి అదియే సాధ్యమని తలంతురు కాని దానివలన ముక్తి లభింపదు అది సాధనము మాత్రమే గాని సాధ్యము గాదు ఇదియే సాధ్యమని భావించినచో, జనన మరణముల చక్రములో తగుల్కొనుట తప్పదు కావున నీ రూపును నిజముగ నెఱిగి, అసత్య పథమును జేరవలెను

కొందరు తమతమ మతములే గొప్పవని పోరాడుకొందురు అది ఈ విధముగ నుండును

"కరి శౌచ భంగిని వ్యర్థ మగును
కరి కపిత్థ న్యాయకంబునైయుండి
అడవి గాచిన వెన్నెలట్లై పోవు"

# గురుశిష్య సంవాదము[8]

అముద్రితము

కర్త యోగానందావధూత స్వామి, గ్రంథాదిని గురుస్తుతి గావించి, రచన కుపక్రమించినాడు

'అమర యోగానంద అవధూత స్వామి
నగునట్టి నేను నాలింగ గురుని
జిగియైన యాజ్ఞను శిరసావహించి
గురుశిష్య సంవాద గురుతర ద్విపద
విరచింతు లెస్సగా విస్తరముగను"

గురుశిష్య సంవాద రూపమున నున్న నీ గ్రంథమున, గురుసేవా విధము, వైరాగ్య పద్ధతి, షోడశ వికారములు షడూర్ములు, గుణత్రయవిభాగము, పంచకోశపద్ధతి మున్నగు విషయములు వివరింపబడినవి పరమానంద శతకాదు లీతని గ్రంథాంతరములు.

వినయ భక్తి విశ్వాసముల నలవఱచు కొని గురువును జేరి అతని పాద పద్మములను పూజించి, పండ్రెండు మారులు మ్రొక్కి శరణు పొంది కుడితిలో బడితన్ను కొనుచున్న యెలుక రీతి, సంసార వార్ధిలో బడి మునిగి కొట్టు కొని పోవుచున్న తన్నుద్ధరించి కాపాడవలెనని వేడికొన వలయును అపుడు గురువు శిష్యున కభయ మొసగి జ్ఞాన బోధను చేయును.

గురు శబ్దమున గుకారమునకు, తమమగు మాయ యనియు, రు కారమున కా తమస్సును నాశ మొనర్చునదనియు నర్థములు, కాగా, అజ్ఞానమును నాశనము చేయువాడు గురువని భావము గురువుతో సేవస్తువును సమానము

---

8 శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ గ్రంథాలయము, ఆర్ నెం. 98 తాళపత్రము.

కాజాలదు కల్ప వృక్షము కూడ మనకు కావలసిన వస్తువుల నిచ్చునేగాని కల్పనాతీతమగు వస్తువుల నీ జాలదు గురువట్లు గాక, శిష్యునిజేరి తన రూపు నాతని కొసగి, కల్పిత వస్తువుకు గూడ జూపగలడు కాబట్టి గురునితో సాటియగు వస్తువేదియు నీయిలలో లేదు. గురువు లేక హరిహరాదుల కైనను మోక్ష సుఖములేదు 'నగురో రధికమ్మ' నియును, 'గురూపతరోర్నాస్తి' యనియు, స్మృతులు గురుని కొనియాడుచున్నవి గురుకటాక్షములేనిది కోటి జన్మములెత్తినను పరమపదము లభింపదు ఆకాశ చారికయగు ముద్రజూపి మహావాక్య తెరగును తెలిపి శిష్యుని పాపపుణ్యములను ఛేదించి కృతకృత్యుని జేయును. ఇది గురుని మహిమ

పిమ్మట వైరాగ్య పద్ధతిని గూర్చి చెప్పినాడు మలమూత్రాదులతో గూడిన నీ దేహముపై మమతను పెంచికొనక, ఆ మమత నంతటిని సర్వేశునిపై నిలప వలెను అపుడే అనిత్యమగు నీ సంసారమునుగాక, నిత్యమగు అనంత పదవి లభించును

పిమ్మట యోగమార్గమును వివరించి, ఈ మార్గమున పరమాత్మనెట్లు చేరుదురో యెట్లు చేరగలరో వివరించినాడు

అంతమున మనకు లక్ష్యమగు బ్రహ్మయొక్క గుణములు విపులముగ వివరింపబడినవి

## గురు శిష్య సంవాదము[9]

అముద్రితము

ఇది అసమగ్రము కర్తయెవ్వరో తెలియదు, శైవ వేదాంతమును ప్రతిపాదించు గ్రంథము మంజరీద్విపదలో రచింపబడినది దీని ప్రారంభ మీవిధముగ నున్నది:

---

9. మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము, డి నెం 2083.

"శ్రీ గురుమూర్తి నా చిత్తంబునందు
భావించి గురుజేరు భక్తిమార్గంబు
శ్రీగురు నాధుని చిత్తంబులోన
చేరి కొల్చెడి విధము చెప్పెద వినుడి"

గ్రంథాంత మిటుల గలదు:

"అది లెస్సగా నీవు అరసి చూడగను
చంద్ర బింబము పుట్టు చేచూచునపుడు
పండు వెన్నెల రీతి ప్రభగల్గియుండు
ఆ ప్రభ లోపల నశ్యంత మయిన
ఆపోజ్యోతి అయి అది యుద్భవిల్లు
ఆ జ్యోతి సర్వాంత యామియై యుండు
ఇదియె జీవన్ముక్తి యిది రాజయోగము
ఈ యోగ దృష్టిచే నిప్పుడు నీవు
యోజించి బ్రహ్మమై యుండు మీ వచ్చు

## గు రు బో ధ[10]

ఇది శైవ వేదాంత ప్రతిపాదక కృతి, మూడాశ్వాసముల గ్రంథము గ్రంధకర్త సోమన శివకవి యయిన వీరభద్రుని పుత్రుకు రేవణకు శిష్యుడు వీరశైవుడు ఆశ్వాసాంతమున తన్ను గూర్చి యీ విధముగ చెప్పికొనెను.

"గురు రేవణేశ్వరుకూర్మి శిష్యుండ
పరగ శివకవి వీరభద్ర తనయుండ
సువిధానమది సుతుడ సోముడన్వాడ

---

10 మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము డి నెం. 2081 కాగిత ప్రతి.

భువిలోన నీ గురు బోధకు నెలమి
చెలగిన మంగళ శ్రీల బెంపొందు

సంసార సుఖమే సుఖరసాయనమని అవ్యాజమోహమున బడి జన్మ పరంపర లలో బడి కొట్టు కొనుచున్న తన్నుద్ధరించి తత్త్వోపదేశమును గావింపమని శిష్యుడు వేడగా గురువు కృపాళుడై పంచతత్వములుదయించిన తెఱగు శరీర యింద్రియముల యొక్క తత్త్వము, జీవాత్మ పరమాత్మల స్వరూప స్వభావ సంబంధములను విశదీకరించి, తత్త్వోప దేశమును గావించెను

శివుని పంచవక్త్రములయిన సద్యోజాత, వామదేవ, అఘోర తత్పురుష, ఈశాన్య ముఖముల నుండి యేనక్షరములు జనించిః నమశ్శివాయ బీజాక్షరములై పంచాక్షరీ మంత్ర స్వరూపమును దాల్చినది ఇవి యెట్లనగా, వాసుదేవ ముఖమున సకారము, అఘోర ముఖమున మకారము తత్పురమునుండి శికారము, ఈశాన్య ముఖమున నకారము, సద్యోజాత ముఖమున యకారమును జనించినవి ఇందు నకారము పుడమి తత్త్వము, యకారము గగన తత్త్వము వకారము వాయు తత్త్వము మకార మగ్ని తత్త్వము శికారము జలతత్త్వము, ఈ పంచాక్షరీ మంత్ర సాధనచే జీవుడు జాగ్రత్స్వప్న సుషుప్త్యాద్యవస్థలను దాటి శివాద్వైతము నందినచో జ్ఞానసిద్ధి ఘుటిక సిద్ధి, మొదలగు సిద్ధులు లభించును కాని యీ సిద్ధులను, అర్థాదులను నాశింపక శివలింగ, జంగమ లింగ, ప్రసాదలింగ, మహాలింగ దేవులను భక్తితో పూజింపవలెను ఒక్క నిముసము కూడ ఏమరక, వీరదాసుడై, నిత్యవ్రతుడై వీర భృత్యుడై ధ్యాన సమాధులను నిల్పి శివమంత్రమును జపింపవలెను ఇది ప్రథమా శ్వాసమునందలి విషయము

ద్వితీయాశ్వాసమున పిండోత్పత్తి క్రమము, తృతీయాశ్వాసమున, ప్రాణ లింగాంగ భావము లింగస్థలములు, లింగసన్ముఖములు, లింగార్పితములు వర్ణింపబడినవి.

గురువుచే జ్ఞానమును బడసి, శిష్యుడు ప్రణవనాదమును గనుగొని.

"కంటిమి శ్రీపాద కమలంబులోన
కంటిమి నిజమూర్తి శోభిల్ల
కంటి మోంకారంబు వేడ్క తోడ
కంటిని అకార అకారంబు మరియు
కంటిని మకారంబు కంటి నాదంబు"

అని పొంగినాడు. ఈ యుదాహృత ద్విపదల వలన యీతని శైలి సరళ ముగ ప్రసన్నముగ నున్నటులు తెలియనగును. ఈ కవికాల మెరుగరాదు.

## సీత మాహేశ్వరాచార సంగ్రహము (రుద్రాక్ష మాహాత్మ్యము)[11]

అముద్రితము

ఇది సంస్కృతమయిన నీలకంఠ నాగనాధాచార్యుడను శైవాచార్యుడు రచించిన వీరమాహేశ్వరాచార సార సంగ్రహమను గ్రంధమునకు ద్విపదానువాదము .రచయిత పర్వతమంత్రి లింగనకవి బ్రౌను దొరగారీక్రింది విధముగ నీ గ్రంథమును గూర్చి వ్రాసికొనినారు

"This is one of the Aradhya or Semi Jangama works labouring to reconcile the creed of Basava with the various superstitions in vogue among Brahmins Such treatises seem to aim at reconciling the smarthas to the Aradhyas No wonder that the Jangamas reject such books as heritical Basava endeavoured to abolish the very customs herein inculcated particularly spells such as occur in pages 424"

మూల గ్రంధము 10 ఆశ్వాసములలో నీక్రింది విషయములు వ్రాయబడెను (1) విభూతి మహిమ, (2) రుద్రాక్ష మహిమ, (3) పంచాక్షరీ మహిమ, (4) హరనామ మహిమ, (5) శివరాత్రి మహిమ, (6) శంఖచ

11 మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము. 433 (సి) (20–36)

క్రోశత్తిం (7) మార్కండేయ చరిత్ర (8) విష్ణు శాప విమోచనము (9) శర భేంద్రు మహిమ, (10) వ్యాసశిక్ష.

తానీకావ్యమును గురువయిన శ్రీ మల్లికార్జునుని కృపచేరచించినట్లు చెప్పు కొనెను కావ్యాదిని చేయబడిన గురుస్తుతి వలన నీతడు మల్లికార్జున పండితా రాధ్యుని శిష్యుడని తెలియుచున్నది

'బెరసి దాక్షారామ భీమేశ్వరమున
హరు డయోనిజ రూపుడై యున్నవాని
వేదోక్త మార్గంబు వెస బ్రతిష్ఠించి
ఆది శ్రీగురుమూర్తియై యున్నవాని
అజ్ఞాన తిమిరంబు నవలీల బాపి
విజ్ఞాన దీపంబు వెలిగించు వాని

— —

ఆ రూఢి దగు మల్లికార్జున పండి
తారాధ్య దేవుని నమర సేవించి"

కాబట్టి యీతడు పండితారాధ్యుని ప్రత్యక్ష శిష్యుడైనచో 12 వ శతాబ్దమువాడై యుండును. అట్లుగాక పండితుని కాలము తర్వాత నతనిని కేవలము గురు భావమున పూజించిన వాడైనచో నతని తర్వాతి వాడై యుండునని మాత్రమే తెలియును ఎంతటి అర్వాచీనుడో చెప్పలేము

ఈతని గురువైన పండితారాధ్యుడు "మల్లికార్జున పండితారాధ్యుడు గాక, క్రీ. శ. 1800 ప్రాంతములో కుంటముక్కల తిమ్మయ వీరశైవాచార సంగ్రహ కృతి కర్తయగు గన్నయ మంత్రి గురువుగానున్న పండితారాధ్యుడు అట్లయిన నీతడు శ్రీ కృష్ణదేవరాయలకు కొంచెము పూర్వుడుగావచ్చునని"[12] శ్రీ నిడదవోలు వెంకటరావుగారు వ్రాసిరి. ఈతడు రుద్రాక్ష మాహాత్మ్యమును గూడ రచించెను.

## శైవ సిద్ధాంత శిఖామణి

ఇది వీరశైవ వేదాంత ప్రతిపాదకమైన గ్రంథము చతుర్థాశ్వాస పరిమితమైనది. కవి చెన్నాప్రెగ్గడ నాగేశ్వర కవి ఆత్రేయస గోత్రుడు ఈతని తల్లిదండ్రులు వీరభద్ర గురువాంబలు ఈతడు మల్లంపల్లి రామలింగారాధ్యుల శిష్యుడనని చెప్పుకొనినాడు

"జగతిపై మున్ను నిశ్చలతగా నాల్గు
యుగములకును శైవ యోగ పీఠముల
నలువురు రేవణ సిద్ధుడనగ
చెలువుగా నామరుల్ సిద్ధయ్య యనగ
... ... ...
గరిమ నేకోదాసు ఘనుని వంశజుడు
హరితస గోత్రులు పరమానంద యుతులు
ఒనర మల్లంపల్లి నుండుట జేసి
వసుపడి మల్లముపల్లి వారంచు
... ... ...
గురులింగ మాచార్య కులవరేణ్యుడు
పరగ మల్లముపల్లి భవ్య వంశాబ్ధి
రాజ బింబములో రామలింగంబు
రాజశేఖరు మూర్తి రాణిత కీర్తి"

ఇందు ప్రథమాశ్వాసమున పిండితా మహత్వము, గోపింద విజ్ఞాన మహిమ, సంసారగుణ హేయ చరితము, ఘోర సంసార హరము, దీక్షా ప్రకారము, లింగధారణ మహత్త్వము, భూతి ధారణము, రుద్రాక్ష ధారణము నను నేడు విషయములు ప్రతిపాదితములైనవి

ద్వితీయాశ్వాసమున నాది భక్తస్థల వ్యాఖ్యానమును, శైవ పంచాక్షరీ మహిమ, భక్తి ప్రియాచరణము, గురులింగ పూజ జంగమ పూజ, ప్రసాద

లక్షణము, సాంగదానత్రయ చరిత్రము ఒనెడి యంతరావాషస్థలాష్టకాఖ్యాన మంతయును గలదు

తృతీయాశ్వాసమున మాహేశ్వర స్థలము, నాంతర స్థలసప్తకాఖ్యాన మగుచు ప్రసాదస్థలము ప్రాణలింగ స్థలము, శరణ స్థలము నైక్యస్థల వివరణములు గలవు

చతుర్థాశ్వాసమున ఎనుబది యేడు లింగస్థలముల వివరణ గలదు

ఈ కవి 'గణ సౌజన్యాఖ్యాన' మను శతకమును కూడ రచించెనట.

## [ఖ] అద్వైత వేదాంత బోధకములు

### మాయా చిదానంద మంజరి[13]

అముద్రితము

అద్వైత వేదాంతమును బోధించు గ్రంథము కర్త నాదిండ్ల ఉమాపతి ఆత్రేయస గోత్రుడు, ఆరువేల నియోగి వేంగమాంబా శేషయామాత్యుల పుత్రుడు. వీరయకులజుడు

చిదానంద ఘనయోగి యను సిద్ధుడు స్వప్నమున సాక్షాత్కరించి సకల వేదాంత పరమ రహస్యములు బయలుపడునట్లుగ నొకకథను రచింపుమనినాడు

"శ్రీ కృష్ణా యదు భూషణా నరసఖా"

యను పద్యముతో గ్రంథారంభమును గావించి సద్గురుస్వామి పాదపద్మమును గొలిచి, గ్రంథ రచన కుపక్రమించెను ఇందుకూడ దేహోత్పత్తి క్రమము, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, కారణ సూక్ష్మ శరీరముల క్రమములను, దేవాదుల అనిత్యత్వము, ప్రపంచ సృష్టిక్రమము వర్ణితమైనది జన్మబంధములు తెగిన జీవుడమృతము త్రాగిన దాని రీతి తన్మయానందమును తరగక గలిగినవాడగును

ఈ సందర్భమున కవి చూడాంకోపాఖ్యానమును దెల్పి, ఈ వేదాంతార్థమును బోధమగువట్లు గావించెను చిదానందుడను రాజు వేటకేగి, అట అరణ్యమున నుండిన, మాయశాంభవి యను సుందరిని వివాహమాడి, తన స్వరూపమును మరచి. మదన సామ్రాజ్య సుఖమున దగుల్కొని ,యుండెను ఈతని మరల సన్మార్గమునకు గొనిరాదలచి, యీశ్వరుడొక మాయను పన్నినాడు

ఒక దినమున ఒక యోగి రెండు మహావాక్యములవలె నొప్పు నిర్వురు శిష్యులను రెండు వైపుల నిడికొని చిదానందుని యొద్దకేతెంచినాడు చిదానందుడు వారి కర్ఘ్యపాద్యాద్యుపచారములను గావించి పూజింపగా. నా యోగి రాజునకు వేదాంత విజ్ఞాన రహస్యములను బోధించి, మోహ భ్రమలను పోగొట్టి స్వస్వస్వరూపానందము ననుభవించునట్లు చేసినాడు

చిదానందునకుపదేశింపబడిన యద్వైత జ్ఞానము కావున, దీనికి మాయా చిదానంద మంజరి యను పేరిడి యుండును

ఈ గ్రంథమునందేమియైనను తప్పులున్నచో సరిదిద్దవలెననియును, తనకు రచనా జ్ఞానము లేదనియును, విజ్ఞానులందరకును విన్నవించుకొని తన విషయమును ప్రకటించుకొనెను

"ఉర్వి చిదానంద యోగి దావచ్చి
సర్వ వేదాంతాది సార సంగ్రహము
నలరి కావింపు మీ యన నేరనన్న
కల నానతిచ్చి నే గలనందు కనుచు
భావించి యతనిపై భారము వైచి
గావింప బూనితి గాక నా తరమె
గర్వించి పలుకుట గాదు నిశ్చయము
యుర్వి సర్వజ్ఞులు యొరసి మెచ్చుదురు
ధీరత నీ బోధ తెలిసి వ్రాకువ్వ
నెరనయ్య లకెల్ల నేనె(ను) మ్రొక్కెదను

కడగి తప్పొప్పులు గల వనేకములు
తడయక యవి దిద్ది దయజూడుడు
ముదమొప్ప కవులకు మ్రొక్కు గావింతు"

ఈతడు క్రీ శ 1460 ప్రాంతమందు నివసించెను.

## అ ను భ వ ద ర్ప ణ ము[14]

అముద్రితము

ఇది వేదాంత విషయమును ప్రతిపాదించు గ్రంధము కర్త పరమానంద తీర్థయతి చతుర్థాశ్వాస పరిమితమైన ఈ గ్రంధమున శివుడు కుమారస్వామి కద్వైక వేదాంతమును బోధించినట్లు వివరింపబడినది

పరమానంద తీర్థుడు తంజావూరి మండలమున జంపకారణ్యమున నివసించిన పరమహంస పరివ్రాజకాచార్యుడు "ఈతడు దత్తాత్రేయ గురు పరంపర లోని వాడై తెనుగు భాషలో నద్వైత వేదాంత ప్రతిపాదకములైన గ్రంధము లనేకములు రచించియున్నాడు ఆంధ్ర భాష యందద్వైత వేదాంత ప్రవర్తకులలో నీతడగ్రస్థానము వహింపదగినాడు" ఈతడీ ద్విపద కృతినేగాక శివ జ్ఞాన మంజరి యను వేరొక వేదాంత బోధక ద్విపద కృతిని గూడ రచించి నాడు సంపగిమన్న శతకము, ముక్తి కాంతా పరిణయ యక్షగానము, దత్తాత్రేయ శతకము, బ్రహ్మ విద్యా సుధార్ణవము వివేక చింతామణి, ఉపదేశక్రమ మును వచన కావ్యములు నీతని గ్రంథాంతరములు. తెనుగు వాఙ్మయమున దత్తాత్రేయ సంప్రదాయ ప్రవర్తకులలో నీత డగ్రగణ్యుడు ఈతడు క్రీ శ. 1590

---

14 దీని ప్రతి తంజావూరు సరస్వతీ మహలు పుస్తక భాండాగారమున గలదు

15 దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము, (ద్వితీయ ముద్రణము), పుట ౨౪౬

ప్రాంతమున నివసించినట్లు శతక కవుల చరిత్రవలన తెలియుచున్నది [16]

దత్తాత్రేయ గురువునకు నతులొనర్చి గ్రంథారంభమును గావించి నాడు.

"వేదాంత సిద్ధాంత విశ్రుత కాంత
నాదాంత రసవంత నయ పరిత్రాయ
తెలివి దత్తాత్రేయ దేశిక స్వామి
దలచి సేవించి కీర్తన లొప్పజేసి
యానందమున పరమానంద తీర్థ
మౌనీంద్రుడను మహామహిమ దీపింప
ననుభవదర్పణంబను మహాగ్రంథ
మనుపమ వాక్పాంధి మలర రచింతు"

ఆంధ్ర భాషయందద్వైత వేదాంత ప్రవర్తకులలో నీతదగ్ర స్థానము వహింపదగిన వాడని విమర్శకులు చేసిన సూచన, సత్యమైనది ఈతనివలెనింత కూలంకషముగ సూక్ష్మమగు వివరణలతో నద్వైత వేదాంతమును ప్రతిపా దించిన వారింకొకరు లేరనినచో నతిశయోక్తి గాదు అద్వైత వేదాంత సిద్ధాంత ముల నన్నిటిని వివరించినాడు ఇపుడు పరిశీలించిన యద్వైత వేదాంత ప్రబోధకమగు గ్రంథములలో కెల్ల నిదియే మేలురముగ నున్నది.

## అనుభవామృతము[18]

అముద్రితము

కర్త ఘట్టు పీరాఖ్యుడు ఈతని యిష్టదైవము వీరభద్రేశ్వరుడు. యాజ్ఞ వల్క్య, కుచేలోపాఖ్యానములను రచించిన కవి ఘట్టు ప్రభువను నాతడొకడు

---

16. శతక కవుల చరిత్ర (నూతన ముద్రణము) శ్రీ వి వెంకటరావు గారిచే పరిష్కృతము, పుటలు. 225—230

18 మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము, ఆర్ నెం. 2526—తాళపత్రము

గలడు. మరి యిర్వురకేమైన సంబంధము గలదేమొ తెలియరాదు సత్యభామా విజయకర్త"[19] యయిన ఘట్టు శేషకవి తాను ఘట్టు వీరార్యుని పుత్రుడని దెల్పి కొనెను.

"ఇది భ్రమరాంబా సమిద్ధ ప్రసాద
విదిత సాతస్వత విఖ్యాత ఘట్టు
వీర సత్పుత్ర నవీన సాహిత్య
సారాభిలాష శేష కవీంద్ర భవ్య
శేముషీ రచితమై చెలువగు సత్య
భామా విజయ మని..."

ప్రస్తుత మన గ్రంథకర్త ఘట్టు వీరాఖ్యుడు.

"ఇది ఘట్టు వీర భద్రేశ్వర దివ్య
పద పద్మ సేవాను బద్ధైక మాన
సాగ్ర ఘట్టు రాచయాహ్వ యానంద
నాగ్రజ్వర స గుంభనార్థోపమాన
సార కవిత్వ కౌశల చిత్త ఘట్టు
వీరాఖ్య సుకవీంద్ర విరచితంబైన
అనుభవామృత సారమందు భావింప
గరుత్వం పదార్థ లక్ష్యము..."

కాని, యిర్వురును సూత్ర గోత్రములను దెల్పుకొనలేదు. కావున, ఘట్టు శేషకవి ఈ గ్రంథకర్త పుత్రుడో కాడో కాడో నిశ్చయముగ జెప్పజాలము. కీ శే. శ్రీ వీరేశలింగము పంతులుగారు ఘట్టు ప్రభువు కాలమును క్రీ.శ 1750 ప్రాంతమని నిర్ణయించినారు,[20] ఒకవేళ నీ ఘట్టు వీరాఖ్యునకు పై ఘట్టు వంశీ

---

19 మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార—త్రైసియల్ క్యాటలాగు, నం 4.

20. ఆంధ్ర కవుల చరిత. సంపుటము 3—పుటలు 265-267.

యులతో నేమైన సంబంధముండినచో నీతడు క్రీ శ 19వ శతాబ్ద ప్రాంతమున నుండినట్లు చెప్పుకొనవచ్చును. లేనిచో నీతడెప్పటివాడో యెరుగరాదు

ఈ లబ్ధ గ్రంథము సమగ్రముగ లేదు. మూడు నాలుగైదాశ్వాసములు మాత్రమే గలవు. ఇందు తత్, త్వం, అసి, పదార్థముల వివరణతో కూడిన విషయములు వర్ణితములైనవి.

తృతీయాశ్వాసమున త్వం పద లక్ష్యము వివరింపబడినది దేహ కరణాది నికాయము లన్నియును దృశ్యమానములు, తత్సాక్షి దృక్, దృశ్యమానమగుచున్న కాయమాత్మగాదు ఏది సాక్షి భూతముగా నున్నదో అదే ఆత్మ. మేదో మాంస రక్తాదులతోగూడి, స్త్రీ పురుషభేదము గలిగిన యీ శరీర మాత్మకాదు. ఈ శరీరము కంటె భిన్నమైనది యాత్మ ఆ ఆత్మయే 'త్వం' పదార్థము త్వం అనగా నీవు నీవు అనబడుచున్నది శరీరముగాదు. మనస్సుగాదు బుద్ధిగాదు అహంకారముకాదు వీటినన్నిటికిని అది అతీతముగ నున్నది, అది వీటినన్నిటిని నెరుగునది అది స్వయం జ్యోతి, అది పరబ్రహ్మ ఆ బ్రహ్మయే నీవని తెలిసికొనవలెను

తత్ అనగా అది యని యర్థము. అది అనగా, పరబ్రహ్మ యనిభావము అది మాయాతీతము

అరిషడ్వర్గాదులను జయించి శమదమాదుల ద్వారా శాంతి దాంతులను సంపాదించి, ముక్తి మార్గమున బయనించి తన స్వస్వరూపమును తెలిసికొనుటయే జీవిత చరమ లక్ష్యము. స్వస్వరూప జ్ఞానమును బడయుటకు గురువు యొక్క బోధ యావశ్యకము ఈ గురువు మనయందుండు భ్రాంతులను పారద్రోలి, యవిద్యను నిర్మూలించి విద్యా వివేక సంపన్నులుగ నొనర్చి ముక్తి మార్గమునకు దారిని జూపువాడు ఇట్టి గురువు శంభునితో సమానుడు

ఈతడు వేదాంత గ్రంథమునే రచించినను, ఆయాతావులకు తగిన విధముగ జాతీయాదులను గూర్చి వీలయినంత రుచికరముగ రచించినాడు.

(1) "ముకుర మేటికి జూడ ముంజేతి సొమ్ము"

బ్రహ్మ నంటి విశ్వమున్నది గాని విశ్వము చేతగాని, మాయచేత గాని, బ్రహ్మ ఏ మాత్రము చెలింప బడదనుటకు,

"సూది రాతినంటి సూదులు తిరుగు
సూది రాతికిని దోచునే చలనంబు"

పాలు నీరులను హంస వేరు చేయు విధముగ మానవ బుద్ధి శాశ్వతా శాశ్వతములను వివేకముతో నెరిగి శాశ్వతమయిన దానిని లక్ష్యముగా నెంచు కొనవలెను

"నేరుపుతో పాలు నీరు రాయంచ
నేరుగా భావించు విధమున బుద్ధి
బుద్ధి మొదల లక్ష్యము దృఢముగ
విచారించి తుది నైక్య మొంద జెందు"

(ఇట గణ భంగమైనది)

## ఆత్మా సం ద ర స మం జ రి[21]

ఆముద్రితము

ఈ ద్విపద కృతికర్త శేషదాసు తిరువెంగళాచార్యుడు భారద్వాజ పవిత్ర గోత్రుడు బోధాయన సూత్రుడు

"..... భారద్వాజ గోత్ర నామమున
యలమి బోధాయనం బనెడి సూత్రమున
ధరణి నొప్పిన శేష దాసుని చేత
విరచితంబైన యీ విమల ద్విపద"

---

21. మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము. డి నెం. 2062—కాగితప్రతి

ఇది మూడాశ్వాసముల గ్రంథము అద్వైత వేదాంత మిందు వర్ణిత మైనది దీని నీతడు కృష్ణాపురాయపుర వేణుగోపాలస్వామి కంకితముగ రచించి నాడు. ఈతని గురు వెవరో నెరుగరాదు గాని వేణుగోపాలస్వామినె తనకు గురువుగా నుండ వేడికొనినాడు

పరబ్రహ్మ వర్ణనతో గ్రంథారంభమును గావించి, పిమ్మట ఆ పరబ్రహ్మ యందుండి మాయ, దానినుండి, మహత్తత్వము, ప వర్గమునుండి పంచేంద్రియ ములు, క వర్గమునుండి, శబ్ద స్పర్శలు, తన్మాత్రలు పుట్టుట ట వర్గమునుండి త్వక్చక్షు శ్రోత్రాదులైన జ్ఞానేంద్రియములును, కవర్గ వలన పృదివ్యాది పంచ భూతములును, దెల్పి, మొత్తము పంచ వింశతి తత్త్వము లుద్భవించిన క్రమ మును వర్ణించి, సాత్వికాది గుణ త్రయముల వలన నవవిధ భేదము లేర్పడిన తీరు, తాపత్రయములను, అన్నమయాది ప్రాణకోశములను, దేహ భ్రాంతులను వివరించి, రాజయోగమునకు సంబంధించిన యిడ పింగళాది నాడీ స్వరూప మును, పిమ్మట పరబ్రహ్మ బ్రహ్మ విష్ణు మహేశ్వరాదుల తొడంగి ప్రపంచ మును సృష్టించిన విధము

యోగ మార్గమున పరమాత్మని సాధించుట యెటులో వివరించినాడు. ఇది సులభ గ్రాహ్యమగుటకు ఒక కోటను నిర్మించి, అందు పరమాత్మ నెట్లు ప్రతిష్ఠాపింప వలెనో యాలంకారికముగ వర్ణించినాడు. శరీరము నందుండనేక చక్రము లనేక కోటలు చిట్టచివరనున్నది కనకపు కోట ఈ కనకపు కోటకు, రక్షకై, వేయి దళములతో వేయి గూండ్లు గలిగిన ఫిరంగి నొకదానిని నిర్మించి ఆ కోటకు సద్గురు నధిపతిగా చేయవలెను ఇట వేయి దళములు గల్గి, మన శిరమునందున్న సహస్రార చక్రమున శ్రీ సద్గురుడు గలడనియు, అతనిని భావింపవలె ననియును భావము ఈ గురువు వైరాగ్యమను చెలికత్తెను సృష్టించి, శుద్ధ సత్త్వగుణ సుఖశయ్యాసనాసీనురాలను గావించి ఆమెవంటి వారల నెల్ల రను, తనవద్దకు పంపమని యాజ్ఞయిడి, జగములను పాలించుచున్నాడు. అనగా వైరాగ్యోదయము గల్గిన జనులే సద్గురుని జేర నర్హులని భావము ఇట నిల్పిన స్త్రీతో మాటాడిన వారు మనువు, జనకుడు, ప్రహ్లాదుడు, శుకుడు మొదలగు

ఘూరులు గాని అన్యులు గారు. అనగా నిది యోగ సాధ్యమగు విషయమను మాట. దీని తరువాత జగత్తత్వమును విశదీకరించినాడు.

మాయాకల్పితమైన ఈ జగమును ఆ విరాట్పురుషుడే సూత్రధారియై ఆడించు చుండును ఈ ప్రపంచ తత్త్వ మాతనికే తెలియును. గాని యితరులకు తెలియదు. పిమ్మట విరాట్పురుషుని సుందర సాకార రూపమును, కరచరణాద్యవయవముల సౌందర్యమును తనివితీర వర్ణించినాడు భక్తజనుల కానంద జలధియై యుండునట్లుగా నాత్మానంద రసమంజరిని ద్విపద కావ్యముగా చేసితి నని కవి చెప్పుకొనెను. కావుననే దీని కాత్మానంద రసమంజరి యను నామ మిడినాడు

"......నా భక్త
జనులకు నానంద జలధియై యుండ
దగునట్లుగా ద్విపద ప్రబంధముగ
నిగమార్థ సారంబు నిర్మించి దీని
కానంద రసమంజరనెడి నామమును
పూని గల్పించి......"

ఈతని శైలిని దెలిసికొనుటకు పరబ్రహ్మ వృక్షమును వర్ణించిన యీ క్రింది ద్విపద లుపయోగపడగలవు

"కలయంగ నీ ప్రకాశమే వేళ్లు
గలిగి అప్రాకృత ఘన మూల మగుచు
... ...
గురుతరంబైనట్టి కొమ్మలు గలిగి
భరిత ఉత్కృష్ట ప్రభావంబు లనెడి
పరగ శాఖలు గలిగి ప్రబలి పంచోప
నిషదర్థ పర్ణముల్ నొప్పుగా గల్గి
పరమైన సత్త్వగుణమే మొగ్గ

అరుదుగా జన్మించి యా గుణకార్య
ములు పుష్పములుగాను——"

కావ్యము సలక్షణమై యొప్పారుచున్నది శైలి ధారాళముగ నుండి సుగమముగ నున్నది. కవి కల్పనా శక్తి యపారమైనదని చెప్పవలెను. సామాన్యముగ రుచింపని వేదాంత విషయమును రుచికరముగ వర్ణింపనెంచి కాబోలు మన కతి సన్నిహితములును, పరిచితములునునగు వస్తువులతో—కోట, వివాహము మున్నగు వానితో— నుపమించి వర్ణించినాడు. కవి క్రీ శ 1700 ప్రాంతమున నివసించియుండెను.

## తత్త్వ చంద్రోదయము[22]

ఆముద్రితము.

ఇందే మూడు వేదాంత విషయ గ్రంధములు గలవు కాగిత ప్రతి ఇది యద్వైత వేదాంత బోధకమగు ద్విపద. కర్త కొప్పరాపూరి మల్లన యోగి. ఈతని గురువు ధేనుకొండ నివాసి యగు పాకనాటి శేఖరుడు తిమ్మరాజు గ్రంథారంభమున తన గురువునకును, నిష్టదేవతకును వందన మాచరించి రచన కుపక్రమించినాడు.

ద్వారకయందు రుక్మిణీదేవి కోరగా, శ్రీ కృష్ణుడు లోక సంగ్రహార్థ మద్వైత వేదాంతమును బోధ చేసిన దానిని రచించినట్లు చెప్పికొనెను ఒక స్థలమున బయలును గూర్చి,

"ఒక యిచ్చయును లేక యుండెడి బయలు
సకలంబు తానైన చక్కని బయలు
లోకంబు లన్నియు లోగొన్న బయలు
రాకపోకలు లేక రంజిల్లు బయలు

---

22. ఆంధ్ర సారస్వత పరిషత్ పుస్తక భాండాగారము, సంపుటము-77.

మునులకు నల్లారు మద్దుగున బయిలు
విన విన వీనుల విందైన బయలు
ఎందు బూచిన గాసి యెడలేని బయలు
సందీక యయు సాగిన బయిలు"

యిత్యాదిగా, యించుమించుగా నూఱు చరణములతో వివరించినాడు. కవికాల మెరుగరాదు

## తత్త్వ దీపికా ప్రబోధము

ఆముద్రితము

దీనిని గూడ మల్లన యోగి శిష్యులలో నొకడగు వేంకటయోగి యను నాతడు రచించెను. గ్రంధాదిని తన్ను గూర్చి యిట్లు చెప్పెను

"అనుచు మల్లనాచార్య ప్రసాద
ఘనత మారేపల్లి కామార్యసుతుడు
సుతుడు వేంకట భట్టు సూనృత యశుడ
అతని కిల్లాలు నర్సాంబ వారలకు
గారాపు సుతుడు వేంకటయోగి వరుడు"

ఇందలి ప్రతి పాద్య వేదాంత విషయము వేంకటేశ్వరస్వామి యలమేలు మంగాంబికకు దెల్పినట్లుగ కవి వర్ణించి, వేంకటేశ్వర స్వామికే అంకితము గావించినాడు

"సారట వేంకటాచలపతి పేర
నారూఢు లెంచగా నంకితంబైన
ధీరత నీతత్త్వ దీపికా బోధ"

ను రచించినాడు.

---

23. ఆంధ్ర సారస్వత పరిషత్తు పుస్తక భాండాగారము, గ్రం. సం. 77

# జ్ఞాన సూర్యోదయము[24]

అముద్రితము

కృతికర్త మల్లన యోగి శిష్యుడయిన వెంకటాఖ్యుడు తన గురువగు మల్లనకే కృతి నిచ్చినాడు ఇదిగూడ వేదాంత విషయ ప్రతిపాదకమగు గ్రంధమే. చతుర్థాశ్వాస పరిమిత మగు గ్రంథము. కవి ఆశ్వలాయసన సూత్రుడు ఋగ్వేదభాసురుడు వసిష్ఠ గోత్రుడు లక్ష్మమాంబా కాయచార్యుల పుత్రుడు గ్రంధారంభమున గురు స్తుతిని గావించి గ్రంధారంభమునకు గడంగినాడు.

ఈ తత్త్వోపదేశమును సీతాదేవి యడుగగా. శ్రీరామచంద్రు డుపదేశించి నట్లుగ రచించినాడు. ఈతడు బోధించినది కూడ అద్వైత వేదాంతమే.

"విను తత్త్వమస్యాది విమల వాక్యముల
పుట్టిన జ్ఞానంబు పొందున దోచు
భాగ్యంబు లానందపదలక్షణములు
ప్రాగనునొకటి ప్రధ్వంస మొకటి
అన్యోన్య మొక్కటి యత్యంత మొక్కటి
శూన్యముల్నాలుగు సొరిది నిత్యమును
వెలయును దీనిని వివరింతు వినుము"

పిమ్మట ప్రాగభావ ప్రధ్వంసాభావ అన్యోన్య అత్యంతములన నేవో వివరించి దెల్పినాడు

'కలుగు మృత్తిక యందు ఘటములు మొదట
పరికింపగా నిది ప్రాగభావంబు

---

24 ఆంధ్ర సారస్వత పరిషత్తు పుస్తక భాండాగారము,
గ్రం. సం 77

వెరవైన ఘటములు వెనక లేదనుట
పటువుగ బ్రధ్వంస భావ శూన్యంబు
ఘటములు పటమందు బటములా ఘటము
కణగి లేదనుటయె కణగి యన్యోన్య
మనయ భావంబింక నాకాశ పుష్ప
మనఁ యత్యంతమౌ నలయ భావంబు
ఘన నిత్య పదమిది కంజాక్షి మఱియు"

## ఉత్తరగీతా మంజరి[25]

అముద్రితము

దీని కర్త కౌండిన్య గోత్రుడయిన వల్లూరి శ్రీనివాసాచార్య పుత్రుడు లక్ష్మీనారాయణ యోగి

"...వల్లూరి ఘన కులాంబోధి
చంద్రుడై విలసిల్లు సలలిత శ్రీని
వాసార్య పుత్రుండు వరగుణోల్లాస
రమణీయ లక్ష్మీ నారాయణయోగి
చెప్పె నుత్తర గీత శిష్యులు మెచ్చ"

ఈ గ్రంధకర్త గురువు అమృతానందయొగి. ఈతని పేరనే కృతిని రచించినాడు ఇది మహా భారతము నందలి యశ్వమేధ పర్వములోని యుత్తర గీతలకు మంజరీ రూపమగు నాంధ్రీకరణము.

అర్జునుడు శ్రీకృష్ణునిచేరి పరబ్రహ్మ తత్త్వమును దెల్పమనగా కేశవుడు సమ్మతించి. ఆత్మ ప్రణవ స్వరూప మనియును హంస స్వరూపమునునని

25. శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ గ్రంధాలయము. డి నెం. 2072 — తాళపత్రము.

ప్రారంభించి, పరతత్త్వము నంతటిని ఉపదేశించినాడు ఈ పరబ్రహ్మ నెరుగుటకు జ్ఞానమావశ్యకము ఈ జ్ఞానమునకు ధారణ యావశ్యకము. ధారణచే లింగతనువు భేదించును కర్మలు. కర్మఫలములు నశించి జ్ఞానము సిద్ధించును. ఈ జ్ఞానముచే మానవు డీశ్వరునియొక్క సర్వగత. సర్వాంతర్యామి తత్త్వము నెరుగును గ్రంథమున లక్షణ వైరుధ్యములు గానరావు

## వే దా ం త మ ం జ రి[26]

అముద్రితము

ఇది అద్వైత వేదాంత విషయమును బోధించు గ్రంథము మంజరీ ద్విపద వికారమైన రచన కర్త పేరు తెలియదు "నమశ్శివాయ శాంతాయ బ్రహ్మణే, పరమాత్మనే. సచ్చిదానంద రూపాయ దక్షిణామూర్తయే నమః" అను శ్లోకముతో గ్రంథారంభము గావించినాడు వనితలకు వేదాంత విద్య యందధికారము లేదు గావున తానీగ్రంథము వారి కొరకై ద్విపదలో రచించుచున్నట్లు కవి చెప్పికొనెను ఇందు యతి భంగ, గణభంగ దోషాదు లనేకములు గలవు పాదమధ్యమందును పాదాంతములందు పాడుకొనుట కనువగునట్లుగ దీర్ఘములను గూర్చినాడు.

ఈతడు 'ఒళ్ళు', 'మురికి'. 'చెప్పేము', 'ఆఇచివైసుకొని' వంటి వ్యావహారిక పదముల నుపయోగించినాడు విషయ ప్రతిపాదనచే ముఖ్యముగా నెంచినాడు కాని ఛందో వ్యాకరణాది నియమములను, సాహితీ సాంప్రదాయము అనుగాని ముఖ్యముగ నెంచినట్లు గానరాదు. చెప్పదలచుకొనిన విషయిమును పాండిత్యమేమియు లేని వారలకు కూడ సుబోధమగునట్లుగ మిక్కిలి సులభముగ రచించినాడు వేదాంత విషయముల యొక్క లోతులకు దిగక

---

26. మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము, ఆర్.నెం. 1641 తాళపత్రము.

సూక్ష్మముగ తడవి విడిచి పెట్టినాడు. ఈ కవి దక్షిణామూర్త్యుపాసకుడు. గ్రంథాంతమిట్లున్నది

"శ్రీ దక్షిణామూర్తి దేవు సత్కృపను
వేదాంత విజ్ఞాన మమర జెప్పితిమి
నమ్ముడీ నామాట కల్ల గాదనుచు
యిది సత్యమిది సత్యమిది సత్యమమ్మ
... ...
అనుచు వేదాంత విజ్ఞాన మంజరియు
పలికితి భువిలోన ... ..."

## సర్వ శూన్య సహజా మనస్క నిరాలంబ మంజరి[27]

అముద్రితము

గ్రంథకర్త యెవరో తెలియదు సుబ్రహ్మణ్య స్వామి యనునాత డాత్మానుభవము నుపదేశింపగా నాతని శిష్యుడు వ్రాసినట్లు గలదు కవి సుబ్రహ్మణ్యస్వామి మధుకరాయమాన చిత్తుడుగ గన్పట్టుచున్నాడు పరబ్రహ్మ లక్షణము, 'తత్వమసి' వాక్యమున కర్థ వివరణము మొదలగునవన్నియు ఉదాహరణ పూర్వకముగ వర్ణింపబడినవి సత్ప్రకాశుడైన పర బ్రహ్మకాత్మార్పణమును గావించి కృతి యారంభము గావించినాడు గ్రంథారంభమున కృతి కర్తను గూర్చి తెలియకపోయినను, ఆశ్వాసాంత ద్విపదల వలన, దీనికర్త 'రామకృష్ణమ్మ' యను నాతడేమోనని తోచుచున్నది

'వరకంధి కప్పెర వంశ పావనుడు
పరగ లక్ష్మమ్మకు పౌత్రుడు మరియు
అమర వెంకటదలమాంబ పుత్రుండు

27 మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము
ఆర్ తిం ౨౬౨౩ తాళపత్రము

రామకృష్ణమ్మిది రచియించినదియు
శ్రీ లీల ద్విపదగా శ్రీగురునాజ్ఞ
ఆలించి వినరయ్య ఆత్మానుభవులు"

ఈతని గురువు శివ బ్రహ్మమని, గ్రంథాంత ద్విపదలవలన తెలియుచున్నది

"సరవి—సద్గురు పేర
మరి శివ బ్రహ్మమ్మ సద్గురు పేర
నిరవొందగా పరమేష్ఠి గురుపేర
గురు పరంపర పరమ గురువుల పేర
పరగ సుబ్రహ్మణ్య బ్రహ్మంబు పేర
సర్వ శూన్యంబైన సహజా మనస్క—
మరియు నిరాలంబ మంజరి యనంగ
స్థిరమతి ద్విపదగా శ్రీ గురునాజ్ఞ"

మొదట గురువు యొక్క మాహాత్మ్యమును దెల్పినాడు కరుణాళుడై గురువు శిష్యుని యందున్న మలత్రయమును పోగొట్టి, అజ్ఞాన తిమిరమును పార ద్రోలి, బిందు బీజముల భేదమును దెలిపి, పరబ్రహ్మతో నైక్యము గలుగు విధమును దెల్పును కాబట్టి ఈ గురువే దైవము, అతడే తల్లియు, తండ్రి యును, గురువే దైవము, గురువే తీర్థము గురు దర్శనమే ముకుంద దర్శనము గురువే బ్రహ్మ. గురువే విష్ణువు. వేయేల, అతడే యీడుగడ

ఇట్లు గురూత్కృష్టతను దెల్పి పిమ్మట పరబ్రహ్మ స్వరూపమును వివ రించినాడు. ఆ పరమాత్మ నిర్గుణమైనది అది మన హృత్కమలములందు నీ వార శూకాగ్రమగుచు నీలతోయద మధ్యస్థ విద్యుల్లేఖవలె భాసమాన మగుచు పరమాణు రూపమున ప్రకాశించు చుండును అదియే అంగుష్ఠ మాత్రుడైన పురుషుడుగా వర్ణింపబడినాడు. అదియే పరబ్రహ్మము ఆ పరమాత్మయే నీవని "తత్త్వమసి" యను మహావాక్యము బోధించుచున్నది తత్-అనగా పదార్థము త్వం. నీవు, అని అగుతున్నావు కాని జీవుడజ్ఞానము వలన తన స్వస్వరూపమైన బ్రహ్మత్వమును మరచి మాయలోబడి కొట్టుకొనుచున్నాడు. ఈ సంసారజలధిని

దాటుటకుగల మార్గమొకటియె. అది సత్సాంగత్యము సత్సాంగత్యమువలన నిస్సంగత్వము దాని వలన నిర్మోహము దానివలన నిశ్చల తత్త్వము ననుభవమునకు వచ్చును.[28]

దీనికి దృష్టాంతముగ నొక గురు శిష్యుల కథను దెల్పి అందు సృష్ట్యాది మొదలుకాని ఈ ప్రపంచ తత్త్వము నంతటిని తడవి ముక్తినొందు మార్గక్రమమును వివరించినాడు ఎవడుద్వంద్వాతీతుడై, పరబ్రహ్మానుభవమునుపొందునో, ఆతడే, అవధూత, ఆతడే నిరాలంబానుభవయోగి, ఇది నిరాలంబోపనిషదర్థము సర్వ,శూన్యమై, సహజా మనస్కమైన స్థితి నాతడనుభవించును

## శారీరోపనిషత్తు [29]

అముద్రితము.

రాగాంబా రాయని మంత్రి పుంగవుల కుమారుడు దానప్ప ఏతద్గ్రంథ కర్త వీరు బ్రాహ్మణ కులజులు కాశ్యప గోత్రులు

"పంకజ భవకుల ప్రభవుడై యొప్పు
గుణనిధి కాశ్యప గోత్ర పావనుడు
గణితశాస్త్రాది ప్రజ్ఞా విశారదుడు
మహితాంధ్ర భాషా చమత్కారవరుడు
... ... ...

---

28 ఈద్విపదల భావమునకు శ్రీశంకర భగవత్పాదులవారిసత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వం నిర్మోహత్వే నిశ్చల తత్త్వం, నిశ్చల తత్త్వే జీవన్ముక్తిః" భజగోవిందం, భజగోవిందం మూఢమతే...యను శ్లోకమాధారము

29 మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగార, ఆర్ నెం 2524, తాళపత్రము

పదివేల జనములోపల నెన్ని కగుచు
పోదిం రాయని మంత్రి పుంగవుండలరు
... ... ...
అతని యర్ధాంగి యగు గుణాలంబ
ఖ్యాతి యరుంధతి కరణి రాగాంబ
ఆ దంపతులకు మేమాత్మజద్వయము
... ... ...
సౌఖ్య మేమియు గాన సరసాన్నదాన
సౌఖ్యద తత్త్వ సామ్రాజ్య సంపదను
వెలసిన వారినే గలసిన వాడ
ఇలను శారీరోపనిష దర్థమెల్ల
పని బూని చెప్పితి—"

మాయా ప్రపంచమున బడి కొట్టుకొనుచు, నశ్వరమగు నీ శరీరమునసక్తై ప్రాకులాడక, శాశ్వతానంద ప్రదమగు నా బ్రహ్మ పదమును జేరుటయే లక్ష్యమని శారీరోపనిషత్తు బోధించుచున్నది

కవి గ్రంథాదిని, తనకు ఛందో వ్యాకరణాది పరిజ్ఞానముగాని కవిత్వ గుంభనలుగాని తెలియవని పల్కి తన వినయమును చాటుకొనినాడు

"ఒకశ ఛందో బద్ధములు నేనెరుంగ
రసగుంభనలు యతి ప్రాస సందిగ్ధంబు
...యి నాటకాదులు మొదలనే నెరుగ
కలితమౌ సద్గురు ఘన కటాక్షమున
పని బూని తెనుగున రచింతు..."

## [సి] విశిష్టాద్వైత ప్రతిపాదకములు

### తత్త్వార్థ దర్పణము

అముద్రితము

ఇది విశిష్టాద్వైత మత ప్రతిపాదకమగు తత్త్వార్థ గ్రంథము ఇందు వైష్ణవ మతాచార్యుడగు రామానుజాచార్యుల చరిత్రము శ్రీరామానుజాచార్యులు తమ శిష్యుల కుపదేశించిన విశిష్టాద్వైత సిద్ధాంతములు వర్ణితములు కర్త లక్ష్మణార్యుడు, క్రీ శ 1700 ప్రాంతమువాడు.

"శేషావతార నిశ్శేషితాశేష
పాషండ దుర్వాది బాహ్యకుదృష్టి
వాదవేదాంతర జ్వర భేష జాస్మ
దాది రక్షక యతీంద్రాంఘ్రి నిక్షిప్త
కామలక్ష్మణ యోగి గర్భితాత్మాభి
రామానుజోక్త సుశ్రావ్య తత్త్వార్థ
దర్పణంబను ప్రబంధంబు లక్ష్మణార్యు
డర్పించుమని తానె యంగీకరించె"

యని యాశ్వాసాంతము లందు చెప్పికొనెను

భక్తి, జ్ఞాన, కర్మ ప్రసన్నయోగముల నెరిగి శ్రీ మహావిష్ణువు యొక్క పాద కమలములను సేవించి కడతేర వలెను అర్చా స్వభావమును దెలసి, కృత నిశ్చయుడై యకించిన భావ విశ్వాసమును గలిగి, సద్గురూపదేశమున ప్రపత్తి మార్గమును నవలంబించి, సాధనాంతర చింతమాని భగవదాశ్రిత జన

---

30 శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ గ్రంథాలయము, ఆర్ నెం 600—కాగితప్రతి

పరతంత్రుడయి, ఆచార్య సన్నిధినుండి అతడు చెప్పిన రీతిగా కైంకర్యమును జేసి శాస్త్ర విహితములకు కృత్యములను జేయుచు నిత్యము ఆచార్య భాగవతాచ్యుత పూజాపరాయణుడు గావలెను.

వైష్ణవ మతమున భగవదర్చన కంటె భాగవతార్చన యుత్కృష్టమని సిద్ధాంతము శాస్త్ర వివేకము లేక దేహాత్మ భేదము తెలియక, అజ్ఞాన మోహితులై కర్మల నాచరించినచో నది బంధ హేతువగును అచ్యుత జ్ఞానమే మోక్ష హేతువు

## ముమ్మార్త వైభవము[31]

కర్త గోవర్ధన వంశ్యుడగు ననంత కవి వేంకట రాయ పుత్రుడు గ్రంధాదని కొన్ని యాకులు చాలవరకు నష్టమయి పోయినందున అక్షరములు పంక్తులు పరింప వలను పడకున్నది ఇది శాలివాహన శకము, 1716 అనగా క్రీశ 1794 వ సంవత్సరమున రచింపబడినది.

శ్రీకృష్ణు డర్జునున కుపదేశించినట్లుగ, పర వ్యూహ విభవాద్యవతార వర్ణన పూర్వకముగ విశిష్టాద్వైత మత స్వరూపము వర్ణింపబడినది.

మొట్టమొదట పరతత్త్వమును గూర్చి, అనగా, వాచామ గోచరము, దివ్య తేజో మయము, అకలంక శుద్ధ సత్త్వాకారము, నిరాకార సాకారమును నయిన విష్ణుతత్త్వమును గూర్చి వివరించినాడు. పిమ్మట వ్యూహ చతుష్టయము, వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ వ్యూహము లేర్పడిన విధము వాని స్వరూప, స్వభావ, వైభవము లుగ్గడింపబడి, భగవంతుని అవతారములన్నియు వివరింపబడినవి. ఇటు లీతడు శ్రీరామానుజులు చెప్పిన ముమ్మార్తల అనగా. పరతత్త్వ, వ్యూహ, అవతారముల వైభవములను గొని యాడినందున దీనికి ముమ్మార్త వైభవమని పేరిడినాడు. ఇట్లయిన పిమ్మట అష్టోత్తర శత

31 శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ గ్రంథాలయము ఆర్ నెం 3866 తాళపత్రము

భాగవద్విశిష్ట స్థానములను, అనగా శ్రీవైష్ణవుల తీర్థ యాత్రా స్థలములను వివరించి, శ్రీరంగేశుడు శ్రీరంగమునకు వచ్చిన విధము పదుగురు ఆళ్వారుల చరిత్రములను తడివి శ్రీమద్రామానుజుల వారి చరిత్రను కూడ సూక్ష్మముగ వివరించినాడు

గ్రంధాంతమున వైష్ణవులు భాగవతుల నెట్లు సేవింప వలెనో, యితర మతముల పట్ల యే విధముగ నడుచుకొనవలెనో వివరించినాడు.

వైష్ణవ సంప్రదాయమునకు చెందిన తమిళ పదముల నెన్నిటినో కవి గ్రంథమున వాడి యున్నాడు. గ్రంథము నందలి శైలి బిగువుగ నుండి సొంపారు చున్నది

# ఆరవ ప్రకరణము

# భారత కథాసంబంధములు

## ద్విపద భారతము

"వ్యాసప్రోక్తమగు సంస్కృత మహాభారతము మాతృకగా కవిత్రయ కృతమైన ఆంధ్ర మహాభారత మవతరించినట్లే కాలాంతరమున ఆ కవిత్రయ భారతము మాతృకగా నీ ద్విపద భారత మవతరించినది. ఇది యపర కవిత్రయ కర్తృకము" దీనిని మువ్వురు కవులు తిమ్మయ, సోమన, బాల సరస్వతులు రచించిరి. వీరియందు తిమ్మయ నన్నయవంటి వాడని చెప్ప వీలగును ఈతడు ఆది పర్వమునుండి ద్రోణ పర్వాంతము వరకు నేడు పర్వములను రచించినాడు ఎందువలనో నీతడు సభాపర్వమును రచింపక విడిచివైచినాడు ఈ సభాపర్వమును బాలసరస్వతి పూర్తిగావించినాడు ఈ బాలసరస్వతికి రచనావకాశమును గల్పించుటకొరకే ఈ కవి మధ్యగల సభా పర్వమును విడిచియుండునని కొందరి తలంపు

తిమ్మయ

పుష్పగిరి తిమ్మయకు సమకాలికుడైన చేకుమళ్ల రంగశాయి యాతని తన ద్విపద భాగవతమున స్మరించుట వలనను, తంజావూరి మహారాజు శాహాజీ (1684–1712) ఈ ద్విపద గ్రంథమునకు ప్రతిని వ్రాయించుటచేతను, తిమ్మయ సుమారు 1550–1600 ప్రాంతమున నుండెనని భావింప వీలగు చున్నది ఇతడు బట్టేపాటి నివాసి బాలసరస్వతి యీతనికి సమకాలీనుడు నెల్లూరి ప్రాంతమందలి ఆత్మకూరు నివాసి సోమన వీరికి అర్వాచీనుడు అతడు, 1600-1650 ప్రాంతమున నుండి యుండును

నన్నయాదుల భారతము వ్యాసభారతము కనువాదమయ్యు స్వతంత్ర గ్రంథమేయని యెట్లెన్నదగియున్నదో, ఈ ద్విపద భారతము కూడ, కవిత్రయ భారతము ననుసరించినదయ్యు స్వతంత్ర గ్రంథముగానే విరాజిల్లుచున్నది.

అనేకోపాఖ్యానముల తోడను, విషయ బాహుళ్యము తోడను విస్తృతమును గహనమునునయిన వ్యాసభారతావతారికను నన్నయ సంక్షేపపఱచి మార్గమును సుగమ మొనర్చినట్లుగ, ఈ తిమ్మయగూడ ఇంకను సంక్షేపపఱచి, భాగత కథతో సన్నిహిత సంబంధముగల్గిన ఉదంకుని వృత్తాంతముతో కథ నారంభించి, యప్రస్తుతములని, భావించి కాబోలు ఉప పర్వ, శమంత పంచ కాషాహిణీ కథనము, దేవళుని వృత్తాంతముచ్యవనుని చరిత్ర ప్రమద్వరా కథ మున్నగువానిని పూర్తిగా విడిచి పెట్టినాడు ఇటులే శర్యాతి కథయుం గూడ దేవదానవుల యుత్పత్తిక్రమము, పూరూరవాది రాజ వంశ చరిత్రము, వ్యుషి రాశ్వశ్వేతకేతుల చరిత్రము దీర్ఘతముని వృత్తాంతము సుందోపసుంద మందపాల వృత్తాంతములను విడిచి పుచ్చినాడు

ఈ కవి ప్రధాన భారత కథేతి వృత్తమున కప్రస్తుతమని భావించిన వృతాంతములను విడిచిపుచ్చుటయేగాక, స్వీకరించిన కథలయందును మార్పు లను గావించినాడు. ఆంధ్ర మహాభారతమున, ఉదంకుని చరిత్ర గురుపత్ని కుండలములు దెచ్చుటకై యాతని పౌష్యమహాదేవి పాలికనుపుటతో ప్రారంభము గావింప బడగా నీత డుదంకుడు జనమేజయ మహారాజు నొద్దకేతెంచి అతడి తండ్రియయిన పరీక్షిత్తుని తక్షకుడు చంపిన కారణమున కోపమూని శాంత మును విసర్జించి సర్పయాగము చేయమని దెల్పుటతో ప్రారంభించినాడు, అతని సర్పయాగము జేయ నుద్రిక్తపఱచి ఉరగులను తక్షకుని తాను సంహరింపు మనుటకు గల కారణము నాతడు గురుపత్నికై గొనిపోవుచున్న కుండలములను తక్షకుడు ప్రముచ్చలించుటయేనని దెల్పి పాములిట్లు చేసినచో నిక దిక్కెవ్వరు నుండరని దెల్పినాడు. ఇంతటితో నూరుకొనక జనమే జయుడు సర్పయాగమును జేయుటకొక కారణము గలదని పల్కి, గరుడో పాఖ్యాన కథ నాతనికి దెల్పినాడు కాని ఉదంకుడే జనమేజయునకు గరుడోపాఖ్యా నమును దెల్పుట యంత యుచితముగ నున్నట్లు దోపదు మూలమున. సర్పములన్నియు సర్పయాగమున నుదగ్ర పావక శిఖాతతులందు. బడుటకు కారణమేమని మునులందరును రోమహర్షణి నడుగగా నాతడు వారికి సర్పకుల జననియైన కద్రువ శాపకారణమని దెల్పి గరుడోపాఖ్యానమును దెల్పినట్లుగ నున్నది

గరుడోపాఖ్యానమున అమృతమును గైకొని దాని నాస్వాదింపకనే పోవు చున్న గరుడుని గాంచి శ్రీమన్నారాయణుడు,

"నీ విజయోత్సాహమునకు
లావునకు జవంబునకు నలౌల్యమునకున స
ద్భావమునకు మెచ్చి వరం
బీవచ్చితి వేడు మెద్ది యిష్టము నీకున్" (ఆది, ద్వి, 105)

అని యడిగినట్లును, అపుడు గురుడుడు అమృత పానము చేయకయె తనకజరామరత్వ మీవేడి నట్లును, శ్రీహరి యాతని కావరము నొసగి, తనకు వాహనముగను, ధ్వజముగను నుండివలసినదనగా, పక్షీంద్రుడు మహాప్రసాద మని యంగీకరించినట్లును మాత్రముండగా, నీతడీ సన్నివేశమును కొంత విస్తృత పరచి రచించినాడు.

ఆంధ్ర మహా భారతమున గురుడోపాఖ్యానము ముగిసిన వెనుక, శేషుడు బ్రహ్మను గూర్చి తపమొనర్చి భూభారమును వడసిన వృత్తాంతము పిమ్మట జరత్కారముని చరిత్రము ఆస్తీకుని జన్మ ప్రకారము తెలుపబడినది ద్విపద భారతమున నీ క్రమము కొంత మారినది జనమేజయుడు గావించు చున్న సర్పయాగము నుడిగించుటకై సర్పవితతిచేతను ప్రార్థితుడై జనమే జయుని యాగ శాలకేగి, ఆస్తీకుడే తన జన్మ వృత్తాంతము నంతటిని జర త్కారు చరిత్రను) జనమేజయునకు తెలిపి, తన మాతృ కులమును మన్నించి సర్పయాగవం నుడిగి యురగులను రక్షింప వలసినదని వేడగా,, జనమేజయుడు సర్పయాగమును మానివేసినాడు.

శర్మిష్ఠ వలన తన పుత్రికకు గలిగిన యవమానమును దాసివలన నెఱిగి శుక్రుడామెకడకేగి, ఓదార్చి బ్రతిమాలుచుండగా. వృషపర్వుడు కేతెంచి గురువు నభినందించి,

"హెచ్చి మా శర్మిష్ఠ యీయింతి కెగ్గు
లొనరించె, దీని నేలుడు దాసిగాగ"

అని శర్మిష్ఠను దేవయానికి దాసిగా నొసరించినాడు. దేవయాని కోరుటకు పూర్వమే దానవ రాజిట్లొనర్చుటాతని ధర్మాభిరతిని తెలియజేయుచున్నది,

శకుంతలోపాఖ్యానమున గూడ నీకవి కవిత్రయ భారతమున గల కథకు గొంచెము మార్పు గావించి కాళిదాస, పినవీరభద్రుల మార్గము ననుసరించినాడు. వేటాడుటకై యేగి దుష్యంతుడు స్వల్ప పరివారముతో కొంత దవ్వేగి కణ్వాశ్రమము గనుగొనినట్లు నన్నయ రచనలో నుండగా, నితడొక హరిణమును దరుముచు కణ్వాశ్రమము వరకు పోగా, ఆ ఆశ్రమమున నుండువారది ముని యాశ్రమమని హెచ్చరించినట్లు కవి రచించినాడు ఇట్టిందలి రచనా విధానమునే కాక శ్లోక భావములను గూడ అటనట గైకొని రచించినాడు

కుంతీ దేవి చరిత్రమున, కర్ణ జననము ఆరంభమునందే నన్నయ వర్ణింపగా తిమ్మయ ధర్మరాజు జననము పిమ్మట కర్ణ జన్మవృత్తాంతమును దెల్పెను

పాండురాజు వేటాడుటకై యేగిన ఘట్టము ద్రౌపదీ స్వయంవర ఘట్టములను కూడ మిక్కిలి పెంచి వ్రాసినాడు స్వయంవర మంటపమును ప్రవేశించుటకు పూర్వము ద్రౌపది నలంకరించిన విధము నీ కవి వర్ణించినాడు ద్రౌపది అలంకరణ ప్రసక్తియే నన్నయ చేయలేదు

భారత కథలోని కొన్ని యుపాఖ్యానములను విడిచి, ప్రధాన కథను త్వరితముగ నడిపించుట కథాక్రమములో గొంత మార్పును జేయుటయే గాక ఒకానొక సందర్భమున నీత డమూలక భిన్నగాథను గూడ కల్పించి, ద్విపద భారతమున కత్యంతమగు సొగసును చేకూర్చినాడు ఇది గరుడోపాఖ్యానమునకు పూర్వమున వర్ణితమయిన సముద్ర మథన వృత్తాంతమే వ్యాస, నన్నయ భారతములందు సముద్రమథన వృత్తాంతము హఠాత్సంభవముగ నున్నదని తలచి కాబోలు ఈతడు విష్ణు పురాణమున నున్న దుర్వాస శ్శాప వృత్తాంతమునిందు ప్రవేశపెట్టి సముద్ర మథనమునకు పూర్వరంగమును గల్పించినాడు. ఈతని రచనలోనే గాక మొత్తము ద్విపద భారతముననే సముద్ర మథన వృత్తాంతముక రసవద్ఘట్టము. అది యొక ప్రత్యేక ప్రబంధముగ నుండననువైనది.

సభాపర్వమును ద్విపదీకరించిన బాల సరస్వతి ద్విపద భారత కర్తలలో ద్వితీయుడు మొత్తము భారతములోని రమ్యమగు ఘట్టము సభాపర్వమును నన్నయ రచన కనుగుణముగ నీతడు ద్విపదీకరింపలేదని విమర్శకుల యభిప్రాయము ఈతని పేరు వలెనే నీతని కవిత్వముగూడ బాల్య ప్రాయము గనే యున్నదని పెక్కురు తలంపు ''ఇతడు తిమ్మయ్యకు (ఆదిపర్వ కర్త) శిష్యుడో శిష్య ప్రాయుడో అయి ఉండునవియు, నందుచే నాతడీతనిని సహాయునిగా గొని యీ రచన కుపక్రమించి యుండుననియు, తానాది పర్వరచన మారంభించి సభాపర్వ నిర్వహణము నీతని పరముచేసి యుండుననియు, నీతని రచన యంత సరిగా లేకపోవుటచే నంతతో నీతని నాపనినుండి విరమింపజేసి తిమ్మయయే అరణ్యపర్వము మొదలు ద్రోణ పర్వాంతము ద్విపదీకరించి యుండుననియు యభిప్రాయపడుటకు వీలుగా నున్నది మొత్తమీ గ్రంథములో నొక్క సభాపర్వము మాత్రమే బాలసరస్వతి పేర కన్పట్టుట ఆదిపర్వ నిర్వహణానంతరము అరణ్యపర్వాలు మరల తిమ్మయ కృతులుగానే వెలయుటపై నాయూహకు కొంతవరకు కారణములు. ఏమైననేమి ద్విపద భారత కర్తలలో ఈతనికి ఒకింత చోటు దొరికినది ఆ మహా గ్రంథమందు ఈ బాలకవి పేరు చిరస్థాయిగా నిలచినది "

ఈతడు "అసమ సాహిత్య విద్యా చతుర్ముఖ" బిరుదాంవితుడయినను తెనుగు సాహిత్యమందును, తెనుగు కవిత్వమందు గాని, రచనా ప్రణాళిక నేర్పరుచుకొనుటయందుగాని విశేషమగు ప్రజ్ఞ గలవాడుగా బొడగట్టుటలేదు. తిమ్మయ మార్గమును అనుసరింపక ఒక 'తృతీయ పంథాను' ద్రొక్కినాడు. అదికూడ ఒక క్రమము ననుసరించిగాదు. తనకు ఇచ్చవచ్చినట్లు రచన గావించి ఆంధ్ర సాహితి సహృదయుల నిరసనకు పాత్రుడయినాడు నన్నయ రచన యందలి విషయములను ననేకములను యధేచ్ఛగా విడిచి పుచ్చినాడు.

బాల సరస్వతి సభా పర్వమున నత్యంత ముఖ్యమగు విషయములను

---

1. భారతి, నవంబరు 1959

విడనాడుటయే గాక, కొన్ని కొన్ని సందర్భములలో నన్నయ వ్రాసిన దానిని సరిగ కూడ ద్విపదీకరింపకుండెను

"చోర భయవర్జితమముగ, ధారుణి బాలింతే" (సభా 1–41) అను నన్నయ పద్యమును,

"పరికింపగా చోర భయవర్జితముగ
ధరణి బాలింతువే ధనలోభమునను
దండి నేలవు గదా తస్కరావళిని"

అని వ్రాసి భావములను తారుమారు గావించెను,

"అనర్థజ్ఞుల తోడి చింతనంబు...     ...
...పదునాలుగు రాజదోషంబుల పరిహరించె"

అను నాతని వచనమును మూల విరుద్ధముగ ననువదించినాడు.

సోమన ద్విపద కర్ణ పర్వ మాదిగా, స్వర్గారోహణ పర్యాంతమువరకు రచన గావించెను భారత కవిత్రయములో చివరివాడయిన సోమన తిక్కన మనీషి పదునేను పర్వములను రచింపగా, నీతడు పదునొకండు పర్వములను రచించెను. తిమ్మయ నన్నయ యయినచో, నీతడు తిక్కన యగుచున్నాడు. కాని బాలసరస్వతిని ఎఱ్ఱనతో పోల్చుట సాహసమే యగును

సోమన తిమ్మయ యంతటి మేధావంతుడు కాకపోయినను, తిమ్మయ రచనను తిక్కన కళాఖండములను చదివి, తన రచన యం దిరువురి రచనా వైవిధ్యములు ఓతప్రోతములగునట్లుగ రచన గావించిన శిల్పి

పెక్కు స్థలములందు మూలమందలి సంస్కృత సమాన భూయిష్ఠ రచనను ప్రసన్నమగు తేట తెనుగున ద్విపదీకరించి దేశీయ మొనర్చినాడు.

"క్షేమధూర్తి భీముని నాహ్వానంబు చేసిన" (కర్ణ–1–77)

అను తిక్కన పద్యమును,

'అందెందు బోయెదవని లజసీవు
ఇందు రమ్మ——'' ని (కర్ణ పు. 16)

రచించినాడు. ఇదే ప్రయోగమును మరల శల్యపర్వములో చూడవచ్చును. శల్యుని గొనిపోవుచున్న కృపాచార్యుని రథము వెంట భీముడు జనుచుండగా, రారాజ గాంచి,

''అందెందు బోయెద వనిలజ తిరుగు
మిందు రమ్మ——'' ని పిల్చినాడు (శల్య. పు. 15)

కొన్ని పట్టులందు మూలమున లేకున్నను నలంకారాదులతో పెంచి రచిన గావించినాడు

కర్ణునకు సారథ్యము వహింపుమని దుర్యోధనుడు శల్యుని ప్రార్థించు చున్నాడు

''ఇమ్మి వ్వరమ్ము సార
థ్యమ్మితనికి జేయు మినున కరుణుడు సాహా
య్య మొనరించినట్లుగ డిమి
రమ్ము క్రియన్ రూపుసెడి యరాతులడంగన్'' (కర్ణ-2.247)

దీనిని,

''......ఈ వరమ్ము !
ఈవేళ నాకిమ్ము ! ఈ వెవో దిక్కు
సావధానత గర్ణు సారథి గమ్ము
వినతాత్మజుని విమల సహాయ
మున విభావసుగతి మునుకొని వినుత
నిబిడాంధకారంబు నిక్కంబడగ''

అని అలంకారమునకు సొప్పించి ద్విపదీకరించినాడు.

మూలమున సూత్రప్రాయముగ నున్న విషయములను ఒక్కొక్కప్పుడు పెంచి వ్రాయును.

బలరాముని తీర్థయాత్రను వర్ణించు సందర్భమున మూలమున గల మంకణ మహాముని చరిత్ర కుమారస్వామి వృత్తాంతము, ప్రభావతి యనుముని కన్యక చరిత్ర. కురుక్షేత్ర ప్రశంసాభివర్ణనలను విడిచి పెట్టినాడు. మూలమున లేకున్నను, బలరాముడు సప్త గోదావరి తీరము మొదలు దక్షిణ దేశ యాత్రల నన్నిటిని చేసినట్లు వర్ణించినాడు. (శల త్పృ.ఆ పు. 60)

శాంతిపర్వమునగల రాజనీతులు, ధర్మ ప్రసంగములు మొదలగువానిని క్లుప్తపరచియు, ప్రథమాశ్వాసముననున్న సులభాజనక సంవాదము, నాల్గవ యాశ్వాసములోని మేధావి వృత్తాంతము, అజగర వృత్తాంతము. అయిదవ యాశ్వాసములోని ఇంద్ర వృత్రాసురుల యుద్ధ ప్రకారము మొదలగు వానిని విడిచి, శాంతి పర్వమును మూడువంతులకు తగ్గించి కథా ప్రధానముగ రచించినాడు.

శాంతి పర్వ ద్వితీయాశ్వాసమున ప్రభాత సమయమున మంగళ పాఠకులు శ్రీకృష్ణుని మేల్కొల్పు సందర్భమున, నీ కవి మేల్కొల్పు ద్విపదలను రచించినాడు.

"జలజ దళాక్ష సంస్తవనీయ చరిత
పూతన సంహార భువనైక వీర
పాతక దూర గోపాల మేల్కొనుము
... ...
నవ్యగుణోదార నవనీత చోర
భవ్యాత్మ, దానవ భంగ మేల్కొనుము
కంస భంజన దేవ కరుణా కటాక్ష
సంసార విరహిత శౌరి మేల్కొనుము
... ...
శుద్ధ బుద్ధ జ్ఞాన సుగుణ ప్రసిద్ధ
సిద్ధాంత యద్వైత శ్రీశ మేల్కొనుము"

(శాంతి. ద్వి ఆ.పు. 44-45)

అను శాసనిక పర్వమున గల ధర్మోప దేశములను గూడ విడిచిపెట్టి ఆ పర్వమును సగమునకు పైగా తగ్గించి వేసినాడు

ఆశ్రమ వాస, మౌసల. మహా ప్రస్థాన, స్వర్గారోహణ పర్వములను మూల విధేయముగ ననువదించి భారత రచనను పూర్తిగావించినాడు

ఈ విధమగా సోమన ప్రధాన భారత కధను గైకొని మూల విధేయక ముగను లోప రహితముగ, 'దేశి కవిత తోని ప్రసన్న భావమును మందగించ నీయక', నిపుణతతో రచనను సాగించి పూర్తిగావించినాడు

ఈతిడీ పదునాకండు పర్వముల రచనను మాత్రమే గాక, తిమ్మయ యరణ్యపర్వమను ఉపాఖ్యాన రహితముగా రచింపగా నీతడద్దానిలో ఆ పర్వమునకు జీవగఱ్ఱలైన యుపాఖ్యానములను చేర్చి తిరుగ వ్రాసినాడు. దీని నీతడు తిమ్మయ పేరనే రచించి 'తిమ్మనార్యుడు విడిచిన కథలుకూర్చి వ్రాసితిని' అనిమాత్రమే చెప్పుకొనిన వినయశీలి

## కావ్య విశేషములు

ద్విపద భారత కవులు తమ కనువైన యొక స్వాతంత్ర మార్గము నవలంబించి రచన సాగించి, కావ్యమున ఆయా సందర్భాదులకు తగినట్టి వర్ణనలను చేసియు, రసములను పోషించియు, జాతీయములగు నుడికారములను గూర్చియు, ద్విపద కావ్యమున కొక యద్వితీయమగు శోభను గూర్చిరి. వర్ణనాదులను జేయుటలో వీరచ్చటచ్చట ప్రబంధ కవుల రీతుల ననుకరించినట్లు తోచును.ఆదిపర్వమున గల శుక్తిమతీ నది వర్ణన చేయుటలో వసుచరిత్ర కారుని యనుకరించి యుండును

"జూచు నొక్కొక్క మాటు సుకుమార మీన
లోచన శుభగుణ లోల దృష్టులను
బలుకు నొక్కొక్క మాటు బక చక్రవాళ
కలహంస మధుకర క్రౌంచనాదముల

మెలగు నొక్కొక్క మాఱు మృదుల మృణాల
వలన హస్త విలాస వైభవం బొప్పు
వెలయు నొక్కొక్క మాఱు వీచి సంక్షోభ
కలిత కైరవ ఫేన కమల హాసముల
వనవారణములు ప్రవాహ మధ్యమున
మునుగ కుంభ కుచాద్రులును గానవైన ' (అది ద్వి ఆ పు.101)

ఇట్లే దీర్ఘముగ సాగినదీ వర్ణన ఇది మూల భారతమున గానరాదు
ఇటులే శకుంతలా సౌందర్య వర్ణన నద్భుతముగా గావించినాడు

వేదాభ్యాస విదులైన వైదికులకు బుద్ధిజాడ్య జనితోన్మాదము సహజము ఏల యనగా, శకుంతల నంత యందముగ సృజించుట వేదాభ్యాస విదుడైన బ్రహ్మ మనః పూర్వకముగ నొనరించిన పనిగాదు పొరపాటున దానంతట యదే సౌందర్య మావె కల్పినది

"వితత వేదాభ్యాస వివిలుడైనట్టి
చతురాననను కిట్టి చతురత గలదె ?" (ఆది. కృ అ పు 149)

ద్రౌపదీ స్వయంవరమున కేతెంచిన రాజులు పాండవులతో యుద్ధముచేసి పవనజు చేత చాపకట్టుగా కూలిరి ఆ యుద్ధమును కవి వివాహముతో పోల్చినాడు ఈ వర్ణన మిక్కిలి సొగసుగా నున్నది,

"అనోన్య శరధార లనలంబు లీవ
గన్యా వివాహాగ్ని గతి మండుచుండె
లాజల గతి హారలత లందు దునిసె
రాజరక్తం బాజ్యరాజిగా దొరగె
విసిరి భీముడు వ్రేయ విఱిగిన రథము
అసమున సమిధలై యా యగ్ని బడియె
ఆ సర్వ నృపుల భీతాలాప రవము
రాసియై వేద మంత్ర ధ్వని బోలె

బదిట బదా రిఁట బం[డెంట రెంట
బదివేలు లక్ష తప్పని సాయకముల

నాపింప ... ... " (ఆది సప్త పుట 3-7)

వేరొక చోట యుద్ధక్షేత్రమును సముద్రముతో నుపమించినాడు (భీష్మ-ప్రథ.ఆ.పు. 17)

వేరొకచోట యుద్ధభూమి యందు రేగిన ధూళిని కదనోర్వికి మేల్కట్టుగా నుపమించినాడు కవి. ఈ యుపమానము మిక్కిలి సుందరముగా నున్నది (భీష్మ ద్వి. పు 28)

ప్రస్తుతమగు కథా సందర్భముతో హితపరచి ప్రకృతి వర్ణనను గావించుట మహాకవుల ప్రతిభను ఎత్తి చాటును తిమ్మయ గావించిన సూర్యాస్తమయ, సాయంకాల వర్ణనల కివి ఉదాహరణములు స్త్రీల పాదములను తాబేళ్ళతో పోల్తురు కాని తిమ్మయ యొకచోట స్త్రీ పాదమును తలదిండుతో పోల్చినాడు! ఇది యొక నవ్యత. "తలదిండులైన పాదముల పెంపును"[2]

వీరు జాతీయములను నుడికారములను నచ్చటచ్చట వాడి కావ్య సౌంద ర్యము నినుమడింప జేసినారు.

''తాడెక్కు మానిసి దగ క్రిందుపట్టి
యెడగాను ద్రోయంగ నెవ్వారి వశము''
''కుడిచిన యింటికే కుఱుచ దలంచి
యెడపక దోషంబు లెపుడు చేసెదవు''
''అదియు శుభాషితంబవివేకి యెదుట
జదివిన యట్లైన జలనంబు లేక''
''కుమ్మర పురు వంద్రు కుట్టని తేలు
నిమ్మల నీ శాంత మింతకు దెచ్చె''

---

2 ఆది పర్వము, పుట. 106

"పగవాని గుఱుచగా బ్రభు డాడరాదు
పగతుని మేటిగా భావింప వలయు"
"మేదిని నా సిగ్గు మీకేల తెలియు
మొదల గాపటి వ్రేగు మోచువాడెఱుగు'
ప్రాణ సంకటముల బ్రాహ్మణ క్రియల
రాణతో బెండ్లిండ్ల, ద్రవ్య భంగముల
నతివయు ఋతుమతియై యుండుచోట్ల
పతి కల్లలాడిన పాపంబు లేదు" (ఆది. ప పు 133)

అను ద్విపదలు పోతన "వారిజాక్షులందు, వైవాహికములందు" అను పద్య మును జ్ఞప్తికి దెచ్చుచున్నవి

ఇది పోతన యొక్క 'జ్యావల్లీ ధ్వని గర్జనంబుగ' అనుపద్యమును జ్ఞప్తికి తెచ్చు చున్నది.

## ఛందో వ్యాకరణ విశేషములు

వీరిలో ముఖ్యముగ పేర్కొనదగినది పద ప్రయోగ చ్ఛంద స్స్వాతం త్ర్యము. వీరు తమకాలమున వాడుకలో నున్న దేశీయములగు పదములను పలుకు బడులను, ఇష్టానుసారముగ నుపయోగించిరి ఛందస్సు విషయ ములో కూడ వీరు స్వాతంత్ర్యమునే వహించిరి వీరు ద్విపదలో సూర్యేంద్ర గుణములు మాత్రముండవలెనను నియమమును ద్రోసిపుచ్చి చంద్రగుణములను కూడ ప్రయోగించిరి

కొన్నిచోట్ల వీరు హ్రస్వముండు చోట్ల దీర్ఘములను చేసిరి. ఉదాః సత్యా లోకము, సహాదేవ మొదలగునవి

వీరు. ఆయడ, చదురు (మరుకు) జెడలు (జడలు కాక) వంటి పదములను ప్రయోగించిరి. వీరు సంయు తాసంయుత ప్రాసములో అప్పకవి చెప్పిన కేవల 'ర' వర్ణమునకు మాత్రమే గాక, తక్కిన వాటిని గూడ వాడినారు.

వీరు, ల-ర, శ-స, ప-వ, డ-ఢ, ఫ-భ, ల-డ, ర-ఱ, ల-ళ, లకు కూడ ప్రాసలను వాడినారు

## సంధులు

మనః పేత, తపోన్నతి, తమ సామరాది, మున్నగు సకారంత పదము లకు అకారాంతమువలె గుణ సంధిని గూర్చినాడు (తిమ్మయ)

నియ్యను గ్రహము-అయ్యున్న-అని

త్రికముపైనున్న హల్లునకే గాక, యుష్మ దర్థక సర్వనామమగు 'నీ' కును, అగుధాతువు భూత కాలిక దీర్ఘరూపమగు 'ఐ' కిని గూడ ద్విత్వమును చేసినాడు సోమన

'ఇడిలిదియే' నీకు నింత యల్పుడనే' యని మధ్యమ పురుష 'ఇ' కారమునకు (తిమ్మయ) సంధి చేసినాడు

స్త్రీ వాచక తత్సమ సంబోధనాంతములకును క్త్వార్థక సంధిని కుషష్ఠికి నగామము లేకను సందిని గావించిరి

ఉదా మత్స్యగంధను, మ్రింగైనను, విప్రులనుమతి మొదలగునవి.

వీరు "అందును" సప్తమ్యర్థమునవే గాక తృతీయార్థమున గూడ వాడిరి. 'అగమోక్తులయందు నిఖిల దానముల - (సభా ప) ధూర్త విద్యల యందు మదినింత నీవు చెడక

'బండి ఎఱిగిన వాడె కడు వెఱ్ఱి వాడనగా బోలదు', నాకంటె నీకంటె నాకంటి తెలివి, కొఱ్ఱు మ్రింగిన యట్లు, చొప్ప గోసి వొప్ప గట్టిన భంగి, వీచిన చేతికి వేయేండ్లు, ఏ నోరు పెట్టువే యేయవచ్చితిరి నక్క చిక్కులు, పనిలేని పని, చచ్చిన యంత కలగన్న చోట మేల్కనుము, ముక్కాలంబు గుడిచి, మానువొడువ, బొమ్మరమునుగాకపోయె, వాలంబు మెట్టినవడిరోజు నట్టి కాలాహి విధమున, మనుమడు తాతకు మాటాడనేర్పె, సూదివెంట సూత్రము సొచ్చినట్లు

గోళ్ల మీటుచు, ఏడు చెఱువుల నీళ్ళు త్రాపింతు, మొదలగు దేశీయములగు పద బంధములను పలుకు బడులను ప్రయోగించిరి

## సుభద్రా కల్యాణము

ఈ లఘు ద్విపద కృతి కర్త్రి తాళ్ళపాక తిమ్మక్క. ఈమె తాళ్ళపాక అన్నమాచార్యుల ప్రథమ భార్య. కాన, ఈమె క్రీ శ 1425–1503 ప్రాంతమున నుండినట్లు తెలియుచున్నది ఈమె కావ్యమును

> "శ్రీ రమా వల్లభులు శ్రీకృష్ణు లెలమి
> ద్వారకా పట్టణము తమ రేలుచుండ
> శ్రీకాంతపతి కృపను జెలగి పాండవులు
> ప్రాకటంబుగ ద్రౌపదిని బెండ్లాడి''

అని వస్తు నిర్దేశముతో నారంభించినది

ఇందలి వస్తువు భారతాది పర్వమునుండి గ్రహింపబడినది అర్జునుడు ఉలూపియను నాగకన్యను, మణి పురాధీశుని పుత్రికయగు చిత్రాంగదను, శ్రీకృష్ణుని సోదరియగు సుభద్రను వివాహమాడుటయే ఇందలి యితివృత్తము. పైకథకు ప్రసక్తాను ప్రసక్తముగ సౌభద్ర తీర్థ పంచతీర్థములలో శాపకారణమున మకరులై పడియుండిన నందాదుల నర్జునుడు శాప విముక్తులను గావించిన కథ గూడ యిందు చేర్చబడినది భారతమున నీ కథ యున్నవిధినే గై కొని, తిమ్మక్క మంజరీ ద్విపద వికారముగ హృద్యమగు ప్రబంధమును రచించినది. వేంకట కవిపలె వర్ణనలు గాలించిన ఈమె కావ్యమింకను మనోహరముగ నుండెడిది గాని, ద్విపద కావ్యములందు వర్ణనలు స్వల్పముగనే గన్పట్టుచున్నవి.

''ఈమె శైలి యెక్కడను ఒడుదుడుకులు లేక చక్కని యెదుగుతో ఒయ్యారపు నడకలతో కలస్వనములతో, కదలిపోవు చిన్న సెలయేరువలె మనో

హారత నించియున్నరి.[3] ఈమెయే ప్రథమాంధ్ర కవయిత్రి యని విమర్శకుల యభిప్రాయము. ఈమె కావ్యమందలి సుభద్ర పాత్రపోషణ మెంతో విశిష్టముగ నున్నది. ఈమె విష్ణు భక్తురాలగుట వలన అర్జునుని వైష్ణవ యతిగా వర్ణించినది. ఇందలి ముద్దులు గులుకు రచనా విధానమున కలరి. వేంకటకవి యీామె కావ్య మందలి కొన్ని కొన్ని పాదములనే తన విజయవిలాస ప్రబంధమున చొప్పించి నాడు ఈమె వర్ణించిన అర్జుననినే అతడును వర్ణించి నాడు.

''ఎగు భుజమ్ములవాడు మృగారాజు నడుము
నడచి పుచ్చుకొను నెన్నడుము గలవాడు
గరగరని వాడు చక్కని వాడు నతడు
గొప్ప కన్నులవాడు కొదండ గుణకి
ణాంకంబు లౌ బాహు లమరినవాడు
వెన్నున మచ్చగల విభవంబు వాడు
బవిరి గడ్డము వాడు పన్నిదంబిడిన
వెన్ను పగడసాల వెసనాడవచ్చు'' (పుట 32)

అను ఆమె ద్విపద పాదములనే, అతడు

సీ. ''ఎగు భుజమ్ములవాడు మృగరాజు మధ్యంబు వుడిచిపుచ్చుకొను
నెన్నడుమువాడు"

అను సీసపద్యముగా సంతరించినాడు ఇదే విధముగ

''అమరగా బలికెను అతివతో నపుడు
కోమలి యిద్దఱము గోకర్ణమందు
కూడియే యుంటిమి కొన్నాళ్లలము
భోజనమ్ములు శయనములు నొక్కచోటె
చెలియు యుంటి మేము చెలికాండ్ల వలెను

3 ఆంధ్ర కవయిత్రులు—పుట 11-12,

అతనికి నాకును అరమర లేదు
ఆతనికి నాకైక్య మతివరో వినవె"

అను ద్విపద పంక్తులను

"కోమలి యీగతిన్ మది దిగుల్పడ బల్కిన నవ్వి"

అను పద్యముగా గూర్చినాడు

స్త్రీయగుటవలననో యేమొ స్త్రీలయొక్క సరస సంభాషణలు చక్కగ రచించినది యతి అర్జునుడని తెలిసికొని సుభద్ర సిగ్గుపడుచు వచ్చి తల్పముపై పండుకొని యుండగా వదిన రుక్మిణి యేతెంచి ఆమెను పరిహాసము చేయుచున్న సందర్భమున సుభద్ర అర్జునునితో వెడలు (పు ౩౭) చున్న సందర్భమున రుక్మిణి గరపిన బుద్ధులు (పు 42) ఇట పేర్కొనదగినవి

కన్యయగు సుభద్ర సిగ్గుచే అర్జునుని గురించి సూటిగ ప్రత్యక్షముగ ప్రశ్నింప లేక తన మనోగత భావము నెట్లు వెల్లడించినదో గనుడు

'అయ్యా మీరే వేళ యరసి చూచితిరో
ఎయ్యది మీ నామ మెచ్చట నుండుదురో?
పరగు నింద్రప్రస్థ పట్టణమ్మునను
బహుళ సంపదలతో బరగు చున్నార
ధీర మానసులు కుంతీ సుతుల్ వారు
అరయ గడు సుఖులై యున్నవారె? (పుట. ౨౪)

అర్జునుడు సుభద్రను వివాహమాడి శయ్యా గృహమున నామెతో ప్రవేశించి నపుడు ద్రౌపది పడిన మనస్తాపము, ఆవేదన, పిమ్మట సమాధానపడిన తీరు తిమ్మక్క సొగసుగ, సహజముగ వర్ణించినది. స్త్రీకనుకనే స్త్రీ హృదయము నంత నిశితముగ నర్థము చేసికొనినది. లేక ఆమె స్వానుభవమునే వ్యక్త పరచినదో

# నల చరిత్ర

కర్త రఘునాథ భూపాలుడు. కాని ఈ గ్రంథము నేడెటను లభ్యమగుట లేదు. దీని లిఖిత ప్రతి తంజాపూరీ సరస్వతీ మహాలు గ్రంథాలయమున లేకుండుట శోచనీయము. దీనిని 1921 వ సంవత్సరములో చిత్రాడ రామ విలాస ముద్రాక్షశాలలో ప్రకటించినట్లు శ్రీ నిడదవోలు వెంకటరావుగారు వ్రాసిరి గాని యది సరి గాదని తోచుచున్నది నల చరిత్రను గూర్చి 1954 ఫిబ్రవరి భారతిలో శ్రీ నేలటూరి వెంకట రమణయ్యగారు వ్రాయుచు ఈ నల చరిత్ర 1928 సెప్టెంబరు మొదలు, 1929 ఏప్రిల్ వరకు కీ శే చెలికాని లచ్చారావుగారు 'ఆంధ్రభాషోల్లాసిని' యను సారస్వత మాసపత్రికయందు ప్రకటించినట్లు వ్రాసిరి నాకా పత్రికలును లభ్యము గాలేదు.

నలచరిత్ర పీఠికలో నీతడిట్లు వ్రాసెనట.
''భూషించి అచ్యుతాభ్యుదయ కావ్యంబు
నిర్మాణమున మాకు నిఖిల దేశములల
నిర్మల సత్కీర్తి నెగడు గావునను
నిటువలె ద్విపద కావ్యము పేరు యొకటి
ఘటియించి సత్కీర్తి గైకొందుననుచు

... ...

"కవి దోషహరణము కలిత పుణ్యైక
ఫలిత మైనది నలోపాఖ్యాన మనుచు''

'నల చరిత్రము ఎనిమిదాశ్వాసముల గ్రంథము. శ్రీరామచంద్రుని కంకితము చేయబడినది. నల దమయంతుల కథ సంపూర్ణముగ వర్ణింపబడినది రఘునాథుడు శ్రీహర్షాదు లలసులై పూర్వ భాగమునే చెప్పిరి గాని సర్వమును చెప్పకవిడిచిరనుటవలన నీతడు పూర్వోత్తర కథాంశములను రచించిన చక్రపురి రాఘవాచార్యు నెరుంగడనియును, లేక యీతనికి రాఘవాచార్యుడర్వాచీను డనియును భావింపవచ్చును రఘునాథ కృత నల చరిత్ర రాఘవాచార్యుల రచన కంటె రసవత్తరమైనది కవిత్వము వాల్మీకి చరిత్ర వంటిదే. పదముల

పొంకమును నుడికారపు బింకమును, వర్ణనా చమత్కారము, పాత్ర పోషణ విధానమును, రఘునాధుని కవిత్వమునకు వన్నెయిడు చున్నవి వర్ణనలను కన్నులకు గట్టినట్లు చేయును."[4] దీని యందేడాశ్వాసముల పూర్తిగను, ఎనిమిదవ యాశ్వాసమున కొంతభాగముమాత్ర మున్నటుల 'శ్రీవాత్సవ' వ్రాసిరి.[5] ''కొన్ని యెడల శ్రీనాధుని పద్యరచనముల ననుసరించినట్లు తార్కాణము చూపవచ్చును, మసి బిసికినయట్లు, ఇనుపదచ్చినమున జంజరులు చక్కిలములవలె చిక్కెనను తావులలో తెనుగు జాతీయములు కన్పట్టును రఘునాధుని సర్వశాస్త్ర విజ్ఞాన పాండితికి మచ్చుగా ప్రథమాశ్వాసములో నలుని అశ్వ కళా నైపుణ్యము, చతుర్థాశ్వాసమున సంగీత శాస్త్ర వివరణము. షష్టాశ్వాసమున నల దమయంతుల కష్టదశలు కవి వర్ణనము మొదలయినవి రఘునాధుని వైదుష్యమును వ్యక్తపరచు చున్నవి ''

హంసను నలుడు పట్టుకొనిన సందర్భమున నీకవి రచన యిట్లుసాగినది.

''కాంచన పక్షముల్ గలవంచు నెంచి
యంచల దినువార లవనిలో గలదె
పొమ్మని విడువమో పుణ్యచారిత్ర
నమ్మి నిద్రించితి నాచెక్క తుదల
బంగారమున కాసపడితివో రాజ
సింగారమే కాని చేతికిరాదు"

రఘునాథ కృత నలచరిత్ర రాఘవాచార్యుల రచనకంటె రసవత్తరమైనదనియు. పచ్చి శృంగారమందు గోచరింపదని విమర్శకుల యభిప్రాయము,

---

4 భారతి, ఫిబ్రవరి, 1947

5 శారదాధ్వజము, పుట. 191,

## నలచరిత్రము

ఈ ద్విపద కావ్యకర్త చక్రపురి రాఘవాచార్యుడు[6] ఈతడు తిరువేంగళాచార్యుని పుత్రుడు కందాళ దొడ్డయాచార్యుని శిష్యుడయిన చక్రపురి దొడ్డయాచార్యుని పౌత్రుడు వీరిది వాధూలస గోత్రము ఈకవి వైష్ణవుడయ్యును అన్య దేవతాద్వేషి గాడని గ్రంథారంభమున నీతడు గావించిన హర, పార్వతి, గణపతి దేవుల స్తోత్రాదికముల వలన నూహింప వలను పడుచున్నది ఈతడు తన కావ్యములను ఘటికాచల నృసింహస్వామి కంకితము గావించినాడు. ఈకవి క్రీ శ పదునేడవ శతాబ్దమువాడు "నెల్లూరుజిల్లా, ఉదయగిరి తాలూకా సింగరెడ్డిపల్లి అను గ్రామములోని ఒక శిలాశాసనము ప్రకారము సింగరెడ్డి పల్లిని శ్రీవాడ పెద్దవెంకటాద్రి నాయుడుంగారు శక 1573 నందన చైత్ర పౌర్ణమినాడు (క్రీ శ 1652-53) కందాళ దొడ్డయాచార్లు అయ్యగారికి జాగీరుగా ఇచ్చినట్లున్నది ఈ దొడ్డయాచార్యులే ఘోటకగిరి నివాసి అయిన మహాచార్యులు కాబట్టి చక్రపురి రాఘవాచార్యులు క్రీ శ 1690 ప్రాంతము వాడై ఉంటాడు "[7]

ఈతడు ద్విపద కావ్యమునే వ్రాయుచుండినను మొట్టమొదట నొక కంద పద్యమున దేవతాస్తుతిని గావించి గ్రంథము నారంభించినాడు

కం శ్రీ గౌరీ ప్రియపుత్రుని
నాగమ సంవేద్యులైన హరుని భవానిన్
భోగిశయను లక్ష్మిని
వాగీశుని వాణి మదిని బ్రస్తుతి సేతున్

ఇట్లు గణపతిని మొదట నుతించి పిమ్మట లక్ష్మిని, ఉమా మహేశ్వరులను,

---

6. ఈతడు "విష్ణుభక్త చరిత్రము" లేక "విష్ణు పురాణమను" నింకొక ద్విపదకావ్యమును గూడ రచించినాడు ఇందు దానిని గూర్చి పేర్కొనలేదు.

7 పండితారాధ్య చరిత్ర, పీఠిక, పుట. 141

సరస్వతీ చతుర్ముఖులను నుతించినాడు. పిమ్మటనే తన యిష్ట దైవమగు ఘటికాచల నృసింహస్వామిని నుతించినాడు.

ఇందలియితివృత్తము నలోపాఖ్యానముప్రధాన కథ యందెట్టి మార్పులను జేయక పోయినను, నచ్చటచ్చట ద్విపదకావ్యకర్త కొన్నికొన్ని స్వల్పములగు మార్పులను గావించినాడు.

1. దమయంతీ గుణబద్ధ చేతస్కుడైన నలుడు విరాళి పట్టలేక వన విహారమున కేతెంచినట్లు భారతమున నుండగా, వసంత ఋతు సమయమున వసంత శోభను గాంచుటకై నలుడు వన విహారమున కేతెంచినట్లు—

"చెలువొంది చూడ విచిత్రమై యిట్లు
వెలసిన నారామ వీధి వినోద
మంతయు జూడ నా యవనీశ్వరుండు
సంతసంబున మంత్రి జనులు బాంధవులు
హితులు గాయక పురోహితులు నాశ్రితులు
హితబుద్ధి గొల్వంగ నేతెంచి ——————"

యని మార్పుజేసెను

2 దమయంతీ జన్మ వృత్తాంతమును సూక్ష్మముగ బృహదశ్వుడే ధర్మ రాజున కెరిగించినట్లు భారతమున నుండగా, నలునిచే పట్టుపడిన రాజహంస దమయంతీ సౌందర్యమును, జన్మ ప్రకారమును నలున కెరిగించినట్లు ద్విపద కావ్యమున వర్ణితమైనది దమయంతి జన్మ వృత్తాంత మిందు వివరముగ తెల్పబడినది

3 నల దమయంతు లిరువురు నన్యోన్య రూపగుణ సంజాత ప్రీతు లై పరస్పరాకృష్ట మాన మానసులయినట్లుగాక, మొట్ట మొదట రాజహంసయే వారి కొకరి రూపగుణముల గూర్చి యొకరికి దెల్పి వారి హృదయములందు ప్రణయ బీజములను నాటినట్లు ద్విపద కావ్యమున వర్ణితమయినది,

4 ద్విపదకావ్యమున గావింపబడిన యింకొక మార్పు కృత్రిమ కిరాత రూపమును ధరించి కలి నలుని యొద్ద కేగి. వేటాడుటకు రమ్మని పిలిచి, అతని నోడించుట.

5 నల దమయంతు లిరువురును నడవులందు గ్రుమ్మరించు వసిష్ఠుని గాంచినట్లు ద్విపద కావ్యమున గలదు వసిష్ఠుడు వారి నట్లడవి యందుగాంచి, వారట్లు ముదము దప్పి యరణ్యమున కేతెంచుటకు కారణమేమి యని యడుగగా నలుడు తనకు తటస్థించిన దురవస్థ నెల్ల యాతనికి విన్పించినాడు - అపుడు వసిష్ఠుడు తన మనోదృష్టిచే సకల వృత్తాంతము నెఱిగి, అతనికి భవిష్యత్తులో మంచిరోజులు వచ్చునని చెప్పెను

6. ఏక వస్త్రధారులైన నల దమయంతులు దుఃఖ పూరితులై యడవి యందు గ్రుమ్మఱుచుండగా, కలి బ్రాహ్మణ వేషమును ధరించి, వారి యెదుట కేతెంచి, అచట నాల్గుమార్గములను గల్పించి, వారికా మార్గములను దెల్పినటులు ద్విపద కావ్యమున గలదు గాని, కలిమాయ బ్రహ్మణ రూపమున వారి యొద్ద కేతెంచినటులు భారతమున లేదు

7. నలుని విరూపునిగా జేయుటకు కలి అగ్నిని అనిలుని సహాయముతో యరణ్యమున విజృంభింపుమని పంపినటులు ద్విపద కావ్యమున గలదు భారతమున అగ్ని దానియంతటనదియే బయలుదేరినటులు గలదు అందున్న కర్కోటకుడు తన్ను రక్షింప వలసినదని నలుని ప్రార్థించినాడు

8 కర్కోటకుడు తన్నెత్తికొని పొమ్మనిన వెంటనే నలుడాతడు సర్పమని యెంతమాత్రమును సంశయింపక వెనువెంటనే నాతని నగ్ని ముఖము నుండి రక్షించినట్లు భారతమున నుండగా, ద్విపద కావ్యమున "ధరణి బాముల నమ్మదగదందు రుర్వి వెఱతు నిన్నంటగా విషధర" యిని నలుడు భీతి జెంది యాతని యంట వెఱచినట్లును, అపుడాతనికొక యుపకారము చేసెదనని దెల్పగా నలుడద్దానిని జ్వాలల నుండి తప్పించినట్లును గలదు. కానీ సర్పమిట్లు ప్రత్యుపకృతి యొనరించెదనని వాగ్దానము గావించిన పిమ్మటనే నలుడాతని నెత్తికొనిపోయెదని వ్రాయుటవలన నలునిపాత్రలోని యుదాత్తత కొంతకొఱవడి

నదని చెప్పవలెను ఆర్తత్రాణ పరాయణుడుగను, దీనరక్షాపరుడుగను, ధీరోదాత్తుడుగను ప్రసిద్ధి వహించిన నలుడు దీనుడై వేడికొనిన వెంటనే ఎట్టి సంశయమును లేక యగ్ని దష్టము గాకుండ సర్పమును గాచెననుట ఔచితీ వంతముగ నున్నది భారతమున గూడ 'నన్ను రక్షించిన నీకుం బ్రియంబు సేయనోపుదు ననిన వాని నెత్తికొన బోపం జులుకనై" యని బ్రియము జేసెదని యనెను గాని నలుడా యుపకృతి వాంఛించియే యాతని కుపకార మొనర్చినట్లు గానరాదు

9. కర్కోటకుడు కరచిన వెంటనే నలుడు "వికృతరూపముతో" నుండెనని భారతమున నున్నను ఆ వికృత రూపమెట్టిదో మనకు జీవలుడు గావించు వర్ణనవరకు తెలియదు ద్విపద కావ్యమున నట్లుగాక ఆ వికృత వేష మెట్టిదో వర్ణితమైనది

10 కర్కోటకునకు గలిగిన శాప వృత్తాంతమును తద్విముక్త వృత్తాంత మును భారతమున లేదు ఇది ద్విపద కావ్యకర్త గావించిన మార్పు.

11 దమయంతికి మునులు గానుపించి ఆమెకు భావికాల వృత్తాంతమును తెల్పిన విధమున భేదము గలదు. దమయంతికి విశ్వాసము గల్గుటకై కాబోలును ద్విపదకావ్యమున మునీశ్వరులు భావి వృత్తాంతమును మాత్రమేగాక, గడచిన వృత్తాంతమును గూడ నామె కెరింగించిరి. భారతమున,

కం. "వనజాయతాక్షి కతిపయ
దినములలో జూడగాంతు దివిరి నలుని భూ
జనసుత నెప్పటి యట్టుల
తన పురమున రాజ్య లీల దనరెడు వానిన్"

అని కతిపయ దినము లని యుండగా, ద్విపద కావ్యకర్త.

"ఎలనాగ యింక మూడేండ్లకు వెనుక
బలవంతుడైన నీ ప్రాణనాయకుని
గలసి నెమ్మదిని సౌఖ్యము నొందగలవు"

అని మూడేండ్ల కాలమును స్పష్టముగ దెల్పినాడు

12 మునీశ్వరులే దమయంతికి సుబాహు పురమునకు మార్గమును జూపి అటకేగుమని జెప్పి నలుని వర్తమానమును కూడ చెప్పినట్లు ద్విపదకావ్యమున గలదు కాని భారతమున దమయంతిని దీవించి మును లదృశ్యము కాగా— దమయంతి ఆమె కట కానుపిలచిన చనుప సహాయిములతో గూద సుబాహు పురమున కేగినట్లు గలదు నలుని వృత్తాంతము ముందుగనే దమయంతికి తెలిసిన దనుట వంన ఉత్సుకత కొరవడినది

13 ఋతుపర్ణుని యాస్థానమున దమయంతిని తలచుకొని నలుడు మన్మ థార్తుడై విలపించు చుండగా, దానిని ఋతుపర్ణుడే విని, నలుని ప్రశ్నించినట్లు ద్విపద కావ్య కర్త వర్ణించినాడు. కాని భారతమున నలుని విలాపమును ఋతుపర్ణుడు గాక జీవలుడు విని "నీ తలంచుచున్న భార్యకు నీకు నేల వియో గం బయ్యె" నని బాహుకు నడిగినట్లు భారతమున గలదు

14 సుబాహు పట్టణమున విదర్భ పురాధీశుడయిన భీమునిచే దమయంతిని వెదకుటకై పంపబడిన వసుదేవుడను[8] బ్రాహ్మణుడు సుబాహుడు బ్రాహ్మణులకు దానాదికముల చేయుచుంగా, నన్య బ్రాహ్మణులతోగూడ గలిసి రాజునిలయమున జొచ్చి దుఃఖతప్తురాలయిన దమయంతిని గాంచినట్లు ద్విపద కావ్యకర్త వర్ణించి నాడు. 'సుదేవుండను బ్రాహ్మణుండు జేదిపతియైన సుబాహు పురంబునకుం జని పుణ్యాహంబు సేయింపంబోవు బ్రాహ్మణులతో రాజగృహంబు సొచ్చి యతఃపుర బున సునందా సహితయై యున్నదాని" గాంచినట్లు భారతమున వర్ణితమైనది.

15 ఋతుపర్ణుని వలన నక్ష హృదయమును బడసిన పిమ్మట తత్సా మర్థ్యముచే నలుని శరీరమున నుండ జాలక కలి కర్కోటక విషమును గ్రక్కుచు అతని శరీరము నుండి నిర్గమించి విహితాంజలుడై తన్ను మన్నింప వేడికొనినట్లు భారతమున నుండగా, ద్విపద కావ్యమున తాడిచెంత నున్న

---

8. సుదేవుడని భారతమున గలదు.

నలుని నాడు పాము యొకటి గఱచినట్లును, అవిషాగ్నిని భరింపలేక కలి యాతని శరీరమునుండి బయల్వెడలి యేతెంచి.

> కువలయాక్షిని విన్ను ఘోరాటవులకు
> నెడబాపి పడరాని యిడుముల బఱపి
> కడు తప్పు జేసితి గరుణింపు నన్ను"

అని వేడికొనినట్లు గలదు.

16. "నిన్నుం గీర్తించిన జనంబులు నా వలన భయంబు బొందరు నాకుం గరుణింపు మనిన నలుడు గోపంబుడిగె'' నని భారతమున నుండగా, నలుడే తన్ను స్మరించిన వారిని చేరవలదని కలిని వరము వేడినట్లుగ ద్విపద కావ్యమున రచయితమైనది. కాని యిట్టి మార్పు కావ్య సౌందర్యమునకు ప్రతిబంధకముగ నుండి నాయకుని ఉదాత్తతకు కొరత జనించినట్లు నున్నది.

17. మునులు పూర్వమే నలుడు వికృత రూపుడై ఋతుపర్ణుని యొద్ద నున్నటులు దమయంతి కెరిగించుట వలన ద్విపద కావ్యమున దమయంతి ఋతుపర్ణుని సారథిగ నేతెంచిన బాహుకుడే నలుడని శీఘ్రముగ గుర్తించి యాతని పాదములపైబడి తన్నేలుకొవలసినదని వేడికొనినది.

18. ద్వితీయ స్వయంవరము చాటించి నందులకు దమయంతని నలుడు నిష్ఠుర వాక్యము లాడుచుండగా, దమయంతి తానెట్టి పాప భావమును నెఱుగ ననియును, అట్లయినచో తన్ను సూర్య చంద్రాగ్నులు చంపకుండ విడువరని ప్రమాణము గావించినట్లును, అవుడు వాయుదేవు డామె పతివ్రత యని దెల్పినట్లును భారతమున నున్నది[9]. కాని వైష్ణవుడయిన ద్విపద కావ్యకర్త దమయంతి పాతివ్రత్యమును నిరూపించుకొనుటకు అగ్నియందురు సాక్ష్యాద్విష్ణువే యేతెంచి, ఆమె సచ్ఛీలమును నలున కెరగించి నలున కప్పగించినట్లు రచించినాడు.

---

9 భారతము, అరణ్యపర్వము. ద్వి ఆ. 214-216,

19 విష్ణుమూర్తి యేగిన పిమ్మట నలుని కులగురువగు వసిష్ఠుడేతెంచి, యాతని కుపదేశము గావించినట్లు గూడ ద్విపద కావ్యమున గలదు. వసిష్ఠుని ప్రసక్తి భారతమున గానరాదు వసిష్ఠుని యుపదేశానుసారముగ నలుడు పుష్కరుని యొద్దకేగి, జూదమాడి యాతని నోడించి తన రాజ్యమును మరల గైకొని దమయంతితో గూడ రాజ్యము జేయుచు సుఖముగ నుండెను.

## కవితా విశేషములు

ఈ కవి "సలలితంబగు నాంధ్ర శబ్ద సంగతుల
దెలిపెద నీ కథ ద్విపద కావ్యమున
వలద నొప్ప నలచక్రవర్తి చారిత్ర"

అని గ్రంథారంభమున చెప్పికొనినాడు అతడు చెప్పికొనినట్లుగ, చక్కని తేటతెనుగు పదములతో, మధురములగు జాతీయములతో నొప్పారుచు నీతని కవిత్వము ముద్దులొలుకుచున్నది.

కొన్ని యెడల నీతడు "ఈతకు మించి వచ్చునే లోతు', 'విసమెక్కునే తల వెంట్రుకల్ కడచి" వంటి జాతీయములను ప్రయోగించినాడు.

నలుడడవియందు దమయంతితో

"శృంగార వనములో క్రీడింపలేని
యంగన నీ వెట్టు లడవి గ్రుమ్మరెదు
మును సౌధ సోపానముల నెక్కలేని
వనిత యెట్టెక్కెదు వసుధాధరముల?
స్ఫటికంపు మేల్కట్ల పైనెక్కలేని
కుటిల కుంతల యెట్టుగుట్ట లెక్కెదవా?
యరుదైన రత్న గేహళి దాటలేని
గరిత యే గతి దాటగలవు ఘట్టముల?"

అని పల్కిన పల్కులు, పోతనగారి "పేణ జక్కగ బట్ట వెఱవెఱుంగని

కొమ్మ బాణాసనంబెట్లు పట్ట నేర్చె' యనుపద్యము ననుకరించినట్లు దోపు చున్నది ఇదే విధముగ

'మఱియును దెగునతోమానిని డించి
సరగున జనుదేర సతిమీద మోహ
మనుతీగె కాళ్ళకు నప్పుడు చుట్టి
వెసగొన బోలేక పృథివిపై వ్రాలి
పుడమిరేడట మూర్ఛబోయి యొక్కింత
తడవున దెలసి యాతరలాక్షి జూచి (పుట 83)

యను ద్విపదలు,

''అన్నలుడు విమోహరజ్జుల బెనంగి గతాగత కారియైనయు
య్యేలయును బోలె నూఱడక యెంతయు బ్రొద్దు వినిశ్చి
తాత్ముడై —'' అను భారత పద్యానుకరణముగ నున్నవి

విదర్భరాజు సంతాన హీనుడై, విలపించిన సందర్భమును పురస్కరించుకొని సంతాన మాధుర్యమును వర్ణించినాడు

మూలమున దిఙ్మాత్రముగ సూచింపబడిన నలదమయంతుల వన విహార వర్ణనను ద్విపదకావ్యకర్త విస్తారముగ వర్ణించినాడు. ఇటులే కథా గమనమున కనుకూలమగు సందర్భముల సాయంసమయ చంద్రోదయ వర్ణనలు ప్రాతఃకాల సూర్యోదయ వర్ణనలును గావింపబడినవి. దమయంతిగావించిన చంద్రోపాలంభనము గడు సొగసుగా నున్నది

ఇట ప్రబంధములందలి యనుకరణ స్పష్టముగ కానుపించుచున్నది ఇదే విధముగ నలుడు వేఁటాడుటకై యేగిన యరణ్యమునందలి వృక్షముల వర్ణన కూడ ప్రబంధములందలి వర్ణనను బోలియున్నది. లోకమున ఈ గ్రంథమున ద్రాక్షాపాకమున మృదువులగు పదములతో జదువ జదువ నుత్సాహము వృద్ధి యగునట్లు రచన సాగియున్నది ప్రబంధ లక్షణములిందు సంపూర్ణ ముగ నున్నవి

## కవి - విష్ణుభక్తి

వైష్ణవుడయిన ఈకవి యీ కావ్యమున వీలయిన సందర్భములన్నిటి యందును విష్ణు ప్రశంసను గొనివచ్చి తన విష్ణు భక్తిని దెల్పికొనినాడు. నలుని పుట్టమును పక్షులెత్తుకొనిపోయి నపుడాతని నూరార్చుచు దమయంతి "వదలకు హరిచింత వదలకు నీతి" యనినది.

దమయంతి పాతివ్రత్యమును ప్రతిష్ఠించుటకై సాక్షాత్తు మహా విష్ణువే యేతెంచినట్లు చిత్రించుట యీతని వైష్ణవభక్తి పరాకాష్ఠ నందినట్లు వెల్లడి యగుచున్నది

అరణ్యమందు దమయంతి నేలపై పరుండిన సందర్భమున, రఘునాథ, రాఘవాచార్యులెట్లు రచించిరో గనెదము.

రఘునాథుని రచన :

"చటుల మధ్యాహ్న భాస్కర ఘోర కిరణ
స్ఫుట వల్లి గందిన పూదీగ వోలె
కసుగంది ధరమీద కన్నులు మోడ్చి
కుసుమ కోమలి నిద్ర గూర్కి యున్నదియు
సన్నుతి సకల రాజన్యుల సతులు
కనుసన్న తన యూడిగంబులు సేయ
హంస తూలిక పాన్పునందు బెంపొందు
హంస యానకు నేడు అవని పాన్పాయె"

చక్రపురి రాఘవాచార్యుని రచన :

"చటుల మధ్యాహ్న భాస్కర కిరణముల
స్ఫుటముల కందిన పూదీగ వోలె
నటవుల ద్రిమ్మరి యాకట సొలసి
మదిరాక్షి తన దేవి మహిమీద బ(ం)డి ?

నిదుర వోవగ జూచి నృప కుంజరుడు
సన్నుత సకల రాజన్య కామినుల
కన్ను సంజ్ఞల నూడిగంబులు సేయ
హంస తూలికల శయ్యను నిద్రబోవు
హంస యానకు పానుపయ్యెబో నేల"

(తృ. అ—పు. 242-243)

## నలచరిత్రము[11]

కృతికర్తను గూర్చిగాని, కృతి భర్తను గూర్చి గాని యిందు లేదు. గ్రంథమున నెట్టి విభాగమును గానరాదు గ్రంథము సమగ్రముగ నున్నది గాని కొంతశిథిలమై యున్నది కావ్యగుణములు ధర్మజునకు బృహదశ్వుడు చెప్పినట్లు గలభారతమునందలి నలచరిత్రనే పెంచి వ్రాసినాడు కవిదృష్టి యంతము కథా కథనమునందే కేంద్రీకరింపబడినది సూటియగు భావములు, ధారాళమగు శయ్య శబ్దాలంకార రాహిత్యము యిందలి విశేషము రచనావిధానమునందు గవి పూర్వ కవుల నెవ్వరిని యనుసరించినట్లు గానరాదు.

ఇందు కవి ప్రవేశమునకు బదులు శని ప్రవేశము గలదు. నల దమయంతులు దుర్భర కష్టముల వర్ణించు పట్ల కరుణ రసమును వెల్లి విరియించి నాడు.

''తడయక బహు రత్న తతి యెల్లనోడి
కడగి నాటక శాల కాంతల నోడి''

తుదకు సర్వమునోడి దీనాతిదీనుడై సతీమాత్ర సహాయుడై యడవుల బడి పోవుచున్న నలుని జూచి కవి మనస్సే కరగినది.

"ఉవిదయు దానును నొంటిమై వెడలి
నవసి యందఱు చూడ నడచి వచ్చుటయు

---

11 తంజావూరు సరస్వతి మహలు లైబ్రరీ. ఎమ్. 218—

అడవుల జేరునో సంబరం బొలిచి
బడుగు పక్షులు భంగపరచి పోవుటయు
వదలని యాకట వచ్చి చేరుటయు
నిది యాదిగా దుఃఖ మెల్ల ద్రవ్వేచును
మదిరాక్షి తనదేవి మహిమీదబండి
నిదురపోవట చూచి నృపతి శోకించె
చటుల మధ్యాహ్న భాస్కర ఘోర కిరణ
స్ఫుట వల్లి గందిన పూదీగ వోలె
కసుగంది ధరమీద కన్నులు మోడ్చి
కుసుమ కోమలి నిద్రగూర్కి యున్నదియు
సన్నుతి సకల రాజన్యుల సతులు
కనుసన్న తన యూడిగంబులు సేయ
హంస తూలిక పాన్పునందు బెంపొందు
హంస యానకు నేడు అవని పాన్పాయె"

ఈతడు వైష్ణవాచార్యుడైన ఒక తిరుమలాచార్యుని ప్రశంసించినాడు.

"సారెకు తిరుమలాచార్యుల పాద
నీరజ యుగళంబు నెమ్మి సేవించి"

దీని తాళపత్ర ప్రతి తంజావూరి లైబ్రరీలో నుండుట వలన, నిది ఆ ప్రాంతపు కవిచే రచించబడినదని ఊహించుటలో పొరబాటుండదని దలంకును. చిక్కదేవ దేవరాయల కాలమున ఒక తిరుమలాచార్యుడు ప్రసిద్ధ వైష్ణవాచార్యులుండినట్లు శ్రీ నిడదవోలు వెంకటరావుగారు వ్రాసిరి.

"చిక్కదేవరాయ కాలమున వైష్ణవ విద్వాంసులలో చిక్కుపాధ్యాయుని తరువాత రామాయణము తిరుమలాచార్యుడు ప్రసిద్ధుడు. ఈతడు క్రీ శ. 1974వ సంవత్సరమున దేవనగిరి శాసనమును రచించినాడు ఈతడు కర్ణాటాంధ్ర

సంస్కృత కవిత్వములందేగాక గాంధర్వ విద్యయందును ప్రవీణుడు" [12] ప్రస్తుత కవి ఈ తిరుమలాచార్యునే నుతించియుండినచో నీతడును ఈ కాలము నాటివాడు, అనగా 17వ శతాబ్దము వాడని నిర్ణయింపవచ్చును

## న ల చ రి త్ర[13]

గ్రంధకర్త యెవరో తెలియదు. గ్రంధమును హరి కంకితముగా రచించి నాడు.

ఇందలి రచన సరసముగా నున్నది శైలి సంస్కృత పద మిశ్రితమై ప్రౌఢమై తనరారుచున్న పురవర్ణనాదులను విస్తృత రూపమున గావించికావ్యము నకుగౌరవము నాపాదించి నాడు నలునిచే జిక్కిన హంస అతనితో తన మొరను చెప్పికొనుట నభి వర్ణించిన ఘట్టము సొగసుగానున్నది

"రాజ రాజేంద్ర యో రాజ మార్తాండ
భూజన స్తుత వంద్య భువనైకనాధ
యీకలందు తనదుబ్బ (?) యీ సువర్ణ
నీకు నక్కరంచెరుగనే రాజేంద్ర
చింతింప మంచున చెరు వేల నుండు
యింత మాత్రమునకు యీ పాపమేల
కరులను మెసగెడి కంఠీరవంబు
స్థిరమక్షికములను దిన్న నేమగును?
నిన్ను విశ్వసించి నెరయ ప్రాలితిని
నిన్ను నిర్దయుడని నెరుగలేనైతి
... ...

---

12 దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము పుట 503

13 శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ ఆర్ నెం. 166 (బి) తాళపత్రయే

తన తల్లి మిగుల నంధకురాలు ముదియు
తనయులు శిశువులు తన సతి గోల
నాకు గావగ మానవ నాథ యేను
ఆ కసిగందుల కడలెద గాని
అనుచు కన్నుల నీరు (కు) ? లాన దుఃఖమున
తను జూచి యేర్పడిన దయ జూచి నలుడు"

ఈతడు శ్రీనాథుని శృంగార నైషధ భావముల ననుకరించినట్లు ద్విపదల వలన తెలియుచున్నది పై ద్విపదలు, శృంగార నైషధమందలి 'తల్లిమ దేక పుత్రిక, పెద్ద కన్నులు గాన దిప్పుడు" యిత్యాది పద్య భావమును బోలి యున్నది.

నలదమయంతులు రాజ్యము నోడిపోయిన పిమ్మట, అడవుల కేగునపుడు కలిపురుషుడు వారికి కష్టములను కలుగజేసి, ఏమియు లభించకుండునట్లు చేసినాడు. ఆత్తరి నలదమయంతుల పాట్లను వర్ణించు ద్విపదలలో నంత్యాను ప్రాసమును ప్రయుక్తము గావించినాడు ఇందలిది ద్విపద వికారమైన రచన కావ్యము సంపూర్ణముగ లేదు ఆశ్వాస విభజన గానరాదు ద్వితీయ స్వయంవర నెపమున నలుని తనవద్దకు రప్పించుకొని, అతనిని చెలికత్తె ద్వారా, నలునిగా నెరుగుట వరకుగల కథమాత్రమే ఉపలబ్ధమగు గ్రంథమున నున్నది. తర్వాతి భాగము గానరాదు.

ముద్రితా ముద్రితములగు నలచరిత్ర ద్విపద కావ్యములు తొమ్మిది యున్నటులు తెలియుచున్నది

| | | | |
|---|---|---|---|
| 1. | నలచరిత్ర | | ... రఘునాథ నాయకుడు |
| 2 | ,, | | .. చక్రపురి రాఘవాచార్యుడు |
| 3 | ,, | | కాకర్లపూడి రాఘవాచార్యుడు |
| 4. | ,, | ఆర్. నెం. 1070 | తిమ్మనకవి |
| 5 | ,, | | వీర రాఘవకవి |
| 6. | ,, | ఆర్. నెం. 145 | అసమగ్రము, కవి పేరు తెలియదు |

7.   ,   ఎమ్ నెం. 216   సమ్మగముకాని, కర్త పేరుతెలియదు
8   ,,   ఎమ్ నెం 1073 ... అసమ్మగ్రము, కర్త తెలుగరాదు
9   ,,   .. 166 (31-39) అసమ్మగ్రము, కర్త పేరు లేదు

కాకర్లపూడి రాఘవాచార్యులు, వీర రాఘవకవులు, ద్విపద నలచరిత్ర రచించినట్లు ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తక భాండాగార ఆకారాద్య ముద్రితగ్రంథ సంచికవలన తెలియుచున్నది గాని, వీరిని గూర్చి ఏమియు తెలియుటలేదు

తిమ్మన కృత నల చరిత్ర అర్ నెం 1070, సంపూర్ణముగాని, సరిగ లేదు ఇందు పూర్వభాగము మాత్రము రామాంకితముగ రచింప బడినది

ఆర్ నెం 145 గల ప్రతియు అసమ్మగ్రము, ఘటికాచల నరసింహ దేవున కంకితము గావించినాడు ఏతద్గ్రంథకర్త కందాళ దొడ్డయాచార్యుని, ఆసూరి భాష్యకారుని స్మరించి గ్రంథరచన కుపక్రమించినాడు ఈ గ్రంథము ఘటికాచల నరసింహస్వామి కంకితము చేయబడుటవలన, గ్రంథాదియందు కందాళ దొడ్డయార్యుని సంస్తుతించుట వలనను, నిది చక్రపురి రాఘవాచార్యుల కృతిలోని భాగమై యుండునని భావింప వీలగు చున్నది.

ఆర్. నెం 1073న గల గంథ్ర మసంపూర్ణము. కర్తృహీనము

## ద్రౌపదీ స్వయంవరము

ఆంధ్ర పత్రిక పదియవ సంవత్సరాది సంచికయందు "నన్నయభట్టు వంశపుకవి—గోపాలుని రామకవి" అను వ్యాసమున శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు, "ద్రౌపదీ స్వయంవరమను ద్విపదకావ్యము, వీరభద్ర కవిచే రచితమైనది తమయొద్దనున్నటులును, దాని విలేఖకుడు గోపాలుని రామ కవి యనియును తెల్పిరి

ఇది మూడాశ్వాసముల ద్విపద ప్రబంధము ఇందలి,

"మదనూరి పురదాసు మూర్తి విలాసు
సదమల గుణశౌరి సత్య సంశీలి

పుట్ట నామాత్య సత్పుత్రుండు నీతి
బద్దిన దగ వీరభద్ర సత్కవిని"

అను ద్విపదల వలన దీని రచయిత వీరభద్రుడయినట్లు తెలియుచున్నది కనక రాజు చెన్నప్ప యను నాతడు దీని కృతిభర్త.

## సౌగంధిక ప్రసవాపహరణము

ఈ ద్విపదకావ్యకర్త కృష్ణమ రాజనందనుడురత్నాకరము గోపాలకవి పైగ్రంథమునేకాక, యింకను ద్విపద భాగవతమును,[14] సకల లక్షణసార సంగ్రహమను వ్యాకరణ గ్రంధమును రచించెను

ఈకవి తన కులగోత్రాదికములను గూర్చి గ్రంధమునందు చెప్పుకొనక పోయినను రత్నాకరము సుబ్బరాజు రచించిన తిమ్మ భూపాలకాభ్యుదయము లోని సీస పద్యమువల్ల తెలియు చున్నది

సీ "పృధు యజ్ఞవాసి నావిర్భవించిన వందివరవృత్తి యెవ్వారి వర్తనంబు
బహువిధాభయ దాన భాసమానపు విష్ణు భుజశాఖ యెవ్వారి పుట్టినిల్లు
శ్రీ కాళహస్తిధా త్రీవల్లభ కటాక్షపంక్తి యెవ్వారికి ప్రాణరక్ష
నవరస రసికులౌ కవిపుంగవులనుగ్రహపాత్ర మెవ్వారి కవనశైలి

యట్టి రత్నాకరము వారి యన్వయమున
ప్రభవమును బొంది దామర ప్రభుల వలన
నగ్రహారాది బహుమతులందియున్న
యార్య చరితుల మావారి నభినుతింతు"

---

14 ఇది అముద్రితము

15 పరిషత్పుస్తక భాండాగార గ్రంథసంఖ్య 3471, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, ఆఱవ సంపుటము, పుట. 353—గ్రంథ పీఠిక, పుట—౮.

ఇందలి ఇతివృత్తము ప్రసిద్ధమైనది, భారతారణ్య పర్వమునుండి గ్రైకొనబడినది. కాని కవి యందుందు కొన్ని మార్పులను గావింప నెంచి మూడాశ్వాసముల రసవత్ప్రబంధముగా రచించినాడు హనుమద్దర్శనము, యక్షి రాక్షసుల తోడియుద్ధము, మణిమయ వధ, మున్నగు నంశములు రెండు గ్రంథములందును గలవు.

పాండవులు బదరికావన ప్రాంతమున కేగునప్పటికి వసంతోదయమైనట్లు ద్విపద కావ్యమున వర్ణితమైనది. వసంత ఋతు ప్రసక్తి యేమియు ఆంధ్ర భారతమున గానవచ్చుటలేదు వారట కేగునప్పటికి కరకావృష్టితో ప్రచండమగు వర్షము గురిసినదని మాత్రమే అందు గలదు. ప్రియాప్రియుల కత్యంత ఆమోదకరమైన వసంతఋతు వేతేరగనే ద్రౌపది మనము ప్రియునితోగూడ వన విహారమును గోరినది అందు "అలఘులు గంధమాదన మహా ధరణీ ధర సానురత్న వేదుల బవమాన నందనుడు ద్రోపదియున్ విహరించు చున్నచో" అని మాత్రముగలదు భీమునితోగూడ వనవిహారమున కేగెదనని ధర్మజుని యనుమతిని వేడినది. కానీ ధర్మజు డందుల కంగీకరింపలేదు. తనకోర్కె మన్నించ నందున నశ్రుపూరితలోచనయై ద్రౌపది ధర్మరాజును నిష్ఠురోక్తు లాడినది. అపుడు భీముడు తానొంటిగా నడవుల కేగుచున్నాడను సంశయమును బెట్టికొనక, ద్రౌపదిని తనతో వన విహారమున కనుప వలసినదని వేడినాడు. కాని ధర్మరాజు ద్రౌపది ననుపుట కింకొక సంశయము గలదని దెల్పినాడు. ఈ సమయమున అర్జును డమరావతి యందున్నాడు. ద్రౌపదితో గూడ భీముడును వాహ్యాళి కేగినచో, ధర్మజుడు తానొంటిగాడనయి పోదుననియును. సమయమునకై వేచియున్న దుర్యోధనాదులు ఈ ఆదనును చూచుకొని తన మీదికి దండెత్తివచ్చి తన్ను నిర్జించు నేమోనను శంకను వెలిబుచ్చినాడు ధర్మరాజిట్లు ధైర్యమును వీడి, దీనముగా పల్కుట ధర్మజుని పాత్రపోషణలోని లోపమని చెప్పవచ్చును భద్రత కొరకు తన పుత్రుడయిన ఘటోత్కచు నట నిల్పి పోవుదుననియు, సతుల వాంఛలు దీర్పకున్న నగణిత పాతకంబని భీముడపుడర్జునునికి తన యంబరదూతచే వార్తనంపి యమరేంద్రపురినుండి గొని వత్తునని దెల్పినాడు. అర్జునుడా లేఖ నందుకొని ద్వైతవనమున కేతెంచి పాండ వాగ్రజునికి మ్రొక్కి ద్రౌపది పట్టిన పంతము తెరగు నెఱిగి, దేవలోకము

నుండి మందార దివ్య కుసుమాద్యఖిలవస్తువులను తాను దెచ్చితిననియును, కావున రాక్షస భయంకరమగు నా కానకు భీమునితో గూడ విహరింప నేగవల దని యామెను బ్రతిమలాడెను. కాని అర్జునుని పల్కులను విని బాష్పవారి పరి పూర్ణలోచనయై తాను మున్నెన్నడును వారి నే కోర్కెయు కోరలేదనియు యిప్పుడొక్క కోరిక కోరగా దానిని వారు తీర్ప తన్ను పరిహసించుతున్నారని దృఢనిశ్చయముతో పల్కినది ఎట్టకేలకు ధర్మజుడొడంబడి ద్రౌపదీ భీము లను వనవిహారమున కనిపినాడు

ద్రౌపదీ భీములు వన విహారము చేయుచుండగా, నొక సౌగంధిక ప్రసవము వారిముందట వాయు వశమున పడినదనియు ఆ ప్రసవము తనకు కావలయునని ద్రౌపది భీమసేనుని వేడినదనియు నన్నయ వర్ణించినాడు

కాని యీ ఘట్టమున కూడ ద్విపద కావ్యకర్త యించుక మార్పు గావించినాడు ఇరువురు కలసి యేగుచుండగా భీముడు ద్రౌపదిని జూచి, యామె కిష్టమైన వస్తువేదియో చెప్పినచో నావనమందు దాని నామెకుతెచ్చి యిచ్చె దనని పల్కినాడు ఈ వన మార్గంబునందు, ఘనమైన వస్తువుల్ గనుగొంటి నేని యప్పుడు మిమ్ము నే నడిగెద" నని పల్కినది. వారట్లు గరుడ కిన్నర యక్ష ఖచర గంధర్వ వరసిద్ధ సాధ్య నివాస భూములందు, వన నదీ పర్వత నికాయములందు క్రుమ్మరుచుండగా, వాయు వశముచే వారున్నకడ నొక కనక సౌగంధిక ప్రసవము వచ్చి పడినది ఆ కనక పద్మమును గాంచి ద్రౌపది మన మున నలరి యింతకు పూర్వము భీమసేనుడు తనకు గావించిన ప్రతిజ్ఞను జ్ఞప్తికి తీసుకవచ్చి, "నిటువంటి హాటకాబ్జములు గనుగొని యెందైన గలదేని తెమ్ము" అని వేడినది ఈ కోర్కె చెల్లించనిచో తానాచోటు పాసి వచ్చుట యసత్యమని తెల్పినది.

నన్నయ భారతమును బట్టి, యిప్పటి సమయమేమో తెలియదు ద్విపద గ్రంథమున నప్పటి సూర్యాస్తమయ సమయమైనట్లు నున్నది ఇక చీకటి దొడమ నున్నది గావున, ద్రౌపది నొంటిగ నట నునిచి తానెట్లు సౌగంధిక పుష్పమును తెచ్చుట వెడలగలననియును, నామెను తనతో గూడ తోడ్కొని

పోవుటయు దుర్ఘట మనియును డోలాయమానసుడగుచుండగా, నింతలో నారదు డేతెంచి, ద్రౌపది యొద్ద ఘటోత్కచునుంచి పుష్పాపహరణము కొరకు కేగమని తెల్పినాడు. నారదుని వచనానుసారముగ ఘటోత్కచుని రప్పించి ద్రౌపది యొద్ద నునిచి భీముడేగినాడు భీముడేగిన పిమ్మట ద్రౌపది తాను తప్పిద మొనర్చితి నేమోనని విచారింపజొచ్చినది. ఇట స్త్రీ స్వభావ చిత్రమును కవి చక్కగ గావించినాడు.

2 ఈతడు గావించిన రెండవ మార్పు ఫలమును గూర్చినది భీముని జూచి, హనుమంతుడు, "అమృత కల్పంబులైన యీ ఫలమూలంబులుపయోగించి క్రమ్మరుము" అని నన్నయ వర్ణించినాడు భీమునకు తన బలపరాక్రమములను గూర్చియున్న యహంకారమును పోగొట్టు దలచి హనుమంతుడు తనకి (మాను నందుగల ఫలమును భక్షింప నిచ్చపుట్టినదనియు కాని వృద్ధుడైనందున తాను దానిని కోయలేకపోవుటచే, ఆ ఫలమును తనకు తెచ్చియిచ్చి, పాండవుల కున్న ఆర్త రక్షణ బిరుదును సంరక్షించు కొమ్మని చెప్పినట్లు ద్విపద 'కావ్యకర్త మార్పు గావించినాడు భీముడు తన ఆయుధము లన్నిటి సహాయముతో ఆ పండును పడవేయలేకపోగా హనుమంతు డాతని పరిహసించి ఆతడూరకనే గర్వించు చున్నాడు గాని, తన వాలమును కూడ పట్టి ఎత్తలేని నిర్వీర్యుడని పల్కినాడు భీముడు హనుమంతుని వాలము నెత్త ప్రయత్నించి విఫలుడు కాగా, తన వాలము నెత్తలేనివాడవు సౌగంధిక కమలము లేమి తేగలవు కాని, మరిలిపొమ్మని పుండుమీద కారము చల్లినట్లుగ పల్కినాడు అవమాన పీడితుడైన భీముడు హనుమంతుని చంపుటకు గాని, తాను చచ్చుట గాని, గావింప నిశ్చయించుకొనగా, హనుమంతుడాతనికి ప్రత్యక్షమై నిజస్వరూపము నెఱిగించెను. నన్నయ భారతమున కేవలము వాలము నెత్తి వెళ్లమని వర్ణింపబడగా, ద్విపద కావ్యమున దీనికిందింత పూర్వరంగము కల్పింపబడినది నన్నయ భీముడు సౌమ్యుడుగ చిత్రింపబడగా, ద్విపద కావ్యమున భీముడుద్ధతుడుగ, నహంకృతుడుగ, బలగర్వితుడుగ చిత్రింపబడినాడు

३. భీముడు యక్షరాక్షసులతో గావించిన యుద్ధమున గూడ నీ కవి యించుక మార్పు జేసినాడు. భీముడు సౌగంధిక వనమును జేరి, ఆ కొలనిలో

సలిలంబు సేవించి, యనంత బల సంపన్నుండై పుష్పోపహరణము జేయ బూనగా, కుబేరుడు "పాంచాలీ ప్రియకరంబైన పవనతనయు పరాక్రమారం భంబు విని మెచ్చి వాని నుపేక్షించె"[13] అని నన్నయ వర్ణించినాడు కాని ద్విపద కావ్యమున కావలియున్న యక్షరాక్షసులకును, భీమునకును సంకుల సమరమైన పిమ్మట హతశేషులై యున్నవారు కుబేరున కావృత్తాంతమును విన్నవించినట్లును, దానిని విని 'ధనాధీశుండు విస్మయమొంది, కనుగవ మిణు గుర్లు గ్రమ్మ' తన యుపవనమున నొక నరుడు ప్రవేశించి కనక కమలయము లను గొనియెనా యని చిట్టుగా నట్టహాసము చేసి యుండగా, నలకూబరుడట ప్రవేశించి, తానేగి భీమునితో యుద్ధము గావించి దేవర సన్నిధికి గొనివత్తునని పల్కినాడు

భీముడు సౌగంధికకమలములను గొని వచ్చు సమయమున పిడుగులతో గూడ వర్షము పడగా భీతుడై ధర్మజుడు గగన మార్గమున భీముడున్న కడకేగి తమ్ముని గొనివచ్చెనని నన్నయ భారతముననుచు ఘటోత్కచుని సహాయము గొనెనని ధర్మజుడు కోరుచుండగా, నారదుడటకేతెంచి, భీమ నలకూబరుల యుద్ధము సంగతిని వివరించి, ఘటోత్కచుని భీమునకు సహా యముగా నేగుమనినాడు. అటనుండి నారదుడు దుర్యోధనుని కడకేగి పాండ వుల యిక్కట్టును వివరించినాడు దుర్యోధనుడు, భీమార్జునులు లేని యీ యదనును పురస్కరించుకొని, ధర్మజుని నోడించి ద్రౌపదిని కొని తేవచ్చునని భావించి కర్ణునితో కూడ వారున్నకడకేగెను కాని పాండవు లెవ్వరు నట లేకుండుటచే, వారు పోవుచున్న దిక్కునకు పోవుచుండగ ఘటోత్కచుడు తన రాక్షస సైన్యముతో వీరి పై కురికెను. కపటి యగు దుర్యోధను డపుడు తాము వారి సహాయార్థమే వచ్చుచున్నామని పల్కి వారితో కూడ భీముడున్న యెడ కేగెను

పిమ్మట పాండవులకు సహాయముగ కృష్ణుడును కుబేరుని పక్షమున

---

13. నన్నయ భారతము. అరణ్య పర్వము, తృతీయాశ్వాసము, పుట. 368.

శంకరుడును యుద్ధమునకు వచ్చి పోరు సల్పుచుండగ దేవతలు భీతిల్లి వారిని స్తుతించి వారి యుద్ధమును మాన్పిరి. కుబేరుడు శివుని పనుపున భీమునకు సౌగంధి కములములను దెచ్చి యిచ్చినాడు.

ఈ గ్రంధమును కవి రావిళ్ళ లింగభూపాలున కంకిత మొసగినాడు ఈ లింగ భూపాలుడు కమ్మకుల తిలకుడు. వెల్లుట్ల గోత్ర సంజాతుడు. ఇతడును, ఇతని తండ్రి తాతలును, విజయనగర సామ్రాజ్య మేలిన, సాళువ తుళువ ఆర్వీటి వంశ నరపతుల సామంతులుగ నుండి, విజయనగర సామ్రాజ్యాధిపతు లశ్వ గజపతులతో నొనరించుచుండిన యుద్ధములందు సహాయ భూతులుగ నుండిరి

ఈ కావ్యమున వర్ణితములయిన విషయములు కొన్ని విజయనగర సామ్రాజ్య మేలిన సాళువ, తుళువ, ఆర్వీటి వంశ రాజులు కృతినందిన కావ్యములందు కూడ వర్ణితములైనవి లింగ భూపాలుని మూలపురుషుడగు మల్ల భూపతి గుడిపాటి సమీపమును కుతుబుషాహి బలముల నెదుర్కొని యోడించి రాయలచే బిరుదులను పొందెనని కవి వ్రాసినాడు ఈ గుడిపాడు పూర్వము కొచ్చెర్లకోట సీమలోనియొక గ్రామము ఈ గ్రామమిపుడు నెల్లూరు జిల్లాలో ఆత్మకూరు తాలూకాలో నున్నది పూర్వము కోటసీమను విజయనగరాధీశులచే రావెళవారు మన్నెరికముగా గ్రహించి, గుడిపాడులో నగళ్ళ కోటను గట్టించుకొని అచ్చటనుండియే యా సీమను పాలించుచుండిరని దువ్వపాడు కైఫియత్తులో నున్నది.[23]

లింగ భూపాలుని భాస్వద్భుజావీర్య నిర్దళితారాతునిగా కవి వర్ణించెను. ఇతడు సుల్తాను అబ్దుల్ పాదుశాహాను జయించి, యతనిని పెనుగొండ వరకు దరిమి వేసెననియు, డాబాలుపైబడి డాగులుచేసెననియు, దళవాయి వేంకట ధరణీశుచే మెప్పులు వడసెననియున తెలియుచున్నది ఇంకను నీతడు నరపతి సింహాసన స్థాపకుడనియు, నరపతిదత్త నానారత్న భూరికరితురంగ

---

౨౩ సౌగంధిక ప్రసవాపహరణము, పీఠిక—పుట '౪'

శతాంగ ఘన భాగ్య దగను వర్ణితుడయినాడు. ఈ పేర్కొన బడిన సుల్తాను గోల్కొండ నవాబయిన అబ్దుల్లా ఇతడు గోల్కొండను క్రీ శ 1612 - 1670 వరకు పాలించెను. పైన పేర్కొనబడిన నరపతి పెనుగొండను 1630 - 1642 వరకు నేలిన పెద వేంకటపతి రాయలు, సుల్తాని అబ్దుల్ పాదుషాహ, దక్షిణ దేశముపై దండెత్తి వచ్చి క్రీ.శ 1638-42 ప్రాంతములందు నేటి నెల్లూరి జిల్లాను పూర్తిగ జయించి తన మాండలికులను నియమించెను ఈతడే పెనుగొండ నేలుచుండిన పెద వేంకట రాయలపై దండెత్తిరాగా, రాయల సహాయార్థము లింగ భూపాలుడు దండువెడలి సుల్తానుని ఓడి చి, రాయలను పెనుగొండలో నిల్పియుండవచ్చునని ఊహింప వీలగుచున్నది ఈ యుద్ధమున లింగభూపాలుడు దళవాయి వెంకట ధరణీశునిచే మెప్పు పొందెనని కవి వ్రాసినాడు ఈ వెంకట ధరశీపడు వెలుగోటి వెంకటపతి నాయనింగారయి యుండవచ్చును

లింగ భూపతి "డాబాలుపైబడి డాగులు చేసెనని కవి వ్రాసెను ఈ డాబాలు అనునది పశ్చిమ తీరమున నున్న డాబుల్ పట్టణమేమొ నని పీఠికా కారు లూహించుచున్నారు

రావెళ్ళ వారిని గూర్చి చెప్పెడి యత్యంత ప్రాచీనమైన శాసనము నెల్లూరి జిల్లా శాసన సంపుటమున నున్నది [24] కాని వీరికిని, ఈ కావ్యమున వర్ణితుడైన రావెళ్ళ లింగ భూపాలునికిని ఎట్టి సంబంధమైన నున్నదేమొ నిర్ణయించుట దుర్ఘటము

ఇదే విధముగ కర్నూలు జిల్లాలో శ్రీగిరి మండల మేలిన మరియొక రావెళ్ల వంశీయులు గలరు కాని వీరికిని ఈకృతి భర్తను కూడ సంబంధమును నిర్ణయించుట దుర్ఘటమే

## కవిత్వ విశేషములు

ఇందలి కవిత్వము నిర్దుష్టమై ధారా వాహిగా మనోహరముగ నున్నది.

---

24 నెల్లూరి శాసన సంచయము. సం. 6.

రచనా సౌందర్యమద్వితీయముగ నున్నది  ఒక్కొక్కచోట నీతడు శ్లేషను కూడ నుపయోగించినాడు

ఉదాహరణకు, ద్రౌపదీ సౌందర్య వర్ణన

"కువలయానందంబు కొమ్మ నేత్రములు
కువలయానందంబు కోమలి పిఱుదు
సారంగ విభవంబు జలజాక్షి వేణి
సారంగ విభవంబు చామ యానంబు
హరి వినోదంబు తొయ్యలి రోమరాజి
హరి వినోదంబు కంజాక్షి నెన్నడుము
అబ్జ సౌభాగ్యంబు హరిణాక్షి గళము
అబ్జ సౌభాగ్యంబు అతివహస్తంబు"

గంధ మాదన శైల వర్ణన, వసంత ఋతువర్ణన ప్రబంధములందలివర్ణన వలె శ్లేషలతో కూడి ప్రౌఢముగా నున్నవి. ఇదే విధముగ కళానదీ వర్ణన కూడ ఈతని వర్ణనా సౌష్ఠవమునకు తార్కాణమగుచున్నది

ఈతడు జాతీయములగు పలుకుబడులతోను, నానుడలతోను సామెతల తోను, శైలికలంకారము నాపాదించి, రచన కద్వితీయ సౌందర్యమును చేకూర్చి నాడు.

"పిచ్చ్చ గుంటమై ఘనము
జారు భాగీరధి జనుదెంచు లీల"
మెప్పుగా దలుపులు మ్రింగు వానికిని
యప్పళాలన నెంత యని విజ్ఞంభించి"
"కడప దాటగ లేవు కడువడి మీరి
జడధు లెల్లను దాటి చన దలంచెదవు
తెగి కూటిలో రాయి తీయగ నోప
వెలయుచు సంగడా లెత్త బోయెదవు"

"పిడుగు కొంచెంబైన బెడిదంబె గాదె?"
"ఇంట గెల్చి రచ్చల గెల్వ వలయు"
"భువి నావులావును బోట్లాడి కెరలి
కవిసిన లేగల కాళ్లెల్ల విరుగు"

## కపోతవాక్యము[25]

అముద్రితము

కర్త ఆర్వేల నియోగి వెంకటగిరి కృతిని వేంకటేశ్వరాంకితము గావించినాడు. ఈతని కాల మెరుగరాదు

ఇందలి యితివృత్తమునకు మూలము భారతమందలి శాంతి పర్వములోని కపోతోపాఖ్యానమే. 'జ్ఞానానందమయ' మను శ్లోకముతో గ్రంథారంభమును గావించి, విభీషణుడు తన్ను శరణు వేడ వచ్చినపుడు, శ్రీరాముడు సుగ్రీవునకు శరణాగతుడైన వానిని గాచుట తమ ధర్మమనియును, పూర్వము పక్షులు కూడ శరణాగతుడైనవానిని గాచినవని దెల్పి, అ కథను దెల్పినాడు

ఈతడు బోయవాని వర్ణన సందర్భమున రచించిన ద్విపదల వలన నీతని శైలి తెలియగలదు

"శబరి యని యెడి శబరుండు గలడు,
నల్లని దేహంబు నట్టి నాసికయు,
బల్ల బెరిగిన కడుపు పాము నాలికయు
యెర్రని కన్నులు యెనుపోతు ముఖము
వరపైన యధరంబు పల్ల వెండ్రుకలు
అంటిన చెక్కులు అరయంగుళములు

25. శ్రీ వెంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ డి. నెం 1036—తాళపత్రము.

గంట్ల మోమును చాల ఘనమైన పెదవి
విలువంక కాళ్ళను విరసిన వ్రేళ్ళు
పల్ల మీసములు పాప......"

ఈ వర్ణన కళ్ళకు గట్టినట్లున్నది.

## కపోత వాక్యము[26]

అముద్రితము

కర్త జౌబళయ్య సర్వయ కొడుకు ఈతడు కూడ శ్రీరాముడు సుగ్రీవునకు జెప్పినట్లుగ రచించినాడు

ఇందుగూడ వ్యాధుని వర్ణన పై గ్రంథమునందు వలెనే యున్నది.

"శరభుడని పేరిడి శబరుండు గలడు
నల్లని దేహంబు నట్టి నాసికయు
పల్లవించిన కడుపు పాము నాలికయు
యర్రని కన్నుల యెనుబోతు ముఖము
పరపైన యుదరంబు పల్ల వెంద్రుకలు
అంటిన చెక్కులు అరయంగుళములు
గండైన మోము ఘనమైన పెదవి"

ఈ రెండు కావ్యములును ఖాతతము ననుకరించి వ్రాసినట్లు గానరాదు. ఇర్వురును ఒకే మూలమునుండి రచించియుందురు బోయవానిని వర్ణించిన సందర్భమందలి ద్విపదలు ఒకే విధముగ నుండుట వలన, రెండును ఒకే మాతృకకు ప్రతులేమొ నను సందేహము గల్గుచున్నది. కాని గ్రంథకర్తలు

26. శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ, డి నెం. 1035 (అర్ నెం 141) — తాళపత్రము.

వేరు వేరుగా అవతారికలో పేర్కొనబడినారు ఇది యెట్లు జరిగినదో తెలియ జాలదు.

ఆ స్త్రీ పక్షిని గానక మగపక్షి విలపించిన ఘట్టము కరుణరస స్ఫోరక ముగనున్నది

"నేడెందు బోయేనో యెలనాగ యిపుడు
అనుచు కపోతముండంత శోకమునను
కంద వలత జూచి కానగ వగచి
పలుకులు దినరావు పణతి నాతోడ
అలుకమై యిచ్చటి కరిగెనో గాక
కాయింబు విడచనెనో కానక నన్ను
పాయదు యెన్నడు పద్మ సుగంధి
నీవంటి చతురాలు నీవంటి ముగ్ధ
నీవంటి లావణ్య నిధి యెందుగలదె"

ఈ జాబళయ్య కావ్యమునకు వేరొక ప్రతి తంజావూరు సరస్వతీ మహలు గ్రంథాలయమున గలదు.[27] కాని దానిలో అవతారికాభాగము, గ్రంధకర్తృ వివరములు లుప్తమైనవి కర్తృనామము తెలియదు అవతారికలో పేర్కొన బడ లేదు ' అని డిస్క్రిప్టివ్ క్యాటలాగు నందున్నది గాని, ఇది జాబళయ్య కృతికి ప్రతియే. శబరుని వర్ణన యిందుగూడ పైవాని యందు వలెనే యున్నది.

ఇదిగాక తంజావూరు పుస్తకశాల లోని ౩౮౬ సంఖ్యగల 'రామ కధ' లో కూడ నీ 'కపోతవాక్య' కధయే గలదు ఇంకను ఆర్ నెం 1038, 1039, ప్రతులు ఈకథేతి వృత్తముతోనే యొప్పుచున్నవి.

ఆర్ నెం 1038 ప్రతి గ్రంథకర్త యెవరో తేలియదు 1039 ప్రతి కర్త కూడ తెలియదుగాని, అతడు కందాళ వరదాచార్యుని శిష్యుడుగ పేర్కొన బడినాడు.

---

27 తంజావూరు మహలు గ్రంథాలయము, ఎమ్ నెం 371.

రంగనాథ రామాయణమందీ కథా ప్రసక్తి వేరొక విధముగ నున్నది.
(రం రా యుద్ధ కాం)

## పరశురామాయణము[28]

కర్త ఉలిచి భావజ్ఞుడు. గ్రంథము కనకాద్రి కంకితము గావింపబడినది. ఈతని కాలమును గూర్చి తెలియరాకున్నది.

పరశురాముడు కార్తవీర్యుని ఓడించిన కథ మంజరీ ద్విపద ఛందమున వీర రస స్ఫోరకముగ రచింపబడినది పాడుట కమవుగ, రసికులు మెచ్చునట్లు రచించినాడు. శ్రీరాముడు పరశురాముని విల్లును త్రుంచుటయు, పరశురాముడు శ్రీరాముని ప్రస్తుతించుటయు చివర గలవు

డిస్క్రిప్టివ్ క్యాటలాగునందీ గ్రంధము పూర్వోత్తర విభాగములు విభజింపబడినట్లు తోచుచున్నదని వ్రాసిరి. కాని, పూర్వార్థము మాత్రమేయున్నది. ఇదియు నసమగ్రముగ నున్నది అక్కడక్కడ పాదములలో కొన్ని పదములు, అక్షరములు క్రిమి దష్టములై పోయి కన్పడుట లేదు.

దీనిని గురించి బ్రౌను దొర యీ విధంగా నోట్ వ్రాసియున్నారు

"దీనియొక్క మాతృక కుంపణీ వారు పెట్టుకొన్న చెన్నపట్టణం కాలీజులో (College) మెకంజీ పుస్తకాలలో వున్నది An abstract of this work, by Mr Taylor is in Madras Journal No 19 (April 1838, P 353 This poem is mere rubbish and on perusing the beginning I desired the transcriber to desist The illeterate comparer did not even know the laws of rhyme"

ఇందు కార్తవీర్యుని జన్మాదినుండి కథ ఆరంభమైనది. కవిత పేలవముగ నున్నది

---

28 మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము, డి నెం 1111 కాగితప్రతి

## వి రా ట ప ర్వ ము[29]

అముద్రితము

ఇది విరాట పర్వ కథకు మంజరీచ్ఛందమున సంక్షేపమగు రచన. కర్త యెవరో తెలియదు పత్రములు రెండు దెసల యందులు శిథిలములైనవి గాన గొన్ని పదములు లుప్తము లైనవి

దేవతాస్తుతిని, కుకవి నిందను గావించి గ్రంధరచన కుపక్రమించినాడు దుర్యోధనుడు పాండవుల నన్యాయమార్గమున జూదమున నోడించి అరణ్యవాసమున కనుపుటయు, వారద్దానిని ముగించి, అజ్ఞాతవాసమునకై మారువేషములను ధరించి, విరాటుని దర్శించుటతో గ్రంథారంభము నొనర్చి, సింహబలుడు ద్రౌపదిని జూచి మోహించుట, కీచక వధ, ఉత్తర గోగ్రహణములను వర్ణించి, ఉత్తరా వివాహ ఘట్టముతో కథను ముగించినాడు వర్ణనాదులను విడిచి సంక్షేపముగ రచించినాడు.

## కు శ ల వో పా ఖ్యా న ము

ఈ గ్రంధకర్త లావనూరి రామనార్యుడు. జౌభళామాత్య డీతనితండ్రి అనుజులు సిద్ధన సింగనలు వీరిది నియోగి శాఖ నందవరీక కుటుంబము. ఈతడు తాను వింజమూరి తిరుమలాచార్యుని శిష్యుడనని చెప్పికొనినాడు. ఈతడీ కావ్యమును రామభద్రాంకితముగా రచించి తన జీవితమును ధన్యము గావించుకొనినాడు

ప్రస్తుత పరిష్కృత గ్రంధమును బట్టి యీతని గూర్చిన వివరము లేమియు దెలియ వచ్చుటలేదు. ఈతడు తన తండ్రి యౌభళామాత్యుడని జెప్పినాడు కాని అతడే రాజు నాశ్రయించి యుండెనో తెలియుటలేదు. సాధారణముగ

---

29. ఆర్. నెం 2232 — తాళపత్రము, మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము.

ఆమాత్య శబ్దము నియోగుల నామధేయముల చివరి నుండుట చూడవచ్చును. అమాత్య శబ్దమును బట్టి నియోగి శాఖీయులని మాత్రమే తెలియుచున్నది. ఈతడు తన కావ్యము రామభద్రున కంకిత మొసగుట వలన, నీతని కాలమును స్థానమును నిర్ణయించుట కూడ దుర్ఘముగ నున్నది ఈ గ్రంథాంతముననే కవి తన్ను గూర్చి యీ వివరములను మాత్రమే తెల్పికొనెను

"కృతులకు పెచ్చు సంగీత సాహిత్య
చతురుండు తిరుమలాచార్య శిష్యుండు
నతిలోకుడగు నందనగరాగ్రహార
పతి లావనూరి యౌభళమంత్రి సుతుడు
రామకథా విశారదుడైన సుకవి
రామనార్యుడు గవి రాజ మిత్రుండ"

(ఉత్తరభాగము గ్రంథాంతము) పుట 259.

ఈ గ్రంథము యొక్క వేరొక ప్రతిలో నీ కవిని గూర్చి మరికొన్ని వివరములు నున్నవని ఈ గ్రంథ పరిష్కర్తలు తమ ఉపోద్ఘాతములో వ్రాసిరి. [30]

కుశలవోపాఖ్యానము జైమిని భారతములోని యశ్వమేధ పర్వాంతమగు కుశలవ చరితమునకు స్వతంత్రానువాదము, కవి యీ విషయమును స్పష్టముగ తెల్పినాడు.

శ్రీరామచంద్రుడు రావణ వధను గావించి సీతాదేవితో గూడ నయోధ్య కేతెంచి, పది వేల యేండ్లు సుఖముగా సీతాదేవితో గూడి రాజ్యముచేయుట, పిమ్మట లోకాపవాద భీతిచే నిర్దోషురాలును, పూర్ణ గర్భవతియునగు సీత నడవిలో దిగ విడుచుట, అట సీత వాల్మీకి యాశ్రమమున కవలలను గనుట, ఇట అయోధ్యలో శ్రీరాముడశ్వమేధ యాగమును చేయదలచి, అశ్వమును దిగ విడు

---

౩౦ కుశలవోపాఖ్యానము, ఉపోద్ఘాతము. పు. ౯.

చుట, ఆశ్రమ ప్రాంతముల కేగిన యశ్వమును లవుడు పట్టుకొనుట శత్రుఘ్న సైనికులకును, లవునకును పోరాటమగుట, మూర్ఛితుడైన లవుని గొని వార యోధ్య కేగుట, యితర మునికుమారులవలన లవు డయోధ్యకు గొంపోబడిన వార్తను సీతా కుశు లెరుగుట, లవుని రక్షించుటకై కుశుడు వారివెంట నేగుట, అట భరత లక్ష్మణ శత్రుఘ్ను లందరును కుశునకోడి పోగా శ్రీరాముడు స్వయముగా యుద్ధభూమి కేతెంచి, వీరితోపోరాడి వారిబాణధాటి కోర్వలేక, నలసి తేరిపై పడుట, కుశలవులు యుద్ధమున విజయులై శ్రీరామాదుల భూషణాదులను గైకొని హనుమజ్జాంబవంతుల దోడ్కొని యాశ్రమ భూమి కేగి జానకికి తమ జయమును దెల్పుట, వాల్మీకి వాక్యములచే శాంతిని బొంది శ్రీరాముడు ఆశ్రమమున కేతెంచి. కుశలవుల జన్మ వృత్తాంతము నెఱిగి, అట సీతాదేవిని దర్శించి, వారినందరను దోడ్కొని యయోధ్య కేతెంచి అశ్వమేధమును సంపూర్తిగా వించుట యిందలి యితివృత్తము.

జైమిని భారతమున, కుశలవ చరిత్రము ప్రాస్తావికోపాఖ్యానము. అందు ప్రధాన కథ భారతకథ. భారత కథా శ్రవణానందపరుడగు జనమేజయునకు పార్థ బభ్రువాహనుల యుద్ధావసరమున తండ్రి కొడుకులకు యుద్ధమేర్పడుటను వినగా, నాశ్చర్య జిజ్ఞాసలు కల్గినవి. ఆ సమయమున పార్థ బభ్రువాహనుల యుద్ధ మాశ్చర్య విషయము కాదనుటకు మాత్రమే అట కుశలవ చరిత్రము వర్ణింపబడినది. భారత శ్రవణ కుతూహల పరాయణుడైన జయమేజయుని కౌతూహలమునకు భంగము వాటిల్లకుండ కుశలవ చరిత్రము నాతి దీర్ఘముగ వర్ణింపబడినది. మూలమున సంగ్రహముగ వర్ణింపబడిన యితివృత్తమును వర్ణనాదులచే విస్తృతపరచి, సందర్భానుసారముగ నాయా రసాదులను గూర్చి, కథకనుగుణముగ కొన్ని సందర్భములందు మూలమందలి కొన్ని ఘట్టములను సంగ్రహపరచియు, కొన్నిటిని విస్తృత పరచియు, కొన్ని యెడల విడిచి వైచియు, కొన్ని యెడల స్వకపోల కల్పితముగ కల్పించియు, సర్వాంగ సుందరమగు నొక రసవత్కావ్యముగ దీర్చి దిద్దినాడీకవి.

ఈ కవి చేసిన మార్పులలో యవతారికలో గావించిన మార్పు ప్రధానమైనది జైమిని భారతమున, జైమిని ముని బభ్రువాహనునకును, అర్జునునకును,

యుద్ధమును వర్ణింపుచ కుశరాముల యుద్ధమువలె నుండెనని వర్ణింపగా, జనమే జయుడు కుశరాముల వృత్తాంతమును విన కుతూహలపడుట, దానిపై జైమిని రాముడు కుశలవులతో యుద్ధము గాంచిన కథను వర్ణించెను.

కావి రామనార్యుడు పార్థుడును గర్ణుడును దీవ్రమగు యుద్ధము చేయు చుండ. కుశరాముల యుద్ధమువలె నుండెననగా జనమేజయుడు కుశరాముల వృత్తాంతమును వినగోరుటయు. తదుపరి జైమిని కుశలవ చరితమును వర్ణించి నట్లును మార్పుజేసినాడు

కుశరాముల యుద్ధ ప్రస్తాన భారతమున తండ్రికొడుకుల యుద్ధము అర్జున బభ్రువాహనుల యుద్ధ సందర్భముననే వచ్చిన దనుట బాగుగ నున్నది, కర్ణార్జునుల యుద్ధ సందర్భమున ఆ ప్రస్తావన సరిగా సందర్భమున నిముడుట లేదేమో. కవి యిట్టి మార్పు ఏ యుద్దేశముతో జేసినాడో చెప్పజాలము. మూలమునందలి ప్రస్తావనయే ఔచితీవంతముగనున్నది

2 శ్రీరాముడు రావణాదుల సంహరించి యయోధ్యకు వచ్చి కౌసల్యకు మ్రొక్కగా, కౌసల్య రాక్షస బాణములచే క్షతగాత్రుడైన కుమారుని జూచి కడుంగడు దుఃఖపడి తన హస్తములచే శ్రీరాముని దేహమును స్పృశింపగా, నాతడు క్షత నివారుడైనట్లు మూలమునగలదు.

"కౌసల్యాం జననీ పశాన్నమస్కర్తు మగాచ్ఛసః ।
మలినాం పంకదిగ్ధాంగీం రామదర్శన లాలసామ్ ॥ [33]

ఈ పట్టున కవి మూలావిధేయముగ ననువాదమును సాగించినాడు. శ్రీరాముని దేహమందలి రాక్షస బాణ క్షతములు కౌసల్యాకర స్పర్శముచే నివారింప బడుటను కవి దెల్పలేదు "శోకార్తియై మీదు జూడక యంటి" మొదలగు కౌసల్యా వాక్యములు మూలమున గానరావు

---

33 జైమిని భారతము, అశ్వ.పర్వ. అధ్యా 25 శ్లో. 11-19

శ్రీరామచంద్రుడు నగరు ప్రవేశించగా, శ్రీరామచంద్రునిపై ఘన పుష్ప వృష్టి గురియుట, యిత్యాది వన్నియు అమూలకముగ కవిచే కల్పింపబడి, కావ్యమునకు సౌందర్యాపాదకములగుచున్నవి.

దశవర్ష సహస్రాణి రాజ్యం చక్రే స రాఘవః
ప్రజాం నలేభే సీతాయాం పాలయన్పూరజస్థితిమ్

మూలమున శ్రీరామునకు సీతయందు సంతతి గలుగలేదని మాత్ర ముండగా, రామనార్యుడు సందర్భోచితముగ, సంతతిలేనివారు పడు వ్యధ నంతటిని సవిస్తరముగ వర్ణించి సంతతిలేని శ్రీరాముని దైన్యమును చక్కగ స్పష్టము గావించినాడు

ఈతడు గావించిన, వసంతఋతువర్ణన, వర్షాగమన వర్ణన, సీతారాముల వనవిహారములు, జానకి వర్ణన వనవర్ణన మొదలైన వన్నియు, మూలమున గానరావు. కృతికి కావ్యత్వము నాపాదించుటచే కవి యిట్టి వర్ణనలను గావించినాడు.

కుశలవులు లక్ష్మణ సేనలతో పోరాడుచుండిన సందర్భమున లవుని విల్లు విఱుగగా నాతడు సూర్యుని స్తోత్రముచేసి, ఆ విల్లును మరల పొందినాడు, ఈ సందర్భమున నీసౌర స్తోత్రము పెద్దదిగా నున్నది కాని యనువాద గ్రంథమున నీస్తోత్రమేమియులేదు "తనభక్తి గమలబాంధవు దిక్కుజూచి, మ్రొక్కి సౌరస్తోత్రమున నమ్మహాత్ము దక్కక ప్రార్థింప'' సూర్యుడు దివ్యకార్ముకము నా బాలున కొసగి నట్లు మాత్రమే కవి దెల్పినాడు

సూర్యాస్తమయ వర్ణన మొదలగు వానిలో నీ కవివర్ణనా పాటవమున కుదాహరణముగ పేర్కొన వచ్చును.

వాల్మీకి యాశ్రమ వర్ణనకూడ ప్రబంధములందలి వర్ణన వైఖరిని బోలి సుందరముగ నున్నది. (ఉ.బా.వు 98)

రస ప్రకటీకరణమందీ కవి సిద్ధహస్తుడని చెప్పవలసియున్నది. సీత

శ్రీరాముడు(తన్నరణ్యమందు) పరిత్యజించినాడని తెలిసికొని వ్యథాపూరితురాలై విలపించు సందర్భమున నాయడవి యందున్న మృగపక్ష్యాదులు కూడ వ్యథ చెందినవని వర్ణించిన సందర్భము కరుణ రసపూరితముగ నుండి చదువరుల హృదయములను ద్రవీభూత మొనర్చుచున్నది

"మృగములు కదుపులు మేతలు మఱచి
పొగలుచు బురబుర పొక్కంగ దొణగె
తఱచుగా జెదరిన తమ కలాపముల
నెఱయంగ గన్నుల నీళ్ళను వెడల
దమయాట లటుమాని ధరణిజ జూచి
నమ్మళ్ళు వాపోవ నలుదిక్కులందు
గొఱుకుల విడిచి పక్షులు మహీసుతకు
నెఱయంగ రెక్కల నీడ గావించె
జల పక్షుదప్పుడా జానకి మీద
జలముల జల్లగా జల్లగా దొణగె
చమరీమృగంబులు చపలాక్షి జేరి
తమ తాళ వృంతంబుల విసరె"

ఉత్తర భాగమంతయు నించుమించుగా,యుద్ధవర్ణన తోనే నిండియున్నను, ఆయా సందర్భములకు తగినట్లుగా రచన గావించి విసువు జనియింపకుండ వైవిధ్యమును చవి చూపినాడు.

## రామకుమారి విజయము [35]

అముద్రితము.

పై పేరున నొప్పు కుశలవ చరిత్ర, మూడాశ్వాసముల గ్రంథము. కర్త చిదంబరకవి తనను గూర్చి యవతారికలో నిట్లు చెప్పికొనెను.

---

౩౫. ఆంధ్ర సాహిత్య పరిషత్పుస్తక భాండాగారము,

"అని రామనామక హరికృపాలబ్ధ
ఘన సంస్కృతాంధ్ర సత్కవితారహస్య
విదుడు భారద్వాజ విమలగోత్రజుడు
పదవాక్యనిధి చిదంబర కవీంద్రుండు
రుచిరసాలంకార రూఢులు మెఱయ
రచియించినట్టి శ్రీరామకుమార
విజయ ప్రబంధంబు ..."

గ్రంధాంత మిట్లు గలదు

"గురుడు భారద్వాజ గోత్రవంశజుడు
పరమ విఖ్యాతుండు భాగయార్యుండు
తన తపంబుల పంట తటి బండె ననగ
దనయుండు గల్గె నాధన్యాత్మునకును
నరనుత వేంకట నరసింహ సూరి
యురు యశోనిధి యుర్వి నుదయించిమించి
యనుపమ మహిముడై యంబుధి విధుని
గనన చందంబున గనియె
నారాయణాఖ్యుని నరనాధ పూజ్యు
నారూఢ మతి గనె నమ్మహాత్ముండు
దనధర్మ పత్నియై తనరక్కమాంబ
యనసూయ కెనయగు నా సాధ్వియందు
సుతుల నల్వుర గాంచె నతుల విశ్రుతుల
సతత శ్రీహరి భక్తి సంసక్త మతుల
నాలల్వురందు నేనవర జన్ముండ"

# కుశలవ కథ [36]

అముద్రితము.

దీని కర్త యెవరో తెలియరాదు. దీనిని రంగనాథ రామాయణమును జూచి వ్రాసినట్లుగ నున్నది

"శ్రీరామచంద్రు డాశ్రిత వార్థిత చంద్రు
డారఘునాయకుండభయ దాయకుడు
కారుణ్య వారధి గాంభీర్య ధనుడు
చారు యశోనిధి సత్యసంధుండు
అమర విద్రావణుండైన రావణుని
నమిత ఒలోదీర్ణుడగు కుంభకర్ణు
హతశాత్రవోపాయుడగు నతికాయు
నతుల వీర్యోన్మత్తుడగు నింద్రజిత్తు
చతురంగ బలవీర సచివాప్త బంధు
సుతులతో జముడున్న చోటికిని ననిపి"

ఇట్లారంభమై —

"శ్రీరాము సేవయు జేయుచు నెపుడు
నారూఢినియతితో నవని బాలింప
భూచక్రమున బోలు పొందుచునుండి
... ...
ఆజ్ఞాను సారిగా నఖిల సంపదల
సుజ్ఞాన యుక్తులై నారిది రాజ్యంబు
ఏలుచుండిరి యింపలరార
ఆ కుశలవోపాఖ్యాన మిదియు

36. ఆంధ్ర సాహిత్య పరిషత్తు పుస్తక భాండాగారము, నం. 1844.

ఇదియె యుత్తర భాగ మిందు కులేశ"

అని ముగింపబడినది

శ్రీ,రామచంద్రుని యొద్ద బొమ్మాకృతిగా నొక స్త్రీ కలదని కైక సీతతో దెల్పగా, నామె యేగి. తద్వృత్తాంతము నెరిగి రాముడు లేని సమయమున అమ్మ లను పొడిచేసి తాగినట్లును అటుపై నామెకు గర్భము నిల్చినట్లును గల యితి వృత్త మిందలి వస్తువు ఇందు కథ కుశలవుల జన్మ ప్రకారము నుండియు గలదు.

## శ్రీకృష్ణార్జున సంవాదము (గయోపాఖ్యానము)

ఈ ద్విపద లఘు కృతి కర్త నాదెండ్ల గోపమంత్రి, ఈతడు సుప్రసిద్ధు డైన మంత్రి తిమ్మరుసు మేనల్లుడు ఈతని సోదరుడయిన నాదెండ్ల అప్ప మంత్రి మాదయ్యగారి మల్లన రాజశేఖర కృతి భర్త. ఈ అన్నదమ్ము లిరువు రును, శ్రీ కృష్ణ దేవరాయల కాలమున క్రి.శ 1509-1530) ఆతని రాజ్యాంగ మున దుర్గాధ్యక్షులై, కృతికర్తలై, కృతిభర్తలై వితరణ ఖేలనా తత్పరులై బహు ప్రసిద్ధులై యుండిరి. పీరి వంశవృక్షము రాజశేఖర చరిత్రమున నీయ బడినది. [37]

37 ఈ నాదెండ్ల గోపమంత్రి సంస్కృత ప్రబోధ చంద్రోదయమునకు చంద్రిక యను వాఖ్యానమును రచించెను. ఆ వ్యాఖ్యాన అవతారికలో గూడ వారు తాము సాళువ తిమ్మరుసు యొక్క భాగినేయులమని చెప్పికానిరి [38] "గోపన మంత్రి చాణక్య ప్రజ్ఞగలవాడై భట్టి, యుగంధరుల వలె, రాజనీతియందప్రతి మానుడై యుండెను. రాజశేఖర చరిత్రమందు గోమర్యమంత్రి గుత్తి దుర్గ పాలకుడుగ జెప్ప బడినాడు "[39]

---

38. ప్రబోధచంద్రోదయ అవతారిక, 4–6
39. విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయ చరిత్ర (ద్వి భా పు 301)

గోపమంత్రి క్రీ.శ 1520 నుండి 1533 వరకు కొండవీడు పరిపాలకుడుగా నుండి నపుడే యీ ద్విపద కృతిని రచించినట్లు ఈ గ్రంధావతారిక వలన తెలియుచున్నది

కృష్ణార్జున సంవాదకధ భారతమున లేదు. చరిగొండ ధర్మన కృతమగు చిత్ర భారతమున నీకధాఛాయ గలదనియును, అయినను నీకధ కేవల కల్పిత మనియు విజ్ఞుల యభిప్రాయము ఇది గయోపాఖ్యాన కధ

ఇది కృష్ణార్జునుల సంవాద రూపమున నుండుట వలన కవి దీనికీ పేరిడి యుండును

నాదెండ్ల గోపమంత్రి ఆంధ్ర గీర్వాణ భాషలయందసమాన పాండితీ విభవము గలవాడు. ప్రబోధ చంద్రోదయమున కీతడు విరచించిన వ్యాఖ్యానమే, ఉత్తమ మైనదిగా, ప్రశస్తతరమైనదిగా నెన్న బడుచున్నది స్వకపోల కల్పితముగ నీ గయోపాఖ్యాన కధ నీతడురచింమ టీతని కల్పనాప్రాగల్భ్యమును చెప్పక చెప్పుచున్నది. మొట్టమొదట దీని నీతడే రచించినాడు. ఈతని కావ్యము ననుసరించియే రామయామాత్యుడు మొన్నగు వారు పద్య కావ్యకావ్యములుగా, చిలకమర్తి లక్ష్మీ నరసింహముగారు నాటకముగా వెలయించిరి.

"గోపమంత్రి కృతి, కధాప్రధానమై, సెలయేటి నీటివలె స్వచ్ఛమైనది. వర్ణనలు సందర్భోచితముగా చేయబడినది చిలకమర్తివారి గయోపాఖ్యానమునందు వలెగాక, యిందు సంభాషణలు పాత్రల యుదాత్తతను వ్యక్తీకరించుచున్నవి కృష్ణ శపధ సమయమున కోపరసము, గయుని యాత్రలలో కరుణరసము, సుభద్రరాయబారమున శాంతరసము, సంగరమున భయానక రసము, చక్కగా ప్రపంచితములైనవి. [43]

---

41 ఆధునికాంధ్ర వాఙ్మయ వికాసవైఖరి—పు. 78-79

42 తెలుగు జానపదగేయ సాహిత్యము, పు. 112

43 కృష్ణార్జున సంవాద పీఠిక పు 26

గ్రంథారంభమున నీతడు గావించిన ద్వారకాపుర వర్ణన, కైలాసవర్ణన రాత్రివర్ణన లీవని వర్ణనా పాటవమును జాటుచున్నది ఈతడు స్వయముగ యుద్ధనీతి నిపుణుండై నందున గ్రంథమున యుద్ధవర్ణనమును కన్నులకు కట్టి నట్లుగ గావించినాడు

"మహిమతో నుండంగ మధురాపురముగాని, పొలుపార వైకుంఠపురము గాదు" అను పోతనగారి పద్యమున కనుకరణముగా నీ క్రింది ద్విపదలను రచించినాడు

"కోపింప గోపాలకుల మూకగాదు
చూపట్టు ప్రతి భటస్తోమంబుగాని
వినగోపికా గీతవినతులుగావు
తనరిన హయ హేషితంబులుగాని,
సరికెక్క గేలికాచలములు గావు
సరభసమత్త కుంజరములు గాని'' (పు 65)

సంస్కృతమున మహా విద్వాంసుడయ్యు సరళమగు శైలికే వాడి యున్నాడు

ఈతడు మహాదాని. కొండవీటిలోని రాఘవేశ్వరునకు వప్రహర్మ్యములను నిర్మించి, ఆ దేవత నిత్య నైవేద్యమునకు మైదవోలను పురమును దానము చేసి నాడు. దాని నీతడీ గ్రంథ యవతారికలో గూడ తెల్పుకొనెను

ఈ దాన శాసనములు క్రీ శ. 1520, 1522 నాటివి. ఈ కొండవీటి రాఘవేశ్వరునకే ఈ ద్విపద కృతి నంకితము గావించినాడు.

## అభిమన్యు కల్యాణము[44]

అముద్రితము

---

44. శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ—డి. నెం. 1020—తాళపత్రము.

గ్రంధకర్త శేషము చెన్ను భట్టారకుడు లక్ష్మమ్మ వెంకటార్యుల పుత్రుడు పరమ వైష్ణవుడు గ్రంధమును రామాంకితముగ నొనర్చినాడు. ఈతడు క్రీ శ 1690 ప్రాంతమువాడు

ఇందలి యితివృత్తము ప్రసిద్ధమగు శశిరేఖాభిమన్యుల వివాహ కధయే అయిదాశ్వాసములుగ విభజింప బడినది శృంగార రస భూయిష్ఠముగ రచింప బడినది

శశిరేఖాభిమన్యుల సమాగమమును ప్రారంభమున చెన్ను భట్టారకుడు, నాటకీయ రీతిని ప్రవేశపెట్టినాడు తన పెంపుడు చిలుక యభిమన్యుని వద్ద నున్నటు లెరిగి, శశిరేఖ దానిని తనకీయమని అడుగుటతో నిర్వురికిని సంభాషణ మొదలై ఆ సంభాషణ క్రమముగ నొకరిపై నొకరికి గల ప్రణయమును వ్యక్తపరచుకొనుటతో ముగిసినది ఇందు శశిరేఖ విరహము, ఆమె, మన్మథ చంద్రాదులనుపాలింభించుట॰ వివాహానంతరము వారి విహార లీలలు వర్ణింప బడుటచే, నిది, ప్రబంధము వలె చదువుటకు రుచికరముగ నున్నది ఘటోత్కచుని యుద్ధవర్ణన సుదీర్ఘముగ సాగినది శశిరేఖాభిమన్యుల వివాహ సందర్భమున తెరయెత్తిన పిమ్మట అభిమన్యుడు శశిరేఖ సర్వావయవములను తిలకించి నాడు అతని దృష్టులే ఆమెకు భూషణములై తనరారినట్లు వర్ణించిన విధము సొగసుగానున్నది

"వరుమాడ్కి కొప్పుపై వ్రాలిన యపుడు
తరుణికి క్రొవ్విరుల్ దాల్చినట్లయ్యె
నుదురుపై నరనందను దృష్టి పరవ
సుదతికి దోచె కస్తూరి బెట్టినట్లు
వరుస కన్నుల మీద వరుచూడ్కి సోక
తెలవకు కాటుక దీర్చినట్లుండె
పతి చూపు కెమ్మోవి పైసొంపు గులుక
అతివ కర్పూర వీడె మందినట్లయ్యె"

ఇత్యాదిగా సాగినదీవర్ణన

"ముక్కుద్రాట కాలు ద్రొవ్వెదరు''
"ములుకు మాటల ముంచివేసెదవు''
"గాజుల గుదికి రోకలి బూనినట్లు''
"గుడ బాయ సంబైన గుదిటపై నిడక
నుడుకు జుర్రిన నోట కౌక రుచి గలదె''

వంటి జాతీయములను ప్రయుక్తము గావించినాడు.

పీణె లక్ష్మీపతి యనునాతడీ అభిమన్యు కల్యాణము ననుసరించి పద్య కావ్యమును రచించినట్లు తెలియుచున్నది [45] ఈ కథ భారతమున గానరాదు.

45 మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము, ఆర్. నెం 3281.

ఏడవ ప్రకరణము

# చరిత్రాత్మకములు

## సిద్ధేశ్వర చరిత్ర

కర్త కాసె సర్వప్ప, ఆంధ్ర వీరుల ప్రతాప పరంపరలను నలుదిక్కులవెదజల్లి ముష్కర తురుష్కులను తమ కరవాలమ్ముల కెఱజేసి, హైందవ సంస్కృతిని కాపాడి, ఆంధ్ర తేజమును, శౌర్యమును, పాదుకొల్పిన మహిమాన్వితులు కాకతీయంధ్ర చక్రవర్తులు పీరి చరిత్రను కావ్య రూపమున గానము చేసి, పీరి యశో సుమ సౌరభములను నల్గడల గుబాళింప చేసిన కవి కాసె సర్వప్ప ధన్యుడు ఈతని తల్లిదండ్రులు లక్ష్మాయి మల్లరాజులు తన స్వగ్రామము బొలికొండ సీమలోని చెర్వుపల్లి గ్రామమని చెప్పుకొనినాడు. మరల "పెండార్లనుండియు నండ జేసికొని" అని కూడ చెప్పికొనెను. ఈ పెండార కాజీపేట సమీపమునగల పెండ్యాల యేమొ భార్య మూలముగ రాజస్థానమున నుద్యోగమును సంపాదించి హనుమకొండయందు నివాస మేర్పరచుకొనెను

ఈ కవి క్రీ శ 1550 ప్రాంతము వాడై యుండును [1] కవి స్తుతిలో, సీతడు (పశుపతి) నాగనాధుని పేర్కొనినాడు నాగనాధుడు క్రీ శ. 1369 ప్రాంతము వాడని, అయ్యనవోలు దేవస్థానమునందలి స్తంభముపైగల అనవోతానాయకుని శాసన రచయిత అయినందున తెలియుచున్నది. కాన సీతడు క్రీ.శ 1369 తర్వాతివాడే.

---

1. వీరేశలింగము పంతులుగారు, చిలుకూరి వీరభద్రరావుగారు, చాగంటి శేషయ్యగార్లు ఈ కవి క్రీ.శ. 1400 ప్రాంతమువాడని వ్రాసిరి. గోల్కొండ కవుల సంచికయందుకూడ యీతని కాలము క్రీ.శ. 1400 ప్రాంతముగానే పేర్కొనబడినది

కవి నరపతి రాయలను మొల్ల రామాయణమును పేర్కొనుటవలనను (నరపతులనగా విజయనగర రాజులు) నతడు క్రీ శ 15వ శతాబ్దమున ఉత్తరార్థమునగాని, 16వ శతాబ్దము ప్రారంభమునగాని యుండియుండును.

సిద్ధేశ్వర చరిత్ర కేవల ద్విపద గ్రంథముగాదు గ్రంథాంతమున వచన భాగముగలదు మూడాశ్వాసములలో ద్విపద భాగమున్నది ద్విపదలో మొదటి భాగమున శివుడు, సిద్ధేశ్వర నామముతో హన్మాద్రిపై వెలయుటయు, ద్వితీయ భాగమున కాకతీయరాజుల చరిత్రయు, వచనభాగమున ప్రతాపరుద్రుని చరిత్రయు వర్ణితము లైనవి వచన భాగము ప్రక్షిప్తమని విమర్శకుల యభిప్రాయము

సిద్ధేశ్వర చరిత్రయందు, చెన్నమరాజు కాకతీయవంశ మూలపురుషుడుగ దెల్పబడినాడు ఈ వెన్నమకు, పోరంకి వెన్నమ, అతనికి పెండ్లి గుండన జనించినట్లిందు దెల్పబడినది. పెండ్లి గుండమ రాజు చనిపోవునాటికాతని పుత్రు డెఱక దేవరాజు బాలుడయినందున అతని మేనత్త కుంతలాదేవియాతని పక్షమున రాజ్యమేలినది పిమ్మట ఎఱక దేవరాజు, తరువాత భువనైక మల్లుడు, అనంతరము త్రిభువనమల్లుడును రాజ్యమునకు వచ్చిరి వీరిని చారిత్రక కాకతీయ వ్యక్తులుగ నిర్ణయింపుచు వారి కాలము నిక్కడ శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము గారిట్లు చెప్పిరి.

| | |
|---|---|
| కాకర్త్య గుండన (పెండ్లి గుండమరాజు) క్రీ.శ, | 950–975 |
| కుంతలదేవి (కామసాని) క్రీ శ ,, | 975–994 |
| ఎరుక దేవరాజు (బేతరాజు–1) ,, | 914–1030 |
| భువనైక మల్లుడు (ప్రోలరాజు–1) ,, | .0Ɔ0–1075 |
| త్రిభువన మల్లుడు (ప్రోలరాజు–2) ,, | 075–1110 |

కాబట్టి ఈ గ్రంథమందు చెప్పబడిన ఎరుక దేవరాజే కాకతీయరాజుల లోని మొదటి బేతరాజని లక్ష్మీరంజనముగారనిరి విరియాల కామసాని, గూడూరి శాసనము నాధారముగ నీ విషయములను నిర్ణయింప వీలున్నది. గూడూరి శాసనమున విరియాల వంశ మూలపురుషులు దుర్జయాన్వయులుగ నభివర్ణింప

బడిరి ఈ వంశీకులు ప్రథమ కాకతీయరాజులు శక్తివంతులై రాజ్యమున స్థిరముగ పాదుకొనుటకు మిక్కిలి సహాయపడిరి దుర్జయ వంశమున చెన్నుడు, చెన్నునికి ఎఱ్ఱడు, ఎఱ్ఱనికి విరియాల భీముడు, ఈతని కెఱ్ఱడు జనించిరి, ఎఱ్ఱ నరేంద్రుని భార్య కామసాని, వీరు కాకతీయులను సింహాసనమున సుస్థిరముగ నిల్పుటకు పాటుపడిరి. గావుననే వీరిని తమ వంశ మూల పురుషులుగ కాకతీయులు దెల్పికొని యుందురు [2] వీరు పరస్పర వైవాహికాది సంబంధములనుగూడ కలిగియుండిరేమొ విరియాల కామసాని గూడూరు శాసనమున "ఎఱ్ఱ డాప్పుడై" అను వావాక్యము వీరొకరికొకరాప్తులను విషయమునే సూచించుచున్నది. గూడూరు శాసనమందలి వెన్నుని డా. పుట్టపర్తి శ్రీనివాసాచారిగారు బోరంటి వెన్నయని దెల్పిరి అపుడీ బోరంటి స్వల్ప భేదముతో సిద్ధేశ్వర చరిత్రయందు పేర్కొనబడిన పోరంకి వెన్నుడని భావింప వచ్చును కాకతి మైలాంబ బయ్యారం చెఱువు శాశనమున పేర్కొనబడిన పిండి గుండమయే, సిద్ధేశ్వర చరితయందలి పెండ్లి గుండమషయియుండును ఈతదే కాకర్త్య గుండన ఈతని పుత్రుడు గరుడ బేతరాజు ఈతదే మొదటి బేతరాజను పేర కాకతీయ వంశ మూలపురుషుడుగ నెన్నబడుచుండెను ఈ బేతరాజే అనుమకొండను కైవసం చేసికొని దానిని కాకతీయ రాజధానిగ చేసికొనినట్లు సిద్ధేశ్వర చరిత్రయందు చెప్పబడినది. ఆ విషయమీ శాసనమున గూడ గలదు. సిద్ధేశ్వర చరిత్రలో తెల్పబడిన తక్కిన కాకతీయ రాజులందరును చరిత్ర కెరుక పడినవారే.

ఈ కాకతీయులు కందాపురమునుండి వచ్చినట్లే గ్రంథమున గలదు. ఈ కందాపురమానంద గోత్రీకుల రాజధానియనియును, అపురము నేలిన రాజులుగ చెప్పబడిన మాధవ వర్మాదులానంద గోత్రరాజులనియు వారు నాల్గవ శతాబ్దమున కృష్ణా, గుంటూరు ప్రాంతములను పాలించిరనియును శ్రీలక్ష్మీరంజనముగారు తమ బృహత్పీఠిక యందు దెల్పిరి. ఈ కందారపురము నాందేడు

---

2 కాకతి మైలాంబ బయ్యారం చెఱువు శాసనమున దుర్జయుడు వంశ మూలపురుషుడుగ చెల్పబడినవాడు (భారతి ఏప్రిల్ — 1967)

జిల్లాలోని కందహారై యుండునని మరియొక అభిప్రాయముగలదు [3]

ఈ మాధవ వర్మ సంతానార్థము సిద్ధేశుని కూష్మాండ ఫలములచే పూజింపగా వెన్నమరాజను పుత్రు డుదయించినట్లి గ్రంథమున గలదు ఈ కథ ననుసరించియే తరువాతి కాలమున కాకతీయులు గుమ్మడి తీగయందుద్భ వించిరను ఐతిహ్య మేర్పడియుండును ఇది అనితల్లి కలువ చేరు శాసనమున గూడగలదు

"కాకత్యాః పరశక్తేః కృపయా కూశ్మాండవల్లి కాకాచిత్[21]
పుత్ర మసూత దేతత్కులమనఘం కాకతీయ సంజ్ఞమభూత్"

కాకతమ్మ యనుదేవతను పూజించుట వలన కాకతీయులను నామమేర్పడి యుండునని మరి కొందరు తలంచుచున్నారు.

## సర్వప్ప కవిత్వము

కృత్యారంభమున నీతడు తన్ను గురించి వ్రాసికొనిన ఈ క్రింది ద్విపదలు కేవలము వినయోక్తులు గావనియు, కొంతవరకు యథార్థములేనని, గ్రంథమును చదివిన పిమ్మట తెలియును.

"శబ్ద సంగతులు శాస్త్రాదిది విమల
శబ్ద లక్షణములు చర్చించి యెఱుగ
నాటకాలంకార నవ్య రీతులను
కూటువ లుంకువల్ గుణ దోష ఛంద
వాటంబు లేమియు వరుసతో నెఱుగ
సిద్ధేశ్వర స్తుతి చేకొని యె (ద) ను
లబ్ద ప్రసాదు (౦డ) సిద్ధేశు కరుణ
కర మరుదగుచు శ్రీ కరమగు చుండు

3. భారతి, ఏప్రిల్, 1767

వరవర్ణితంబగు పర కవిత్వంపు
తప్పొప్పు లెఱుగ నాతని స్వామి కరుణ
జెప్పితి నీ కృతి చేకొని వినుడి"

ఉత్తమ కవికుండవలసిన ప్రతిభావ్యుత్పత్తు లీతనిలో లేవనియే చెప్ప వలెను కావ్యమున ఒండురెండు తావులందు మాత్రము రసవత్తరముగ రచించి తన కవితా పాటవము ప్రదర్శించుకొనినాడు ఈతడు గూడ పోతనవలె తన కావ్యమును నరాంకితమును చేయక సిద్దేశ్వరాంకితము గావించినాడు

కవి గ్రంథమున చరిత్రకే నెక్కుడు ప్రాధాన్య మొసగెననియును వ్యాకరణాది విషయముల నంత గణణీయముగ భావింపలేదనియును తలంప వలెను మొత్తముమీద నీతడు శుద్ధ దేశీయమగు కృతిని రచించిన దేశికవి ఆంధ్ర దేశమునకు సంబంధించిన వీరులు కాకతీయులు వీరి చరిత్రము నితి వృత్తముగా గైకొనినాడు కాకతీయులు శైవులు ఛందో విషయమున వేరుగ చెప్పనక్కరలేదు. అది ద్విపదయే భాషను గూడ లోక వ్యవహారమునకు సమీపముగ నున్నదానినే గైకొనినాడు

సంధుల విషయమున అకారేకార సంధులను, క్త్వార్థ కేకార సంధులను గూర్చినాడు కందువలర్చెను సర్వప్పనువాద భూమందును, గోదావరుత్తరించి౯ బలము దూరటుబోవ, మున్నగునవి.

సద్యజీవన్ముక్తి అని కొన్ని చోటులందు సంస్కృత సమాస విషయము లలో గూడ స్వాతంత్ర్యమును జూపెను. వైరి సమాసములను గూర్చినాడు

జీవర్లు, సరదార్లు, బత్తీసు, చప్పన్న దేశములు మొదలగు అన్య దేశ్య పదములను వాడినాడు.

ఛందో విషయమున కూడ స్వాతంత్ర్యమును జూపించినాడు ఈతడు 'నల' 'భ' గణములను పంచమాత్రాకములుగ నొనర్చి 'నలల', 'భల'గుణము లను వాడినాడు

"పదకమల సౌరభాస్వాదమాన" — పుట. 21
''నందగిరి యని యెడి చందంబు గలుగ, —పుట 29
''సానుమతి హోమ సంస్కారాది విధుల" —పుట 35

ప్రాస యతిలో ద్విత్వ ద్విత్వరహితములకు మైత్రిని పాటించినాడు.

''ఱాల రువ్వెన భక్తులెల్లర భూతి"

ప్రాసవర్ణము సంయుక్తాక్షరమైనపుడు, దానిలో నొక్క హల్లుతో మాత్రము, మైత్రిని పాటించినాడు

''గోపుర ప్రాసాద కుట్టిమంబులను
నేర్పుతో రచియించెనేపు దీపింప"

ఋకారమునకు, ఉకారముతో మైత్రిని గూర్చినాడు

కృష్ణ గోదావరీ కుంభిని మధ్య - పుట 23
''ఉందు రెప్పుడు ముని బృందముతోడ'' —23
''ఋత్విక్కులను బిల్చి రూఢిగా జేయ" —35
''మృడుడు సిద్దేశుడు ముదిత నీకిచ్చు'' —41

యకారముతో తెలుగు శబ్దముల నారంభించినాడు యఱుక దేవరాజు, ల—న లకు యతిని కూర్చినాడు. (పు-21)

అనుస్వార సహిత ట, త లకు మైత్రి చెల్లునని అప్పకవి మతము ఈతడు ట తలకు అనుస్వార రహితముగనే యతిమైత్రిని గూర్చినాడు

''దుర్గాది దుండి వట్లు క్షేత్రపాల'' పుట—20

ఈతని కవిత నిర్దుష్టమై శ్లాఘా పాత్రము కాకపోయినను, ఆంధ్రభాష యందు చారిత్రక కావ్యము ను రచించిన యీతనికి కావ్య జగత్తున ఉన్నతమగు స్థానమే లభించినది.

ఎనిమిదవ ప్రకరణము

# వీరగాథా సంబంధములు

## పల్నాటి వీరచరిత్ర

ఈ గ్రంధకర్తృత్వ విషయమై భిన్నాభిప్రాయము లున్నవి దీనిని కొందరు ప్రసిద్ధుడైన కవి సార్వభౌముడు శ్రీనాథమహాకవి రచించెనని భావింపగా, మరికొంద రా పేరుగల మరియొక ప్రౌఢకవి రచించెనని అనుచున్నారు. ఈ శ్రీనాధుడు రచించిన గ్రంథముకూడ పూర్తిగ లభింపటలేదు. లభ్యమగుచున్న పల్నాటి వీరచరిత్ర కథా భాగమున, బాలచంద్రుని యుద్ధము మాత్రమే శ్రీనాథ విరచిత భాగమని విజ్ఞుల అభిప్రాయము దానిని అక్కిరాజు ఉమాకాంతము గారుద్ధరించి ప్రకటించిరి మిగిలిన కథా భాగము, మల్లయ కొండయాదులు రచించిరి [1]

పల్నాటి వీరచరిత్ర కేవలము చారిత్రక ఘట్టము గాక పోయినను నిందు కొన్ని చారిత్రక ఘట్టములు కల్పనలును నల్లిబిల్లిగ నల్లుకొని పోయినవి ఇందలి కొందరు వ్యక్తులు చారిత్రక పురుషులు ధరణికోట భీమదేవుడు, కోట కేతరాజు, కాకతి రుద్రుడు, వీర భల్లాణుడు, వీర సోముడు, వెలనాటి గొంక రాజు, మున్నగు ప్రసిద్ధ చారిత్రక పురుషులతోపాటు, బాల చంద్రానవోతుల వంటి కల్పిత పురుషులు కూడ దర్శన మిచ్చుచున్నారు ఇందుగానవచ్చు, చారిత్రక పురుషుల నాధారముగ గొని ఈ యుద్ధ కాలమును క్రీ శ 1178-1182 మధ్య ప్రాంతముగ కీ శే అక్కిరాజు ఉమాకాంతముగారు నిర్ణయించిరి.[2]

---

1. మొత్తము పల్నాటి వీరచరిత్ర గ్రంథము నిటీవల శ్రీయుతులు పింగళి లక్ష్మీకాంతము గారు, అవసరాల సూర్యారావు గార్లు సంపాదించి ప్రకటించిరి

2 పల్నాటి వీర చరిత్ర - అక్కిరాజు వారిది, ద్వితీయ భూమిక

పల్నాటి వీరచరిత్ర ఏ కారణముచేత నైననేమి సంపూర్ణముగ నొక్క చోట లభించుట లేదు అసలు పాటలు పాడెడి పిచ్చుక కుంట్ల వారి యిండ్లలో కూడ ఈ గ్రంథము సరిగ లేకిపోవటయేగాక, వారిలో నొకరికొక భాగము, ఇంకొకరికింకొక భాగమును వచ్చును అనేక కవులు వ్రాసిన గ్రంథ భాగములను ఐతపర్చినగాని, గ్రంధము సంపూర్ణముగాదు ఇట్లేల అనేక కర్తృక మైనదో చెప్పజాలము. వీరిలో ఒక్కొక్కరు పూర్తి గ్రంధమునే వ్రాసిరో, లేక తమకు నచ్చిన భాగమునే వ్రాసిరో చెప్పుటయు కష్టమే కాని వ్రాసిన కవులెల్లరును శ్రీనాధుని పేర్కొనిరి. కొన్ని భాగముల అవతారికగాని, గ్రంధ కర్తల పేర్లు గాని, గానరావు పల్నాటి వీర చరిత్రమునకు సంబంధించినవి మొత్తము పదునొకిండు ప్రకరణములు గలవు

1 అనుగురాజు పలనాటి సంపాదనము
2 పలనాటి రాజ్య విభాగము
3. కోళ్ళ పోరు — గోపన్న విరుగు
4 అరణ్య వాసము లేక మండాది వలస
5 మంద పోటు — లంకన్న విరుగు
6 గురజాల యుద్ధము
7 అలరాజు రాయబారము
8. కల్లు ప్రతిష్ఠ
9 బాల చంద్రుని యుద్ధము
10. కొమ్మరాజు యుద్ధము
11. బ్రహ్మన విరుగు

మొదటి రెండు ప్రకరణములను వ్రాసిన కవి యొకడే ఈ భాగమునకు కృత్యవతారిక గలదు శ్రీనాధుడు నవరస సంభరితముగ రచించిన కావ్య కధను తాను రచింపు చున్నానని దెల్పి చెన్నకేశవుని మదిలో దలచి రచన కుపక్రమించినాడు కాని యాతడెవరో దెలియదు.

కోళ్ళ పోరు, గోపన్న విరుగు నను భాగమును మల్లన యనునాతడు

రచించెను ఈ కోళ్ళ పోరాట ఘట్టము వీర చరిత్రయందలి రసవద్ఘట్టములలో నొకటి, మల్లయ రచనా పద్ధతి కూడ రసవంతముగ నున్నది.

కల్లు ప్రతిష్ఠ బాలచంద్రుల యుద్ధమును, శ్రీనాథుని రచన యని కృత్యా ద్యంతముల యందుగలదు. వీనినే బాలచంద్ర యుద్ధముగ శ్రీ అక్కిరాజు ఉమాకాంతముగారు తొలిసారిగ 1925 లో ప్రకటించిరి.

కొమ్మరాజు, యుద్ధమును రామిశెట్టి కుమారుడయిన కొండనాహ్వయుడు రచించెను

పల్నాటి వీర చరిత్ర కథ సుప్రసిద్ధము ఈ గ్రంథమును కీ శే అక్కిరాజు ఉమాకాంతము, పింగళి లక్ష్మీకాంతముగార్లు కూలంకషముగ విమ ర్శించి యుండుటవలన, మరి దాని గుణ దోషములను గూర్చి ప్రసంగించుటకు తావు లేదు.

'ఆరంభంలో జీడినూనె గుడ్డలు ధరించి దాపము క్రిక్రై అనుగు రాజాదులు బయలుదేరడం మధ్యన బాలచంద్రుడి వైరాగ్యోపదేశం వృత్తావసానమంతు ఉభయానికి వినాశం బ్రహ్మనాయుడి ఉపదేష్టృత్వ ప్రతిపత్తి, వీటి అన్నిటివలన మహా భారతంలోవలె ఇక్కడకూడా ప్రధానరసం శాంతమని, వీర కరుణాదులు అంగరసాలని నిర్ణయింపవచ్చును [3] ఇందు అంగిరసము వీరమని శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు వ్రాసిరి

పల్నాడు కృష్ణానదీ దక్షిణతీర ప్రాంతమున నున్నది ఇది ప్రస్తుతము గుంటూరు జిల్లాలో నొక తాలూకాగా నున్నది. గురిజాల దీని ముఖ్య గ్రామము. నాగులేఱు చంద్రవంక లిచటి నదులు కార్యమపూడి నాగులేటి, తీరమునను, మాచెర్ల చంద్రవంకా తీరమునను గలవు. 'నాగాధిపతి ప్రాణనాశంబుచేసి, నడుముగా పారిన నాగులేరాయె' నని నాగుబామును చంపి మధ్యగా పారుటవలన

---

3. పల్నాటి వీర చరిత్ర – ద్వితీయ భూమిక—అ. ఉ. పుట. 9

దీనికి నాగులేరను పేరు వచ్చినట్లు తెలియుచున్నది నాగజాతి వారీ దేశమున నుండినట్లు చరిత్ర చెప్పుచున్నది

వీరచరిత్ర పల్నాటి భారతము రెండు గ్రంథములయందును దాయ భాగమును గూర్చియె తగవేర్పడినట్లు గలదు కౌరవ పాండవు లన్నదమ్ముల బిడ్డలు కాగా, మలిదేవాదులు సవతి బిడ్డలు, జ్యేష్ఠుని పుత్రుడు దుర్యోధనుడు రాజ్యమును గోరినట్లుగనే తన తల్లి రాజ్యము తనకు రావలెనని నలగామురాజు పట్టుబట్టి యుండును ఐకమత్యముగ నుండవలెనని దుర్యోధన నలగామా దులకు వారిహితులు శ్రేయోభిలాషులు, స్నేహితులు చెప్పిరి. కాని వారు వినలేదు అందువలన కౌరవ రాజ్యము వలెనే పల్నాటి రాజ్యముకూడ రెండుగా విభజింపబడినది. శకునిచే దుర్యోధనుడు ప్రేరణ నందగా నలగామునకు నాయకురాలు సంప్రాప్తించినది. పంచియిచ్చిన రాజ్యమును తిరిగి అపహరించు నుద్దేశ్యముతో దుర్యోధనుడు మాయ జూదముచే ధర్మరాజాదుల నోడించి కానల కంపగా మోసమున కోళ్ల పోట్లాటచే బ్రహ్మన నోడించి మలి దేవాదుల నరణ్యము లకు పంపినది నాయకురాలు అట గోగ్రహణ మిట మందపోటు గడువు తీరిన పిమ్మట తమ భాగములను తమ కీయమనగా దుర్యోధన నలగాములు నిరాకరించిరి. రెండు గ్రంథముల యందును రాయబారములు నడచినవి కృష్ణుడు విషప్రయోగము నుండి తప్పించుకొనగా అలరాజు దానికి బలియైనాడు. సంధి ప్రయత్నములు విఫలములైనవి వారు కురుక్షేత్రమునను వీరు కార్యమపూడి యొద్దను ఘోర యుద్ధ మొనర్చిరి అట ధర్మము జయమంది రాజ్యము ధర్మరాజాదులకు ప్రాప్తించగా, నిట నలగామునకు దక్కినది, కాని యది బ్రహ్మయ దయాభిక్షవలన వీరచరిత్ర యందలి కొమ్మరాజు భారత భీష్ముని వంటివాడు. ఇందు పేడిపాత్ర నేవిధముగ సృష్టింపదలచి లంకన్నకు ఆడు వేషమును గల్పించినాడు కవి ఇట్లది పల్నాటి భారతమై యలరారుచు ఆంధ్రులకు విస్మరింపరానిదై పల్నాటి వీరులు చిరస్మరణీయులగు చున్నారు

ఇందు కవులు, కులపగ, కనకతప్పెటలు వస్తువునకు బదులుగా వస్తువులు, నరికితే తప్పానవాలు, దాగుండు, మున్నగు వ్యాకరణ విరుద్ధ

ప్రయోగముల గావించినారు  వీరు రచించిన మంజరీ ద్విపద యందు మూడింద్ర గణములు, ఒక సూర్యగణము, మూడవ గణాద్యక్షరము యతి స్థానము అను నియమము గూడ పలు తావుల నుల్లంఘింప బడినది. యతి భ్రంశములను రచయితలే గావించిరో లేక తరువాతి లేఖకులే గావించిరో చెప్పుట కష్టము  పాడుకొనుటకు తాళలయాను యుక్తముగనుండుటకును గణనియమను కవియే యంతగా పాటింపలేదేమో.

తాళము కొరకు కొన్నిచోట్ల శబ్దముల రూపములు మారిపోయినవి, వసంతము, వాసంతమైనది  ఇంకను గణ భంగ విశేషములను శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు తమ పీఠికలో చూపి యున్నారు.

గ్రాంధికములు గాని, వ్యావహారిక శబ్దములను పెక్కింటిని వాడిరి. మగతనమనుటకు మొగతనమును వాడిరి  'మగ' శబ్దము వ్యవహారమున మొగగ నుచ్చరింప బడుచున్నది  మగడు అను పదము 'మొగుడు' అని విన్పించు చున్నది అటులే ఉచ్చారణలోనున్న శబ్దములే గైకొని ప్రయోగించిరి. ఇటులే 'వచ్చు' నకు 'ఒచ్చు' అని ప్రయోగించిరి

వీరు ప్రాతిపదికకు గాక ప్రత్యయమునకు బహువచన రూపమును జేర్చి ప్రయోగించిరి.

'ఏ పుంజులందు నెరుగమే భూమి'

ఇంకను వీరు వస్తిమి, తెస్తిమి పుడితె, అట్టుయితే, వెళ్లితె అనతిస్తిరి, మొదలగు శుద్ధగ్రామ్యములను వాడిరి

కొన్ని విలక్షణ పదములను ప్రయోగించిరి  ఓజులు (బత్తులు) అసత్తువ (బలహీనత) పరిగె (పరుగున) మగసిరి (పౌరుషము) పడుచువాడు (పసివాడు) మొదలగున వెన్నియో వింత పదములను ప్రయోగించిరి,

## కా ట మ రా జు క థ

ఈ కాటమ రాజు కథ ఆంధ్రప్రదేశమున, ముఖ్యముగా నెల్లూరు, గుంటూరు మండలములందు కడు ప్రసిద్ధమై గానము చేయబడు ద్విపద ప్రబంధము హంసవింశతిలో దీని ప్రశస్తి వర్ణింపబడినది[4]

గొల్లలు దీనిని భక్త్యుద్రేకములతో చెప్పుదురు మాదిగలలో నొకతెగ వారును, కొమ్ము వారును, గొల్లలలో నొక తెగవారగు పికిలి వారును ప్రచారము చేయుదురని శ్రీమల్లంపల్లి సోమశేఖర శర్మగారనిరి ఏటేట కాటమరాజుకు, యాదవుల దైవమైన గంగకు పూజలు జాతరలు జరుగును.

నెల్లూరు రాజు నల్ల సిద్ధి రాజునకును, కనిగిరి రాజైన యాదవ కాటమ రాజునకు పుల్లరి విషయిమై జరిగిన పోరాటమే కాటమరాజు కథయందలి విషయము ఇదికూడ పల్నాటి వీర చరిత్ర వంటి బృహద్గ్రంథము వీరికథా వాఙ్మయములో నది ప్రాచీనమైనది దీని కర్త గంగుల పిన యెల్లయ, ఈతడు శ్రీనాథుడు, దీనిని రచించినట్లును, దానినే, తాను చెప్పినట్లును అవతారికలో చెప్పెను

"పినయెల్ల యనువాడు ప్రియము దీపింప
·వలనొప్ప శ్రీనాథు వచన పద్ధతిని
సలిపెను యదుశాస్త్ర చరితమంతయును"

ఇందువలన శ్రీనాథుడు పల్నాటి వీరచరిత్రను వలె కాటమరాజు కథను గూడ రచించెనని కొందరు తలంచుచున్నారు.[5] కాన దీనిని శ్రీనాథుడనుకవి యొకడు రచింపగా, అతని వచనపద్ధతి ననుసరించి యీకవి చెప్పెను.

ఈతడు వీర కథా వాఙ్మయమందును, దేశి రచనలయందును నుత్సాహమును గొని, పల్నాటి వీరచరిత్ర, కాటమరాజు కథలను రచించియుండును.

---

4. కాటమరాజు గథ, 2-88
5 కాటమరాజు కథయని యొక పద్యప్రబంధము కూడ గలదు. ఆపద్యప్రబంధకర్త కూడ శ్రీనాథుడు కాటమరాజుకథను రచించెనని పేర్కొనినాడు.

ఈ కాటమరాజు కథకు సంబంధించినవే, బట్టు రాయబారము, కోటిపాటి తాటి వృక్షము తెచ్చే కథ, ఎఱ్ఱగడ్డ పాటి పోట్లాట అగుమంచికథ అనునవి.[6]

బట్టు రాయబారమున గల కథ కాటమరాజు వద్దకు, పుల్లరి యీయవలసినదని నల్లసిద్ధి భట్టును పంపుట, కాటమరాజందుల కియ్యకొనక భట్టును వెనుకకు మరలించుటయు

కాటమరాజు నల్లసిద్ధితో తనకుగల్గిన పోరాటమును తనకు సహాయులుగా రమ్మని తన సోదరులకు, కమ్మ వ్రాయుటకై కోటిపాటినున్న, తాటివృక్షము నుండి, ఒక యాకును తెమ్మని తన మరదిని పంపుటయు, అతడటనుండి ఆ వృక్షమునకు వృక్షమునే పెకలించి తెచ్చుటయు, కోటిపాటి తాటివృక్షము తెచ్చే కథలోని విషయము ఆ ఆకులమీద కాటమరాజు తన సోదరులందరకును లేఖల నంపినాడు

ఇరు పక్షములవారికి, ఎఱ్ఱగడ్డ పాటియందు జరిగిన పోరాటమే, ఎఱ్ఱగడ్డ పాటి పోట్లాట యిందు వర్ణితమైనది

అగుమంచి కథలో, కాటమరాజాదుల చెల్లెలైన అగుమంచి యుద్ధభూమి యందున్న తన అన్నల శుభముకొరకు శివరాత్రి ఉపవాసముండి శివుని పూజించగా శివలింగము కళ తప్పుట, ఆమె తలయంటుకొని, నగలను శృంగారించుకొనబోగా, నగలు కాంతిహీనములగుట, చివరకామె రాత్రికి, తనవారందరును యుద్ధమున పడిపోయినట్లు కలవచ్చుట, మొదలగు నంశములు వర్ణింప బడినవి

లోకలు రికార్డులలో నున్న కథకును, యాదవులు చెప్పు వ్యవహారము

---

6. మద్రాసు ప్రాచ్య పుస్తక భాండాగారము వారు ముద్రించిన కాటమరాజు కథకనుబంధముగా, బట్టు రాయబారము, కోటిపాటి తాటి వృక్షముతెచ్చే కథ, ఎఱ్ఱగడ్డ పాటి పోట్లాటలను ముద్రించిరి. అగుమంచి కథను శ్రీ వేటూరి ఆనందమూర్తి గారు 'పరిశోధన' యందు ప్రకటించిరి.

నందున్న కథకును నించుకంత భేదము గలదు లోకలు రికార్డులలోని కథ వలన నల్లసిద్ధి మహారాజు ఉంపుడుకత్తె, పెంపుడు చిలుక కాటమరాజు ఆల మందలో కలకలము పుట్టింపగా, కాటమరాజు పినతండ్రి పోలమరాజు దానిని గొట్టుటయే కారణమైనట్లుగా తెలియుచుండగా, కాటమరాజు పుల్లరి యెగగొట్టు టయే యుద్ధమునకు కారణమైనట్లు యాదవులు చెప్పుదురు

వ్యవహారమున నున్న ఈ కథ యెంతవరకు సత్యమో తెలియదుగాని, కాటమరాజు కథా సంబంధి గ్రంథములు మాత్రము అనేక స్థలములందు, "చిలక వ్రేయించినందుకు" అని యుండుటచే అదియే ప్రామాణికమేమోనని తలంపవలసి యున్నది నల్లసిద్ధి ఉంపుడుకత్తె విషయము కథా గౌరవమునకు కొంత భంగకరముగా నుండునని తలచి, రెండవ కథ నెవరో సృష్టించి యుండురు నల్లసిద్ధి తాను కాటమరాజువద్ద కవులు వ్రాసికొనిన సంగతిని తన సోదరికి తెల్పకుండుటయు, ఆమెయు, పరిస్థితి యుద్ధము వరకు వచ్చినను, తాను పశువులకు నష్టము కలిగించిన సంగతిని దెల్పకుండుటయు, కథలో నసందర్భములుగా నున్నవి. కావున లోకల్ రికార్డులందున్న కథయే సత్య మని తలంపవలసి యున్నది

ఈ కవి తాను శ్రీనాధుని వచన పద్ధతిని అనుసరించి చెప్పినట్లు చెప్పెను. శ్రీనాధుని వచన పద్ధతి యననేమొ దెలియరాకున్నదని ఈ గ్రంథ పీఠికాకారులు రచించిరి వచన పద్ధతి యనగా, వచించిన పద్ధతియని యర్థమై యుండును.

ఇందలి రచన మంజరీ ద్విపద వికారముగనున్నది. అది అయినను, ప్రతి పాదమునను ద్విపద గణములు సరిగ లేవు. ఒండు, రెండు ఒకప్పుడు మూడు నాల్గు మాత్ర లెక్కువగ నున్నవి పాడుట కనువుగ నుండుటనే దృష్టి యందిడికొని, యిట్లు రచించియుండును యతి మైత్రిని మాత్రము ఎల్లప్పుడు పాటించినాడు, కొన్ని సందర్భములలో అపశబ్దములను వాడి కూడ మైత్రిని చేకూర్చెను.

"వలలన్ని చాలుగా వడ్డుడీ చక్క"— పు 44
"జలరేగి మ్రోగంగ జౌకళింపుచును"— పు 53

"వైకుంఠమున కయి వఱగి రావేళ"— పు 74
"వక ఘటం బేనుగులు వడిమావటీలు"—పు 123
''వాశేటి పీనుగుల్ వఱగు లొటిపిటలు"—పు 150

కాటమరాజుతో యుద్ధము చేసిన నెల్లూరి రాజు నల్లసిద్ధి పల్లవాధీశ్వరుడు గను, సూర్యవంశోద్భవుడుగను, దరణికోట అమరలింగమునకు, బ్రాహ్మణ కన్యవలన జనించిన ముక్కంటి సంతతి వాడుగను అభివర్ణింపబడినాడు. ముక్కంటి పల్లవుడనగా, త్రిలోచన పల్లవుడు.[7]

కాని స్థానిక చరిత్రములందు నల్లసిద్ధి ఇనవంశోద్భవుడైన చోళరాజని పేర్కొనబడినది పల్లవుడు కాడు. ఈతని మంత్రియగు ఖడ్గ తిక్కన కూడ, చోళరాజుల కొలువులో నుండినవాడు ఖడ్గ తిక్కన తండ్రియు, ఖడ్గ తిక్కన సోదరుడును, చోళరాజుల కొల్వులో నుండినట్లు కేతన దశకుమార చరిత్ర మందు కూడ వర్ణించినాడు కావున నల్లసిద్ధి చోళ వంశజుడని తేలుచున్నది ఇదిగాక, నెల్లూరును పరిపాలించిన తెలుగు చోళ రాజులలో చాలామంది పేర్లు 'సిద్ధి' యను దానితో నంతమగుచున్నది దీని ననుసరించి కూడ నల్లసిద్ధి పల్లవ వంశజుడు కాడని తేలుచున్నది

కాటమరాజు కథయందు యుద్ధము మాఘ బహుళ అమావాస్య మంగళ వారమునాడు జరిగినట్లున్నది స్థానిక చరిత్రములందు మాఘ మాసము, చిత్రభాను సంవత్సరము లోనిదిగ దెలుపబడినది. ఖడ్గ తిక్కన సోదరుడు భాచయ[8] (సిద్ధయి భాస్కరుడు) కీ శ. 1215 ప్రాంతమున నుండెనుగాన,

---

7. ఈతనిని గూర్చిన కథలను నవచోళ చరిత్ర యందుద్ధృత మొనరించితిని

8. ఈతడే సిద్ధయ భాస్కరుడు నెల్లూరి రాజ్యముపై సేవణ సైన్యముతో సింఘణదేవుడు (శక. 1132–1169) దండెత్తి వచ్చినపుడు సిద్ధయ భాస్కరుడు దాని నెదుర్కొని యుద్ధము చేసి సంహరించెనని దశ కుమార చరిత్రలోని పద్యమువలన తెలియుటచే నీతడు క్రీ.శ. 1215 ప్రాంతమున నుండెనని తెలియుచున్నది

ఖడ్గ తిక్కనయు నా ప్రాంతముననే యుండి యుండునని భావింపవచ్చును. చిత్రభాను సంవత్సరమునకు సరిపడు శక సంవత్సరములు 1084, 1144, 1204, లనియును కాని వీనిలో 1084 సంవత్సరమున మాఘ బహుళ అమావాస్య మంగళవారమైనను అప్పటికి ఖడ్గ తిక్కన లేకపోవుటచే యుద్ధమపుడు జరిగి యుండుట యసంభవమనియును తక్కిన రెండు సంవత్సరములందును మాఘ బహుళ అమావాస్య మంగళవారము కాకపోవుట చేతను యుద్ధ కాలమును నిర్ణయింప వీలుపడకున్నదని శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారనిరి [9]

కాని నెల్లూరు శాసన సంపుటయందు గల గుండ్లపాలెము శాసనము. యుద్ధము కాళయుక్తి కార్తిక శుద్ధ 5 గురువారమనియు, అది శకవర్షము 1170 అనియు దెల్పబడినది. కాని యాందలి శకవర్షము సరియైనది కాదనియును, అది 1180 అయి యుండదగుననియును, కాని, ఆ సంవత్సరమున, కార్తిక శుద్ధ 5 గురువారము కాలేదనియును కాన నిదికూడ, యుద్ధకాలమును సరిగ నిర్ణయించుట కుపయుక్తమగుట లేదనియు వారేయనిరి

అయినప్పటికిని, నీ యుద్ధము, శక 1180 ప్రాంతములందు జరిగినదియును, శాసనాధార ముండుట వలన యెఱ్ఱగడ్డపాటియందు కాటమరాజునకును, నల్లసిద్ధికిని జరిగిన యుద్ధము పుక్కిటి పురాణము గాదనియు, నది చారిత్రక సత్యమేననియు రుజువు పరచుచున్నది దీనివలన నీయుద్ధము. పల్నాటి యుద్ధము యించుమించు నేకకాలముననే జరిగినట్లు తెలియుచున్నది.

చారిత్రకులనేకులు కాటమరాజునే దోషిగా నిర్ణయించిరి. కాటమరాజే యుద్ధమున విజయుడయ్యెను గాన నిప్పటికిని ఆ ప్రాంతమందుండు యాదవులెల్లరకును కాటమరాజువారిమీద అధికభక్తి గలదు పశువులను మేతకు తోలుకొని పోయినప్పుడు అవితిరిగి సురక్షితముగ గృహము చేరుకొనినచో కాటమరాజు వారికి 'పొంగళ్లు పొంగిస్తామని' మొక్కు కొందురట. దీనివలన అతడియెడ వారికి గల భక్తి గౌరవములు తెలియు చున్నవి

---

9 కాటమరాజు కథ— పీఠిక పు. 29

గ్రంథ రచనాకాలము కూడ సరిగ తెలియుట లేదు. గంగుల పిన యెల్లయ యెప్పటివాడో తెలియదు ఈతడు నల్లసిద్ధికి సహాయముగా, "చన్నపట్టణమేలు చంద్రశేఖరుడు" వచ్చెనని రచించుటచే, నీతడు చెన్నపట్టణ నిర్మాణానంతరమే యుండెనని తలంప వలను పడుచున్నది. కావున నీతడు క్రీ.శ 17వ శతాబ్దమువాడై యుండు ననుకొన వీలగుచున్నది.

ఈ గేయరచన చక్కగ సాగినది జాతీయములు, సామెతలు నానుడులు పెక్కులుండి పదునారుపాళ్ల దేశిరచన యనిపించుకొనుచున్నది.

"గొల్లమీద పుల్లరి గోగుమీద బచ్చలి"
"ఉలవ లెత్తామంటె ఊళ్ల నడిగెదవు"
''తెడ్డడిగినప్పుడే కొయ్యడిగినట్లు"
''పేరేమొ లాట పెటల పెదవులు మృదువు"
''బూతే గంపల కాడ పొర్లు దండాలు'' మొదలగునవి

"అందముగా వెదురాకు చందమున తిరుమణి తిరుచూర్ణము దిద్దిరితోడ" ''కందుకంబునబోలె కాంతితో నెగసి'' ''పెక్కు ముంగిసలతో పెద్ద శేషుండు సాహసంబున బోరుచందాన" వంటి అలంకారములు సహజ సుందరములై జానపదులకు నిత్య పరిచిత వస్తువులతో సంబంధము కలిగియున్నవి.

మారుమూాల పదములు ''అచ్చాశిమూక'' గణిడీలు సారసత్తులు సోమసూర్య వీధులు మున్నగునవి చిర్ఠీ వజ్రీలు ముస్తీబు ఫౌజు దిలాస బాకీ జవాబు హెజీబు వంటి అన్య దేశ్య పదములు ఇందు పెక్కులు గలవు

తొమ్మిదవ ప్రకరణము

# పురాణ సంబంధములు

## హరిశ్చంద్రోపాఖ్యానము

సరస సాహిత్య లక్షణ విచక్షణుడైన గౌరనామాత్యుడు, తేట తెనుగు పలుకు బడులతో, తియ్యని నుడికారపు సొబగులతో ముద్దులు గులుకు నట్లు ద్విపదచ్ఛందమున హరిశ్చంద్రుని కథను రచించినాడు హరిశ్చంద్ర కథను కావ్య వస్తువుగా గ్రహించిన తెలుగు కవులలో మొట్టమొదటి వాడీతడే, ఈతని కావ్యము ననుసరించియే, తరువాతి కవులు కావ్యములుగా నీకథను తీర్చిదిద్దిరి ఈతడు దీనిని 'కవితా చమత్కృతితో' 'కవులందరును శిరకంపము సేయు నట్లుగ' రచించినాడు.

ఈతని తండ్రి పేరయ్యలమంత్రి యనియే భావింపవలసి యున్నది ఈతడు సంస్కృతమున రచించిన లక్షణ దీపిక గద్యయందును, అయ్యలమంత్రి యనియే గలదు

ఈతని పెదతండ్రియగు పోతనామాత్యుడు మాధవరాయ నృపాలుని యుద్ధ మంత్రిగా నుండినటు లీతని రెండు ద్విపద కావ్యములందును పేర్కొన బడినది. ఈ మాధవరాయ నృపాలుడు శ్రీనాథుడు పేర్కొనిన సర్వజ్ఞ సింగమ నాయుని చినతండ్రి. ఈతడు సుమారు క్రీ.శ. 1376 ప్రాంతమున నుండెను గాన గౌరన క్రీ శ 1385-1445 ప్రాంతమువాడని భావింప వీలగు చున్నది. ఈతడు శ్రీనాథుని సమకాలీనుడు

''వెలగి ఋగ్వేద ప్రసిద్ధుడని జగతి నెలయ హరిశ్చంద్ర విభు చరితను 'కవితా చమత్కృతి గాంచి కవుల పండువుగాగ' రచియింతునని..." ప్రతిజ్ఞ చేసి యా ప్రతిజ్ఞనను సర్వవిధముల నెరవేర్చుకొనెను, దేశీయ చ్ఛంద

మును చేపట్టి ఈతడీ యుపాఖ్యానమును రచించుటవలన హరిశ్చంద్రుడాంధ్రులం స్వంతమై పోయినాడు

హరిశ్చంద్ర కథ ఋగ్వేదమునందు గలదు. కాని వైదిక హరిశ్చంద్రు డసత్యవాదిగ నిరూపింపబడినాడు అందాతడు నరమేధము చేయబూని శునస్సేపుని యజ్ఞ పశువుగా గొనిపోయినట్లును, చివరకు శునస్సేపుడు వరుణుని ప్రసాదముచే ముక్తి గాంచినట్లును వర్ణితమైనది. పౌరాణిక హరిశ్చంద్రుడిందుల కన్ని విధముల బిన్నుడు పురాణములందీతడు కఠోర సత్యవ్రత పరిపాలనము గావించిన వాడుగ చిత్రింపబడినాడు సత్యవ్రత పాలన కొరకు రాజ్యమును, భార్యా బిడ్డలను గూడ తృణప్రాయముగ భావించి, త్యజించి, కడకు తాను గూడ నమ్ముడుబోయి, పరవశుడై, చండాలుడై అనేక కష్టముల కోర్చి సత్యవ్రతము నాచరించినాడు.

హరిశ్చంద్రుడు నరమేధము చేయుదునని వరుణునకు మ్రొక్కిన కథ భాగవత దేవీ పురాణములందు గూడ గలదు కాని గౌరన గ్రంథమందా కథా ప్రమేయ మేమియు లేదు

హరిశ్చంద్రోపాఖ్యానము స్కాంద మార్కండేయ పురాణములలోను, దేవీ భాగవతమునందును గలదు. గౌరన స్కాంద పురాణ కథ ననుసరించి ఆంధ్రీకరించినట్లు కాననగుచున్నది. ఈ రెంటి యందలి కథకును కొంత భేదమున్నది మార్కండేయ పురాణమున హరిశ్చంద్రుని భార్య పేరు శైబ్య యని గలదు కాని స్కాంద పురాణమున నామె పేరు చంద్రమతి దానినే గౌరన స్వీకరించినాడు అది యే లోకమున ప్రసిద్ధి నొందినది

[illegible]స్కాంద పురాణము ననుసరించి రచించినప్పటికిని, గౌరన హరిశ్చంద్రోపాఖ్యానమున మూలభిన్నములగు మార్పులు గొన్ని గలవు

1. హరిశ్చంద్రుడు స్వర్గమున కేగిన పిమ్మట, వశిష్ఠ విశ్వామిత్రు లొకరి నొకరు శపించుకొని పక్షి రూపములను పొందినట్లు మార్కండేయ పురాణ, దేవీ భాగవతము లందుండగా, వసిష్ఠ విశ్వామిత్రుల కలహ మింద్ర

సభలో జరిగినదని కావ్యారంభముననే ఈతడు వర్ణించినాడు.

2 హరిశ్చంద్రునికిడుములు గూర్చినది మాయా సూకరమని మూల మందుండగా, గౌరన మాయా కురంగమనినాడు.

3 మూలమందు గానరాని నక్షత్రక పాత్ర నీతడే సృష్టించెను నక్ష త్రక పాత్ర పోషణ కడుంగడు సొగసుగా నున్నది నక్షత్రకుని పాత్ర నీచ ముగ సృష్టింపబడుటచే తారతమ్య భేదము వలన, హరిశ్చంద్రుని పాత్రకు మరింత ఉదాత్త గాంభీర్యము లేర్పడినవి

4 లోహితునకు గూడ కాలకౌశికుడు మూల్యమిచ్చి కొనినట్లుండగా, నిందు కాలకౌశికుడేమియు నీయలేదనియు, నక్షత్రకుడు లక్షమాడలు లంచము గొని కాల కౌశికుని పక్షమునే తీర్పు చెప్పినట్లును వర్ణితమైనది

5 హరిశ్చంద్రుడు కాటియందు పిండములను దిని ఆకలిని దీర్చుకొని నట్లుండగా, ద్విపద కావ్యమున, దివిజులాతని కాకలి దప్పులను లేకుండ జేసి నట్లు చెప్పబడినది

6. లోహితాస్యుని చావును విని, భార్యతోకూడ హరిశ్చంద్రుడు చిచ్చురక బోవుచుండగా, దేవతలు ప్రత్యక్షమైనటులు, మార్కండేయ పురా ణమునను, హరిశ్చంద్రుడు భార్యను నరకుటకు సంసిద్ధుడు కాగా దేవతలు ప్రత్యక్షమైనట్లు స్కాంద పురాణమున గలదు కాని ఈ సన్నివేశమున గౌరన గావించిన కల్పనలు సుందరముగ నుండి, కథౌత్సుక్య పోషకములగుచున్నవి.

మంగళసూత్ర స్మరణచే చంద్రమతి హరిశ్చంద్రుని భర్తగా గుర్తిం చుట, మాదతెచ్చుట కామె మరల కాలకౌశికుని యొద్ద కేగుట, శిశు హత్యా నేరా రోపణము, రాజదండన, హరిశ్చంద్రుడా యాజ్ఞను నిర్వహింప నిశ్చితుడగుట, మొదలగున వన్నియు గౌరన గావించిన మార్పులే. అనేక విషమ సంఘటనలు హరిశ్చంద్రుని మనమును కలచి వేసినవి కాని, అతడు చలింపకుండెను అతడు తన సత్య వ్రతము నంతటి విషమ పరిస్థితిలో కూడ వీడలేదు. ఇది గౌరన హరిశ్చంద్రుని పాత్ర పోషణ విషయమై చూపిన నేర్పు

7 చిట్ట చివరన హరిశ్చంద్రుడు వెంటనే స్వర్గమున కేగినట్లు మూల మందుండగా, కొన్ని దినములు రాజ్య భోగముల ననుభవించి స్వర్గమున కేగి నట్లు గౌరవ రచించెను

ఈతడీ గ్రంథమున, హరిశ్చంద్ర, నక్షత్రక పాత్రల పోషణ గావించిన తీరు విశిష్టమైనది. హరిశ్చంద్రుడు ధర్మవీరుడు

నక్షత్రకుడు విశ్వామిత్రుని శిష్య గణములోని మూర్ఖాగ్రేసరుడు, నత్యంత కుటిలుడు, క్రూరుడు హరిశ్చంద్రుడు దాచిన ధనము నంతటిని తన బాకీ కొరకు వసూలు చేయుటకై నక్షత్రకుని హరిశ్చంద్రుని వెంట నంపినాడు నిర్దయుడై కౌశికుడు గురువును మించిన శిష్యుడు నక్షత్రకుడు వారిని నిము సము నిలువనీయక, వేదనల నిడినారు శృంగార వీర రసాత్మకమగు పాత్ర లను సృష్టించుట యింతకంటె సులభతరమేము ! ఈర్ష్యా క్రోధములతో కూడు కొన్న యిట్టి పాత్రలయొక్క మనః ప్రవృత్తులను, ఆ ప్రవృత్తులకు దగినట్టి సంభాషణలను సృష్టించుటకు కవికి అనితర సాధారణమగు భావనా గాంభీర్య ప్రాగల్భ్యము లుండవలెను ఈ పాత్ర చేష్టాదికములను గాంచుచు సంభాషణలను వినుచుండగా. నిత్యము మనకు గానవచ్చు క్రోధమూర్తులే సాక్షాత్కరింతురు

గౌరన కాలమునాటికి ద్విపద యొక కావ్య ప్రక్రియగా స్వీకరింపబడినది. సోమనాధాదుల వలె కేవలము మతోద్ధరణకై ద్విపద యుపయోగింప బడలేదు ఆ మతావేశము చల్లారినది ఆయావేశ పూరితమగు శైలి లేదు శైలి రసవత్తరముగా నుండి, తేట తెనుగు పదములతో గూడుకొని జాతీయములు జాలువాఱగా నాహ్లాదమును గూర్చుచున్నది సోమనాధాదుల గ్రంథములందువలె లక్షణ వైరుధ్యము గానరావు ఈతడు ప్రాస యతిని వాడలేదు

ఇతడు ర-ఱ లకు యతి మైత్రిని పాటించినాడు అప్పకవ్యాది లాక్షణికు లకీ మైత్రి సమ్మతముగాదు వీని సాంకర్యము జేయుట వలననే అప్పకవికి పోతన లాక్షణిక కవి గాలేదు. అప్పకవి పోతన నిట్లాక్షేపించినాడుగాని, పూర్వ

కవులు గొందరు వీనికి మైత్రిని పాటించియే యున్నారు. అందువలన నిందు రెండు మతములున్నవని భావింపవచ్చును. గౌరన,

1. "రతి నాయకుని యాజ్ఞ రంతుగా జాటు
గతి నందియలు గల్లు గల్లన మ్రోయ"—

2 రోటు వోయిన చెయ్యి ఱొయ్యి కంపరము
వాటుగాలును ఱోలువలె నున్న నడుము"—

నని ప్రయోగించినాడు "కాసుకు కన్ను గొనక. పంకకు బొమ్మగట్ట, బంటకు జెయ్యిచ్చు, పెండ్లాము కిడక", వంటి ప్రయోగముల గావించినాడు ఇట్టి ప్రయోగములు నన్నిచోడుని కావ్యమునను గలవు [1] కావున ఇవి గౌరన చేసిన ప్రయోగములే ననియు, లేఖకుల పొరపాట్లు గావనియు భావింపవచ్చును. నవీన వ్యాకరణపు టొరపిడి రాకమునుపై నన్ని కావ్యములను గీటిడ నవసరము లేదేమొ.

'కట్టిన దొక బట్ట కప్పిందో తోలు' అని ప్రయోగించినాడు 'కప్పినది' అనుదానికి 'కప్పింది' అనునది వ్యావహారిక రూపము శ్రీనాథుడు "ప్రొద్దు పోయింది జుండని బుజ్జగించి" అని వాడెనని (భీమ ఖండమున) తిమ్మకవి సర్వ లక్షణ సారసంగ్రహమున నుపయోగించెను [2] "రోసిందేటికి రోతలేటికి" అని ధూర్జటి కాళహస్తీశ్వర శతక ప్రయోగము గలదు

నక్షత్రకుడు మిథ్యా పరిశ్రాంతి నటియించి నేలపై కొరగి దాహమని పరితపించుచుండగా హరిశ్చంద్రుడు జలాశయాన్వేషణకై బయలుదేరి దారియందు విశ్వామిత్రునిచే సృష్టింపబడిన కపట మౌనిని జూచి యాతని కమండలులోని నీటిని నక్షత్రకుని కిమ్మని వేడెను అపుడా కపటమౌని "నేనేల నీవేల నెల తుక యేల, పూని తపోవిఘ్నమునకిది త్రోవ" యనును నేనెక్కడ నీవెక్కడ

1. కాసుకు చిందమయ్యెడన్, నఖము కెగయు— మొదలగునవి.
2. హరిశ్చంద్రోపాఖ్యానము - పీఠిక, పు. 9.

యని యభిప్రాయము. పూర్వ కవి ప్రయోగములుండేదకు మారుగ 'ఏల' యనియే మాపట్టుచున్నది

గౌరన ద్విపద కితః పూర్వముండిన యగౌరవమును దొలగించి తన ద్విపద కావ్యకన్యకు కావ్య ప్రక్రియలన్నిటి తోడను నలంకరించి సర్వాంగ సుందరముగ తిర్చిదిద్దినాడు ఇందాతడుపయోగించిన జాతీయములు, నానుడులు పెక్కులు గలవు

"తల పుండ్లు గడిగి రక్షింవెదో" (కడగండ్లు దీర్చియని యర్థము)
"ఉరిసిన పుండ్లపై నుప్పును జల్లి"
"కలదె పాయసము భిక్షాందేహి యనిన"
"తీపారు చక్కెర దిన్న యా నోర, వేపాకు మేసిన విధమున"
"చీమల గామల వలె శిశువులాడుచుండంగ"
"చెడు నాకా చీర రాచిన బాము కాటు"
"నాలుక నువుగింజ నానదు నాకు"
"మొగిలు లోపలి నీళ్ళునమ్మి, దాన నీళ్ళ జల్లు, వేదురు దెందుగలడె?"
"గాదని ముకు ద్రాట గాలుదయ్యకుము"
"నీరు వట్టారునే నెయి ద్రావి కొనిన"

ఇట్టి ప్రయోగమును శ్రీనాధుడును గావించినాడు. "దప్పిగొన్నట్టివారికా దప్పిదేప, సలిల పూరంబుహితవౌ యాజ్యంబు హితమొ"

(శృం, నై 4—52)

నేయి యుత్కృష్టమే యయినను దప్పిగొన్న వారికది మంచినీటిచేతీరును గాని, నేయిచే తీరదు.

"అందని ఫలముల కఱ్ఱులు సాప"
"కొఱవి కాదుల గోకి కొంటి క్రొవ్వి"
"మును సిరివచ్చిన మోకాలి నొగ్గుననువున"
బెరికి బ్రహ్మాస్త్రంబు బిచ్చుకమీద"
"సురుగన్వంట యిల్ నొచ్చిన శశము గరుణ సేయకకూరగా
వండదగునే"

"ఉత్తుతర గద్య పద్యోక్తులకంటె సరసమై పరగిన జాను తెనుగు విశేషము ప్రసన్నతకు" ఇత్యాదిగా బాస చేసికొని చెప్పినను సోమనాథుని కావ్యములలో మతావేశముచే నాతనికి తెలియకనే సంస్కృత భూయిష్ఠ సమాసములు దొర్లిపోయినవి. గౌరన రచనలో ఆ ధాటి గానరాదు చక్కని తేట తెనుగు పదములతో రసమును చిప్పిలజేసి రంజకముగా రచించు నీతడు.

స్వభావోక్తి నుపయోగించి యధావద్వస్తు వర్ణనను గావించి ఆ పాత్రను గాని, దృశ్యమును గాని మన కన్నెదుట నిలుపును సుందర దృశ్యముల వర్ణించు నపుడెంత అహ్లాదముగ నండునట్లు చేయునో నటులే జుగుప్స కలుగునట్లున కడు సమర్థతతో జేయును కాలకౌశికుని భార్య చూడుడెటులున్నదో

"మెదుక పట్టిన తల మెడగండమాల, నుదిటిమీదటి సుడి నులిగొన్న బొమలు బుఱ్ఱ ముక్కును లొట్టపోయినగన్ను, వెఱ్ఱి చూపును దెగి వ్రేలాడు చెవులు మిడిపండ్లు చిక్కిలి మీది పుల్పిరియు, బడివ్రేలు చన్నులు బడబాఱునోరు రోటుపోయిన చెయ్యి ఱొమ్ముకంపగము, వాటుగొలుసు ఱోలువలెనున్న నడుము బద్దుపిక్కలునంట బలసిన తొడలు, మొద్దు పాదంబులు ముడిగిన వ్రేళ్లు, గఱుకు నల్లని మేను గలిగి దయ్యంబు మఱపింప దగునుచ్చమల్లి చందమున గనుగొన రోఁతైన కాలకౌశికుని, వనిత..."

ఆయా ఘట్టములందు చేయబడిన సూర్యోదయ, సూర్యాస్తమయ చంద్రోదయ వర్ణనలు ప్రబంధములందువలె మనోహరముగ నున్నవి.

ఒకొక్కొక్కసారి చిన్నచిన్న సంస్కృత పదముల గూర్చి లలిత లలిత

ము.గా రచించును మాయా వశిష్ఠుని యాశ్రమ వర్ణన యిందుల కుదాహరణ కాగలదు

"కమలినీ స్థలరుహ కమల వనాంత, విమల చంద్రోపల వేదికా ప్రాంత
పరిపక్వ బహుఫల భారావనమ్ర, సరససాల రసాలనాలాగ్రకలిత,
కలకంఠ శుకనీలకంఠ చకోర కలకలశారికా కలకలాపములు
ఫలిత పుష్పిత లతా భవనాంతరాళి, చలిత మరంద నిర్ఝరకణశిశిర
కలిత మిళింద సంగత పికకీర, లలిత గీతామృత లహరీవిలోల
కిన్నర కర వల్లకీనాదముదిత, సన్నుత సారంగ శాబక ప్రముఖ
కోమల వానీర కుంజ పుంజములు..."

కొన్ని పట్టులయందాలంకారికమైన శైలి నుపయోగించినాడు శాబ్దిక, ఆర్థికాలంకారముల రెంటిని సొగసుగా గూర్చినాడు

"ఏమందు నింక నిట్లేమందు విధిని, నేమందు వెట్టిన నెసఱు
బ్రాణము" —అనునది యమకమునకును,
సుందరి గాదిది సొబగు రాయంచ• యంచగాదిది నడపారు క్రొమ్మించు.
మించు గాదిది రాచమెచ్చుల ప్రతిమ, ప్రతిమగాదిది పచ్చిపగడంపులతిక
లతిక గాదిది నవలావణ్య సరసి, సరసి గాదిది పుష్ప చాపునిశరము'

అనునది ముక్తపదగ్రస్తమునకును నిదర్శనములు, ఈతడొక యెడ రమణీయమగు శ్లేషను గూర్చినాడు. తక్షకుని గూర్చి చంద్రమతి పల్కినది.

''శ్రుతి బాహ్యు డిల బుట్టు గ్రుడ్డు తామసుడు,
గతిచెడ్డ చెడుగు తెక్కలి బొక్కలాడు,
బదవిహీనుడు జగత్ప్రాణ భక్షకుడు
వెదకి యీ వసవాల విత్తు నేమందు?"

ఉపమా, స్వభావోక్త్యలంకారములను విరివిగనే వాడి యున్నాడు. గంగను స్త్రీతో పోల్చి రూపకాలంకారమును గూర్చినాడు.

"సుందరి గాదిది సొబగు ఠాయంచ, యంచ గాదిది నడపొలు క్రొమ్మించు" అనునపు డపహ్నవాలంకారము

చంద్రమతి యడవిలో నడువలేకుండుటను చూచి హరిశ్చంద్రుడు

"మును సౌధ సోపానముల నెక్కలేని, వనజాక్షి యెట్లెక్కె వరుస శైలములు పటికంపు రాకట్టు పై నెక్క నలయు కుటిల కుంతల యెట్లుగుట్టలు గడచె ననువొంద రత్న దేహళి దాటనలగు ఘనకుచ యేరీతి గడచె ఘట్టములు?"

అని చింతించును ఈ వర్ణన పోతనగారి "పీఱ జక్కగ బట్ట వెఱ తెఱుంగని కొమ్మ బాణాసనంబెట్లు పట్టనేర్చె" — అన్న పద్యచ్ఛాయను పోలియున్నది. ఇట్లే—

"కనలు శూలము జంద్రకళయునుదాచి ముని వేషముననున్న ముక్కంటి యితడు"—అనునది

"అ చతుర్వదనో బ్రహ్మ ద్విబాహురపరో హరిః
అఫాలలోచన శ్శంభు శ్శక తాతస్త పోనిధిః"—అను శ్లోకమును స్మృతికి దెచ్చు చున్నది.

ఆయా ఘట్టములకును సందర్భములకును దగిన రసము లభివర్ణింప బడినవి చంద్రమతి పుత్రునికై విలపించిన ఘట్టము కరుణ రసోల్బణముగ నున్నది ఇంకను పెక్కుతావుల కరుణ రసము పోషింప బడినది విశ్వామిత్రుని కోపము వర్ణింపబడి నపుడు రౌద్రరసము గలదు. చండాల పేట శ్మశానములు వర్ణింప బడినపుడు బీభత్స రసము పోషింపబడినది

ఈకావ్యమున హాస్యరసము గూడ అటనట పోషింపబడినది కాలకౌశికుని శిష్యుడు గురువు భార్యతో

"రూపింప వికృతంపు రూపు నీరూపు పత్ని కట గొన నాకిటమీద
గమనీయ రూపరేఖలుగల కాంత నమర నొక్కతె వివాహముగా వలయు

నని యొజ్జలిట క్రింద నాడు వాక్యములు విని పింప నవినీకు విరస మౌనంచు
నివి నేడు సౌందర్య మెల్లను బ్రహ్మ బొదిమి చక్కని రూపు సేసిన యట్టి
రాచ కూతురుగాని రవ్వగాకుండ దాచిన మూలధన మెల్ల బెట్టి
గోచికాడై దాని గొనుచు నేతెంచి లాచియున్నాడు నీలా గొత్తి చూడ
వాడెపో మన తలవాకిట నున్నవాడు'' అని గురువుగారు చెప్పుమను
దానికి విపరీతముగ నామెతో జెప్పి భార్యా భర్త లిరువురికిని జగడ
మేర్పరచిన యా శిష్యుని మాటలు నవ్వు పుట్టించు చున్నవి

ఈ కోవ కావ్యముల కితః పూర్వము లేని సొబగునుకూర్చి హరిశ్చంద్ర కథామృతమున నాంధ్రుల కొసగిన గౌరన మహాకవి ప్రాతః స్మరణీయుడు.

హరిశ్చంద్ర కథ పూర్వోత్తర భాగములను వెన్నెకంటి చంద్రశేఖర కవి (క్రీ.శ 1700) యను నాతడు ద్విపదలో రచించినట్లు గోలకొండ కవుల సంచికలో దెల్పబడినది. కవి ఓరుగల్లు నివాసి ఇంతకుతప్పు దీనిని గుఱించిన వివరములు తెలియవు.

## ఉత్తర హరిశ్చంద్ర చరిత్ర[3]

కర్త గద్దె చంద్రశేఖర కవి ఈ కవి వీర శైవాచార వ్రతుడు ఈ కృతి నీతడు చెంగల్వ రాయడని ప్రసిద్ధి జెందిన కుమారస్వామి కంకిత మొనర్చినాడు చిత్తూరు మండలమున కుమారస్వామికి చెంగల్వరాయడని ప్రచారము గలదు. కావున కవి చిత్తూరు మండలమువాడై యుండును. ఈ కవి తన్నుగూర్చి యిట్లు చెప్పికొనెను.

''. . . . కాశవాస్తిశు చరణ
పంకజ సౌరభ భ్రమరాయమాన
వీర శైవాచార విశ్రుత గద్దె

---

3. మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము డి. నెం. 1028—
కాగితప్రతి

వీర భద్రాచార్య విభు తనూజాత
ధీజన స్తోత్ర వాగ్దేవి కటాక్ష
రాజిత సాహిత్య రస పోషణాంక
సావధానానేక శాస్త్ర విజ్ఞాన
కో విదు సానన గోత్రాబ్ధి చంద్ర
చంద్రశేఖర కవీశ్వర కృతంబగుచు"

ఈ గ్రంథమున కాకర మేమియో తెలియ రాకున్నది. రామాయణ కథయంతయు గడిచిన పిమ్మట, శ్రీరాము డయోధ్యలో కులాసాగా నుండిన సమయమందు శ్రీరాము డగస్త్య మహర్షిని హనుమంతునియొక్క మాహాత్మ్యమును గూర్చి యడుగగా నగస్త్యుడాతనికి రామాదుల పూర్వవృత్తాంతములను సవిస్తర ముగ తెలియపరచును ఇది యుత్తర రామాయణకథ పూర్వకథ యుత్తర కథగా చెప్పబడినది ఈ కవికూడ నా మార్గమునే అవలంబించి, దీనికి ఉత్తర హరిశ్చంద్ర కథయని పేరిడినాడు హరిశ్చంద్రుడు విశ్వామిత్రుని పంతమువలన పడరాని యిడుమలను పడి, చివర కాతని యనుగ్రహము వలననే, ఏడు దీవుల కధిపతి యయినాడు. అతడు కులాసాగా రాజ్యము చేయుచు ఒకనాడు కొలువు దీర్చి యున్న సమయమున అతని మంత్రులు చూచి, విశ్వామిత్రుని శాపమును పొందబోవు నాడుగూడ నాతడిటులే కొలువుండి, వేట కేగినాడని పూర్వకథా స్మృతిని కలిగించును. అక్కడనుండి వీరి పూర్వజన్మ వృత్తాంతము వర్ణింప బడినది. కావున నీ కథ యుత్తర హరిశ్చంద్ర కథ యైనది. హరిశ్చంద్ర కథను గౌరన రచించి యుండుటను గాంచి యీతడీ కథను రచించి యుండును. కాన నీ కవి గౌరన కర్వాచీనుడని భావింప వీలగుచున్నది. కాని ఎంతటి అర్వాచీనుడో నిశ్చయముగ జెప్పుట కష్టము.

ఇందు హరిశ్చంద్రాదుల పూర్వ జన్మ వృత్తాంతము, చంద్రమతీ హరిశ్చంద్రుల వివాహము, ఆ రాజదంపతులు విపత్తుల నందుటకుగల కారణ ములు, నలకూబరుడు తక్షక శాప కారణముగా, లోహితాస్యుడై జనించుట, యముడు వీర బహుడగుట, శని కాలకౌశికుడగుట, హరిశ్చంద్రుడు రాజసూయ యాగమును జేయుట, మొదలగు నంశము లన్నియు వర్ణింపబడినవి.

ఈ కవి సంస్కృతాంధ్ర పదములను సమముగ ప్రయోగించినను, అచ్చ టచ్చట కేవల సంస్కృతపదసమూహ రచన గావించినాడు. ఇందు కాతడు గావించిన సముద్ర వర్ణన యుదాహరణ కాగలదు

నీలాల నింగిపై మినుకు మినుకు మను తారలు హరిత దీర్ఘిక యందు కనుపట్టు తామరలతో నుపమానసమును సంతరించుకొన్నవి ఇదే విధముగ సూర్యాస్త మయమున సామాన్యముగనే ముకుళించుకొను పంకజమునకు, కమలినీ భామ విరహ వేదనా భారము కారణముగ దెల్పబడినది ఈ రెండు భావము లును మనోహరముగ నున్నవి

## దే వాం గ పు రా ణ ము [4]

కర్త భద్ర లింగ కవి క్రీ.శ 1580 ప్రాంతమందుండినాడు. 'సానంద చరిత్ర' ద్విపద కావ్యమీతని గ్రంథాంతరము ఇందు దేవాంగ ఋషి యొక్క చరిత్ర దెల్పబడినది. ఇది బ్రహ్మాండ పురాణాంతర్గతమైన దేవాంగ ఋషి చరిత్రకు తెలుగు సేత

బ్రహ్మ సకల చరాచర సృష్టిని గావించియు దేవ మానవుల మాన సంరక్షణార్థము వస్త్రములను సృజింపలేకుండెను. ఆ కార్యమున కింకొకనిని సృజింప శివునకే శక్తి గలదని బ్రహ్మ దెల్పగా, శివుడు తన సంకల్ప సిద్ధిచే ఋషి నొకనిని సృజించి దేవలుడని నామకరణము గావించి యాతనితో నిట్లు చెప్పెను "పూర్వము నావలన వేదములు పుట్టినపుడు వానితోగూడ సర్వ లోకాలంకారములగు దారములుగూడ బుట్టినవి అది మొదలవి విష్ణుని నాభీ

---

4 ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము—డి నెం 948—ఇది క్రీ.శ. 1886 లో ఆరాధ్యుల వీరేశలింగము పంతులుగారిచే ముద్రిత మైనటులు తెలియుచున్నదిగాని నాకది లభ్యము కానందున తాళ పత్రమునే జదివితిని.

కమలమునందున్నవి నీవా విష్ణుని యొద్దకు బోయి యాతంతువులను సంగ్ర హించి నీ నేర్పుకొలదిని దివ్య వస్త్రములుగా జేసి మాన సంరక్షణార్థమెల్లర కొసగుము. దానివలన నీకు కీర్తియు, దేవాంగుడను నామమును గలుగును "

ఇది ఏడాశ్వాసముల గ్రంధము ప్రధమాశ్వాసమున దేవాంగ ఋషి, శివుని పనుపున వస్త్రములను నేసి, దేవతలకిచ్చుట, పిమ్మట శంకరాదుల యను మతిపై కశ్యపుని పుత్రికను దేవదత్తను వివాహమాడుట

ద్వితీయాశ్వాసమున దేవతలతో యుద్ధము, పుత్ర జననము, తృతీయా శ్వాసమున ఈతడు పుష్పదంత ప్రమధుడై పార్వతికి శివుడు చెప్పిన కధలను రహస్యముగ విని శాపోహ హతుడైన వృత్తాంతము

నాల్గవ యాశ్వాసమున పుష్పదంతుడు భేతాళుడై భువికివచ్చిన విష యము- (ఇది విక్రమార్కుని కధయే)

అయిదవ ఆశ్వాసమున వరరుచిగా దేవాంగుని యవతారము. (ఈ కథ విద్యావిహీనుడుగా నున్నప్పటి కాళిదాసు కథవలె నున్నది )

ఆరవ యాశ్వాసమునందు, దేవాంగుడీశ్వరుని యాదేనుసారము, కల్యాణ కటకమునందలి ఒక విప్రునకు, దివసాళిగా జన్మించి ఆ పురరాజు పుత్రునకు శివదీక్ష నొసగుట, ఆ రాజు తన చర్యకు కినుక వహించి అతనిని కత్తుల చెఱసాలయందుంచగా, దివసాళి దానిని యోగదృష్టిచే నెఱిగి, మృగము లను చతురంగ బలముగా మార్చి, రాజును యుద్ధమున సంహరించిన వృత్తాంత మున్ను

చిట్టచివర దేవరదాసి అవతారము, ఈయవతారమున నీతడు జైనులను వాదమున నోడించి వీరశైవాచారమును ప్రతిష్ఠించాడు (దేవరదాసికి ముద నూరి రామేశ్వరుడు గురుడట.)

ఈ గ్రంధమునందుకంటె నీతని కవిత 'సానంత చరిత్ర' మందు రుచికర ముగ నున్నట్లు తోచుచున్నది.

గ్రంధారంభమున, వీరశైవ వాఙ్మయ స్థాపనాచార్యులైన బసవేశ్వర, సోమేశ్వరులను స్తుతించినాడు.

అక్కడక్కడ శబ్దాలంకారాములను వాడి, రచనకు సౌందర్యమును గలిగించినాడు

గ్రంధారంభమున ముదునూరి కటకాభిరాముని స్తుతించిన సందర్భముగ ముక్తపదగ్రస్తమును పయోగించినాడు

"శ్రీరజతాచల శృంగ విహారు
హార కర్పూర నిభాంచితాకారు

... ...

తాపస మానస దర్పణో దీప్త
దీపితగణ పద్మ దివ్య షట్చరణు
చరణ పద్మానత సన్ముని ప్రవరు
వరవర్ణనీయత వామార్ధదేహు"

ఈతడు గావించిన కాళహస్తి పుర వర్ణన సొగసుగా నుండి యీతని వర్ణనా పాటవమును చెప్పక చెప్పుచున్నది

"కాఠిన్య గుణములు దలుగ వచ్చోట
పారీన నేత్రుల పాలిండ్లగాని
చంచలత్వంబులే జనులందు లేవు
చంచలాక్షుల విలోచనముల గాని
అలవడ వెవ్వరి యందు జాడ్యములు
నలినాయతాక్షుల నడవులగాని
లేము లెవ్వరి యందు లేవు భావింప
లేమల నడుముల లేములే గాని"

—,o,—

## దేవాంగ పురాణము[5]

కర్త వీరన అసమగ్రము. పత్రములన్నియు తార్మారుగా నున్నవి. కొన్ని పత్రములు చివర తునిగియున్నవి. ప్రథమాశ్వాసము మాత్రమే గలదు. గ్రంథారంభము లేదు గ్రంథాంతమున బ్రహ్మాండ పురాణాంతర్గత గాథనే తాను దెల్పినట్లు కవి చెప్పకొనెను కాని ఈ కవి వంశాదికము లేమియు తెలియుట లేదు ఉపలబ్ధమగుచున్న గ్రంథమున దేవాంగుని జననము, వివాహము దేవతా వస్త్ర నిర్మాణములు గలవు, దేవదత్త సౌందర్యమును వర్ణించు నీ క్రింది ద్విపదల వలన నీతని కవనము నిర్దుష్టమై యించుక గంభీరమై చదువుట కింపుగా నున్నదని తెలియును

"అడుగులో గాకవి అలరు కొంజిగురులో
మడములా గాకవి మల్లె పూచెండ్లా
వరకూర్మములో గాకవి వనిత మీగాళ్లా
శరధులో గాకవి సఖియ చిరుదొడలో
పసిడి యరటులో గాకవి పణతి యూరువులో
యిసుక దెన్నెలో గాక యింతి జఘనములో
హరి మధ్యమొ గాక అంగన నడుమొ
నెరి శంఖమొ గాక నెలత గళంబొ"

... ...

## మార్కండేయ పురాణము[6]

కర్త ఎల్లకర కృష్ణయార్యుని పుత్రుడయిన, నరసింహకవి ఈతడు క్రీ.శ 1580 ప్రాంతమువాడు కాదగును గ్రంథారంభమున కొమరవోలు

---

5 శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ ఆర్ నెం 994–

6 శ్రీవేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ గ్రంధాలయము.
ఆర్ నెం 132–కాగితప్రతి

రాజగోపాలుని ప్రస్తుతించి, ఆ దైవమునకే గ్రంథము నంకితము గావించెను. లక్ష్మణార్యుడీతని గురువు. పూర్వకవి స్తుతిలో నన్నయ రంగనాథులను పేర్కొనినాడుగాని, మార్కండేయ పురాణకర్త యయిన మారనను పేర్కొనలేదు మారన యీతనికి పూర్వుడే

ఇది మార్కండేయ ముని చరిత్రగాదు పద్మసాలీల వంశ వృత్తాంతమునకు చెందిన మార్కండేయ పురాణము సంస్కృతమున గలదు దానికిది ద్విపదానువాదమై యుండును పద్మసాలఖ్యుల యభ్యర్థనాను గుణముగ తానీ గ్రంథమును రచింప పూనుకొనినట్లు చెప్పినాడు. ఈతడిట్లు గ్రంథరచనచేయ నూహింపుమంత "సిల మేఘచ్ఛాయ నెగడెడి" కొమరవోలు రాజగోపాలస్వామి స్వప్నమున సాక్షాత్కరించి తనకీ గ్రంథము నంకితము గావింపుమనినాడట సృష్ట్యాది నుండి క్రమముగ మార్కండేయుని సుతుడైన భవనా ఋషి చరిత్ర వరకు నిందు వర్ణింపబడినది మనువుల యొక్క చరిత్ర వర్ణింప బడిన పిమ్మట భృగు మహాముని యొక్క యగ్ర తనూజుడైన ధాత్రునకు శివుని వరమున, మార్కండేయుడును పుత్రుడు జనించెను. ఈ మార్కండేయునకు భావనా ఋషి జనించెను ఈ భావనా ఋషియే పద్మసాల వంశ్యుల మూలపురుషుడు. భావనా ఋషి తండ్రి యాజ్ఞచే విష్ణుని గర్భమందున్న తంతువుల నాతనిని ప్రసన్నుని చేసుకొని తీసుకొని ఎల్లరకును వస్త్రముల నిర్మించి యిచ్చినాడట

భావనా ఋషి జన్మకారుడు బ్రహ్మ, ఈ భావనా ఋషి యాధిక్యమును వర్ణించి, ఈతని చరిత్రతోనే గ్రంథ సమాప్తి గావింపబడినది ఈతని వంశీకులైన పద్మ సాలెలు, ఒంటి కంబపు మేడను సాధించి రనియును, కాలువ సేవుని రణరంగమున గూల్చి రనియును కవి వర్ణించినాడు.

"బహు పుణ్యమూర్తులు భండారు వాడ
విహిత కులాచార విఖ్యాత యశులు
కంటకులను (?) వొంచి ఘనత వహించి
ఒంటి కంభము మేడ యొనర సాధించి

... ... ...

భావనా ఋషి వంశ్య భవులగువారు
వావిరి ముల్లోకవాసులకెల్ల
నెనరొప్ప బంచవన్నెల వస్త్ర సమితి
నిన చంద్ర సాక్షిగా నిచ్చినారు
కాలువ సేనుని కదన రంగమున
నేలగూల్చిన రణ నిపుణులన్వారు

... ...

అలరాజ సంస్థాపనాచార్య బిరుదు
లలరు శేఖరులు నుద్యత్ప్రతాపకులు

... ...

పద్మ తంతువులచే బ్రబలి లోకముల
బద్మ సాలాఖ్యులన బరగెడు ఘనులు"

ఇందు వీరు రణరంగమున గూల్చిన కాలువసేనుడు పల్లవ రాజై యుండునేమొ నని నిడదవోలు వెంకటరావుగారనిరి కాని, అతడు పల్లవరాజుగాడు పురాణములందు వర్ణితుడైన యొక రాక్షసుడు, ఆరాక్షసుని వీరు గూల్చినట్లు చెప్పబడినది ఈ కాలువ సేనుడు విశాలాక్షమను పట్టణమున నుండిన నతి గర్వియయిన రాక్షసుడు, అంధకాసురుడు, తారకుడు సింధురాసురుడు, జిహ్వా సదుడు మొదలగు వారీతని యల్లుండ్రు, వీరొకనాడు సకల శృంగారములను చేసికొని, మామను దర్శింప బోవుటకు నిశ్చయించుకొని కట్ట వస్త్రములు లేనందుకు కడు చిన్నబోయి, మామకాసంగతిని విన్నవించిరి. కాలువసేను డపుడు, దేవతలకు వస్త్రములను నేసి యిచ్చుచుండిన భావనాఋషి రాకపోకలను గనిపెట్టుచు, అతడొకనాడు మగ్గమును వెలుపల మరచిపోగా దానిని గొనితెచ్చి నూలు లభ్యము కానందున నారనుదెచ్చి నారవస్త్రములను నిర్మించి రాక్షసులెల్లరకు నిచ్చినాడు. భావనాఋషి యీసంగతిని తెలిసికొని కాలువసేనుని పైకి యుద్ధమునకు వచ్చి, ఆ కదన రంగమున నాతని కూల్చివేసినాడు ఇందలి కవిత సరసముగ మృదువుగ నున్నది.

## మార్కండేయ పురాణము [7]

ఇదియును వెనుకటి గ్రంథమువలె పద్మ సాలుల వంశ చరిత్రను దెల్పు గ్రంథమే. ఇదికూడ సంస్కృత గ్రంథమునకు దెనిగింపని అముద్రిత గ్రంథ సూచిక యందు దెల్పబడినది దీని యందెనిమిదాశ్వాసములు గలవు 1—3 అశ్వాసములలో ద్దని రచయత, గజవెల్లి గురవప్పగా దెల్పబడినాడు. మరల 5—8 అశ్వాసాంత ద్విపదలలో పర్వతమంత్రి లింగానామాత్యుడీ కృతి కర్తయని చెప్పబడినాడు

ఇందుకూడ సృష్ట్యాదినుండి మొదలిడి భావనా ఋషి జన్మము వరకును గల చరిత్రను వర్ణించినాడు పిమ్మట పద్మ సాలుల పరాక్రమాదులు వర్ణింప బడినవి పిమ్మట మృకండు మహామునికి మార్కండేయుడు జనించుట, చిట్ట చివర, మార్కండేయ ముని శివుని గూర్చి తప మొనర్చి చిరంజీవి యగుటయు వర్ణితమైనవి మార్కండేయుడు శివుని గూర్చి తప మొనర్పగా శివుడు ప్రత్యక్షమైనాడు అపుడు శివుని గూర్చి మార్కండేయు డొనర్చిన స్తోత్రమును కవి యాంధ్రీకరింపక, సంస్కృతమున నట్లే యుంచినాడు.

ఇందలి కవిత్వము నిర్దుష్టమై తనరారుచున్నది భావనాఋషి కాలుప సేనుల యుద్ధ సందర్భమున ఆ సన్నివేశమునకు దిగినట్లు గావించిన సంధ్యా వర్ణన రమణీయముగనున్నది

"వీరునిచే నెల్లి వెస దానవుడు
ఘోరాజిలో నేల గూలు నటంచు
చమరుల కెరుగింప నరుగు చందమున
గమల మిత్రుడు గ్రుంకె కడు వేగమునను
అరయంగ వీరుడు నసురుల దునుము

---

7. శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ గ్రంథాలయము— ఆర్ నెం 630—కాగితప్రతి

బరగ రక్తచ్ఛాయ భంగి దిక్కులను
వెలయంగి గెంజాయ విలసిల్లునంత
పొలుపార దనుజుడీ పోరిలో జావ
సపురులు తల దాల్చునట్టి చందమున
బిసరుహ నిచయంబు బిగువెల్ల నుడిగె
భోరున దైత్యుని బోరిమార్చ సురలు
వీరునిపై పుష్ప వృష్టి వర్షింప
బొలుపారగా గూడ భోగిన భంగి
నెలమి జుక్కల పంక్తులెంతయు నొప్పె"

## రుక్మాంగద చరిత్ర[8]

అముద్రితము

కృతి కర్త కవిగిరి లేక వేంకటగిరి ఈతడు శాహాజీ మహారాజు బంధువును విచిత్రరాయని కుమారుడును నగు ఖండోజీ రాయని యాస్థానకవి ఈతడు కృతుల నన్నిటిని యాతని యాదేశానుసారము రచించినాడు. విచిత్ర రాయవతంసుడని యీతనికి బిరుదు గలదు. "ఈతని పోషకుడగు ఖండోజీ, యీ బిరుద నామముతో సంబోధించిన సన్నివేశమును బట్టిచూడగా, కవిగిరి ఖండోజీ తండ్రి నాటి నుండియు నాతని యాస్థానమున నుండెననియు, నందుచే దన తండ్రిపేరితో నున్న బిరుదముతో ఖండోజీ సంబోధించెననియు స్పష్టమగుచున్నది "[9] గిరిరాజీతని సోదరుడు

---

8 తంజావూరు సరస్వతీమహలు గ్రంధాలయము, ఎఫ్ నం. 353– కాగితప్రతి

9. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము– ద్వి ము– పు. 266
కవి వంశ మూల పురుషుకు గోపాలమంత్రి పీరాపస్తంభ సూత్రులు.

అభినవదర్పణము, ఘటికాచల మాహాత్మ్యము, నను పద్యకావ్యము లీతని యితర కృతులు.

పరమ భక్తుడై ఏకాదశీ వ్రతమును జరిపి ముక్తిని గాంచిన రుక్మాంగద మహారాజు చరిత్రమిందు వర్ణింపబడినది ఇదియే మోహినీ రుక్మాంగద కథ యని సామాన్యముగ నందరనుకొను కథ.

ఈకవికుకవి నిందనుగావించినాడు. ద్విపద కవులలో కుకవినిందగావించినవారిలో నీతడొకడు. ఖండోజీ రాయడీతని పిలిపించి "మత్ప్రియముగా కమలాక్షుపేర" నొక కావ్యమును చెప్పుమనగా, కవి సకల పుణ్య శ్లోక సత్కథల రాశియయిన రుక్మాంగదరాజు చరిత్రను చెప్పుటకు నిశ్చయించినాడు

ఈ కథ బ్రహ్మాండ పురాణమున గలదు. ఈ రుక్మాంగద చరిత్రమునే క్రీ. శ. 15వ శతాబ్ద ప్రారంభమున ప్రౌఢకవి మల్లన పద్య కావ్యముగ సంతరించెను. ద్విపద కావ్యమునకును పద్య కావ్యమునకును గొన్ని యెడల భేదములు గలవు

(1) రుక్మాంగదుడు బ్రహ్మ సృష్టించిన మాయా మృగముల నన్నింటిని ఖండించి మందర ప్రాంతమునుండి మగుడి తన పురమున కేగుచున్న సమయమున అతనిని మందర పర్వతముపై మోహిని యున్న స్థలమునకు పంపుటకై బ్రహ్మ కాలజిత్తను రాక్షసుని సృష్టించినట్లు ద్విపదకావ్యమున గలదు. ఈతడు మాయాతపసి వేషమును పూని శివుని పూజింప వలెనని రుక్మాంగదునికి బోధ గావించి మందరాద్రికి పంపును కావి ఈ కాలజిత్తు ప్రసక్తి పద్యకావ్యమున గానరాదు ఈ కాలజిత్తు మాయా తపసి వేషము వేసికొనుట హరిశ్చంద్రోపాఖ్యానము లోని మాయా వశిష్ట పాత్రను దలపునకు దెచ్చుచున్నది

(2) రుక్మాంగదుడు మంధర పర్వతమున కేతెంచిన వార్తను మోహిని చెలుల వలన వినినట్లు ద్విపద కావ్యమున గలదు. కాని పద్యకావ్యమున

మోహినియే తెలిసికొనినట్లు, "అరుగుదెంచుటాత్మ వీక్షించి'' అని గలదు

(3) మోహినీ రుక్మాంగదలు పురమునకు మగుడి రథారూఢులై పోవుచున్న సమయమున వారి రథము క్రింద నొక బల్లి పడుట తటస్థించును ఆ బల్లి వాలము తెగి బాధపడుచుండగా రుక్మాంగదుడు దాని బాధను గాంచలేక జాలి జెంది దానిని చేతిలో నిడికొని బాధ నివారించుటకు యత్నము చేయుచుండగా మోహిని బల్లిని అంటరాదనియును, అంటినచో పాపము సంభవించుననియు పల్కగా, నా గృహ గోధికము మోహినిని జూచి "కరుణ యొకింతలేక యిట్టాడుట" భావ్యము గాదనియును, "మహాధ్వరములు ప్రాణి రక్షకు సదా సరిగా వని పల్కు వేదముల్" అనియు నన్నట్లు పద్యకావ్యమున రచింపపడినది కాని ద్విపద కావ్యమున బల్లి మోహినితో పల్కినట్లు లేదు

(4) గృహ గోధికము పూర్వజన్మమున తన భర్తకు సిద్ధురాలొసగిన మందిడగా, నామందు మాత్ర దప్పి అతడు మరణించినట్లు పద్య కావ్యమున గలదు కాంతునకు వలపు మందిడిన అపరాధమునకై బ్రహ్మ యామెను బల్లివై పుట్టుమని శపించినట్లును పద్య కావ్యమున గలదు. కాని ద్విపద కావ్యమున నిట్లు లేదు మందిడగా, ఆమె భర్త ఆమె వశమగుటకు బదులు సిద్ధురాలి వశమయి నట్లును, మందిడిన పాపము వలననే యామె గృహ గోధికముగా జన్మించినట్లును గలదు

(5) రుక్మాంగదుడు మోహినిని గొనివచ్చి తక్కిన నూర్గురు భార్యలను జూచి, తానింక మోహిని యొక్కతెతో మాత్రమె నుండగల వాడనని చెప్పగా, వారందరును కుపితులై రాజును దూఱ బల్కుదురు అపుడు పట్ట మహిషియైన సంధ్యావళి యేతెంచి వారట్లు పతిని నిందిచుట పాపమని చెల్పి, వారికి పతివ్రతా ధర్మము నుపదేశించి, ఆ సందర్భమున విష్ణు శర్మ యనునొక విప్రునికథను దెల్పుట, ద్విపద కావ్యమున గలదు. ఈ కథాప్రసక్తి పద్యకావ్యమున గానరాదు.

(6) ఇటులే, మోహిని రుక్మాంగదుని ఏకాదశీవ్రతమును మానివేసి తనతో నుండి సుఖోప భోగముల ననుభవింపమని చెప్పినపుడు గూడ, సంధ్యావళి యేతెంచి, ఆమెకు పతివ్రతా ధర్మమును బోధించి, 'విష్ణుశర్మ' కధను జెప్పినట్లు పద్యకావ్యమున గలదు కాని ఈ సందర్భమున నీ కధాప్రసక్తి, ద్విపద కావ్యమున గానరాదు. ఈ కథ పై 'విష్ణుశర్మ' కధతో నించుక భేదించుచున్నది

(7) మోహినీ దేవి రుక్మాంగదుని పుత్రుడు ధర్మాంగదుని చంపమని కోరినపుడు సంధ్యావళి పుత్రుని కొరకై శోకించినటులు ద్విపదకావ్యమున విపులముగ గలదు. ఈ ఘట్టము పద్యకావ్యమున సంక్షిప్తముగనున్నది. ఈమె శోకించిన ఈ ఘట్టము హృదయ విదారకముగ నుండి కరుణ రసమును చక్కగ పోషించుచున్నది

(8) రుక్మాంగదుడు తన పుత్రుని చంపుటకై కరవాలమునెత్తి యాతని మెడ నరుక నుంకించిగా. విష్ణువుయొక్క మాయవలన నా ఖడ్గము పుష్పమాలయై ధర్మాంగదుని కంఠము నలంకరించును, ఇట్లు జరిగిన వెంటనే నారదాది మునీశ్వరులు తన్ను సేవింపుచుండగా శ్రీమహా విష్ణువు రుక్మాంగదు నెదుట ప్రత్యక్షమైనటులు పద్యకావ్యమున గలదు. కాని ద్విపద కావ్యమున ఖడ్గమట్లు పుష్పదామము కాగానే రుక్మాంగదుడు "ధార తప్పెనో లేక తనయ మోహాంధ కారమునను కేలు కంపించె నొక్కొ, కాకున్న నాచేతి కలితాసిధార సాకల్యమీ వెంట జరుగునేయనుచు," వితర్కించినట్లు ద్విపద కావ్యమున నున్నది. అటులేఅతడు రెండు సారులు ధర్మాంగదుని కంఠము ద్రుంపబూనుట రెండుసారులు నాప్రయత్నము విష్ణుని కరుణచేవమ్మగుట మూడవసారి ప్రతిజ్ఞ యొనర్చివేయబూనగా శ్రీ మహావిష్ణువు ప్రసన్నుడై సాక్షాత్కరించుట జరిగినట్లు ద్విపద కావ్యమునగలదు.

(9) విష్ణుమూర్తి రుక్మాంగదునకును, భార్యలకును వెంటనే మోక్షము నొసగి వైకుంఠమునకు దోడ్కొని పోయినట్లు పద్యకావ్యమున గలదు. రుక్మాం

గదునింకను కొన్నిదినములు భూలోకమున నుండి రాజ్యపాలనము గావించిన పిమ్మట వైకుంఠమునకు రమ్మని శ్రీ మహావిష్ణువు చెప్పినట్లు ద్విపద కావ్యమున గలదు.

(10) రుక్మాంగదు డేకాదశీవ్రత మొనరించిన వారందరకును వైకుంఠ వాసము నొసగవలెనని దేవదేవుని కోరగా నాతడా వరమును భక్తున కొసగి, సంధ్యావళీదేవి పాతివ్రత్య ధర్మమును ప్రశంసించినట్లు ద్విపద కావ్యమున గలదు

(11) మోహిని తాను రాజువ్రతమును చెఱుప బూనినందున తనకు గతు లేమియు నుండబోవనియును తనను మన్నించి కాపాడ వలసినదనియు పక్షివాహనుని ప్రార్థించినట్లు ద్విపద కావ్యమున గలదు ఈప్రసక్తి పద్యకావ్యమున గానరాదు బ్రహ్మదేవుడు తనకప్పగించిన ధర్మమునే తాను నిర్వర్తించినటులామె! భావించిన దేమొ

(12) మోహినీదేవి రుక్మాంగదుని యనుజ్ఞవడసి మందరాద్రిని గొల్చుటకై మరల మందర పర్వతమున కేగినట్లు ద్విపద కావ్యమున నుండగా, పద్యకావ్యకర్త నామె సంగతినే తడవలేదు

ఈ కావ్యము రసవంతమై వర్ణనాదులతోను, నలంకారాదులతోను నొప్పారుచు ప్రౌఢమైయున్నది కవి కావ్యస్తుతి నెక్కుడుగా గావించు కొనలేదు "సరస రసాలంకార సార్థపదంబు, లిరవొంద చెలువొందు నీ మహాకథను" అని మాత్రమే చెప్పినాడు, ఈ కావ్యమునందు వర్ణనా బాహుళ్యము గలదు. ద్విపద కావ్యములందు వర్ణనలు స్వల్పముగ నుండునను నుక్తికిది యపవాదమైజెన్నొందుచున్నది కావ్యా రంభమున గావించిన నైమిశారణ్య వర్ణన, మందర పర్వతవర్ణన, ఏకాదశీ వ్రతమును జేయునపుడు నగరము నలంకరించిన వర్ణన లిందులకుదాహరణములు కాగలవు యముడు పాపులను పెట్టు బాధల వర్ణనను కూడ సొగసుగ గావించి నాడు వానిని చదువుచుండ నిజముగా భయము గొల్పుచున్నది

ఈ కవి గ్రంథమున ననేక జాతీయములను నానుడులను ప్రయోగించి శైలికి సొగసును గూర్చినాడు.

"ప్రేతల తోడి జాగరణము
నిప్పున చదలంట నేర్చునే
ముచ్చును తేలు గుట్టిన యట్లు
రెంటికి చెడిన రేవడి నైతిని
చల్లకు వచ్చి ముంత దాచుట
ముసుగు లోపలి గుద్దులాట
ఎలుకకు మార్జార మేడ్చినట్లు
కడుపులో చేయి బెట్టి కలంచినట్లు"

ఈతని శైలియందు సంస్కృతపదము లెక్కువగా నున్నందున ప్రౌఢమై తనరారు చున్నది. ఉదాహరణమునకు మందర పర్వత వర్ణనను గనుడు

"సమదగ్ర తరగాన సందవచ్చంద్ర?
మణివారి నిర్ఝరి మర్జ మదేభ?
రణ కేళి ఘుమారవసముత్పన్న
కుటిల ప్రతి ధ్వాన కుప్యజ్ మృగేంద్ర
చటుల దంష్ట్రాతప శమితాంధకార
కందరంబులను సత్కూట దరము
మందరంబున గాంచి..."

కొన్ని పట్టులందు ముద్దులుగుల్కు తేట తెనుగు పదములను కూడ గూర్చినాడు శివుని వర్ణన సుందరముగ నున్నది

ప్రజలందరును క్రూర మృగములు తమ్ము బాధించుచున్నవని మొర బెట్టు కొనగా రుక్మాంగదుడు వానిని వధించు నుద్దేశ్యముతో వేటకు బయలు దేరును. అపుడు సంధ్యావళీదేవి యేతెంచి వేట, జూదము, మున్నగునవి వ్యసనము లనియును, ధర్మపరులగు రాజుల కవి తగవనియును జెప్పిన వాక్యములు నీతి భరితములై యున్నవి

ఈ కవి సంధ్యావళీదేవి ముఖమున మూడు నాల్గుస్థలములందు పతివ్రతా ధర్మము నుపదేశించినాడు. పతివ్రత లెట్లుండవలెనో. పతి భక్తి లేని స్త్రీలెట్టి జన్మములను పొందుదురో మున్నగు వాని నన్నింటిని వర్ణించినాడు.

ఈ కవి గావించిన విష్ణుశర్మ భార్య వర్ణనము హరిశ్చంద్రోపాఖ్యానము లోని కాలకౌశికుని భార్యవర్ణనమును బోలి యుండి జుగుప్సను గొల్పుచున్నది.

"తుప్పబట్టిన మేను తోరంపు గూను
గొప్పైన నడుము ముందుకొన్న వాగడుపు
బొడిపె కట్టిన నెత్తి బుడ్డ మూతియును
పిడతటి పై కంది పెట్టిన నుదురు
చుండు రాలెడి తల సుడి గొన్న బొమలు
కండకన్నులు తుట్టె గట్టిన పెదవి
గొంచి మోరయు మహాక్రూర దృష్టియును
నించ బోయిన కాలు యొత్తిన వ్రేలు
చివ్వల సగముగా దెగి వ్రేలుచాట వీనులును
నవ్వినట్లనె యుండు నలి మిట్ట పండ్లు"

ఈకవి యొకానొక సందర్భమున దయ యొక్క యౌత్కృష్ట్యమును నిరూపించినాడు

''దయగల చోట దగులు సంపదలు
దయగల చోటను దనరు సత్కీర్తి
దయగల చోటను ధర్మంబు వెలయు
దయగల చోటును దైవంబు నిలుచు
తపములు వ్రతములు దాన ధర్మములు
జపములు ప్రాణ రక్షకు సరిగావు
కావున దయగల ఘనులకు నెల్ల
నేవి యసాధ్యంబు లిహ పరంబులను"

ఈ ద్విపద పంక్తులు మహాకవి, షేక్స్పియర్ దయను గూర్చి చెప్పిన పంక్తులను దలపునకు దెచ్చుచున్నది (Merchant of Venice 4-1)

ఇటులే ఈత డింకొక యెడ సత్యము యొక్క యౌత్కృష్ట్యమును వర్ణించినాడు.

"సతత విద్యాదాన స ప్త సంతాన
వితత మహాదాన వితతులెన్నైన
సత్య వాక్యంబుతో సరి కాయరాదు
సత్యంబు కైవల్య సాధకతమము
... ... ... ...
సత్యంబు దప్పిన సమయము సంపదలు
సత్యంబు దప్పిన సత్కీర్తి చెడును
మీరి కల్లరి కాలమృత్యువు కాని
కోరి సత్యము బొత్తుకుడువ డెన్నడును"

గ్రంథారంభమున సరస్వతీ, శివ, గణేశులను స్తుతించుట వలన నీకవి యద్వైతియని తెలియుచున్నను, నీ గ్రంథమును బట్టి చూచినచో నీతనికి విష్ణువు నందు ప్రీతి యెక్కుడని యనిపించును విష్ణుపీతని యిష్ట దైవమయి యుండ వచ్చును.

ఈతనికంటె పూర్వమీ రుక్మాంగద చరిత్రను చదలువాడ మల్లన ద్విపద కావ్యముగా క్రీ శ 1680 ప్రాంతమున రచించినట్లు తెలియుచున్నది. కాని ఈ గ్రంథము నేడెచ్చటను లభ్యమగుట లేదు. ఈతడు దీనిని రచించెననుట కీతని విప్రనారాయణ చరిత్ర పీఠికలోని పద్య మాధారము.

ఈతని రుక్మాంగద విజయ ద్విపద కావ్యములోనిదని అప్పకవి ఈ క్రింది ద్విపద నుదాహరించినాడు

'శ్రీకర గుణ సాంద్ర చిరయశోరుంద్ర
ఆకార చంద్ర రామయ భాస్కరేంద్ర"

దీనిని బట్టి యీతడు దీనిని రామయామాత్య భాస్కరున కంకితము గావించినట్టూహింపవచ్చును రామయామాత్య భాస్కరుని కాలము క్రీ శ 1560 ప్రాంతము

కావున రుక్మాంగద చరిత్రను ద్విపద కావ్యముగా మొట్టమొదట దీర్చి దిద్దిన యశస్వి కవికే జెందుచున్నది. దీనిని బ్రహ్మాండ పురాణము నుండి గైకొనినట్లు కవిగిరియు, ప్రౌఢ కవి మల్లనయు జెప్పిరి. ఈ ద్విపద కావ్యము రసవంతమై యుండి చదువ చదువ చవులూరుచున్నది పాత్ర పోషణ విషయమై కవి కడుంగడు నైపుణ్యమును ప్రదర్శించినాడు

## భా ను క ల్యా ణ ము [11]

అముద్రితము

కర్త చంద్రశేఖరకవి, ఈతడు విశ్వ కర్మాన్వయమున బరగు కిన్నెర బ్రహ్మ వంశ సంజాతుడు, ఈతడు కంచెర్లయ్య వారి పుత్రుడనని చెప్పికొనెను.

మయబ్రహ్మ పుత్రిక యయిన సంజ్ఞాదేవిని సూర్యుడు వివాహమాడుట యందలి యితి వృత్తము ఒకనాడు సంజ్ఞాదేవి తన సఖులతో నుద్యాన వనమున విహరించుచుండగా సూర్యుడామె సౌందర్యమును గాంచి అబ్బురపడి ఆమెను వివాహమాడ దలచును వెంటనే నాతడు కశ్యపాది మునీశ్వరుల వద్ద కేగి, తన కోరికను దెలిపి, తమ వివాహమునకు బ్రహ్మ నెటులైన నంగీకరింప జేయుమనెను. బ్రహ్మ అందులకు మొదట నిచ్చగింప లేదుగాని, సంక్రందుని సంధాన చాతుర్యము వలన చివర కంగీకరించును. మునులీ సంతోషకరమగు వార్తను సూర్యునకు దెల్పి, అతనిని పెండ్లి కుమారునిగా దోడ్కొని వత్తురు. పెండ్లి సకలాట్టహాసములతో జరిగినది

ఇందాశ్వాస విభజన గానరాదు. ఇది లఘుకృతియే యైనను, కవిత్వము

---

11. మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము—
డి నెం. 1176—కాగితప్రతి.

సరసముగను, పటువుగను నున్నది. అటనట శబ్దాలంకారములను వాడినాడు సంజ్ఞాదేవి సౌందర్య వర్ణన సందర్భమున ముక్తపద గ్రస్తమును వాడినాడు.

"దంతిగా డికురాకు తళుకుల బంతి
బంతిగా దొరపైన పసిడి చెంగల్వ
కల్వగాదిది చంద్రకళలోవి చెల్వ
చెల్వ గాదిది పెంపు సిరిగల మొల్క
మొల్క నవనీతముననైన బొమ్మ
బొమ్మగా దిల పూవి బూసిన కొమ్మ
కొమ్మగా మరుడు గైకొనిన పూశరము"

ఈ ద్విపదలు, గౌరన యొక్క "సుందరి గాదిది సొబగు రాయంచ" యను ద్విపదలను స్ఫురణకు దెచ్చుచున్నవి

తిక్కనవలె నీకవి గూడ పాత్రల వర్ణనను తానై చేయక, పాత్రలచే చేయించినాడు

ఈ కథ బ్రహ్మాండ పురాణమున గలదు. కాని అందు సూర్యుని తేజమును చూడలేక సంజ్ఞ కండ్ల నొకసారి మూసికొనుట, రెండవసారి వెలవెల బోవుట, అందువలన సూర్యుడామెకు తపతీ, శనులుదయించునట్లు శాప మొసగుట మొదలగు వృత్తాంతములు గలవు కాని ద్విపద కావ్యకర్త వానినన్నిటిని తడవలేదు. సూర్యుడామె సౌందర్యముచే నాకృష్టుడై ఆమెను వివాహమాడు వరకు గల కథను మాత్రమే గైకొని వివాహముతో గ్రంథసమాప్తిని గావించినాడు

ఇందలి శైలిని బట్టి చూచినపుడీతడు 16వ శతాబ్ద ప్రాంతము వాడేమోనను ఊహ పొడమును

పదియవ ప్రకరణము

# జీవిత చరిత్ర సంబంధములు

## రఘునాథ నాయకాభ్యుదయము

తంజాపురాంధ్ర నాయక రాజైన విజయ రాఘవ నాయకుడీ ద్విపద గ్రంథ కర్త. ఈతడీ యితివృత్తము నించుకంతైనను భేదము లేక రఘునాథాభ్యుదయమను పేర యక్షగానముగ రచించెను ఈతడిట్లొకే కథా సన్నివేశమును, ద్విపద ప్రబంధ, యక్షగానములుగా రచించుట కాతని కాలము నాటి సాహిత్య పరిణామపు ప్రభావమే కారణమని చెప్పదగును.

రఘునాథనాయకుడు రాజ్య పరిపాలనము గావించుచుండిన కాలనమున, నాతడుదయము నిద్ర మేల్కాంచినది మొదలు రాత్రి నిద్ర బోవువరకు నాచరించు దినచర్య యీ కావ్యమందలి వస్తువు ఇందలి నాయకుడు రఘునాథ నాయకుడే పురవీధులయందు స్వారి వెడలుచుండగా జాల మార్గముననుండి చిత్రరేఖ యను నొక వేశ్య యాతని సౌందర్యమును గాంచి మన్మథావేశ పరురాలయి తనపెంపుడు కీరముచే రఘునాథ భూపాలునకు తనవద్ద కేతేరమని సందేశమును పంపును. ఆ శుక సందేశమును దెలిసికొని రఘునాధుడు చిత్రరేఖ యభిమతమును దీర్చుటకై యారాత్రి యామె గృహమున కేగి యామెతో గడుపును ఇట్లు నాయికానాయకుల సమాగమ సౌఖ్యముతో కావ్యమంత మగును. ఇందుకవి ఆయా సందర్భములకు దగినట్లుగ, పురవర్ణన, మన్మథోపాలంభన మొదలగు వాని నమరించి రసవత్కావ్యముగ తీర్చిదిద్దినాడు ఇందలి యితివృత్తము తమిళ దేశపు 'ఉలా' ప్రబంధ పద్ధతి ననుకరించినది. ఉలా ప్రబంధము తమిళమున నతి పురాతనమైనది. తొల్కాప్పియయమున 'పుర త్తి నై ఇయల్' అనుసూత్రమందు ఉలా ప్రబంధ ములను గూర్చి చెప్పబడినది. ఇవి దేవతల రథోత్సవములకు, ప్రసిద్ధ

పురుషుల గజోత్సవములకు సంబంధించిన వర్ణనాదులతో గూడినవి. "ఇందలి యితివృత్తము ఇటువంటి యుత్సవము తమ వీధిని సాగుచున్నప్పుడు దానిని జూచుట తటస్థించు సప్తవిధ గణికలలో నొకవిధమునకు జెందిన కన్యక ప్రేమ ప్రకటనకు సంబంధించినది."

రఘునాథ నాయకాభ్యుదయమందలి కవిత్వము పాల్కురికి సోమనాథ రంగనాథ, గౌరనాదుల కవిత్వమంత ప్రౌఢముగా లేక పోయినను, శైలి ధారాశుద్ధి కలిగి, సరళమై విరాజిల్లు చున్నది. కాని ఈకావ్యమునకు గౌరవము, ప్రాముఖ్యము, కవిత్వ దృష్టితోకాక, అందభివర్ణితమైన విషయమును బట్టి ఒసగబడుచున్నది. ఆంధ్ర నాయకరాజుల కాలమున రాజ జీవిత మెట్లుండెనో నెరుగుటకీ కావ్యము దర్పణము వంటిది. ఆ కాలమున నాయకరాజులు ధరించు, వేషభూషలు, వారి ఆహార విహారములు, వారివిద్యా వినోద కాలక్షేపములు, రాజ కార్యకలాపములు మున్నగు విషయములన్నియు సూక్ష్మ విశేషములతో సంపూర్ణముగ నభివర్ణితములైనవి రఘునాథ నాయకుని దేవభూదేవ పూజనము, దానాదికములు మజ్జన భోజనాదులు కొలువు తీర్చియుండునప్పటి విశేషములు, నగర వీధుల విహారము, విద్యా వినోద కాలక్షేపములు, ఉద్యానవన విహారము మొదలగు విషయములను జదువునప్పుడు మనము కూడ నా సమయమున నటనుండి, యా విశేషముల ననుభవింపుచున్నట్లుగ నుండును. ఇందలి వర్ణన లంత వాస్తవికముగ నున్నవి.

## తంజాపురము — రాజప్రాసాదము

ఈ కావ్యమందు గావింపబడిన వర్ణన లన్నిటిలో నాయకరాజుల రాజధానీ నగరమైన తంజాపుర వర్ణనము విశేషమైనది. క్రీడాభిరామమున ఓరుగంటి పురవర్ణనమును, ఇందు తంజపురీ వర్ణనమును గలదు కాని వేరెందును నిట్లు పురవర్ణనములు గానవచ్చుటలేదు. ఇట్టి వర్ణనలు ఆ నాటి సాంఘిక రాజకీయ విశేషములను తెలికొనుట కనువు పడుచున్నవి. తంజాపుర వర్ణనము సామాన్య పురవర్ణనవలెనుండి యతిశయోక్తులతోగూడి

యున్నను, రాచనగర వర్ణనము మాత్రము వాస్తవికముగ నున్నవి

ఈ కావ్యమందు విజయరాఘవ నాయకుని యొక్క వంశావతార క్రమము, నాయక రాజుల దినచర్య రాజ్యసభా వృత్తాంతము మొదలగు విషయములనన్నిటిని సూక్ష్మముగ వివరించినాడు.

విజయరాఘవ నాయకుని కవిత్వము దోష రహితమై లక్షణ వంతమై యొప్పారుచున్నది. ఈతడు కూడ పెక్కురు కవులవలె లఘ్వలఘురేఫలకును దధ, ట—ర, (వర్గప్రాసము) లకును, ప్రాసమును గూర్చినాడు ల—ళ కును ప్రాసమును గూర్చినాడు

ప్రాసస్థానమున 'చ' ద్విత్వాక్షరముగా వచ్చినపుడీతడు 'అచ్యుత' బదులుగా 'అచ్చుత' యని వాడినాడు, దీనిని పొరపాటుగా భావించి అచ్యుతగా దిద్దనవసరములేదు. ఏల యనగా, ప్రాస స్థానమున ద్వితీయాక్షర స్థానమున నున్న సంయుక్త వర్ణములలో దేనితో నైనను ప్రాసను గూర్చుట ద్విపద కవుల సంప్రదాయమునకు విరుద్ధముగాదు కాన ఈ కవి అచ్చుత యనియే ప్రయోగించినాడని భావింపవచ్చును

"అచ్చుత రఘునాధ యతి మోహనాంగ
విచ్చేయవలయు మావెలది యింటికిని" — (పు 65)
"అచ్చుతేంద్రుని పట్టి యతివ జేపట్టి
మచ్చిక తోడ నమ్మణి సౌధమునకు" — (పు 71)
"దెచ్చిన భూలోక దేవేంద్రుడైన
అచ్చుత రఘునాధుడట గటాక్షింప" — (పు. 30)
"అచ్యుతేంద్రకుమారా నసహాయశూర
నిచ్చటికేదెత్తు నిదె పోయివత్తు" — (పు. 46)
"అచ్చుత రఘునాధుడంత నక్కడను
విచ్చలవిడి స్వారి విచ్చేసి మరలి" — (పు. 49)

ఈ కావ్యమున దేశ్యములు, అచ్చతెనుగు పదములు అధికముగ ప్రయోగింప

బడినవి. ఐత్తాయితము, కడితము, వాగఅ, తంబుగ, సజ్జ, చప్పరము, ఉప్ప రిక, ఉప్పవడము, మదనచేతులు-మొ. గుఱిగొల్లలు, బొక్కసమువారు, సంప్రతులు, అసమువారు, వేగులవారు వ్రేతహస్తులు, మజాలశీలు, రాయసములవారు, మొదలయిన రాజకార్యమున నియుక్తులైనవారి పేర్లు కూడ పేర్కొనబడినవి

ఇట్లీ రఘునాథ నాయకాభ్యుదయ కావ్యము, సాహిత్య పరముగానే కాక, చారిత్రక సంఘటనలన, ఆనాటి సమకాలీన జీవనమును నెరుగు టకు ప్రామాణికమైన గ్రంధముగ నున్నది.

## అన్నమాచార్య చరిత్ర

అన్నమాచార్యుని చరిత్ర నాతని మనుమడు తిరువేంగళ నాథుడే రచించుట వలన నిది యాతని చరిత్రము నెరుగుటకు మిక్కిలి ప్రామాణికమగు గ్రంధము

అన్నమాచార్యుడు నందవర వైదికి బ్రాహ్మణ వంశమున జన్మించెను. తాళ్లపాకవారు ఋగ్వేదులు, ఆశ్వలాయన సూత్రులు, భారద్వాజ సగోత్రులు. పొత్తపినాటి తాళ్లపాక[8] గ్రామమున నుండెడివారు అన్నమాచార్యుని తల్లి లక్కమాంబ ఈమె మాడుపూరి మాధవస్వామి భక్తురాలట[9] అన్నమాచార్యుడు క్రీ.శ 1424వ సంవత్సరమున జన్మించెను చిన్నతనమున తలిదండ్రులును వదినె యన్నలును, ఈతని కనేక పనులను జెప్పుచుండగా, నీతనికివి తన భగవ దారాధనకు ఆటంకము కల్గి చీకాకును గల్గించుచుండెను. అన్నమయ్యకు పదు నారవ యేట స్వామి సాక్షత్కరించి, సంకీర్తనములను రచింపుమని యానతిచ్చి నాడట. అప్పటినుండియు నాతని "మదికిచ్చయైనట్లు, ఆడినమాటెల్ల నమృత కావ్యముగ, పాడినపాటెల్ల బరమ గానముగ, తన కవిత్వమునకు

8. తాళ్ళపాక నేటి కడప జిల్లా రాజంపేట తాలూకున నున్నది.

9 ఇది కడపజిల్లా సిద్ధవటము తాలూకాలో నున్నది

దన గానమునకు గనుకొని సకల లోకములు గీర్తింప," వేంకటపతి మీద వింత వింతలుగ, సంకీర్తనంబులు సవరించుచుండెను. వేంకట పతిని దర్శించు నభిలాషచే నన్నమయ్య తిరుపతికి ప్రయాణమై మార్గ మున తిరుపతి పొలిమేరలోగల తాళ్ళపాక గంగమ్మను సేవించి తిరుపతికి విచ్చేసినాడు. తిరుపతిలో కొంతకాలము గడిపి, తల్లితోగూడ గృహమున కేతెంచినాడు అన్నమయ్య తిరుమలమ్మ, అక్కలమ్మ యను నిర్వురు భార్య లను పెండ్లియాడి గృహస్థ జీవితమును గడుపుచు, వెంకటేశ్వర స్వామిపై ననేక శృంగార సంకీర్తనలను రచించినాడు. వివాహానంతరమే యీతడు రామాయణమును రచించినట్లు గలదు కాని నేడది యలభ్యము. అహోబల నృసింహస్వామి గురువై అన్నమయ్యకు హయగ్రీవానుగ్రహమును గలుగ జేసినాడు. పిమ్మట అన్నమయ్య శఠకోపముని యొద్ద సకల వేదాంత శాస్త్రము లను నభ్యసించినాడు. "ఈశఠకోపముని అహోబలమఠ ప్రతిష్ఠాపనాచార్యు లయిన యాదివ్వ శఠకోప మునీశ్వరులగుదురు. అన్నమయినాట నీశఠకోప యతులే వర్తిల్లిరి ఆముక్తమాల్యదలో శ్రీకృష్ణ దేవరాయలవారీ శఠకోప యతిని సన్నుతించిరి "[10] అన్నమయ్య సంకీర్తనలానాటికే ప్రసిద్ధిని పడయుట వలన, సాళ్వ నరసింగ రాయడన్నమయ్యను దర్శింప నేతెంచెను నరసింహ రాయడు విజయనగర ప్రథమ రాజ్య వంశ్యుడయిన విరూపాక్ష రాయల తరువాత నా వంశమువారిని పడగొట్టి రాజ్యము నాక్రమించుకొనెను అన్నమాచార్య చరిత్రమున నాతడు "రాచమూకలలో ఐరాక్రమశాలిగా" వర్ణితుడైనాడు అన్నమాచార్యునికి చేకానికలను సమర్పించుకొని "శ్రీకృష్ణుమన్నన గ్రీడిభూచక్ర మేక చక్రంబుగా నేలిన పగిది, నాలాగు మీ సహాయము నాకు గలగనేలుదు ధర యెల్లనేక చక్రముగ"నని చెల్పి, శ్రీకృష్ణుడర్జునునకు సహాయ భూతుడై యుండినట్లుగ, నీతడు కూడ తన దేశమున కేతెంచి, తనను మన్నింప వలెనని వేడికొనినాడు. రాయడు నన్నమయయు కొంతకాలము టంగుటూరు నందుండిరి అన్నమయ్య యాశీస్సుచే, శ్రీ వేంకటేశ్వరస్వామి దయచే నరసింగరాయడు విజయనగర సామ్రాజ్యము నాక్రమింప గలిగెను ఈతడు తిరుపతి వద్ద చంద

---

10. అన్నమాచార్య చరిత్ర, పీఠిక. పుట. 41

గిరిలో కొంతకాలము రాజ్యమేలినట్లుగ తిరుపతి శాసనముల వలన తెలియు చున్నది. విజయనగర సామ్రాజ్యమును స్వాధీనపరచుకొనిన పిమ్మట, పెనుగొండ కీతడన్నమాచార్యుని రప్పించుకొని, సంకీర్తనలను విని యానందించినాడు. అన్నమాచార్యుడు,

"చక్కెరలో తీపు చల్ల దెమ్మెరలు
చక్కని కపురంపు జీవరత్నములు
కలయమృతంబు మీగడ మీది జవులు
చిలుకును గవులెల్ల జేయెత్తి మ్రొక్క
వెంకటపతికి గావించిన మంచి
సంకీర్తనముల రసంబులుట్టగను
సింగార మొక కుప్ప జేసిన రీతి
రంగైన రాగ వర్ణముల......" బాడినాడు

ఈ సంకీర్తనలను వీనుల విందుగా విని చాల మెచ్చి సాళ్వనరసింహరాయలు అన్నమాచార్యులకు పచ్చల కడియాలు, బంగారు వ్రాత పచ్చడములు, కెంబట్టు కుళ్ళాయి, అంగదములు ఉభయాతపత్రము వింజామరల జోడు మంచి యుదిరి చేసిన గిండి, కళాచిక మొదలగువాని నొసగి సత్కరించి తన పెద్ద నగరియందే యొక్క నగరును పొందుగా జూపించియటనుండ బనిచినాడు. అన్నమాచార్యుడు నరసింహరాయల వలన యనేకాగ్రహారాదులను కూడ బడసి యుండును. ఇందుకు ప్రమాణ మీ గ్రంథములోని వాక్యములే. 'వెంకటాద్రి చెంగటను, తన యగ్రహారమై తనరుచునున్న, మరులుంకు నొక జీడి మామిడి దాన"[11] అన్నమాచార్యులు చాల వైభవముతోను రాజసముతోను గొన్నాళ్ల వెలుగొందెను [12]

---

11. అన్నమాచార్య చరిత్ర, పుట, 42
12. అన్నమాచార్య చరిత్ర, పుట, 35

ఇది జరిగిన తరువాత మరల నొక నాడన్నమార్యుని బిలుపించుకొని రాయలు శృంగార సంకీర్తనము లాతనిచే వినెను.

"చెలులార వేంకట శిఖరి నాయకుని
కలికికి గడగంటగను పట్టు నెఱుపు
చెలువ మేగతి నుండె జెప్పరే" యనిన
నలువున బ్రాణేశు నాటిన చూపు
నిలుపున బెఱుక నూనిన శోణితంబు
తలపోయ గాదుగాదా యన్న పదము
పలుమఱు బాడించి పాడించి చొక్కి
తలయూచి ''యిది! కవిత్వం" బని మెచ్చినాడట''

అన్నమాచార్యుల సంకీర్తనలను విని తన్మయుడైన రాయడంతటితో తృప్తి నొందక గర్వాంధుడయి అట్టి పదములను తనపై రచియింపుమనినాడట. ఈ పలుకును విని యన్నమయ రెండు చేతులతోను చెవులను మూసికొని 'పరమ పతివ్రతా భావమును బూని, "హరి ముకుందుని గొనియాడు నా జిహ్వా, నిను గొనియాడంగ నేరదెంతైన" యని దెల్పి, అటువంటి వాని పొందు తనకిక నవ సరము లేదని పోవుచుండగా, భటులచే నాతని బట్టి తెప్పించి, సెంకలలను వేయించి నిర్బంధమున నునిచినాడు అపుడన్నమయ్య "వేంకట భర్తనుతలచు కొని, సంకెల లిడువేళ జంపెడు వేళ, నంకిలి ఋణ దాతలాగెడు వేళ, వదలక వెంకటేశ్వరుని నామంబె, విదలింప గతిగొని వేరొండులేదు, వనమాలి యతడె నావగపెల్ల నుడుపు" (పుట 86), అని సంకీర్తనమును జెప్పి సంకెలలను విడిపించుకొనెను భటు లీవార్తను రాయలకు దెల్పగా, దానిని మాయగా భావించి తానే స్వయముగా నెదుటనుండి మరల సంకెల వేయించినాడు మరల యన్నమాచార్యుడు వినిపించుకొనగా, నాతని భక్తి మహిమకు అద్భుతమంది పశ్చాత్తప్తుడై అతని చరణాబ్జములపైబడి తన తప్పిదమును మన్నింప వేడికొని నాడు పిమ్మట అతనకి పాదార్చనాదులను గావించి, జాంబూ నదాంబరాదుల నొసగి సన్మానించినాడు. అన్నమయ్య యాతనిని క్షమించి, వెంకటేశ్వరుని యందును, అతని భక్తులయందును నెల్లప్పుడు పాయని భక్తితో నుండుచుని

చెప్పినాడు అన్నమయ్య యాదేశానుసారము రాజు అన్నమయ్యనే సాక్షాద్వేంకట భర్తగా నెన్ని భక్తి ప్రపత్తులతో నుండెను

అన్నమాచార్యుడు శృంగారమంజరి యను మంజరీచ్ఛందో మయ రచనను, శృంగార రసమయ మయిన దానిని వెంకటేశ్వర స్వామిపై రచించెను. ఈ రచనను విని వేంకటేశ్వరస్వామి యన్నమాచార్యు నిట్లను గ్రహించెనట.

"శృంగారమంజరి జేసి శేషాద్రి
శృంగ వాసునకు నర్పించి యిచ్చుటయు
నాడుచు బతక మాకన్నల జోల[13]
పాడగ నాడెల్ల బసిబిడ్డనైతి
నాకృష్ణమాచార్యు నాధ్యాత్మ వినుతి
రాక కొన్నాళ్ళు విరక్తుండనైతి
జగతి నీ శృంగార సంకీర్తనముల
కగపడి మంచి ప్రాయపు వాడనయితి
నని వెంకటేశ్వరుడన్నమాచార్యు
గనుగొని వాక్రుచ్చి గారవించుటయును"

అన్నమాచార్యుడు పెక్కు మహిమలను గావించినట్లుగ నిందు వర్ణితమైనది. తన యగ్రహారమైన మరులుంకునందున్న పుల్లమామిడి పండ్లను స్వామి కర్పించి వానినారగింపగా, నవి పళ్లు పులియునంత పులుపుగా నుండెనట. అట్టి వానిని స్వామి కారగింపు జేసినందులకు మిగుల పరితప్తుడై, వానిని దియ్య మామిడిగా జేయగా స్వామి నర్థింపగ, నవి తియ్య మామిడి యయినవట, ఇటులే వేరొక బ్రహ్మచారికి వివాహమునకు 'ద్వాదశీ కన్యకా' దానము నిప్పింపగల్గినాడు.

---

13 పతకమాకన్న జోల యెక్కడిదో, ఎవరిదో తెలియదు. కాని, కాకతి ప్రతాపరుద్రుని కాలమున నుండిన కృష్ణమాచార్య రచనకంటె పూర్వమైనదని పైవాని వలన తెలియుచున్నది

కన్నడ భాషయందు వేలకొలది పదములను రచించిన పురందరదాసు అన్నమాచార్యుని దర్శించి యాతని సంకీర్తనల నాలకించి, యాతడు సాక్షాద్వేంకటేశ్వరుడే యని సన్నుతింపగా, నన్నమయ్యయు నాతని సాక్షాత్తు పాండురంగ విఠ్ఠలుడే యని కొనియాడెనట, అన్నమాచార్యుని వార్ధక్యమున పురందరదాసు పిన్న ప్రాయమువారై యుందురు పురందరదాసు అన్నమాచార్య సంకీర్తనల ననుకరించుచు ననేక రచనలను గావించినాడు

అన్నమాచార్యుడు భక్తి శృంగార వైరాగ్య సంకీర్తనలను మొత్తము ముప్పదిరెండు వేలను జెప్పెనట [14] అతడు పదునాఱవ యేటినుండి యారంభించి దినమున కొక సంకీర్తనను జెప్పెనట ఇట్లు లెక్కింపగా నించుమించుగా నిరువదిమూడు వేలు లెక్కకు వచ్చును ఇందు ముప్పదిరెండువేలని చెప్పబడినది.

ఈతడు ద్విపద రామాయణమును రచించెను. కాని నేడది యలభ్యము. సంస్కృతమున వేంకటాచల మాహాత్మ్యమును రచించెను ఇవిగాక యీతడు పండ్రెండు శతకములను, సకల భాషలందును ప్రతిలేని నానా ప్రబంధములను రచించెనట. ఇందొకటి వేంకటేశ్వర శతకము. రెండవది యలమేలు మంగమ్మ మీద రచింపబడినది అన్నమాచార్యుని మనుమడు చిన తిరుమలాచార్యుడు తన తాత సంస్కృతమున సంకీర్తన లక్షణమును రచించినట్లును, దానికి తన తండ్రి పెద తిరుమలాచార్యుడు వ్యాఖ్య చెప్పినట్లును, దానిని తాను తెలుగు చేసినట్లును చెప్పెను గాని అది నేడు గానవచ్చుటలేదు

సంతానము అన్నమాచార్యుని ప్రథమ భార్యయగు తిరుమలమ్మకు నరసింగన్న యను పుత్రుడు గలిగెను ఈతడే 'చిన్నన్న ద్విపద కెరగు'ను అన్న పద్యమున తెనాలి వానిచే ప్రస్తుతుడయినాడు. అన్నమాచార్యుని రెండవ భార్య యయిన లక్కమాంబ యందు పెద తిరుమల జన్మించెను.

---

14. అన్నమాచార్య చరిత్ర పుట, 45
15. అన్నమాచార్య చరిత్ర, పుట, 46

పదునొకండవ ప్రకరణము

# సంకీర్ణ ద్విపదలు

## వైశ్యపురాణము

అముద్రితము.

రచయిత భాస్కరాచార్యుడు వైశ్యులందరీతనిని పిలిచి వైశ్యపురాణమును రచింపవలసినదని కోరగా నీతడు రచింపబూని, యీశ్వర స్తుతితో గ్రంథారంభము గావించి సంస్కృత కవుల స్మరించి, రచనకుపక్రమించెను

పెనుగొండయను పట్టణమున వింధ్యవాసి యనుపేరుతో గంగ ప్రవహించుచుండెను ఆ పట్టణమందు నీతి ధర్మపరులై ప్రఖ్యాతిగాంచిన వైశ్యులు నివసించుచుండిరి పద్మజుని దక్షిణోరువునందు వైశ్యులు జనియించిరి వీరు సరసిజగర్భుని యానతిపై కైలాసముననుండి శివుని సేవించుచున్నపుడు, చిత్రరధుడను గంధర్వుడొకడు, యక్షుని పుత్రికను జూచి మోహింపగా, నామె యిష్టపడక, భూమిపై రాజవుకమ్మని అతనికి శాపమొసగినది అతడును వారందరును కన్యకతోగూడ భూమియందు జనింతురని శాపమొసగినాడు. ఈ శాపమున కనుగుణముగ పరమ శివుడును వైశ్యులెల్లరు ఆ నామమును ధరించి భువిలో జనించి మనవలెనని యానతిడెను కలియుగమున కుసుమాఖ్యుడవు వైశ్యునకు గల్గిన వాసవీ కన్యయను కన్యను, చాళుక్యరాజు విష్ణువర్ధన మహారాజు వివాహమాడగోరి కుసుమాయుధుని వేడుట, కాని వైశ్యులందుల కంగీకరింపకపోవుట, రాజు బలవంతముగ కన్యను గొనిపోయత్నింపగా వైశ్యులందరును కన్యకతో సహా అగ్నిప్రవేశ మొనర్చి ప్రాణత్యాగమొనర్చుట యిందలి కథ ఈ కన్యయే కన్యకాపరమేశ్వరీ దేవత— నేటికిని ఈమెకు పూజలు చేయబడుచున్నవి.

---

1. డి. నెం. 1011, కాగితపుప్రతి. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము.

కథ కరుణరసపూరితముగ నుండి పఠితలమనసులను ద్రవింపజేయు చున్నది.

ఈ వైశ్యపురాణమునందలి వాసవీకన్య కథను కేవల పురాణగాథగానే భావింపవలయునా? లేక యిది చారిత్రక సత్యమా? ఇందు చాళుక్యరాజుగ దెల్పబడిన విష్ణువర్ధనుడెవ్వడు? వాసవీకన్య దేహత్యాగము చేసినది పశ్చిమ గోదావరిలోని పెనుగొండయా యను విషయములు పరిశీలనార్హములు చారిత్రక చతురాననులు శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు ఈ సంఘటన కల్పితమని ఆంధ్రుల చరిత్రలో దెల్పినారు [2] ఇందు దెల్పబడిన పెనుగొండ అనంత పురము జిల్లాలోనిది గాక పశ్చిమ గోదావరి మండలమునందలిదని కొందరి యభిప్రాయము [3]

వాసవీకన్య యగ్నికుండమున బడినప్పు డటనున్న భాస్కరాచార్యుడును నీ గ్రంథకర్తయు నాకరుగారు పూర్వమెప్పుడో జరిగిన కథను తెనుగున ప్రబంధముగా రచింపుమని పెనుగొండ వైశ్యులర్థింపగా నీ భాస్కరాచార్యుడీ గ్రంథమును రచించినట్లే క్రింది వైశ్యపురాణమందలి పద్యమువలన తెలియు చున్నది.

"మును మా పెద్దల చరితము
ముని సాలంకాయనుండు ముదమున జెప్పెన్
ఘనమున దత్కృతి పొందుగ
ననుగుణముగజేసి చెప్పుడాంధ్రోక్తి దగన్".

వాసవీ కన్యయు వైశ్యులును నగ్నిగుండమున బడినప్పుడు వైశ్యులు భాస్కరాచార్యులకొక తామ్రశాసనమును వ్రాయించి తామరవాడ యను గ్రామము నగ్రహారముగ నిచ్చిరట ఆ శాసనము నీ గ్రంథకర్త పద్య వైశ్య పురాణమున నుదాహరించెను ఈ శాసనకాల మిప్పటికి 24, 25 సంవత్సరముల

---

2. ఆంధ్రకవి తరంగిణి సం 9 పు 20-209
3. ఆంధ్రకవి తరంగిణి సం 9 పు. 208-209

ప్రకితము నాటిది. అనగా ఆ ప్రాంతముననే వాసవీ కన్య అగ్నిప్రవేశము గావించినట్లు తెలియుచున్నది ఆమెను గామించిన చాళుక్య వంశజుడైన విష్ణు వర్ధనుడు, రాజమహేంద్రవర రాజుగా దెల్పబడినను, ఆంధ్ర దేశముతో సంబంధము గల చాళుక్య విష్ణువర్ధను డప్పటివాడు కాడని చరిత్రవలన తెలియుచున్నది. ఇందలి విష్ణువర్ధనుడు రాజమహేంద్రవరమును పదునొకండవ శతాబ్దమున పాలించినవాడని సిరాజుల్హాసన్‌గారు "The castes and tribes of the H.E.H. the Nizam's Dominion" లో వ్రాసిరి. (తె. జా. గే. సా. (దా.రా.రా) పు. 593)

ఈ భాస్కరాచార్యుడు పదునేడవ శతాబ్దము వాడు కానోపును. గౌతమ గోత్రికుడు. 'వలనొప్ప మించు గీర్వాణ పురాణ, మలవడ రచియించితంధ్ర భాషను' అని తెల్పినాడు కాని, ఆ గీర్వాణ పురాణమేదియో తెలియరాకున్నది. ఇందలి కవిత సరసమై యొప్పారుచున్నది వాసవీ కన్య సౌందర్యము నీ విధముగ వర్ణించెను

"అమ్మానవతి యొప్పె నపుడు బంగారు
బొమ్మయో కరసాన బూను మన్మధుని
ప్రదరమో చక్కని పద్మారి కళయొ
కదలని విద్యుత్ప్రకాశమో పువ్వు
దీగెయో చిత్తజు దేవి చేబట్టు
బాగైన చిలుకయో భ్రమరమెప్పుడును
ముట్టని బిస మాణిముత్యమో జగతి
దిట్టమై మోహినీ దేవియో యనగ..."

## భోగావతీ ద్విపద[5]

అముద్రితము

ఈ గ్రంథకర్త యెవరో తెలియదు. భోగావతి వారాంగన కానోపును.

---

5 ఆర్ నెం. 1708- కాగితపుప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము.

ఆమె సౌందర్య వర్ణన, విరహ వర్ణన ఈ యుపలబ్ధ భాగమున గలవు నాయకుని పేరు తెలియదు లేఖకుని ప్రామాదికల వలన తుది మొదళ్ల రెండును గ్రంథము యొక్క యిరువది యొకటవ పుటకు జేరినవి కృత్యాదిని శివస్తుతి యుండుటచే నీ కవి శివభక్తుడై యుండనోపునని ఊహింప వీలగును ఇందలి నాయకుని పేరేమొ తెలియరాదుగాని, అతడొక రాజు ఇది రఘునాథ నాయకాభ్యుదయము వంటి రచనయే తమిళమునందలి 'ఉలా' ప్రబంధము వంటి రచన యని యిందలి కథా ధోరణివలన తెలియుచున్నది. కాని యీ గ్రంథ మసమగ్రముగ నుండుటవలనను, నాయకుని పేరు తెలియరాకుండుట వలనను నిది చారిత్రక, సాంఘిక విషయ పరిజ్ఞానమున కుపయుక్తము గాజాలకున్నది. కేవలము రచనా సౌందర్యమునకే పఠింప దగిన కావ్యముగా నున్నది.

నాయకుడు సింధు సైంధవము నెక్కి వాహ్యాళి వెడలుచుండగా నొగవతి సౌధముపై నిల్చి అతని సౌందర్యమును గని, 'నిల్పగరాని మోహాబ్ధిని' గుందినది ఇట ఆమె విరహ వర్ణన, చెలులామె నూరార్చుట వర్ణింపబడినది

ఇంతటితో గ్రంథము సమాప్తమైనది

## ధర్మాంగద చరిత్ర

కర్త బొమ్మకంటి నృసింహ కవి ఈతడు యదువంశ సంభూతులైన సరసమాంబా మాధవుల పుత్రుడు తన కవితా కన్య నీతడు కృష్ణార్పితము గావించెను

ఒకనా డహల్య గౌతముని జూచి, సీతా ద్రౌపది తారలకు మించిన పతివ్రత లోకమున నున్నచో నామె వృత్తాంతమును దెల్పవలసినదని వేడగా, గౌతము డామెకు 'ధర్మాంగద చరిత' కథను చెప్పినట్లుగా గ్రంథారంభము గావింపబడినది ధర్మాంగదుని దుష్ట పుత్రుని అతని కోడలు తన సౌశీల్యముచే మానవునిగా మార్చిన కథ యిందు వర్ణితము

ఇందలి కవిత్వము నిర్దుష్టమై ధారావాహిగా, నాతి ప్రౌఢముగా తనరారు

చున్నది కథను నడుపుటలో గడుసుదనమును జూపి, పాఠకుల కౌతుక్యము జనించునట్లుగ రచన గావించెను ఇదియే పాము పాటయని ప్రసిద్ధి చెందిన కథ. కొన్ని సందర్భములం దీకవి గావించిన వర్ణనాదులు రసోదంచితములై తనరారు చున్నవి -

గ్రంథారంభమున గావించిన నిష్టదేవతా స్తుతిలో ముక్తిపదగ్రస్తమును ప్రయుక్తము గావించెను

'పాలితామర సత్యభామినీ లోల
లోల రసాదీశ లోక సంచార
ధారుణీ భవహార దైత్యసంహార
హారికౌస్తుభ వక్ష యఖిల లోకేశ
కేశవాచ్యుత హృషీకేశ శ్రీవాస
వాసవార్చిత భక్తవరద ముకుంద.'

ఈతడు గావించిన గంగావర్ణన సొగసుగా నున్నది

'ఆరయ పాప విభంగ అతి శోక భంగ
కరకంఠ జటసంగ కరుణాంతరంగ
మునిమనస్సుమభృంగి భువిమహోత్తుంగ
ఘనగభీర తరంగ కడునుత్తమాంగ'

ఈతడు నిత్యవ్యవహారమునందున్న చదివేది, చూచేది, వంటి పదములను ప్రయోగించెను ఒండు రెండు తావులందు చేసుక, మనుజేశులిండ్ల వంటి ప్రయోగములు కానబడుచున్నవి అక్కడ నక్కడ జాతీయములను ప్రయోగించినాడు.

'ఖాసగ పోకకు గాల్చి పుట్టెడమ్మదురు'
పేదకు ధర్మంబు పిరికి యుద్ధంబు
అత్తకు శాంతంబు అలవేము తీపు
కత్తికి మెత్తన గలదె యెచ్చటను'
'మూలనుండిన వాని ముంగిట యేసి'
'ఎట్టి మద్దైనను అన్నమిందకపోయె.'

## శృంగార విషయము[6]

కర్త ఎవరో తెలియదు ఇది అసమగ్రముగా నున్నది గ్రంధాద్యంతములు లేవు. విరహార్తయగు నొక స్త్రీ చేటిచే తన ప్రేమ సందేశమును నాయకునకు తెలియపరచుట యిందలి విషయము ఇది యొక రామాయణ గ్రంధములోని భాగమయి యుండునని డిస్క్రిప్టివ్ క్యాటలాగున వ్రాయబడినది దీని ప్రారంభ మీ విధముగ నున్నది—

............నచ్చెలువుని యురము
కరి తుండములు ఛర్య కవ్యకాండములు
పరి చందములు వాని బాహాదండములు
అటువంటి సౌందర్య మతని చాతుర్య
మటువంటి గాంభీర్య మవనిలో గలదె
ఆ మహారాజేంద్రు నాకాంతి చంద్రు
నా మంజుగుణ సాంద్రు నాకార చంద్రు

ఉపలబ్ధమగుచున్న తాళపత్ర గ్రంథమున అంత మీ విధముగ నున్నది—

'తేజంబు దళ్కొత్త తేజిపై నెక్కి
రాజ మార్గంబున రంజిల్లు వేడ్క
స్వారిగా నేతేర సరసతమీఱ
నారీ శిరోమణి నాళీకపాణి
సరసిజ వదన భాస్వత్కుందరదన
వర రదచ్ఛదన లావణ్యైక సదన'

---

6. ఆర్.నెం 1183 — తాళపత్రము మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము.

## బిల్హణోపాఖ్యానము[7]

ఇది ఏకాశ్వాస ప్రబంధము పాంచాలసీమను పరిపాలించుచుండిన మదనాభిరాముడను రాజుపుత్రిక, యపురూప సుందరియగు యామినీపూర్ణతిలకను రాజతరంగిణీ కర్తయగు బిల్హణుడను కవీశ్వరుడు వివాహమాడిన కథయే యిందలి యితివృత్తము యామినీ పూర్ణతిలకకు యౌవనారంభవేళ శృంగార కావ్యములను చెప్పుటకై బిల్హణుని నియమించిరి బిల్హణుడును అపురూప సుందరుడైనందున, వానినిగాంచి యామినీపూర్ణ తిలక మోహించునని భావించి, యామె కుష్ఠరోగ పీడితయని యాతనితోడను. యాతడు జాత్యంధుడని యామె తోడనుబల్కి, ఒకరినొకరు చూచుకొనకుండునటు లేర్పరచి, యిర్వురకు నడుమ యవనిక నేర్పరచి పాఠములు జరుగు నేర్పాటును గావించిరి కాని, విధి వశమున, నొకరి నిజస్వరూపము నొకరు తెలిసికొని, విఘ్నముల నన్నిటిని దాటి వివాహము చేసికొనిరి

దీనికర్త కాశ్యప గోత్రుడయిన అరుణాచల కవి. ఈతని తండ్రి నారనార్యుడు తల్లి సుబ్బమాంబిక. ఈ గ్రంథమును తన తల్లియగు సుబ్బమాంబిక పేర నంకితముగా రచించెను

'రామభక్తుండనై రామాఖ్య దనరి
నట్టి రామార్యున కానందమూర్తి
పుట్టె సుపుత్రుండు బుధకులోత్తముడు
నారాయణాఖ్యచే... ...........
......... దయామూర్తి సత్యభాషణుడు,

అగునట్టి పుణ్యాత్మునకు జనియించి
అగణిత సమ్మతి హరి సేవ

---

7 తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపుస్తక భాండాగారము – అర్. నం. 1011– కాగితపు ప్రతి.

ధరణిపై జేయుచు దనరిన వాడ
గురుతర కాశ్యప గోత్రుడ జూడ
నరుణాచలాఖ్యచే నలరినవాడ...''

తనకు యతిప్రాసల జ్ఞానము లేదని తెల్పుకొనినది సత్యోక్తిగనే తోచుచున్నది.

'ధరప్రాస విశ్రమ తత్త్వంబు లెఱుగ
శ్రీకరకరనుతా శృంగారముగను
బిల్హణో పాఖ్యాన మిపుడు
ద్విపద కావ్యమునగు.'

ఇందు గ్రంథపాతములు మిక్కుటముగ గలవు కవి కాలము తెలియరాదు. ఈతని శైలి సరసముగా, చదువ నింపుగా నున్నది పాంచాల సీమయందుగల శ్రీలక్ష్మి రమ్యమందిరమను పురము నీవిధముగ వర్ణించినాడు.

'పూని యీ పురినుండి బావి భటాళి
కట్టింతు రుడుగక కడు నుగ్రులైన
పట్టింతురుర్విపై పటు వీరభటులు
నదరి దట్టింతురు హతులనైన
కడువేడ్క యమునైన గట్టింతురుర్వి
యిమ్మహిలోపల హితమతితోడ
తమ్ముల దోషాప్తి తగయ యుర'

వచ్చుచున్న బిల్హణుని గవాక్షమునుండి గాంచి పురస్త్రీలు—

'చతురాస్య సరిపోలు చతురాస్యుడితడు
సతత కళానిధి సరి కళానిధియు
ఈపుణ్యు గడిసినదే పుణ్యవతియొ
యీ పట్ల మనకును యిది యెట్లుపొసగు'

అచ్చటచ్చట యతిప్రాసాది దోషములున్నను, కవిత్వము సరసము గానున్నది

# పతివ్రతా చరిత్రము

పతివ్రతా చరిత్రము పతివ్రతల మాహాత్మ్యమును పాతివ్రత్య ప్రభావమును తెల్పు ప్రశస్తమగు ద్విపద గ్రంధము. ఇందు ముప్పదిరెండు కథలున్నటులు చివరి కథవలన తెలియుచున్నది గాని, పదునొకండు కథలు ఏ కారణము చేతనో లుప్తములగుట వలన, నిరువదియొక్క కథలు మాత్రమే నిందు నేడు మనకు గనబడుచున్నవి

కృత్యాద్యంతములు లేకపోవుటవలన నీ గ్రంధకర్త యెవరో తెలియకున్నది కృతియందలి రచనా రీతులనుబట్టి చూచినచో నీతడు ప్రబంధ యుగమునకు తరువాత వెలసినవాడని తోచును రచనా విధానమందు ప్రబంధ కవుల పోకడలన్నియు పుణికి పుచ్చుకొనినటు లున్నవి. శబ్దాలంకారముల ప్రయోగము లవిరళముగా గాననగు చున్నవి 'పాలవేకరి కదరీపతి నాయక ప్రణీతమగు శుకసప్తతి (నీ చ) శృంగార కథలు కలదగుటచే బవిత్రమగు పతివ్రతా చరిత్రమును వ్రాయుతలంపీ కవికి గలిగినట్లు తోచుచున్నద' ని ఈ గ్రంథ పీఠికా కారులు వ్రాసిరి. శుకసప్తతియందువలె నిందుగూడ వణిగ్వరుడు వ్యాపారార్థము దేశాంతరమున కేగినపుడా వైశ్యునిభార్య దూతిక ప్రేరేపణచే నాయూరిరాజు కోరిక చెల్లింపబోవ నుద్యమించు చుండగా, ఆమె మనోగత భావమునెరిగి యావణిగ్వరుని చిలుక యామెకు బుద్ధి గరపి పతివచ్చునంతదాక నామెకు ప్రతినిత్యము రేయి నొక్కొక్క పతివ్రత కథ చెప్పి కాలహరణము గావించి యామెను రాజునొద్దకు బోకుండ గాపాడినది. ఇందలి కథలుఅన్నియు జిలుకయొక్క సదాశివ జటాజూట కలిత గంగా తరంగ ఘుమఘుమోక్తుల' నుండి వెల్వడినవే కావున దీనినికూడ శుకసప్తతి వంటి గ్రంథముగనే భావింపవచ్చును

ఇందలి కథలన్నియు వివిధ గ్రంథములనుండి సంకలనము చేయబడినట్లు తోచును అవతారికయందు బుష్పదంతుని వృత్తాంతమును, భట్టసోమదేవుని కథాసరిత్సాగరములోనిదై యుండును. 'నీ యెట్టి చూపునకు గొంగ గా'నన్న కథ భారతమందలి ధర్మవ్యాధోపాఖ్యానమాధారముగా రచింపబడియుండును పతి యనుమతి గాంచిన సతి వంటికథ భోజరాజీయమునగూడ

నున్నది సింహాసన ద్వాత్రింశతినుండి సులోచన కథయు, కేయూరబాహు కథ కేయురబాహు చరిత్రనుండియు గైకొనబడినవి అరుంధతీ లోపాముద్రల కథలు పురాణములలో నున్నవేకదా సుమతి కథవంటిదే తెల్లవారకుండ శపించిన కథ ఇటువంటి కథ మార్కండేయ పురాణమునగూడ గలదు ఈ కథలోని దుర్మేధుడు కాశీఖండ పాండురంగ మాహాత్మ్యముల యందలి గుణనిధి, నిగమశర్మల వంటివాడు జనసామాన్యమున ప్రచారములో నున్న పులిని చంపిన వానికి రాజుకుమార్తె నిచ్చుటవంటి కథలకును నీ గ్రంథమున తావు గల్గినది

"ఈ కథలన్నియు నుత్తమ సంవిధానములు గలవై రసవంతములై యున్నవి అరుంధతీదేవి కథయందు నింద్రియ నిగ్రహము యొక్క ప్రభావము, సావిత్రి కథయందు స్త్రీకిగల మృత్యువుతోనైన నెదుర్కొను శక్తి, కాశిగుడిలో బలిని వరించిన సతి కథలో గొడుకు ప్రాణముకంటె సతికి మానమే ప్రాణమను నీతి, బుద్ధికర్మముల కథలో గర్మము యొక్క యద్వితీయశక్తి, లోపాముద్ర కథలో బడతికి బతితోడిదే లోకమను నాదర్శము, మానవతి కథయందు స్త్రీ మానమునకు రక్షకుడు పురుషుడా లేక స్త్రీయా యను సమస్యకు జక్కని సమాధానము, కిరాతపతి కథలో నన్యదానములకంటె నన్నదానమునకు గల వైశిష్ట్యము ద్రౌపదీదేవి పూర్వజన్మకథలో ద్రౌపది పంచవల్లభ యగుటలోగల రహస్యము చక్కగ రూపింపబడినవి. ఇట్లు కథలన్నియు లోక వ్యవహార సాధనభూతములు, సంశయ విచ్ఛేదకములు, సదుపదేశకములునై యున్నవి" [8]

చండప్రతాపుని కథలోని చిలుక ప్రభావతీ ప్రద్యుమ్నమందలి శుచిముఖితో నుపమింపదగియున్నది, ఈ కావ్యమందలి కవిత్వము, సరళమై, సుందరమై తనరారుచున్నది ఇతడు పూర్వకవుల ననేకుల ననుకరించినాడు ఈతడు శబ్దాలంకారములను, నానుడులను ప్రయుక్తముగాంచి రచనకు సౌష్ఠవమును గొని తెచ్చినాడు

8. పతివ్రతా చరిత్ర మున్నుడి — పు. 6

"తన వలచిన వనితయె కదా రంభ"
"టెంకాయ కుక్క కబ్బిన జవి గొన నెట్టు నేర్చు"
"మొక్కలీ డెబ్లేలు ముద్దిత"
"కన్నీరు మున్నీరుగా నేడ్చుట"

''కన్నుల కఱవెల్ల కడతేఱె ననుచు"... మొదలయినవి. ఇందలి ప్రయోగములు ప్రామాణికములై శబ్దరత్నాకరమున స్థానమును బడసినవి

## సారంగధర చరిత్ర

కర్త బాణాల శంభుదాసుడు. అయప్ప, నాగమాంబల పుత్రుడు. తాను శంభుని వరప్రసాదమున జన్మించి కొండపల్లి గోపాలుని కృపచే కవితా ప్రౌఢిని పొందినట్లు చెప్పుకొనినాడు. రాజరాజనరేంద్రుని జనమేజయుని పుత్రునిగ వర్ణించినాడు. సారంగధరు డీతని పట్టపుదేవియైన రత్నాంగి పుత్రుడు.

గ్రంథము మూడాశ్వాసములుగా విభజింపబడినది. ఈ కవి యితర కృతులింకేమైన రచించెనో లేదో యెఱుగరాదు. సారంగధర చరిత్రను, అప్పన్న యనునాతదు తనకు చెప్పిన చొప్పునవ్రాసినట్లు గ్రంథాంతమందు చెప్పికొనెను కాన నీతడు వెంకటకవి తరువాతివాడని భావింపవచ్చును చేమకూర వేంకట కవినే అప్పన్నగా పేర్కొనెనేమొ

"అప్పన్న చెప్పిన యా ప్రకారమున
నొప్పగా నీ కృతి యొనరించినాద
శంభుని వరమున జగతి బాణాల
శంభుదాసుండ నీ సచ్చరిత్రంబు"

ఈ కావ్యము సర్వవిధముల నుత్కృష్టముగా నున్నది. శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిగారే దీనిని రసోత్తరమనియు, మృదుమధురమనియు నీతి ధర్మ జ్ఞానప్రదమనియును ప్రస్తుతించియున్నారు. "కవి సహజముగా శిల్పి యగుటచేతను, పాండిత్యలోక వ్యవహారములందు నేర్పరియగుటచేతను, కథా నిర్మాణమునందును, ఆయా వర్ణనములందును, శిల్పకౌశలము లోకజ్ఞత మిక్కి

లిగా గుదురుకొన్నవి...చక్కనగు జాను తెనుగు నుడికారము, ఆబాల గోపాల మున కర్థమగు సులభశైలి హృదయమోహనము శ్రవణ ప్రేయమునై యున్నవి [9]

సారంగధరుని సౌందర్య వర్ణన ఎంత ముగ్ధమనోహరముగనున్నదో ఆతడు ముక్కంటి వరమున మురిపానగన్న పుత్రుడు ఇంకను—

"మాణిక్యములమూట మల్లెపూదోట
ఏణాయతాక్షుల కెన్నికనూట
కందురేని పసిండి కమ్మయై నిండు
చందమామను బోలు సారంగధరుడు."

ఇదేవిధముగ చిత్రాంగి సోయగముకూడ నాహ్లాదకరముగ వర్ణిత మైనది

"అంగజునకుగల యాత్మ సంజీవి
సింగారముల దీవి చిత్రాంగి దేవి

సంపెంగ పూబంతి సామజయాన
చిగురుటాకు కటారి చిత్తరుబొమ్మ"

కవి, శృంగార రసవర్ణనమందెంత సిద్ధహస్తుడో, కరుణరస చిత్రణమునందును నంతే సిద్ధహస్తుడు. సారంగధరుని నఱకుటకై తలారు లితని పెడతెక్కలు విఱిచి కట్టి తీసకొని పోవునప్పుడు రత్నాంగి విలపించిన విధము, హృదయ విదారకముగ నున్నది

"గోమున నిన్నాళ్లు కొడుకని పెంచి
కోమలికిని బారి గోరి యీనాయె
వగమించు మల్లెపూవంటి రుమాలు

---

9 భారతి, 1942 — అక్టోబరు 'శంభుదాసుని సారంగధర'— కొండూరు వీరరాఘవాచార్యులు

సిగయూడి వెం(డుకల్ చిందాయెనటర,
పాలు వెన్నలు (దావి బాగుగా నెఱిగి
బాల(ప్రాయము నేలపాలాయెనటర..."

విలపించుచున్న రత్నాంగికి (ప్రాఙుల అశాశ్వతత్వమును వెల్పి, యిరుగు పొరుగు తరుణులు ఓదార్చుదురు

'అడలకుమమ్మ రత్నాంగిదేవమ్మ
యొడలు బాసినమీద నెవరికెవ్వారు
సత్యమెవ్వరి కైన సతమౌనుగాని
నిత్యమా దేహంబు నీటిపై బుగ్గ
నిర్దయుండననేల నీ (ప్రాణవిభుని
అర్థాయువగు పిండమాయె నీ కొడుకు,
పుట్టినదే కల్లపు(త్రుండు నీకు
చెట్టున కసుగాయ చెడిపోదటమ్మ
కట్టడ యిదిసుమ్మి కపట నాటకము'

చి(త్రాంగి పా(త్రపోషణ విషయమై కవి కడు మెలకువను వహించి మిక్కిలి సహజముగ తీర్చిదిద్దినాడు. సంపెంగ పూబంతియు, సామజయానయు నయిన చి(త్రాంగి అవతార మన్మథుడయిన సారంగధరునకు సరియుజ్జీగ నుండునని నిర్ణయించిరి కాని విధి వేరు విధముగ దలచినది. చి(త్రాంగిని రాజ రాజుకూడ చూచినాడు. అంతటితో నూరుకొనక వలచి వివాహము చేసికొనెను సాం(ప్రదాయికముగ కత్తికి వివాహము జరిగినది కాని చి(త్రాంగి ఏమి బేలయా? చి(త్రమున తనకు జూపించినది రాజరాజుకాడని యెఱిగినది. చెలికత్తెల మూల మున రాజరాజుపు(త్రుడు సారంగధరుడని తెలిసికొని అట్టి సుందరాకారుని కిల్లాలు కానందున తన చక్కదనమంతయు వ్యర్థమైపోయినదని దురపిల్లినది అతనిని తనవద్దకు రాబట్టు నుపాయమునకై వేచియుండినది రాజామెను పోతు టీగ దూరని బంగారు మేడలో నుంచినాడు ఒకనాడు రాజు వేటకేగినాడు సారంగధరుని పారావతము చి(త్రాంగి మేడపై (వాలినది. సారంగధరుని తన

వద్దకు రప్పించుకొనుటకిది మంచి సమయమని యెంచి, చిత్రాంగి అద్దానిని దాచినది. సారంగధరుడు విధివైపరీత్యముచే మంత్రి హితబోధను చెవినిడక పావురమును గొనుటకు చిత్రాంగి మేడపైకేగినాడు చెలులచే వీనిరాకను విన్న చిత్రాంగి వారాశివలె బొంగి గమకించి ముత్యాల గద్దెపైనుండి దుమికి, తత్తర పాటుతో నేగుదెంచి సారంగధరుని గాంచినది. స్త్రీగా జన్మించినందులకా నవ మన్మథాకారుని గూడి భోగింపవలెనని యామె తలచినది అనిమేష దృక్కులతో నాతని సౌందర్యమును తనివిదీర త్రాగుచున్న చిత్రాంగికి సారంగధరుడు నమస్కరించినాడు దానితో నామె హతప్రభయై తనకు మ్రొక్కజనదని పల్కినది. పన్నీరు దెప్పించి యాతని పాదములను కడిగి అగరు జవ్వాజి కప్పురములను గానికగా గొనివచ్చి యిచ్చినది వీనిని సరకుచేయక పారావతము నర్థించినాడు సారంగధరుడు అతడు తన భావము నర్థము చేసికొనలేదని యెరిగి, 'మచ్చిక నినుగూడి మనసు రంజిల్ల, ముచ్చటించెదగాక మోహంబుదీర, జనపతి యును నీవు సమమింకనాకు' అని పల్కి లోమందిరమునకు గొనిపోయి, కామకళా శాస్త్రమునకు సంబంధించిన చిత్రముల నన్నిటిని, చిత్తరువులను చూపు నెపమున జూపినది కాని వానినన్నిటిని వేదాంతపరముగ విమర్శించి వదలి నాడాతడు. హతాశురాలైనదామె. వ్యంగ్య గర్భితములగు పల్కులుగాని, చేష్టలు గాని, యికనాతనివద్ద పనిచేయవని యెఱిగి, 'చాతుర్యములనెంచ శక్యంబు గాదు, రాతికి సరివచ్చురా వీని మనసు, కరుగంగబోదు మెత్తకాయకు చిలుక, పొరసిన విధమాయెబో తన వలపని' తలచి, మనసువిప్పి స్పష్టముగ తన కోర్కెను చెప్పినది తాను విరహవేదనకు దాళజాలకుండినందున తన కోర్కెను దీర్పుమని బలవంతము జేసినది ఆమె తనకు పినతల్లి అయినందున తల్లితో సమానురాలనియును, కాన ఆమెతనపై నట్టిభావము విలిపి మాటలాడుట యుచితము గాదనియు ఆతడు దెల్పెను కాని ఆమె వానిని పెడచెవినిబెట్టి 'వలపున్నచోట వావు లెంచగనేల" యని బలవంత పెట్టజొచ్చినది దేవుడని మ్రొక్కవచ్చిన మితి దప్పి గుడివచ్చి మీదబడ్డట్లయినది సారంగధరుని పని. ఇకనట నిలువ దగదని సాగిపో జొచ్చినాడు. చిత్రాంగి ఆతని మొలదట్టి గట్టిగా బట్టి పెనచి పోనీక పెనగులాడినది వనిత పట్టిన దట్టిని చించుకొని బయటపడినాడాతడు. 'పోయి నచో అవనీశునాన' యని ఒట్టుపెట్టినద 'నా కన్నులతోడు నిన్నేమియు నన'

నని బాస చేసినది భయము లేదని ధైర్యము చెప్పినది. మాటైన వినుమని పిల్చినది. కాని ఆ మాటలు చెవిపెట్టక సారంగధరుడు మనసు కరుగక పారి పోయినాడు. ఇక ఆమె కాతనిపై వలపుపోయి పగ యేర్పడినది. ఆడుదాని ఉసురంటక పోదని వెక్కసముతో పల్కి జనపతి వచ్చిన పిమ్మట ఆతని కాళ్లు చేతులను కిత్తులచే నరికించెదనని పంతములాడి అందు నఫలీకృతురాలై నది. రాజు రాగనే 'మామవైతివి నాకు మండలాధీశ నినుజూడ ప్రాణంబు నిలిపితినని' కల్లబొల్లి మాటలు పల్కి ఆతని కత్తితో కొమ్మను పొడుచుకొను నట్లు నటించినది ఇక నేమున్నది ఆమె యాశయము నెరవేరినది. 'నిన్ను బట్టిన వానిని నిముసంబులోన గన్న పుత్రునినైన ఖండించివైతు' నని ప్రమా ణము గావించినాడు.

చిత్రాంగి పాత్ర నీరీతి మనసిజు నెలయించు మాయాకురంగిగ చిత్రిం చుటలోను టాటోటు కత్తెగజూపుటలోను కవి మంచి నేర్పును జూపియున్నాడు. ఈ కవి వాడుకలో నున్న అనేకములగు జాతీయములను నానుడులను వాడి కావ్య మును దెనుగుగడ్డకతి సన్నిహిత మొనర్చినాడు

'వెన్నబెట్టుక నేయి వెతక నేమిటికి'
'రాతికి సరివచ్చురా వీని మనసు'
'చలికూటిపై వెన్న సారంగధరుని మనసు'
'చల్లకు వచ్చి ముంత దాచగ నేల'
'ఆలస్యమమృతమె విషము'
'ఆడబోయిన తీర్థమరుదెంచునట్లు'
'మబ్బులోపల నీళ్ళు నమ్మి దొననీళ్ల
తెగగొట్టుదురె వెఱ్ఱులయిన'
'చేదొఱకిన మేలు చేయిజార విడిచి'
'మీదవచ్చెడు కీడు మేరెవ్వడెఱుగు.'
'పిచ్చుకపై బ్రహ్మాస్త్రము'
'ముంజేతి కంకణమున కద్దమేల'

'పాము కాటెంత తుడిచిన బోదు'
'కత్తి మెత్తని వాడి కలదె లోకమున '

ఇటు లీ గ్రంథము రసవంతముగా నున్నది.

## సారంగధర చరిత్ర[11]

అముద్రితము

గ్రంథాంతమున పరశురాముడను నాతడు ఈ గ్రంథమును రచించి నట్లు గలదు. కావున గ్రంథకర్త పరశురాముడని తలంపవలసియున్నది. గ్రంథారంభమందలి యాకులు తునిగిపోయి, గ్రంథపాఠములు హెచ్చుగ నుండుటచేత ఈ గ్రంథకర్తృ వంశాదికములు తెలియజాలకున్నాము

'చెలగ నవ తొమ్మండ్రు సిద్ధులగూడి
నాగార్జున కొండ సంతసమున నెక్కి
యీరేడు లోకము లెఱుగంగ జెప్పె
వెళ్ళిరి సిద్ధులు వేగంబుగాను
ఉరగ జంగములోన ఊరిలోపలను
పరశురాముడు చెప్పిన ద్విపద."

ఈతడు రత్నాంగి చిత్రాంగి యిర్వురను రాజరాజనరేంద్రుని పట్టపు దేవులనుగా వర్ణించినాడు. రత్నాంగి చాల కాలము పుత్రులు లేక, శివుని యనుగ్రహమును బడసి, గొడ్డుపీగి కన్న సంతానము సారంగధరుడు తరువాతి కథయంతయు మామూలే.

ఈతని శైలి దెలియుటకై కొన్ని ద్విపదలు ... రత్నాంగి సారంగ ధరుని దలచుకొని యేడ్చినప్పటి విధము —

---

11. శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ ఆర్. నెం. 168 ఎ — తాటియాకు.

'...... బోలు పుణ్య పురుషుండు
ఏమిసేతును తండ్రి యెత్తుకోనైతి
ముద్దాడనైతి ముచ్చట దీర
నీ రూపురేఖలు నీ చక్కదనము
ఎందు జూతునువోయి...
నాతండ్రి నాబాబు ననుగన్న తండ్రి....,

గ్రంథమునందు చెప్పుకొనదగిన విశేషములేమియు గానరావు వ్రాత తప్పు లధికముగా గలవు. ఇందలిది మంజరీ ద్విపద వికారమగు రచన.

## సారంగధర చరిత్ర

కూచిమంచి తిమ్మకవి ప్రణీతము ఈతడు బహుళ గ్రంథకర్త[12] అభినవ వాగనుశాసన, కవిసార్వభౌమ ఇత్యాది ఘన బిరుదాంకితుడు. 'ఈతని కవిత్వంబు మృదుమధుర రస పద సంయుక్తంబై శబ్దసౌష్ఠవంబై చదువరుల చెవులకింపై, యనర్గళ ప్రవాహంబై యొప్పుచుండు. ఈతడపూర్వ కథారచనా యోగంబునం బ్రసిద్ధిగన్నవాడు'

తిమ్మకవి ఆరువేల నియోగి కౌండిన్య గోత్రుడు బయ్యనామాత్యుని ప్రపౌత్రుడు తిమ్మయ పౌత్రుడు. గంగన మంత్రి పుత్రుడు తల్లి లక్ష్మమ్మ. సింగన్న జగ్గన్న సూరన్నలు సోదరులు ఈ జగ్గన్నకూడ చంద్రరేఖా విలాసము మొదలగు గ్రంథముల ననేకములను రచించినాడు. తిమ్మకవి గోదావరీ మండలమందుండు పీఠికాపుర సంస్థానమందుండు కందరాడ గ్రామ కరణము. ఈ కవి కాలమున పెద్దాపుర సంస్థానాధీశులు వేంకటకృష్ణారావుగారు కావున

---

12 ఈతని యితర గ్రంథములు (1) రుక్మిణీ పరిణయము. (2) రాజశేఖర విలాసము (భల్లాణ రాజ చరిత్రము) (౩) సింహాచల మాహాత్మ్యము. (4) నీలా సుందరీ పరిణయము (౫) అచ్చతెనుగు రామాయణము (౬) సాగరసంగ మాహాత్మ్యము. (7) లక్షణసార సంగ్రహము. (8) రసిక జన మనోభిరామము. (౯) సర్పపుర మాహాత్మ్యము.

సీతనికాలము క్రీ. శ 1687 – 1757. శివుడు స్వప్నమందీతనికి సాక్షాత్కరించి ఆతడు రచింపబూనుకొన్న సారంగధర చరిత్రను తనకు కృతి యిమ్మనినాడట

'వరదుడు రజతపర్వత నికేతనుడు
కరుణాపయోధి శంకరుడొకనాడు
గురుతర కౌండిన్య గోత్రపావనుని
వర కూచిమంచి సద్వంశ సంభవుని
గంగన మంత్రిశేఖరునకు నుత్త
మాంగన యగు లచ్చమాంబకు సుతుని

. .

రావు వేంకటకృష్ణరాయ విశ్వంభ
రావరపరిగుప్త రాజమహేంద్ర
పరదేశ భాగభాస్వద్దివ్య పీఠ
పుర మహారాజ్య విభూషాయమాన
పావన కంద్రాడ పట్టణాధిపుని
శైవకళా రహస్య జ్ఞాన నిధిని
ఘనులు మెచ్చగ ననేక ప్రబంధంబు
లొనరించి విఖ్యాతి నొందిన ఘనుని
తిమ్మ సత్కవి నామధేయుని నన్ను
నెమ్మది గృపజూచి నీ వొనరింప
దలచిన సారంగధర చరిత్రంబు
వలనుగా గృతిసేయ వలయు మాకనుచు
గలలోన బొడగట్టి కడలేని ప్రేమ
గులుక నానతి యొసంగుటయు'

ఆ యానతి ప్రకారము సారంగధర చరిత్రను శంకరునకు గృతి యిచ్చెను. ఇందీతడు చిత్రాంగిని వేశ్యగా చిత్రీకరించెను. ఇందలి కథ శృంగారాదుల యను

ప్రవేశము కలిగి కరుణ రస ప్రధానమై యున్నది. ఈతని కవనము గడుంగడు రసవంతముగా నుండును. ఏనుగు లక్ష్మణకవి యీతనిని గూర్చి యిట్లు ప్రస్తుతించి యున్నాడు.—

'హాటక గర్భ వధూలీ
లాటన చరితాంఘ్రి నూపురారవసు శ్రీ
పాటచ్చరములు తేనియ
తేటలు మా కూచిమంచి తిమ్మయ మాటల్'

దెందులూరి లింగనారాధ్యు డీతని గురువు. ఈతడును కథ రాజమహేంద్ర వరముననే జరిగినట్లు వర్ణించినాడు. సారంగధరుడు పావురముల నాడుచుండగా నొక పావుర మెగిరి రాజుగారి వేశ్య యయిన చిత్రాంగి మేడపై వ్రాలినది ఆమె సారంగధరుని తనయొద్దకు రప్పించుకొనుట కేకమాత్రమగు నుపాయము దానిని పంపకుండ తనయొద్దనే యుంచుకొనుటయని తలచినది తరువాతి కథ మామూలే.

రాజు కుమారుని గానక వనమునందు వెదకుట పోతన్నగారి గోపికలు శ్రీకృష్ణుని వెదకుటను దలపించుచున్నది

'ఎందు దూరెను చూడరే యంచు రేచి
క్రందుగా వనమెల్ల గలయ ద్రిమ్మరుచు
. .
కరులార యక్ష కిన్నరులార రత్న
ధరులార బిల్ల . .
. శాకరులార పుష్ప
తరులార తోడు మెకములార చెంచీ
తలులార పాపతొయ్యలులార మౌని
కులులార మాద్య ... ...
... . ...... ...

కానరే మా పుత్రు కమనీయగాత్రు

. . .

దీన జనాధీను దివిజోపమాను
గనరె మా సుకుమారు ఘనసుకుమారు
కనదమలాకారు కమలాకుమారు. ' అని విలపించినది.

ఇదే ఘట్టమున బాణాల శంభుదాసు డీ విధముగ రచించినాడు. అతని రచనా విధానముకూడ ఇటులే నున్నది

'తిన్నని కస్తూరి తిలకంబు వాడు
పొన్నవృక్షములార పుత్రుని గనరె
జిలుగు వన్నెల రుమాల శిఖనుబూబంతి
గలవాడు సంపెంగ గానరే సుతుని
చెంగావి మొలధట్టి చెరగులవాడు
మంగవృక్షములార మా సుతు గనరె
కలువరేకుల వంటి కన్నులవాడు
కలగొట్ల తరులార గానరె సుతుని
సారంగధరుడను చక్కనివాడు
పారిజాతములార బాలుని గనరె

నీచక్కి నెనయ జాడెరిగితిరేని
దాచక చెప్పరే తాపసులార. .'[13]

రసపోషణమందును నీకవి సిద్ధహస్తుడుగ నున్నాడు సారంగధరుని కాలు సేతులను నరుకుట కాజ్ఞ యిడినట్లు దెలిసికొని రత్నాంగి దురపిల్లిన ఘట్టమున కరుణ రసము వెల్లివిరిసినది

ఈ కవి జాతీయములను సామెతలను ప్రయోగించి రచనకొక యద్వితీయ

---

13. పు. 40

మగు సొగసును గూర్చినాడు. ఆతడుపయోగించిన వానిలో మచ్చునకు గొన్ని-

చల్లకుబోయి ముంత దాచినయట్లు మోమోటంబేల.
చేతికివచ్చు నిక్షేపము బారవేతురే యేలాటి వెంగళులైన
చలికూటిపై వెన్నసరణి నించుకయు జలియింపరున్నాడు [14]
చేతి మామిడిపండు చెదరుగవైవి యాతలి మునిడిపండర్థించినట్లు
పడుకైన గరిగి లేబదనగుగాని, గడితంపు నీమది గరగదయూరె.
ప్రాణదానముకన్న బరమధర్మంబు క్షోణిలో గలదె
ముంజేతి కంకణంబున కద్దమేల?
అకొన్న పులివాతకబ్బిన కంచిమేక చందంబున మెత్తబాటాని.
వెలది బొంకుట గోడవేసిన యట్లుండె. మగ బొంకు దడిగట్టినట్లు.
కతకు కాళ్లును మరి కడవకు జెవులు, నతకజూచెద చిలక నంవరిలోన.
కన్నులు చల్లగా గనుగొనుము.
కయ్యాన కరిమురి గాలుద్రవ్వుచు
ప్రాణంబు గలిగిన బలుసాకులైన, పోణినేరుకతిని భువినుంచవచ్చు
క్రమమొప్ప నారులచేరములెంతుగాని, తమతప్పు లెంతురె ధరనెవ్వరైన.
తమచల్ల పులిచల్ల యనుచు బలుకుదురే యెట్టి పామరులైన
ఆవ దాగిన పసరంబు మాడ్కి.
మిన్ను విఱిగి మీదబడ్డటులు
భూవల్లభుని బుద్ధి పూరి మెసగె
క్షితిలోన జేతనాచేతన జ్ఞాన, మతికాముకులకెందు నాత్మలోఁ గలదె   ఇది కాళిదాసుని మేఘసందేశములోని 'కామార్తాహి ప్రకృతి కృపణాశ్చేతనా చేతనేషు' అనుదాని కనుకరణమై యుండవచ్చును.

నక్షత్రోదయము నీ కవి మినుప రొట్టెపై దేవతలిడిన నిప్పుకణముల వలెనున్నట్లు వర్ణించినాడు ఏమి యీ యుపమాసౌందర్యము ఆకాశము మినుప రొట్టె, నక్షత్రములు నిప్పుకణికలు నగుచున్నవన్నమాట.

---

14. భాణాల శంభుదాసుడును ఇట్టి ప్రయోగము గావించెను.

'అనిమిషుల్ మిను పెచ్చునం బిడ్డ నిప్పు
తునెలన రిక్కలు దోచె నభ్రమమున..'

చిత్రాంగి సారంగధరునితో—

'ఎఱుగనేరవుగాక యెన్ని పుట్టువుల
తఱినబ్బు మకరకేతన నిశాతాస్త్రి
జాలవ్యధాభిన్న సకలాంగులగుచు
కేల కపోలముల్ గీలించి పైని
గాలి సోకిన వెన్న కరణి గరుగు
గోలల గౌగిట గూర్చు భాగ్యములు'

అని పల్కిన పల్కులు అల్లసాని పెద్దన్న వరూధిని నోట 'ఎన్ని భవంబులన్ గలుగు నిక్షు శరాసన సాయక వ్యధా భిన్న' ఇత్యాదిగా పలికించిన పద్యాను కరణమైయున్నవి

ఒకే పదమును భిన్నార్థముల నుపయుక్తముగావించియు కొన్ని యెడల శ్లేషచేతను చమత్కారపూరితమగు రచనను గావించినాడు.

'ఏలరా రతి దేల్చి యేలరా తాళ
జాలరా మదిలోన జాలరాగిలితి'
'పినతల్లి వేదనో పినతల్లివనుచు'
'కర పదహీనుడై కడు బహుళాత్రి
ధర గుందు సారంగధరుడును బోలె
కర పద హీనుడై కడు బహుళాత్రి
ధరగుందు సారంగధరున కవ్వేళ'

కిరణములును స్థానమును లేని ఆమావాస్యనాటి చంద్రునివలె కాలు సేతులులేని సారంగధరుడు వ్యధచెందుచుండెనని భావము

ముక్కుతిమ్మన్న సత్యభామవలె కూచిమంచి తిమ్మన్న చిత్రాంగికూడ,

'కలకంఠ కులవధూ కాకలీ ధ్వనులతో' నేడ్చినది. జరిగిన నిజమును విప్ర సన్నిధిని దెల్పుమనగా నామె—

'అలుక మీరగ వసంతా గమారంభ
లలిత రసాల పల్లవ రసాస్వాద
కలనా కషాయిత కంఠసోత్కంఠ
కలకంఠ కులవధూ కాకలి ధ్వనుల
నెలుగెత్తి యేడ్చుచు నృపునకిట్లని. ' నది.

అన్నిటికన్న విచిత్రము, విషాదచిత్తుడైన సారంగధరుడు 'నులక కంకటిపై బడి కడయుడరాని జంకున' నుండెనట ఆ రాజసౌధమున నులకమంచమునకు తావెటులు, ఎచట గలిగినదో యెఱుగరాదు బహుశః కవి తన గృహమునే గుర్తుంచుకొని, తాను వర్ణించుచున్న కథ రాజసౌధ సంబంధియని మరచి యుండును

## విక్రమార్క చరిత్ర[15]

అముద్రితము

దీని కర్త తిమ్మయ కవిపుత్రుడు కొండయ కవి కాలము తెలియరాదు. దేవయామాత్యుని కొడుకగు పెద్దయమంత్రి ప్రేరణమున నీకృతి తిరుపతి వేంకటేశ్వరస్వామి కంకితము సేయబడినది ఈత డవతారికలో నన్నపార్యుని సంస్తుతించినాడు. ఈతడొక కథను రచియింపవలెనను యోచనయందుండగా దేవయామాత్యుని పుత్రుడు పెద్దయమంత్రి వచ్చి సప్త సంతానములలో ఖిల ముగాకుండునది కృతిగావున నొక కృతిని రచింపవలసినదని ప్రోత్సహించెను. అపుడీతడు—

---

15. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము— డి. సం. 1180— కాగితపు ప్రతి

'(హరి) (వి)? విభుండగు విక్రమార్కుని కథలు
సరవిద్వాత్రింశక సాలభంజికలు
చెలగు భోజనరేంద్రు చెవిసోకు కథలు
చలికొండ పట్టికి శంకరుడర్థి
దెలిపెను గ్రమమెల్ల ధీరులు మెచ్చ
దెలుగునందును రసోద్దీపితంబుగను
గలుగ జెప్పెదను సత్కవులును మెచ్చ
ఘనతతో (డ) ద్విపద కావ్యంబు జేసి '

యని ప్రమాణముచేసి ద్వాత్రింశతి సాలభంజికల కథలను ద్విపద కావ్యముగా రచించెను.

జక్కన విక్రమార్క చరిత్రవలెనిందును, విక్రమార్కుడు, ఇంద్రుని వలన ద్వాత్రింశత్సాలభంజికలు గల్గిన దివ్య సింహాసనము బడయుట, ఆతని మరణానంతరమది భూస్థాపితము చేయబడుట, భోజుడద్దానిని పైకితీసి, దాని నెక్కబోవుచుండగా, దానియందున్న ముప్పదిరెండు సాలభంజికలు, భోజునకు విక్రమార్కుని ఔదార్యాది గుణములనుగూర్చి ముప్పదిరెండు కథలను చెప్పి శాపమోక్షము నొందుట కథావస్తువు.

ఈ కవి శైలి తెలియుటకై కొన్ని ద్విపదలు మేరుపర్వత వర్ణన—

ఊర్జితంబైన యా యుర్వీతలంబు
నిర్జర వాహినీ నిర్ఝరమయ్యె
కొండయల్లుని వెండి కొండ యాకొండ
కొండుక శిఖరమై కొమరు దీపించు
యున్నగంబునగాదె యింపు సొంపార
పన్నగ కిన్నర భామలుండుదురు
ఈ కాంచనాద్రిపై యీగార్చు కోర్కు
నాకల్పముగ నుండు నాకల్పతరువు
ఆకుల గోత్రంబులం దెక్కుడగుచు

శ్రీకుల గోత్రమై చెన్ను దీపించు
రత్న గర్భాకార రాజరత్నంబు
రత్నసాను వనంగ రాశికి నెక్కె

## విక్రమార్కుని కథలు[16]

అముద్రితము

గ్రంథ మసంపూర్ణముగ నున్నది. 'అనఘాత్ముఁడగు విక్రమార్కుని కథలు మునుకొని చెప్పెద ముప్పదిరెండు' అని కవి ముప్పదిరెండు కథలను దెల్పి నట్లున్నను ఉపలబ్ధమగు గ్రంథమున నిరువది యారు కథలు మాత్రమే గలవు ఇదికూడ జక్కన రచన వలెనే యున్నది

ఉజ్జయినీ పురము నేలు విక్రమార్కునకు దేవేంద్రుడు సాలభంజికలతో గూడిన సింహాసనము నొసగుట, పిమ్మట అది భూస్థాపితము చేయబడుట. మరల నద్దానిని భోజుడు తీసి దానిపై నెక్కబోవుచుండగా ముప్పదిరెండు సాల భంజికలు అతనికి ముప్పది రెండు కథలను దెల్పినవి

దీని కర్త యెవరో తెలియరాదు.

లక్షణ విరుద్ధమగు ప్రయోగములిందు గానరావు. ఈతని శైలి తెలియు టకై హిమాద్రి. బ్రహ్మరాక్షసుల వర్ణనలు. ఇవి సుందరమై తనరారు చున్నవి

## యాజ్ఞవల్క్య విజయము[17]

అముద్రితము

కర్త చల్లా గురవయ్య కృష్ణాపాత్రుని వేంకటమంత్రి ప్రేరణచే దీని నీతడు రచించినట్లు చెప్పుకొనెను

---

16 తంజావూరు సరస్వతి మహలు గ్రంథాలయము. ఎమ్. నెం. 855 తాళ పత్రము.

17 శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ — ఆర్. నం. 493 — కాగితపు ప్రతి.

'తగువేడ్క-తోడ నాదరమున నొసఁగి
మగటిమితో బల్కె- మానుషంబునను
లాలితమృదు వాగ్విలాస వై ఖరిని
మేలైన కృతులు నిర్మించినా విపుడు
దుర్గా వరప్రసాదుడవు కవిత్వ
మార్గ మెఱింగిన మహిత పుణ్యుడవు
బాల సరస్వతీ ప్రౌఢ నామమున
ధీ లక్షితుండవై దిక్కు-లమించి '

గురవయ్య నివాస స్థలము కొండపల్లి. దుర్గా వరప్రసాదమున మహా కవియైనాడు బాల సరస్వతీ బిరుదాంకితుడు

ఇది జన్మకాండ, వేదకాండ, మైత్రేయకాండ, పరబ్రహ్మకాండ, యజ్ఞ కాండ, విశ్వజిత్కాండ యను షట్కాండ పరిమితమైన గ్రంథము ఇది యాజ్ఞ వల్క్య మహర్షి చరిత్రను దెల్పు గ్రంథము కాని గ్రంథము సంపూర్ణముగ లేదు మొదటి నాల్గాశ్వాసములు సమగ్రముగను, నయిదవకాండ మసగ్రముగను నున్నది ఇంతవరకే గ్రంథము లభ్యమగుచున్నది

కవి కాలము తెలియదు యాజ్ఞవల్క్య విజయమునే ఘట్టు ప్రభువు పద్య కావ్యముగా రచించినాడు.

కావ్యమున పురవర్ణనాదులను సవిస్తరముగ జేసి, కావ్యమునకు లగువు బిగువులను గూర్చినాడు

"నారాయణుండున్న నగరి యోజనము
లారయ బదునెనిమిది కోటులెనయ
నేవంక జూచిన నిభతురంగములు
నేవంక జూచిన హేమరథంబు
లే చాయ నరసిన హేమకుంభములు
నేచెంత వెలసిన హేమ ధములు
కొమరుగ బంగారుకోట వేడగుచు
విమల .. రత్నవేదిక గల్గి
భానుకోటి ప్రభా భాసితంబగుచు
నానాప్రకార సన్మణులెన్న గలిగి "

పుత్రులు లేని జీవనము వ్యర్థమని సునందచే బ్రహ్మరాతితో ననిపించును—

"పుత్రులు లేనట్టి పొలతులేనిటికి
పుత్ర హీనంబైన బొలతు లేమిటికి
పుత్రుండు గలిగిన బుణ్యంబు గలుగు
పుత్రుండు ఇహపరదాయకుండు."

ఒకచోట యుద్ధమును సముద్రముతో పోల్చినాడు—

"రక్తంబుగల యెల్ల రాకయువోలె
యుక్తమై పర్ణింప నుదధియు వోలె
దంతంబులెంచ ముత్యంబులు గాగ
జపల నేత్రములు మత్స్యంబులుగాగ
తలపంగ నాచు కుంతలములు గాగ
లలినాభులెల్ల వలను సుళ్ళుగాగ
నెనయ నూగార్లు ఫణీంద్రులు గాగ
నును జొలగలెంచిన నూరులు గాగ
సరణి మీగాళ్ళు కచ్ఛపములు గాగ
గరిమ గాయములు నక్రంబులుగాగ."

## భేతాళ పంచవిశతి[18]

**అముద్రితము**

గ్రంథకర్త నామము తెలియదు అసమగ్రముగా నున్నది ప్రతి కీటక దూపితమై గ్రంథపాతము మిక్కుటముగా నున్నది వ్రాత తప్పుల కుప్పగా నున్నది అది యయినను సమగ్రముగా లేదు తొమ్మిది కథలు మాత్రము సంపూర్ణముగా నున్నవి పది పదునొకండు కథలు సంపూర్ణముగ నున్నవి. గ్రంథారంభ మీవిధముగ నున్నది

18 తంజావూరు సరస్వతీ మహలు గ్రంథాలయము. — ఎమ్. నెం 824 (డి. నెం 14184 వి 8529) — తాళపత్రము

శ్రీ సర్వమంగళాశ్రిత భూమియగుచు
నా సదాశివునకు నిలయంబైన
వారణాసీ పురమేలు విభుడు
వారిదరిపుడు ప్రతాపశాలి
సూనాస్త్ర రతిబోలు సుందరి యతని
మానిని యొప్పుల సోమప్రభయనగ
వారి కుమారుండు వజ్రమకుటాహ్వయుండు
నెరివసంతుని బోలు నిజరూపరేఖ
బుద్ధిమంతుడు మంత్రి పుత్రుండు ఘనుడు
బుద్ధి శరీరాఖ్య బోలు పారువాడు
నరనాథ సుతు డొక్కనాడు వన భూములకును
నుచిత సౌఖ్యంబుల నాగివేట వెడలి
రచిత ధనుర్గుణారావ మెసంగ...'

పైనీయబడిన యారంభము గ్రంథారంభముగా దోపదు. అది భేతాళుడు రాజునకు చెప్పిన రెండవ కథారంభమై యుండునని, ఈ కథాంతమున,

'అని చెప్పి భేతాళు డాతుణంబునను
చని శింశుపా వృక్షశాఖతో వ్రేలె
వెలయ నీ కథ పంచ వింశతిలోన
నలర ద్వితీయమై యభినుతికెక్క.'

అని రెండవ కథగా దెల్పబడియుండుటవలన తెలియుచున్నది

## స్వరశాస్త్రము[19]

అముద్రితము

ఇందు నాడుల విషయములు, వశీకరణ ప్రశ్న శాస్త్రాదికములకు సంబంధించిన విషయములు వర్ణితములైనవి. మంజరీ ద్విపద బద్ధమగు రచన. గ్రంథారంభమివ్విధముగనున్నది

---

19 మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము— ఆర్ నం 2518 —తాళపత్రము

| రూప సాధనోప యోగి ప్రత్యయములు | ధాతుజ నామవాచకములు | వ్యాపారార్థకములు కాని ధాతువులు తెలుచు | విమర్శము |
|---|---|---|---|
| అల్ | పై + య్ + అల్ = (బాలుఁడు) (పైద్ + అల్) | { పై = పసు (-చు) = (ఆకు పచ్చని-నూతనము) | |
| ,, | ఉడ్ + అల్ = (శరీరము) | ఉడ్ + ఉ = (ధరించు) | ఉట్-(ప్రా. తమి.) తెల్గు-ఒడలు. |
| ,, | పుస్ + అల్ = (తుపాను) = (పుయల్) | పుయ్ = (పట్టుకొను) | |
| ,, | ఉర్ + అల్ = (సున్న పుగచ్చు) | ఉర్ + అమ్ = (బలము) | |
| ,, | వయ్ + అల్ = (వరిపొలము) | వై = (ఉంచు? స్థలము?) | |
| ,, | వణ్డ్ + అల్ = (వండమట్టి) (ముఱుగడ) | ? | తెలుఁగు-వండ = వండలి = (వండమట్టి) |
| అలై | సుడ్ + అలై (శ్మశానము) | సుడ్ = (కాల్చు) ('సుద్' అని తప్పు పడినది). | చుట్-(ప్రా. తమి.) |
| ,, | మల్ + అలై = (బాల్యము) | మల్ + అ = (చిన్న-పసిది) | |
| ,, | విడుద్ + అలై = విడుత్తల్ = (విడుదల) | విడ్ + ఉ = (విడుచుట) | విట్ (ప్రా. తమి.) |

'తలై = (తల = తలము)' అనునది గ్రాంథిక భాషయందు సప్తమీ విభక్తి చిహ్నముగా విరివిగా వాడఁబడుచున్నది. కాని 'అలై = అల్' అనునవి తుదియందుండునవి యితర పదములవలన నేర్పడినట్లు తోఁచును. 'విడుదలై' అనునది 'విడు + తలై' అను రీతి నేర్పడక 'విడుదల్ + ఐ' అను రీతి నేర్పడినదని తెలియును. 'విడుదల్' అను రూపము ప్రచురమగు క్రియానామవాచకమనిపించుకొను కృద్రూపము.

వ్రాయసకాడు దీసిని పరాభవ నామ సంవత్సరము, వైశాఖ బహుళము, బుధవారమునాడు వ్రాసి ముగించినట్లు చెప్పబడినది.

## కామేశ్వరీ చరిత్రము[20]

అముద్రితము

కర్త రేటూరి భావనామాత్యుడు. శ్రీవత్స గోత్రుడు. పెగడయ్య మంత్రి పౌత్రుడు నాంచారమ్మ రామార్థిమనుల పుత్రుడు. రెట్టపురి నివాసి. ఈతడు క్రీ.శ. 1650 ప్రాంతమున నుండినవాడు. గ్రంధారంభమున కాళిదాసాది సత్కవులకు నుతులొనర్చినాడు. ఈతని గురువు అద్దంకి శ్రీ సింగరాచార్యులు కామేశ్వరీదేవి తనకు స్వప్నమందు సాక్షాత్కరించి, ఈ కథను రచింపమని తెల్పగా నీతడిద్దానిని రచించినాడు.

కామేశ్వరీదేవి ప్రసక్తి క్రీడాభిరామమున గలదు. కావున కామేశ్వరీ పూజ లాంధ్రదేశమున కాకతీయుల కాలమునుండి యుండినట్లు తెలియనగుచున్నది.[21] కామేశ్వరి ఏడ్గురక్కలలో చిట్టచివరియామె. శ్రీరామచంద్రుడయోధ్యా నగరమును పాలించుచుండెను. వైకుంఠమున లక్ష్మీనారాయణుల సమక్షమున నారదుడు శ్రీరాముని ప్రశంసచేసెను శ్రీరామచంద్రునిగూర్చి విని లక్ష్మీదేవి యాతని చూడగోరినది. అట్టి అభిలాష యామెకు దగదని చెప్పెను గాని, ఆతని తోడ్తేర శంభుభట్టు నయోధ్యానగరమున కనిపెను శ్రీరాముడు గరుడవాహనుడై యేతెంచుచుండగా, శ్రీమహావిష్ణువు లక్ష్మీదేవిని పరీక్షింపగోరి యామెనొంటరిగా విడిచి తిరోహితుడయ్యెను శ్రీరాముని మన్మథాకారమును గాంచి, విష్ణువే యీ రూపమున నేతెంచి తన్ను పరీక్షించుచున్నాడని భావించి లక్ష్మి 'ముదమంది యీ రూపమున నున్నయపుడె కలసి పొందగవలె గాకంచు దలచి, నీ మాయలన్నియు నేనెరుంగుదును, స్వామి నాకోర్కె దీర్చంగ బూని

---

20 మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము – డి నెం 1045— కాగితపు ప్రతి

21 క్రీడాభిరామము – పు 46

తిరి, అవలీల నీదు ఒయ్యారంబు జూచి, ప్రాలితినే మోహావనధిలో నిపుడు, కడతేర్చు రహిగూర్చు కౌగిట చేర్చు, అదరి నన్నానంద మందించు మిపు'డని కోరినది శ్రీరాముడు తానేకపత్నీ వ్రతుడననియును, ఇటువంటి అకార్యము చేయదగదనియును పల్కగా, నామె తమి మిక్కుటముకాగా, శ్రీరాముని చేల మును పట్టిలాగినది శ్రీరాముడామె వద్ద నుండి తప్పించుకొని పారిపోవుచుండగా, నామె శ్రీరాముని ఏకపత్నీ వ్రతము చెడునట్టుగ శపించినది. కృష్ణావతారమున నాతని వ్రతమంతయు చెడిపోగా స్త్రీలనాతడే బ్రతిమాలుకొనుచు దొంగయై తిరుగునని శాపమిచ్చినది శ్రీరామచంద్రుడు మాత్రమేమి తక్కువతినెనా? ఆమెకూడ, కామేశ్వరి యనెడి పేరున జనించి, విరహమున గ్రుంగుచు వెతల బొందునని ప్రతిశాప మొసగినాడు

లక్ష్మి తన శాపము సంగతిని విష్ణునితో దెల్పి దుఃఖింపగా, నాతడామె నూరార్చి శివునకు జనించి భక్తుల కోర్కెల నీడేర్చుమనియును, తాను కృష్ణావ తారమెత్తెదననియును దెల్పెను లక్ష్మీదేవి హిమవంతముపై తపమాచరించు చున్న శివుని కడకేగి తనకోర్కెను దెల్పగా తాను గౌరీదేవిని వివాహమాడు వరకును కొలనున నుండుమని శివుడామెకు ఒక కొలనును జూపించెను లక్ష్మి యందుండెను గౌరిని వివాహమాడి శివుడు లక్ష్మీదేవి యుండిన కొలనులో జల క్రీడలు సల్పెను గౌరీదేవి యా కొలనునుండి యేడు పుడిసెళ్ళ నీటిని ద్రావగా లక్ష్మి గౌరిదేవి గర్భమున ప్రవేశించినది గౌరీదేవికి సద్యోగర్భమై, ఏడు దోసిళ్ల నీటిని ద్రాగిన కారణముగా, లక్ష్మి సప్తకన్యకలుగా జన్మించినది.

'పొడవైన మెఱుగుల ప్రోవు చందమున
పెడతల జనియించె బెరవాటి యనగ
శిరమున జనియించె శివవాణి యనగ
కొప్పున జనియించె కొండవాణనగ
మొగమున జనియించె ముద్దరాలనగ
చన్నుల జనియించె జక్కులమ్మనగ
కన్నెలార్గురకును కడపట బొడమి

చిన్నారి పొన్నారి చెలియలై యపుడు
అన్నిట గొదలేని యాకారరేఖ
కన్నుల నుదయుంచె కామవల్లనగ
ఇటువలె శ్రీలక్ష్మి యేడ్వురై పుట్టె '

సప్త కన్యల సంరక్షణార్థము పోతురాజును సృజించి. వారినటనే విడిచి పార్వతీ పరమేశ్వరులు వెడలిపోయిరి వారికొరకు బ్రహ్మ యొక పురమును నిర్మించి, పోతురాజుకు కూనలమ్మను సృజించినాడు (ఈ కూనలమ్మ పైనే పదములనేకములు తెలంగాణా రాయలసీమ ప్రాంతములలో నధిక ప్రచారమున నున్నవి ) శివుడొకనాడు యక్షులను బిలిచి, కామవల్లిని కొల్వుమనినాడు

విష్ణువు కృష్ణావతారమునెత్తి ఒకనాడు గోపకుమారులతో గోవులను మేపబోయెను కామవల్లి తనయక్కలతోగూడ స్నానమాచరించుచుండగా, శ్రీకృష్ణుని గోవులు కొలనును చీకాకు పరచినవి కామవల్లి కోపించి. గోవులను, గోపబాలకులను శిలలుగా కమ్మని శాపమొసంగినది శ్రీ కృష్ణుడు అక్కల వస్త్రముల నపహరించి పొన్నచెట్టెక్కి వేణుగానముచేసి. శిలలను మరల గో గోపకులనుగా మార్చివేసెను వేణునాదముచే పరవశురాలై ఉన్మాదినియై, కామవల్లి శ్రీకృష్ణుని చెంతకుచేరి అన్నేలుకొమ్మని వేడినది శ్రీకృష్ణుడు తమ శాపముల నెరిగించి, కల్క్యవతారమున తన్నుసుఖవింపగలదని దెల్పి, ఆమెకు విరహోపశాంతి గల్గు ఉపాయమును దెల్పి, ఆమె రుక్మిణిగా జనించినపుడామెను చేపట్టగలనని దెల్పెను కామవల్లి రుక్మిణిగా జన్మించి, శ్రీకృష్ణుని పొందెను ఆ మహాదేవి డెబ్బదిరెండు ప్రదేశముల కొలకులందు వెలసి పూజాదికముల నందుచున్నది

శైలి మిక్కిలి సరళముగ నుండి ధారావాహిగ నున్నది

## నాసికేత పురాణము[22]

అముద్రితము

కర్త శృంగార కవి తిరుమల నాథకవి తంజావూరి మహారాష్ట్ర రాజుల కాలమునలో పెట్టపల్లు కులముల వాడు ... ఇతడు ... వీరు తంజావూరులోని,

22 మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము.

ధేనువాళము గరిడికి పెద్ద గరిడికి సంబంధించినవారు ఆ జెట్టిమల్లులలో నొకడగు తిమ్మాజెట్టి ప్రేరణ వలన తిరుమలనాథ కవి, దీనిని రచించెను ఇది పెద్ద గరిడియందు వెలసిన శ్రీకృష్ణుని కంకితమీయబడినది కవి తన్నుగూర్చి చెప్పికొనుచు—

'ఘనుడైన శృంగార కవి తిమ్మఘనుని
తనయుడ వైష్ణవోత్తమ సేవకుండ
మహనీయ గుణుడ తిర్మల నాధకవిని
అహిరాజ శయనుని కంకితంబుగను
కరమొప్ప బరమ భాగవత చరిత్ర
పరమార్థ దీపిక పద్మినీ పరిణ
యము మొదలైన కావ్యములు రచించి...'

అనియు — కృతిపతి యీతని గూర్చి—

'లలితోక్తి దేవమల్లు చరిత్ర మాకు
తొలుత రచించి కీర్తులు దెచ్చినావు'

అనుట వలనను, నీతడు నాసికేత పురాణము మాత్రమేగాక, యింకను గ్రంథములు రచించినట్లు తెలియుచున్నది. కాని నాసికేత పురాణము తప్ప తక్కిన గ్రంథములేవియు లభించుటలేదు. ఈతడు తన కవనమునుగూర్చి—

'అల మహారాష్ట్ర దేశాంగ నామణుల
కులుకు గుబ్బల రీతి గూఢమైపోక,
మట్టుగా ద్రవిడ భామా కుచలీల
బట్టబయల్ గాక భావజ్ఞులనను
సరచాటుపైటల నాంధ్ర భామినుల
మెఱుగు గుబ్బల రీతి మేలిమియగుచు
సకల లక్షణ లక్షంబాగు నామంబులు

ప్రకటించి చెప్ప నేర్పితి నాగ మించె
ఘనుడైన శృంగార కవి తిమ్మఘనుడు '

ఈ ద్విపదలు 'ఘనతర ఘూర్జరీ కుచయుగ' అను పద్యమున కనువాద ప్రాయములుగ నున్నవి ఇందలి యితివృత్తము నాసికేతోపాఖ్యానము, కఠోపనిషత్కథ.

— ం —

# పంద్రెండవ ప్రకరణము

## ద్విపద కావ్యములు—

# ఆయా కాలములనాటి సాంఘిక చరిత్ర

'AN INTRODUCTION TO THE STUDY OF LITERATURE' లో W H Hudson, "A nation's literature is not a miscellaneous collection of books which happen to have been written in the same tongue or within a certain geographical area It is the progressive revelation, age by age of such nation's mind and character " అని చెప్పినట్లుగ, ఆయా కాలములందు రచింపబడిన కృతులందు సమకాలిక సాంఘిక జీవన విధానములు ప్రతిబింబింపబడును.

ఈ ప్రకరణమున నేను పరిశీలించిన ద్విపద గ్రంథములనుండి, తెలియ నగు సాంఘిక పరిస్థితులను తెలిసికొన ప్రయత్నించితిని ఇందు సాంఘిక జీవిత చరిత్రకు ముఖ్యాధారములయిన గ్రంధములను మాత్రమె గ్రహించితిని

పాల్కురికి సోమనాథుని బసవపురాణ, పండితారాధ్య చరిత్రలవలన క్రీ. శ. 12, 13 వ శతాబ్దముల కాలమునాటి ఆంధ్రదేశపు సాంఘిక జీవిత విధానమును గూర్చి వివరములు పెక్కులు తెలియుచున్నవి మతము ప్రధాన జీవన విధానము బసవ పురాణము నాటికాంధ్ర దేశమున జైన, శైవ, వైష్ణవ మతములు పరస్పర ప్రాబల్య వ్యాప్తులకై పోరాడుచుండెను. మొట్టమొదట జైన మతము బాగుగ వ్యాపించినట్లు కాననగుచున్నది ప్రథమ కాకతీయ రాజులు జైనులే హనుమకొండ యందలి యిప్పటి పద్మాక్షి దేవాలయము పూర్వము జైనాలయమే. వీరశైవులు జైనమతస్థులను హింసించి, వారి దేవాలయాదులను ధ్వంసము చేసిన సందర్భమున ఈ దేవాలయము నందలి జైన విగ్రహమును బగులగొట్టి, శైవ విగ్రహములను నెలకొల్పియుందురు బసవేశ్వరుడు వీర శైవమును వ్యాపింపజేయుచు, జైనమతమును ఖండించి వీరశైవ మత పారమ్య మును స్థాపించుటయేగాక, వీరశైవులు జైనులను నానా హింసలు పెట్టినట్లు బసవ పురాణమువలన తెలియుచున్నది.

"వెస జైన ప్రతిమల విటతాటమాడి
వసదులన్నియు ద్రవ్చి వైపించెగాదె" —పు 408

"అఱిముఱి వసదుల వెఱికి వెటాడి
జినసమయులనెల్ల జీకుల జేసి" —పు 409

"జిన బౌద్ధ సమయంబులను వేళ్లు దుడిచి
మునుల దివ్యించె నాయినపకోళ్లుణను" —పు. 419

"జైన, బౌద్ధ చార్వాక దుష్పడ సమయములు
మూడు నిర్మూలనుగ
మూడజాలను వైతుము ముపొద్దు నిన్ను" —పు 423

"వీరమాహేశ్వర వితతి యుప్పొంగి
వెనుకొని వసదుల విఱుగ గొట్టుచును
జినప్రతిమల తల ల్చిదిపి వైచుచును
నసమాన లీల గల్యాణంబునందు
వసదియు జినుడను వార్త లేకుండ
గసిమసంగుచు జంపి గాసి వెట్టుచును
వసుధలో జినులను వారి నందఱను
నేల వాలుగజేసి... ..."

వీరశైవులు జాతి రహిత సంఘమును నిర్మించుటకై ప్రయత్నించిరి. శైవ దీక్ష నందిన వారందరిది ఒకే కులమని చెప్పిరి బసవేశ్వరుడు మాల మాదిగలకుకూడ శివదీక్ష నిచ్చి తన మతమున జేర్చుకొనినట్లు తెలియుచున్నది శివనాగుమయ్యయను మాలవాడు పరమ వీరశైవాచారుడు రజక కులస్థుడైన మడిపాలు మాచయ్య శివ భక్తాగ్రేసరుడు అష్టాదశవర్ణములు మానవులు కల్పించినవని బసవేశ్వరుడు బిజ్జలునితో చెప్పినాడు

"గోవిందు ప్రతిమ యుక్కునను గావించి
భావించి యటమీద బంచలోహములు

బోయించి కడు సొంగముగ బ్రతిష్ఠించి
పాయక రేయును బగలును గొలువ" —పు 283

అనుటవలన ఆనాడు వైష్ణవ మతముగూడ మంచి వ్యాప్తిలో నున్నట్లు తెలియుచున్నది, కాని వీరశైవులు అన్ని మతములను అణగద్రొక్కుచుండిరి పై ద్విపదల వలన, ఉక్కు పంచలోహములు వాడుక యందుండినట్లు తెలియు చున్నది ఆనాటి కింకను అద్వైతులు, మాయావాదులు బౌద్ధులు, చార్వాకులు, కర్మవాదులు, కులవాదులుకూడ నుండినట్లే గ్రంథమువలన తెలియుచున్నది ఈ కాలమున మాడలు వ్యాప్తిలో నుండెను

"పెట్టెల మాడలట్టుప్న భంగి—

ఆనాడు నాటకము లాడువారుండిరి "బహురూపు" అనగా నాటకము లందు వేషములు వేయువాడు.

"దైవంబనగ లేదు తా బహురూపు
దానికాచార్యుండు ధర గర్మ జడుడు" —పు 44

జనులు రకరకములగు నృత్యములను జేయుచుండిరి

"వేడుక గోలాట మాడెడువారు
గూడలి త్రిపురాంతరని కొల్వువారు
గెడగూడి పసిడి గర్గిట కేళికలను
గడు నొప్పు సౌన్నలికపురంబువారు
చేరువ నాడెడు పేరణి విధము
సౌరాష్ట్రి నాయతు సంప్రదాయంబు
వేడుక బ్రతి జోకలాడెడు వారు
గూడలి సంగయ్య కొలువు నర్తకులు" —పు 63—67

"కోలాటమును బాత్ర గొండ్లి పేరణియు, గేళిక జోకయు లీల నటింప" —ఇందలి గొండ్లి అనగా గర్భనృత్యము. పేరణి అనగా కుంభము ఆనాటి జనులు రకరకములగు గీతముల పాడుచు నాడుచుండెడివారని తెలియుచున్నది.

"ఆనంద గీతంబు లగ్గించువారు
పూని శంకర గీతములు వాడువారు
జతిగీతములమీద జప్పట లిడుచు
నతిశయ శివభక్తి నాడెడువారు
నాది పురాతనా పావిత స్తుతులు
వేదార్థములుగాగ వివరించు వారు
నెఱి శివమరులును గఱిలేని వేడ్క
నఱిముఱి మిన్నంది యాడెడువారు" —పు 50

ఇదే విధముగ పండితారాధ్య చరిత్ర మహిమ ప్రకరణమునందును గలదు
(పు 176)

ఆనాడు రకరకములగు పట్టులు వ్యాప్తిలో నుండెను బసవని భార్య చీరను ఒక మిండజంగము దగుగు సందర్భమున పట్టుచీర రకములు పేర్కొనబడినవి.

"వెంజావళియు జయరంజియు మంచు
పుంజంబు మణిపట్టు భూతిలకంబు
శ్రీవన్నియయు మహాచీని చీనియును
భావజ తిలకంబు పచ్చనిపట్టు
రాయశేఖరమును రాజవల్లభము
వాయు మేఘము గజవాళంబు గండ
వడముగావులు సరిపట్టును హంస
వడియు వీణావళి పల్లవదట్టి
వారణాసియు జీసువాయు గెండాగిరు
గిరిగనంపమ్మును క్షీరోదకంబు
పట్టును రత్నంబు పట్టును సంకు
పట్టును మరకత పట్టు పొంబట్టు
నెఱిపట్టు వెలిపట్టు నేత్రంబు పట్టు
ఘటి తవరాజంబు మాందోళంబియు

జంద్రాతపంబును సాంధ్యరాగంబు
నింద్రనీలంబు మహేంద్ర భూషణము
సన్ననడంచును శరధియు మేఘ
వన్నెయు రుద్రాక్ష వన్నెకాంభోజి
పులిగోరుపట్టును భూపతి రుద్ర
తిలకంబు సరిపట్టు మలయజసిరియు
గౌలని మేఘము గజావళి హయావళియు
వలిపంబు సరిగమ్మి తెలుపు దివ్యాంబ
రంబును సుదియ రాగంబు దేవాంబ
రంబు పౌత్తియు గుజరాష్ట్రంబు పట్టు" మొదలుగా—

పు. 127—128

కన్నడ బ్రహ్మయ, యిండ్లను కొల్లగొట్టుటకు పోయినపుడు

"కత్తెర యినుము నక్షతలును ముండ్ల
బంతియు నీలి కప్పడముఁ గ్రిండు
మంతర కాటుక మఱి చండ వేది
నెలగోల యొంటట్టె చెప్పుఁ దీకె
యొలుకుల బూడిదయును పాఱువాఱు
గుక్కల నాకట్టు గొంకినారసము"

మున్నగు నాయుధముల గొంపోవుచుండినట్లు చెప్పబడినది. ఆనాడు చోరులీ యాయుధ విశేషముల నుపయోగించుచుండి యుందురు. మంతర కాటుక, యొలుకుల బూడిద, మత్తుమందుల వంటివై యుండును. 'కుక్కల నాకట్టు' కుక్కలు మొఱగకుండ వానిని నిద్రింప జేయు లేక ఊరకుండునట్లు జేయు మందు అయియుండును

బసవేశ్వరుడు.

'కాలకూటము శృంగి ఘనవత్స నాభి
హాలాహలంబును నాదిగాగలుగు
విషములన్నియు వేగనూటించి' నట్లు

చెప్పినందున ఈ విషములన్నియు నాడు వ్యాప్తిలో నుండినవని తెలియుచున్నది

బసవపురాణం పండితారాధ్య చరిత్రలలో పెక్కు స్థలములందు శివ ద్విజుల ప్రసక్తిగలదు శ్రీశైలమును, 'బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాది సత్కులజులును దుష్కులజులును నెట్టి మానవులు" మెట్టినను వారి పాపములు తొలగిపోవునని [1] పండితారాధ్య చరిత్ర యందుండుటవలన ఆ నాడు శైవులలో వర్ణవిభేదమున్నదనియే చెప్పవలెను

"వెలివాడ గలుగునే వేదఘోషంబు''[2] అనియుండుట వలన ఆనాడు పంచములు వెలివాడలో నివసించి వేదాధికారము లేనివారుగా నుండిరట్లు కానబడుచున్నది. వీరశైవంలో వర్ణవిభేదము లేదను నభిప్రాయము సోమన కుండినచో సోమనాథుడీరీతిగా రచించియుండడు శివద్విజులు, శివ బ్రాహ్మణులు నను ప్రయోగములు ఆనాటి శాసనములలో నున్నవని శ్రీ చిలుకూరి నారాయణ రావుగారు చెప్పిరి

శ్రీపతి పండితుడు శివుడొక్కడే దైవమని నిరూపించుటకు పొత్తి పచ్చడమున నిప్పులు ముడిచినట్లు (పంచ పు. 1-407-405) వర్ణించినాడు కావున ఆనాడు వీరశైవులు తమ భక్తిని శివుని ఏకత్వమును నిరూపించుకొనుటకిట్టి యమానుష క్రియలను చేయుచుండిరటు లూహింప వీలగుచున్నది ఇదే విధముగ శ్రీశైలమున శివభక్తులనేకులు తమ భక్తి నిరూపణముకొరకు, కండ్లు నూడబెరికియు, కాలుసేతులు తెగగోసియు, శివున కర్పించుచుండినట్లు తెల్పినాడు. ఆనాడు వీరశైవులలో నిట్టి వీరావేశముండినదేమొ.

సర్పదష్టుడైన రాజును రక్షించుటకు,

"శాస్త్రు, వైద్యులు గారుడవరమంత్రవిదులు
జనుదెంచి విషముచే జచ్చిన నృపతి

1 పండితారాధ్య చరిత్ర 2—267

2. బసవ పురాణము, పు. 154

గనుగొని యశక్యంబనుచు నేగ
మరియొక్కగారుడ మంత్ర సిద్ధుండు
పఱతెంచి విషదగ్ధ భావంబు జూచి''నారు (పం.చ 1-435)

దీనివలన ఆ కాలమున పాము విషమును పోగొట్టు మాంత్రికులుండిరని తెలియుచున్నది

పాముకాటు ఎట్లుగల్గిన వేనచే తొలగింపబడునో దెల్పినాడు

"ఒక్క పల్ నాట నాడినను
దండి మంత్రములచే దరియుదంతములు
రెండూన నౌషధ క్రియలచే బాయు
నరుమూడు దంతముల్ నటిన వ్రేగు
బరువడి మరి నాల్గు పండ్లు నాటినను
ధరమంత్ర తంత్రౌషధ క్రియలేల
హరి వేధలకు గావ నరుదు గావునను" (పం చ –1–438)

ఇదే విధముగ కంటి రోగమును గూర్చి దానిని నిర్ణయించు విధానమును గూర్చి చెప్పినాడు

"సార కటాక్ష వీక్షణ జాలమైన
గారుణ్య జలములు గావ యుష్ణములు
ఘర్మ జలంబుల క్రమమందమని
ఘర్మ జలంబులు గన్నుల గలవె,
యొండు దుఃఖం బేవి యూహించి చూడ
రెండు గన్నుల గాఱకుండునే నీరు
తానొక్క కంటనే ధారపర్వెడిని
గానోపు నక్షి రోగంబ యేమేని
చెప్ప జిత్రము కోడి ఱెప్ప వెర్గినదో
తప్పవో నోవునో తడి కంటి విధమొ?
నొవ్వియో, పొరగప్పెనో మాద తెవులో

పువ్వు వ్రట్టిల్ల నాపువు కంటి పోటొ
మయిలపడ్డదియొ దుర్మాంస దోషంబొ
అయిరయొ వెండి యనక్షి రోగంబొ?"

ఇదే విధముగ పండితారాధ్య చరిత్రమున, పెక్కు రకము లయిన నేత్ర రోగములను పేర్కొనినాడు (మహిమ ప్రకరణము పు. 108)

బెజ్జమహాదేవి కథయందు శిరోరోగములనుగూర్చి ప్రస్తావించినాడు అటులే, బసవ పురాణమందలి (3. ఆ పు 176) నాట్య నమిత్తిండి కథలో, వాయురోగము వచ్చినపుడు చేయవలసిన వైద్య ప్రక్రియను దెల్పినాడు

"వాయుతైలము గొనివచ్చి యాక్షణమ
మాయాప హరుమేన మర్దన సేసి
తవిలియా వావిలి చివుళులుమ్మెత్త
చివుళులు దక్కెడి చివులులాముదము
చివుళులు పండిన జెల్లెడాకులును
నివియాదిగా మందులిన్నియు గూర్చి
చెచ్చెర దనువెల్ల నేకంబు సేసి
వొచ్చెంబు లే కిన్మ పొట్లాలగాచి
పుచ్చుచు నరచేత వెచ్చ జూపుచును
నిచ్చ యెఱిగి కాకలిచ్చుచు పాయు
పథ్యంబులారగింపంగ బెట్టుచును
శిథ్యంబుగా వెంటి తగు క్రియ సేసె"

పండితారాధ్య చరిత్రలోని కుమార పాలభూర్జరుని కథవలన ద్యూత పరిభాషా పదములు తెలియుచున్నది దాయము, ఈరైదు, దుగ, ఇత్తిగ, దచ్చొక, పంచియ, చౌదుగము, భద్రము, సత్రా, తీవంచ, నౌవంచి— మొద లగునవి

జూదమున నోడిన వారికి "తలచుట్టు గాలువట్టి మోపగ నెత్తికట్టు" శిక్ష నిచ్చెడివారట.

ఆనాడు పలు రకములయిన ఆటలు ఆడుచుండినట్లు తెలియుచున్నది

"పొందంగి రాగుంజు పోగుంజులాట [3]
గుందెన గుడి గుడి గుంజంబులాట
యప్పల విందుల యాట వల్మాఱు
జప్పట్లు వెట్టుట సరిగుంజులాట
సేర బొంతల యాట సిట్ల పోట్లాట
గోరంటలాట దాగుడు మూతలాట
దీకొని దిగు దిగు దిక్కాను నాట"

"వీరభద్రయ్య యీబారి గడపిన, వారక జాతర వచ్చెదననెక"— అనుటవలన ఆనాడాపద మ్రొక్కులకై జాతరలకు పోవుట యందు నమ్మకముండినట్లు తెలియుచున్నది

ఆనాడాంధ్ర దేశమున, అనేక మతములు వర్ధిల్లినట్లూహింప వీలగుచున్నది వీరశైవము బౌద్ధ జైన, పాంచరాత్ర, వైదికమతములు పేర్కొనదగినవి వీరశైవ మతానుయాయులు తమ మతమును వ్యాప్తిగావించుటకును, దానిని ప్రతిష్ఠించుటకును ఆవేశములకు లోనై, యితర మతానుయాయుల యెడ హింసాకాండను జరుపుచుండినట్లు తెలయుచున్నది

జైనుల నేవిధముగ వీరు హింసించిరో వర్ణింపబడినది.

"పొసపరి వ్రద్దిల్ల బొట్ల వెర్వ్వనను
వసదులేన్నాఱుపు ప్రచ్చి వైపించి
వెస జిన ప్రతిమల విటతాటమాడి
యొసగునాడీ జైనులెక్కడననిరి?
... ... ...
కోపూరి లోపల గలయట్టి
పసదులన్నియు వ్రచ్చి వైపించి

3 బహుశః ఇది నేటి చెడుగుడు వంటిదేమో.

నెసగునాడీ జైనులెక్కడ సనిరి ?

... ... ...

మెఱయుచు నాడుచు మఱి యొండు శిరము

వడసి జైనులనెల్ల భస్మంబు సేయు

నెడనాడు మీ జైను లెక్కడ సనిరి ?

... ... ..

కూడ జైనుల నెల్ల గొఱ్ఱు లెక్కించి

రూఢియై వసదుల రూపడగింప ?

... ... ...

"అదిగాక నిడుమారడను చోడనృపతి

వెదకుచు దన యేలు విశ్వధరిత్రి

గల జైన మునుల నొక్కట పిలుపించి

వలయు తర్కంబుల వారి నోడించి

తలివి గ్రాగిన కొర్తలలు గ్రిందుకను

దివియ నాడెందేగితిరి .?"

"పూని బొమ్మల వాడు బొమ్మలలోన

దానుండు నెట్లు సూత్రనుయుండుగాక" (పు 569)

అనుట వలన వొమ్మలాట గాంధ్రానాదు బొమ్మలాటల నాడుచుండిరని తెలియుచున్నది.

"బహురూపమాడుచో బాపి చెండీడు

సహజంబు సూపకే జూడవచ్చినను

నరయ నేరంగ రంగమధ్యంబున నున్న

తరుణి యెరుంగదే తన మగడగుట"

ఆనాడు నాటకాదులను ఆడుచుండినట్లు తెలియుచున్నదివి. శ్రీ పర్వతము వద్ద తిరునాళ్ల (సమయములందు) శివుని లీలలను నాటకములుగ భక్తులాడుచుండి నట్లు వర్ణింపబడినది. (పు. 2—142)

"మాయలేని పురారి మాడ్కి నాప్పుచుచు, బురములు గాల్చిన పోల్కి యాడుచును,
మరు జిఱువుచ్చిన మాడ్కి నాడుచును. సతి కర్ధమిచ్చిన చందమాడుచును
యతులు గొల్వ గనున్న యందమాడుచును, నంధకాసురు మదంబడుచు టాడుచును,
గంధ గజాసురు గడపుటాడుచును, జన్నంబు గ్రుంచిన చాళినాడుచును,
వెన్నుండు గన్నిచ్చు వేళ నాడుచును, గిరళంబుదాల్చిన కరణి నాడుచును
వెండియు భవు బహువిధ చరిత్రముల ఖండిత గతి నాటకంబు లాడుచును"
శ్రీశైలమున భక్తులు దేవదేవుని, వేని వేనితో స్తుతించుచుండెడివారో వర్ణింప బడినది
"సతతంబు నతి భక్తి జలిపెడువారు, నాది ఋగ్వేదాది
నలరారు సూక్తు లాదిగా బ్రాహ్మణాద్యంత సూక్తములు
దుదిగాగ రుద్ర సంస్తోత్ర సూక్తములు, జదువుచు పొదలి ప్రశంసించువారు
రుద్ర విధాన నిరూపిత న్యాస భద్రాత్మ సంజ్ఞలు పను నొకంటికిని
క్రమమొంద జనుక సూత్రంబు లేకావ శ పములు నొండొంటిశాంతులుగాగ

. . .

అంచిత బాణ గద్యాత్మగగద్య, పంచ గద్యాదులు పటు ప్రబాడంబ
రంబు వర్ణాడంబరంబు వ్యాసాష్ట, కంబును నీలకంఠ స్తవంబు
శ్రీరుద్ర కవచంబు శారభంబును, మయూర స్తవము హాలాయుధ మనావయము
మలహణ హరణంబును మహిమ్నంబను స్తవము
మలయ రాజీయంబు మౌని దండకము
స్తుతి [4] మూలమగు మహాస్తోత్ర సూత్రములు, శతకంబు శివతత్త్వ సారంబు దీప
రళిక, మహానాటకము సుదాహరణములు రుద్రమహిమయు ముక్తావళులు
గీత సూక్తులు, భృంగీ స్తవంబులు బురాతనముని ముఖ్యరచితాష్టకములు

4 ఇటు 'స్తుతి మూలమగు' అని ఉండవలెను 'స్తుతి' అన్నది సరియైన పాఠము కాదు

హరలీల రుద్ర సహస్ర నామాదు, లరుదొంద జదువుచు నంకించువారు
నరుదగుదాసయ్య నలువత్తుమూలు, సరితంబులును శ్రీ బసవ పురాణంబు
నేలలు వెట్టంగ నింపు సొంపారు, శైలిచే గ్రాలుచు జదివెడువారు
జాతుర్య మెసగ బసవ దండనాధు, తీతంబు లాదిగా గీతాదులైన
సకల పురాతన చారు గీతములు, ప్రకటించి ప్రకటించి పాడెడువారు
జదువుల బాటల సంగతి లేమి, బొదలి మాటల యంద పొగడెడివారు"

పై ద్విపదలను బట్టి ఆనాడాంధ్ర దేశమున సోమన కాలమునాటికి, శతకములు, నాటకములు, ఉదాహరణములు, పెక్కు గద్య రచనలు, బహుళ ప్రచారములో నుండినట్లు తెలియుచున్నది. బసవ పురాణమును కూడ భక్తులు తన్మయులై పాడుచుండినట్లు తెలియుచున్నది. దానిని ఏలలు వెట్టి పాడుచుండరట. ఏలలు పెట్టి పాడుట యనగా, ఒక పదమునెత్తి రెండు మూడు పంక్తుల తరువాత మరల మరల పాడుట. ఇందు పేర్కొనిన 'శతకంబు శివతత్త్వసార' మను దానికి పెక్కుమంది శివతత్త్వసారమునే శతకముగా సోమన పేర్కొనెనని యందురు. కాని శ్రీ నిడదవోలు వెంకటరావుగారు శతకము వేరుగను, శివతత్త్వ సారము వేరుగను నుండవలెననియు ఇచట శతకమనగా శ్రీగిరి మల్లికార్జునా యను మకుటముతో నున్న మల్లికార్జున పండితుని శతకమనియు తెల్పిరి. ఏల యనగా, శివతత్త్వసారము శతక లక్షణములలో సమన్వయింపదు.

ఇందు పేర్కొనబడిన గద్యలలో పండితారాధ్యుడు, లింగోద్భవ దేవ గద్య, అక్షరాంకగద్య, శ్రీముఖ దర్శనగద్యలను రచించినాడు వీనిలో లింగోద్భవ దేవగద్య యనుపలభ్యము. ఇవిగాక, ఆనాడు అనేక పదములను పాడుచు జనులు తిరునాళ్ళలో తిరుగుచుండినట్లు సోమన వర్ణించినాడు. ఎన్ని రకముల పదములో.

"పదములు, తుమ్మెద పదముల్ ప్రభాత
పదములు బర్వత పదము లానంద
పదములు శంకర పదముల్ నివాళి
పదములు వాలేసు పదములు గొబ్బి

పదములు, వెన్నెల పదములు సంజ
వర్ణన మరిగణ వర్ణన పదములు" (పం.చ - వాద.ప్ర-పు.613)

సోమనాథుడు తన ద్విపద రచనను సమర్థించుకొనుటను బట్టి చూచినచో, ఆనాడు వాఙ్మయక్షేత్రమున మార్గదేశి రెండు మార్గములు నుండినట్లు స్పష్టముగ తెలియుచున్నది. ఆయామార్గముల నవలంబించిన వారికి స్పర్ధలు కూడ నుండిన వేమొ. అందువలననే తిక్కనామాత్యుడు తాను ఉభయకవి మిత్రుడనని చెప్పి కొనినాడు. ఈ విధముగ పండితారాధ్య చరిత్ర ఆనాటి సాంఘిక విషయముల ననేకములను తెలిసికొనుటకు వీలగుచున్నది

సోమన ఆనాటి సంగీత సంప్రదాయములను గూర్చికూడ కొంత తడవినాడు. బసవ పురాణమందు సకలేశ్వర మాది రాజయ్య కథలోను, పండితారాధ్య చరిత్రయందు పర్వత ప్రకరణమునను వీనిని గూర్చిన విశేషముల నొసగినాడు. పండితారాధ్య చరిత్రయందీతడు బహువిధములగు వీణల పేర్లను పేర్కొనినాడు అదే విధముగ తాళములను (108), శ్రుతులను, ఆలాపనలను, శిరోభేదములు మొదలగువానిని దెల్పినాడు (పం చ.-పర్వత ప్రకరణము పు. 442-457)

శివరాత్రి సందర్భమున శ్రీశైల మందలి ఉత్సవములను వర్ణించుచు,

"ఆదట గంధర్వ యక్షవిద్యాధ
రాదులై పాడెడు నాడెడువారు
విధమున బ్రచ్ఛన్న వేషముల్ దాల్చి
యధికోత్సవము దులుకాడ నట్లొ"

అని చెప్పుట యక్షగానములను గూర్చియే యనియు, కావున సోమన నాటికి మన దేశమున యక్షగానముల నాడుచుండెడివారనియు కొందరు తలంచుచున్నారు

## వేష భాషలు

దోనమయ్య శ్రీశైల పర్వతమునకు పోవుచు, దారిలో ననేకులను గాంచినాడు. వారెట్టి వేషములతో నుండిరో సోమన వర్ణించెను. జంగములు-

పొడవైన సంబువులను, పసిడి గొడుగులను, పావలను, వాగె పాదరతులను, కఱకంచు కావులను, పొత్తిపచ్చడములను, గోపీనములను, పలుచని జోడు కుబుసములను, కావిపచ్చడపు దుప్పట్లను, రత్న కంబళ్లను, ధరించుచుండిరి

శ్రీశైల యాత్రాసందర్భమున నానాదేశముల నుండి వచ్చిన తీర్థయాత్రికులు తమ తమ భాషలలో వరుస బంతులను గట్టి పాడిరని సోమన వర్ణించినాడు. ఇందు భారతదేశములోని ప్రాంతముల నన్నిటిని పేర్కొనినాడు

ఇదిగాక సోమన గొల్లలు, చాకలి, జాలరి, వడ్రంగి, కనుమరి, అగసాలి, బోయ వారల వృత్తులను, వేషములను గూడ వర్ణించినాడు బసవ పురాణమున సకలేశు మాది రాజయ్య కథలో, తన కాలమందుండిన గొల్లల వేషమును వర్ణించినాడు. (బ. పు—పు, 224-225).

ఆనాడు సామాన్యులు రాగి కుండలములు, రాగినందులు, రాగినూలులు, రాగి కంటెలు, రాగి దండలు, రాగిజన్నిదములు, రాగియుత్తెరలు, కొక్కెరలు, పాలెలు, సరిపెణలు, సేవళములు, కీలుకొలుకులు, రాగి కీర్తిముఖములు, అందెలు, రాగి కటకములు, రాగి పదకములు, రాగి ఒడ్డియాణములు, కటి సూత్రములు, కంచుమట్టెలు, ఉంగరములు, వల్లయూరులు, నల్లగాజులు, తగరపు కడియములు, పచ్చగాజుపూసలు, సంకుపూసలు, నల్లపూసల బన్నసరము, మున్నగు వానిని ధరించుచుండినట్లు తెలియుచున్నది (దీ ప్ర పు.—133-134)

ఉత్తిలములు. పోకవొత్తములు; గిల్లతిత్తులు, రాగిబిందెలు, పేరుపులు, కుండలు, కలతులు, గుళ్లగోరలు, గిండులు ,కమండలములు, గరిగళ్ల,బటువులు, కావళ్లు, గూడగర తిత్తులు మున్నగున ఆనాడు నీరు నింపుకొను పాత్రలు (పం. చ — పర్వ. ప్ర. పు 354)

పండితారాధ్య చరిత్రవలన పిచ్చుక కుంట్ల వారను నొక తెగవారుండినట్లు తెలియుచున్నది నేడువారు రెడ్ల గోత్రాలను తంబురాపై పాటలుగా చెప్పుచుందురు పాల్కురికి సోమనాథుని కాలములో వీరు వికలాంగులైన బిచ్చగాండ్రు.

"... ... మాకు
లేవంగ చేతులు లేవయ్యా, నడచి
పోవంగ గాళ్ళను లేవయ్య, అంధ
కులమయ్య పిచ్చుక గుంటులమయ్య
దానమొసంగరే ధర్మాత్ములార"

అని బిచ్చమెత్తినారు. (పం.చ 2—పు 348)

ఆ కాలమున నిష్కము వాడుకలో నుండెను. ఒక కర్ణాటక వేశ్య తన రేటు "శాటీహాటక నిష్కము" అని చెప్పినది 'శాటీ అనగా చీర'

'తార మొసంగరే ధర్మాత్ములార' అని ఒక పిచ్చుక కుంటు వేడెను. (పం చ.2—పు—307) ధాన్యం కొలతలో ఇరుస కుంచము, తూము అనునవి ఉండెను ఆనాడు జనులెక్కి గిర్రున తిరిగిన రంగుల రాట్న ముండినది.

"చటుల సంస్కృతి జీవఘట చక్రకర్మ
పటుపరివర్తన భ్రమణంబు గూర్చి
కీలువొందించి యా క్రియ రాటనముల
వాలి యాడించు నా వడ్రంగి యతడు" (బ.సు.)

శైవ సంప్రదాయములలో నందికోల ఆటయుండెను. అది నేడును కార్తిక మాసమున జరుగును.

గౌరన నవనాథ చరిత్రవలన కూడ ఆనాటి సంఘ జీవితము కొంత తెలియుచున్నది ఆనాడు గొల్లవాండ్రు, "పిలిపాగ, మొలలో పెట్టుకొన్న పిల్లగ్రోలు, మూపున గొడ్డలి, ముసుగువేసికొన్న గొంగడి, చేత గుదియ, మెడలో గురిజల పేర్లు, బొంగుకోల కాసెదట్టి, బెబ్బులివాకట్టు బదనికలు, బిగించి చుట్టిన ఉరిత్రాడు, జింకకొమ్ము, కాపుకుక్కల" ను గలిగి యుండెడి వారు. గౌరన పుళిందాదుల వేషములను కూడ వర్ణించినాడు (8 ఆ—పు. 123)

గౌరన హరిశ్చంద్రోపాఖ్యానము వలన, ఆనాడు మాడలు, సువర్ణ నిష్కములు వాడుకలోనుండినట్లు తెలియుచున్నది.

"ఎఱిగిరే తలవరు లిప్పుడే వట్టికొఱుత నెట్టదురోరి", యనుట వలన నీతని కాలమున చోరులకు కొఱుతలు వేయబడుచుండినట్లు తెలియుచున్నది.

కట్టు గొట్టును బడి కర కరి కోర్చి,
చట్టు వెట్టిన మోచిసరి యాకనుండ,

యనుట వలన, నపరాధకులను దండించుటకు, వారిపై చట్రాతులను పెట్టి ఘోషించుచుండినట్లు భావింప వచ్చును.

సుభద్రా కల్యాణము వలన, ఆనాటి స్త్రీల యాభరణములు అలంకార విధానములు తెలియుచున్నవి. జవ్వనియైన సుభద్ర, బొమ్మ పెండ్లిండ్లు చేసి ఆడుకొనుచుండినది పూర్వపు కన్యలందరు బొమ్మ పెండ్లిండ్లు చేసి ఆడుకొనుచుండినట్లు మనకనేక కావ్యములలో నిదర్శనములున్నవి ఈమె చెప్పిన ఆభరణములు, పసిడి ముత్యాలు పెట్టిన పూర్ణచంద్రుడు, తాటంకాలు, ముత్తెంపు కొలికి, ఇంకను అనేకములైన హారములు, ఒడ్డాణము, బిల్లల మొలనూళ్లు, కాలిపెండె, అందెలు, నెలవంక తాయతులు, పుంజుల కమ్మలు, ముక్కర — మొదలగునవి.

సుభద్ర, కమ్మకస్తురి నలుగిడి, గొజ్జగినీట జలకమాడి, చెంగావి పావడ చుంగు విడిచి కట్టి, జారముడిచిన కొప్పులో మల్లెలు, జాజులు, సంపంగి, పారిజాతములను పెట్టికొని, గుమ్మడి గింజనామము దీర్చి, గోవ కస్తురి ఒడల బూసి, కపుర పీడెంబు గావించి" "అర్జునుని సేవించుట కేగినదట !

చిన్నన్న కాలమున అనగా, 1540 ప్రాంతమున (విజయనగర రాజుల కాలమున) కరణములు, బొక్కసము ధనమునకు లెక్కలు వ్రాయుచు సరి చూచుచుండిరని పరమయోగి విలాసము వలన తెలియుచున్నది తిరుమంగై యాళ్వారు తన ధనము నంతటిని వెచ్చించినట్లు తెలిసికొని రాజు కరణములను పిలిపించి,

"అకట యెన్నాళ్ళాయె నౌకార ; నగరి
కొకకాసు చెల్లింప కున్నాడటంచు

గిరములు మీసలొక్కట దీటికొనుచు
బెరయంగ గరణాల బిలువు డటన్న"

ముఖ్య కరణములకు సంప్రతులని పేరుండినట్లు డా. నేలటూరి వెంకటరమణయ్యగారు చెప్పిరి.

"The word Samprati is defined as the head Karanam or the chief accountant who is at the head of the Several Karanams or accountants The nine Sampratis of Rayavacaka should be taken to mean the nine chief secretaries to the government The nature of these nine Sampratis is no where clearly defined." [5]

కరణముల వేషము లీ విధముగ నుండినట్లు తెలియుచున్నది.

"పనమించు తెలి వలిపంపు బింజియలు
పొసగ జుట్టిన యట్టి బోడకుల్లాలు (అనగా చిన్నటోపీలు)
చింపి కుప్పసములు చెవి దోరములును
సంపుటంబుల తోడ జంపాడు నాడలు
బిగువుగా జంప దోపిన బలపములు
తగ నలవడగ నత్తటి గిరణికులు
చనుదెంచి "

ఇదే విధముగ నీతడు రెడ్డి, కాపు, వైద్యులు, మొదలగు వారి వేషములను వర్ణించినాడు.

## రెడ్డి వేషవర్ణన

"పసపు చుంగుల తలపాసెపట్టంబు
కసి బిసి మెసగు బాగాల పీడియము
మిన్న దేరెడు దొడ్డ మొల నూలు మిగుల
వన్నియగల మాధపశిపచ్ఛదంబు
వలకేల గన పట్టువంకుటుంగరము" (ప. యో. పి—6 అ.పు.400)

5 హిసరీ ఆఫ్ ఆగపీడు డెగాసీ

## వైద్యుల వేషవర్ణన

"చంక మందుల సంచి జగజంపు వలువ
పొంకమై నిజకర్ణముల నొప్పదూది,
కునిపడ జుట్టిన కుళ్ళు మాపు పాగ
యనువంద పంచ లోహపు టుంగరము
నురుతలం బైనట్టి యూర్ధ్వ పుండ్రంబు
కరమొప్పు వలకేలి కరక కాయలును
బెరయ పచ్చడముతో బెంపడ సందె
నగరను పట్టు బాహాట పుస్తకము
బనుసడలో గుణ పాఠంబు జదివి,
కొనుచు మూలికలు దిక్కుల జూచి
... ... కొనుచు
... ... ధన్వంతరి కెనయైన వైద్యుడు"

ఇదే విధముగ, కాసె వారిని, మేదరవారిని పరదేశముల సెట్లను వర్ణించినాడు.

మేదర వారిని గూర్చి మొట్టమొదట దెల్పినది పరమయోగి విలాసము లోనే, "మేదరవారు తెలుగువారు కారు. వారు అరవలుగా కనుపింతురు. రాయల కాలమునాడే వారి భాష వేరుగానుండెను. అడవిలో ఒక బాలుని ఆక్రందనమును మేదరవారు విని—

"అలించి మూర్ఛాలమని సంశయించి,
పొక్క వాక్కని తమ భాష జెప్పుచును"

అనుటచే, వారి భాష వేరనుట స్పష్టము. తెలుగు దేశమందలి మేదరి వారు తెలుగు భాషనే మాట్లాడుదురు కాని కొందరు, ఈత బరిగెలతో, బుట్టలల్లు ఎడుకల వారుమాత్రము చెడిన అరవము మాట్లాడుదురు "[6]

---

6 ఆంధ్రుల సాంఘిక చరిత్ర, పు. 64

ఆ కాలమందు వస్తువులు దిగుమతి యగుచుండినట్లు తెలియుచున్నది.

"ఆటకు మిక్కిలి చేరువగు వయోరాశి
తట సమీపమున నిత్యంబు నోడలను
బచ్చ కప్పురమును బట్టు బట్టలును,
బచ్చి కస్తురి మేల్మి పసిడి యిట్టికెలు,
మణులు జంద్రాననా మణులు బటీర
కటములు మొదలుగా గల వస్తువులు"

ఇదే విధముగ భోగమువారి వర్ణన. వారు పన్ను జీతులు, బోగము స్త్రీల వృద్ధ మాతల కఱకు దనము, వారియొద్ద నుండు దాసీగణము, తొండరప్పొడి యాళ్వారు చరిత్ర సందర్భమున వర్ణించినాడు.

సిద్ధేశ్వర చరిత్రను చారిత్రక కావ్యముగ కంటె కూడ ఆనాటి సాంఘిక జీవిత చరిత్రను ప్రతిబింబింప జేయు గ్రంథముగ భావింప వలెను. ఆనాటి సాంఘికచరిత్రనుదెల్పుగ్రంథము ఇంతవరకు క్రీడాభిరామమొక్కటిమాత్రమే. ప్రతాప సిద్ధేశ్వర చరిత్రలు కూడ ఈ విషయములను వివరించుచున్నవి. ఈ రెండుగ్రంథములు నించుమించు కావ్యప్రక్రియలలో నడచినందున కొన్ని సంగతులతిశయోక్తులుగా నుండవచ్చును గాని మొత్తముమీద ఆ నాటి సాంఘిక విషయములను దెల్పుచున్నవి. ఆ నాడా రాజ్యమున నుండిన నానా వర్ణముల వారి సంఖ్య లీయబడినవి.

| | ఇండ్ల సంఖ్య |
|---|---|
| వేదవేదాంగ పారగులగు విప్రుల గృహములు | 18 వేలు |
| రాజద్వారంబు దీర్చు గణికల యిండ్లు | 2 వేలు |
| రణ రంగ చతురులైన క్షత్రియులు | 2 వేలు |
| వైశ్యులు | 30 వేలు |
| కోటికి పడగలెత్తిన వైశ్యులు | 320 |
| పగ నా-గ-కులు | 7 |

| | |
|---|---|
| కాచవర్ణ పంచ లోహ ప్రముఖులైనవారు | 1,50,000 |
| గొల్లవారు | 8,000 |
| కాపులు | 4,000 |
| తెలకులు | 3,500 |
| బెస్తవారు | 16,000 |
| తెనుగయిండ్లు (వీరినే ముత్రాసీ లేక ముత్రాజులందురు) | 6,500 |
| బుక్కాయిండ్లు (బుక్కా-గుండ వంటివానినితయారీచేయువారు) | 6,300 |
| పెరికె కరిణలు (పంటలను మున్నగు వానిని తీసికొని పోవు బండ్లను తయారు చేయువారు) | 8,500 |
| ముచ్చెయిండ్లు (సుంకమును వసూలు చేయువారు) | 13,000 |
| కక్షారకులు (?) (చాకలి వారేమొ ?) | 50,000 |
| వేశ్యా గృహములు | 6,000 |
| ప్రవాసులైన వారికి వండిపెట్టు వంటలక్కలు | 5,000 |
| బలిజలు (కాపులలో శాఖ) | 4,000 |
| రుద్ర జియ్యలు | 15,000 |

ఇంకను పంచాణమువారు కూడ ఉండిరి వారిసంఖ్య సిద్ధేశ్వర చరిత్రలో నీయలేదు క్రీడాభిరామమున 'మోహరివాడ' ప్రస్తావించబడినను శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు మోహరివాడయందు సైనికుల వస్త్రములను తయారు చేయుదురని చెప్పిరి. ఈ పదము మోహరమునుండి వచ్చినదై యుండును ఇటులే మేదరవాండ్ల, ఈడిగల గృహముల సంఖ్య ఈ గ్రంథమున లేదు

| దేవాలయముల సంఖ్య యీయబడినది | సంఖ్య |
|---|---|
| శివాలయములు | 5,500 |
| విష్ణ్వాలయములు | 1,500 |
| మైలారు దుర్గ, భైరవ, గణపతి, వీరభద్ర నివాసములు | 4,500 |
| నిస్సాణములు (దేవాలయమంటపలి బాజాలు) | 2,500 |
| గుడులమీది పసిడి కుండలు | 5,500 |
| గుడి దీపములకు నూనె | 26 పుట్లు |

| | |
|---|---|
| నగరి దీపములకు బ్రాహ్మణ సంతర్పణలకు ఘనసార చందన పరిమళ ద్రవ్యాదులకు | నిత్యము 10 వేల వరహాలు |
| గోపురములు, శంఖములు మున్నగునవి | 10,000 (సిద్ధేశ్వర చరిత్రలోలేదు) |
| యోజన విస్తారమై నానావస్తు శోభితమైన అంగళ్లు | 300 |
| పురంబునకు చుట్టుగల వీరభట నివాసములు | 300 |
| గూడెంబులు | 500 |
| ప్రతాపరుద్రుని యాస్థానమున | 77 గురు |
| పద్మనాయకులు, మల్లికార్జున భట్టు మొదలగు బంగారు పల్లకి నెక్కివచ్చు బ్రాహ్మణవిద్వాంసులు | 150 |
| పరిహాసకులు—లోక బాచయ్యలు మున్నగువారు | 40 |
| శంకరరాజు, కేదారరాజు, మొదలగు సాహస విక్రమార్కులు త్తమక్షత్రియులు | 500 |
| వేశ్యలు[7] | 200 |
| ఇంకను బిరుదు పాత్రలు, భరతకథలు, అచ్చాదేవి, సర్వ (స్వర) మండలచక్రవర్తి (గానకళాప్రవీణులేమొ) చిలుకలపలుకల త్రిపురారి మొదలగువారు | 8,000 |
| భాస్కరుడు మున్నగు కవీశ్వరులు | 200 |
| వేదాంగ పారగులకు పురోహితులు | 100 |
| వందిమాగధ స్తోత్ర పారకులు | 200 |

ప్రతాపరుద్రుని యాస్థానమున శ్రీరంగమ దేవుండు, రుద్రదేవుడు పినకూచి రుద్రదేవుడు నిడదవోలు చండా దేవుందు, ఇందులూరి అన్నమ దేవుడు, పెద్దతలారి సిశ్శంక వల్లభుడు (Chief Commissioner of the City of Warrangal), నానా దేశాధిపతులును, రాయబారులును, అశ్వ

---

7. క్రీడాభిరామమునందు మాచల్దేవి ప్రతాపరుద్రుని వేశ్యయని చెప్ప బడినది.

ములకు పెద్దయయిన నాహిణి మారయ్య, నవలక్ష ధనుర్ధరులకు పెద్దయయి, కొలిపాక సీనయ్య మన బోతుకు పల్లాయి గట్టి యెక్కవచ్చు నూర్గురు అయిదు వేలమంది సభను సరిచూచువారు, శివదేవయ్య, శరభాంకుడు మల్లికార్జునుడు, పాలకుర్తి సూరప్ప మొదలగువారుండిరి. ప్రధాన వర్గముతో ప్రతాపరుద్రుడు సభ దీర్చియున్న మధ్యాహ్న సమయమున అయిదు వేల శివాలయములందును, పదుమూడువందల విష్ణ్వాలయములందును ఇతర దుర్గా, గణపతి, భైరవాది దేవాలయములందును దేవతలకు నివేదింప బడిన ప్రసాదమును అధికారులు పచ్చల పల్లకీలలో తేగా ప్రతాపరుద్రుడు సింహాసనమునుండి దిగి అంతఃపురమున భోజనశాలకేగి తన తమ్ముడగు అన్నమదేవుడు డెబ్బది యేడ్గురు పద్మనాయకులు ఒక పంక్తిని గూర్చుండి నానావిధ పదార్థములతో నారగించును

జనుల యభియోగములను రాజు స్వయముగ వినును సాయంకాలము సభ దీర్చి కొంత సమయమును వినోదములతో గడుపును వ్యాఘ్ర భల్లూక యుద్ధములు, జట్టి మల్లుర పెనుగులాట, పుణ్యకథా శ్రవణము, నాటకాలంకార శబ్ద శాస్త్రముల వాదనలు, పరిహాసకుల వాక్యములు, వారాంగనా నృత్య గీత వినోదములు మొదలగువానితో కాలక్షేపము గావించును సాయంకాలము నగరు వెళ్ళి వచ్చు సమయమున పరివార సమేతుడై మూడువేల అయిదు వందల కరదీపికలు తన వెంట రాగా శివాలయముల కేగి శివుని పూజించి శంభు లీలా విలాసములను వినుచు ప్రదక్షిణత్రయము గావించి శంభు లింగమునకు సాష్టాంగ దండప్రణామము లాచరించి ఒక్క యామమట గడిపి, అంతఃపురమున కేతెంచును అట సకల జనముల నుచిత స్థానములకు పంపివైచి, పెద్ద తలారియైన నిశ్శంక వల్లభునితో రెండు గడియలు కార్యాలోచన గావించి విశ్రమించును. ఇది ప్రతాపరుద్రుని నిత్య కృత్యము

ఈతనికి వచ్చు ఆదాయము, అగు వ్యయము కూడ వివరింపబడినది

కటక వల్లభుడు, లోనుగాగల చిల్లర వల్లభులిచ్చు

| | |
|---|---|
| అప్పనములు | ౨౪ కోట్లు |
| తన రాజ్యమున వచ్చు రొఖము | 20 కోట్లు |

బ్రాహ్మణుల కగ్రహారము లుండినవి

| | |
|---|---|
| దేవతా వైభవములకు | 2 వేల గ్రామములు |

| అతని భండారమునకు వచ్చు 44 కోట్ల ద్రవ్యమునకు | వ్యయము |
|---|---|
| నిత్యవైభవమునకు గంధ కర్పూర కాశ్మీర జవ్వాది పరిమళ ద్రవ్యంబులకు, పంక్తి భోజనములకు, నగరి దీపములకు (వెలుంగులకు) నానాదేశముల నుండి విద్యార్థులకు ప్రతి వర్షము పంచి పెట్టినది | 8 కోట్ల 60 లక్షలు |
| పురమునుగాచు సిశ్శంక వల్లభునకు, అతని పరివారమునకును, జీతము | 8-,20,000 |
| అన్న సత్రములకు (100) | 1,00,000 |
| ద్విజులకు | కోటి, 20 లక్షలు |
| నగరి మొగసాలకొల్చు నవలక్ష ధనుర్ధరులకు, సంవత్సరమునకు | 3 కోట్ల 80 లక్షలు |
| గజాశ్వ రక్షకుల జీతము | 2 కోట్ల 60 లక్షలు |
| ఏకశిలానగరమందలి దేవాలయములకు | 1 కోటి |
| వారణాసి విశ్వేశ్వరుడు, శ్రీశైలమల్లికార్జున, శ్రీ వేంకటేశ్వర, శ్రీ రంగనాయక, ఏకామ్రేశ్వర, రామేశ్వర, గోకర్ణేశ్వర దేవాలయములకు | 3 కోట్లు |
| నగరిలో రాజగృహములు గట్టు పనివారికి సంవత్సరమునకు | 1 కోటి |

ప్రతాపరుద్రుని సామ్రాజ్యము సకల భోగ భాగ్యములతో తులతూగు చుండినది. జనులు సర్వ సౌఖ్యములను కల్గియుండిరి. ప్రతాపరుద్రుడు సాక్షాత్తు రుద్రుడుగాని మర్త్యుడుగాడని ప్రబలంగ దు [illegible] చుండిరి ఆతడు విదేశ వ్యాపారమును బాగుగ వృద్ధి పరచినట్లు ప్రమాణ [illegible]ముగ గలదు. అతడు రెండువేల నౌకలను నిర్మించెను. తన ప్రాంత వ్యాపారమును వృద్ధి చేయుటయే ఈతని తలంపై యుండెను వ్యాపారముల వలన నాతని కోశాగారమున కెంతయో యాదాయము లభించు చుండెడిది. రాజులు సీమ ప్రాంతమందలి యడవులను

నరికించి సస్యశ్యామమలగు భూములుగ మార్పించెను. అట గ్రామములను నిర్మించి అనుమకొండ యధికారులను కొందరిసి అట ఉంచెను. ఈ కాలము నందలి నాణెము లేవో తెలియదు. వరహాలు వాడుక యందున్నట్లుగ నున్నది. నికషములు, చిన్నలు, రూకలు, అని పిల్వబడుచుండినట్లు తెలియుచున్నది.

## విద్యా వినోదములు

ప్రతాపరుద్రుడు తన తాతల వలె నిర్మాణాది కార్యముల నెక్కుడుగ జేసినట్లు గానరాదు. అతడు కవి పండితుల ననేకులను తన యాస్థానమున పోషించినాడు దీనికి కారణము బహుశః అతడు పరిపూర్ణవిద్యావంతు డగుటయే యయి యుండును విదేశములనుండి వచ్చు విద్యార్థులకు కూడ తన నగరమున విద్యా సౌకర్యములను కల్పించినట్లు తెలియుచున్నది. క్రీ.శ 1261 సంవత్సరమునాటి మాల్కాపుర శాసనమున ఆనాడు నేర్పబడిన విద్యలు చెప్పబడినవి

ఓరుగల్లునందు సంగీత సాహిత్య విద్యాలయము లుండినవనియు, ద్వార సముద్రము నందు రాజనీతి విద్యాలయములుండెడివనియు చేకుమళ్ళ అచ్యుత రావుగారు చెప్పిరి [8]

ఆనాడు జ్యోతిష శాస్త్రము మంచి ఉచ్ఛదశయందుండి గౌరవమును పొందుచుండెనని చెప్పవచ్చును. ప్రతాపరుద్రుని యాస్థానమున పంచాణము వారికి రుద్రజయ్యయకు జ్యోతిషశాస్త్ర సంబంధ విషయమున జరిగిన స్పర్థవలన ఈ సంగతి తెలియుచున్నది.

శాకవెల్లి మల్లికార్జున భట్టాతని యాస్థాన పండితుడు. ఈతడు నిరోష్ఠ్య రామాయణమును రచించెను ఈతడు దైవశక్తులను గల్గి యుండినట్లుగ జెప్ప బడినది ఒక దినమీతనితో వాదించుటకు సుదర్శన మిత్రుడు దక్షిణదేశము నుండి యేతెంచెను ఏకశిలానగర విద్వాంసులాతని వాదమున నోడించిరి. అపుడాతదు కపటోపాయముచేతను, కారుమాటల చేతనైనను గెల్చెదనని

---

8. కాకతీయ సంచిక, పుట. 243.

ప్రతిన పూని "రేపు అమావాస్య నష్టచంద్రుడు ఇది నిజంబు మీఱలందరు కాదనుడ"ని పల్కగా ఆటగల విద్వాంసులందరాతనిని చూచి "రేపు నష్ట చంద్రుడు గాడు, సంపూర్ణచంద్రుడు ఇది నిజము" అని పల్కిరి అపుడు శాకవెల్లి మల్లికార్జునుడు భద్రకాళీదేవి నారాధించి మర్నాడు (వాస్తమున కానా డమావాస్య) పౌర్ణమి యగునట్లుగ వరమును బడసినాడు. దీనిని గని సుదర్శన మిత్రుడు అతనివద్ద కేతెంచి 'నాదిమానుష ప్రజ్ఞ మీకును మాకును హస్తిమశ కాంతరంబు గాదె నాయపరాధము క్షమింపు' దని పల్కెను. అపుడువారు సుదర్శన మిత్రుని గౌరవించి లక్ష వరహాలను ఇచ్చినారు. ప్రతాపరుద్రుడు మల్లికార్జున భట్టును బ్రహ్మరథం బెక్కించినాడు విప్రులకు పది లక్షల వర హాలు సమర్పించినాడు

ప్రతాపరుద్రుని కాలమున మొల్ల రామాయణము, భాస్కర రామాయ ణము, శాకవెల్లి మల్లికార్జునుని నిరోష్ఠ్య రామాయణము, రంగనాధ రామాయణము రచింప బడినట్లిందు చెప్పబడినది మొల్ల మొదట వచన రామాయణమును వ్రాయగా నది శూద్ర కవిత్వమని ఆటగల విప్రులు నిషేధించిరట. సర్వజ్ఞుడు కావున రాజు బ్రాహ్మణ కృతమైన రామాయణము కావలెననెనట అపుడు భాస్కరుడు రామాయణమును రచించెను మొల్ల మరల నేతెంచి తన రామా యణమున నొక పద్యమును రాజునకు విన్పింపగా నాతడామెను విశాలాక్షి వద్దకు పంపినాడట ఆమె కొక పల్లకిని, నగరున నిత్య జీవితంబును కట్టడ జేసినాడు. ఈ వార్త విని శాకవెల్లి మల్లికార్జునుడు నిరోష్ఠ్య రామాయణమును రచించినాడట.

రంగనాధుని చరిత్ర విషయమున నాతడు శివమందిరములు చూడ నొల్ల నందున కండ్లు పోవుట. శివునిపై రగడ చెప్పుట వలన మరల కన్నులు వచ్చుట, పాల్కురికి సోమనాధునివద్ద దీక్ష వడయుట, మున్నగుకథ యంతయు చెప్పబడినది

పాల్కురికి సోమనాధుని చరిత్రమున నాతనిని ధూర్త విప్రులు 'పాల కుర్తి సోమనాధుండు చెప్పినవి నూతనంబులు గాని యాద్యంతరంబులు గావు'

అని నిరాకరణ పూర్వకముగా పల్కగా ప్రతాపరుద్రుడూరకుండెనట. పాల కుర్కి సోమన పండితారాధ్య చరిత్ర ప్రతాపరుద్రుడు వినుచుండగా పై మాట లను వారాతనితో పల్కిరి ఈ సంగతిని శివభక్తులు సోమన కెరిగింపగా నాతడు బండియందు కూర్చుని శైవేతరులు చూడకుండునట్లుగ మూయించుకొని ఏక శిలానగరమునకు వచ్చుచుండెను. ఏకశిలానగరపు గవనివద్ద అడ్డ దూలమున జేసిన భవిప్రతిమయు రెండు ఏనుగులును ఉండుటవలన బండి యెద్దులు లోనికి వెడల కుండెను. అపుడు పాల్కురికి సోమన 'తొలగు'డని పల్కగా నవి యిరు గడలపడి పోయినవట ఈ వార్తను ప్రతాపరుద్రుడు విని మిక్కిలి విస్మయ మంది ఆతని ప్రభావమును మెచ్చికొనినాడు కాని ధూర్తులది మంత్ర విద్యగాని వాక్య సిద్ధిగాదని తెల్పి, కొంచరు అంగ హీనులకు విభూతి రుద్రాక్షలను దాల్ప జేసి సోమనను పరిహాసము చేయనంపినాదని యాతనివద్దకు పంపిరి అపుడు వారు సోమన వద్దకేగగా అతని ప్రభావము వలన వారు నిజముగనే శివదీక్షి తులైరి ఇందులూరి అన్నమయ్య యీలని శిష్యుడు ప్రతాపరుద్రుని సోమ నాథుడు భాగీరథీజలంబుల శివ లింగము నభిషేకము జేసిగాని కుడువనను వ్రతమును పట్టుమని చెప్పెను. అతడటులే చేయుచుండెను. శివుడాతని పరీ క్షింపగోరి ఏడు దినములు పెద్ద వర్షమును కురియించి భాగీరథీ జలములు తెచ్చుటకు వీలు పడకుండ జేసెను అపుడు ప్రతాపరుద్రుడు స్వయముగ భాగీరథీ జలములను తెచ్చుటకు బయలుదేరెను కాని యాతడు వెడల లేక శివుని "శంభులింగా, మహాదేవా, నీలకంఠా, మృత్యుంజయా, కైలాస వాసా యని ప్రార్థింపగా నందివాహనారూఢుడై న శివుడు ప్రమథగణములతో గూడ ప్రత్యక్షమై యాతనికి వరము నొసగెదననినాడు ప్రతాపరుద్రుడు తనకు వ్రతభంగము కాకుండ నుండునట్లుగ వరము నిమ్మని వేడికొనినాడు శివు డందులకు ప్రసన్నుడై ఆతని పురమున కుత్తరమున ఒక క్రోసు దూరమున భాగీరథీ జలంబులతో సమానమైన బుగ్గ గలదనియు, దానివలన నాతని వ్రతము చెల్లుచుండుననియు చెప్పినాడు శివుడు ప్రసన్నమైన స్థలమున నొక శివాలయ మును ప్రతాపరుద్రుడు నిర్మించెను ఓరుగల్లు పట్టణమునకు రెండుమైళ్ల ఉత్తర మున గల 'కాశీబుగ్గ'ను మాహాత్మ్యము నాపాదించుటకే కథ కల్పింపబడి యుండునని కొందరి యభిప్రాయము. పాల్కురికి సోమనాథుడు తనకాలదేశమున

వ్రతములు చెల్లవనియు, దక్షిణ దేశమునకు పోయెదననియు పల్కగా ప్రతాప రుద్రుడాతనికి 'గొట్టిపర్ర'ను గ్రామమును అగ్రహారముగ నిచ్చినాడు సోమన రంగనాథునితో నటకేగినాడు.

ఈ చక్రవర్తి యాస్థానమున కృష్ణమాచారికూడ నుండినట్లు చెప్పబడినది ఈతడు విష్ణుమూర్తిని స్తోత్రము చేయుచు వచనములను వ్రాసెను వానిని రాగి రేకులపై వ్రాసినట్లిందు చెప్పబడినదిగాని, యది యథార్థము కాదేమోఅని అనిపించుచున్నది. వీనిని రాగిరేకులపై వ్రాయించినట్లెక్కడను పేర్కొనబడ లేదు. తాళ్ళపాక అన్నమాచార్యులు సంకీర్తనములను రాగిరేకులపై వ్రాయించెనను విషయమును విని కవి యిట్లు వ్రాసి యుండును కృష్ణమాచారి సింహగిరి వచనములను రచించినాడు. ఇవి "సింహగిరి నరసింహ నమోనమో దయానిధీ" అను మకుటమును గల్గి యున్నవి ఈ వచనములనునవి గద్య రూపమున నున్న శతకముల వంటివే. వీనియందుగూడ శతకములలోవలె మకుట నియమము, సంఖ్యానియమము ఉండదు ఇవికూడ దేవతాస్తుతి పర ముగ నుండును

ఈతడు 'నమోనమో లక్ష్మీ వల్లభా' యను మకుటముతో విన్నపములను గూడ రచించెను ఈవిన్నపములు శఠకోపముని ద్రావిడ వేదమునకు ఆంధ్రీ కరణములు. ఈతడు ద్రావిడవేదము నాంధ్రీకరించినట్లు తాళ్ళపాక చిన్నన్న పరమయోగివిలాసము అవతారికలో

"శఠమతరాద్ధాంత సంహారియైన
శఠకోపముని బోలు శఠకోపమౌని
వేదంబు తెనుగు గావించి సంసార
ఖేదంబు మాన్చిన కృష్ణమాచార్యు" అని చెప్పినాడు

ద్విపద భారత కర్త కాలసరస్వతి కాలమునాటికీ క్రిందివస్త్రముల రకము లన్నియు వ్యాప్తిలో నుండి యుండును. శ్రీకృష్ణుని ప్రార్థింపగా ద్రౌపది కటి ప్రదేశమున నీ రకముల వస్త్రములన్నియు దృశ్యమానములయినవట

"పట్టు చీరలు వెలిపట్టు చీరలును,
దట్టపు పులిగోరుతరము చీరలును
చెల్లారు వన్నెలు జిలుగు చీరలును
నల్లగంటుకులు సన్నంపు వస్త్రములు
కస్తూరి మళ్లను గందు చీరలును
విస్తారమగు తమ్మి విరుల చీరలును
రుద్రాక్ష వన్నెలురూఢిమై నొప్ప
భద్రాక్ష వన్నెల బడగంపు వన్నె" లు గల చీరలు వచ్చినవి.

## పల్నాటి వీర చరిత్ర — ఆనాటి సాంఘిక పరిస్థితులు

ఈ యుద్ధకాలమునాటికి హైహయ సంతతి వారైన అనుగు రాజాదులు పల్నాడును పాలించుచున్నట్లు తెలియుచున్నది వీరు కాక ఆ సమయమున కాకతీయులును, ధరణికోటను భీమదేవుదును పాలించుచున్నట్లు తెలిసికొంటిమి పశ్చిమ చాళుక్య రాజైన రెండవతైలపుని సింహాసన భ్రష్టుని గావించి కలచుర్య వంశస్థుడగు బిజ్జలుడాక్రమింప ఈ యుద్ధకాలము నాటికావంశమువారే రాజ్యము చేయుచుండిరి. గొంకరాజు మొదలగు వెలనాటి చోడులు వెలనాడును పాలించుచుండిరి. ఈవిధముగ నాకాలమున రాజకీయ పరిస్థితి కొంత అల్లకల్లోలముగ నుండెను.

## మతము

శైవ, వైష్ణవ మతముల మధ్య జరిగిన సంఘర్షణమే పల్నాటి యుద్ధమునకు కారణమని కొందరి తలంపు కాని యీవిషయము నిదమిత్థముగా జెప్పుట కష్టము. బ్రహ్మనాయుడు పల్నాటి విష్ణువనియు,సాక్షాద్విష్ణుని అవతారమనియు భావింపబడినను అతడు శివద్వేషి మాత్రము గాడు. శక్తి, వీరభద్రుడు, ఇత్యాది దేవతలయెడ నాతనికి భక్తిభావమేగాని ద్వేషము లేనట్లీ గ్రంథము వలన తెలియుచున్నది త్రిపురాంతకముసుండి భూతరాట్కాంబమును తరలించు సందర్భమున అతడు శివునిస్తుతించిన విధమువలన అతని శివభక్తి వెల్లడి యగుచున్నది

ఆనాడు కుల విపక్షత లేకుండ నందరికిని వైష్ణవదీక్ష యొసగబడు చున్నట్లు అర్ధరాత్రి కన్నమ యుద్ధభూమి యందు ఎరుకల సానితో పలికిన

"కలికి కృష్ణుండైన కారుణ్యమూర్తి
పుట్టెను బ్రహ్మన భూలోకమందు
అతనికి దాసుడ నౌదును నేను
మాలలకును బుట్టి మాలనై పోక
విష్ణు పాదము బట్టి విశ్వంబులోన"

ఈ వాక్యముల వలన తెలియుచున్నది. కేవలము నాల్గు జాతుల వారు మాత్రమే గాక, మాల మాదిగలు కూడ ఆ దీక్ష ఎడయుట కర్హులైనట్లుగ నున్నది. అన్ని జాతులవారు మతములవారు కలసి మెలసి తిరుగుచుండినట్లు తెలియుచున్నది బాలచంద్రుడుసి సోదర వర్గములో నన్ని జాతుల వారును చేరిరి బ్రహ్మన కన్నమను కన్నకుమారునిగ స్వీకరించినాడు బ్రహ్మన పెట్టిన చాపకూడు కూడ దీనినే ఘోషించుచున్నది. చాపకూడు బహుశః 'కాస్మోపాలిటన్ డిన్నర్' వంటిదయి యుండును, బ్రహ్మన మాచెర్లలో చెన్నకేశవుని యాలయమును నిర్మించి తత్ప్రాంతమున వైష్ణవ మత వ్యాప్తికి కారకుడయి యుండును

శైవమప్పటికి దేశమున బాగుగ వేరూని నిల్చుటవలన నాయకురాలు నలగాముడు, (వారిపక్షము వారును) శైవులై యుండిన నుండవచ్చును ఒకవేళ వారు శైవులైనచో వైష్ణవుడైన బ్రహ్మనను నాయకురాలు ద్వేషించుటలో వింతలేదు. వీరశైవులు భవుల దర్శన స్పర్శ నాదికములను పరిహరింతురు గదా! అట్టియెన నీ మతముల సంఘర్షణమే ఈ యుద్ధమునకు కారణమని ఊహింప వచ్చును గాని "పీర చరిత్రమున నిట్లూహించుట కేమియు నాధారములు కాన వచ్చుటలేదు

9) జానపద గేయ సాహిత్యము, (డా బి. రామరాజు) పుట. 700

అప్పుడే రెడ్లకును వెలమలకును ప్రాబల్యము హెచ్చుచున్నట్లు కానబడు చున్నది. బ్రహ్మన మన్నగువారు వెలమలే.

శ్రీనాధుని చాటువుల వలన నట జొన్న పంట యధికముగ నున్నట్లును, అచటి ప్రజలకదియే ముఖ్యమగు నాహార మైనట్లును తెలియుచున్నది. ఈ గ్రంథమున అనుగురాజు పలనాటి సంవాదనమున "మంచి ముత్తెములట్లు మది కింపు గూర్పు. ఇటు వంటిజొన్నల నెన్నడు కనము" అని అనుగురాజు సేనానాయకులు పల్కుట పై యభిప్రాయమునే ధ్రువపరచుచున్నది

"మాకంత వరి మడి మూలకులేదు
తరగవు గాదెలు ధాన్యంబు హెచ్చి" అనుటవలన వరి కూడ నట పండుచుండినదని తెలిసికొనవచ్చును

## యుద్ధములు — ఆయుధ విశేషములు

దేశమున ప్రజల సంఖ్య అధికమైనపుడది కొంత తగ్గుటకు యుద్ధము లవసరమనియు అందుకు తగినట్లుగనే దైవికముగ నేదో యొక కారణము తటస్థపడుచుండుననియు మనవారి విశ్వాసము. విజ్ఞానమభివృద్ధి చెందిన నేడు అణుశక్తి వలన తయారు చేయబడిన బాంబులు యుద్ధమున నుపయోగింపబడు చున్నవిగాని పూర్వ మనేక విధములగు నాయుధముల నుపయోగించి యుద్ధ మొనర్చెడివారు ఆ నాటి యాయుధములలో కొన్ని మనకు తెలియనే తెలియవు అనుగురాజు నాయకులతో పోరాడుటకు సేనలను కూర్చుకొని రమ్మని ఊరకోటరాజు చెప్పగా వారు.

''చతురంగ బలములు సమకూర్చిరంత
ముసలముల్ గదలును ముద్గర చయము
వెస భిండి వాలముల్ విచ్చు కత్తులును
పరిఘలు చక్రముల్ బాకు కటార్లు
అరుదుగ మెరయు చంద్రాయుధములును
పట్టి నాయకులెల్ల పయనంబు లైరి "

సేనలో చతురంగ బలములు నుండెడివి.

'కోళ్ళ పోరు — గోపన్న విరుగు'న గోప్పపై నలగాము బంట్లు

"పోయిన పోకలు బోయె మారులును
చందురు వంకలు చల్ల జంపులును
పొట్టల పొంగులు పుణ్యా తీర్థములు
ఎరి దైవములుపిల్లి యెను కల్విరులును
ఒక పెక్కు నమ్మలు ఓక పోకలును
తామర కూనలు తల్లి మెరుగులును
చీకటి మిణుగుర్లు చివురు గుండెలును
గుండె భీతిల్లెడి కూత పెట్టులును
కుత్తిక వీపులు కుప్పి కోలలును"

వేసిరట, గురిజాల కోటపై బ్రహ్మన యెత్తివచ్చినప్పుడు నలగాముడు అతనిపై

"వసి గొయ్య వడిసెలువాలు దొంకెనలు
తోరంపు కోలలు దొడ్డ యీటెలును
గసికెలు దూలాలు గాలి దుందుభులు"

వేయించినాడు బాల చంద్రుడు నరసింగును 'సామంత రాగోల'తో కొట్టి చంపినాడు. సైన్యమేగుచున్నప్పుడు రణభేరి ముందర మ్రోగుచుండును. ఊరకోట రాజు కుమారు డుత్తరునితో పోరాడుట కనుగురాజు బ్రహ్మనను రమ్మని లేఖ నంపగా నాతడు

"కదన భూమికి తాను కదలి పోవంగ
పట్టుటిజారును బాగుగా తొడిగి
కాసె మీదను వీర కాసె బిగించి
చుక్కల తలపాగ సొగసుగా తీర్చి
చంద్రకాంతి రుమాల చెలువ మరకట్టి
పచ్చ పువ్వుల బంతి పసిడి బాసికము

మోకాలి ఘల్లియ మోర చిక్కముును
కాలి బిరుదందెలు ఘనముగా గట్టి"

ఆయుధ హస్తుడై పయనమైనాడు ఆ నాటి సైనికుల వేషము లిట్లుండి యుండును రాజులు యుద్ధమునకు పోవునపుడుగూడ సపరివారముగ పోవు చుండిరి యుద్ధ విరామ సమయములలో వారు వినోదించుటకు కూడ తగిన యేర్పాట్లను గావించుకొనుచుండిరి, కార్యమపూడి కదన రంగమునకు నలగా ముడు మదకరీంద్రము నెక్కి బయలుదేరగా నాతని వెంట 'అయిదు విధముల నమరు వాద్యములు ... తరువాత నెలగోలు దళములు గదలె, కదలిరి దండు నుకై జీతగాండ్లును, బలము నల్దిక్కుల పటిమతో నడచెను,'' నాయకురాలు అధికార్లతో 'గొల్లెనల్ మొదలైన' గురుతర భార, నిచయంబులెల్లను నించిన, బండ్లు, శస్త్రాస్త్ర చయముల శకట సంఘంబు అంగళ్ళవారల నాడు పావలను, పరగ వంట యొనర్చు బానిస జనుల, ఆటపాటల చేత నలరించు వారి" పంపు మని ఆజ్ఞాపించినది ఇందలి ఆటపాటల వారు నృత్య గీతాదులచే రాజును సైని కులను యుద్ధ విరామ సమయంబులందు రంజిల్ల చేయుటకే

కార్యమపూడి యొద్ద విడిసిన నలగాముని దండులో ''నిఖిల వర్తకులు, సకల ధాన్యంబులు సకల రత్నములు, బంగారు, వెండియు బహుధనవితతి, షౌమ వస్త్రంబులు సరసంపు పట్టు, పటములు ఘనతంతు పటనిచయంబు, కాంస్య పిత్తడి తామ్ర ఘన భాండ తతులు రసపర్గములనెల్ల రంజకంబొప్ప, క్రయ విక్రయములు వెలయింతురెపుడు, సౌందర్య ఘనతచే సంపూర్ణమైన వేశ్యవాటిక యొప్ప విశదంబు లగుచు", ఆనాడు వేశ్యలు గూడ రాజులతో పాటు రణరంగ మున కేగి వారి కెప్పటివలె వినోదమును గూర్చుచుండెడివారు గాబోలు, దీనివలన ఆనాడు సంఘమున వేశ్యలకు గల స్థానమును, వారు నిర్వహించుచుండిన విశిష్ట మగు కార్యమును తెలియుచున్నది

కార్యమపూడికి కదలిన బ్రహ్మన సేనలో 'కాశ్మీర కస్తూరి గంధ కర్పూర, మాదియౌ వాసనలమరు పెట్టెలును, టెక్కసంబుల బర్వు టోన గాపట్లు, జవ్వాజి పిల్లుల, శారికాకీర, జంతముల్ పట్టెడి జన సమూహంబు'' లుండినవి

యుద్ధ విరామ సమయములందు కాలక్షేపము కొరకు నెత్తములాడు చుండి నట్లు కొమ్మరాజు యుద్ధమునందలి "ఆవేళనెత్తంబు లాడుచు నుండి, బ్రహ్మన యూరకె పక్కన నవ్వె'' అన్న వాక్యము వలన తెలియుచున్నది

యుద్ధ క్షేత్రమున నిరుపక్షముల వారికి సాక్షి భూతముగ నుండుట కొరక స్తంభమును పూజాదులుగావించి స్థాపించుచుండినట్లు తెలియుచున్నది. బ్రహ్మన త్రిపురాంతకము నుండి తరలించి తెచ్చిన భూతరాట్ స్తంభమును 'తులసి పత్రంబుల దొరగెడు తీర్థమచ్చోట చల్లించియతలరు లగ్నమున శంకు స్థాపన సమ్మతి జేసి,...తెచ్చిన కంబంబు ధీరతతోడ, నడికల నెత్తించె నర నాథ వరుడు,'' పిమ్మట దానికిపూజలుచేసి ధూపదీపనైవేద్యాదుల గావించి, 'అఖిల భూతంబుల కాచారముగను ఘనమైన పోతుగావు చెల్లించి'' నాడు. ఆ స్తంభమునకు పశు బలి గావించుట కూడ నాటి ఆచారమై యుండును

తరువాత నాగులేటి తీరాన గల మడుగు "పొంతకు జని వీరపుంగవు లెల్ల, తమతమ నామగోత్రము లుచ్చరించి, తానముల్ తగజేసి దరియందు నిలచి, నిలిపిరి లింగముల్ నియమంబు తోడ'' ఈ లింగ ప్రతిష్ఠాపనయు ఆనాటి శైవ మత సంప్రదాయమై యుండును, ''ఈ లింగము లిప్పటికిని గంగధారమడు గున నొడ్డున గుడిలో పూజలందుచున్నవి వీరుల స్మృతి చిహ్నముగా జరుగు జాతర, పూజ, మున్నగువానిలో ఈ విశేషము గూడ గలదు ఇచ్చట లింగము లనగా శివలింగములు కాదు. మలిదేవరాజు మరియు అతని యనుచర వీరవర్గ ముపై బ్రహ్మనాయని వైష్ణవ ప్రభావ మంత యుండగా వారు శివలింగ ప్రతి ష్ఠాపన మొనర్చిరని తలంపరాదు తమతమ పేరులతో లింగములు నిలిపిరను టచే తమనే నిలిపికొనిరని తలంప వలయును ఆ లింగములనే నేటి ప్రజలారా ధింతురు.'' [10]

ఈ లింగములు శివలింగములు గాక వీరులు తమ పేరున నిలిపిరు వైనచొ కావచ్చును. కాని బ్రహ్మనాయని వైష్ణవ ప్రభావమునకు లోనయి వారు శివ లింగముల నిల్పలేదని మనము చెప్పజాలము శైవమే దేశమునందు ప్రాబల్యమొం

---

10 జానపద గేయ సాహిత్యము, పుటలు 707-708.

దుండినది గాని వైష్ణవమప్పటికింకను బాగుగ వ్యాపించలేదు బ్రహ్మనాయడు ప్రతి వారికిని బలవంతముగా వైష్ణవము నిప్పించి వారిని తన పక్షము చేసికొను చుండెనని కూడ భావించ లేము ఎంత తన పక్షపు సైనికులైనను వారికంద రకును బలవంతపు వైష్ణవ మిప్పించి యుండడు ఎంతటి వాడైనను ప్రజాభి ప్రాయమున కనుగుణముగానే సంచరింపవలెను గాని విరుద్ధముగ సంచరించి కార్యసాధన చేయజాలడు లింగములు శివలింగములైనను లేక వీరులు తమ పేరున నిల్పుకొన్న వైనను నవి శైవమత చిహ్నములే యగుచున్నవి గాని వైష్ణవ మతముతో నించుకంతయు సంబంధము గలవి గావు బ్రహ్మనాయడు కూడ విష్ణు భక్తుడైనను శివ ద్వేషి కాడని ఆతని శక్తి, నంది, శివారాధనల వలన తెలియుచునే యున్నది. అందువలన వీరులు లింగములను స్థాపించినపు డాతడెట్టి యభ్యంతరమును పెట్టి యుండడు

యుద్ధములకు బోవుచు సుముహూర్తములను, జయ ముహూర్తములను విప్రుల చేతను, జ్యోతిష్కుల చేతను పెట్టించు కొనుచుండెడివారు యుద్ధమునకు బయలుదేరుచు మాతృదేవతల దీవెనలు గైకొనుచుండెడివారు బ్రహ్మన బయలు దేరుచు తల్లికి నమస్కరించి ఆమె యాశీర్వచనముల నందుకొనినాడు

## ఆచార వ్యవహారములు

'నలి పందెమున బ్రహ్మనాయని ఓడించుట కొరకని కోడిని చంపించుటకు నాగమ్మ కట్టుబోతులనుపించినది ఆనాడీ మంత్ర తంత్రములన్నియు ప్రయోగించు చుండెడివారని తెలియుచున్నది ఇవి నేటికిని విరళముగా నట నట నున్నటులే గాన నగును నాగమ్మ దయ్యాల మల్లయ్యను పిలిపించినది వానిపేరే దయ్యాల మల్లయ్య. అనగా భూతములను సాధించి ఆ శక్తిచే క్షుద్ర విద్యల నభ్యసించువాడై యుండును ఆ దయ్యాల మల్లయ్య "వాకట్టు, మరకట్టు, పొంగకట్టు, మూత పెట్టెడుకట్టు, కోపించుకట్టు, కాళ్ళను చేతులుకదనికట్టు, ప్రాణంబు పై బెడి బలువైనకట్టు, ఎంటి బోయెడి కట్టు, ఎగిరెడి కట్టు, వీధి బారెడు కట్టు, పెగిడెడుకట్టు" మొదలగు కట్లను నేర్చిన మాంత్రికుడు. వాడు జీవంబు గలవాని క్షణములో మంత్రించి చంపగలడు.

సంతానము లేని స్త్రీలు సంతానార్థమై పలు నోములను నోమి పుత్రులను బడసెడివారు భగవత్కృపవలన సంతానము గలుగు ననెడి నమ్మకము పూర్వుల కుండెడిది అనుగురాజు భార్యలు "విమవకపుడు వీరవిద్యల దేవి, సంతానమును కోరి సద్భక్తితోడ, చెన్నకేశవు నోముచేయగా పిదప పెద మల్లిదేవుడు, పినమలిదేవు, బాలమల్లుడనగ బాలురు కలిగిరి. "పార్వతీశుని నోము పట్టి నోమగను. భూగమాదేవికి పుట్టిరి సుతులు". బాలచంద్రుని కొరకు ఐతమ్మ నోచిన నోములు లెక్కలేనివి. ''సంతానమే లేక చాల కష్టించి, ఇలలోన నోములు ఎన్నెన్ని కలవో అన్ని నోచితి నని చెప్పినది. ఆమె గావించిన దానాదికములు గాక "గౌరీ మహేశ్వర ఘననామ శిఖరి ఎక్కియు గోమితి నేలేశ్వరమున దిగి వచ్చి నోమితి తిలపర్వతమున, విధి వెలుగను నోము వెలయ నోమితిని, వారక యా సంజపత్తి నోమితి, (బహుశః నిత్యము సంధ్యాసమయమున దేవుని యెదుట దీపమును వెలిగించుట కావచ్చును) తప్పక నోమితి యా జగజ్యోతి, ఏగురు వనితల నెలమితోగూర్చి, ఏకపిల్లను నోము నెన్న నోమితిని, పదుగురు వనితల బాగుగ గూర్చి పచ్చ పిల్లను వ్రతము పట్టి నోమితిని" ఇంకను నామె నంబికేశుని నోము, అశ్వత్థ వృక్షమువద్ద పెంటి పోతులకు పెండ్లిండ్లు చేయునోము చీకటింటను నోములను నోమినది మరియు పుత్రకావ్యం బిచ్చు పొలుపైన చీరలద్దించి గట్టినదట పుత్ర సంతాన ప్రాప్తికై స్త్రీలు ప్రత్యేకముగ చీరల నద్దించి కట్టుకొనుచుండునట్లు తెలియుచున్నది. ఇట్టివే వితంతు స్త్రీలు పుణ్య ప్రాప్తి కొరకు కొట్టుకొను అవుల చీర. ఋతుప్రసరదోషము పోగొట్టుకొను కొరకు స్త్రీలు ధరించెడి కాద్రేని చీర మొదలగునవి.

ఇన్ని నోములు నోచినను ఆమెకు పుత్రులు గల్గనందున ఆమె ఆకాశ వాణి చెప్పిన గజనిమ్మ నోము నోమినది దీని నొక సంవత్సరము పాటు చేయవలెనట. నిమ్మ చెట్టునే శ్రీ మహావిష్ణువుగా భావించుచు చంద్ర భాగానదిలో స్నానముచేసి సరిగంచుపట్టు చీరను పసుపు కుంకుమలను ధరించి చెన్నకేశవునకునై వేద్యాదులగావించి, నిమ్మ చెట్టువద్దకు వెళ్ళి అట శుభ్రపరచి వనదేవత నాహ్వానించి చెట్టుకు పూజాదికములను గావింపు చుండవలెను. వర్షాంతమున నా వృక్షము ఫలించినపుడా ఫలములు చెన్నునకర్పించినచో సంతానముకలుగునట. ఈ నోము చేసిన పిదప ఐతాంబకు బాలచంద్రు డుదయించినాడు.

కుమార్తెలకు వివాహము గావించి అత్తవారిండ్లకనుపునపుడు అరణము లిచ్చు నాచారముండెడిది. అనుగురాజు భార్య మైలమదేవి అను* రాజునకు పల్నాడు సరణముగా దెచ్చినది. మలిదేవుని భార్య (వీరసోముని పుత్రిక) గండు బోయలను పశువులను సరణముగా దెచ్చినది. కుమార్తెల నిచ్చునపుడు తలిదండ్రులు 'ఓలి' యను ధనమును తీసికొనుచుండెడివారేమొ లేక ఈ సంప్రదాయము వెలమలలో మాత్రమే యుండెడిదో'' బాలచంద్రుడు తల్లితో ''నా మేనమామను 'నాముద్దు సుతకు, పిల్లనిమ్మని నీవు' ప్రియమున నడుగు, మన కులంబున నోలి మాడలు గలవు, తగిన ధనంబీక తానీయననెను'' అని చెప్పెను. కావున వెలమలలో మాత్రమే యీ యాచారముండినట్లు తెలియు చున్నది ఇప్పటికి వారిలో నీ యాచారమున్నదని అందురు

ఆనాడు ప్రజలకు సుముహూర్తముల మీదను శకునముల మీదను, మంచి నమ్మకముండెడిది కార్యమపూడి యుద్ధమునకు బయలుదేరుచు 'బ్రహ్మన నలగాములు జయ ముహూర్తములను పెట్టించుకొనిరి బ్రహ్మన ప్రథమ ఏకాశినాడు ముహూర్తము పెట్టుకొనెను ముహూర్తమాసన్నముకాగా ప్రతిపక్ష సైనికుల సన్నాహము చూచి బ్రహ్మన సైనికులును త్వరపడగా, బ్రహ్మన ముహూర్త మింకనునాసన్నము కాలేదని తన నాయికుల నాపించెను.

బ్రహ్మనయు, గోపన్నయు కోళ్ళ పోట్లాటకు పోవుచు తమ కిరువురకు వచ్చిన శకునముల నొండొరులకు చెప్పికొనిరి గోపన్న గొల్ల వాడగు కావున శకున ఫలితములను చెప్పగలననెను. ఆ నాడు గొల్లలు శకున ఫలితములు బాగుగచెప్ప నేర్చిరేమొ బ్రహ్మన తనకు గలిగిన శకునముల నన్నిటిని చెప్పగా గోపు వాని ఫలితములను వివరించినాడు.

'మేనికి రక్షయై మించు తాయెతులు
దంట చేపుల రెంట ధారణచేసి''

అని యుండుట వలన ఆనాడు రక్షలు, తాయెతులు భూత ప్రేత పిశాచములు గాలి దయ్యములు సోకకుండ ధరించెడి వారని తెలియుచున్నది

మన దేశమున పురుషులు పూర్వము పై భాగమున వస్త్రము లేవియు ధరించెడి వారు కారెమోయని తోచుచున్నది. ఒక ఉత్తరీయమువంటిది కప్పుకొనెడి వారెమో. కొలువు కూటమునకు వచ్చుటకు నలగాముడు తయారగుచున్నాడు

"సరసంపు పన్నీట జలకంబులాడి,
ఘన శుచి వస్త్రముల్ కటియందు దాల్చి
చిత్రాసనంబుపై చెలగి కూర్చుండి
తిలకంబు నుదుటను తిన్నగాతీర్చి" కొనెను.

అప్పటి పురుషులకు స్త్రీలకువలె జుట్టుకూడ నుండెడివి. వరూధిని ప్రవరాఖ్యుని 'తెగబారెడు జుట్టును'చూచియే మోహించినది. ఆంగ్లేయుల రాకతోనేమనదేశమున పురుషులకు'క్రాపింగ్'లు వచ్చి యుండును. నలగాముడు 'తగటు వాసంబులు ధరియించి తలను, ఒక వింత యుష్ణీష మొప్పుగా బెట్టి' కొనినాడు అంతటితో నాగలేదు 'హారిరత్నపు బిళ్ళ నమరొందకట్టు' కొనినాడు బ్రహ్మనాయడు గురిజాల యుద్ధమునకు వెడలునపుడాతని తల్లి శీలమ 'యాతని శిరమును నివిరి ముడివిప్పి, వెంట్రుకల్ ముదమొప్ప జార, సంపెంగ నూనెయు చక్కగా రాచి, జలక మార్చెను బ్రహ్మ సంతోషమొంద' ఇంత మాత్రమే గాక పురుషులు శరీరము నిండ ఆభరణములను గూడ ధరించుచుండిరి బ్రహ్మన గురిజాల యుద్ధమున కేగునపుడు 'పెంపైన ముత్యాల పేరులు వైచి, డాకాలనందెయు తనర పెంపొంద" వెట్టుకొనెను నలగాముడు గండపెండేరమును కాలికి తొడిగికొని, 'కర్ణకుండలములు ఘనముగా మెరయ, అఖిల రత్నములతో నమతికైనట్టి, పతక చయమ్ములు పైకి మాలికలు, మెడజుట్టి మించి వెలుంగ, భుజకీర్తులను రెండు భుజముల దాల్చి, మురుగులు గొలుసులు ముంజేవ నొప్ప, పదివేళ్ల ముద్రికల్ బాగుగా పెట్టి, నవరత్న ఖచితంపు నడికట్టు దాల్చి' నాడు ఈ నడికట్టు స్త్రీల ఒడ్డాణమువంటిదై యుండును బెల్టుకు బదులుగ నుపయోగించుచుండిరేమొ

బాలచంద్రుడు మాంచాలవద్ద కేగినపుడామె చెలికత్తెలామె నలంకరించిన తీరును బట్టి నాటిస్త్రీల భూషణములు అలంకరణములు తెలియుచున్నవి

కురులు బాగుగా దువ్వి, "బంగారు పూ చేర్లు బాగుగా జుట్టి, పాప ము మణి హేమ మౌక్తిక మండితంబైన చేర్చుక్కను" పెట్టినారు పిమ్మట శశి రవి భూషణ యుగము పాపట కిరువంకల నిలిపినారు వీనినే సూర్యవంక చంద వంకలని యందురు తల వెనుక భాగమున మాణిక్యకూటకమయ బింబమొక దానిని పెట్టిరి. ముక్కున ముత్యపు ముంగరను నిల్పినారు తాటంక భూషణ ముల నుంచిరి ఇంకను ముత్యాల కుచ్చులు, మునికొని వ్రేలు బవిరలు కుందేండ్లు బాగొప్ప పెట్టి, కర్ణాగ్ర దేశముల్ కాంతులు గ్రమ్మ, కుప్పెల ముత్యాల కుచ్చులు రెండు ఘనకుంతలముల గదియించిరట ఇందలి బవిరలు, కుందేండ్లు మనకు తెలియవు చేతులకు కేయూరములు అంగుళీయకములు కంకణములు మున్నగువానిని పెట్టిరి ఆమె తపనీయ కాంచిని ధరించినది కాళ్ళ కంచెలు, గొలుసులు, గజ్జలు పెట్టుకొనినది

మనుష్యులు తమ శరీరముల నలంకరించు కొనునట్లే గృహములను, పట్టణమునను గూడ నలంకరించి యానందించుచుండిరి. నాయని భట్టు చూచిన నలగాముని కొలువీ విధముగ నలంకరింపబడినది. "కస్తూరి చేతను కలయంగ నలికి, ముత్యాల తోడుత ముగ్గులు పెట్టి, కప్పుర ముదకమ్ము కలిపి యంతటను జల్లిరి కలయంపి సత్వరమ్ముగను శ్రీ రామకథలును శ్రీకృష్ణ కథలు పన్నుగా వ్రాసిన పటములు తెచ్చి కట్టిరి. గోడలు కనుపడకుండ, మౌక్తిక మంజరీ మంజు పుంజంబు వ్రేలాడు చుండెడి వివిధవర్ణముల ఘనవితానంబులు కట్టిరి మీద, నిలుపుటద్ద మ్ములు నిలిపిరి దిశల

సహగమనము చేయు నాచారమానాడుండినట్లున్నది అలరాజుతో నాతని భార్యయు, అనపోతు భార్య అనపోతుతోను సహగమనములు చేసిరి. రాజారామ మోహనరాయలు దీనిని నిషేధించువరకు నీయాచారము మనదేశమున నుండినది. వర్ణవ్యవస్థ అంత జటిలముగ లేదేమొ అనిపించుచున్నది. నాయుడు మాల మాదిగలకు కూడ వైష్ణవ దీక్ష నిచ్చి తనలో చేర్చుకొనుచుండెను. బాల చంద్రుని సహచరులలో నన్ని జాతుల వారు నుండెడివారు. నాయుడందరికిని చాపకూడు పెట్టించెను.

నలగాముని సభయందు జరిగిన సంగీత నాట్యప్రదర్శనముల వలన ఆనాడివి మంచి యుచ్చస్థితి యందుండి రాజాదరణ పొందుచుండినట్లు తెలియుచున్నది "శ్రీరామ కథలును, శ్రీకృష్ణ కథలు పస్సుగా వ్రాసిన పటములు తెచ్చి కట్టిరి" అనుటవలన నాడు చిత్ర లేఖనమువంటి లలితకళల పోషణ కూడ రాజుల వలన జరుగుచుండినట్లు భావింపవచ్చును. "పైగప్పి సుఖములు పరుపులు వేసి" అనుట వలన ముఖమలు పరిశ్రమయు, "ఇనుము పిత్తళికంచు హేమ తామ్రముల పంచ లోహంబుల ప్రబలిన దాస"వని బ్రహ్మన ఖూత రాట్నంబును స్తుతించుటను బట్టి ఆనాడీ లోహపు పరిశ్రమలు చక్కగా సాగుచుండిన ట్లూహింప వచ్చును భూషణముల వర్ణననుబట్టి వెండి బంగారు పరిశ్రమలు కూడ బాగుగ సాగుచుండినట్లు తెలియుచున్నది కోళ్ళ పరిశ్రమ మంచి అభివృద్ధిలోనుండినట్లు కూడ తెలియుచున్నది

ధనవంతులు కాశ్మీర కస్తూరి పన్నీరు మొదలగు సుగంధ ద్రవ్యములను విరివిగ నుపయోగించుచు వైభవోపేతమగు జీవనము గడుపుచుండి యుందురు.

రకరకములగు విషములుండినట్లు తెలియుచున్నది. నాయకురాలు బ్రహ్మన్న అలరాజునకు విషాన్నము పంపినది అలరాజు విషాన్నము నారగింపనందున నామె 'ఆఘ్రాణ మొనరించునట్టి వారలను, ఆ క్షణంబున చంపు నౌషధ క్రియయు, వీక్షించుచుండ ప్రవేశంబు జేయించి, అలరాజును చంపించినది వాసన చూచిన చచ్చిపోవు విషమది గురిజాల యుద్ధమున కార్తవీరుడు బ్రహ్మనకు తన వృత్తాంతమును చెప్పుచు రాజుగారి కోటను దోచుకొనుటకు 'పొక్కుల విభూతిని తీసికొని పోతినని చెప్పెను మీద చల్లినంతనే మైకము కమ్మించెడి మత్తుమందెది.

ఆనాడు రాయబారమునకు భట్టుగాని, బ్రాహ్మణుడుగాని పోవుచుండినట్లు తెలియుచున్నది. రాయబారి సర్వదా అవధ్యుడనెడి ధర్మము పాటింపబడుచుండెను ప్రజల యభిప్రాయములకు, మాటలకు ఎంత విలువ గౌరవముండెడిదో 'కోళ్ళ పోట్లాట గోపన్న విరుగు'తో, గోపన్న మాటలవలన తెలియుచున్నది.

'డమాయీలు మురజ సంఘములు, బూరలు భేరీలు పోటు ధారలు ముఖ వీణ, వంకిణి కాలికొమ్ములు శంఖములు, సన్నాయిలు, మురళి నగరలు తప్పెటలు, కనక తప్పెటలు చేగంటలు, చిరుగంటలు,' మొదలగుననేక వాద్య విశేషము లుండినవి

కోడిపందెములు తెనుగువారి జాతీయోత్సవములు. ఇప్పటికిని సంక్రాంతి సమయమున పల్లెటూళ్ళయందు కోళ్ళ పందెము లాడుదురు

బాలచంద్రుడాడిన ఆటల వలన ఆనాటి ఆటలు తెలియుచున్నవి, 'గుమ్మడికాయలు, చెరుకులు పందెంబు, గోలాటలు, బంతులాట, గుంతమాతలు బొంగరములు, మున్నగు రకరకములాడి వాలుదు, వీనిలో కొన్ని మనకు తెలియదు, 'తాడెక్కు పురుషుని తల్లికి అల్లె గడమీద నాడుకర్కశుని తల్లికిని, శూరుని తల్లికిని సుఖమేమి లే'దని ఐతాంబ పల్కిన వాక్యములను బట్టి నాడు త్రాడుపైనను గడల మీదను నాడెడు సర్కసు కాండ్రుండెడి వారని తెలియుచున్నది.

ఈ కాలమున, బోయవారు, రుంజలు, పిచ్చుకుంట్లవారు, ఇసుప కోలల వారు, సీటెల వారు, అరిగెల వారు, సడిదాలవారు, సురియలవారు, హాలాలవారు చెంచులు, పడవాళ్ళు మున్నగు జాతులుండినట్లుగా నున్నది

మంత్ర తంత్రములను ప్రదర్శించు కట్టుబోయలుండెడివారు. వారికి ఎన్ని రకముల 'కట్టు' మంత్రములు తెలియునో చూడుము

"వాకట్టు, మరకట్టు పణికెడుపెట్టు
పొట్ట పొంగెడుకట్టు పొంగులకట్టు
కూత పెట్టెడుకట్టు కోపించుకట్టు
ఎండి పోయెడుకట్టు ఎగిరెపడుకట్టు
పీధి బావెడుకట్టు నెరదెరుకట్టు
కాళ్లను చేతులు పిడచసికట్టు
ఎక్కిసక్కియకట్టు గుశిరసుకట్టు

ఒకలింతల తోక నారలెడుకట్టు
ప్రాణంబు పోయెడి ఒయువైనకట్టు"

## కాటమరాజు కదాకాలమునాటి యుద్ధ విశేషములు

యుద్ధరంగమున పెక్కు రకములగు గుడార్లములనెత్తిరి తగనొప్పగా వీరతమక మేర్పరచి. చిత్తర్వుల గుడార్లు చెంత నెత్తించి, పచ్చ వన్నెగుడార్లు పరగ నెత్తించి, నలుబది స్తంభాల హామితీర్థంపు, గూడార్లు రత్నాల గూడార్లు ముత్తె, గూడార్లు వెలిపట్టు గూడార్లు చాల నెంగలకుగూడార్లు నెవలేక యెత్తించి రెన్నో గుదార్లు, గూడార్లితను పైడికుంద లెత్తించి, ఘన శరభ శార్దూల గండ భేరుండ, ముఖ బిరుదులన్నియు ముందు రెత్తించి'రి తమగమనగా ఎత్తయిన మంచె వీడులు నిలబడి చూమట కేర్పరచినది, వీరతమగము కాటమరాజునకు, నలుబది స్తంభముల గుడారముండెను. తక్కిన గుడారముల వర్ణన మానాటి కళలను వ్యక్తి పెద్యంగు సూచించును

ఇందుగూడ పల్నాటి వీరచరిత్రలో వలె నిపుడు తెలియని యాయుధ విశేషము లెన్నియో పేర్కొనబడినవి 'కట్టుఒల్లులు, సనాదీలు, యందెలగడలు. మొదలగునవి, పిన్నయిట్టు, సీసెలు, కటార్లు, జంజాళముల్. కత్తులు మరియు వజ్రంపు మణులుగల వంకిణిల్ వాడి, నేజాలును సురాయి నేర్పుతోబట్టి, బాకుల చేబూని' వచ్చెను, కొందరి సిద్ధిరాజు 'బిచ్చుకత్తుల వారు బిమతులై నడువ, జల్లి గడలును చాల ఒమిలి బెక్కెంటతో' వచ్చెను ఇరువదియముతవారు "బరిసీల బల్లేల బళబొడునంగ, రింయమున నొంగిరి రౌతులందరును"-'శరముల గుంతాల జెల్లచి పొడువ' 'చక్రాల కొండురె శిరసుల వేయ' 'సురకత్తి పిడికత్తి సురియల తోను' గోసంగులు యుద్ధము చెసరి హొల్లాపు యుద్ధమునకు భయపడి సిద్ధిరాజు సైనికులు, 'అష్టకత్తెలు భేదెలటు'పారిపైచిరి.ఇంకను రకరకములగు బాణములు పేర్కొనబడినవి గన్నెరాకమ్ములు బొత్తపు నేజాల,పార్వతి యంబులు,గుమ్మడి గింజలు, పంతగిరులు కొంగవలిరిత్తులు, బంగారు పరుజులు బంజాళములు, అర్థనారి జల్లులు, అప్పడిత్తులు, కొమ్ముగాలాలు, మొ 'తమ ముందుగుండును తగ బాగుచేసి, సంధించి రంజుల సమ్మెను టోసి, జానికిజాప్ప చక్కంగ రాల్చి,

తొడిబడ గురి బంచి తుపాకిగుండ్లు రంజకమునగా, తుపాకి చెవిరో బోసెడు మందు జనకి రాను వెల మందుకు నిప్పంటించునది. ఇది ఉర్దూ పదము పవి తన కాలమున కన్న తుపాకులను చెప్పినాడు, "వాల్పలంబు జూచి కంపటీలెల్ల చాలుగా నిలచిరి సమరంబు సేయి" కంపటి యొక యాయుధము, కంపటిని ధరించువారు కంపటీలు కాబోలు, పద్మ రాఘవుడు రాజు విల్లును కత్తి కనక ఖాణాలు వేయుచు నార్చుచు వెంగూల్చె రిపుల' బ్రమాను విల్లుగాదు మరి భూత విల్లు పలుపగ నేజాతువాకులవారి, పనువైన యాభ్రత్తి నాయుధముల వారి బహుళః ఇది ఛత్తీసాయుధము కావచ్చును ఛత్తీస్ అనగా ముప్పదియారు ఇన్ని విధములగు నాయుధములు ధరించిన వారిని యర్థముగావచ్చును కాటమరాజు వెంటనున్న సేనాసమూహము —

ఎనుబదెన్మిది వేల యేనుగ పీరు, లొలయ తొమ్మిది వేల యుత్తమాశ్వములు, నూరిరి నెన్మిదివేల వొక్కపు చిల్పివెలుగు, నిరువదిలక్షల యీటెగోడిగలు, కరులునుమూడు వేల్ గటిలైదులక్ష, ఒరగింగ లొట పిటల్ పదునైదువేలు, పసిగల పచ్చల పాలకీల్ నూరు, నరిగెలు నొకలక్ష యందలాల్ నూరు వెరసి ముప్పదివేల వింజామరములు, డమ్మాము లేనూరు డాలు లేనూరు, కొమిరొప్ప జగజంపు గొడుగు లేనూరు, తుపాకి పిలుమూక తొమ్మిదిలక్ష పదునైదు శూలాల బంట్లు నార్చ్వారు, గడమెన్నె వారునుగాక సర్దార్లు నడిపిం కొల్లకాండ్లు నాలుగు వేలు, బహువాద్య మేళాలు పరగ నేనూరు"

ఇవలి సంఖ్యా వివరములన్నియు నతిశయోక్తులని చాట్టమి రామరాజు గారనిరి కాటమరాజునకంత బలము లేకుండెను?) మరియును కాటమరాజువెంట 'తుపాకి పిల మూకు తొమ్మిదిలక్ష' అనుట నిజముగాదు, తుపాకులానాడు లేవు

ఖడ్గతిక్కన యుద్ధమునకు వెడలునపుడు సల్లసిద్ధి రాజాలిచ్చి "గంధంబు కస్తూరి ఘుసృణముగ జూసి, తలుబులో తమలము తగిగ నిప్పించి" వివాచారము ప్రకారము పొడిచెనె నాడు,

దండుపిడిసిన కాటమరాజు రామాయణమ్ము వినుచును, నాగిటాల పెద్దనాయకుండెను బ్రహ్మనాయకుడుకూడ నాడుచుండెను. యుద్ధ విరామ సమయమున పీరులాడుచు వినోదించుచుండిరి

యుద్ధములందు ధర్మపరము, ధర్మయుద్ధము కానబడుచుండును. ఖడ్గ తిక్కన యుద్ధమునకురాగా, యాదవుల పక్షమునందలి చల్లపిన్నమ — 'బుద్ధి చాలనియట్టి భూసురోత్తముడు, యుద్ధంబు సేయ నుద్యోగించినాడు, సర్వథా బ్రాహ్మడు చావక పోడు, బ్రహ్మహత్య మనకు బాపుకోరాదు, అని బ్రాహ్మణుని జంపమైతిమేనిపుడు, ఇందఱసితడు మా యింపక పోడు, చంపకుండరాదు చావగారాదు, ఇందుకు గతియేమి యెరిగింపుమన్న" అని బ్రహ్మ రుద్రయ్య నడిగెను యుద్ధమున కూడ బ్రహ్మ హత్యా పాతకమునకు వెరచి, యాదవులు తిక్కనతో పోరాడుటకొరకు బ్రాహ్మణ రుద్రయను ఒంపుట యానాటి యుద్ధ ధర్మము, ధర్మ యుద్ధము వ్యక్తమగుచున్నది.

పిన్నయ తన సేనలు నల్ల సిద్ది సైన్యముతో పోరాడుచున్నపుడు ఉదుట నడవుల బట్టనురికించి తండి, తొణకి చంపకుదన్న దోషంబువచ్చు మార్కొని పిల్చిన మరవకుండంగ, చెండాడి చంపను సెలవని పలికెను. పారిపోవుచున్న వారిని చంపుట యుద్ధధర్మమునకు విరుద్ధము, ధైర్యమున తననెదుర్కొన్నవారినే మార్కొని పోరాడుట మగటిమి.

సాయంకాలము యుద్ధమాపుటకు 'కూచి దారపట్టెను కొమ్ముకసినేడు' దీనినే ధర్మదార యందురు. కూచి యనునది ఉర్దూ పదము, కూచ్ కరనా యనగా సేనలు తరలి (మరలి) పోవుట. పల్నాటి వీర చరిత్రలోవలె రణ రంగమునుండి భయపడి పారిపోవువారి వర్ణన గలదు "తాటి బొందుల సందు దాగేటివారు, చచ్చినవారి క్రింద జొచ్చేటివారు, కడువేగ దొంతులై కడవ లన్నట్లు, తలలగుడ్డల సందుదాగేటివారు.

పల్నాటి వీరచరిత్ర యుద్ధ భూమిలో పీనుగులపై భూత పిశాచములు, నక్కలు, మొదలగునవి విహరించిన బీభత్స దృశ్యము వర్ణింపబడినది కాటమ రాజు కథయందట్టి బీభత్సము కలుగకుండునట్లు ప్రార్థింప వీరగంగ భక్తిరన్న కాశినుండి వచ్చువరకు రణరంగమును 'ఈగ వ్రాలకయుండనీ లెయిదకుండ, కాకులారణమందు గదిసిరాకుండ...కాంతిగల దేహాలు కందిపోకుండ' కాపాడెను

ఇందలి యుద్ధమున ఒక్కొక్క వీరుడొక్కొక్క వీరునెదుర్కొనుటయే కానవగుచున్నది. భట్టురాయబారమున యాదవుల భట్టు నల్లసిద్ధి భట్టుతో "తరపుకు తట్టువ బంటుకు బంటు, రాజుకు రాజు, కాలారికి కంపటీలు అని ధర్మ యుద్ధ నియమము చెప్పినాడు పల్నాటి వీరచరిత్రమున యుద్ధ సేనల వెంబడి, దాసీలు, వేశ్యలు నుండిరి గాని కాటమరాజుకథలో లరు. ఇది రచయిత కాలమునాటి సంఘ సంస్కారమై యుండును. కాని కాటమరాజు ధర్మనిష్ఠను సూచించుచున్నది

భట్టు రాయబారమున యాదవుల భట్టు సిద్ధిరాజు భట్టుతో కాటమరాజు ప్రతాపమును వర్ణించి సిద్ధిరాజును నిందించుచు 'పారిపోవగ జంపు పోర బొమ్మ కట్టు' 'ఈ సిద్ధిరాజుకు మాయెద్దు కాలిబొమ్మ', 'తల్లిగాని రాజుకు దరువు బొమ్మ', చెల్లని రాజుకు చెడికాలిబొమ్మ—యనెను నాచన సోమన పంతముతో దోహారమున బట్టుదు (ఉ. హరి 3—11) వాసిక బొమ్మ గట్టుమని'యనియు, శ్రీనాథుడు, 'డాకాలిగండ పెండారంబుదాపున బొమ్మలై వైరిభూభుజులు వ్రేల' అని (కాశీ పీఠిక—౫౫) చెప్పిరి శత్రువుల నవమానించుటకు వారి ప్రతిమలను జేయించి తమ్మపడిగలలో నుంచుట, కాలికి గట్టుకొనుట, గండపెండేరమునందు చెక్కించుకొనుట ప్రత్యేకముగ తెలుగుదేశమున కానబడు విషయము. శత్రువుల పక్షపు రాయబారికి మెడకు పట్టుబట్ట త్రాడుగావేసి శత్రురాజు నవహాస్య పరచి నట్లుగా దలచెడివారు. "పట్టుకోకల జుట్టి పలుపుగా బెనచి, నాకు చెనటకాడు మీకర్ణియందు, తగ సిద్ధిరాజులకు దామెన పలుపు"-అని యాదవుల భట్టు సిద్ధిరాజు భట్టుతో పలికి కట్నములొసగి, రాయబారమును బొసగనీయక తిరిగి పంపివైచెను.

ఐతమరాజాదులు కాటమరాజుకు సాయము వెడలునప్పటి సన్నాహము "చక్కెర కట్నాలు సన్న బియ్యములు, ఉప్పాలు గందపొడిపసుపు జవ్వాజి పోకలు కంట్లాలు హొన్నుటాకీలును, చేకొని యొక కొంత చేరువగనడువ బట్టు తివాసీలు పరెజాలు కోస్, దిట్టమగ వొందర ధీరతనడువ బట్టె ముఖాలును పరుపులు దిండ్లు, బెట్టెల చీరెలు బెద్దయడపము గొట్టడి యెద్దులు గొబ్బుననడువ,

ముట్టడి సేయంగ నుందుగాగదలె, గొప్పైనగూడార్లు, గోడ సరాతు, లొప్పగా నెత్తిన యెద్దుల నడచె, నటుముందుగా జెండ అది కొని కదలె, నటు వెన్క సేనలు నంతయు గదలె, విలమూక యీటెలు వెసదుపాకులును వెలుగొందగా నూరు వెల్ల చత్రములు గంభీర వాద్యముల్ గాలి టెక్కెములు, శంభుని పల్లకి సరసనే కదిలె."

## ఆచారములు

ఈకాలపు వారికిని శకునములయందు గొప్ప నమ్మకముండినది నల్లసిద్ది సేనలో నలసిద్ధికి మెండైన రాగాలు మెరనాడసాగె, చీతుకల్ మింటిపై చెలరేగి పలికె, నవతల పైడికంటదిరి పడిలేచె, పాల పీరెమువారి పాములు నడకొట్టె. నేల నాడువ చోట నిలిచెను గాళి"—శకునములు కన్పడగా, బ్రహ్మన గోపన్న నువలె నీతడు సంధ్యగోపాలుని శకున ఫలితము లడిగెను. గొల్లవారానాడు శకున ఫలితముల చెప్పుటలో సిద్ధహస్తులుగ నుండిరేమొ గోపన్నవలె నీతడును నా శకునముల కన్నిటికిని ఫలితముల జెప్పెను

"భట్టురాయబారమున" నల్లసిద్ధి కాటమరాజులందెవరు సమయ భంగము చేసిరో యని తీర్మానించుటకు పెన్న సమీపమున సంగమదేవుడు మధ్యవర్తిగా నుండెను. కాటమరాజు పక్షమువారు శిలలను పలికించి తామే సత్య ప్రియులమని రుజువుపర్చుకొనిరి. ఇట్టి విశ్వాసము ప్రజలయందిప్పటికిని నున్నది

ఖడ్గతిక్కన యుద్ధభూమినుండి పారిపోయిరాగా, నాతని భార్య స్నానము నకు నీళ్ళు దోడి, అక్కడమంచంబునడ్డంబు పెట్టి యర్ధశేరు పసుపు నమరంగ నుంచి, కూర్చుండి స్నానంబు గొబ్బున జేయు'డని చెప్పివచ్చెను. మంచమడ్డు బెట్టుకొని, కూర్చుని స్నానము చేయుట స్త్రీలకు విహితమేమొ. స్త్రీలు కూర్చుం డియు, పురుషులు నిల్చుండియు స్నానము చేయు నాచారముండె నేమొ!

సిరిగిరితో లేఖలు చదివించుటకు ఐతమరాజాదులు శారదామండపమున గూడి కూర్చుండి—"అప్పుడు కూటాలకడ్డతెరగట్టి - కప్పురగంధుల కడు

వేడ్క బిలిచి, కొమ్మలారా మీరు గొబ్బున బోయి. యమ్మనూకాంబిక కటువిన్న వించి, సిరిదేవి కొమరక్క సిరి భోగలింగ సరసన నగుమంచి చట్లుమారమ్మ పందములు యరణమప్ప పైడివారి తల్ల అందరి తోడ్కొని యతివేగరారె" అని యుండుట వలన, నప్పుడంతఃపుర స్త్రీలు తెరచాటు చేసికొనిమాట్లాడుచుండినట్లు తెలియుచున్నది. పల్నాటివీరచరితమున అలరాజు రాయబారములో బ్రహ్మనాయుడలరాజును రాయబారము పంపునపుడాతనితల్లి యైన చల్లమ్మ యనుమతి గై కొనుట కామె యంతఃపురమునకేగగా, ఆమెయు, అడ్డంబుతెరబెట్టి యర్ఘ్య పాద్యముల' నిచ్చినది

కాటమరాజు కధనాటికి 'సొమ్ములు, కట్నాలు సొన్నటంకాలు'ండినట్లు తెలియుచున్నది

పూర్వకాలమున మన దేశమున కాగితములు లేనందున లేఖలు,మున్నగు వానిని తాళపత్రముల మీదను, భూర్జ పత్రముల మీదను లిఖించుచుండిరి మనవాఙ్మయమంతయు, భారతాది గ్రంధములు తాళపత్రముల మీదనే రచింపబడినవి. ఇప్పటికిని కొన్ని వ్రాతప్రతులు తాళ పత్రప్రతులు గ్రంధాలయములందు భద్రపరుపబడినవి కాటమరాజుకధయందు త్తరములు వ్రాయుటకు, తాటియాకుల తెప్పించుట ఒక కధగా కల్పింపబడినది కాటమరా జైతమ రాజాదులకు లేఖలు వ్రాయుటకు, "సమ్మతంబుగ మంచి సవరని యాకు, కొనగల మోవాకు కుదురు చక్కనిది" కోటివాటినుండి తెప్పించెను లేఖవ్రాయుటకు, 'భాసురకీర్తి ప్రభావశేఖరుడ లేఖలు వ్రాయను లిఖియించి చదువ, ప్రాకట ఛప్పన్న భాషాధికారి. కాటభూపాలుని కరుణతోదుతను, మేటియై ప్రభవొందు మితభాషణుండు, కందర్ప సాటి/గల రామచంద్రు' రప్పించి, బావయగు పల్లికాండకు, కొమరక్కసిరిదేవికి, ఐతమరాజాదులకును నుత్తరములు వ్రాయించెను, ఈలేఖలను వ్రాయుటకు, చదువుటకు అనేక భాషల జ్ఞానము గలిగిన వారు రాజులవద్ద నుండెడివారు 'ఛప్పన్' అన ఏబదియారు భాషల నేర్చిన వాడట వాడు ఈ లేఖలన్నిటిని, కాటమరాజు, తనవ్రాలు చేసిన తగు లేఖ లన్ని, ఘనముగా జలవైనుకడు చెంద్రికలును, వరుసతో జేసియువైనా

నట్టి, యురు వైన తన చేతి యుంగరంబునను, లక్కముద్రలు జేసినపుడు, కబురుసనారాజుకాలారి బిలిచి, కాలారి చేతికి కమ్మలందించి' పొమ్మనెను. కాలారి యనగా వేగముగా వార్తగొనిపోవువాడు. లేఖలు భద్రముగ నుండెడు పెట్టెకు చంద్రిక యని పేరు లక్క ముద్రికలు వేయబడి ఉంగరము లత్తబడి, లేఖలు రహస్యముగ కాపాడబడుచున్నవి

ఐతమరాజువద్ద నన్న మంత్రికాటమరాజు లేఖను చదువ సమర్థుడు కాడాయెను ఆతడు సాధ్వాతయుగాదు నన్న చిన్నెలును, నీజాబు తెలియదు యదుకులాధీశ" యనెను దానిని చదువ సమర్థురాలు ఐతమరాజుకుమార్తె సిరిగిరి దేవి. ఈమెకూడ ఛప్పన్న భాషా జ్ఞానియట 'తెలుగు నరవంబును... చెలగి కన్నడమును జదివె నాగరము, నరనాథ మీపుత్రి నలినాయతాక్షి, తెలగొప్ప ఛప్పన్న దేశీయ భాష, లక్క మలాక్షికి నంత తెలివిడియు" సిరిగిరి లేఖల చదివించుట కందరును శారదామంటపమున జేరిరట. ఈశారదామండపమై తమరాజుయొక్క సాహితీ భవనమై యుండవచ్చును ఇటనే ఆతడు కవిపండితు లతో గోష్ఠులు చర్చలు సాగించుచు, కళాభివృద్ధిని గావించుచుండెడివాడేమో, దానివలన నాతని సాహితీ ప్రియత్వము వెల్లడి యగుచున్నది

## వేషాదికములు

చల్లపిన్నయ్య మున్నగువారు యుద్ధమునకు 'కాసెలు బిగియించి గంధంబు బూని, రాళ్ళు దాపిన యట్టి రాకట్లు దాల్చి, ముత్యాలహారముల్ మురియుచు వేసి, చౌకట్ల గర్ణముల చయ్యన దొడిగి దేదీప్యముగ వెల్గు దివ్యాంబరముల, నవరత్నముల భూషణములుదాల్చి, కడుసూర్యకాటార్ల ఘనముగా బూని, మహా దేవ హరహరా మహాదేవ యనుచు – బయలుదేరి, అయితమరాజు మొదలగు వారు, వజ్రాంగి తొడిగెను పల్లవులరాజు, చింతగా శిరమందు వీరజడయల్లి, విరజాజులు తురిమి వేడుకమీర, పరగమాణిక్యాల పతకంబుదాల్చి పచ్చలకడి యముల్ పసిడుంగరములు, మెచ్చయిన నేవళము మెడనూలువేసి, యడపడాం తట నాకు చుట్టేయు యుద్ధమునకు కదలిరి ఎల్లయ్య – అప్పుడు కట్టిరి హను మంతుకాసె వీరులై తలజడల్ వీరజడలల్లి, విరజాజుల నతివేగధరించి మెడ

జాలు గంధంబు మేలు హారములు, శరకుంతములు చేత చక్కగా బట్టె' ను పీరన్న వెంబడియున్న దోసంగిదళముల వేష భూషణములు చక్కగా వివరింప బడినవి.

గోబ్రాహ్మణులు పూజార్హులని మనవారి నమ్మకము గోవును, పవిత్రముగా భావింతురు మనవారు; యాదవుల సంపద పశుబలమే. వారికి వాని తోడిదే జీవనము. వానిని ప్రేమింతురు వారు, అనేకవిధముల నలంకరించి యానందింతురు. యాదవులు బొల్లావు నలంకరించిన విధము రమణీయముగ నున్నది 'పసిడిబిందెల నీట పాదముల్ గడిగి, అందంబుగా వెదురాకు చందమున, తిరుమణి తిరుచూర్ణము దిద్దిరి తోడ, నలదిరి మేనున నగరు గంధంబు, నటుపున్గు జవ్వాజి యలదిరి చాల, సురయించి కస్తూరి సురటులు విసరి నాల్గుపాదంబుల నాదు టందెలను, మెండుగా వేసిరి మేలుగంటలను, రత్నాలు దాపిన రావిరేకులను, తళతళ మెరయంగ ధరియింపజేసి, కొమ్ముల బంగారు కుప్పెనుదొడిగి, రహిమించ మెడచుట్టు రంగుగా నపుడు, గోమేధికంబులు గొలుసులు వేసె మురువైన ముత్యాల మువ్వలపేర్లు గంటల సరసను ఘనముగావేసె మూపురముకు జుట్టు మురువు గజ్జెలును సన్నగజ్జెలు వేసె సందు సందులను'

బతమరాజాదుల యశ్వాలంకరణము కడు మనోహరము. వాజులకన్నిటికి పైనపైనాన, వాగెలు బంగారు వన్నె సమికట్లు బాగైన కట్టాణి బన్నసరములును, బిగిలి తలాటలు బిరుదు జల్లులును, నకలంక బంగారుఅందెలు, బాలార్క బిళ్ళల పగడదేవళలు, వాలసంకుల పేర్లు పసుపురుమాళ్లు నెచ్చైన బిరుదెండు ముఖములందె, పచ్చనిబంగారు పల్లమువేసి, తఅచైన బంగారు టంగీ బిగించి, పరిగె పట్టనములుపైని సవరించి, సిగెబంద జేరాలు సింగిణీవింధ్లు, తగగ బొమిడికములుతగ ధరియించి, యుత్తరరాజుకు, ...వింతగా రిపులపై విజయంబునొందె కొంత్రైన జాళువ గొలుసు లిర్గడల, బంతగించిన క్రియ పట్టుకరాగ. నయితన్న యెక్కటి అపురూపరాయనికి, రావిరేకలు మణిరత్న భాషికము లావణ్య ఖనియైన లాలు సరిజల్లి, అనరవ అఖములనద్దె హనుమంత బిరుదు, పసిమించు నెల్లి గోపాల మను బిరుదు వేగంబు ధరియించి వేడుకతోను' – ఇట్లే ఒక్కొ

క్కారు నెక్కు గుఱ్ఱములకు రకరకములుగ నలంకరణములు గావింపబడినవి. కాటమరాజు యుద్ధమునకు పోయినపుడు 'శంఖులు గవురులు చెలగు బూరుగలు బింకపు భేరీలు బిరుదుకాహళులు, రావణ వీణెలు రజత దండెలును, గోవింద వీణెలు గొప్పవీణెలును దండెలువీణెలుతరచు గిన్నెరలు, మెండైన రావణ మేడి హస్తములు, భేరి ధమామాలు పెద్దగారులును, జూరలుదారలు పోరకలగంగ వాద్యవిశేషములు వాయింపబడినవి

'ఘనమైన శంఖముల్ కనక తప్పెటలు, ఘనమృదంగంబులు గర్ద బేరులును' కూడ నుండినవి.

కాటమరాజు యుద్ధ విరామ సమయమున, వీరతమగముపై సొగటాలాడు చుండెను. బొల్లియావు బోయలతో చేసిన యుద్ధము, 'వింతగా పున్నమ వెన్నెల గాయ, సంతతబిల్ల దీవులాడిన యట్లు' దోచెనట. ఇది యొక బాలక్రీడా విశేషమట. మరియు బారపందెములు, చక్కా పగడలు, అయిదుకర్రలు, తెలుపు నలుపులువె ... నాటలుకూడ నుండినవి కాలారి, కాటమరాజు లేఖలనుగొని పోవుచు, ధనకొండవద్ద, 'రచ్చగాకూర్చుండి రాజుతమ్ముడును, నమ్మనుజాధీశు నల్లుడై నట్టి, ముమ్మయ్య పోచయ్య ముద్దు బాలురును, కొమరొప్ప జగజంపు గొడుగుల నీడ, నమరంగ బొంగరాలాడుచునుండ' గాంచెనట. బొంగరాలు పల్నాటి వీరచరిత్ర బాలచంద్రుడును నాడినాడు. రెండు కావ్యములందును నిది 'చాలురావుల కాడ' నాడబడినది

ఈ కథ నాటికి దేశమున శైవవైష్ణవములు బాగుగ వ్యాపించినవి. యాదవులు వైష్ణవులు, కాటమరాజు బొల్లియావు విష్ణ్వంశసంభూతులని విశ్వాసము. ఖడ్గతిక్కనతో యాదవుల పక్షమున పోరాడిన బ్రహ్మరుద్రయ్య ఆరాధ్యబ్రాహ్మణుడు. గంగయాదవుల యారాధ్యదైవము, కాటమరాజు తండ్రి పంచలింగాల కొండ సమీపమున లింగమై వెలసెను వీరన్న వీరభద్రుని యవతారమాగ చెప్పబడెను. ఐతమరాజాదులు యుద్ధమునకు పోవుటకు ముందు, శివపూజలు, అభిషేకములు గావించి జాహ్నవిని వేడిరి.

భట్టు రాయబారమున కాటమరాజు పక్షపు భట్టు కాటమరాజును గూర్చి, "కావీరభూమిని తాలావుల మేపి, నవనాథ సిద్ధుల నయము గన్నాడని" స్తుతించుటచె కాటమరాజు కూడ, శైవ ప్రభావమునకు లోనైనట్లు కానబడుచున్నది. కరియావులన్న మొదలగువారు విష్ణుభక్తులు - కాన యాదవులలోనే శైవవైష్ణవులుండినట్లును అయినను, మత అసహనములేక, యుండినట్లును తెలియుచున్నది.

రఘునాథనాయకాభ్యుదయ ద్విపదకావ్యము, రఘునాథాభ్యుదయ యక్షగానము, ఆంధ్రనాయకరాజుల కాలపు జీవితమును ప్రతిబింబించు దర్పణముల వంటిది. ఆనాడు వాడుకలో నుండిన యాచార మర్యాదలు, జంత్రవాద్య విశేషములు, భూషణములు, నాట్యములు మున్నగునవి పేర్కొనబడినవి.

జంత్రవాద్యములు వీణ, మురళి, రబాబు, తంబుర, కిన్నర, ముఖవీణ, స్వరమండలము, రావణహస్తము, చెంగు, దండె, డక్కి, గట్టివాద్యము, తాళము.

ఉత్సవ సందర్భమున ఉపయోగమునసుండిన వాద్యములు చిఱుత మద్దియలు, కాహాళలు, భేరులు, డవిణలు, ఢక్కలు, నాగసరములు, నరగజములు, ధవళ శంఖములు మున్నగునవి.

నాట్యములు పదవాళి, పేరణి జక్కిణి, కొరవంజి, సుజాతి, దేశి, దురుపద కేశిక, శివలీల.

ఆభరణములు ముద్రికాభరణము, ముత్యాలయెండ్లు, శ్రీరామభద్రతాళి, ముత్యపురావులు, పెద్ద చౌకట్టులు, కంఠమాలికలు, కంటసరము, పచ్చలపదకము, బవిరిచెక్కడపు ముత్తైపుదాళి, వజ్రముల యుత్తరిగలు, వజ్రముల జేసరులు, మెఱుపుల కడియములు, బాహాపురులు, రత్నాంగుళీయములు, నవరత్నములు తీర్చిన దిరుడు పెండేరము, బంగ్లు - ఇవి రఘునాథనాయకుడు ధరించిన యాభరణ విశేషములు

ఇవి స్త్రీల యాభరణ విశేషములు ముంగాముఁరారి, కంకణములు, ఉంగరములు, ముత్యాల మురువుల బవిరలు, బుడదలు, కమ్మలు, ముంగర, ముత్యాల కంటె, కంటసరములు, బన్నసరములు, పంజుం పదకములు, కంఠమాలికలు, సరిపెణలు, జాళువాగొలుసులు, పుంజాలదండలు, సందిదండలు, గంటల మొలనూలు, ఒడ్డాణము, పచ్చతాపలకల పాదపల్లవము, అందియలు, గిలుకుచుట్టియలు, జాళువాకడియము, పెంచురతనాల కుచ్చు, కిరీటి, బవిరపదము.

రాజులారగించుచుండిన భోజనము శాలి తండులపు ప్రసాదము బంగారుచాయల పప్పులు, సద్యోఘృతము, శాకపుకూరలు, అప్పడాలు, పచ్చడులు మొదలయిన శాఖాహారపు భోజన వస్తువులు, ఇక మాంసాహార భోజన విశేషములు - అందు ఎన్నిరకముల కోళ్ళను వర్ణించినాడో గనుడు — నువుబొడి హవణించినట్టి కప్పురపుకోడి, తురిమిన తెంకాయ తునియలుగూర్చి కరివేప పొడిచల్లి కమ్మని నేత బొంకంబుగా దాల్చి పొదిగిన యట్టి కుంకుమకోడి, చణక చూర్ణంబుతో సగబాలుగాగ మిరప చూర్ణము గూర్చి మేదించి మిగుల గమ్మగా వండిన కస్తూరి కోడి, చీని చక్కెరజల్లి నవనీత ఖండముల్ నవముగా గూర్చి మృదుపాకముగ నొనర్చిన పాలకోడి, లశునఖండములు పలాండు ఖండములు విశదంబుగా దూర్చి వేపుడుంబొళ్లు కలయంగ జల్లిన కట్టు కోడియును నులవ కోడియును - వెన్న చక్కెరలను జేర్చి వండిన చేపల యూర్పు.

బిరంజి, వండియములు, పొడికూరలు, చలువయానము, ఉప్పురస్తూరి, చిక్కుడుకాయల రొయ్యల యూర్పు, పేణీలు, మండెగలు, లడ్వములు, వెన్న కజ్జాయములు, మణుగుబూలు, అతిరసాలు, సారసత్తులు, కరివడలు, ఆమ్రపు వడలు, దధివడలు, పప్పుకుడుములు, తెలికుక్కరొట్టె, టెంకాయరొట్టె సంబారు రొట్టె, తెరటుబాలు, తనిబాలు, తెంకాయపాలు, జీలకరపాయసము, చలువ పాయసము, సొజ్జిపాయసము, పన్నీరు పాయసము మొదలగు ఇన్ని ఉన్నప్పటికి నీరుమజ్జిగ కావలెను కాబోలు ఎంత రుచిగా ఉన్నదో చూడుడు —

"సారమౌ జంబీర నారంపు రుచులు
మీఱంగ లవణంబు మితముగా గూర్చి

మేలైన సొంటితో మిళితమైనట్టి
యేలక పొడివైచి యింపు దీపింప
దగువట్టి వేళ్ళచే తావులు గట్టి"న నీరుమజ్జిగ

## పరిపాలనా విధానము

ఈ రెండు కావ్యములవలనను నాయకరాజుల కాలమునాటి పరిపాలనా విధానము తెలిసికొనుటకు వీలగుచున్నది రాజప్రాసాదమును వర్ణించు సందర్భమున, సంప్రతికరణములు పేర్కొనబడిరి వీరు ఒక్కచోట కూడి రాష్ట్ర ఆయవ్యయములకు సంబంధించిన లెక్కలను చూచుచుండిరి సంప్రతి యనగా, పెద్ద రాజ్యవిభాగమునకుగాని, లేక కొన్ని గ్రామములను గలియజేర్చి యేర్పాటు చేసిన ఖండమునకుగాని యాయవ్యయములకు సంబంధించిన లెక్కలను వ్రాయు పెద్దకరణము. ఇందు వర్ణింపబడిన ఈ సంప్రతి కరణముల విశాలశాల, వీరందరు కలిసి పనిచేయు కార్యాలయమై యుండును రఘునాథాభ్యుదయ యక్షగానమందు పెద్దకరణము అట్టవణ రంగయ్య పేర్కొనబడినాడు ఈతని క్రిందనే బహుశః అన్ని ఆర్థిక విభాగములను ఉండినవేమొ అతడు వినిపించిన లెక్కలవలన, రాజ్యమునకు శిస్తు (రెవిన్యూ) ఎట్లు చెందుచుండెనో ఆయవ్యయములెట్లు వలెనుండెనో తెలియుచున్నది

"చిదంబరనాథ మొదలారిమీద ధర్మాసనం మూడులక్షల మాళ్ళకు చెల్లు రెండులక్షలున్ను, ముప్పైఅయిదు వేలు కాక పార (ర్శ్వ) నిల్వ పదిహేను వేలున్ను పద్దనిల్వ యాభై వేలున్ను అంతునిల్వ అఱువైయైదు వేలు, కుబుసం లక్ష్మయమీద మణియం మనోవర్తి రెండులక్షలున్ను యాభై వేలకు రొఖ్ఖం చెల్లు లక్షా యాభై వేలు, ధాన్యస చెల్లు యాభై వేలు, అంతు రెండులక్షలు కాక నిల్వ యాభై వేలు వాచమాటిమీద కరతొరలు లక్షవరహాలకు రొఖ్ఖం చెల్లు యెనభై వేలు కాక నిల్వ యిరవై వేలు కోనేరి పిళ్ళమీద సుంకం పద్దెనిమిది వేలకు చెల్లు పంద్రెండువేలు కాక నిల్వ ఆఱువేలమాళ్లు అందు నిల్వలక్షా నలభై యొక వేల మాళ్ళు ...[11]

11 రఘు యక్షగానము, పుట 27

ఇందలి ధర్మాసనములనగా, న్యాయధర్మ సంస్థలు,
పార్వ (ర్శ్వ) లనగా, బాకీలు,
మణియరు నగా రాష్ట్ర (ప్రభుత్వము)మునకు సంబంధించినది
మనోవర్తి యనగా రాజకుటుంబమునకు సంబంధించినది
కరతొరలనగా రేవులు నదులు.

దీనివలన, విజయనగరమునందు వలె తంజావూరు రాజ్యమున కూడ రాజ్యమంతయు, మణియము, మనోవర్తి అని రెండువిధములుగ విభజింపబడి నట్లు తెలియుచున్నది రాష్ట్రమునకు శిస్తుమొత్తము నాల్గుముఖములనుండి వచ్చుచున్నట్లు తెలియుచున్నది ధర్మాసనము, మణియము మరియు మనోవర్తి, కరతొరలు, సుంకము, ఇది మొత్తము ౬౮8 000 మాడలు, ఈ మొత్తము అంతయు రొఖ్ఖం నగదు రూపములోనే వసూలు చేయబడుచుండెడిది కాదు మణియము మనోవర్తి భూమి శిస్తు కొంత నగదుగాను, కొంత గ్రాసరూపమున వసూలు చేయబడుచుండెడిది. రాష్ట్ర ఆదాయములో సగమునకు పైగా ధర్మాసనములనుండి వచ్చుచుండెడిది తర్వాత పెద్దమొత్తము మణియము మనోవర్తులనుండి వచ్చెడిది

కరణము లెక్కలను సరిగ పరిశీలించి వానిలో తప్పులెక్కున్నచో అట్టివారిని శిక్షించుటకు వేరే శాఖ యుండెడిది. అట్టిదానికే అధికారి, అస్తెప్ప దీక్షితులయి యుండును. అతడు, అట్టవణ రంగయ్య కస్తూరుల వివాదమును విని, లేఖలను పరామర్శింప నియుక్తుడైనాడు రఘునాధనాయకుని చేత.

హషము (సైన్యము)న విభిన్నశాఖ లుండెడివి ఎలగోలు (బండ్లు) చివగదలు (లాన్సెర్స్) కైజీతగాండ్రు (వీరు రాజునుండే జీతములను పుచ్చుకొనుచుండిరి ) నల్లప్రజలు (అటవీజాతి ప్రజలు) అశ్వపతులు, గజములు (మస్కెటీర్స్)

ఈ కాలమునందలి సాంఘిక చరిత్ర కట్టా వరదరాజు రామాయణము వలనగూడ తెలుకపడుచున్నది

రాజు నిద్రనుంటి లేవగనే పరిచారకులు దర్పణములను దాల్చి నిల్చుదురు "పరిచారకులును దర్పణములు దాల్చి"

వనమార్గములను చక్కబరచుటకు
"పారలు నుప్పరపారలు గడ్డ
పారలు చెక్కుడు పారలుమడ్డు
గత్తులుగొడ్టండ్లు కర్రెలుగొలిమి
తిత్తులు దన్నీరు తిత్తులు కరకు
కాడవండ్లు. ."
మొదలగు సాధనముల నుపయోగింపుచుండిరి.

అవసరము-వారు, అంగరక్ష సువారంబువారు సంబళ బత్యంబులు, పంపుడుమూక, క్రైజీతకాండ్రు డెబ్బదిరెండు నియోగములవారు, ఒంటర్లు, మున్నగు రాజకీయ పారిభాషిక పదములువాడుక యందుండినవి

ఆ నాడందురును సిగలందు విరులను జుట్టుచుండిరి

కొలవణి, భరద్వాజాశ్రమమున సొంగుబళానులాపములు, కోలాటము పేరణి, కోలచారిణి, చిందుగుజ్జరి మొదలగు దేశినాట్యములు, మద్దెలతాళములు రావణహస్తము, దండి మొదలగు నుపకరణములును నుండెను

ఈతడు, పెరతేనియలు, కుండబుట్టు తేనియలు కురుజ తేనియలు, కొమ్మతేనియలు, బుట్టతేనియలు, పొదలతేనియలు" అని తేనెలందు గల రకములను జెప్పినాడు

ఇట్టి గ్రంథములన్నియు ఆంధ్రుల సాంఘిక జీవితమును తెలిసికొనుటకుపయుక్తముగ నున్నవి

* * *

# ద్విపద గ్రంథముల పట్టిక

1 ఆత్మానంద రసమంజరి — డి. నెం. 2062 — శేషదాసు తిరువెంగళా చార్యుడు

2. ఆత్మైక బోధము — డి నెం 2063 —

3. అన్నమాచార్య చరిత్ర — తాళ్ళపాక తిరువెంగళనాథుడు. 1949, తిరుపతి దేవస్థాన ముద్రాక్షరశాల

4 అనుభవ దర్పణము — ఎమ్ నెం 293 — పరమానంద తీర్థుడు

5. అనుభవామృతము — ఆర్ నెం 2528 — ఘట్ట వీరార్యుడు

6 అభిమన్యు కల్యాణము — డి నెం 1026 — శేషము చెన్న భట్టారకుడు.

7 అష్ట మహిషీ కల్యాణము — తాళ్ళపాక తిరువేంగళ నాథుడు, 1936, తిరుపతి దేవస్థాన ముద్రాక్షరశాల

8 ఉత్తర రామాయణము — కాచ విభుడు, విఠ్ఠల భూపతి, 1920, చిత్రాడ రామవిలాస ముద్రాక్షరశాల చెలికాని లచ్చారావు

9. ఉత్తర గీతామంజరి — డి నెం 2072 — లక్ష్మణార్య యోగి

10. ఉత్తర హరిశ్చంద్ర చరిత్ర — డి నెం 1028 — గద్దె చంద్ర శేఖర కవి

11 ఉషా కల్యాణము — తాళ్ళపాక తిరువెంగళ నాథుడు, 1938, తిరుపతి దేవస్థాన ముద్రాక్షరశాల

12 కాటమరాజు కథ — గంగుల పిన యెల్లయ, 1963, మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార ప్రచురణ. సం మల్లంపల్లి సోమశేఖర శర్మ (అగుమంచి కథ — సం వే. ఆనందమూర్తి, పరిశోధన, సం 5, 6, 7).

13. కపోతవాక్యము — డి నెం 1465, 1033 — సంజ ఓబళయ్య (కవిగిరి)

14 కామేశ్వరీ చరిత్ర — డి నెం 045 — దేటూరి భావనామాత్యుడు

15 కుశలవోపాఖ్యానము — రామనార్యుడు 1951, తంజాపూరి సరస్వతీ మహాలు లైబ్రరీ ప్రమరణ

16. కుశలవ కథ — నెం 1344

17 కృష్ణార్జున సంవాదము — నాదిండ్ల గోపమంత్రి, 1949, వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ సం ని వెంకటరావు

18. గురు బోధ — డి నెం 2081 (2082) — సోమన

19 గురు శిష్య సంవాదము — డి నెం 2083 —

20 గురు శిష్య సంవాదము — ఆర్ నెం. 93 యోగానందావధూత స్వామి.

21. జ్ఞాన సూర్యోదయము — నెం 72 — వెంకటాచార్యుడు

22 చండీశ్వరి కథ — ఆర్ నెం. 994

23. చక్రవాళ మంజరి — తాళ్లపాక పెదతిరుమలార్యుడు 1936 — తిరుపతి దేవస్థాన ముద్రణ

24. చొక్కనాథ చరిత్ర — పచ్చకప్పురపు తిరువేంగళ నాథుడు. 1954 మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార ప్రచురణ సం. ని. వెంకటరావు

25. తత్త్వ చంద్రోదయము — మల్లన

26 తత్త్వ దీపికా ప్రబోధము — నెం. 77 — వెంకటయోగి

27. తత్త్వార్థ దర్పణము — ఆర్. నెం 609 — లక్ష్మణార్యకవి

28. తిరువాయ్ మొడి — కాంద్రవటి రామానుజాచార్యుడు 1910, బ్రహ్మ విద్యావిలాస ముద్రాక్షరశాల సం. మానవల్లి రామకృష్ణకవి

29 ధర్మజ కృష్ణ సంవాదము — ఎమ్ నెం. 378 — నరసింహాకవి
30 ధర్మాంగద చరిత్ర— బొమ్మకంటి నరసింహకవి 1895
31 ద్విపద భారతము — తిమ్మయ, సోమన, బాలసరస్వతి 194, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ప్రచురణ
32 దేవాంగ పురాణము— డి నె 918 — భద్రకవి లింగకవి
33. దేవాంగ పురాణము— ఆర్ నెం 894 — వీరన్న
34. ద్రౌపదీ స్వయంవరము—గోపాల రామకవి
35. నల చరిత్రి — చక్రపురి రాఘవాచార్యుడు
36 నలచరిత్ర—రఘునాధనాయకుడు
37. నలచరిత్ర—ఆర్ నెం. 166 (139)
38. నవచోళ చరిత్ర—పోలిశెట్టి లింగకవి, 1923, ఆంధ్రగ్రంథమాల
39. నవనాధచరిత్ర —గౌరన, 1937 మదరాసు విశ్వవిద్యాలయ ప్రచురణ
40 నాసికేతోపాఖ్యానము—తిరుమల నాథకవి
41. నింబజామాహాత్మ్యము—ఎమ్ నెం 285—కన్నడ నరసకవి
42 పండితారాధ్య చరిత్ర—పాల్కురికి సోమన 1939 ఆంధ్ర గ్రంథ మాల, మదరాసు
43 పరమయోగి విలాసము—తాళ్లపాక తిరువెంగళనాథుడు, 1938 తిరుపతి దేవస్థానం, ప్రెస్ సం విజయరాఘవాచార్యుడు
44 పరశురామాయణము—డి నెం. 1110 —ఉరిచి భావజ్ఞుడు
45 పల్నాటి వీరచరిత్ర — శ్రీనాధ,మల్లయ, కొండయలు 1911 సం అక్కిరాజు ఉమాకాంతం ద్వి, ము 1955— శ్రీరామ ముద్రాక్షరశాల, చెన్నపురి 1961 విశాలాంధ్ర ప్రచురణ, సం,లు. పి లక్ష్మీకాంతం అండ్ ఆ సూర్యారావు
46. పతివ్రతా చరిత్ర – మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగార ప్రచురణ

47 ప్రభులింగలీలలు – పిడుపర్తి సోమన, జగపతి ముద్రాక్షరశాల పెద్దాపుర 1920 (గుజలీప్రతి) 1884, వేణుగోపాల ముద్రాక్షరశాల

48. ప్రబోధ చంద్రోదయము – నెం 715 - లింగమంత్రి వెంకటకవి

49 బలభద్ర విజయము - ఎం. నెం. 320 - లోకేరావు సోమన

50 బసవ పురాణము – పాల్కురికి సోమన,

1. 1926, ఆంధ్ర గ్రంథమాల, సం వేటూరి ప్రభాకరశాస్త్రి ద్వి॰ ము, 1952, సం, ని, వెంకటరావు
2 1952, వావిళ్ల సోమస్వామి శాస్త్రులు అండ్ సన్స్, సం, బం, తమ్మయ్య
3 సం, డా జి వి సుబ్రహ్మణ్యం ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు 1969

51. బసవ విజయము — ఆర్ నెం 565 — నల్లసగండ్ల నారనారాధ్యుడు

52. బ్రహ్మోత్తర ఖండము — ఆర్ నెం. 1543 — యాదాటి వెంకట నారాయణ

53. బిల్హణోపాఖ్యానము — ఆర్ నెం 1011 — అరుణాచల కవి

54 భాగవత దశమ స్కంధము — మడికి సింగన 1951, తంజావూరి సరస్వతీ మహలు లైబ్రరీ ప్రచురణ

55 భాగవత దశమ స్కంధము — ఆర్ నెం 784 — రత్నాకరము గోపాలకవి

56. భాగవతము — ఆర్ 765 — చేకుమళ్ళ రగశాయి

57 భాగవత వైభవము — ఆర్ 1724 — సుంకనాల తిరుమల కవి

58 భానుకల్యాణము – డి నెం 1176 – చంద్రశేఖరకవి

59. బాల భాగవతము – డి నెం 972 – దోనేరు కోనేర నాథకవి, 1914, సం. తం. తేవప్పెరుమాళ్లు

60. భోగావతి ద్విపద – ఆర్ నెం 1703 –
61. భేతాళ పంచ వింసతి -- ఎమ్ నెం. 824 –
62 మనోబోధ – డి నెం 2151 -- కాలని గణపనారాధ్యుడు
63 మాయాచిదానందమంజరి – ఆర్. నెం 96 -- నాదిండ్ల ఉమాపతి
64 మఱి బసవపురాణము – డి నెం 978 – బచ్చు సిద్ధకవి
65 మార్కండేయ పురాణము – ఆర్. నెం. 132 -- నృసింహకవి
66 మార్కండేయ పురాణము -- ఆర్ నెం 630 -- గుజవెల్లి గురువప్ప (పర్వతమంత్రి లింగన
67. మల్లారి చరిత్ర -- ఆర్ 238 -- మఱింగంటి వెంకటాచార్యుడు
68 మువ్వార్ల వైభవము -- ఆర్ 366 – గోవర్ధనం అనంతకవి
69 మైరావణ చరిత్ర -- డి నెం 1177 –
69ఎ. మైరావణ చరిత్ర - డి నెం 1177 -- కాచన
70. యాజ్ఞవల్క్య విజయము—ఆర్. 493 -- చల్లా గురువయ్య
71 యోగీశ్వర విలాసము – డి నెం 478, 1189 – సిద్ధేంద్ర యోగి
72 రఘునాథ నాయకాభ్యుదయము – విజయరాఘవ నాయకుడు 1951, తంజావూరు సరస్వతీ మహాలు ప్రచురణ, సం నే వెంకట రమణయ్య
73. రంగనాథ రామాయణము – 1942, ఆంధ్ర విశ్వ విద్యాలయ ప్రచురణ, 1960, వావిళ్ళ రామ స్వామిశాస్త్రులు అండ్ సన్స్
74. రామాయణము – ఎమ్. నెం. 321 -- ఏకోజీ
75. రామాయణము -- కట్టా వరదరాజు 1952, తంజావూరు సరస్వతీ మహాలు లైబ్రరీ ప్రచురణ, సం ని వెంకటరావు
76. రామకథ – ఎమ్. నెం 335 –
77. రామకుమార విజయము – నెం 2550 - చిదంబరకవి

78. రుక్మాంగద చరిత్ర — ఎమ్ నెం 353 — వెంకటగిరి, దర్భా
79. రుక్మిణీ కల్యాణము — డి నెం 1009 —
80. వరదరాజమంజరి — ఎమ్. నెం 402 — అప్పనసుకవి
81. విక్రమార్క చరిత్ర — డి. నెం 1180 - కొండయ్య
82. విక్రమార్కుని కథలు — ఎమ్ నెం. 355 —
83 విభీషణ బుద్ధి — ఎమ్ నెం 356 —
84 విష్ణు భక్త చరిత్రము — ఎమ్ నెం 358 — చక్రపురిరాఘవాచార్య
1901, సం యతి రాజదాసకవీంద్రుడు,
85 విష్ణుమాయా విలాసము — కంకంటి సరసకవి
86. విరాటపర్వము — ఆర్. 2232
87 వీరమాహేశ్వరాచారసంగ్రహము — ఆర్ 435 పర్వతమంత్రి లింగనకవి
88. వీరశైవ దీక్షాబోధ — పిడుపర్తి బసవన
రాతుస. రామలింగేశ్వర ప్రెస్, వరంగల్లు
సం ముదిగొండ శంకరారాధ్యులు,
రాజశ్రీ కొండూరు కుంకుమయ్యగార్లు,
89. వేదాంత మంజరి — ఆర్. 1541
90 వైశ్యపురాణము — డి. నెం 1011 భాస్కరాచార్యుడు
91. శంకర సంహిత — ఎం 266 (357) -
92 శతకంఠరామాయణము — నెం 20 -
93. శరణాగత ద్విపద — ఆర్ నెం 861 —
94. శారీరోపనిషత్తు - ఆర్ 2534 - బానప్ప
95. శివజ్ఞానమంజరి — నెం 811 (759-61) — పరమానంద తీరయతి
96. శివరహస్య ఖండము - డి నెం 1012 — జౌబళ కవి
97. శ్రీనివాస విలాస సేవధి — శ్రేష్ఠలూరి వెంకటార్యుడు 1954,
తిరుపతి దేవస్థానం ముద్రాక్షరశాల
సం. కోరాడ రామకృష్ణయ్య

